సరస్వతీ గ్రంథమండలి :

# వేమన పద్యములు

(అకారాదిగ కూర్చబడిన 5000 పద్యములు)



సంకలన :

శ్రీ నేదునూరి గంగాధరం

ముఖచిత్రం :

శ్రీ Y. వెంకటేశ్వరరావు



పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్

# VEMANA PADYAMULU

(Arranged Alphabetically)



Edited by
NEDUNOORI GANGADHARAM

First Edition September 1960
Price Rs 12/-





Publishers : ADDEPALLY & CO.
SARASWATHI POWER PRESS

# బ్రహ్మశ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ M. A.
## గారు ఇచ్చిన
# అభినందనము

---

శ్రీ నేదునూరి గంగాధరము గారొకరు తమ జీవితము జీవితమునంతయు నాంధ్ర భాషకొఱకు వినియోగపరచినవారు. పరచుచున్నవారు. వీరు తెలుగు సామెతలు, పలుకుబడులు మరియు వేమనపద్యములు పెక్కు కథలు సేకరించిన వారిలో నెంతయో శ్రమపడి యివన్నియు సంగ్రహించిరి.

ఈ తెలుగునాటఁ బలుమంది తెలుగు సామెతలను నుడికారములను గడచిన దశాబ్ది దశాబ్దిన్నరగాఁ బ్రచురించిరి. అందఱును శ్రీ గంగాధరముగారి సంకలనములనుండి మిక్కిలిగా సాయము తీసికొనినవారే. చివరకు 'ఆంధ్ర ప్రదేశ సాహిత్య ఎకాడమీ' వారు ప్రచురించిన తెలుగు సామెత లన్నగ్రంథము కూడ వీరి పరిశ్రమనుండియే చాలభాగము ప్రోవుచేసికొన్నది. నుడికారము లందుఁగూడ వీరి సాహాయ్యము కలదు.

ఇప్పుడు వీరు వేమన్న పద్యములను ఐదువేల నేకత్ర సంగ్రహించెను ఇంత పని మున్నెవ్వరు చేయలేదు. ఈ పద్యములు కొన్ని యొక విశ్వబ్రాహ్మణుని గృహమునందు, మరికొన్ని యొక కుంభకారుని నివసనమునందుఁ గొన్ని కొందఱి నోళ్ళలో నుండును. వాని నీరీతి సేకరించుట యెంత యోపికయో యెంత పట్టుదలయో యొక తీవ్రమైన జీవితాశయముతో యొక నిరంతరనమె నిగూఢమైన జీవితోద్వేగముతోఁ బనిచేసెడివారికి మాత్రమే తెలియును. ఒక కార్యమునందలి కష్టము తెలిసికొనుటకు నొకడు కొంతకాకపోయినఁ గొంత యయిన నాపనిచేసి దాని ననుభవించవలెనయిన వలయును. లేదా మనస్సుతో దానిలోని కష్టము నాలోచించియైనఁ దెలిసికొనవలయును. రెండును లేనివాని కెంతటి దొడ్డపని సరిగా నర్థముకాదు. తెలిసినవాని 'కబ్బా! ఎంత శ్రమపడినాడు. ఎంత చేసినాడు' అని యాశ్చర్యము కలుగును. గౌరవమును

కొంత యెక్కువ చేసెను. దాని కోసమంత ప్రశంస చేయుదు వెందుకన వచ్చును. అదికాదు. ఈనా డిట్టి కార్యముల కున్నంత యవసరము వేనికిని లేదు. ఏజాతియైనను తన జీవితములో నొకప్పుడు తన సర్వవిజ్ఞానము 'నంచనా' వేసికొని యిది మన యాస్తియని చూచుకొనవలయును. అట్లు తొలుతఁ జూచికొనినచోఁ దరువాత చేయవలసినపనులు సులభముగా నిర్వర్తించు కొనవచ్చును. నేడు మన తెలుగుజాతి కట్టి యంచనా వేసికొనవలసి వచ్చిన దినములు వచ్చినవి. ఇట్లన్ని జాతులును జేయుచున్నవి. భారతదేశమునఁ దక్కిన భాషాప్రాంతము లిందులో మనకంటెఁ జాలముందున కేగినవి. మనమే వెనుక పడియున్నాము.

ఇట్టి 'యంచనా' లో శ్రీ గంగాధరముగారి యీ వేమన పద్యసంకలన మొక ఘట్ట మని చెప్పవలయును.

ఈ యంచనావలని ప్రయోజన మేమి యన్నచో దీని ప్రయోజనములు చాల కలవు. వానిలోఁ బ్రధానమయినది 'విజ్ఞాన సర్వస్వము'.

విజ్ఞానసర్వస్వములు మన భాషలో నింతవరకు నాల్గయిదు వెలువడినవి. ఇంకను గొన్ని రచనలో నున్నవి. అవియును దొందరలో వెలువడఁగలవు. ఇప్పుడు వెలువడుచున్నవి మున్ను వెలువడినవియు నన్నియు నసమగ్రములే యనవలయును.

విజ్ఞానసర్వస్వ మనగా 'సరస్వతీ విశ్వరూపము' ఇది యనంతమయినది. ఆ విశ్వరూపమును వేయిదిశలనుండి ప్రదర్శించవలయును.

అందులో 'వేమన్న పద్యములు' ఒక దిశయొక్క సమగ్రరూపము. అన్ని శాఖలయందును నేటి యీ శ్రీ గంగాధరముగారి పరిశ్రమ ఫలితమయిన యిట్టి యించుమించుగా సమగ్రరూపమన్న యీ ప్రయత్నమువంటి ప్రయత్నములు సాగి యీరీతి రూపుకట్టినచో నా 'విజ్ఞానసర్వస్వము' తొందరలో బ్రత్యక్షమగును.

నేటి విజ్ఞానసర్వస్వములు చేసిన కార్యములన్నియు నా విజ్ఞాన సర్వస్వ మహాసముద్రమును ...

కొంత యెక్కువ చేసెను. దాని కోసమంత ప్రశంస చేయుదు వెందుకన వచ్చును. అదికాదు. ఈనా డిట్టి కార్యముల కున్నంత యవసరము వేనికిని లేదు. ఏజాతియైనను తన జీవితములో నొకప్పుడు తన సర్వవిజ్ఞానము 'నంచనా' వేసికొని యిది మన యాస్తియని చూచుకొనవలయును. అట్లు తొలుతఁ జూచికొనినచోఁ దరువాత చేయవలసినపనులు సులభముగా నిర్వర్తించు కొనవచ్చును. నేడు మన తెలుగుజాతి కట్టి యంచనా వేసికొనవలసి వచ్చిన దినములు వచ్చినవి. ఇట్లన్ని జాతులును జేయుచున్నవి. భారతదేశమునఁ దక్కిన భాషాప్రాంతము లిందులో మనకంటెఁ జాలముందున కేగినవి. మనమే వెనుక పడియున్నాము.

ఇట్టి 'యంచనా' లో శ్రీ గంగాధరముగారి యీ వేమన పద్యసంకలన మొక ఘట్ట మని చెప్పవలయును.

ఈ యంచనావలని ప్రయోజన మేమి యన్నచో దీని ప్రయోజనములు చాల కలవు. వానిలోఁ బ్రధానమయినది 'విజ్ఞాన సర్వస్వము'.

విజ్ఞానసర్వస్వములు మన భాషలో నింతవరకు నాల్గయిదు వెలువడినవి. ఇంకను గొన్ని రచనలో నున్నవి. అవియును దొందరలో వెలువడఁగలవు. ఇప్పుడు వెలువడుచున్నవి మున్ను వెలువడినవియు నన్నియు నసమగ్రములే యనవలయును.

విజ్ఞానసర్వస్వ మనగా 'సరస్వతీ విశ్వరూపము' ఇది యనంతమయినది. ఆ విశ్వరూపమును వేయిదిశలనుండి ప్రదర్శించవలయును.

అందులో 'వేమన్న పద్యములు' ఒక దిశయొక్క సమగ్రరూపము. అన్ని శాఖలయందును నేటి యీ శ్రీ గంగాధరముగారి పరిశ్రమ ఫలితమయిన యిట్టి యించుమించుగా సమగ్రరూపమన్న యీ ప్రయత్నమువంటి ప్రయత్నములు సాగి యీరీతి రూపుకట్టినచో నా 'విజ్ఞానసర్వస్వము' తొందరలో బ్రత్యక్షమగును.

నేటి విజ్ఞానసర్వస్వములు చేసిన కార్యములన్నియు నా విజ్ఞాన సర్వస్వ మహాసముద్రమును భాగీరథిపాయలవలె నింపును.

విజ్ఞానసర్వస్వ మనునది యొక్కనాటిపనికాదు. ఒక్కడు చేసెడిపని కాదు. ఒకసారి చేసినంతన యైపోయెడి పనియుఁగాదు. ఈదశలలో మూడవ

దసంతతదశ. ఆదశకు యోగ్యమయిన యొక విజ్ఞానసర్వస్వమును లక్ష్యముగాఁ బెట్టికొనియే కొందఱు తెలిసియుఁ గొందఱు తెలియకయు నీ మహాకార్యమునందు నిమగ్నులయియున్నారు. వారు తెలిసిచేయుచున్నను దెలియక చేయుచున్నను వారి కార్యము ప్రశంసనీయమే. భవిష్యత్తున నెంతయో యుపయోగించును. 'ఈ ప్రపంచాగ్నికి నేనుకూడ సమిధ నగుదును' అన్న యాధునిక మహాకవి యర్థము ననుసరించి యీ ప్రయత్నములన్నియు నా 'విజ్ఞానసర్వస్వ' మన్న మహాగ్నికి సమిధలు.

ఈ గంగాధరముగారి యీ సమిధ చాల యవసరమయినది. ఈ వేమన్నలో – తెలుగు పలుకుబడులు – దేశ్యములయిన శబ్దములు – వ్యావహారిక పదములు – తెలుగుజాతి ఆచారములు – అలవాట్లు – సామెతలు – మొదలయిన వన్నియు విస్పష్టముగా నెఱింగి యుపయోగించుకొనుట యిప్పు డెంతో తేలిక యగునుగదా! మరియు – నాటి సాంఘికవ్యవస్థ – అర్థమునుండి విగ్రహింపఁ బడి శవములవలెనున్న యాచారములమీద వేమన్న యెత్తిన దండు – దానివలన సంఘస్థితి – భూతభవిష్యద్వర్తమానములు 'దానినిబట్టి' తీర్చికొనవలెనైన స్థితి – యివి యన్నియుఁ దెలిసికొని యాచరింపఁదగిన వైయుండును.

ఇవియేకాక – వేమన్న మతమేమి? అచలమా? తద్భిన్నమా? ఈ యచలాభాస ముదయించుటకుఁ బూర్వోక్తవిషయము లెట్లు హేతువు. తత్రత్య యమో తద్విపర్యాసమో యేది నేడు ప్రాధేయము? ఇట్టి బహువిషయ నిరూపణ కీ గ్రంథము వేమన్న విషయములోఁ దొల్లిటికంటె నెంతయో సౌల భ్యము నేడు సమకూర్చగలదు.

శ్రీ నేదునూరి గంగాధరముగారు చేసినపని యింత గొప్పది. ఇది ప్రచురించిన శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు దీనిలో సగభాగమున కర్హులు.

కరీం నగరము

20 - 6 - 60

ఇట్లు

విశ్వనాథ సత్యనారాయణ

# సహాయ గ్రంథములు

1. పి. బ్రౌను దొరగారు సేకరించిన యాబదిరెండుగ్రంథములలో ముప్పది ఎనిమిది ఎత్తివ్రాయడమైనది.
2. కె. లక్ష్మణస్వామి మొదలియారు ప్రచురణ
3. పమ్మి త్యాగరాజ శెట్టిగారి ప్రచురణ
4. వావిళ్ళవారి ప్రచురణ
5. రాయవరపు పూర్ణమాచార్యులు ప్రచురణ
6. వేదాంత సిద్ధాంతము
7. వేమన పద్య రహస్యార్థ బోధిని
8. వేమనార్యుని పద శబ్దార్థములు
9. వెస్టు వార్డు కంపినీ వారి ప్రచురణములు
10. రాజమండ్రి శ్రీ గౌతమీ గ్రంథాలయములో గల నెం. 148, 149, 150 151, 152, 153, పుస్తకములు
11. వేమన వాక్యానుభవ శిరోమణి
12. బాలస్వరూపానందుల వారి ప్రచురణ
13. రెంటాల వేంకట సుబ్బారావు గారి ప్రచురణ
1 . పి. సాంబశివరావుగారి ప్రచురణ
1 . . బంగారయ్యగారి ప్రచురణ
16. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి ప్రతి.

# తొలినుడి

శ్రీరాజ్య లక్ష్మమ్మగారి పేరిట కాతేరులో నెలకొనియున్న ప్రాథమిక పాఠశాలలో నేను చదువుకొను కాలమున నవయుగ వైతాళికులు తెలుఁగు నుడుల పోడిములను నవయుగమునకు అందించి విజ్ఞాన కాగడా వెలిగించి మించిన నవ్యాంధ్ర యుగకర్తయు సర్వమత సమ్మతమును రంగరించి యాంధ్ర జనానీకమునకు ఉగ్గుపాలతో కలిపి పోసిన పితామహుఁడగు శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారు నన్నూ నా తెలుగు పలుకుల తెరవెంచి అంచిత కరుణార్ద్ర దృష్టితో ఆశీర్వదించి "ఆంధ్రకవులు చరిత్ర, శ్రీరాజశేఖర చరిత్రయు" నాకు బహూకరించిరి.

సహజముగా శిష్యవత్సల్యురును, సంస్కృతాంధ్రాంగ్ల భాషారామ కేకియు విమర్శకాగ్రేసరు లగు శ్రీమానవల్లి రామకృష్ణకవి M. A. గారు నాఉపాధ్యాయ తరిఫీజు తరుణమున శ్రీ కందుకూరి వారి కరుణబడసిన వాడనని దెలసికొని బహుప్రీతితో నాకు కవితా సతికవసరమగు అంద చందములు నేర్పి అనాటి నుండి వారి యంత్యము వరకు ఆదరణతో జూస్తూ తను గన్న సంతానమువలె గాంచి నన్నింత వానిగా జేసిరు.

జానపద వాఙ్మయ సేకరణ సంచారిగ్గా మద్రాసు మాగురు దర్శనార్థమై నేను వెళ్ళినపుఁడు అంధ్రవిశారదులగు శ్రీ తాపీ ధర్మారావునాయుఁడుగారూ, శ్రీ గూడవలి రామబ్రహ్మముగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగార్ల పరిచయము గలిగినది. ముగ్గురు వర్యులు అముద్రిత వాఙ్మయ సేకరణ నేను చేయుచున్నానని పైముగ్గురకు తెలియజేయగా అందు శ్రీ తాపీవారు వేమన వేద సారమును కూర్పమనియూ, కూర్చునపుఁడు మాయింట నిరాఘాటంగా కుడువ వచ్చుననియు శ్రీ గూడవల్లివారూ, అట్లయిన మాప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోనున్న బ్రౌనుదొరవారి సేకరణ వాఙ్మయము నిచ్చెదననియూ వేటూరివారూ బాసలు గావించిరి.

యీ మహామహుల దయచేత నేను శ్రీ బ్రౌను దొరవారి యాబదిరెండు సంపాదిత గ్రంథములలో ముప్పది యెనిమిది ఎత్తివ్రాసికొని నేను తెలుఁగు నేలనాలుగు చెరగుల తిరిగి ప్రోవు చేసిన పదియారు ముద్రణ ప్రతులునూ కలపి అకారాదిగా కూర్చితిని.

యీ నాసంకలన సవిత్రి అనాదరణ అంధకారాటవిలో చిక్కుకొని యుండ "వాఙ్మయ మహాధ్యక్ష శ్రీ వద్లమూడి గోపాలకృష్ణయ్యగారు" వినిఁగని విచారించి శ్రీ అద్దేపల్లి దంపతుల ఆదరణ కాంతినిఁ గల్పించారు.

నా కోరిక మన్నించి వెంటనే దీనికి అభిప్రాయాశీర్వచన లిచ్చిన "కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ M. A. గారికి, యీగ్రంధ నిర్మాణములో తగిన సలహాలు నిచ్చి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి, వేమన చారిత్రక చిత్రములు వ్రాసిన Y. సుబ్బారావుగారికి, వేమన సంక్షిప్త చరిత్ర వ్రాసియిచ్చిన శ్రీ పోలిశెట్టి నాగేశ్వరరావు గారికినీ. దీనిని అచ్చునకు సరిపడు గ్రంథముగా తయారు చేయుటలో, శ్రీ పెనుమంట్ర సుబ్బయ్యగారికీ, పద్యములు సూత్రీకరించుటలోనూ. ఇంకా అనేక విధముల తనశక్తివంచన లేకుండా శ్రమించి నాకు సహాయ్యముజూపిన చిరంజీవి, అష్టావధాని, బొత్సకవి (శాంతిశ్రీ)

గారికి అచ్చు ప్రూఫులు జూచుటలో ముఖ్యముగాతోడ్పడిన శ్రీ పున్నమరాజు నాగేశ్వరరావుగారికి, శ్రీరాపాక కృష్ణమోహనరావుగారికి అరంభము నుండి అంత్యమువరకూ దీనిని అన్ని విధముల పుస్తక రూపముగా తయారు చేసియిచ్చిన శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్ వర్కర్లకూ నేను హృదయ పూర్వక వందన, అభినందనము లిందుమూలముగా నందించుచున్నాడను.

ఇందు ప్రచురించిన వేమన 5000 లు పద్యములు కేవల వేమనవే గావు, వేమన యందున్న గౌరవ ప్రపత్తులతో స్వరచనలు కొందరు యిందులోచేర్చినారు.

ఇతర గ్రంధముల లోనున్న పద్యములు కొలది మార్పులతో వాక్సాహిత్యకారులు కొంత సాహిత్యమును జేర్చిరి.

పద్యపాదములు విరచి యితర పాదములతోఁగలపి అపభ్రంశముగా పద్యముల సంఖ్య పెంపొందించారు కొందరు.

వేమన్న పద్య ప్రచురణ కర్తలు కొందరు వారి కందిన మట్టుకు అదే వేమన సర్వస్వమని ప్రకటించారు.

చరిత్రకారులు, టీకాకారులు, విమర్శకులు, వ్యాసకర్తలు, అభిమానులు, వారివారి యిచ్ఛకు నచ్చినట్లు మార్పు, కూర్పు, చేర్పు, తీర్పులతో సిద్ధాంతీకరించిరి.

అందుచేత యిందులో వివరించిన లోపములునూ, చేరని పద్యములునూ, నాకు యిప్పించిన వారికి కృతజ్ఞత తెలిపుకొంటూ ద్వితీయ ముద్రణమున చేర్చుకొందును.

25–7–60
టౌనుపోలీసు లైను
రామకృష్ణాస్కూలు
లక్ష్మీవారపుపేట
రాజమండ్రి

ఇట్లు
భాషాసేవకుడు
– నేదునూరి గంగాధరం

# వేమన జీవితం

వేమనయోగి ఏకాలంవాడో, ఏప్రాంతం వాడో ఏకులం వాడో ఎవరూ సరిగ్గా చెప్పలేక పోతున్నారు. ఈవిషయమై పండితులలో అనేక అభిప్రాయభేదాలు వున్నాయి. ఈయన్ని, ఒకరు 15వశతాబ్ది వాడంటే మరొకరు 17వ శతాబ్ది వాడంటున్నారు. ఒకరు కొండవీటి ప్రాంతంవాడంటే, మరొకరు కదిరి దగ్గిర కటారుపల్లె వాడంటు న్నారు. అలాగే ఒకరు ఈ యన్ని కాపుకులస్థుడంటే, మరొకరు రెడ్డి కులస్థు డంటున్నారు. ఈవివాదాంశాలు చారిత్రక పరిశోధకులకి వది లేసి, వేమన చెప్పిన పద్యాల ఆధారంతో వేమనయోగి కుల, స్థల కాల నిర్ణయాలు చేద్దాం.

> " మనమున వేసిన । మైనపు జిడ్డీ
> వ్రణతము నై దగు । రావుల దొడ్డీ
> యనువున జేసెను । నందబనొడ్డీ
> వితతముగాఁ గను । వేమన రెడ్డి "

ఈ పద్యంవల్ల వేమన రెడ్డి కులస్థుడని స్పష్ట మవుతున్నది. మరో పద్యం చూద్దాం :-

> " ఊరుకొండవీడు । ఉనికి పశ్చిమ వీధి
> మూగ చింత పల్లె । మొదటి యిల్లు
> ఎడ్డె రెడ్డి కులము । దేమని తెల్పుదు "

ఈ పద్యం వల్లకూడా వేమన రెడ్డికులస్థుడనీ, జన్మస్థలం కొండ వీడనీ తెలుస్తూ వుంది.

> " నందన సంవత్సరమున
> పొందుగఁ గా ర్తీకశుద్ధ । పున్నమనాఁడున్
> వింధ్యాద్రి సేతు బంధన
> సందున నొకవీరుఁ డేలు । సరగున వేమా. "

పై పద్యమును బట్టి వేమన 1412 లో నందన సంవత్సర కార్తీక పూర్ణిమనాడు వేమన జన్మించాడని నిర్ధారణ చేశారు.

"కదిరి తూర్పునందు । ఘనత శోభిల్లగా
బరగు వరకటార్ల । పల్లె వెలసి
యచల నిష్ఠఁగూడ । నమరి యుండెదరయా"

ఈ పద్యంవల్ల వేమనయోగి కదిరి దగ్గిరవున్న కటారు పల్లెలో మరణించినట్టు తెలుస్తున్నది. ఇప్పటికీ ఈపల్లెలో వేమనయోగి సమాధివుంది. ఇక్కడ ప్రతిసంవత్సరం వేమనయోగికి పెద్ద వుత్సవం జరుగుతుంది. ఈయన శార్వరినామ సంవత్సర చైత్రశుద్ధ నవమి నాడు సిద్ధి పొందినట్టు కటారు పల్లెవాసులు చెబుతారట.

వేమనయోగి జీవితం విషయమై జనసామాన్యంలో ఈకథ ప్రచారంలోవుంది.

కొండవీడును మొట్టమొదట పోలయవేమారెడ్డి పరిపాలించాడు. తరవాత ఈయనకొడుకు అనవేమారెడ్డీ, అనవేమారెడ్డి కొడుకు అనపోతవేమారెడ్డీ, అనపోతవేమారెడ్డి కొడుకు కుమారగిరి వేమారెడ్డీ పరిపాలించారు. ఈ కుమారగిరి వేమారెడ్డి 14 సంవత్సరాలు రాజ్య పాలన చేశాడు.

ఈయన కాలంలో పాంచాలపురంలో ఓబ్రాహ్మణ యువకుడు ఒంటరిగా జీవిస్తూ వుండేవాడు. ఆపుర సమీపంలో ఓ అడవివుంది. ఆ అడవిలో భిల్లజాతివారు నివసించేవారు. భిల్లకన్యక ఒకామె ఈ బ్రాహ్మణ యువకుణ్ణి చూసింది. మోహించింది. పెళ్ళికూడా చేసేసుకుంది అతణ్ణి. ఆ అడివిలో "అపరుసవేది" వున్నట్టు బ్రాహ్మడికి తెలిసింది. అడవిలోకి ఎలాగైనా పోయి పరుసవేది సంపాదించాలనుకున్నాడతడు. ఓరోజున అతడు, భిల్లులు నివసిస్తున్న అడివిలోకి తనను తీసుకువెళ్ళమని భార్యను కోరాడు. ఆమె అతడిమాట కాదనలేకపోయింది. రహస్యంగా అతణ్ణి అడివిలోకి తీసుకువెళ్ళింది. ఆ అడివిలో ఓచోట "పరుసవేది" నీరులా ప్రవహించడం చూశాడతడు. అతనికి

ఆశపుట్టింది. భార్యకి తెలియకుండా ఓ వెదురుగొట్టం నిండా పరుస వేది నింపుకుని అడివిలోంచి తిరిగి వచ్చేశాడు.

ఇతనికి ఓ కోమటిస్నేహితుడు వున్నాడు. కోమటి యింటికి వెళ్ళాడు. అతడియింట్లో ఓదూలానికి పరుసవేదితో నిండివున్న వెదురు గొట్టాన్ని వేలాడగట్టి, జాగ్రత్తగా వుంచమని స్నేహితుడితో చెప్పి బ్రాహ్మడు వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళకి వెదురుగొట్టంలోవున్న పరుసవేది, దాని కిందవున్న ఇనుపకడ్డీల మీదపడింది. దాంతో అవన్నీ బంగారపు కడ్డీలగా మారి పోయాయి. ఇది కోమటి చూశాడు. ఆశ్చర్యపోయాడు. గొట్టంలో వున్నది పరుసవేది అని గ్రహించాడు. ఎలాగైనా దాన్ని దొంగి లించాలనే దురాశ కలిగిం దతనికి. వెంటనే పరుసవేదిని మరోచోట రహస్యంగా దాచి, తనకొంపకి నిప్పుఅంటించాడు. తగలబడిపోతున్న స్నేహితుడియిల్లు చూసి బ్రాహ్మడు పరుగెత్తుకుని వచ్చాడు, పరుస వేదితోనిండియున్న గొట్టం యింకా ఆయింటోనే వుందనుకున్నాడు బ్రాహ్మడు. గొట్టం తెచ్చుకుందామని వెంటనే మంటల్లోకి దూకాడు. మరణించాడు. ఆ తరవాత కోమటి పరుసవేది సహాయంతో మణు గులకొద్దీ బంగారం తయారుచేసి భాగ్యవంతు డయ్యాడు.

ఈసంగతంతా కొండవీటిరాజు కుమారగిరి వేమారెడ్డికి తెలిసింది. కోమటి భాగ్యమంతా తనస్వాధీనం చేసుకున్నాడు. ఇది చూసి భరించలేక కోమటి ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయాడు.

ఈపాపం పోగొట్టుకోవాలని కుమారగిరి వేమారెడ్డి జీర్ణదేవాల యాన్ని బాగుచేయించాడు. సత్రవలు కట్టించాడు. చెరువులు త్రవ్వించాడు. అంతేకాదు తనకొడుకులకి ఆబ్రాహ్మడిపేరూ, కోమ పేరూ పెట్టాడు. ఈయన పెద్దకొడుకుపేరు కోమటి వెంకారెడ్డి. అన వేమారెడ్డి అనికూడా పిలుస్తారు. చిన్నకొడుపేరు రాచకవేమారెడ్డి మూడవకొడుకు వేమారెడ్డి, ఈయనే వేమనకవి.

## వేశ్యాలోలత

వేమన యవ్వన కాలంలో చలచిత్తంతో తిరుగుతూవుండే వాడు. అది చూచి తల్లీ, అన్నగారూ అసహ్యించుకునేవాళ్ళు. వదిన మాత్రం అతడు ఎన్ని చిలిపిచేష్టలు చేస్తున్నా సహించేది. కన్న బిడ్డ కన్నా ఎక్కువ మాతృప్రేమతో చూచేది. వేమన కూడా ఆమెని కన్నతల్లిలా ప్రేమిస్తూ, ఆమెకు అడకువగా వుండేవాడు.

ఇలా వుండగా వేమన ఓ రోజున ఓ అందాల వేశ్య వలలో చిక్కాడు. అప్పటినుంచీ రాత్రీపగలూ ఆమె యింటిలోనే గడుపుతూ, వదినె ఏమైనా అనుకుంటుందని, అప్పు డప్పుడు మాత్రం ఇంటికి వచ్చేవాడు. ఇలా వేశ్యతో కాలం గడుపుతూ, ఇల్లుగుల్లచేసి చేతికి దొరికిన సొమ్మంతా ఆమెకి యిచ్చేశాడు.

## వదినగారి నగలు అడగడం

వేశ్యకి యివ్వడానికి మరేమీ మిగలలేదు. వేమన విచారిస్తూ కూచున్నాడు. అప్పుడు వేశ్య అతడి దగ్గిరికి మెల్లిగా చేరింది. "నాకోరిక చెల్లించావంటే నేను శాశ్వతంగా నీదాన్ని అయిపోతాను." అంది. అందుకు వేమన "అదేమిటో చెప్పు. ప్రాణమైనా సరే నీకు యిచ్చేస్తాను" అన్నాడు. "అయితే మీ వదినగారి కుడి ముక్కున వున్న బులాకీ తెచ్చియ్యి" అంది వేశ్య. ఆమె మాటలు వినగానే, వేమనకి గుండెల్లో గునపం పోటు పొడిచినట్టయింది. సంధిగ్దావస్తలో పడిపోయాడు. నోట మాటరాలేదు. వేశ్యకి యిచ్చినమాట తప్పడమా? లేక తల్లిలాంటి వదినగార్ని, ముక్కుబులాకీ అడిగి తేవడమా? అంతేకాదు స్త్రీకి మంగళసూత్రమూ, ముక్కు బులాకీ తీయరానివి కదా!

ఇలా ఆలోచిస్తూ మతిలేనివాడిలా యింటికి చేరాడు. మౌనంగా కూచున్నాడు. వదినె అతడి వైఖరి గ్రహించి "ఏమికావా" లని అడిగింది. వేశ్యకోరికను మెల్లిగా వెల్లడించాడు.

వదిన నరసమాంబ వేమన పవిత్రహృదయం గ్రహించింది. అత డితో యిలా అంది. "నువ్వు అడిగినట్టే నామును బులాకీ యిస్తాను నీకు. నువ్వు దీన్ని తీసుకుపోయి, వేశ్యని నగ్నంగావుండి వొంగొని వాలు మొగ్గవేసి రెండుకాళ్ళ మధ్యనుంచి, ఈనగ అందుకోమ్మని చెప్పు. నువ్వు ఎదురుగా నిలబడిదీన్ని అందియ్యి." అందుకు వొప్పుకున్నాడు వేమన. వేశ్యయింటికి వెళ్ళాడు. వదిన చెప్పినట్టుగా నగ అందిం చాడు. ఆ సమయంలో వేశ్య నగ్నశరీరంచూసి అసహ్యించుకున్నాడు. ఛీ ఛీ అనుకుంటూ తిరిగి యింటికి వచ్చాడు. మనసువిరక్తి కలిగింది. వదినగార్ని చూసి నమస్కరించాడు. "అమ్మా! నువ్వు నా జ్ఞాన నేత్రం తెరిపించావు. నువ్వు సాక్షాత్తూ శాంకరివి. నీ ఋణం తీర్చుకో లేను తల్లీ!" అన్నాడు. వేమనని ఆశీర్వదించింది ఆమె.

## వేమన వ్యవసాయం

తరవాత వేమన వ్యవసాయం చెయ్యాలనుకున్నాడు. అన్న గార్ని అడిగి పొలంతీసుకున్నాడు. సేద్యం ప్రారంభించాడు. కాని ఈతని వ్యవసాయం విపరీతంగా పరిణమించింది. అతడు అందరిలా పొలంలో సస్యం వేయక చేదు (వెర్రి) పుచ్చపాదులు పెట్టాడు. ఇది చూచి వూళ్ళో వాళ్ళంతా వెర్రి వేమన అని పిలిచారు. ఎంచేత నంటే వెర్రిపుచ్చకాయలు లోకానికి ఎంత ఉపయోగమో వేమన కూడా అంతేనని వారి అభిప్రాయం.

ఎంత పనికి రావని ప్రజలు అనుకున్నారో అంత విపరీతంగానూ పుచ్చకాయలు కాశాయి, పుచ్చకాయలు ఎవరుకోస్తారో వారికి పుచ్చకాయలే కూలిగా యిస్తానని వేమన చాటించాడు. ఊళ్లో వాళ్ళు మరింత నవ్వడం ఆరంభించారు. అప్పుడు గతిలేని ఓముసిలిది పుచ్చకాయల కోతకి వెళ్ళింది. సాయంత్రంవరకూ పనిచేసింది. వేమన ఆమెకి మూడు పుచ్చకాయలు యిచ్చాడు. అవి తీసుకుపోయి తన కొడుక్కి యిచ్చింది ముసలమ్మ. కొడుకు ఓపుచ్చకాయని పనికిరాదని

దొడ్లోకి విసిరికొట్టాడు. అదిబద్దలయింది. అందులో గింజలు ముత్యాలయ్యాయి. కళ్ళు మిరుమిట్లు గొల్పాయి. ఆశ్చర్యపోయారు. వాటిని భద్రంగా దాచుకున్నారు. మర్నాడు ముసలమ్మా, ఆమె కొడుకూ కోడలూ ముగ్గురూ కలిసి కూలికివెళ్ళారు. వేమన యథాప్రకారం మనిషికి మూడేసికాయలు కూలి యిచ్చాడు. కాని వాళ్ళ ఆశ తీరక దొంగతనంగా రెండేసి మూడేసి కాయలు వొడులలో దాచుకుని యింటికి తెచ్చుకున్నారు. కాని వేమన యిచ్చిన కాయల్లోనే ముత్యాలున్నాయి. మిగతావాటిల్లో పురుగులున్నాయి.

ఈవిషయం వూరంతా పాకింది. అంతా వేమనని "మహాత్ముడు" అన్నారు.

వేమన దాయ పంపకంగా అన్నదగ్గిరికి వెళ్ళి "అన్నా! నేను పండించిన పుచ్చకాయల్లో భూమిపన్నుపోను మిగతావి నువ్వూ నేనూపంచుకుందాం, రా" అన్నాడు. అందుకు వేమనను అన్నగారు, నవ్వి పరిహసించాడు. మహాత్ముల చర్యలు ప్రాకృతులకు అర్థంకావుకదా! వేమన వదిన అతని మహాత్యం తెలిసింది కనుక, భర్తని వొప్పించి వాటా తీసుకు రమ్మని పంపింది. అతడు వెళ్ళి, వేమన చెప్పినప్రకారం ఓపుచ్చకాయ బద్దలుకొట్టి చూశాడు. అందులోంచి మంచి ముత్యాలు రాలాయి. అన్నగారు ఆశ్చర్యపోయాడు. తమ్ముడి నిజస్వరూపం తెలుసుకున్నాడు. అతణ్ణి బతిమాలుకున్నాడు.

## అభిరామయ్యని పొంచిచూడ్డం

అభిరామయ్య రాచనగరంలో సువర్ణకారుడు. అతనివద్ద, వేమన వదినగారు నగలు చేయిస్తూ, వేమనని కాపలా వుంచింది. అభిరామయ్య ప్రతిరోజూ అందరికన్నా ఆలస్యంగా పనికి వస్తూవుండేవాడు. దీనికి కారణ మేమిటని వేమనకి అనుమానం కలిగింది. తెలుసుకోవాలనుకున్నాడు. అభిరామయ్యకి తెలియకుండా, అతని వెంటే వెళ్ళాడు వేమన. అభిరామయ్య ఊరికి తూర్పుగావున్న వనంలో లంబికాశివ

యోగిని దర్శించి పూజచేశాడు. అప్పుడు ఆయోగి అభిరామయ్యని చూసి "నాయనా! ఇన్నాళ్ళనుంచీ నువ్వు నాకు చేసిన సేవకు సంతోషం. నాకు అవసానకాలం సమీపించింది. నువ్వు రేపు ఉదయం నాదగ్గిరికి రా" అని చెప్పాడు. అది విని, వెనక పొంచివున్న వేమన ఆశ్చర్యపోయాడు. ఇంటికి యథాప్రకారం వెళ్ళిపోయాడు. వదినెను పిలిచి, రేపు వుదయం అభిరామయ్యను యింటికి వెళ్ళకుండా చెయ్యమని బతిమాలాడు. అప్పుడు నరసమాంబ రాజుతో చెప్పి అభిరామయ్యని యింటికి వెళ్ళకుండాచేసింది. అభిరామయ్య నగలుచేస్తూ, తన దురదృష్టానికి ఎంతో దురపిల్లాడు. రాజాజ్ఞ మీరలేకపోయాడు.

వేమన మర్నాడు పూజాద్రవ్యాలుపట్టుకుని యోగిని దర్శించాడు. సాష్టాంగ దండప్రమాణం ఆచరించాడు. లేచి వినయంతో ఆయన ఎదుట నుంచున్నాడు.

యోగి, వేమనని చూచి, "నువ్వు ఎవ్వరవు?" అని అడిగాడు. "అయ్యా! నేను అభిరామయ్య శిష్యుణ్ణి. మీకు మనుమణ్ణి. ఆయన నన్ను మీదగ్గరికి పంపాడు." అన్నాడు వేమన. అది యోగి విని "నాయనా! అతనికి ప్రాప్తి లేదు. నువ్వు సుకృతజన్ముడివి. అంచేత నువ్వు నామంత్రం పొందడానికి అర్హుడివి." అని ఆశీర్వదించాడు. అతని నాలుకమీద భీజాక్షరాలు లిఖించాడు. మంత్రోపదేశం చేశాడు.

## అభిరామయ్యని వేడుకోవడం

వేమన గురువు దగ్గిర శలవు తీసుకున్నాడు. ఇంటికి వచ్చాడు. అభిరామయ్య కాళ్ళమీద పడి, క్షమించేవరకూ వదల నన్నాడు. "నువ్వు రాజువు. నేను నిన్ను క్షమించడ వేమిటి?" అన్నాడు అభిరామయ్య, తరవాత అభిరామయ్య వేమనను క్షమించా ననగా, జరిగిన సంగతంతా వేమనచెప్పాడు. అది విని అంతా ఆశ్చర్యపోయారు. అప్పుడు అభిరామయ్యకి వేమన "ఆర్యా! నువ్వు నాగురుదేవుడివి. అంచేత నీపేరు శాశ్వతంగా వుండేలాగ, నీపేరు జోడించి "విశ్వదాభి

రామ వినురవేమ" అనే మకుటంతో ఏనాడూ ఎవరూ ఎక్కడా
వినీ ఎరగని సారస్వతం సృష్టిస్తాను" అని శపథం చేశాడు.

## వేమన దేశసంచారం

ఈవిధంగా వేమన యోగిగా మారిపోయాడు. ప్రథమ గు
వదినకూ, ముఖ్యగురువు అభిరామయ్యకూ వందనాలు అర్పించ
వారిశలవు తీసుకుని దేశాటన ఆరంభించాడు. ప్రకృతి రామ
కానికి ప్రజాహృదయాల్లో గల భావాల్ని హత్తించి పొత్తుచేసి ఆ
ఆటగా పాడింది పాటగా పద్యాలు చెబుతూ ఆబాలగోపాలానికి
మయ్యే భాషలో, తేనెలొలుకు భావాలతో సర్వమత సమ్మత
కవిత్వం చెప్పి ప్రజా మన్ననలు అందుకున్నాడు. విన్న ప్ర
వేమన వేదాతీతుడనీ, వేమన వాక్యము వేదమనీ, వెర్రివేమనమా
వేద మయ్యాయనీ అన్నారు.

## వేమన మహాప్రస్థానం

వేమన ఈవిధంగా దేశమంతా తిరిగాడు. అనేక మంది
తయారుచేశాడు. మందిరాలూ, మఠాలు కట్టించి తనమతం
కావించాడు. చివరికి తనవాళ్ళ నందర్నీ రప్పించి ఎవరికి
సినవి వారికి చెప్పి, వారంతా జయజయ ధ్వానాలు చేస్తుండగా
యోగీంద్ర సాంప్రదాయానుసారం, మహాయోగి, మహాకవి
మహాప్రస్థానానికి వెళ్ళిపోయాడు.

---



వేమన వేశ్యాలోలత్వము
(పద్యము 1307)



వేమన వదినెగారి నగల నడుగుట
(పద్యము 2730)



వేమన వ్యవసాయము
(పద్యము 3561)



లంబికాయోగిని అభిరామయ్యను వేమన పొంచిచూచుట
(పద్యము 2434)



వేమన గురూపదేశము

(వాక్యం 497)



అభిరామయ్యను వంచించినందులకు క్షమింపమని వేడుకొనుట
(పద్యము 3021)



వేమన సంచారము – ప్రచారము
(పద్యము 1796)



వేమన మహాప్రస్థానము
(వచనము 3240)

# మనవి మాటలు

వేదసారమును గోరుముద్దలుఁగ జేసి, ఆంధ్రుల కర్పించిన మహాయోగి వేమన. ఈయన మహాయోగియేగాక మహాకవికూడాను. ఈదివ్యపురుషుఁడు చదివినవారికిని, చదువని వారికిని, జ్ఞానులకును, అజ్ఞానులకును గురి తప్పని బోధలుగా ఆటవెలదులలో సూటిగా జెప్పినాడు.

ఒక అగమ్యమైన విషయమును సులభగ్రాహ్యముగ బోధించుటలో మేటి. ఆయన ఉపమానములు సాటిలేనివి. జ్ఞానమును నిత్యజీవితమునకు ముడిపెట్టిన మహాత్ముఁడాయన. అంత రక్తుఁడు, అంత విరక్తుడు మన తెలుఁగువారి చరిత్రలో మరియొకఁడు కానరాఁడు. "కామిగాక మోక్షకామిగాఁడు" అన్నసూక్తి ఆయనపట్ల చక్కఁగా వర్తించినది.

కందమునకు తిక్కనయు, సీసమునకు శ్రీనాథుడు, ఆటవెలఁదికి వేమనయు ప్రసిద్ధిపొందిన కవులు. వేమన కవిత్వము జాను తెనుఁగులో తేనెసోనలూరుతూ వుంటుంది. ఈయనవ్రాసిన ఆటవెలఁదులలో ప్రతి పద్యమున అపారమగు అనుభవము, అర్థము నిండి వుండును. ప్రతీ పద్యమును ప్రతివారికిని జీవితము పొడవునను నూతనార్థములను స్ఫురింపఁ జేయుచునే యుండును.

వేమన సంఘమును, జీవితమును సంస్కారరూపమునచూచినాఁడు. ఆయనచూచిన జీవితపుశిఖరములను, సంఘౌన్నత్యములను ఎవ్వరును ఊహింప జాలరు. ఆయన జూచిన స్థితికి సంఘముఁ జేరుకొనుటకు చాల కాలముఁ బట్టవచ్చును. వ్యక్తి జీవితశిఖరములను యేకొలదిమందియో కాని చూడలేరు. ఆయనజేసిన జ్ఞానబోధ లట్టివి. ఈయన సంఘమును నిర్మొగమాటముగ విమర్శించాడు. ఆ విమర్శనలో పరిహాసము మృదువుగ గోచరించును కాని, గంభీరదృష్టితో ఆ విమర్శనలను మనము అర్థం చేసుకొంటే "సత్యమంతే" అనిపించును. సంఘదురాచారములను గూర్చి ఆయన హృదయమెంత సంక్షోభపడినదో సంఘ సంస్కరణలకై నిర్వికారుఁడగు ఆ అద్వైత యోగిమూర్తి

యెంతజాలిపడెనో మనకు కానవస్తుంది. ఆయన విమర్శించిన సత్య ములు ఒక దేశ, కాల, పాత్రలకు సంబంధించినవి కాక సర్వకాలిక, సార్వజనిత, సార్వదేశికములై విరాజిల్లుతూ వున్నాయి.

"పొరుగింటి పుల్లకూర రుచి" అన్నట్లు మనవారు పరభాషల లోని గ్రంథములను చదువుటకుఁ బాల్పడుటయేగాని, జాతిరత్నముల వంక చూడరు. మనసారస్వతాన్ని ఖిలంగాకుండా సంపాదించి సంరక్షించిన మహామహుఁడు శ్రీ సి. పి. బ్రౌన్‌దొరగారు. ఈయన ఆంగ్లేయుఁడు. ఈయన వేమన పద్యములను 52 తాళపత్రప్రతులు వ్రాయించి చెన్నపురి ఓరియంటల్ గ్రంథాలయంలో పొందుపర చాడు. కొన్ని పద్యములు ఏర్చికూర్చి వాటికి ఇంగ్లీషులో భావం వ్రాసి అచ్చువేశాడు. దానితో వేమన ఘనత ప్రపంచవ్యాప్తి నందింది.

వేమన పద్యములెన్ని యున్నవో సరిగా తెలియుటలేదు ఆయన ఒక గ్రంథంగా వ్రాయక దేశసంచారం చేస్తూ, తనకు తోచిన భావ ములను, జూచిన పరిస్థితులను, ఇతరులు అడిగిన ప్రశ్నలకు సమాధాన ములును పద్యములలోచెప్పేవాడు. శిష్యులు వాటిని కంఠస్థంచేస్తూ వాక్సాహిత్యంగా ప్రచారం చేశారు. అందుచేత అసలు వేమన పద్యములలో కొన్నివాక్యములు, కొన్నిభావములు మార్పులూ, కూర్పులూ, చేర్పులూ జరిగాయి. అవేగాక కొన్నిపద్యములే కూర్చ బడ్డాయి. కాని, కొంచెం నిదానించినచో 'రాళ్లు', 'రత్నాలు' సులభముగనే గోచరిస్తాయి. ఈ పరిశీలన వాఙ్మయ పరిశోధకులకు విడిచిపెడదాము. "వ్రాల కందని పద్యముల్ వేల సంఖ్య" "పదియు నైదువేల పద్యములను" అనే పద్యవాక్యములు గ్రంథ సంఖ్యకు తోడ్పడతాయి.

వేమనవి అయినను కాకపోయినను నేను ముద్రితాముద్రిత గ్రంథములనుండి సేకరించినవి అయిదు వేల పద్యములున్నాయి. వీటిని అకారాదిక్రమముతో నాకుతోచిన విజ్ఞాన విశేషాలతో సమ ర్పించుకొంటున్నాను.

వేమన తన కాలమున సామాన్యులువాడు భాషనే వాడుటచేత మనకు నాటికాలపుభాష ఆయన పద్యములవలన లభిస్తుంది. ఆయన పద్యాలలో సామెతలు, జాతీయములు కోకొల్లలుగా వున్నాయి. నాటి విజ్ఞానము, సాంఘికపరిస్థితులు, మత సంప్రదాయములు, విశేషవిషయాలు, కూట వేదాంతము, రసవాదాది శాస్త్రవిజ్ఞానములాది అశేషవిషయాలు మనకు ఈయన పద్యాలలో లభించగలవు. అనేకులు అనేక విధములుగా ఈయన పద్యాలకు భావాలు చెప్తూవున్నారు. నేను విన్న విషయాలు వివరించు కుతూహలమే నన్ని గ్రంథసంధానత్వమునకు పురికొల్పింది.

ఏ భాషలోను జ్ఞానవిజ్ఞానముల నింత సులభముగ సామాన్య ప్రజానీకమునకు సూటిగాబోధించు కవిత్వరూపమున మన వేమన కవిత్వమునకు మీరిలేవన్న అతిశయోక్తి కాదు. వేమన పద్యములు ప్రతివారును భక్తిశ్రద్ధలతో, పరిశీలనాదృష్టితో నిత్యముపఠించి వారి వారి బుద్ధులకు తగినటుల అమూల్యఫలముల పొందుదురు గాక యని ప్రాంజలితో ప్రార్థిస్తున్నాను.

ప్రాచీనాచార ప్రకారం గ్రంథారంభమునందుండే, ప్రార్థనాదిక పద్యాలు చేర్చి, తరువాత అకారాదిగా పద్యాలు కూర్చబడుట ధర్మం కదా !

సకల సుకవి నికరానువర్తి
నేదునూరి గంగాధరం

15 - 8 - 60
రాజమహేంద్రవరము

# వేమన పద్యములు

## ప్రార్థన పద్యములు

కం. శ్రీ కర బ్రహ్మాకారుని
ప్రాకటముగ మదినిఁ జేర్చి । ప్రణవాకృతితో
సోఁకి నటించెడి, జ్ఞప్తిని
పాకముఁగని దాఁటువాఁడె । భక్తుఁడు వేమా. 1

కం. శ్రీ మూల శక్తి యనఁదగు
నా మూర్తులఁ గన్నతల్లి । నౌఁగాఁదనకన్
ధీ మూర్తి నెంచి చూఁడుము
నీ మూర్తికి సాటిలేదు । నిజముగ వేమా. 2

కం. శ్రీ యన మంగళ దేవత ;
శ్రీ యనఁగా విష్ణు పత్ని । సిరి సంపదయున్ ;
శ్రీ యనెడు మూలశక్తిని
శ్రీ యని వర్ణింపు మెప్పుఁడు । స్థిరమతి వేమా. 3

కం. శ్రీ రామ రామ నామము
మారాడక విను నరులకు । మహితాత్ముండై
యూరూరఁ దిరిగి చెప్పుమి
యారాధ తపఃఫలంబు । లగు వేమపతీ. 4

కం. శ్రీ రామ యనెడు మంత్రము
తారక మని యెఱిఁగి మదిని । ధ్యానపరుండై
సారముఁ గ్రోలిన నరునకుఁ
జేరువగను బరమపదవి । చేకుఱు వేమా. 5

## గురుస్తుతి

కం. భవదూరుఁడు శరభాంకుఁడు
శివ శీలుఁడు; వేయుఁగోటి । సిద్ధేశ్వరుఁడున్

శివ భృత్యుఁడు, వటమూలుఁడు
శివమయ చిన్మయుఁడుసోమ । శేఖరగురుఁడో. 6

చ. ధరనతి కీర్తిమంతుఁడును । దైవసముం డతిగోప్యుఁ డోర్పుమీ
ఱ,రహిని కొండవీటి, యభి । రామయ నాగురువర్యుఁడాతఁడున్
మఱియుఁబ్రభుండవీవు నను।మానము లేదిఁక, మీదునామముల్
స్థిరముగనుండుఁగాక యిది । సిద్ధముసుమ్ము జగాన వేమనా! 7

తే. పరమగురుఁడభిరామయ । పాదములకుఁ
జేతులనుఁజాచి మ్రొక్కితి । శిరముఁజేర్చి
తప్పువినియును క్షమియించె । నొప్పిదముగఁ
దలఁపఁడేనందఁ దనపాటు । ఫలము వేమ. 8

## క వి స్తు తి

కం. శివ కవులకు, నవకవులకు,
శివభక్తికి, తత్త్వమునకుఁ । జింతామణికిన్
శివలోక ప్రమథులకును
శివునకు, గురువునకు శరణుఁ । జేయర వేమా. 9

## కు క వి నిం ద

ఆ. తోటకూరకైనఁ । దొగ్గలికైననుఁ
దవిటి కుడుముకైనఁ దవిటికైన,
గావ్యములనుఁజెప్పు । ఘనులెల్ల ధనపరుల్
విశ్వదాభిరామ వినుర వేమ. 10

## క వి ఘ న త

ఆ. కామిగాని వాఁడు । కవిగాఁడు, రవిగాఁడు,
కామిగాక మోక్ష । కామిగాఁడు
కామియైనవాఁడు । కవియగు, రవియగు
విశ్వదాభి రామ వినుర వేమ. 11

కం. రవికననిది, కవిమెఱుఁగును
కవి మెఱుఁగని చోటు రవియుఁ । గానఁడు; ధరలో
రవికన్న మిగుల నెక్కుఁడు
కవివై విలసిల్లు నీవు । గానవె వేమా. 12

## వేమనను గుఱించి

ఆ. కవితఁ గూర్ప బుద్ధిఁ గల్గఁజేసె నజుండు
సముచితమతితోడఁ । జక్కఁగాను
యోగరసంధ్య నిష్ఠ । హోమతర్పణములఁ
జెలఁగి కల్పనంబుఁ । జేసె వేమ. 13

ఉ. కూటికి లేనివానివలెఁ । గోపములేకను నెల్లతావులన్
మాటికి, మాటికిన్, మరియు । మాటకు, మాటకుఁబద్యపద్ధతిన్
ధాటినెఱుంగఁ జెప్పుచును । ధారుణిలో శివరూప ధారివై
మాటికి నున్న వేమన, స । మానము లెవ్వరు? యుర్వి వేమనా? 14

కం. వానను దడియని వారును,
పూనికి వేమన్న చేతఁ । బొరయని వారున్
నానా దిక్కుల వెదకిన
గానమురా! నెంత వానిఁ । గానము వేమా. 15

ఆ. బ్రహ్మవ్రాఁత కెదురుఁ । బల్కెడు వాఁడును
ఆదివిష్ణు సూత్ర । మడఁచు వాఁడు
మూఁడు కనులవాని । మొనసి నిల్చినవాఁడు
కానఁ బడరు నీవు । కాని వేమ. 16

ఆ. వేముఁడిట్లు చెప్పు । వివరపు వాక్యముల్
వేముఁడిట్లు పోవు । వెట్టిపోక
పామరులకు నెల్ల । ప్రతిపక్షమై యుండు
పండితులకు నెల్ల । పరము వేమ. 17

కం. శ్రీమ దుమాపతి యగు నా
స్వామికి; దాసుండ నంగ । జగముల్ పొగడన్

వేమన యనియెడు ధీరుఁడు
నేమంబునఁ జెప్పెఁ దీని । నిజముగ వేమా. 18

## గ్రం థ సం ఖ్య

తే. నీతి, వైరాగ్య, భక్తి, వి । నీతులకును
ఘాతకులుఁగాని, జ్ఞాన సం । కలితులకును
వ్రాలకందని పద్యముల్ । వేలసంఖ్య
చేత ; నందుగ వేమనఁ । జెప్పెభువిని. 19

ఆ. శ్రీకర శివ తత్త్వ । శీలుఁడౌ వేమన్న
పదియునైదువేల । పద్యములను
లోకమందుఁజెప్పె । ప్రాకృతుల్ దరిఁజేర,
విశ్వదాభిరామ । వినురవేమ. 20

## గ్రం థ ఫ ల శ్రు తి

ఆ. ఇహ పరంబులకును । నిది సాధనంబని
వ్రాసి, చదివి, విన్న । వారికెల్ల ;
మంగళంబు లొసరు । మహిలోన నిజమిది ॥వి॥ 21

ఆ. ముక్తి మార్గమునకు । మూలమై తగునట్టి
గ్రంథమంత జనులు । గడగి చదువ
విన్నవారికెల్ల । విభవముల్ కలవయా ॥వి॥ 22

కం. వేమన పద్యము లెల్లను
సామముతోఁ జదివినట్టి । సజ్జనులెల్లన్
సోమన తలఁగల యాతని
సామీప్యము నొందఁగలరు । సత్యమువేమా. 23

ఆ. వేయిపద్యముల, వి । వేకియై భక్తితోఁ
బఠనఁజేసినట్టి । భక్తులకును
బాయకుండు మోక్ష । పథమరచేతిదై ॥వి॥ 24

కం. శతసంఖ్య పద్యముల నే
మతిమంతుఁడు పఠనసేయ । మమతలుదీరన్
అతఁడును నాలుఁగు పదముల
సితికంఠుని పదముఁజేరు । సిద్ధము వేమా ॥ 25

కం. ఒక పద్యంబును మదినిడి
ప్రకటితమగుఁగుట్టుఁ దెలిసి । పరికించినచో
సకలంబును శ్రుత్యర్థము
నికటంబగు నిటరహస్య । నిలయము వేమా. 26

కం. వేమన చెప్పిన మాటలు
సామంబున సకలవేద । సారంబుగదా ?
సామెత పంచాక్షరిలో
నీమహిమలుఁ దెలసియుంట । నింపగు వేమా. 27

## ఆకారాది పద్యానుక్రమణిక

ఆ. అంకిలెటేఁగి మాట । లాడ నేర్చినపుడె
పిన్న పెద్ద తనము । లెన్న నేల ?
పిన్న చేతి దివ్వె । పెద్దగావెలుఁగదా ॥వి॥ 1

ఆ. అంగమందు లింగ । మతిశయంబుగఁ గట్టి
[1] లింగమందు భక్తి । [2] నిలుపలేడు.
ముక్తిలేక తుదను । మూర్ఖుఁడై పోవురా ॥వి॥
పాఠాంతరము:- 1 లింగమందు ముక్తి । లేఁడు నిలుప. 2 యతి తప్పినది.

ఆ. అంగమందు లింగ । మతిశయంబుగఁగట్టి
లింగమందు భక్తి । లేక యున్న
దొంగగొడ్డు మెడను । దుడ్డుఁ గట్టినయట్లు ॥వి॥ 3

ఆ. అంగ మందు లింగ । మమరంగ మర్దించి
జంగ మందుఁబెట్టి । యంగు పఱచి
రంగుగాను వసుధఁ । గ్రుంగఁగఁ జూడరా ॥వి॥ 4

ఆ. అంగము లెనిమిది । నరసిన వారికి
చిత్తశుద్ధిఁగలుగు । తత్త్వబోధ
మెలమి బోధ పడును । నెఱి సుఖ మొందును ॥వి॥ 5

విశేషాంశము :- యతి సరియైనది కాదు. యోగమునకు యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి అని యెనిమిదంగములు కలవు. వీటిని తెలిసిన వారికి తత్త్వము బోధపడును. చిత్తశుద్ధి కలుగును. పరమపద సుఖము లభించును.

ఆ. అంగ మెల్లవదలి । యటుదంతముల నూడి
తనువు ముదిమిచేతఁ । దఱచు వడక
ముప్పు త్రిప్పలఁబడి । మోహంబు విడువరు ॥వి॥ 6

ఆ. అంగమేడఁబుట్టె । లింగమెక్కడఁబుట్టె
యెంగి లేడఁబుట్టె । యేకమాయె ?
యెంగి లెంగి లనుచు । నెగ్గులు పడనేల ? ॥వి॥ 7

శా. అంగమ్మాలినవాఁడు జాతయగునా! । యైదారుగోష్ఠేరులున్
గంగా, నర్మద, సింధు గౌతమగునా! । గంగెద్దు *కాభరణముల్
శృంగారించినశంభు తేజి యగునా! । క్షీరాబ్ధిలో నెప్పుడున్
కొంగన్మ్రంచిన రాజహంసయగునా! । గోరాజ వేమాహ్వయా! 8

విశే:- *గణము తప్పినది. కావున "భర్ణముల్" అని వుండవచ్చును.

ఆ. అంగ యోగములును । ఆరుమతంబులు
మూఁడు యోగములను । మొనయరాదు
కడమ యోగమునను । కల్గును మోక్షంబు ॥వి॥ 9

విశే :- ఇంద్రియాదులే "ఆత్మ" అనునట్టి యోగమువలనగాని శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌర కాపాలిక అనెడి ఆరుమతములవలనగాని, "హఠ లయ మంత్రము" అనెడి మూడు యోగముల వలనగాని, మోక్షము కలుగదు - కడమ యోగమనగా రాజయోగము-దీని వలన ముక్తి కలుగును.

ఆ. అంగ లింగములను । హరునితో మర్దించి
జంగ మింక గ్రంధి । భంగ పఱచి
రంగుగాను వసుధ । వంగంబుఁ గూర్పరా ॥వి॥ 10

విశేషాంశము:- ఇది రసవాదమును గూర్చి చెప్పుచున్నది

అ. అంగు మీరగాను । నబల జన్మంబుల
వలచి చంపునెంత వారినైన
అక్కరణినిఁదనువు । లతిశయమ్మై వచ్చు ॥వి॥ 11

కం. అంచఘనాక్షర బిందువు
పంచాక్షరి నాదమంత్రము । పరమ మునీంద్రుల్
ప్రాంచితముగ నది దెలిసిన
మంచాసన మెక్కువాఁడు । మహిలో వేమా. 12

ఆ. అంజనంబు కనుల । కంటించి చూచిన
సొమ్ము దొరకు భువిని । సూత్రముగను
నమ్మి గురుని కరుణ । నభమంటి చూడరా ॥వి॥ 13

ఆ. అంజనంబుఁబెట్టి । యాత్మలో ద్రవ్యంబుఁ
గనఁగలేని ఘనత । కడఁగి యెత్తిఁగి
ఆశఁ దప్పినప్పు । డతఁడెపో ఘనయోగి ॥వి॥ 14

ఆ. అంటి యంటకుండు । నమల స్వరూపమై
మింటి మంటి నడుమ । మెలఁగు దాని
నొంటి స్థంభమందు । జంటించి చూడరా ॥వి॥ 15

ఆ. అంటు ముట్టునెంచి । యదలించి పడవైచి
దూర మందుఁ జేరి । దూరనేల ?
పుట్టి చచ్చిన తటిఁ । బూర్ణంబుఁదెలియరు ॥వి॥ 16

ఆ. అంటు విడని గుణమె । యది దేహ సుఖమౌను
అంటు విడు గుణమ్మె । యాత్మ సుఖము
కమ్మ నంటు గుణము । కలుగునా ? కలుగురా ॥వి॥ 17

కం. అండంబున నాకాశం
బుండం గాంచంగ గాంచ । నొనంఁగఁదీఁపై
యుండున వన్నయుఁ దెలిసిన
మెండుగ నటుఁజూచిచన్న । మేలగు వేమా. 18

శరీరమనే అండమునందు, మహాకాశమును, పరిచ్ఛిన్నాకాశమును ఉన్నవి. వానిని విభజన చేసి, ఆకాశమువలె, తానును, మిథ్యాభూతమని తెలిసికొన్నమీదట మహదానందము కలుగును. అండము=కనుగ్రుడ్డు.

ఆ. అండజములఁబుట్టు । నలరు ప్రాణులుకొన్ని
బుద్భిదములఁ బుట్టు । పురుగులెల్ల
స్వేదముననుఁబుట్టు । జీవులు కొన్నిరా ॥వి॥ 19

ఆ. అండఁ దప్పిన నరుఁ । డతి ధార్మికుని యిల్లు
చేర వలయు ;ఁ బ్రదుకఁ । జేయునతఁడు
యావిభీషణునకు । నతి గౌరవంబున
భూతలమున రాము । రీతి వేమ. 20

ఆ. అండపిండము, నడి । బిందు వాత్మజ్యోతి
యర్కజ్యోతి, సరసి । జాండమందు
నాదబిందువులకు । నడుమ నద్భుతజ్యోతి ॥వి॥ 21

అండము=కనుగ్రుడ్డు, పిండము=కంటిపాప, బిందువు=పాపలోని కళ, ఇదియే ఆత్మజ్యోతి.

ఆ. అండమండముఁగన । నన్నియు, నటుపిండ
మండమెట్లో ? బమ్మ । యండమల్లె
కర్మబంధముననుఁ । గానరే యీనరుల్ ॥వి॥ 22

ఆ. అండమందునుండు । నఖిలమై జనులార !
యొందులేక యుండు । నెఱుఁగుఁనతఁడె
యతని పూజఫలము । నందె నాశివయోగి ॥వి॥ 23

కం. అండములో నాకాశం
బుండంగాఁజూడఁజూడ । నొనరఁగఁ దీప్తై
యుండును, నంతయు దెలిసిన
మెండుగ నొక ముక్తికాంత । మెలఁగుర వేమా ! 24

ఇది 18వ పద్య పోలికలో ఉన్నది. కాని ; అందులో మేలు కలుగుననియు ఇదియులో ముక్తి కాంత విహరించుచున్న దనియు — కొద్ది భేద ముతో చెప్పబడినది కాని ; మహదానంద మార్గమున పోవు వారికి. నిశ్శబ్దము, నిష్ప్రపంచము, సత్యము అక్షరము, అగు బ్రహ్మము కనబడును.

ఆ. అంత కొఱఁత దీఱె । యతిశయకాముఁడై
నిన్ను నమ్మి చాల । నిష్ఠతోడ
నిన్నుఁ గొల్వ ముక్తి । నిశ్చయముగఁ గల్గు ॥వి॥ 25

కం. అంతయు బ్రహ్మమయంబని
మంతనములు, మాని మనసు । మర్మముఁగనినన్
వింతలు బయటను సున్నగు
చింతలు విడినట్టి వాఁడె । సిద్ధుఁడు వేమా. 26

ఆ. అంతరంగమందు । నభవు నుద్దేశించి
[1] దలఁపముక్తి తన్ను । దగులుగాక
బాహ్యరంగముననుఁ । [2] బరికింప లేదయా ॥వి॥ 27

పాఠాంతరములు.
1 తరిచిచూడ ముక్తి । తనకుగల్గు
2 భాషింప నిలుచునా ?

ఆ. అంతరంగమందు । నభవు నుద్దేశించి
నిల్పి చూడనాడ । నిల్చుఁగాక
బాహ్యమందు శివుని । భావింపనిలుచునా ! ॥వి॥ 28

ఆ. అంతరంగమందు । ననువుగా శోధించి
తలఁపఁ దలఁప ముక్తి । తగులుఁగాక
బాహ్యరంగమందు । భాషింపఁదెలియునా ॥వి॥ 29

ఆ. అంతరంగమందు । నపరాధములుచేసి
మంచి వానివలెను । మనుజుఁడుండు
నితరులెఱుఁగకున్న । నీశ్వరుండెఱుఁగఁడా ॥వి॥ 30

ఆ. అంతరంగమందు । నద్వైతమేయుండు
బాహ్య మందు ద్వైత । భావముండు
యట్లుకాక తత్త్వ । మలవడ నేరదు ॥వి॥ 31

ఆ. అంతరంగ మెఱుఁగ । హరుఁడౌను గురుఁడౌను
యంతరంగ మెఱుఁగ । నలవికాదు
యంతరంగ మెఱుఁగ । నతఁడెపో శివుఁడయా ॥వి॥ 32

ఆ. అంతరంగ హృదయ । మందఁగా సాధించి
చింత లూడఁబెఱికి । చిక్కుపడక
వింతఁజూచిమెలఁగి । విజ్ఞాన మందరా ! ॥వి॥ 33

ఆ. అంతరాత్మఁ గనక । యల్పబుద్ధులతోడ
మెలఁగునట్టి ద్విజులు । మేదినందు
యముని నరకములకు । నరుగంగ సాక్ష్యమ్ము ॥వి॥ 34

తే. అంతరాత్మను గుర్తించి । యాశలుడిగి
చింతలనుఁ ద్రొక్కి మదియందు । సిద్ధుఁడగుచు
వింతలనుఁ జూచి భ్రమయక । వెఱ్ఱి వలెనె
సందు గొందులఁ బూర్ణత । నందు వేమ. 35

తే. అంతరాత్మను భవమంది । యాశలుడిఁగి
సంతతార్చన మదినిష్ఠఁ । జలుపఁగోరి
వంతుకెక్కిన వాఁడె పో । వర్యుఁ డరయ
వాని కెవ్వఁడు సరిగాఁడుఁ । గాన వేమ. 36

ఆ. అంతరిక్షమందు । నమరిన లింగంబు
చింతబూన వలెను । జెనకి యాత్మ
వింతలోని వింత । వెన్నటింటిచూడరా ॥వి॥ 37

ఆ. అందరాని పండఁ । దడవి వెన్నెలబైట
నుండుఁ జూడ దొడ్డ । పండుగాను
పండు పడిన చెట్టు । పట్టంగలేరయా ॥వి॥ 38

ఆ. అందలమును మోసి । యందఱిపై నుండి
పొంది వేడ్క మీఱ । పూర్ణుఁడతఁడు
యతని పూజఫలము । లందంగఁజూడరా ॥వి॥ 39

ఆ. అంది యందనట్టి । యచలస్వరూపంబు
పొందుపడఁగఁబూని । పొదలు వాఁడు ;
జెంది మిన్నకుండుఁ । జిన్మయాకారుఁడై ॥వి॥ 40

తే॥ అంది వేమన జెప్పిన । యాత్మబుద్ధిఁ
దెలియలేనట్టి మనుజులు । దేబె లరయ ;
తలను బాసిన వెంట్రుక । ల్వాలెనుఁజూడ
భుక్తి ముక్తులు హీనమై । పోవు వేమ ॥వి॥ 41

ఆ. అందు నిందు నుండు । నఖిలుండుఁ జూడఁగా
నెందుఁదానె నిండి । యెఱుఁగుచుండు
నతని పూజఫలము । నందుటే ముక్తిరా ॥వి॥ 42

ఆ. అందు నిందు ననక । యన్నిఁటి యందును
విష్ణు వమరి యుండు । వెలయు భువిని ;
వెనుకఁ జక్రి తిరుఁగు । విష్ణుచక్రంబుతో ॥వి॥ * 43

ఆ. అందునిందు ననక । నన్నిటఁ బరికింప
విష్ణు వెలయుచుండు । విదితముగను ;
చక్రి తిరుగు భూమి । చక్రంలోపల ॥వి॥ * 44

* యీ గురుగల రెండుపద్యములు కొన్ని పదములు మార్పులఁ గలిఁగి యున్నవి ఒకేపద్య మయి యుండ వచ్చును.

ఆ. అందు నిందు వెదకి, యనుభవ మందక
కొంద రయ్యులెపుడు । కొంగవలెను
మూర్ఖ తపముఁ బూని । * మరియుటఁగానరో ॥వి॥ 45

* యిచ్చట యతి తప్పినది. మురయుట యుండవచ్చును.

ఆ. అందె యింద్రజాల । మయ్యె లోకంబులై
మించె నొకటి కొకటి । మింటి యందు ;
తన్నుఁదానె చూడఁ । దలపుట మఱచెను ॥వి॥ 46

ఆ. అంధకార మందు । నణగియే యుండక
పరమునందు మనసుఁ । బదిల పరచి ;
గరిమ నున్న యట్టి । ఘనుడెందులేడురా ॥వి॥ 47

ఉత్సా. అంబరంబుచూడ నేల । నడవిఁ దిరుగ నేల ; నా
స్తంబళంబులడ్గుఁగ నేల । శంభు దూర్ఘనేల ; నా

నంబి వాని గొల్చి(జించి । నారిచేతఁగట్టు! మై
కంబళంబు హేమమౌను ।* కపరిసత్తు గూడినన్. 48

* దీనిలో బంగారముఁ జేసే యోగమున్నదని చెప్పుచున్నారు. "కపరి సత్తు" యిది ఖండ సత్తేమో ?

ఆ. అక్షమాలఁబూని । యలమటఁ జెందక ;
కుక్షి నింపు కొనుట । కొదువఁగాదు ;
పక్షి కొంగరీతిఁ । బై చూపు లేఁటికో ॥వి॥ 49

ఆ. అక్షమాలఁబూని । యలమట పడనేల ?
నిశ్చయాత్మ మెఱుఁగు । నియతిలేక ;
కుక్షినింపు వాఁడు । గుహఁజేరి ఫలమేమి ? ॥వి॥ 50

ఆ. అక్షయమను టంక । మండంబుతోఁ గూర్చి ;
యమరి గుణవికార । మనుభవించి ;
అక్షయంబునంట । నక్షయంబై యుండు ॥వి॥ 51

ఆ. అక్షయాత్మకంబు । నర్థింప గుఱిఁగని ;
నిశ్చయంబు గాను । నిలిపి మనసు ;
రక్షఁగట్టినట్లు । రట్టడి మాన్చరా ! ॥వి॥ 52

ఆ. అక్షరంబుఁ జదివి । యందునఁ గనలేక ;
హెచ్చు తక్కువనుచు । నేపుమీరి ;
యక్షరాత్ముఁ డన్న । యతనికి ఫలమేమి ?
నిశ్చయంబుఁ దెలుపు । నీవు వేమ. 53

ఆ. అక్షరం బెఱుఁగని । యాచారమదియేల ?
తాను దినని యట్టి । ధనమదేల ?
నొరుల మేలుఁ జూచి । యోర్వని తనువేల ? ॥వి॥ 54

ఆ. అక్షరం బెఱుఁగక । యడవులఁ దిరుగుచు
గొండ, రాళ్లఁ, గుళ్లు । గొలువనేల ?
హృదయ మందు శివుని । యేర్పాటు తెలియరో ? ॥వి॥ 55

కం. అక్షర పదవికిఁ బదివే
లక్షరముల నఱవనేల ? । నల "శివ" యను రెం
డక్షరము లణఁచు దురితము ;
తక్షణమే పదవిఁ గలుగుఁ । దథ్యము వేమా ! 56

కం. అక్షరపు టడవిఁ జొరబడి
యక్షరములువేలు లక్ష । లరయఁగ నేలా ?
నీ క్షితి "శివ" యనియెడు, రెం
డక్షరములె పరిథవిల్లు నరయుము వేమా ! 57

కం. అక్షర పుటముల జొర, వే
లక్షలు చదువంగ నేల । లాలితముగఁ బ్ర
త్యక్షముఁగను "శివ" యను, రెం
డక్షరములె, మదికి శుద్ధి । యగురా వేమా ! 58

ఆ. అక్షరపుటమిడి । యండంబులోఁ గూర్చి
యమరునొక్క రణము * । ననుభవించు ;
నతనికన్న ముక్తి । యక్షరమైయుండు ॥వి॥ 59

* "రణము" యిది సరి కాదేమో ! రవము అని యుండవచ్చును. రవము అనగా శబ్దము ; శబ్దబ్రహ్మముఁ గూర్చి ఈ పద్యము చెప్పఁబడినది.

కం. అక్షరపుటడవిఁ బొరలక
యక్షరమగు మహిమఁగాన । నవనిందోలుతో
నక్షరమును జపియించిన
నక్షయముగ నదియెచాలు । నరయఁగ వేమా ! 60

కం. అక్షర మహిమ నెఱుఁగవే
లక్షలు చదువంగనేల ? । లాలితముగఁ బ్ర
త్యక్షముగను, "శివ" యను రెం
డ క్షరములు పరమ పదము । నగురా వేమా * ! 61

* 58 వ పద్యమును, 61 వ పద్యమును ఒకేపోలికఁగలిగి యున్నవి. నాల్గవ పాదములో మదికి శుద్ధి (పరమ పదము) యివే మార్పుగానున్నవి.

ఆ. అక్షరాత్మకంబు । నమృతపానమునకు ;
రక్షకత్వమునకు । రాజహంస ;
దీక్ష లోని దీక్ష । తెలివంటి చూడరా ॥వి॥ 62

ఆ. అక్షరాళివెంట, । నడవులవెంటను,
కొండ రాలఁగోడు । కుడువనేల ?
హృదయ మందె శివుఁ డ । టుండుటఁ దెలియరో ॥వి॥ 63

ఆ. అఖిల జీవములను । నజుఁడవై పుట్టించి ;
విష్ణుఁడ వయి వాని । వెలయఁజేసి ;
శివుఁడవై సకలము । శిక్షించుచుందువు ॥వి॥ 64

*ఆ. అఖిల దేవతలును । హరిపూజఁ జేయంగ
హరుఁడు నృత్యమాడె । నాదియందు ;
ఆదిబ్రహ్మ తానె । యటమద్దెలనుఁగొట్టె ॥వి॥ 65

* ఇట శివతాండవ గాథ వర్ణింపఁ బడినది.

*కం. అఖిలాకారుఁ డనంతుఁడు ;
సకలాత్మలయందు సర్వ । సాక్షియె తానై
నిఖిలముల । నిర్వికారుఁడు
నికరము బ్రహ్మ మ్మనంగ । నిజముర వేమా ! 66

* దీనిలో "ఖ, క" లకు ప్రాస వాడబడినది. యిది లక్షణ విరుద్ధము.

*కం. అగజాత తనదు దేహము
సగ పాలుఁగఁ జేయువానిఁ । జంపించును ; నా
పగఁదీర్ప నేరకున్నను
మగవాడే ? మగువగాదు । మహిలో వేమా । 67

* ఈశ్వరుఁడు సగ దేహము నందు పార్వతీదేవినిఁ ధరించుటవలన అర్ధనారీశ్వరుఁడయినాడు.

*ఆ. అగ్రమందుఁజూపు । నభ్యాస విధినిల్పు ;
మధ్యమందుఁజూపు । మనసు నిలుపు ;
అంతమందుఁ జూపు । నరయ నాపోజ్యోతి ॥వి॥ 68

* ఈ పద్యములో పంచముద్రలనుఁ గూర్చి చెప్పబఁడినది.

అ. అగ్రమందుఁజేరి । యగ్రేశుఁడై యుండు ;
నిగ్రహించి యెరుక । నియతి మీఱి ;
మోహ గుణములన్ని । ముక్కోని దాఁటరా ! ॥వి॥ 69

ఆ. అగ్నికుండయందు । నమరంగ ఘటియించి ;
అవని నీరు బియ్య । మందునుంచి ;
అది పచనము గాఁగ । హరున కర్పింతురా ! ॥వి॥ 70

ఆ. అగ్ని చక్రమనఁగ । నాకర్ణ లింగంబు ;
అగ్ని గుండమందు । నంటఁగూర్చి ;
భవునిఁధ్యాన మిఁకనుఁ । బాటింప ముక్తిరా ! ॥వి॥ 71

* అ. అగ్నిచేతఁబట్టి । యాపరమేశుని
నిందఁజేసినటుల । నీఱుగారె ;
దక్ష క్రతువులలోని । తల్లడ మెఱుఁగరా ! ॥వి॥ 72

* శివదూషణతో దక్షుడు యజ్ఞముఁ జేయఁగా ఈశ్వరుఁడు వీరభద్రునిచే దక్షయజ్ఞమును ధ్వంసము జేయించిన గాథ యిట పేర్కొనఁ బడినది.

* ఆ. అగ్ని బాణముచేత । అంబుధింకె నపుడె
రాముఁ డవలికేఁగ । లావు మఱచె ?
వరుస కొండలుమోసి । వారిధేటికిఁగట్టె ? ॥వి॥ 73

* దీనిలో గణములు తప్పినవి. రామాయణమునకు సంబంధించినది.

ఆ. అగ్నిదైవమైన । నగ్ని యుపాస్తిచేఁ
జేర రాని ముక్తిఁ । జేరుటెట్లు ?
వీరభద్రుచేత । వెలసిన దగ్నిరా! ॥వి॥ 74

ఆ. అగ్ని శిఖల యందు । నమరంగ మమకార
మభవు మీఁదధ్యాన । మమర నునిచి
యాహుతి యగువెనుక । హరున కర్పితమాను ॥వి॥ 75

ఆ. అచట నున్న యట్టి । యతివలందఱుఁగూడి
శిశువు చెవులు, ముక్కు, । జిహ్వ, కనులు,
మొక్కఁబోక దేహి । మొనయంగఁజూడుఁడీ ॥వి॥ 76

ఆ. అచట నిచటఁ జూడ । నమరదు గురుభక్తి
ప్రచురముగను నాత్మ । బయలుఁజేసి
రుచిరముగనుఁజూడ । నచలమై తోఁచురా! ॥వి॥ 77

ఆ. అచర, చర సమూహ । మంగము లింగము
ల్నరణిఁ దెలియ నట్టి । శైవమేల ?
అష్టతనువు లమరు । హరుడౌట నెఱుఁగరా! ॥వి॥ 78

* ఈశ్వరునకు అష్టమూర్తి యని సార్థకము గలదు.

ఆ. అచల తత్త్వమనఁగ ననుభవ గమ్యంబు !
చూసి చెప్పరాదు । సూక్ష్మమదియె !
మదికిఁదోఁచుఁగాని । మర్మమెన్నఁగ రాదు ॥వి॥ 79

కం. అచల తపోన్విత యుక్తిని
ప్రచురించెడి యాత్మకాంతిఁ । బ్రతిబింబముతో
సుచరిత్రంబగు నిష్కళ
రచియింపుము బట్టబయలు । రాజిలు వేమా! 80

ఆ. అచలయోగ తపము । నందంగ గమకించి
ప్రచురమైనకాంతిఁ । బడయుచుండ
రుచిరముగను దాట । రూపించుఁ బరమాత్మ ॥వి॥ 81

ఆ. అచల సూచనెంతో । యధికారిచేగాని
యందఱికినిఁదోఁప । దమ్మలార!
యందియున్నఁగాని । యనువుఁదెలియరాదు ॥వి॥ 82

*ఆ. అచ్చుపడఁగ మనసు । మచ్చికచేఁబట్టి
ముచ్చటించి శివుని । మూర్తిఁజూపి;
కుచ్చితంబు మాన్పి । చొచ్చుటే యోగంబు ॥వి॥ 83

* మూడవ పాదములో "కుచ్చితంబు" అనియున్నది. యిది వాడుక పదము కుత్సిత ముండ వలయును.

కం. అచ్చుపడముద్ర లెన్నుచు
మచ్చికమీరంగ మనసు । మఱిగినమీఁదన్

విచ్చలవిడి రమియింపుచు
మెచ్చినదే ముక్తికిరవు । మేదిని వేమా ! 84

* ఆ. అచ్చువేసికొన్న । నడియేన నన్నను
తమ్ముఁదిన్న *పంగ । దాసుఁడనగ
పరమ పదమురాదు । ప్రకట నార్థమె కాని ॥వి॥ 85

*వైష్ణవమతము విమర్శింపఁబడినది. *పాఠాంతరము. వెనుక దాసుఁడనిన

క. అజగరమును, జుంటీఁగల,
నిజ గురువులు, గాంచనెంచు । నేర్పుకు సరిగా
విజనాంతర హృదయంబున
భజియింపుము ముక్తికిరవు । భద్రము వేమా! 86

తే. అజుఁడు, హరియును, దాళమ్ము । దంగములకుఁ
బురహరుండు నాట్యమునకుఁను । బూనుకొనిరె ?
యిట్టి సభకును బ్రతినిధి । యెవ్వరనఁగ
గుఱుతుగా విశ్వ కర్మయా । గురుఁడె వేమ ! 87

క. అజుఁ డీ లోకము లెల్లను
సృజియించెను, గజభుజంగ । స్థిరచర జీవుల్
నిజరూప భావ మొందక
గజిబిజియై పుట్టుఁ జచ్చుఁ । గదరా వేమా ! 88

క. అజ్ఞాన మనెడి యడవిని
సుజ్ఞానపుఁ ఖడ్గమునను । జూచి నఱకరా !
యజ్ఞాన మాత్మఁదెలుపుట
సుజ్ఞానపు దివ్యపదముఁ । జూడర వేమా ! 89

* కం. అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానము బ్రహ్మమాట । శ్రుతులను వినరా !
యజ్ఞాన ముడిగి వాల్మికి
సుజ్ఞానపు బ్రహ్మమొందెఁ । జూడర వేమా ! 90

* బోయకులము వాడైన వాల్మీకి నారదుని వలన బ్రహ్మజ్ఞానమునుఁ బడసి బ్రహ్మర్షి యయ్యెను.

ఆ. అజ్ఞులైన జీవు । లరయ ననేకులు
ప్రాజ్ఞుఁడనఁగ నెంత । పండితుండు ;
ప్రకృతి మాయచేతఁ । బరముఁదెలియలేఁడు ॥వి॥ 91

ఆ. అట్టికష్టు బ్రదుకు । యగ్నిపాలైపోవు
* నిర్దయాత్ము బ్రదుకు । నీట గలయు
క్రూర కర్ము బ్రతుకు । చోరుల పాలౌను ॥వి॥ 92
* "నిరయ నాత్ము బ్రతుకు నీటగలసు" అని పాఠాంతరమున్నది.

ఆ. అట్టి చదువు చదివి । యానంద మందక
చట్టమైన మనసు । చపల మంద
మొట్టమొదట చదువు । మొఱుగంగనేలరా ? ॥వి॥ 93

ఆ. అట్టివార్త మహిమ । నరయక భువిలోన ;
మిట్టిపడుదు రిలను । మిడుతరీతి ;
గట్టిఁజేసి నిలుపు । ఘనుఁడెపో శివయోగి ॥వి॥ 94

ఆ. అడవిఁ దిరుగఁ జిక్క । దాకసమునలేదు
యవని తీర్థయాత్ర । లందులేదు
యొడలుశుద్ధిఁజేసి । యొడయనిఁజూడరా ॥వి॥ 95

ఆ. అడవి యడవిఁ దిరిగి । యాసనువిడలేక
గాసి పడెడు వాఁడు । ఘనుఁడుగాఁడు;
రోసి రోసి మదిని రూఢిగా నిలిపిన
వాఁడె పరముగన్న । వాఁడు వేమ. 96

వ. అడవులఁ గొండలన్నములఁదిరుగుచు మనుజుఁడు కష్టజీవుఁడై, గడ్డము, గోళ్ళు, తల, కొంగసిగలును, భూతి రేకలుండాల్సి తపంబు సేయగనునట్టిదె. యొడలున మట్టిఫ్రట్టలు గలుఁగ జేయుట వ్యర్థము. వెఱ్ఱివిధంబునఁ బోవుటయు వట్టిదేసుమా ? లేదు ; లేదు, యిది కొండెము జెప్పుటకాదు. ఈశ్వరసాక్షిగఁబల్కుచున్న దీని నిక్కము జేసి కొన్నవారికే దక్కును. ముక్తిసులభము. గట్టిగనమ్ము మటంచు నాత్మలో జెప్పినమాట మనుజులకుఁ జిక్కునె ? చిక్కదు. వెఱ్ఱివేమనా!

ఆ. అడుగకర్థమిచ్చు । నతఁడు బ్రహ్మజ్ఞాని
అడుగనర్థమిచ్చు । నతఁడుత్యాగి
అడుగనీయలేని । యాతఁడు పెనులోభి ॥వి॥ 98

ఆ. అడుగకర్థ మివ్వ । నతఁడు బ్రాహ్మణయోగి
యడుగనర్థమిచ్చు । నతఁడుత్యాగి
యడుగువారి నడుగు । నవిముక్తశివయోగి ॥వి॥ 99

క. అడుగఁ దగు వారినడిగిన
నిడినయెడం గొసరఁగొసర । నీలేననఁగా
గడుసు వడి యాసచేఁ దా
నడిగిన దుర్మార్గ వృత్తు । లగురా! వేమా! 100

క. అడుగఁ దగు వారినడుగుట
యిడినయెడం గొసరకుంట । యీలే ననఁగా
* గడుసై వేడక యుండుట
యడిగెడు వారలకునీతి । యగురా! వేమా! 101

* "గడుసువడి వేడకుండుట" పాఠాంతరము

ఆ. అడు గడుగనఁ జిత్ర । మఖిల వస్తువులను
భోగ భాగ్యములను । బొలుపు మిగులు
తాను దిరుగునపుడు । తనతోడు నీడయై
దేవుఁడేలఁ దిరుగుఁ? । దివిరివేమ. 102

ఆ. అణఁగి యుండు సర్వ । మంతరంగంబున;
నందిచూడఁ జూడఁ । బొందరాక;
సుందరాంగి యొక తె । సుడివడఁజేయురా! ॥వి॥ 103

ఆ. అణువులోన నుండు । నఖిల జగంబులు;
నణువు దనదులోన । నణఁగియుండు;
మనసునిల్ప నరుఁడు । మరిముక్తిఁజేరురా ॥వి॥ 104

*ఆ. అతిథి దేవ విప్రు । లందఱికి వలయు;
హవ్య కవ్య మెల్ల । నతిశయముగ;
వలయు నంద్రు మాంస । మిలజనులందరు ॥వి॥ 105

* ఇచ్చట ప్రథమపాదములో ఒక లఘువు లేదు,

ఆ. అతిథిరాకఁజూచి । యదలించి పడవైచి;
కఠినచిత్తు లగుచుఁ । గానలేరు ;
* కర్మమునకు ముందు । ధర్మంబు సేయరో ! ॥వి॥ 106

* "కర్మబద్ధు లగుచు । ధర్మంబుసేయరు" పాఠాంతరం

* కం. అతి నిద్రావంతునకు,
న్నతి పానికి నిరశనునకు, । నతికోపునకున్,
ధృతి హీనున, కపకృతునకు,
జతపడదీబ్రహ్మవిద్య । చాటర వేమా ! 107

* రెండవపాదములో ఒకలఘువు ఎక్కువైనది.

కం. అతిమోహాన్విత బుద్ధిని,
సతతము క్షీణింపజేయు, । సత్యముఁగనమిన్ ;
మతి నిలుపఁజాల రెవ్వరు ;
యుతముగ జితప్రజ్ఞఁగూడి । యుక్తిగ వేమా ! 108

కం. అతి సూక్ష్మదృష్టిలో నను ;
మతికింపుగ శివునిఁ గూర్చి । మదియొకటైనన్
బ్రతిలేని మోక్ష మిదెయగు ;
సతతము నిర్వాణపదమె । సాక్ష్యము వేమా ! 109

తే. అతులవైరాగ్యబోధోప । రతుల నెఱిఁగి ;
సతులవలపులఁ జిక్కని । సత్యమెఱిఁగి ;
మతినిఁ జెదరకపట్టుటే । [1]మానవృత్తి ;
యిద్ది కుదిరిన[2]వాఁడెరా । పెద్దవేమ. [3] 110

పాఠాంతరాలు "1 మాస్యకీతి" "2 సజ్జనుడిలనువేమ" "3 విమలగుణ రాజ యోగీంద్ర । వేమనార్య !"

ఆ. అత్తగారి యింటి । కల్లుఁ డొచ్చిన యట్లు ?
మనసును జెఱుపంగ । మాయవచ్చె ;
మనసు మాయ సంధి । మనుజులకే మెఱుక ॥వి॥ 111

ఆ. అత్తమామ రూప । మాలయి జన్మించె
యాలి మగల రూపు । యామె సుతుఁడు ;
తన్నుఁ బోలి పుట్టు । దనయుఁ డన్నట్టుల ॥వి॥ 112

ఆ. అత్తమామ యుచ్చ । యాలయి జన్మించె
యాలి మగని యుచ్చ । యామె సుతుఁడు ;
యుచ్చ దేహమునకు । నుత్సాహపడ నేల ? ॥వి॥ 113

ఆ. అదనెఱిఁగిన మగువ । యనువెల్గుఁ జనువెల్గు ;
ముదముతోడ మగని । మోహమెఱుఁగు ;
విభుని శ్రేష్ఠ గుణము । వేశ్యతానెల్గురా ! ॥వి॥ 114

ఆ. అదరి పడక మనసు । నానందమునుఁగోరి ;
మదిని మెలఁగు వాఁడు । మాన్యుఁ డరయ ;
సదమలత్వమునను । శాశ్వతేశ్వరుఁడగు ॥వి॥ 115

ఆ. అదరి బెదురు కేల ? । నందంగ రానిది
సూక్ష్మ మరయ నొక్క । చూడ్కి నిలిపి ;
పోక లణచి యెఱుక । పొందెన్న కుండురా ! ॥వి॥ 116

ఆ. అదిమి మనసునిల్పి । యానంద కేళిలో
బ్రహ్మమయుఁడు ముక్తిఁ । బడయఁగోరు ;
జిహ్వారుచులచేత । జీవుండు చెడునయా ! ॥వి॥ 117

ఆ. అదియఁ జూచుచుండ । నన్నిటఁదానుండు ;
నాఁదిఁ జూప నొకని । కలవి గాదు ;
యాది ముక్తి తెలుపు । యాత్మనేయుండురా ! ॥వి॥ 118

క. అది యిది యని మదిఁ దోఁచెడు
సదనము గుర్తించి లోనె । సాధించినచోఁ ;
గుదురును బ్రహ్మానందము ;
గదిసినమదిఁ జేరనొక్క । కనవలె వేమా ! 119

ఆ. అదియె యొకటిఁ దెలిసి । యాదిని నిల్పిన
యాదిఁబాయకున్న । నభవుఁడవును;
యాదిబాయు వాఁడు । యంధునిరీతిరా ! ॥వి॥ 120

ఆ. అధముఁడైన మనుజుఁ । డధికునిఁజేఁబట్టి;
యతని మాటనడచు । నవనిలోన;
గజపతింటనెన్న । గవ్వలుచెల్లవా ? ॥వి॥ 122

ఆ. అధర సుధను జూచి । యన్నియు మఱచును;
తరుణిరూపుఁ జూచి । తన్ను మఱచు;
యుక్తు లాలకించి । యోగంబు మఱచురా! ॥వి॥ 123

*ఆ. అధికభుక్తిచేత । మొదట సొమ్మునకు హాని
కుదువసొమ్ముకొన్నఁ । గొంతహాని
మొదటి పక్షమునను । మూలకర్తకు హాని ॥వి॥ 124

* "అధనముక్తిచేత" పాఠాంతరము

ఆ. అధికజనులతోడ, నాప్తులతోడను,
పరువు, గుఱుతెఱింగిఁ । పలుకకున్న;
వచ్చుఁబెద్దదనము । హెచ్చుగా గాంభీర్య
హాని చెందుఁ దనకుఁ । నపుడు వేమ. 125

ఆ. అధికమైన యజ్ఞ । మల్పుండు తాఁజేసి;
మొదసి శాస్త్రమువిడి । మురువుదక్కు;
దొబ్బ నేర్చుకుక్క । దుత్తలు మోచునా? ॥వి॥ 126

తే. అధిక సుఖదుఃఖములు రెండు । నరయలేక;
విధిని దూరంగ ఫలమేమి? వేడుకలర;
బుద్ధినొక్కినఁబరిపూర్తిఁ । బొందుదయ్య;
యట్లు కాకూరకయెయుండ । నడఁగు వేమ. 127

ఆ. అధికసూక్ష్మమైన । యానంద మెఱుఁగక ;
మతియులేక చదివి । మగ్నుఁడయ్యె ;
నతిరహస్యమెల్ల । నాజనుఁడెఱుఁగురా! ॥వి॥ 128

ఆ. అధికుఁడైన రాజు । యల్పునిఁజేబట్టి
వానిమాట చెల్లు । వసుధలోన;
గణకు లొప్పియున్న । గవ్వలు చెల్లవా? ॥వి॥ 129

ఆ. అధికుఁడైన వాని । కధికారమిచ్చిన ;
నచటివారి నెల్ల । నాదరించు ;
చెఱకు దిన్ననోరు । చేదారగించునా? ॥వి॥ 130

ఆ. అధిపతైన నరుఁడు । నాచారవంతుఁడై ;
సతినిఁబాసి యడవిఁ । జంచరించె ;
సాధ్వియైన భార్య । సమ్మతిఁదిగనాడి ;
కొలిచె రాజుఁ గొలువుఁ । గోరి వేమ. 131

ఆ. అధిహితమగునట్టు । లాడిన మాటకు ;
సంతరింతురెల్ల । సత్పురుషులు ;
యధిక భాషణంబు । లాయాసకంబులు ॥వి॥ 132

ఆ. అనఁగననఁగ రాగ । మతిశయిల్లుచునుండు ;
తినఁగఁ దినఁగ వేము । తీయనుండు ;
* సాధకమునఁబనులు । సమకూరుధరలోన ॥వి॥ 133

* సాధనము అని యుండవచ్చును

* ఆ. అనఁగ ననఁగ రాగ । మతి రమ్యమైయుండు
పెనఁగ బెనఁగ సతికిఁ । బ్రేమపుట్టు ;
తినఁగ దినఁగ వేము । తీయనై యుండదా ॥వి॥ ! 134

* ఇది 133వ పద్యము యింకొక మార్పుతో గన్పట్టుచున్నది.

ఆ. అనన నాహతమున । నదిలెస్సగాఁజూచి ;
యిఁకను దాన వాయు । వీహఁజేసి ;
కడమ వాయు వందుఁ । గదలకుండినవాఁడు
చెప్పనేల వాఁడె । శివుఁడు వేమ. 135

ఆ. అనయ మీసు మాపి, । యనలంబు, చల్లార్చి,
గోచి బిగయఁగట్టి, । కోప మడఁచి ;
యాశ విడిచె నేని । యతఁడుదా యోగిరా ! ॥వి॥ 136

క. అనలంబున జన్మించును
ననలంబున లీన మగుచు । నాకాశమునం
గనుపించి, పుట్టునదియె
* జనకుఁడు లేనట్టిదదియె । జాలము వేమా ! 137

* "జనకుఁడు లేనట్టిమాయ । జగమున వేమా" పాఠాంతరము

ఆ. అనల మించుకైనఁ । గనలి మండునుగాని,
చనువు గాని యొఱుక । మనికి విడదు;
తనువు మఱచినపుడె । ఘనతత్త్వ మబ్బురా ! ॥వి॥ 138

ఆ. అనల మించుకైన । నఖిలంబుఁ జెఱుచును;
మనసు పెరిగి, పెరిగి; । మాయఁజెఱచు;
బ్రహ్మమయము చెఱచు । భవబంధముల నెల్ల ॥వి॥ 139

క. అనిలంబున జనియించిన
యనలంబున సలిలమగును । నాకాశమునన్
గనిపించి పుట్టుతానే
జనకుఁడు లేనట్టిమాయ । జగమున వేమా ! 140

* ఆ. అనుకూల్యమైన । యంగనగల్గిన;
సతికిఁ బతికిఁ బరమ । సౌఖ్యమమరు;
ప్రాతి కూల్యమైనఁ । బరిహసించు సుఖంబు ॥వి॥ 141

* ఈపద్యము ప్రథమ పాదములోఁ గణములు తప్పినవి. లక్షణ విరుద్ధముగా నున్నది.

క. అనుచిత పురుషుండొక్కఁడు
విను నిత్యమనిత్యమనక । విధమెట్టిదనన్;
దన సంకల్పమె బంధము;
తన సంకల్పంబె క్షయము । దనరఁగ వేమా ! 142

కం. అనుభవ కేళికి లోనగు
తనువులు మూఁడుడిగిలోని । తథ్యముగనకా
జననాంతర మమరఁగ ; నదు
కను నదె బ్రహ్మంబుమదిని । గట్టిగ వేమా ! 142

కం. అనుమాన రహితమగు గుఱి
వినయముతో బుద్ధినొక్క । వివరింపవలెన్ ;
దనలోఁదానై మించెడు
ఘనమగు చిత్ప్రభనుఁబూని । కనవలె వేమా ! 143

ఆ. అనువుగానిచోటఁ । బనిగొని జూదము
నాడి, కూడి, యోడి, । యడవిసొచ్చి ;
ఘనుని జాడజూచి । గడుపుము మూర్ఖత ॥వి॥ 144

ఆ. అనువుగానిచోటఁ । బనిఁగొనిజూదము
నాడి, కూడి, యోడి ; । యడవిసొచ్చి
కాఁడుసేరి తపము । ఘనముగాఁజేసిన
వానినెన్నఁదరమె । వసుధ వేమ. 145

* ఆ. అనువుగానిచోట । నధికులమనరాదు
కాలమొక్కరీతిఁ । గడపవలయు
విజయుఁడిమ్ముఁదప్పి । విరటునిఁ గొల్వడా ! ॥వి॥ 146

* ఇచ్చట భారతములోఁ గల విరాట పర్వకథ ఉపమానంగా వ్రాయ బడినది.

ఆ. అనువుగానిచోట । నధికులమనరాదు ;
కొంచెమునుండుటెల్లఁ । గొదువఁగాదు ;
కొండ యద్దమందుఁ । గొంచమైయుండదా ! ॥వి॥ 147

ఆ. అనువుగాని బంటు । నల్పుఁడేలినయెడ ;
మాఱు మలయునొండె । మగుడఁబడునొ ?
దూల మూతకోల । దాటికిన చందమా ! ॥వి॥ 148

ఆ. అనువుమీఱగాను । యతుల జన్మంబుల
వరసి చెప్పనెంత । వారికైన
తరముగాదు భవుని । తత్త్వంబు తెలియక ॥వి॥ 149

ఆ. అనువుమీఱ మదిని । యానందమందెడి ;
నరుఁడు పరుఁడుగాఁడె । నయముగాను ;
మనసు నిలుపకున్న । మఱి ముక్తిలేదురా ! ॥వి॥ 150

ఆ. అనువు మెవరిసొమ్ము । తనదని పోషింపఁ ;
ద్రవ్యమెవరిసొమ్ము । దాఁచుకొనఁగ ;
ప్రాణమెవరి సొమ్ము । పారిపోకను నిల్ప ॥వి॥ 151

ఆ. అనృత మాడలేక । యల హరిశ్చంద్రుఁడు,
యాలి, బిడ్డ, నమ్మి । యతఁడుకూడ
మాలవానికపుడు । మఱిలోకువై యుండె ॥వి॥ 152

* ఆ. అన్నదానమునను । నధికసంపదగల్గి;
యమరలోకపూజ్యుఁ । డవును, మీఱి
యన్న మయము బ్రహ్మ । మది కనలేరయా ! ॥వి॥ 153

* షోడశ దానములలో అన్నదానము అధికము.

ఆ. అన్నమదముచేత । అతివలు, పురుషులు,
ఏపుమీఱ మదనుఁ । డేచె నంద్రు ;
అన్నముడిగినంత । అతడెందుఁ బాయునో ? ॥వి॥ 154

ఆ. అన్న మదము వలన । నతివలు మతిచెడి
యేపురేఁగి మదనుఁ । డేచె నందు;
రన్నముడుఁగు వెనక । నతఁడెందుఁబోయెరా ? ॥వి॥ 155

ఆ. అన్న మధికమైన । నమరమృత్యువు నిజం
బన్నమంటకున్న । నాత్మనొచ్చు;
చంపఁ బెంపఁ బువ్వె । చాలదా ! వెయ్యేల ? ॥వి॥ 156

ఆ. అన్నమడుగనతని । కన్నంబుఁ బెట్టిన
పారవేయు దాన । ఫలితమేమి ?
ధనికునకు నొసంగు । దానంబునటువలె ॥వి॥ 157

ఆ. అన్నమన్నమనుచు । నరుతురు మూఢులు;
యాయువొందిసప్పు । డన్న మేల?
నన్న మేలలేదు? । యాయువుబొందిన
మెన్నికరువులైన । యిలను వేమ. 158

ఆ. అన్నమునకు నంటు । యయిన నాత్మకునంటు,
యాత్మను పెనఁ గొన్న । యన్న మంటు;
యాత్మశుద్ధియన్న । మన్నశుద్ధియు నాత్మ
మిన్ను మన్ను మాడ్కి । మెఱయు వేమ. 159

ఆ. అన్న మిడుటకన్న । నధిక దానంబులు
యెన్ని చేయనేమి । యెన్నఁబోరు
యన్న మెన్న జీవ । నాధారమవునయా ! ॥వి॥ 160

ఆ అన్నము తినువేళ । నాత్మరుచులు గోరు ;
టదియు నాల్కసెప్ప । నడుఁగు మనసు ;
నాత్మకుఁ దృణమైన । నయ్యయ్యొ యనరాదు ॥వి॥ 161

ఆ. అన్నము నమృతమును । నంటు నంటనుచునుఁ
బరి హరింత్రుఁ దెలియ । బడక ద్విజులు ;
యన్న మమృత మివియ । హరిహరబ్రహ్మలు
యంటవన్న వాని । కంటువేమ. 162

ఆ. అన్నయనఁగ నెవరో । యది తెలియగఁజూడ
తనకు ముందుఁ బుట్టి । తనరు చుండె ;
యన్నవంటివాఁడు । హరుఁడౌను ; గురుఁడౌను
మిన్ను మన్నుమూడ్కి । మెరయు వేమ. 163

ఉ. అన్నయుఁ దమ్ముఁడుం జెలియ । లక్కలు బావలు బంధుమిత్రులున్
పన్నుగ వీరిఁ జేర్చుటకు । బాగుగఁ క్షేమముఁగూర్చినప్పుడే
మున్నుగు మోసపోకు మది । ముక్తికిఁ ద్రోవ నెఱుంగఁ జేయునీ
వెన్నఁగనాదువాక్యముల । నేమరకుండిన నుండు వేమనా ! 164

ఆ. అన్న రసము వలన । నలబిందు రసమయ్యె ;
బిందురసము వలన । బీజమయ్యె ;
బింబు బీజములను । భేదించి చూడరా ! ॥వి॥ 165
పిండోత్పత్తిని గూర్చి వివరింపబడినది.

ఆ. అన్నిగోసి వేసి । యనలంబు చల్లార్చి ;
గోచి బిగియఁ గట్టి । కోప మడచి
యాస విడచెనేని । యతఁడు దాయోగిరా ! ॥వి॥ 166

ఆ. అన్ని జాతులకును । నాధార మైనట్టు
లున్న సామగాది । మిన్న బుసుల ;
నెన్ని జన్మములకు । నెక్కడఁ గానము ॥వి॥ 167

ఆ. అన్ని జాతులందు । నధికుల మనుచును
యజ్ఞపశువుఁ జంపి । యగ్ని నిడుచు ;
మల్ల మందుఁబెట్టి । మాంసంబుఁ దిందురు. ॥వి॥ 168

యజ్ఞ పశువుని వధించి ఆ మాంసమును హోమాగ్నిలో త ప్తము చేయుటకు మల్లమందురు.

ఆ. అన్ని జాడ లుడుఁగ । నానందకాముఁడై
నిన్ను నమ్మఁ జాలు । నిష్ఠతోడ ;
నిన్ను నమ్మ ముక్తి । నిక్కంబునీయాన ॥వి॥ 169

ఆ. అన్ని దానములను । నన్న దానమె గొప్ప
కన్న తల్లి కన్న । ఘనత లేదు ;
యెన్నగురున కన్న । నెక్కువ లేదయా ! ॥వి॥ 170

ఆ. అన్యులకువచ్చు । నాపద తనదిగా
నెన్ను వాఁడు భువిని । నున్న వాఁడు ;
యెన్ని దానిలోన । నిహపరంబులు లెన్నఁ
గన్న వాఁడు మిగుల । ఘనుఁడు వేమ. 171

తే. అన్యులుండనిస్థలమందు । నాత్మవిద్య
చిత్తచీకఁటి నణగించి । చెంగలించి
పండువెన్నెలకాంతిలోఁ । బ్రాకిచూడు
మప్పుఁ డానందమును బొంద । నగుర వేమ. 172

ఆ. అపుడు నాదుమాట । యానంద మనుకొన
కిపుడు రమ్మటన్న । నేమికలదు ?
మదము నిల్పువఱకు । మనసెవ్వరికినిల్పు ? ॥వి॥ 173

మదము నిల్పుట = మదము లేకుండుట

ఆ. అప్పు తీర్పలేని । యానేర్పు కేటికి ?
కోర్కెఁ దీర్పలేని । కొలువ దేల ?
పెట్టిపోయలేని । వట్టి బీరంబేల ? ॥వి॥ 174

ఆ. అప్పుఁదీయ రోఁత । హరిహరాదులకైన ;
మెప్పుతోడ మైత్రి । మొదలె రోఁత ;
తప్పుఁబలుక రోఁత । తాకట్టిడిన రోఁత ॥వి॥ 175

రోఁత = పనికిమాలిన, మెప్పె = మూర్ఖుఁడు.

ఆ. అప్పు యిచ్చుసొమ్ము । లక్కరకడిగితే
యెప్పుడిచ్చితి వని । యెగరఁగొట్టు ;
తప్పు నొప్పుఁజేయ । తగవాగ నిల్చునా? ॥వి॥ 176

ఆ. అప్పు లేనివాఁడు । యధిక సంపన్నుఁడు ;
తప్పులేనివారు । ధరను లేరు
గొప్ప లేనిబుద్ధి । కొంచెమైపోవురా! ॥వి॥ 177

*ఆ. అభవు ననుభవమున । నార్గురరులు నీల్గ
సంశయంబు లేదు । సాధకునకు
చెంత దీపమిడక । చీకటి వోవునా? ॥వి॥ 178

* ఆర్గురరులు : అరిషడ్వర్గములు (కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములు.)

కం. అభవుని మదిలోఁ గాంచెడు
శుభకరమగు చూడ్కియందు । సొంపలరంగా
నభిముఖ దృష్టినిఁ బూనుము ;
రభసములేనట్టి యెఱుక । రాజిలు వేమా! 179

అభిముఖము = పరబ్రహ్మను లోజూపులో జూచుట

ఆ. అమల మవ్యయంబు । నంతరాత్మకు లోన ;
విమలదృష్టిఁబూని । విడక మించి ;
తెమల కున్నవాఁడు । తెరబయల్సేరును ॥వి॥ 180

తే. అమల మవ్యయ చింతన । యసిపదంబుఁ
గోరి జీవేశ్వరైక్యంబుఁ । గూర్చి నంత ;
యవిరతంబగు పరిపూర్ణ । మమరునయ్య
వాదు లాడంగఁ జిక్కదు । గాదె వేమ. 181

అసిపదము = వేదాంత పరిభాష; బ్రహ్మపదము,

ఆ. అమలమైన పలుకు । లభిషేకవారిధి ;
తనువు దేవళంబు । తాల్మినొంది ;
యాత్మ శివునిఁ జేర్చు । నాతఁడే శివయోగి ॥వి॥ 182

కం. అమలాత్ముని మానసమున
విమలాంతర్గతునిఁగాఁగ । వివరింపవలెన్
క్రమమైన చాయలందుచు ;
సమకారము నెట్టవలెను । మహిలో వేమా ! 183

నెట్టవలెను = విడువవలెను.

ఆ. అమృతసాధనమున । నందఱు బలిసెద
రమృతమెంచిచూడ । నందలేరు
యమృతము విషమాయె । నదియేమి చిత్రమో ! ॥వి॥ 184

లంబికాయోగములో అనగా కొండనాలుక బ్రహ్మరంధ్రములో దూర్చిన అమృతమనే ఊట ఊరును. యీ యూట వలన వజ్రకాయము, బ్రహ్మైక్య సంధానము గలుగును.

కం. అమ్మసుమీ ! యాలనఁగా ;
నమ్మనఁగా యాలుసుమ్మి ; । యాయిద్దరియం
దిమ్మహిలోఁ బరమాత్ముని
నెమ్మదిలోఁ దెలియఁగానె । నేర్పరి వేమా! 185

తనజన్మకు కారణమైనదానినే తా ననుభవింప గోరుట.

*కం. అయమనగనేమి చెప్పుము ;
నయమే జయమై వెలుంగు । నన్యులకెల్లన్
నయ మనఁగ వినవె యెచ్చట
నయ మనఁగా నుక్కపండు । వనఁదగు వేమా ! 186

* ఈ పద్యము నాల్గవ పాదములో యతి తప్పినది ఇది లక్షణ విరుద్ధము.

ఆ. అయిదు చక్రములను । నాదినిఁబడవైచి
యయిదు చక్రములను । నవలఁదెలియ ;
నయిదు చక్రములును । నడఁగిబయల్ తోఁచు ॥వి॥ 187

పంచకోశములు: అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములు. కోశమనగా సంచి.

* ఆ. అయిదు నైదు నైదు । నైదింటఁ జేకూడు
మూఁడు మూఁటఁజేరి । మఱియునొకటె
మురిసిన సకలంబు । మోహించియుండురా ! ॥వి॥ 188

* పంచావస్థలు, పంచతన్మాత్రలు, పంచకర్తలు పంచకోశములో చేర్చి త్రికరణ శుద్ధిగా త్రిగుణములను బంధించుట.

ఆ. అయిదు మనసు తగిలి । యయిదింటఁ దాబుట్టి
యయిదు వ్యాప్తుల నరుఁ । డణఁపలేక
యయిదు యక్షరముల । నరసి జపించరా ! ॥వి॥ 189

శరీరోన్మాదులైన పంచేంద్రియ పాటవము నరికట్టి "నమశ్శివాయ" యను పంచాక్షరి మంత్రధ్యానమున బరిపూర్ణుఁడగును.

*ఆ. అయిదు యక్షరంబు । లంగంబుఁ దెలిసిన
నయిదు నందుముక్తి । యమరియుండు
నయిదులోన నున్న । యతనిని దెలియుఁడీ ! ॥వి॥ 190

* "నైదులోనె నున్న యతఁడెపో తెలియఁగ" పాఠాంతరము. పంచాక్షరములలో పరమశివుడున్నాడు.

ఆ. అయిదు వర్ణములను । నానంద మెఱిఁగిన
నందెచూడముక్తి । యలరుచుండు
నయిదులోనఁ దెలియు । టదియెపో బ్రహ్మంబు ॥వి॥ 191

పంచాక్షరములు, పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచకర్తలు, పంచావస్థలు, పంచకోశములు.

ఆ. అయిదు వర్ణములనె । యఖిలంబుఁ దెలిసిన
నయిదు నందుముక్తి । యమరియుండు
నయిదులోననున్న । నతఁడెపో తెలియంగ ॥వి॥ 192

*ఆ. అరయకర్మమునకు । నాహరిశ్చంద్రుండు
ఆలిబిడ్డ నమ్మి । యతఁడు కూడ
మాలవాని కొపుడు । మహిలోకు వైయుండె ॥వి॥ 193

ఇచ్చట హరిశ్చంద్ర కథ కర్మము గూర్చి చెప్పబడినది.

ఆ. అరయ నేడు (తాళ్ళ । నఖిలజగంబులు
కట్టబడుచునుండు । నిట్టిదాని
జ్ఞాన ఖడ్గమునను । పూని కోయవలయును ॥వి॥ 194

సప్తావర్ణముల చేత బంధింపబడిన దేహమును విజ్ఞానమనే కత్తితో కోయుట ముక్తిప్రదము. ఏడుదారములనగా = (1) దుఃఖము, 2. జన్మము, 3. కర్మము 4. అభిమానము 5. అవివేకము 6. అజ్ఞానము 7. మాయ.

ఆ. అరయఁగంటి దృష్టి । గుఱిగాను ముక్కుపై
రెప్పపడక (గుడ్లు । (త్రిప్పిపట్టి
వివర మెఱుఁగ శాంభ । వీ ముద్రయది యం(దు ॥వి॥ 195

పంచముద్రలలో శాంభవీముద్రగూర్చి చెప్పబడినది.

ఆ. అరయఁ దఱచు కల్ల । లాడెడు వారిండ్ల
వెడలకేల లక్ష్మి । విశ్రమించు;
నీరమోటికుండ । నిలువని చందాన ॥వి॥ 196

* తే. అరయ నేర్చిన సర్వజ్ఞు । లైనవారు
చెప్పనేర్చిన వారొండు । చెప్పరేమి ?
శివునిఁగాంతురు భువిలోఁ బ్ర । సిద్ధముగను
నీకుఁ దెలియని దేముండు । నిజము వేమ. 197

* ఇది కూటవేదాంత పద్యముగ 239 లో ఉన్నది.

ఆ. అరయఁదోఁడు వాఁడు । గురువని తానెంచి;
తిరుగువాఁడు తన్ను । నరయలేఁడు;
పనికి పూలినట్టి । బానిసె కొడుకురా ! ॥వి॥ 198

తే. అరయ సుఖమొంది దుఃఖమ్ము । నార్పలేక
విధిని దూరంగ ఫలమేమి ? । వేమ కలర
బుద్ధినొక్కినఁ బరిపూర్తిఁ । బొందునయ్యు
యట్లు కాకూరకయుండ । నగునె వేమ. 199

బుద్ధినొక్కుట = ఏకాగ్రతతో చూచుట

తే. అరయ వేమన్న చెప్పిన । యాత్మవిధము
తెలియలేనట్టి యజ్ఞాన । దేబెలెల్ల

తలనువీడిన వెంట్రుక । దారివలెను
భుక్తిముక్తులఁ బొసఁగఁగా । బోరు వేమ. 200

దేబె = దేబెరగొట్టు, దీనుడు

క. అరయఁగ దొంగలఁ బట్టుక
మరణము నొందించి యొకని । మన్నింపదగున్
వెర వెరుగునిట్టి వారికి
నిర వందిన యెఱుకగల్గు । నిదియే వేమా ! 201

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఖండించునట్టి ఉపాయములను తెలిసిన మనస్సును మన్నింపవలయును. యిట్టివారికి జ్ఞానోదయమగును.

ఆ. అరయనాస్తి యనగ । యద్దుమాటాడకఁ
దట్టువడక మదిని । తన్నుఁ గొనక
తనది గాదనుకొని । తాఁ బెట్టునదె పెట్టు ॥వి॥ 202

ఆ. అరయ మూలమందు । నర్థంబు నందును;
నిర్మలాత్ములందు । నియతులందు;
బయలునందు శత్రు । భావంబునందును
వేడ్క వెలయుశివుఁడుఁజూడు । వేడ్క వేమ ! 203

ఆ. అరయలజ్జచూడ । నందఱియందుండు;
లజ్జలేనివాఁడు । లాలితుండు;
లజ్జఁగల్గువాని । లాభంబు లేదయా ! ॥వి॥ 204

ఆ. అరయ హస్తమందు । నభయహస్తంబీయ
దర్పణాంగుడైనఁ । దన్నుఁజూచి
మంగళంబుచేయు । మంగళిహీనుఁడా ! ॥వి॥ 205

అభయహస్తమనగా పయికిఎత్తి జూపించి రక్షణయిచ్చే సూచన.

ఆ. అరసి గట్టివేసి । యాధార చక్రంబు
ప్రాణవాయువందె । పదిలపఱచి
యెడ తెగకయుండు । నిల యోగ్యుఁడగు యోగి ॥వి॥ 206

ఆ. అరసిచూడగాను । నన్నిలోకంబులు ;
తనువులోననుండు । తావుగాను
మనసులోని గురుని । మరిముట్టి చూడరా ! ॥వి॥ 207

ఆ. అరసిధైర్యమూని । యతిశయకాముడై ;
నిన్నునమ్మి నిష్ఠ । నెగడుచుండి ;
నిన్నుగొల్వ ముక్తి । నిశ్చయముగఁగల్గు ॥వి॥ 208

ఆ. అరసి సూక్ష్మమైన । యానందమెఱుగక ;
మరియులేక చదివి । మందుడయ్యె
నలరహస్యమెల్ల । నాతడెట్లెఱుగును ? ॥వి॥ 209

ఎన్నిచదివినా పరబ్రహ్మ రహస్యము పట్టుబడుటదుస్తరము.

కం. అరిషడ్వర్గంబులచే
నరులెల్లను జిక్కిసొక్కి । నైజము విడకే
యరుగుదురుగాక ; యెఱుగక
మరుగైనది బ్రహ్మ * మనుచు । మహిలో వేమా 210

* "మయము" పాఠాంతరము

*కం. అరిషడ్వర్గంబులచే
నరులెల్లరు చిక్కిసొక్కి । నయగతియనుచున్
మెరుగుదురుగాక ; తత్త్వము
నరయంగను లేరు యించు । కైనను వేమా ! 211

* ప్రథమ పాదమున అక్షరము ఎక్కువయినది.

కం. అరి షడ్వర్గములచేత
నరులెల్లను చిక్కి సొక్కి । నారే యనుచున్
యరుగుదురు గాక ; కుండము
యెరుగక యెరుకించకైన । నేమో వేమా. 212

యీ మూడు పద్యములు అరిషడ్వర్గములకు సంబంధించినవేయయిననూ వేదాంత పరముగా భావము మార్పు చెందినది.

ఆ. అరుణు నుదయ సంఖ్య । యస్త మానపు సంఖ్య
జనన మరణసంఖ్య । జాతిసంఖ్య
దీని నెఱుఁగుయోగి । ధీరుడైయుండురా ! ॥వి॥ 213

ఆ. అరు * ణోదయములెన్ని । యస్తమానము లెన్ని
జనన * మరణములెన్ని । జాతులెన్ని
దీని నెఱుగు యోగి । ధీరుఁడై యుండురా ! ॥వి॥ 214

* గణములు తప్పినవి.

యీ లోకమున ఉదయాస్థమానము లెన్నియో జాతులెన్నియో చుక్కలెన్నియో యెవరు నిర్ణయించ గలరు ? యోగిమాత్రము అన్నియుఁ దెలిసికొనును. ముందు మనము యోగి ఎవరో తెలిసికొందము. "యోగస్థ కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ । సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే ?" అనగా సర్వమునూ ఏకభావంగా జూచినవాడే యోగి. ఇట్లు ఉదయాస్తమయాది భిన్నభావములు లేవని మన తెలివి తక్కువయే యిట్లగుచున్నదని వేమన నిజమగు యోగిగాబట్టి నుడివెను.

ఆ. అరుత లింగముండ । నదిమెఱుంగ లేక
పర్వతంబు వెదకు । బసవకొడుకు
పాయరానిలింగ । * మాయెఁ బ్రాణమెకదా ? ॥వి॥ 215

* "ప్రాణమేగద చూడ" పాఠాంతరము

ఆ. అరుతలింగముంచి । యతి యనఁ జాలక
పర్వతమున కేగు । పామరుండు
ముక్తిగాననగునె? । మూఢాత్ముఁగుగాక ॥వి॥ 216

ఆ. అఱుతలింగముండ । నదిమెఱుంగక లేక
పర్వతంబుబోవు । బానిసీడు
ముక్తిగాన నగునె ? । మూఢాత్ముడగుగాక ॥వి॥ 217

పైమూఁడు పద్యములు ఆత్మలింగము గూర్చియే చెప్పబడినవి.

ఆ. అఱుదుగా నడిగిన । నతఁడర్థిగాఁబోడు
తరచుగానొసగక । దాతగాఁడు
దాతకర్థికింత । తారతమ్యముసుమీ ! ॥వి॥ 218

ఆ. అలను బుడిపి పుట్టి । యప్పుడే క్షయమౌను
కలనుఁగాంచు లక్ష్మిఁ । గనుటలేదు
యిలను భోగభాగ్య । మీతీరెకానరో ! ॥వి॥ 219

బుడిపి = నీటిబుడఁగ

ఆ. అలయఁ జేసి, మలచి । యడిఁగెండ్లు, మలిగెండ్లు ;
తిరిపె మిడెడు కటికి । దేబెలెల్ల ?
నెలమి మన్నఁదినెడు । నెట్టిలోదురు సుమీ ! ॥వి॥

అడిగెండు... అడుగు + కండ్లు = మలువగా అడుగున నిల్చిన కండ్లు = మలిగండ్లు = మలిచి తీయదగినరాళ్ళు

ఆ. అలలులేని జలధి । వలెనున్న మదిలోనఁ
దెలివిఁగూడి తన్నుఁ । దెలియ వలెను ;
తలలుబోడులైన ! దక్కునా ? తత్త్వంబు ॥వి॥

ఆ. అలలులేని జలధి । వలెనుండి మదిలోనఁ
దెలివిఁగూడి; తన్నుఁ । దెలియునతఁడె
తలప సజ్జనుఁడని । ధరఁజెప్పఁబడునయా ! ॥వి॥

ఆ. అలవిగాని బయలు । నందిన వదిఁజూడ ;
గూడి మెలఁగుచుండఁ । గోచరించు ;
చూడఁ జూడ నెఱుక । చోద్యమై తోఁచురా ! ॥వి॥

ఆ. అల్పజనులకేల । యద్వైతమార్గంబు
మందకోపికేల । మంత్రవిద్య
జ్ఞానవంతుకేల । జాతిమత భేదముల్ ? ॥వి॥

మందకోపి = తొందరగా కోపము గొనువాడు.

ఆ. అల్పబుద్ధి వాని । కధికారమిచ్చిన
దొడ్డవారినెల్లఁ । దొలఁగఁ గొట్టు;
చెప్పుఁదినెడుకుక్క । చెఱకు తీపెఱుఁగునా ? ॥వి॥

ఆ. అల్ప సుఖముఁగోరి । యతివలపై యాస
స్వల్పమైనఁ బెటిఁగి । సాంద్రమగుచు
భ్రమలఁ జిక్కినప్పుడె । ప్రబలును పాపంబు ॥వి॥

ఆ. అల్పసుఖములెల్ల । నాశించి మనుజుండు
బహుళదుఃఖములనుఁ । బాధపడుచు
పరమ సుఖమునొంది । బ్రతుకంగ నేరఁడు ॥వి॥

ఆ. అల్లబోడి తలలు । తెల్లని గొంగళ్ళు;
నొడలు భూతిపూసి । యుంట రోఁత
యిట్టి వేషము లిలఁ । బొట్టకూటికె కాన ॥వి॥ 228

యిచట కపట సన్యాసులను నిక్కచ్చిగా విమర్శించెను.

ఆ. అల్పుఁడెన్ని పలుకు । లలయక పలికిన
నధికుఁ డూరకుండు । నదరి పడక ;
కంచు మ్రోగునట్లు । కనకంబు మ్రోగునా ? ॥వి॥ 229

ఆ. అల్పు డెప్పుడుఁబల్కు । నాడంబరముగాను ;
సజ్జనుండు బల్కు । జల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబుఁ మ్రోగునా ? 230

పై రెండు పద్యములలో పదమార్పులతో ఒకేభావము ద్యోతక మవుతుంది.

ఆ. అల్పుఁడైననేమి ? । యధికుండైననేమి !
చెప్పవలయు రీతిఁ । జెప్పినాఁడ ;
హారుని యెఱుకలేక । యూకు లల్లాడునా ? ॥వి॥ 231

ఆ. అల్పుఁడైనవాని । కధిక భాగ్యము గల్గఁ
దొడ్డవారిఁదిట్టి । తొలఁగఁగొట్టు ;
యల్పజాతి మొప్పె । యధికుల నెఱుఁగునా ॥వి॥ 232

మొప్పె=మూర్ఖుఁడు

ఆ. అల్పుఁడైనవాని । కధికారమబ్బినా ?
దొడ్డ కొంచె మనక । దూలఁబల్కు
చెప్పుఁగొఱకు కుక్క । చెఱకు చేవెఱుగు ॥వి॥ 233

చేవ=గొప్ప

ఆ. అల్లుని కగు మృతికి । నాత్మఁ జింతించును ;
తనయు మృతికిఁ దానె । తల్లడిల్లు ;
పుణ్య పురుషుమృతికిఁ । భూమిలో జనులకు
యుగము గ్రుంగినట్టు । లుండు వేమ. 234

వేమన మహాకవీందుని సహజ కవితా ప్రాభవమిందు ద్యోతక మగు చున్నది.

ఆ. అల్లుఁడై నసేమి । యన్యుఁడై నను నేమి ?
చెప్పవలసి మాట । చెప్పుచుంటి
హరుని యాన లేక । యాకులల్లాడునా ? ॥వి॥ 235

ఇట సర్వమూ సర్వేశ్వరు నాధీనములో నున్నదని సూచించెను.

ఆ. అవని నొక్కబిడ్డ । యతని తండ్రికిఁ బుట్టి
యట్టె యేలె జగము । లగణితముగ !
తల్లిలేక పెరిగి । ధాత్రి నెల్లెలెరా ॥వి॥ 236

ఇది కూటవేదాంతము.

ఆ. అవనివేషమెన్న । నజుని కడ్డముగాదు ;
యముని గెల్వలేని । యధములకును
దొంగపథముగాక ; । దొరకునా ? మోక్షంబు ॥వి॥ 237

ఆడంబరమగు బురఖా వేసుకొని ప్రజలను మోసము చేయు కపట యోగులను కటువుగా విమర్శించెను.

సీ. అవనిలో నొక కప్ప । యైదు పాములఁ బట్టి
విడఁబడి మ్రింగిన । విధమ దేమి ?
యొనర నొక్కట రెండు । ఘనకపుల్ చెలరేగి
యొంటిపిల్లల నీను నోజయేమి ?
కలియుగంబున నక్క । గర్భవాసమునందుఁ
గామధేనువు పుట్టు । కట్టడేమి ?
యవికారమఱ్ఱిపై । నరఁటి ఫలంబులు
పుట్టిన యట్టి యా । పొలుపదేమి ?
పే నొక్కటియు పుట్టి । పెఱిగి యోజనమంత
ద్రుంచుక మోసిన । ద్రుధమదేమి ?

తే. అరయనేర్చిన సర్వజ్ఞు । లైనవారు ;
చెప్పనేర్చిన వారొండు । చెప్పరేమి ?
శివునిఁగాంతురు, భువిలోఁ బ్ర । సిద్ధముగను
నీకుఁ దెలియనిదేముండు । నిజము వేమ. 238

కోరికలుఁ గలిగిన సాధులు గుట్టును బయటపెట్టక గురుకీలకమని గూఢార్థముగా చెప్పునదే కూటవేదాంతము అయ్యుదే యిది.

ఆ. అవుటఁగా మెఱుఁగని । యజ్ఞానజీవులు
మూలమునుఁ దెలియక । ముట్టుచేత
ననుదినము సృజించి । యాత్మఁ దెలియలేక
చచ్చి పుట్టుచుంద్రు । జగతి వేమ. 239

కామాంధులు తెలిసికొనదగిన విధముఁదెలియలేక అనేకజన్మ లెత్తుదురు.

ఆ. అవును కాదటంచు । నాత్మను గనలేక;
మంత్ర యంత్రములను । మగ్నులగుచు
సంశయములఁచేతఁ । జచ్చిరి గదరయా! ॥వి॥ 240

అవుట = పూర్తియగుటఁ దెలియక (అవుట వాడుకమాట)

గీ. అవును వేమన్న చెప్పిన । యాత్మబుద్ధిఁ
దెలియలేనట్టి యజ్ఞాన । దేబెలకును
తలనుఁ బాసిన వెంద్రుక । వలెనుఁ జూడ
భుక్తి ముక్తులు హీనమై । పోవు వేమ. 241

మొదట చరణ మార్పుతో ఈపద్య మొచ్చినది.

ఆ. అష్ట కష్టములకు । నాలయమైయుండు
గతులు దుర్గతులను । గన్న దేదియొ?
కానకుండఁ బోయె । గగన స్వరూపమై ॥వి॥ 242

సీ. అష్టకష్టములు:- పరదేశ యాత్రమై వర్తిల్లు టొక్కటి
పచనంబుజేసి సాపడుట రెండు
తనసతి నెసబాసి దనరుట మూడగు
యాచక వృత్తితో యడరనాల్గు
పరుల పంచనుజేరి బ్రతుకుట యైదును
సరివారి పజ్జ సంచార మారు
విద్యలేక సభకు వెడలుటయే యేడు
యాచకవృత్తిచే నడెరుటెన్మి
గీ. దష్ట కష్టంబు లడియెడి నవ్వియివ్వి
యనుచు సుకవీంద్ర చంద్రము లహరహము
వీని గుర్తించి చెప్పిరి వీనులలర.
ఆశయ విరాగి! నిర్భయానంద యోగి॥

(బొత్సకవి)

ఆ. అష్ట కష్టు బ్రదుక । దగ్ని పాలై పోవు
నిర్దయాత్ము బ్రతుకు । నీటఁగలియుఁ;
గ్రూరకర్మ బ్రదుకు । చోరులపాలౌను ॥వి॥ 243

ఆ. అష్ట తనువులకును నాదిమ మైనట్టి
యాదిశక్తిఁ గూడి । యభవుఁడగును;
భయము లేక యుండు । బ్రహ్మజ్ఞుఁడగు యోగి ॥వి॥ 244

జీవునికి వ్యష్టి, స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములునూ ఈశ్వరునికి సమిష్టి, స్థూల, సూక్ష్మమహాకారణములునూ మొత్తము ఎనిమిది తనువులు కలవు.

ఆ. అష్ట దళములకును । నాధారమైనట్టి
యాదిదేవుఁడొకఁడె । యఖిలజగము !
త్రయముఁ దాటువాఁడె । తానెపో బ్రహ్మంబు ॥వి॥ 245

అష్టదళములనఁగా మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ సహస్రారములనెడి ఎనిమిది చక్రములుగల దేహములో అష్టదళ పద్మమగు సహస్రార చక్రమున్నది. దానిని తెలిసిన వాడే "అహంబ్రహ్మాస్మి" అను పల్కున కర్హుఁడు తక్కిన వాడు కాడు. ఇటవిస్తరభీతి విరమించినాడ.

ఆ. అష్ట దళములందు । నాత్మను సేవించి
నిష్ఠఁబూని మిగుల । నేర్పుతోడ
దృష్టియుండె దృష్టి । తెమలక చూడరా ॥వి॥ 246

సహస్రార చక్రమును ఏకాగ్రతతో జూచిన సిద్ధివచ్చును.

క. అష్టాంగ యోగ సాధన
కష్టంబుల కోర్చి తన్నుఁ । గనలేఁడుగదా ?
చేష్టలు విడువని జీవికిఁ
గష్టంబగు, పుట్టఁ జావ । గతియదె వేమా ! 247

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ సమాధులనెడు నవి అష్టాంగ యోగములు.

* సీ. అష్టాంగ యోగము । లాత్మలోఁ దలపోసి
దృష్టాంతరముగ; తన్ । దెలియువాఁడు
[1] తెలిసి తెలియక డాఁగి । దుముకులాడుచుపైన
[2] నెలకొన్న మాయను । నణచు వాఁడు

సణఁగి పడుకొనియున్న । నాగుబామునుఁబట్టి
ప్రణవ చిన్మయమందు । పలుకువాఁడు
పలుకక కూర్చున్న పదవికి యాసించి
3 జలములోపల వెల్గుఁ । జూచువాఁడు

తే. 4 చూచి, వానిని భూచర । జాడ తెలిసి
5 గోసిఁ*తీసేసి శక్తిని । గెలిచి తేని
6 శివుని చరమందు నిల్పిన । వాఁడె బ్రహ్మ
చాలతత్త్వంబు వినుచున్న । జాడవేమ. 248

1, 2, 3, 4, 5, 6 యిట యతి తప్పినది.

* ఇట గ్రామ్యపదము వాడబడినది.

అష్టాంగ యోగములను సాధించి కుండలిని వశపరచుకొని ఖేచరీ ముద్ర యందు లీనమై సహస్రార చక్రమందు చూపు నిల్పినవాడె బ్రహ్మజ్ఞాని.

ఆ. అసి పదాంతముననుబుద్ధి । నమరనొక్క
కూటపద చిన్మయంబునిఁ । గొలువు దీరి,
యాటపాటల నణఁగింప । నందె ముక్తి,
విశ్రుతంబగు విధమిది । వినర వేమ. 249

పరబ్రహ్మ స్వరూపమునందు కూడి స్వయంప్రకాశమును జూచి విషయ సుఖములను విడచినవాడె ముక్తినందును.

ఆ. అసివినాశమైన । నానంద సుఖకేళి
సత్య నిష్ఠ పరుని । సంతరించు
* నిష్ఠలోని నిష్ఠ । నిర్ముక్త భావంబు ॥వి॥ 250

* "సత్యనిష్ఠజూడ సజ్జన భావంబు ॥వి॥ పాఠాంతరం

రాగద్వేషముల విడచిన భావమేర్పడును.

ఆ. అస్థిర మగు మేని । కధిక పాటులుఁ బడి ;
పెక్కు విధములందు । పెంచి, పెంచి,
యగ్ని కిచ్చు, లేక । యడవికుక్కల కిచ్చు ॥వి॥ 251

అస్థిరమని తెలిసియు దేహము పెంచి తుదకు స్మశానముపాలుజేతురు.

ఆ. ఆఁకటికి తాలంగు । నాచార విధులెల్ల
జీకటికిఁ దొలఁగుఁ । జిత్తశుద్ధి
ప్రేఁకటికిఁ దొలంగు । వెనుకటి బిగువెల్ల ॥వి॥ 252

ప్రేకటి = గర్భిణీ స్త్రీ

ఆ. ఆఁకలన్న వాని । కన్నంబుఁ బెట్టిన
హరున కర్పితముగ । నారగించు
ధన విహీనునకిడు । దానము సటువలె ॥వి॥ 253

ఆ. ఆఁకలిఁ గొనివచ్చె । నని పరదేశికిఁ
బట్టెడన్న మైనఁ । బెట్టలేఁడు
లంజ దానికొడుకు । లంజెలకిచ్చు రా! ॥వి॥ 254

ఆ. [1] ఆఁకలి కన్నంబు । అడుగ నేర్చినవాఁడు
[2] బ్రదుక నేర గలఁడు । భూమిమీఁద
[3] మెడ తెగని కూళ్ళు । మెన్నాళ్ళు వేతురు ॥వి॥ 255

1. ఈ చరణంలో గణాలు తప్పాయి. 2. యతి తప్పింది. 3. గణం తప్పింది. ఈపద్యం సీసపద్య చరణాలకు సరిపోతుంది.

క. ఆఁ కలిచే నేడ్చుచు మరి
లోకము తనకీయ రనును । లోలాక్షుఁడుఁ దా
నాఁకలి దీఱినయప్పుడు
చీకఁటి నాపంగఁ జవియుఁ । జెలఁగుచు వేమా! 256

క. ఆఁ కలిఁ జంపిన రాదవి
యాకులు దిని యడవులందె । యలసిననైనం
జీకఁటి కోనం జిక్కదు
యేకాకృతి మదిని నిల్పి । యెఱుఁగుము వేమా! 257

బ్రహ్మసాక్షాత్కారము నిరంతర ధ్యానమున పట్టుఁబడును.

క. ఆఁ కలి, యలసట, నిద్రయుఁ
బ్రాకటముగ సంగమంబు । ప్రభవము లెల్లం
బ్రాకుట, విడుచుట, విడుచు ; వి
భాకరుఁ డనిలుంపు చలన । భావ్యుఁడు వేమా! 258

విభాకరుఁడు = జ్ఞానభాస్కరుఁడు.

*ఆ. ఆఁకలి మోహంబు । యగ్ని పాలై పోయె
కాయమెత్తుగ తిరుగు । వాయు వాయ
వేరు యెండఁగ నుంటె । నీరు పాలాయెరా ॥వి॥ 259

* గణాలు తప్పినవి. సీసపద్య చరణానికి సరిపోతుంది.

* ఆ. ఆఁకలి వేళకు । నన్నంబు తినకుంటె
దేహంబు బడలికై । ధైర్యమణుఁగు
ధైర్య మణిగిన యపుడె । కార్యంబు తానగు ॥వి॥ 260

1. ఈ పద్యం సీసపద్య పోలికతోవుంది. 2. మూడవ చరణంలో మాత్ర ఎక్కువయింది.

ఆ. ఆకశమున వాయు । వాకారమైగదా
మంటిబొమ్మలకెల్ల । మాట్లు గలిఁగె
దీనికై నబ్రహ్మ । జ్ఞాన మేలాగుండు ? ॥వి॥ 261

ఆ. ఆకసంబు శూన్య । మందు శబ్దముపుట్టె
శబ్ద మధ్యమునను । సరగఁ జూఁడ
శబ్ద రహితమదియె । సద్బ్రహ్మ మనఁజెల్లు ॥వి॥ 262

ఆ. ఆకసగెడమీఁద । నాడు దొమ్మరిపాప
చూపు లోకటిఁగాని । సుఖములేదు;
యాకసమను వీధి । హంసను జూడరా ! ॥వి॥ 263

* ఆ. ఆకారశబ్దంబు । యాలోకముననుండు
ఊకార శబ్దంబు । యుర్వినుండు
* మాకార శబ్దంబు । మోక్షంబు నందుండు ॥వి॥ 264

1 ఈపద్య పాదాలు సీసపద్యానివి 2 యతి తప్పినది.
"అ" కార "ఉ" కార "మ" కారములే ప్రణవాత్మకమైన ఓంకారము

కం. ఆకారణ విధ మెఱుఁగుచుఁ
జేకొని యా మూలధనముఁ । జెందుచు నున్న
న్నా కల్పాంతమును సదా
యేకాలము పిన్నవయసు । నిహమున వేమా ! 265

చలన రాహిత్యముగ పరబ్రహ్మను జూచువాడు నిత్య యౌవనము నిత్యము సుఖములు పొంది ఘెలయుగల్గఁడు,

కం. ఆకాశంబున వాయువు
ప్రాకున దావాగ్నియటుల । మానస మందా
యేకాకారుఁడు జగమున
జోకై తనుదానెవెల్గు । సుమ్మిర వేమా!

జోక = సామ్యము ; అణువు మొదలు బ్రహ్మపర్యంతము పరబ్రహ్మ స్వరూపమేయని వేమన మహాకవి నుడిసెను.

ఆ. ఆకాశ బాణంబు । నగ్ని లేకను దాల్చి
యెగువచుట్టని విడువ । తరముగాదు
యగ్నియుంటేగదా ! । యన్నాట లాడవచ్చు ॥వి॥ 267

1 వ పాదం సీసపద్యానిది. 2 వ పాదంలో యతి తప్పినది 3 వ పాదంలో గణం తప్పినది. సంధితప్పు. ఆకాశబాణము = తారాజువ్వ

కం. ఆకుంచన విధమెఱిఁగియు
నేకాలము మూలబంధ । మేమరకున్నన్
లోకములోపలి వృద్ధులు
ప్రాకటముగ పిన్న వయసు । వారలు వేమా! 368

ఆకుంచన మనఁగా అపాన వాయుద్వారము ఒదింపఁ జేయుట ; మూలబంధమనఁగా యడమ కాలి మడమను గుదస్థానమందు బంధించుట
అపానవాయువును మీదికి పోవునట్లు చేసిన వార్ధక్యము వచ్చునని మహా యోగీంద్రుడు వేమన సూచించెను :

ఆ. ఆకు కానవచ్చు । హరిహరాదులకైనఁ
గొమ్మకానరాదు । కోరిచూడ
కొమ్మకానరాక । కొనియాడకుందురా ! ॥వి॥ 269

ఆ. ఆకుచాటున వగు । నన్ని లోకంబులు
కొమ్మకానరాదు । బమ్మకైన
గొమ్మకానఁబడిన । గొనియాడవచ్చురా ! ॥వి॥ 270

భగవద్గీతలో " మామాదురత్యయా " అని యున్న దానికి సూటిగా మన మహాకవి బ్రహ్మాదులకు నైనా మాయనుదాట శక్యముగాదని వ్రాసెను.

కం. ఆకుఁ దిను విధమెఱుంగుచుఁ
జేకొని యామూలధనముఁ । జెందుచునున్న

న్నాకల్పాంతమ్ముసదా
యేకాలముఁబిన్నవయసె । యిహమునవేమా ! 271

మాయను దాటెడి విధమెరిగిన వారే అనిమిషులు.

ఆ. ఆకుమీఁద వ్రాత । యందఱికి దెలియు
చేతిలోని వ్రాత । జెప్పవచ్చు
తోలుక్రింది వ్రాత । దొడ్డవాడెఱుఁగురా ! ॥వి॥ 273

గ్రంథస్థమయినది, చేతిలోని రేఖలు తెలిసికొన వచ్చును. లలాటవ్రాత దెలియ
దని వేమన సునిశిత విమర్శచేఁ దెలియఁ జేసెను.

ఆ. ఆకు లందుఁ జదివి । యందంగ రానిది
యేక మమర యుక్తి । నెఱుఁగ వలయుఁ
దాకిపూర్తిగాను । దన్మయమందుఁడీ ॥వి॥ 274

గ్రంథపఠనమువలన మోక్షములేదు. సర్వత్రా ప్రకాశించిన స్వయంప్రకాశ
మును పూర్తిగ దెలిసి మోక్షము బొందుమని నుడివెను.

ఆ. ఆకులెల్లఁదిన్న । మేకపోతుల కెల్ల
గాక పోయెనయ్య । కాయసిద్ధి
లోకులెల్ల వెఱ్ఱి । పోకిళ్ళుపోదురు ॥వి॥ 274

కాయకల్పసిద్ధి కాదనిమహాకవి సూక్తి

ఆ. ఆకులేని కొమ్మ । యభ్ర మెల్లను నిండె
మ్రాకు మొదలుఁ దుదయు । మహిని లేదు
యేకమైన పండు । నింపొందుచుండురా ! ॥వి॥ 275

ప్రకృతిని మహీరుహముగా పోల్చెను.

ఆ. ఆకు వక్క సున్న । మవి మూఁడు వన్నెలు
నేకమైనచోట । దాఁకునెఱుపు
శ్లోకి త్రిగుణ మట్లు । శోభించుఁ బరమాత్మ ॥వి॥ 276

ఆకు, వక్క, సున్నము గలసిన ఎఱుపగునట్లు త్రిగుణములు గలసిన జ్ఞానోదయ
మగును.

ఆ. ఆకృతినరయఁగ ; ని । రాకృతియనఁదగు
నాకృతి నొగిఁదగు, ని । రాకృతట్లు
యవియు రెండులేక । యపురూపమై యుండు ॥వి॥ 277

7

కం. ఆకొన్న యతిథి శివుఁడని
కాంక్షించుకలేక మదినిఁ । గరుణాన్వితుఁడై
పోకంత యన్నమిడి నని
నాకొని యా యమునిఁగొట్టు । నుపమిది వేమా ! 278

అన్నదాన ఘనత నిట మహత్తరముగా పేర్కొన్నాడు.

ఆ. ఆగడంబుచేత । నందెందుఁ బొందదు
సాగఁదోలి మనసు । సైపనేర్చి
మ్రోగు ప్రణవరవము । మూలంబుఁ గానరో ! ॥వి॥ 279

ఓంకారము యొక్క శబ్దమే ప్రణవము. ఇది ముద్రాభావములో వినవచ్చునని వేమన వాకొన్నాడు.

ఆ. ఆ చరా చరముల । నంగాలలింగాల
సరణిఁ దెలియనట్టి । శైవమేల?
యష్ట తనుమయుండు । హరుడాట నెఱుఁగరో ! ॥వి॥ 280

వీరశైవులు మెడలోన చేతులందు లింగములు ధరింతురు. నిజమగు శివస్వరూపము "నీరు, నిప్పు, గాలి, భూమి, ఆకాశము, సూర్యుడు, చంద్రుఁడు సోమయాజి" అను అష్టతనుడని తెలియక దాంభికముగా వర్తింతురన్నాడు.

ఆ. ఆజ్ఞ యనెడిచక్ర । మందాత్మ లింగంబు
నరిది నలరుచుండు । నట్టిదారి
పరగఁ జూచినంతఁ । బ్రాప్తించు మోక్షంబు ॥వి॥ 281

ఆ. [1]ఆటలెక్కడఁబుట్టె । పాటలెక్కడఁబుట్టె
మాటలెక్కడబుట్టె । [2]జీవియందె
బావి[3] లోపలఁజేరి । జీవినంటఁగవలె ॥వి॥ 282

1 సీసపద్యపాదములు 2 యతితప్పింది 3 గణంపోయింది.

ఆ. ఆడదనఁగ రోతఁ । యందుఁ జూచినరోఁత
తలఁచిచూడ తమకు । తామెమెచ్చి
యెంతవారలయిన । నెంచరు తమలోన ॥వి॥ 283

ఆ. ఆడదాని బొంకు । గోడబెట్టినరీతి
పురుషవరునిబొంకు । పూరితడికె
స్త్రీలనేర్పు భువిని । చీకురాయితపంబు ॥వి॥ 284

చీకురాయితపము = గుడ్లగూబ

ఆ. ఆడదాని మాట । నరకాసుకై నను
నమ్మఁగూడ దెట్టి । నాతినయిన
కాదనుచును నమ్మ । కానల విడుచురా ! ॥వి॥ 285

ఆ. ఆడ [1]నెఱిఁగిన మగువ । యనువెర్గు చనువెర్గు
ముదముతోడ మగని । మోహమెఱుఁగు
విభుని శ్రేమగుణము । వేశ్య తానెఱుఁగురా ! ॥వి॥ 286

1. 'నెఱుగు' అనివుంటే బాగు.

ఆ. ఆడ పాపజాతి । యన్నిటి కంటెను
ఆశచేత యతులు । మోసపోర ?
చూచి విడచువారు । శుద్ధాత్మలెందును ॥వి॥ 287

ఆ. ఆడవారలతోటి । యాట్లాడుటది రోఁత
పంచభూతములతో । పెనఁగ రోఁత
మూఁడు బావులలోన । మునిఁగి తేలుటరోఁత ॥వి॥ 288

గంగా, యమునా, సరస్వతులను గుర్తించి విడువరాదని మనమహాకవి సూటిగా చెప్పెను.

ఆ. ఆడి తప్పువార । లభిమాన హీనులు
గో డెఱుఁగని వాఁడు । కొద్దివాఁడు;
కూడి కీడుసేయు । క్రూరుండు తలపోయ ॥వి॥ 289

ఆ. ఆడుదనఁగరోఁత । యది చూడఁగారోఁత
తలఁచి చూడఁ దనకుఁ । దానె రోఁత
యెంత వారికైన । నింతియె బల్ఘాత ॥వి॥ 290

ఆ. ఆడుదానిఁజూడ । నర్థంబుఁజూడఁగ
బ్రహ్మకైన నెత్తు । రిమ్మతెగులు
బ్రహ్మ యాలిఁ ద్రాఁడు । బండిరేవునఁ ద్రెంప ॥వి॥ 291

"బండిరేవు" తెలుగు నుడికారపు సొంపు యింపుగా జూపించాడు వేమన.

ఆ. ఆడుదానిఁ గన్న । నర్థంబు పొడఁగన్న
సారమైన రుచుల । చవులఁగన్న
యయ్యగారికైన । నాశలు పుట్టవా ? ॥వి॥ 292

అయ్యగారు = గురువులను సంబోధించే నుడికారము.

ఆ. ఆడుదాని మాట । గోడఁ బెట్టినయట్లు
పురుష వరుని మాట । పూరి తడిక
స్త్రీలనేర్పు మగలఁ । జీకాకు పఱచురా ! ॥వి॥ 293

తే. ఆత్మ తనలోన గమకించి । యనుదినంబు
నిర్గుణాత్మార్చనముఁ జేసి । నిత్య మమర
ప్రత్య గాత్మను లోనెంచి । ప్రబలు యోగి
సచ్చిదానంద పదమందు । సతము వేమ. 294

నిర్గుణబ్రహ్మా రాధనచే యోగి ముక్తి పదమునందునని వేమన ప్రశంసించెను.

తే. ఆత్మ తేజము గమకించి । యభినుతించి
కీలక బ్రహ్మ తన్మయ । కేళివఱిగి
నిత్యపరిపూర్ణ మందుట । నిరతిశయము
సత్వ సంపన్నులకు నిది । సాఁగు వేమ. 295

నిజముగు బ్రహ్మస్వరూపము గుర్తించి పరిపూర్ణత్వమందుటకు అభ్యంతరము లేదని సూటిగా వచించెను.

ఆ. ఆత్మ తేజమూని యనుభ । వించుట ముక్తి
యాత్మ తత్వమెఱుఁగు । నతఁడె యోగి
యెఱిఁగి మరిగి నంత నేకమై । తోఁచురా ! ॥వి॥ 296

పరబ్రహ్మను తెలిసి కొని దానియందు లీనమైన తాను "అహం బ్రహ్మాస్మి" యనగలఁడు.

ఆ. ఆత్మ తేజమూని । యనువుగా శోధించి
తేజ మాత్మ యందుఁ । దేట పరచి
మింటె, మంటె నడుమ । మిన్నంది చూడరా ! ॥వి॥ 297

భూమ్యాకాశముల మధ్య వెలిఁగే స్వయంప్రకాశంగురించి చెప్పఁబడినది.

ఆ. ఆత్మ దేహమందు । నతిసూక్ష్మముగఁ జూచి
దేహ మాత్మ యందుఁ । దేట పరచి
యాత్మ యందె చూడ । నతఁడెపో ఘనయోగి ॥వి॥ 299

దేహమునకు ఆత్మకు అవినాభావ సంబంధమిట నిరూపించబడినది.

ఆ. ఆత్మ నిలచుకొఱకు । నంగంబు బుట్టెను
యంగముల వలనను । యాత్మబుట్టె
యాత్మ పెద్దదా? లేక । యంగరంబు పెద్దదో? ॥వి॥ 299

వేమన బహుముఖప్రజ్ఞావంతుడగుటచే విజ్ఞానులకు కొరకరాని కొయ్యగా ప్రయోగించెను.

ఆ. ఆత్మ నున్నవాని । ననుదినంబును జూచి
యతని మహిమ వలన । నతనిఁ దెలియ
*నదియు సత్యమౌను । నవనీతలంబున ॥వి॥ 300

*. పాఠాంతరం :– "నతఁడు సజ్జనుండు" । నవనీతలంబున

తన ఆత్మలో దైవస్వరూపుని తెలిసికొనిన డంబములతో పనిలేదు.

ఆ. ఆత్మ నెఱుఁగనినుతి । యట్టిట్టు చేసిన
వాని మెచ్చు వాఁడు । వట్టి వాఁడె
ముక్కిడిదియుఁ బాడ । మొండిదె మెచ్చుఁడా! ॥వి॥ 301

దేబెల ప్రజ్ఞల దేబెలే మెచ్చుకొనెదరని లోకజ్ఞానుభవమున నుడివెను.

ఆ. ఆత్మ బుద్ధివలన । నఖిలంబుఁ దానయ్యె
జీవ బుద్ధి వలన । జీవుఁడయ్యె
మోహబుద్ధి వలన । ముదితలపై బుద్ధి ॥వి॥ 302

"యద్భావం తద్భవతి" అను సంస్కృత లోకోక్తినిట విశద పరచెను.

ఆ. ఆత్మబుద్ధులు విని । యన్నదమ్ములతోటి
జగడమాడు వాడు । జట్టిపోతు
నన్నదమ్ము లూడ । యాత్మెట్టు నిలుచురా? ॥వి॥ 303

"ఆత్మబుద్ధులు" దీనికర్థం సరిగా తోచుటలేదు. కాని పద్యభావమునుబట్టి వేమన కాలమునాఁడు ఆత్మబుద్ధులనఁగా భార్యవంకవారయినట్టు తోచును.

*ఆ. ఆత్మ బుద్ధులు వేరె । యానంద మొక్కటి
గురువు శిష్యుఁడు వేరె । గురియు నొకటి
యోగ సాధన వేరె । యోగంబు నొక్కటి ॥వి॥ 304

ఇది సీసపద్య పాదపోలికలతో నున్నది

ఆ. ఆత్మ యందుఁజ్యోతి । యమరుట లింగంబు
* తెలిసి చూడఁగాను । దేటపడును
యదియు గురువులేక । యబ్బునా ? తెలియంగ ॥వి॥ 305

*. పాఠాంతరము :- 1 తెలివిచేతగాని । తేటపడదు. 2 అది యధైర్యవరుని కంటదు. హృదయమును సమాధిచే లోబరచుకొని జ్యోతిర్మండలమును దర్శించుటయే ఈశ్వర సాక్షాత్కారము. దీనికి సద్గురూపదేశము ముఖ్యము.

*ఆ. ఆత్మ యందె దృష్టి । యనువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి । నిలిపెనేని
యతఁడునీవె సుమ్మి । యనుమానమేలరా ! ॥వి॥ 306

చూపును ఆత్మయందు నిల్పుటయే కైవల్యమునకు మార్గము.

ఆ. ఆత్మలోన నాద । మాలించి యాలించి
యాశలందుఁ జిక్కఁ । డాదియోగి
యాత్మలోనఁ గెళల నంటునా ? తత్త్వంబు ॥వి॥ 307

హృదయమున నిరంతరము దశవిధనాదములు ధ్వనించును. అది తెలియుట యోగత్వము.

ఆ. ఆత్మలోన శివుని । ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి । నిలిపెనేని
సర్వము క్తుఁ డౌను । సర్వంబుఁ బానౌను ॥వి॥ 308

హృదయకుహరమునందున్న ఈశ్వరుని పరిశోధనరూపముగా తెలిసికొనినవాడే ఈశ్వరుడు.

ఆ. ఆత్మలోనిఁ జ్యోతి । యమరుట లింగము
తెలిసి చూడకున్నఁ । దేటపడదు
గ్రుడ్డివాఁ డెఱుఁగునె ? । గుఱుతైనరత్నంబు ॥వి॥ 310

యీవిషయము వ్యాసుడు ధర్మరాజునకు చెప్పినట్లు శ్రీరామస్తవరాజము నందు గలదు.

సీ. అల యవస్థాత్రయముల దాటి మదిలోన
రజితాద్రిపటికంపు రాతిపైన
నిండుపున్నమనాటి పండువెన్నెలవలె
పట్టపగటి బట్టబయలు పోలె

నిండిపండి యొరిగి నిబిడీకృతానంద
మైపెల్గు తురీయ సమాధియందు
చిన్మయ జ్ఞప్తిమై సన్మాత్ర మంత్రమై
శేషించియదిదానఁజెలగు చున్న

గీ. బ్రహ్మ విద్యాధురంధరుల్బాహ్యమందు
జాతి, వర్ణాశ్రమాచార సంస్కృతులను
సన్యసించైన సంసార సంగులైన
యఖిల వ్యవహర్తలయి యెందు నంటరధిప ||

ఆ. ఆత్మలోనిసామ్ము । నంజనమునఁజూచి
యంటి తిరుగు నట్టి । యతఁడుయోగి
పుంజుగూటనుండి । ప్రొద్దెఱింగియె కూయు ॥వి॥ 311

కోడిపుంజు సూర్యునిజాడక గూటినుండి వేళదెలిసి కూయునట్లు జ్ఞానాంజనముచే, బంధితుడయ్యు యోగి పరమాత్మను గుర్తించును.

ఆ. ఆత్మలోపల శివుఁ । డయిదింట నుండును
ఆరిఁట గనసుండు । నరసి చూడ
నరసిచూచువాఁడె । యానంద భరితుండు ॥వి॥ 312

మనలో నున్న పంచవాయువులలో ధనంజయవాయువు బ్రహ్మతత్వరతతో నుండును.

ఆ. ఆత్మశుద్ధి గలుఁగ । నధికుల మనబోరు
ధీరవృత్తిచేతఁ । దిరుగఁబోరు
రూపుకుదురు । మంచి రూఢిగావింపరో ! ॥వి॥ 313

ఆ. ఆత్మశుద్ధిలేని । యాచార మదియేల?
భాండశుద్ధి లేని । పాకమేల?
చిత్తశుద్ధిలేని । శివపూజలేలరా ! ॥వి॥ 314

భాండము = కుండ

ఆ. ఆత్మ శుద్ధివల్ల । నఖిలంబుఁ దానయ్యె
జీవశుద్ధివలన । జీవుఁడయ్యె
మోహబుద్ధి [1]లయము । ముందరఁగనుఁగొన ॥వి॥ 315

1 పాఠాంతరము = వలన.

మోహబుద్ధి భవిష్యత్తులో మనిషిని పాడుచేయును.

ఆ. ఆత్మసూక్ష్మమైన । యానంద మెఱుఁగక
మతి తొలంగి చదివి । మగ్నుఁడయ్యె
యతి రహస్య మెల్ల । నాయోగియెఱుఁగురా ! ॥వి॥ 316

చదువు వలన బ్రహ్మజ్ఞానము కలుగదు. యోగమువలననే గలుగును.

కం. ఆత్మానాత్మ । వివేకము
స్వాత్మను గనినంత మీఁద । స్వచ్ఛందమతిన్
నాత్మకు । లోవెరిని గఁడు, మ
హాత్మునిఁ బొగడంగ వశమె । హరునకువేమా ! 317

ఆత్మ, అనాత్మలను సువిమర్శచేఁ దెలిసి ఆత్మాతీతమగు బుద్ధి నార్జింపుమని వేమన సూక్తి.

ఆ. [1] ఆదికారణముల । నల్పుఁడేమి యెఱుంగు
చెప్ప లేఁడు గాని । తప్పఁ బట్టు
త్రోయనేర్చు కుక్క । దొంతులు చేర్చునా ! ॥వి॥ 348

1 పాఠాంతరము=ఆదికాలమునను

ఆ. ఆదిఁ జూచుచుండ । నన్నింటఁ దానుండు
నాదిఁజూఁడ నొకరి । కలవి గాదు
యాది ముక్తి తెరువ । దాత్మనే యుండురా ! ॥వి॥ 319

మూలబ్రహ్మము తెలియుట కష్టము. తెలిసిన ముక్తి కలుగును.

ఆ. ఆది తుదల నరయ । కల్పుడై దినమెల్ల
మార్పుచేత బుద్ధి । మరగి తిరుఁగు
మ్రాను మ్రాను దిరుఁగు । మహిఁ గోతికై వడిని ॥వి॥ 320

జీవాత్మ పరమాత్మ తెలియక మానవుఁడు కోతివలె తిరుగును.

ఆ. ఆది తుదియు లేని । దనుభవ గమ్యమై
వేద తుల్యముగను । వెలయు చుండు
వాద భేద ముడిగి । వరియించు శివయోగి ॥వి॥ 321

పరబ్రహ్మము అనుభవైక వేద్యము

ఆ. ఆదినంటి చూడ । నలవిగా దేరికి
సోదిఁజెప్పఁ దరమె । సుఖమెఱింగి
వాదమేల బయలు । వర్ణించి చూడరా! ॥వి॥ 322

భవిష్యత్తు నిర్ణయించే పొట్ట కూటివాండ్రను ఉపమానముగా చెప్పెను.

ఆ. ఆది నెవరు పుట్టి । యవనికి దొరలైరి ?
వారె బ్రహ్మ, విష్ణు, । వరశివులును
గనఁగ మాయశక్తి । ఘనతేజ మందురు ॥వి॥ 323

శక్తిపురాణ గాథఁజూడుము.

ఆ. ఆది నెరుఁగలేని । యల్పుండు తా మరి
చెప్పలేఁడుఁగాని । తప్పుబట్టు
త్రోయనేర్చు కుక్క । దొంతులఁబేర్చునా? ॥వి॥ 324

* 319 పద్యము పోలికనున్నది.

ఆ. ఆదినెవరు పుట్టి । రది తెలి*యుగఁ గోర
సోది యగును గదర । సుఖములేదు
యాదిశక్తి యన్న । నదిబయలని నమ్మ ॥వి॥ 325

* గణము తప్పెను. ఆదిశక్తియే ప్రకృతి

ఆ. ఆదినొకటిఁ దెలిసి । యాదిని మదినిల్పి
యాదిఁ బాయకున్న । నభవుఁడౌను
యాదిఁబాయు వాఁడె । యంధునిరీతిగా ॥వి॥ 326

తన హృదయ కమలమున నున్న బ్రహ్మమును దెలసి విడచిన అంధుఁడు. విడువక ధ్యానించు సాధకుఁడే పరబ్రహ్మ.

*ఆ. ఆదిమ కవులవలె । నల్పుండు తానెట్టి
చెప్పలేఁడుగాని । తప్పుఁబట్టు
త్రోయనేర్చుకుక్క । దొంతులు బెట్టునా? ॥వి॥ 327

* గణము తప్పెను; వేమన మూఢులను పదేపదే కుక్కతో పోల్చి నుడువుచున్నాడు.

ఆ. ఆది మూల విద్య । నానంద భరితుఁడై
వేదతుల్యముగను । విడకపూని
పాదు కొనినవాఁడు । పడయును మోక్షంబు ॥వి॥ 328

ఆ. ఆదిమూల మేది ? [1]యాధార మెయ్యది ?
సోదిఁజెప్పఁ దరమె । సుద్దులరసి
తోడులేక లోని । తుర్యమందునుజూడు ॥వి॥ 329

సృష్టికి మూలాధారము ఏదని నీలోనున్న యీశ్వరుని గుర్తింపుము,

ఆ. ఆదిశక్తిఁ గూడి । యనుభవించెడి యోగి
వేదవిద్య మఱఁగి । విడువఁబోఁడు
సాధువృత్తిఁ దగిలి । స్థైర్యంబునందురా! ॥వి॥ 330

ఆదిశక్తి = అన్నిటికి మూలమైనది.

ఆ. ఆదిశక్తి దొడరి । యలమట జెందక
ప్రాణ పంచకంబు । పట్టునెఱిఁగి
యంతరిక్షమందు । నభినుతించుట ముక్తి ॥వి॥ 331

ఈశ్వర విచారంబు కష్టమని విడువక పంచప్రాణములతో నింగివలె నున్న అభవుని తెలియుట ముక్తి.

ఆ. ఆది, సోమ, భౌము । లల బుధ, నిర్జర
గురుల ; శుక్ర, శనుల । గుఱుతుఁగాఁగ
నేడు దినములైన నిలనొక్క దివసమె ॥వి॥ 332

యుగ, వార, నెలలాదిగాగల శుభాఽశుభ ఫలనిర్ణయము చెప్పే జ్యోతిష్కులను తృణీకరించెను.

కం. ఆధారంబుల టారును
మోదముగా నలరుచుండు । ముఖ్యముగాగన్
లేదన నేటికిఁ । దెలియక
సాధకమున జూడవయ్య । చయ్యనవేమా! 333

షడ్గుణాలు విడిచి పరబ్రహ్మమును సాధించుము

ఆ. అనుకూల్యము గల । యంగన గలిగిన
పతికిఁ బతికిఁ బరమ సౌఖ్య మమరు
ప్రాతికూల్యమైనఁ బరిహరించు సుఖంబు ॥వి॥ 334

సంసార గాథ

ఆ. ఆపగాళ్ల వెంట । నడవుల వెంటను
గొండరాల వెంట । గొడవలేల ?
నుల్లమందె శివుఁడ । టుండుటఁదెలియరో! ॥వి॥ 335

నదీ నదములు, కొండలు, గుట్టలు తిరుగుట శుద్ధమూర్ఖమని నీలో నీశ్వరుని తెలియుమని మన యోగీంద్రుని వాక్కు.

ఆ. ఆపదందుఁ జూడు । మారయ చుట్టాల
భయము వేళ జూడు । బంటు తనము
పేదవేళఁ జూడు । పెండ్లాము గుణమెల్ల ॥వి॥ 336
లోక సహజమును చిత్రించెరు.

ఆ. ఆపదైన వేళ । యరసి బంధుల జాడ
భయము వేళఁజూడు । బంటుగుణము
పేదవడ్డ వెనుక । బెండ్లము మతిఁజూడు ॥వి॥ 337
పైపద్యం ఇది ఒకే భావం కొద్ది మార్పు

* ఆ. ఆపుట గమెఱుఁగని । యజ్ఞానజీవులు
మూలము తెలియక ను । ముట్టుచేత
యను దినము సృజించి । యాత్మఁ దెలియలేక
చచ్చి పుట్టుచుందు । జగతి వేమ. 338
* గణము పోయెను. మూర్ఖలక్షణము.

ఆ. ఆభిజాత్యముననె । యాయువున్నంతకుఁ
దిరుగు చుంద్రు భ్రమలఁ । దెలియలేక !
మురికి భాండమునను । ముసురు నీఁగలరీతి ॥వి॥ 339
మురికికుండకు ఈగలు ముసిరినట్టు తనకు తెలిసినదే గొప్పగా మూర్ఖుడు మురియును.

కం. ఆమటిని మంటి కడవలు
గ్రామములను వింతలైన । ఘనులకు వింతా ?
తామెందు దిఱుగుచుండిన
వేమన తనతోడినీడ । వెంటనె వచ్చున్ 340
ఆమటి = కుండలు కాల్చిన ఆవము

కం. ఆమడ కామడ కడవులు
గ్రామంబులు, చెఱువు, నదులు । కర్మములింతే,
తామెందులోనఁ దిరిఁగిన
వేమన తోడగుచు వచ్చు । వెంటనె వేమా ! 341
నీడవలె వేమన సూక్తులు మనవెన్నంటును

ఆ. ఆ యక్షరము తోఁటి । యాట్లాడు చుండిన
ఊ యక్షరము లోని । యునికి తెలుసు
మా యక్షరము తోఁటి । మర్దించవలెనయా ! ॥వి॥ 342

* ఇది సీసపద్య పాదాలతో వుంది.

"అకారము బ్రహ్మ, ఉకారము విష్ణువు, మకారము శివుఁడు. మూడును అనగా అ + ఉ + మ = "ఓం,, ఇది ప్రణవము.

ఆ. ఆయు వగిలియుండు । నవనిపై మారుత
ప్రియముగల్గు నప్పుఁడు । పెరుఁగవచ్చు
కాయమును భరించు । కల్పంబు చూడరా ! ॥వి॥ 343

కల్పము = ఇది బ్రహ్మదినము.
స్వరశాస్త్ర విజ్ఞానాన్ని ప్రశంసించెను.

ఆ. ఆయువు గలుగుఁ గద । యవనిపైఁ జొరఁ జార
* ప్రియముఁ గల్గునేని । బ్రతుకి వచ్చు
కాయము నిలిపికొని । కల్పంబుచూడరా ! ॥వి॥ 344

* యతి తప్పు. శరీర రక్షణకు ప్రాణాయామమని వేమన నుడివెను.

ఆ. ఆయు సుధము కన్న । నతిశయ మైనట్టి
కల్ప మెఱుఁగు వాఁడు । కారణుండు
ఆయ సున్న ముఁదిన । నంధకారమడంగు ॥వి॥ 345

కాయకల్ప చికిత్సా యోగమై యుండు నేమో !

ఆ. ఆరిట నిలుచుకొని । యాత్మపూజలుచేసి
* లింగంబు మీఁదను । లక్ష్యముంచి
నరులు యెంతటి వారు । నాదంబు గనిపెట్ట ॥వి॥ 346

* గణము, యతి తప్పింది.
* షట్చక్రములు యందున్న ఈశుని భజింపుమని వేమనయోగి పల్కెను.

ఆ. ఆరు కోణజ లింటి । కాధారమైనట్టు
లొంటిగుంజ మేడ ! । నొనరనిల్పు
నింటి కొక్కఁడు మగఁ । డిది యేమి చిత్రమో ! ॥వి॥ 347

షట్చక్రములకు ఆధారము సహస్రారము. దీనియందు వేలాది "సోఽహం" అనుధ్వనులు పుట్టును.

గురుని జంపి । హరు మీఁది ధ్యానంబు
ి నిశ్చలముగ । నెగడి యాత్మ
యొకనిచేయు । నాతఁడే యోగిరా ! ॥వి॥ 348

ర్గమును ఛేదించి పరమాత్మను జెలియుటయే సమాధి. కావున "శివఏకో కరః" "ఏకోహవై నారాయణ ఇదము ద్భవమాశీత్" అనిశ్రుతి.

గురుని జేర । నత్యంత దుఃఖంబు
సగురుని జేర । యేమపయ్యో
వీరిపొందు । విడియుటే యోగంబు ॥వి॥ 349

పా :— "కనుక వీరి పొందు । కడద్రోయ యోగంబు"
లు, సప్తవ్యసనములు దవిలిన సంతాపమని వేమన సూక్తి.

పరినిఁ జంపి । హరుమీఁది ధ్యానంబు
నిశ్చయముగ । నెగడి యాత్ర
నెఱుంగుచుండు । ఘనుఁడగు యోగిరా! ॥వి॥ 350

దాలములకు । నాధారమైనట్టి
ి కంబ మింటి । కొనర నిల్పి
కొకఁడుకర్త । యేపారుచుండును ॥వి॥ 351

; చ్ఛాయగానే ఇది వున్నది.

రాఱుగురికి । నాధారముగఁ జేసి
రికంబపిల్లు । నొనరనిల్ప 352
కర్కఁడు మగఁడు । నెన్నిక నొనయా ! ॥వి॥

వ- శాక్తేయ, గాణాపత్య, సౌర, కాపాలికలను ఆరుమతస్థులకు
ప్పు బ్రహ్మమందు నిలుపు మనియె.

మూఁడును గుళ్ళను
వానిమర్మ । తేజము లరయ
ంగల మనుజుండఁటఁ
మోక్షంబు ద్రోవ । సిద్ధము వేమా ! 353

డు, కనులు రెండు, ముక్కులు రెండు, నోరు, గుదము, ఉపస్థ యివి
ని అణచేయోగ్యతగల యోగి ముక్తి నందును.

కం. ఆరును, మూడగు నెలవుల
* ధీరుఁడుగా దిరిగి వాని । తేజము లరయ
న్నేరుపు గలపురుషుఁడు తా
జేరును మోక్షంబు త్రోవ । సిద్ధము వేమా! 354

* పైపద్యములు రెండును ఒకే భావము గలవి.

ఆ. ఆరు మతము లందు । నధికమైన మతము
లింగమతము కన్న । లేదు జగతి
లింగధారి కన్న । దొంగలు లేరయా ॥వి॥ 355

షణ్మతాలలో శైవంబు గొప్పదని వేమన ప్రశంసించి, దొంగ లింగధారుల దూషించెను.

ఆ. ఆరు మూఁడు గట్టి । యలమటఁ జెందక
పోరిగుణములడఁచి । పూనిమిగుల
తేగ శిఖరమెక్కి । తెలివంటఁజూడరా! ॥వి॥ 359

షడ్వర్గములు, త్రికరణములు. అరికట్టి సహస్రారములో నున్న పరంజ్యోతిని ట ముక్తిగా నుడివెను,

ఆ. ఆరురుచులు వేరు । సారం బదొక్కటి
సత్యనిష్ఠ వేరు । సత్యమొకటి
* పరమ ఋషులు వేరు । భావ్యంబ దొక్కండయా! ॥వి॥ 357

* గణము తప్పినది.

షడ్రుచులు :— 1 కారము, 2 తీపి, 3. పులుపు, 4 ఉప్పు. 5 చేదు, 6 వగరు భావ్యుఁడు = పరబ్రహ్మ.

ఆ. ఆరు వేషములను । నరయంగఁ గడువింత
యాత్మయందు ధ్యాన । మమర దెందు
భీకరంబు గాని । బిడుద లేదువిరక్తి ॥వి॥ 358

ఆరు మతాలకూ మతానుకూలముగ వేయబడిన వేషములు.

ఆ. ఆరు శాస్త్రములను నఖిల వేదంబులఁ
జదువ నేర్తురిలను । జచ్చువరకు
వ్యర్థ విద్యఁజదివి । వడిఁచెడుచుందురు ॥వి॥ 356

ఆరు శాస్త్రములు :— శిక్షా, వ్యాకరణ, జ్యోతిష, నిరుక్తి, కల్పము, తల్పము.

కం. ఆరూఢ జ్ఞానమ్మునఁ
జేరెడి విధమెఱిఁగి లోన । జితుఁడై యుండ
న్నారాడని పరిపూర్ణము
తారాడక యెఱుఁగువాఁడె । ధన్యుఁడు వేమా ! 360

ఆరూఢము=లెస్సగా తెలిసికొనుట. తారాడక = చలనములేక.

ఆ. ఆర్పఁ దీర్పలేని । తీర్పరి తనమేల ?
గూర్పవిప్పలేని । నేర్పదేల ?
పెట్టి పోయలేని వట్టి । బీరంబేల ? ॥వి॥ 361

ఆ. ఆర్ష విద్యలెల్ల । నపకీర్తిపాలాయె !
వార్త కెక్కువెంత । వారికైన
వార్త విద్యలెల్ల । ధూర్తులపాలాయె ॥వి॥ 362

ఆర్షవిద్య = ఋషిసూక్తులు, వార్త = ప్రచారము.

కం. ఆర్గురు దొంగలఁ బట్టుక
మార్గముననె కొట్టి యొకని । మన్నింపఁదగున్
దుర్గమ మిది తెలియంగా
నిర్గుణ రూపంబుఁదెలియు । నిజమిది వేమా ! 363

షడ్గుణవిరక్తితో మనస్సునుమన్నింపుమని వేమన యుక్తియుక్తముగా చెలిపెను.

కం. ఆర్గురు దొంగలఁ । బట్టుక
* మరిఁ గొట్టఁగవలయు । నొకని మన్నింపఁదగున్
మెరపైన యట్టివారికి
యిరవొందిన యెఱుకఫలము । యిదిగద వేమా ! 364

* పై పద్యభావము వంటిదే యిదికూడాను. స్వల్ప మార్పుతో నున్నది.

ఆ. ఆర్యులైన ఘనులు । కార్యహీనులుఁగారు
శౌర్య, ధైర్యములను । సంతరించి
పూర్ణభావ మమరఁ । బొందింపఁజేయరే ! ॥వి॥ 365

ఆర్యులనిట ఘనముగా ప్రశంసించెను.

ఆ. ఆర్యులైన వార । లనుభవరూఢిని
దెలియఁ జెప్పకున్నఁ । దేటపడదు
గుఱుతుఁ గననివాఁడు గుఱి । యెప్పజెప్పునా ! ॥వి॥ 366

తెలసినవాడు చెప్పగలఁడు. తెలియనివాడు చెప్పలేడు.

కం. ఆలనఁగా నాత్మసుమీ
* యాలనఁగా నమ్మసుమ్మి । యరయఁగమదిలో
నా లమ్మయనఁగ నెవ్వరో?
వాలాయము దీనిఁ దెలియ । వలయును వేమా ! 367

* యీ భావంతోఁ గూడిన పద్యము ఇంతక ముందు వచ్చెను. తనరూపే భార్యగర్భమున జనించును గాన భార్యకూడ తల్లివంటిదని వేదాంతవిద్యాభూషణుని వాక్కు.

ఆ. ఆల మెఱుఁగు బంటు । లల్పుని జేరనే ?
మాఱు నలయు బొత్తుఁ । మరిగి మగఁడు
మాళ్ల ముంతకోళ్ళ ! మఱి కోఁతులైనట్లు ॥వి॥ 368

ఆ. ఆల మెఱుఁగు యోధు । డల్పునిఁ జేరిన
మార్పుచేత బుద్ధి ! మరిగి తిరుగు
మ్రాను మ్రానుఁ దిరుగు । మహిఁగోఁతికైవడి ॥వి॥ 369

వైపద్యం యిదీ ఒక్కటే భావంకలది. "సహవాసదోషేణగుణే భవేత్తను" సూక్తి నిట వేమన వాడెను.

కం. ఆలవఁగల సౌఖ్యములకు
నాలయమగునేని దాని । నాలన వచ్చు
న్నాలాగున గాకుండిన
గాలుని యమదూత యదియె । కదరా ! వేమా ! 370

భార్య భార్యా లక్షణాల లేనప్పుడు యమదూత కంటె అధికం

ఆ. ఆలిఁ దోలి వెంట । నధముఁడై తావెన్క
నేలఁ బోవుటెల్ల । నెడ్డెతనము
చెట్టు ముదరనిచ్చి । చిదిమినఁబోవునా ? ॥వి॥ 371

భార్యనుముందు పంపించి వెనుకపోయినభర్తను దేబెగా నిట వేమన వాడెను.

ఆ. ఆలినమ్మి భువిని । యాచారహీనుఁడై
ప్రాలుమాలె నొక్క । ప్రతిన కొఱకు
యాడి తప్ప కుండ । గాడుఁ గాచినవాఁడు
వాఁడె పరమ గురుఁడు । వసుధ వేమ 372

నీతిలో సత్యహరిశ్చంద్రుని నిజాయితీని చమత్కారముగా మెరిపించెను.

ఆ. ఆలిని మునువంచ । కథముఁడై తావెన్క
విహ్వ లుండగుటయు । వెఱ్ఱితనము
చెట్టు ముదరనిచ్చి । చిదిమినఁ బోవునా ? ॥వి॥ 373

374 పైపద్యభావమిట నిరూపించెను.

*ఆ. ఆలి నొంచలేక । యధమత్వమున నుండి
వెనుక వంతు ననుట । వెఱ్ఱితనము
చెట్టుముదరనిచ్చి । చిదిమిపోవునా ? ॥వి॥ 374

* 375 పద్యభావమే మూడవచరణంలో మార్పేలేదు

*ఆ. ఆలిఁబిడ్డలజంపి । యడవిజేరుట పొద్దు
యడవిఁ జేరినవెనుక । యాశలుడుఁగు
యాశ లుడుగిన వెనుక । యాత్మసుఖపడునయా ॥వి॥ 375

* ఈపద్యంలో గణాలు తప్పినవి — సీసపద్యపాదములో ఉన్నవి.

ఆ. ఆలిమాటలువిని । యన్నదమ్ముల రోసి
వేరు పడెడువాఁడు వెఱ్ఱివాఁడు
కుక్కతోకఁబట్టి । గోదావరీదునా ? ॥వి॥ 376

మనపూర్వ సంప్రదాయముల పాకొన్నాడు

ఆ. ఆలి ఱంకు దెలుప । నఖిల యజ్ఞంబులు
తల్లిఱంకుఁదెలుపఁ । దద్దినములు
కాని తెఱవ కర్మ । కానఁగల్పితమాయె ॥వి॥

పైళాం బెల్లం, తల్లివిషంగా ప్రయోగించెను

ఆ. ఆలి వంకవార । లాత్మబంధువులైరి
తల్లివంక వారు । తగిన పాటి
తండ్రి వంకవారు । దాయాది వర్గమా ॥వి॥ 378

ఇది లోకసహజము. వేమన స్వానుభవముగా లోకజ్ఞానమును గుర్తించుటలో సాటిలేనివాడు.

ఆ. ఆలి సిగ్గుచెఱుచు । నగణి తార్థములందుఁ
దల్లి సిగ్గుచెఱుచుఁ । దద్దినమున
కర్తచేయుఁ గర్మ । కాండంబు గల్పించు ॥వి॥ 379

అగణి తార్థములు = అతీతవిషయములు ; తద్దినము=పితృకర్మ

ఆ. ఆలి సిగ్గుఁజెఱుచు । యఖిలయర్థములందు
తల్లి సిగ్గుఁ జెఱుచు । తద్దినమున
కాకు చేయుకర్మ । కాండంబుఁగల్పించు ॥వి॥ 380

పై పద్యాభావమే నిట వాడెను.

కం. ఆలు పతి సౌఖ్యములకిల
నాలాయంబైన దాని । నాలనఁదగుఁ దా
నాలాగునఁ గాకుండినఁ
గాలుని పెనుదూత గదర । కదియఁగ వేమా ! 381

భార్యాభర్తల పరస్పర సుఖము గనినదే ఆలి. లేకున్న కాలుని దూత. కాలుడనగా యముడు.

ఆ. ఆలు పరసుఖమున । కాలయమై యుండ
నట్టిదాని నాల । నంగరాదు
కీలుఁ దెలియ కున్నఁ । గాలునిపెనుదూత ॥వి॥ 382

యిహపర సుఖములు రెంట గల్పించినదే భార్య

ఆ. ఆలు బిడ్డఁగల్గి । యధిక సంపద గల్గి
భజనసేయ రీతు । భక్తిలేక
భజన సేయనతఁడు । భక్తుండుఁగాడయా ॥వి॥ 383

భజనల ప్రశంసించెను,

ఆ. ఆలుఁ బిడ్డలు ధన । మరయుఁ దల్లియుఁ దండ్రి
కల మనుజుఁడు మిగులఁ । గష్టపడును
తనకు నెవ్వరులేరు । తాను బ్రహ్మముఁ గన్న ॥వి॥ 384
తన ఆప్తులు ఇహమునకే ! పరమున బ్రహ్మము పనికి వచ్చును.

ఆ. ఆలు బిడ్డలనుచు । తి । మోహమున నున్న
ధనము మీఁదవాంఛ । దగిలియున్న
* నట్టి నరులకెల్ల । నవని ముక్తిలేదు ॥వి॥ 385
పాఠాం :— యట్టివానిముక్తి। యవనిలో లేదయా !
తాపత్రయము అనగా యీషణత్రయములు. ధనేషణ, దారేషణ, పుత్రేషణ

ఆ. ఆలు మగని మాట । కడ్డంబు వచ్చెనా ?
యాలుగాదనుమటి । వ్రాలుగాని
యట్టి యాలి విడిచి । యడవినుండుట మేలు ॥వి॥ 386
గయ్యాళి భార్యతో కాపురముకంటే ఆకులుదిని అడవినుండుట సుఖమని తన లోకానుభవమును చిత్రించెను.

ఆ. ఆలు మగఁడుఁ గూడి । యల్లర్లు సేయఁగాఁ
గారినదిను సెల్ల । జేరఁబట్టి
బూతనాక మహిని । బుచ్చుక తినరటో ॥వి॥ 387
శుక్లశోణితం కలయికగా నేర్పడినబిడ్డను బూతుతీరినట్లుగా ముద్దులాడుదురు.

ఆ. ఆలు మగఁడుఁగూడి । యానంద మందిన
మేలు సుతుఁడుపుట్టి । జాలిఁ గడపు
వీలుపొంచి మించి । విడలేరు భువిలోన ॥వి॥ 388
పుత్రప్రేమ విడువలేనిదిగా వాడెను.

ఆ. ఆలు మగఁడు సుతుఁడు । నందటిలో నాత్మ
మేలుగానె యుండి । మెఱయుచుండు
వేలు వేలుగాను । వెలసె రూపంబులై
భూత గణములెల్ల । భువిని వేమ. 389
“ ఏకోనారాయణో హరిః” సూక్తిని అనుసరించెను.

ఆ. ఆలు రంభయైన । నతి శీలవతియైన
జారపురుషుఁడేల । జాడమాను
మాలవాఁడు గుక్క । మఱిగిన చందంబు ॥వి॥ 390

అలవాటుపడిన అభిప్రాయములు మార్చుకొనుట కష్టముగా వేమన నీతిని బోధించెను.

ఆ. ఆలు రంభయైన । నతిశీలవతియైన
జాడలేల మాను । జారపురుషు
పాలు ద్రాగుకుక్క । పరుగుకుతాళదా ! ॥వి॥ 391

పైభావమే గాని పైపద్యముకన్న యిందులో శ్రావ్యముగా వాడెను.

ఆ. ఆలు సుతులు ధనము । లరయంగ నీవని
మోహామునను జిక్కి । మోసపోకు
కాలుఁ గన్న యప్పుఁడు । కనలేక చెడుదువు ॥వి॥ 392

ఇహభోగము లనిత్యము లని బోధించెను.

ఆ. ఆలు సుతులు మాయ । యన్నదమ్ములు మాయ
తల్లి దండ్రి మాయ । తాను మాయ
తెలియనీదు మాయ । దీనిల్లు పాడాయ ॥వి॥ 393

మాయయొక్క మహత్తును వర్ణించెను.

ఆ. ఆలోకమున నుండె । యానందమే వేఱె
భూలోకమున నుండె । బుద్ధి వేఱె
మాలోకమున నుండె । మాటలే వేరురా ! ॥వి॥ 394

ఆలోకము = సత్యలోకము, భూలోకము = సంసార సంబంధమయినది, మాలోకము = తెలివితక్కువ.

ఆ. ఆవుచన్ను పితికి । యాపాలు గాచినఁ
జేరి పెరుగు, చల్ల । పేరులగును
తవిలి లోనపుట్టె । నవనీతగుణమును ॥వి॥ 395

మనస్సులోఁగలిగిన జ్ఞానమువలన విజ్ఞానము దానివలన బ్రహ్మజ్ఞానము కలుగును

ఆ. ఆవుపాలు శివున । కభిషేక మునకౌను
యావుపాలు జూడ । నౌషధంబు
యావుపాలు నున్న । యతిశయ మెఱుఁగుఁడీ ॥వి॥ 396
"గోబ్రాహ్మణ సంరక్షణార్థ మిదంశరీరం" అను శ్రుతిలో గోప్రాధాన్యత, పవిత్రత వచించబడెను. దానిపాలుపవిత్రమని వేమన భాష్యం.

ఆ. ఆశకన్న దుఃఖ । మతిశయంబుగ లేదు
చూపు నిలుపకున్న । సుఖములేదు
మనసు నిలుపకున్న । మఱి ముక్తిలేదయా ॥వి॥ 397
ఇది సహజోక్తి.

ఆ. ఆశ కోసివేసి । యనలంబు చల్లార్చి
గోచి బిగియఁగట్టి । గుట్టుఁదెలసి
* నిలచిన నతఁడయ్యె । నెఱయోగియొంద్రైన ॥వి॥ 398
* పాఠా :— యాసవిడిచె నేని నతఁడు దాయోగిరా
నెరయైన=సిసలైన, అనలము= అగ్ని.
కోపము త్యజించి ఆశను విడనాడి ఉత్తమయోగి కమ్మని వేమన సువాక్కు.

ఆ. ఆశ గనని వాని । నాశ్రయింపఁగ రాదు
యాశఁదీర్చువాని । నడుఁగ వలయు
యాశగలుఁగునాతఁ । డమలుండుగాఁడయా ॥వి॥ 399
లోకాచారమిటు వాకొనెను.

ఆ. ఆశచేత ధనము । నార్జింపఁ గానేల ?
మట్టిక్రింద బెట్టి । మఱువ నేల ?
ధనముపోవు వెనుక । ధర్మంబుఁ దలఁతురు ॥వి॥ 400

ఆ. ఆశచేత మనుజు । లాయువుఁ గలనాళ్ళుఁ
దిరుఁగు చుంద్రు భ్రమలఁ । ద్రిప్పలేక
మురికి భాండమందు । ముసురు నీఁగలభంగి ॥వి॥ 401

కం. ఆశను విడువని జీవికిఁ
గ్లేశము విడిపింపఁ । దరమె కేశవునకు నా

యాశాపాశము లెల్లను
* రోసినఁ గ్లేశంబు విడును । రూఢిగ వేమా ! 402
* ప్రాస సరిపోదు

ఆ. ఆశ, పాశలు మొదలు । లంటఁగా గోసియు
* పారవేయ కుంటె । ఫలము గలదె ?
♦ కొక్కు పేలలకునుఁ । జిక్కి చచ్చినరీతి ॥వి॥ 403
♦ పాఠాం :- కొక్కు బోనులోనఁ । జిక్కి చచ్చిన రీతి
* సీసపద్యపు నడక గానున్నది.

ఆ. ఆశ పాపజాతి । యన్నిఁటి కంటె నా
యాశ చేత యతులు । మోసపోరె ?
చూచి విడచువారు । శుద్ధాత్ము లెందైన ॥వి॥ 404

ఆ. ఆశపాశ మెల్లఁ । గోసివేసినవాని
చిత్త మెపుడు గురునిఁ । జేరియుండు
మోహ పాశమున్న । మోక్షంబు దొరుకునా ?॥ వి॥ 405

తే. ఆశ పాశముఁబట్టింతు । రాలుసుతులు
గాసి పడనేలఁ గూఁటికే । గడప లాడు
శోక మందినఁ గాలుండు । తాకివిడఁడు
పాశ మెడఁగిన గురుభక్తి । పదిలమగును
విమలగుణరాజ ! యోగీంద్ర । వేమనార్య ! 406
వేమన తన్ను తాను సంబోధన చమత్కారముగా వాడెను.

ఆ. ఆశయనెడి త్రాఁటి । నఖిల జంతువులెల్ల
గట్టవడెనుఁ గాని । నిట్టలమున
జ్ఞాన మనెడు ఛురియఁ । బూని కోయఁగలేక ॥వి॥ 407
ఛురియ = కత్తి.

ఆ. ఆశ యనెడుదానిఁ । గోసివేయఁగలేక
మోసబుద్ధి వలన । మునిఁగినారు
కాశివాసులైనఁ । గనఁబోరు మోక్షంబు ॥వి॥ 408
ఈశ్వరుఁడైనా ఆశనువిడక ముక్తిప్రదుఁడు గాఁ జేరఁడని హేవాటముచే నూటిగా చెప్పెను.

కం. ఆశయె యిహపర సౌఖ్య వి
నాశము భవబంధములకు । నైరృతి తానై
యీశునిఁ గనుగొననీయదు 409
యాశ వినాశంబె పరమ । దవనిని వేమా!

ఆ. ఆశలఁ దెగఁగోసి । యనలంబుఁజల్లార్చి
గోచి బిగియఁబెట్టి । కోప మడఁచి
గుట్టు మీరువాఁడు । గురువుకు గురువురా ॥వి॥ 410
గురువుకు గురువు = బ్రహ్మస్వరూపుడు.

ఆ. ఆశ లనెడు త్రాళ్ళ । నఖిల జనంబులు
కట్టువడియు ముక్తిఁ । గానలేరు
జ్ఞాన ఖడ్గమునను । ఖండింపలేరయా! ॥వి॥ 411

ఆ. ఆశలనెడు త్రాళ్ళు । నమరఁ గోయఁగఁ జేసి
పారవైవఁ గాని । పరములేదు
కొక్కు తిండియాసఁ । జిక్కి చచ్చినయట్లు ॥వి॥ 412

ఆ. ఆశ విడకఁగాని । పాశ ముక్తుఁడుగాఁడు
ముక్తుఁడయినగాని । మునియుఁ గాఁడు
మునికిగాని సర్వ । మోహంబు లూడవు ॥వి॥ 413

ఆ. ఆశ విడక కాని । పాశముక్తుఁడు కాఁడు
కాఁడు ముక్తుఁడైనఁ । గాని మృతుఁడు
మృతిని బడయ కున్న । క్షితిమోహమూడదు ॥వి॥ 414

ఆ. ఆశ పీడకున్న పాశముక్తుఁడుగాఁడు
ముక్తుఁడైనగాని । మునియుఁగాఁడు
మునియునైన గాని । మోహంబు లుడుగవు ॥వి॥ 415
పై మూఁడుపద్యములు సహజస్వభావం ఉట్టిపడేలాగున రచించాడు.

ఆ. ఆసనం బెఱుఁగక । యానామ కర్మంబు
గురువు చేతఁ దెలిసి । కూర్పకున్న
మనసు నిలుపకున్న । మఱి ద్విజుం డెట్లగు ? 416

మూర్ఖుఁడు గురుముఖముగా తెలియక యోగాభ్యాసము చేసిన పాడగును. కాని స్వస్తిక, గోముఖ, పద్మ, భద్ర, సింహాద్యాసనములను గురుముఖముగా తెలిసి ఏకాగ్రచిత్తముతో ఈశ్వరు ధ్యానించనిదే బ్రాహ్మణుడు కాడు.

ఆ. ఆసనములు పన్ని । యంగంబు బిగియించి
యొడలు విఱుచుకొనెడు । యోగ మెల్లఁ
జెట్టి సాముకన్నఁ । జింతాకుతక్కువ ॥వి॥ 417

యోగులమని కుక్కుటాద్యాసనములు వేసికొని పరుల బ్రమింప ఒడలు విరచే వారు వీధిమధ్య కుస్తీలుపట్టు మల్లులకంటె చింతాకంత తక్కువవారేయని వేమన తేలికగా జెప్పెను.

కం. ఆసనము లనేకంబులు
వాసిగ భువియందుఁబఱఁగు । స్వస్తికమును, వీ
రాసనము గోముఖంబును
కాసము జర మృతియుఁ బోయు । క్రమతన వేమా ! 418

ప్రధానములైన ఎనుబదినాల్గాసనములలో 1 స్వస్తికము, 2 గోముఖము, 3 పద్మాసనము, 4 వీరాసనము, 5 సింహాసనము, 6 భద్రాసనము, 7 ముక్తా (వజ్రా) సనము. 8 మయూరాసనము, 9 పశ్చిమతాసనము. వీటివలన శరీరారోగ్యము, దార్ఢ్యముఁగలిగి రోగహరణ పాపనాశనములు సిద్ధించును.

ఆ. ఆస పాపజాతి । యైహికములలోన
యాసచేత నెవరు । మోసపోరొ ?
చూచి విడుచువారు । శుద్ధాత్ములెందును ॥వి॥ 419

ఆశనుఁదెలసి విడచినవాడె గొప్పవాడు.

ఆ. ఆసవలన జనులు । యాయుస్సుఁగలవాళ్ళు
తిరుగుచుంద్రు భ్రమలఁ । ద్రిప్పలేకఁ
మురికి కుండ యందు । ముసురు నీగలరీతి ॥వి॥ 420

ఆ. ఇంగలంబు తోడ । నిల నల్పుతోడను
బరుని యాలితోడఁ । బతితుతోడ
సరస మాడుకెల్లఁ । జావుకు మూలంబు ॥వి॥ 421

ఇంగలమనేచాప, పరస్త్రీ, దుష్టుఁడు, నీచుడు వీళ్ళు వర్జితులు.

*ఆ. ఇంగిలీకము స్థితి । నెఱుఁగ మనుజులు
చిత్తరువులు వ్రాసి । చెఱిపిరకట
బొంతజెముడుపాలు । పొంగించ నేరరు ॥వి॥ 422

* గణము పోయినది.

ఆ. ఇంగిలీక మహిమ । హేమింప నేరక
చిత్రపటము వ్రాసి । చెగచినారు
బొంత జెముడుపాలు । పొంగించనేరరో! ॥వి॥ 423

యీపై రెండుపద్యాలు రసవాద సంబంధము రసవాదమనగా బంగారము చేయు విద్య.

ఆ. ఇంచుకంత బోన । మీశ్వరార్పణమన్న
పుణ్య లోకమునకుఁ । బోవు నతఁడు
యన్న దానమునకు । నధిక దానములేదు ॥వి॥ 424

బోనము = అన్నము.

ఆ. ఇంచుకంత బోన । మీశ్వరార్పణమన్న
పుణ్యలోకములకు । బోవు నతఁడు
కర్మసూక్ష్మ ములను । గనవలె ఘనులెల్ల ॥వి॥ 425

పైపద్యములు రెండూ ఒకే ఛాయ నున్నవి.

ఆ. ఇంచుకంత సుఖమె । యీరేడు జగములు
కంచమునకుఁ * బిల్లి । కాచినట్లు?
పంచబాణు నింట । బానిస కొడుకులు ॥వి॥ 426

* పాఠాం:— బారి బడలుచు నాసింత్రు

"స్త్రీ" వాంఛ క్షణభంగురమని వేదాంతి గాన నూటిగా చెప్పెను. పంచబాణుడు = మన్మథుఁడు.

ఆ. ఇంచుకైన రోని । కేగఁడు జనములు
కంచముకడ పిల్లి । పొంచినట్లు
పంచబాణు నింట । బానిసె కొడుకులు ॥వి॥ 4

పైపద్యపు పోలికనేయున్నది.

ఆ. ఇంటిమగనిఁ జూచి । యిల్లాలు దుఃఖించి
వెంటవిటునిఁ దగిలి । వెతలఁబడును
తుంటరైన దానిఁ । దొలగింప మేలురా ! ॥వి॥ 4

ఆ. ఇంటియాలి విడిచి । యిల జారకాంతల
వెంటఁ దిరుఁగు వాఁడు । వెఱ్ఱివాడు
పంటచేను విడిచి పరిగె । యేరినయట్లు ॥వి॥ 4

పరిగ = పంటపొలములో రైతుచే విడువబడిన సస్యము

ఆ. ఇంటి యింటిలోని । యీశ్వరు నెఱుఁగక
యంటి చూడలేక యడవు లందు
నుండఁ గోర, దైవ । ముండనీయఁడు వాని ॥వి॥ 4

దేహమనే యింటిలో హృదయ కమలమందున్న యీశ్వరుని దెలిసి కొ-
న్నాఁడు.

ఆ. ఇంటి యింటి లోన । నీశ్వరుం డుండంగ
నంటి చూడలేక । యడవులందు
నుంట మేలటంచు । నుందురు జోగులై ॥వి॥ 4

జోగి = అడుక్కుతినేవాడు పై రెండు పద్యములూ ఒకే భావం

ఆ. ఇంటిలోన నున్న । యీశ్వరు నెఱుఁగక
కంటిమింటి నడుమ । గనుట యెట్లు ?
జంటబాయ నెఱుక । జాలంబు ద్రుంపరా ! ॥వి॥ 4

దేహములోనున్న ఈశ్వరు నెరుఁగక (భ్రూమధ్యమున నున్న పరబ్రహ్మ నెఱు-
కనుగొనునని ప్రశ్నార్థక మిట సూచించెను.

ఆ. ఇంటిలోన జ్యోతి । యెంతయు వెలుఁగఁగా
బొరుఁగువారి యగ్గి । కరుగనేల ?
తాను దైవ మాయె । దైవముగొలుచురా ॥వి॥ 4

"అహంబ్రహ్మాస్మి" అను మూలసూత్రము నిటసూత్రీకరించె నీయోగాధ్యుడు

ఆ. ఇంటిలోన కోఁతి । యిరవుఁ గానఁగలేకఁ
విరుగఁబోవు వారు । తీరకుంద్రు
కోఁతి నొకఁటనిల్పి । కుదురుండ లేరయా ॥వి॥ 434

మనయోగి మనస్సును కోతితో పోల్చి దానిని కట్టమని బోధించు చున్నాడు

ఆ. ఇంటిలోన ధనమె । యిది నాది యనుచును
మంటిలోన దాచు । మంకుజీవి
కొంచుఁబోఁడు వెంట । గుల్లకాసును రాదు ॥వి॥ 435

మంకుజీవి = మూర్ఖుడు, మొండి.
మనపూర్వులు ధనము భూమిలో దాచేవారు అప్పటి వాడుక పదము పాతు.

ఆ. ఇంటివారి బాసి । యినుప కాసెనుగట్టి
వంటకంబు నీరు । వదలిమించె
వంటనీరు దప్ప । వచ్చునా? తత్త్వంబు ॥వి॥ 436

గృహత్యాగియయి ఇనుపకచ్చెపములుగట్టి నీరాహారముల హరించి వాయు భక్షణచేయు యోగులకు ఒంటిచమట దక్క తక్కినది లేదు.

*ఆ. ఇంటి వెనుకఁ దీఁగ । యింగ్లీక ముండంగఁ
బారదంబుఁ గలుఁగ । బసిడి వేతె
సత్తు, పొత్తుఁ జేసి । సాధింపవచ్చురా! ॥వి॥ 437

ఆ. ఇంటివెనుఁదీఁగ । యింగిలీకంబుంట
పసిఁడికొఱకు యేల? । పాట్లుపడిరి
సత్తుపొత్తుఁజేసి । సాధింప నేరరో! ॥వి॥ 438

* గణముపోయెను. పైరెండూ కొద్దిమార్పులతో నున్నా యోగముమాత్రం ఒక్కటే. ఇది రసవాదముఁగూర్చి చెప్పినది.

ఆ. ఇంత కాలముండి । యెఱుక మాలినజీవి
చచ్చిపుట్టు చుండు । సహజమనుచు
నెఱుక మరచుచోట । నెఱుగునా బ్రహ్మంబు ॥వి॥ 439

విజ్ఞానము మరచిన సుజ్ఞానము శూన్యము జ్ఞానశూన్యత పరబ్రహ్మను దెలియ నీయదు.

ఆ. ఇంత వగవ నేల । యేకాంత బుద్ధిని
హరి హరాదులందు । నాశ లుడిగి
శాంతబుద్ధి నుండ । సమకూరును సుఖంబు ॥వి॥ 440

త్రిగుణములు: సత్వ, రజ, స్తమోగుణాలను విడచి మనశ్శాంతి గలిగినవారు ముక్తినొందుదురు.

ఆ. ఇంత వగ పదేల ? । నేకాంత బుద్ధితో
హరిహరాదు లందు । నాస లుడిగి
వాసనల దెలిసిన । వాఁడెపో బ్రహ్మంబు ॥వి॥ 441

లోక వాసన దేహవాసనా, శాస్త్రవాసనా అను త్రివిధవాసనలను గుర్తించిన హరిహరాదులతో పనిలేదు. వాడే బ్రహ్మం అని స్వానుభవముగా మనవేదాంతి భాషించెను. "శూన్య భావితభావా త్మాపాపపుణ్యైః ప్రముచ్యతే' ఉత్తరగీత: సుషుప్తి కాలే సకలేవిలీనే " అనిశృతి.

"యదానంద రూపం ప్రకాశస్వరూపం నిరస్త ప్రపంచ పరిచ్ఛేద శూన్యం అహం బ్రహ్మ వృత్త్యైకగమ్యం తురీయం పరంబ్రహ్మ నిత్యం తదైవాహ మస్మి " మరియు "నమేమృత్యు శంకా నమేజాతి భేదః। పితానైవమేనైవ మాతాన జన్మ నబంధు ర్నమిత్రం గురుర్నైవ శిష్యాశ్చిదానందరూప శివోఽహం శివోఽహం"అని జగద్గురు శంకరాచార్య స్వానుభవం. సుషుప్తిలో యీసకలము ఎరిగిన తెల్వి కారణదేహమగును. అజ్ఞానాంధకారములో నణగియుండును. జాగ్ర స్వప్నంబులలో దేహేంద్రియ ప్రపంచము కనఁబడును. దీని వలన యేకాంత మనగా తురీయావస్థ యని వేమన స్వానుభవముగా చాటెను.

ఆ. ఇంతి కనులు వింత । వింతలౌ చన్నులం
చింతి గవయు వాని । నెఱఁగి తొలఁగి
సరస కరుగ నతఁడె । సర్వదా యోగిరా ॥వి॥ 442

మోక్షాపేక్షులు ముగ్ధలవలలో చిక్కరాదని నొక్కి వక్కాణించెను.

ఆ. ఇంతి కనులు, చనులు । యెంత లెస్సని చూచి
మోహ పడుచు బుద్ధి । మోసపోయి
గరిసె లోని వాని । కానలే దాయెరా ! ॥వి॥ 443

గరిసనఁగా హృదయ కుహరమై యుండును.

ఆ. ఇంతి కన్ను, చన్ను । లింతంతలనిఁ జూచి
మోహపడుచు బుద్ధి । మోసపోయి
గరిత లేనివాని । గానలేదాయెరా ॥వి॥ 444

గరిత = ముక్తికాంత

ఆ. ఇంతి చనులఁ బిరుసు । కొంతకాలమెకాని
పంతగించి చూడఁ । బాలతిత్తి
చెంత విడక యేడ్చి । చీరఁడే పుత్రుండు ॥వి॥ 445

స్త్రీల సౌందర్యాన్ని నీచంగా గర్హించెను.

ఆ. ఇంతి జూచె నేని । నింతంత యనరాదు
కాలవహ్ని లక్క । కఱఁగినట్లు
వట్టి మోహమిట్లు । రట్టులఁ జేయురా! ॥వి॥ 446

ఆ. ఇంతి తనదు పేరు । నెల్లకాలంబును
ప్రజలు తలఁచునట్టి । ప్రతిభ గాంచె
నింతి పతిభక్తి । నెంతన వచ్చును? ॥వి॥ 447

స్త్రీకి పాతివ్రత్యము విభూషణ మని దేదీప్యముగా వర్ణించెను.

తే. ఇంతి మొలగుంటపై యాస । కెదురుఁ జూచి
చింతలోఁబడి ప్రాణముల్ । చిక్కఁ బెట్టి
యంతుఁ గనలేక జచ్చెద । రవనిలోన
విమల గుణరాజ । యోగీంద్ర । వేమనార్య! 448

వేమన "కొంటెకోణంగి" వలె యిట్టి పట్టులలో నిట్టుల స్త్రీల గుట్టులు బట్ట బయలు పెట్టి తానుబిరుదు దండోరు వేసుకుంటాడు.

తే. ఇంతి యాకృతిపై యాస । కెదురుఁజూచి
చింతలోఁబడి ప్రాణముల్ । చిక్కఁబట్టి
యంతుఁగనలేక చచ్చెద । రవనిలోన
గాముకులగతి యీరీతి । గాదె? వేమ. 449

అడియాసపడి అందరాని పండ్ల కట్టులు జూచినట్లు కాముకులు కాంతల కొరకై కామించి భ్రష్టులగుదురు.

ఆ. ఇంతులఁ గనగానె । యింతింత యనరాదు
యగ్గి లక్కకఱఁగు । నైనరీతి
వెలయు మోహమిట్టి । వింతలుచేయురా ॥వి॥ 450

పురుషుడు పూబోడి స్పర్శవలన కరుగును.

ఆ. ఇంద్ర జాతమట్టు । లీ జగ ద్భ్రాంతులు
చంద్రకళలు దాఁటి । సఖ్యపడెడు
రంధ్రమందుఁ జేరి । రహిమీఱఁగాంచు, దే
వేంద్ర పూర్ణపదవి । విడక వేమ. 451

ప్రపంచ మైంద్రజాలికము. నాదు, బిందుకళలను దాటిన జ్ఞానదృష్టికి బ్రహ్మ స్వరూపము గోచరించును. అప్పుడు ఇంద్రపదవి అందినవానికంటె గొప్పవాడని మనయోగి యుద్ఘాటించెను.

ఆ. ఇంద్రపదవిఁ గోరి । యింపుగా యజ్ఞముల్
కలిమిచేతఁ జేసి । కాముఁలైరి
పరమయోగమూనిఁ । పట్టంగలేమిని ॥వి॥ 452

యజ్ఞయాగాదు లనావశ్యకములని యీసడించెను.

ఆ. ఇంద్రలోక మనఁగ । నింద్రజాలమనంగ
నింద్ర విద్యలనఁగ । నిన్నియొకటె
కలియుగమున నరులుఁ । గానరుభ్రమచేత ॥వి॥ 453

యాగముల పేరుతో భోగలాలసులు చేయుమోసములను విమర్శించెను.

ఆ. ఇంద్రలోక మైనఁ । జంద్ర లోకంబైన
నంది చూడ వచ్చుఁ । బొందుగాను
నందిమీఁద నెక్కి । నయముఁగఁజూడరా! ॥వి॥ 454

నిటలతటము యింద్రలోకము, సహస్రారము చంద్రలోకము, నంది మనస్సు ఆయి యుండవచ్చునేమో !

కం. ఇంద్రియ పరవశు డధముం
డింద్రియ పరవశుఁడె భక్తి । యెడ మధ్యముఁడౌ

నింద్రియ జయు డుత్తముఁడు, జి
తేంద్రియ సమధికుఁడు విను మ । హేశుఁడు వేమా ! 455

ఇంద్రియముల యొక్క అంతస్తులను వర్ణించి జితేంద్రియుని మహేశ్వరునితోఁ బోల్చి మన వేమన సూచించెను.

తే. ఇంద్రియ భ్రాంతిచేఁ జచ్చి । రెల్లజనులు
సుందరాంగుల వర్ణించి । కుంది, మోహ
మొంది, కడగండ్లపాల్పడి । మురియుచుంద్రు
విమలగుణరాజ ! యోగీంద్ర । వేమనార్య ! 456

శ్రీనాథాది మహాకవులు శృంగారమున సుందరీమణుల యంగముల వర్ణింపు నిట గర్హించెను.

ఆ. ఇంద్రియ జయమునను । నేకస్థుఁడై తత్వ
* మెఱిఁగి పిదప తన్ను । నెరుగఁజేని
యట్టివాని జ్ఞాన । వేత్తనియందురా ! ॥వి॥ 457

యతి తప్పినది. ఇంద్రియముల జయించలేనివాడు జ్ఞానవేత్త కాడు.

ఆ. ఇంద్రియములచేత । నెగ్గొందు చుండెడు
వెఱ్ఱిమనుజు డేల । వెదకు శివుని ?
నింద్రియముల రోసి । యీశునిఁ జూడరా ! ॥వి॥ 458

పైరెండు నొకటిగనే యున్నవి.

ఆ. ఇంద్రియముల చేష్టఁ । లెన్నక భువిలోనఁ
దన్నుఁ దెలిసి తుదిని । దమక ముడిగి
మింటిమంటి నడుమ । మిత్తినిఁదొక్కరా ॥వి॥ 459

తమకము = కోరిక, మిన్ను మన్ను = భూమ్యాకాశములు, మిత్తినిద్రొక్కుట = మృత్యువును ద్రొక్కుట.

ఆ. ఇంద్రియముల భ్రాంతి । నీరేడు జగముల
మందుఁ బెట్టినట్లు । మరులుగొనుచు
బొందు సుఖము చేతఁ । బుత్రులఁగాంచిరి
సకల జనులనిట్లు । జగతి వేమ. 460

ఇరు + ఏడు = యీరేడు అనగా పదునాలుగు లోకములు. యీరేడు లోకములలో కామము విడిచిపెట్టదని వేమన నొక్కివక్కాణించెను,

ఆ. ఇంద్రియములు విడిచి । యేకస్థుడై నిల్చి
మెఱిఁగి తన్నుఁ బిదప । నెఱుకకున్న
యతఁడె మౌని, జ్ఞాని, యానని యందురే? ॥వి॥ 461

ఇంద్రియ నిగ్రహణ మౌనత్వ జ్ఞానత్వముల నిచ్చునని వేమన చాలాబాగా చెప్పెను.

ఆ. ఇందు నెఱుఁగఁకున్న । నిహపరములులేక
ప్రాణహానికలదు । ప్రకృతియందు
ప్రళయ కాలమైనఁ । బరమాత్మఁగలయరా ॥వి॥ 462

బ్రహ్మను గుర్తింపలేనిచో ఇహపరములులేవు.

ఆ. ఇంద్రు డాయెఁగామి । హీనుడై పోయెను
మారుఁ డాయెఁగామి । మడసిపోయె
బ్రహ్మ యాయెఁగామి । బయసిపోనాడెను ॥వి॥ 463

ఆ. ఇంద్రుఁ డీహఁగల్గి । హీనుఁడై పోఁడే?
మరుఁడు నీహఁగల్గి । మన్నుఁగాఁడె?
బ్రహ్మ కీహఁగల్గి । బలుతలల్ పోయెరా! ॥వి॥ 464

పై రెండుపద్యములొకే భావముగలవి. ఇంద్రుఁడు అహల్యానాశించి అపాదమస్తకము యోనులుగలిగి కష్టములకు లోనయ్యెను. మన్మథుడు రుద్రుని కంటిమంటలచే మడచి శరీరములేనివాడాయెను. బ్రహ్మ గర్వముపొంది తలతలలను పోగొట్టుకొన్నాడు. మోహము, ఆశ, గర్వములు ఎవ్వారికిని పనికిరావని వేమన పురాణగాథావళి నిట నుత్ప్రేక్షించెను.

ఆ. ఇంద్రుఁడైనఁగాని । చంద్రుఁడైననుఁగాని
నంది, దుర్గమెక్కి । నాతితోడి
పొందుఁబడక ముక్తి । పోరాదవలెనయా! ॥వి॥ 465

మనస్సును లోబరచుకొని ముక్తికాంతను పొందమన్నాడు ఘనయోగి.

ఆ. ఇచ్చకంబుచేత । నిందీవ రాక్షులు
మచ్చరములు మాని । మగలఁజేరి
తుచ్ఛ గుణము విడక । దూఱుచు నుందురు ॥వి॥ 466

ఇచ్చకములు = ముఖప్రీతి వచనములు

క. ఇచ్చుకము లోకవశ్యము
కుచ్ఛితమే లోకనింద । కోవిదులైనన్
తుచ్ఛమున హానివచ్చును
మచ్చరమే తన్నుఁజెఱుచు । మహిలో వేమా ! 467

కుత్సితమని యుండవలయును. అట్లుండిన ప్రాసతప్పు. మత్సరము అట్టిదే !
వేమన ప్రస్తుతము మన సంఘంలోగల దుర్భమల వ్యంగ్యరూపమున నిందించెను.

ఆ. ఇచ్ఛవచ్చు నరున । కెచ్చువైష్ణవమిచ్చి
ద్విజులకన్న దొడ్డ । తీరటంచు
నెల్లచోట్ల కరిగి । పల్లాండుఁ బాడరే ॥వి॥ 468

వైష్ణవమతము ఏజాతివారైనను స్వీకరించి బ్రాహ్మణులకంటె అధికులమని చెప్పుకోవచ్చును. "అల్లాడం పల్లాడం" అనేపదం అరవంలో వున్నది. దీని అర్థ మందర మొక్కుచేయని భావం. వేమనయోగి వైష్ణవమతాన్ని పరిహాసించాడు.

ఆ. ఇచ్చినొచ్చు టేల ? । నిల భోగభాగ్యముల్
వచ్చి పోవుచుండు । వాంఛదీఱ ;
చచ్చినట్లు నరుఁడు । శత్రుఁడై సాధించు ॥వి॥ 469

ఆ. ఇచ్చి పుచ్చుకొన్న । హితమైన మనుములు
తగ్గులేక యల్లు । తామరవలె
కాచి, పూచి, పండి । కడురమ్యమై యుండు ॥వి॥ 470

మను వనఁగా పెండ్లింట్ల సందర్భమున వాడబడునది. అల్లుతామర = పెన వేసుకొనే తామర, తామర తంపర = ఎక్కువ అభివృద్ధి గాంచుట

ఆ. ఇచ్చువాని కంటె । నింద్రియ నిగ్రహుం
డఱయగ తనకంటె । నధిపుఁడగుచు
వాఁడు వానికంటె । పీడును పాపముల్ ॥వి॥ 471

దాతకన్న జితేంద్రియుడు ఘనుడని వేమన నొక్కిచెప్పెను.

ఆ. ఇచ్చువాని కంటె । నింద్రియ నిగ్రహుం
డతని కంటెఁ జాల । నవని మఱచు

వాఁడు వాని కంటె । వీడిన పుణ్యపా
పముల మతిని సముఁడు? భవుఁడు వేమ. 472

పై రెండూ కొద్ది మార్పులతో వాడెను.

ఆ. ఇచ్చువాని యొద్ద । నీని వాఁడుండిన
చచ్చుఁగాని యీవి । సాగనీఁడు
కల్పతరువు క్రింద । గచ్చచెట్లున్నట్లు ॥వి॥ 473

యీవి = ధర్మము చేయుట
కల్పతరువు = కోరిన కోరికలిచ్చే స్వర్గలోక వృక్షము.

కం. ఇచ్చెడి వారల సంపద
హెచ్చెడినే కాని, లేమి యెట్లు కలుగురా!
యచ్చెలమ నీరుఁ జల్లిన
విచ్చలవిడి నూరుచుండు । వినరా వేమా! 474

చలమ = ఏటిలో తీయబడిన గుంట

ఆ. ఇట్టి కనుల బ్రహ్మ । మెట్టు చూడఁగవచ్చు
జూచు కనులు వేరు । చూపు వేరు
చూపులో ననుంచి । చూడంగ వలవదా! ॥వి॥ 475

బ్రహ్మను బాహ్యనేత్రములు గననేరవు. అంతర చక్షువులు జూచును.

*ఆ. ఇట్టి కనుల బ్రహ్మ । మెట్టుఁ జూడఁగవచ్చు
జూచుకనులు వేరు । చూడ్కి వేరు
చూపులోన మరచి । చూడంగవలెనయా! ॥వి॥ 476

* అంతర చక్షువులతో అభిముఖచూడ్కి పరబ్రహ్మను జూడవచ్చునని వేమన అందంగా చెప్పెను.

ఆ. ఇట్టి ఘటములోనఁ । బెట్టినజీవినిఁ
గానలేక నరుఁడు । కాశికేగి
వెదకి, వెదకి యతఁడు । వెఱ్ఱియై చెడిపోవు ॥వి॥ 477

ఘటము = శరీరమనే కుండ

ఆ. ఇట్టితనువు గలిఁగి । యీలోకమందును
బుట్టి, చచ్చు, భ్రమను । గట్టిగాను ;
తెట్టతెరువుఁ జేరి । తెలివంటిచూడరా ! ॥వి॥ 478
తెట్టతెరువు = బట్టబయలు తెలివంటి = జ్ఞానమును పొంది.

ఆ. ఇట్టి పద్య పంచ । కైష్యముఁదెలిసినఁ
బెట్టి, పుట్టి, కట్టి । పృధివిఁ బదికి
చచ్చి శుద్ధుఁ డగుచు । సర్వజ్ఞుఁడై నిల్చు
నెల్లమహిమ నీకుఁ । జెల్లువేమ. 479
తాను చెప్పే అయిదు పద్యాలలోని విజ్ఞానమును అయిదంతస్తులలో దెలిసి
గొనిన ముక్తినొందును.

తే. ఇట్టియోధాను యోధులై । యిలనుబుట్టి
గట్టిగానుండు వేళను । గడచిరపుడు
మండలంబులు గానక । మరచిరంతఁ
దెలసి నడచిన వాగెవో । వీరువేమ. 480
* యతి తప్పినది.

ఆ. ఇట్టి యౌవనమున । నీశ్వర ధ్యానంబు
కలిగి చేయ వలయుఁ । గడఁకతోడఁ
జేయకున్న యెడలఁ । క్షితి సౌఖ్యమేదయా ? ॥వి॥ 481
కడక = పూనికతో, పట్టుదలతో.

ఆ. ఇట్టి లింగమందు । నీరేడు జగములు
పుట్టిబ్రదుక నరులు । భువినిఁ దెలసి
గట్టిగా యమునికిని । గాధుకులై యుండు
రవని జనులు నెప్పు డవుర ॥వేమ॥ 482
పదునాలుఁగు లోకములందునూ ఉన్నవారు యమునిచేతిలోని వారగుదురు.
లోకములు పధునాల్గు అందులో ఊర్ధ్వలోకములు ఏడు :- 1 భూలోకము
భువర్లోకము. 3 సువర్లోకము. 4 మహర్లోకము. 5 జనోలోకము. 6. తపోలోకము
సత్యలోకము.
అధోలోకములు ఏడు :- 1 అతలము, 2 వితలము, 3 సుతలము, 4 రసా
ం. 5 మహాతలము. 6 తలాతలము. 7 పాతాళము,

ఆ. ఇట్టి సాధు విద్య । యెంతలేదని చూచి
గాథవిద్య నేర్చి । కానలేక
సాధు సజ్జనముల । సాంగత్యమెఱుఁగక
బాధపడుదురు, తుదఁ । బరులు వేమ.

"సాధుసంగంబు సకలార్థసాధనంబు" గా చెప్పెను.

కం. ఇటునటు పుట్టిన ఋషులకు
బటుతరముగఁ బుట్టినట్టి । బాపనవారల్
దిటమగు బ్రహ్మము నెఱుఁగక
నటియించిన ముక్తిలేదు । నయముగ వేమా!

కం. ఇటువంటి ఋషికులంబున
పటుతరముగఁ బుట్టినట్టి । బాపనవారల్
కుటిలంబుఁ గానలేకను
యెటు బ్రహ్మకులంబనంగ యమరునె వేమా!

బ్రాహ్మణజాతిలో పుట్టినంతమాత్రమున బ్రహ్మత్వమును తెలిసితిమని వారిని గురించి వేమన యిచ్చట వాకొనెను.

"జన్మనాం జాయతే శూద్రః కర్మణాం జాయతే ద్విజః" అని అసలు "ద్విజ" రెండు పుట్టువులని తెలిసికొని బ్రతుకవలయును.

ఆ. ఇడని వానిచేత । నిప్పించుఁ దనప్రాప్తి
యిచ్చువానిచేత । నీయనీదు
యియ్యఁ బుచ్చుకొనఁగ । నిరువురుకర్తలా! ॥వి॥ ౪

ప్రతివిషయమూ మనిషి అదృష్టమునుబట్టి వచ్చునని వేమన సూత్రీకరించెను.

కం. ఇడ పింగళనాడులకు
నడుమ సుషుమ్నము వెలుంగు । నడయోగాడంగా
గడుదుస్తర మదిగన్న నా
నడుమనె యినచంద్రుహాపుల । నగరము వేమా! ౪౬

సూర్యనాడీ చంద్రనాడీ మధ్యనుండునదే సుషుమ్ననాడి. యీమాటికి కయే త్రికూటస్థానమనబడును. యీ త్రికూటస్థానములోనే పరంజ్యోతిని నగును.

ఆ. ఇతర చింతలన్ని । వెతలని మదినెంచి
జతుకమంటిరీతి । జగము మఱచి
సతత మాత్మ యందె । సయ్యాట లాడరా ॥వి॥ 488

జతుకము = లక్క

లోకచింతలలో మనుజుడు లక్కవలె అంటీ అంటకయున్న ముక్తికలుగు నని వేమన సూక్తి

కం. ఇతరాపేక్షలు గోరక
సతతము గురుభక్తియుక్తి । సారము గనకే
గతియగు బ్రహ్మానందము
మతికింపుగఁ దోఁపఁబోదు । మహిలో వేమా! 499

అన్నిటికంటె గురు బోధనయే గొప్పగా నిరూపించెను.

కం. ఇది నాకుఁ జాల దనుచును
మదిలోఁ దానెపుడు దలఁచి । మమతఁ గనుమతిన్
బొదలుచు విడువం జాలని
దదియే సంసారబీజ । మనఁబడు వేమా! 490

ఆత్మాశయే సంసారబీజము

కం. ఇదినాకు నలవ దనుచును
వదలక మదిలోననైన । వస్తువు భ్రమతన్
కదిసి విడనాడ కుండిన
నదియే సంసార బీజ । మందురు వేమా. 491

పై భావమే ఇట సూచించెను.

కం. ఇది యది గానిది మదిలోఁ
జెదరని గుఱితోడఁజూచి । చేపట్టి కనన్
గదలకఁ మొదలక తోఁచెను
విదితంబే? దంతుఁ బెనఁగి । వెలయును వేమా. 492

బ్రహ్మస్వరూపము లక్ష్యశుద్ధితో జూడుము.

ఆ. ఇదియు పరమటంచు । నితర చింతల విడి
మనసు చెదరనీక । మట్టుబెటి

సత్సమాధి నోలలాడుచుండెడు నతని యోగీంద్రుఁడని చెప్పవచ్చు
వేమా ! 497

తన స్వచరిత్రనిట వ్రాసెను.

ఆ. ఇన్ని జాతులందు । నేజాతి ముఖ్యమా
నెఱుక గల్గువారె । యెచ్చుగారె
యెఱుక లేనివార । లేజాతియన్నను
* మాలకంటెఁ జెడుఁగు । మహిని వేమ. 498

పాఠాం :— హీనజాతియంచు । నెఱుఁగువేమ.

* పరిపూర్ణమును దెలసిన వాడే నిజమగు జాతివాఁడు మిగిలిన అష్టాదశజాతులు కల్పితములే అని వేమన వాడెను.

18. జాతులు:_ 1. బ్రాహ్మణ, 2. క్షత్రియ, 3. వైశ్య, 4. శూద్ర, 5. వ్యవహారిక, 6. గోరక్షక, 7. శిల్పక. 8. పంచాణ, 9. కుంభకార, 10. తంతుకార, 11. క్షౌరక, 12. రజక, 13. వస్త్రచ్ఛేదక, 14. చర్మకారక, 15. తిలఘాతక, 16. లుబ్ధక, 17. చండాల, 18. మాతంగ యీ అష్టాదశకులములు వాడెను వేమన.

ఆ. ఇన్ని నాళ్ళనుండి । యెనసిన మోహంబు
చెలిమి చుట్టరికము । చెల్లె, లక్క-
తల్లి, దండ్రి, బిడ్డ । దాయాదులను నిట్టి
భ్రాంతిచేతఁ జిక్కి । పడర వేమ. 499

ఆత్మీయులయందు భ్రాంతి పడుట మోహ మన్నాడు.

ఆ. ఇన్ని ఫలము లందు । నేఫలంబెక్కు-వ ?
యన్న ఫలముకంటె । నధిక మేది ?
కన్న దిఁకఁ గననిది । కాన్పించు నారూపు ॥వి॥ 500

అన్ని ఫలములకంటె ఆత్మజ్ఞానఫలముల ప్రశంసించెను.

చిత్రపదము. ఇనుమమునఁజేసిన । మైనపుకడ్డి
యింటివెనుక । నట్టావులదొడ్డి
యవిటికి మేపిన । కుందురుగడ్డి
విప్పిచెప్పరా । వేమారెడ్డి. 501

పాఠాం :— ఇనుమునఁజేసిన । మైనపుకడ్డి
మింటిమీన, నన, ట్టావులదొడ్డి

కూర్చుండి వేసిన । కుందనకడ్డి
విప్పిచెప్పరా । వేమారెడ్డి. 502

యీరెండును చిత్రపదములుగా జానపదగేయములు. పదములువేరైనా భావము ఒక్కటే. ఇందు బంగారము చేయు విధానముందని వేదాంతులంటున్నారు.

ఆ. ఇనుము విఱిగెనేని । యినుమాఱు ముమ్మాఱు
కాఁచి యతుకనేర్చుఁ । గమ్మరీఁడు
మనసు విఱిగెనేని । మఱియంటనేర్చునా ? ॥వి॥ 503

ఆ. ఇమ్ము దప్పువేళ । నెమ్మలన్నియుఁ దప్పుఁ
గాలమొక్కరీఁతి । గడపవలయు
విజయుఁ డనువు దప్ప । విరటునిఁ గొలువఁడా ॥వి॥ 504

శుభదినములు దప్పినపుడు శుభాశయములు పోవును.; ఎట్లనఁగా అర్జునుఁడు కాలగతిని పేడిగా విరటుని గొల్చెను.

ఆ. ఇయ్య నతనిచేత । నిప్పించుఁ దనప్రాప్తి
యిచ్చువానిచేత । నీయనీదు
యియ్యఁగొన్న కొనంగ । నీశ్వరుఁడే కర్త ॥వి॥ 505

ప్రాప్తి అనగా అదృష్టము. అన్నిటికీ ఈశ్వరుడే కర్త యను మూఢ భావములను వేమన పరిహసించెను.

ఆ. ఇయ్యఁ బుచ్చుకొనఁగ । నింపొందు పాణి యా
నయిన నటులఁజేయ । నలవి గాదు
మనసుఁగాన నిలను । మరియొక్కరును లేరు ॥వి॥ 506

కొన్నిట ఈశ్వరుడు గూడ చేయలేని కార్యములు మనస్సు ఏకాగ్రతతో సాధించును అని వేమన మానసిక శక్తి గొప్పతనము ప్రశంసించెను.

తే. ఇరవుఁగనుఁగొని పరమార్థ । మెన్నఁగోరి
పరమ నిర్గుణపు బయటఁ । బ్రాకి నిలిచి
తన్మయంబున మది నిల్పి । తనరు యోగి
శాశ్వతసుఖంబు నొందును । సతము వేమ. 507

నిర్గుణబ్రహ్మోపాసకుఁడగుయోగి శాశ్వత సుఖి యగునని సూత్రీకరించెను.

ఆ. ఇఱుకు వచ్చు వేళ । నీశ్వరుఁదలచినఁ
గరుణఁగనునె ? వట్టి । గాసిగాక
సుఖము వచ్చువేళఁ । జూడంగలేరయా ! ॥వి॥ 508

ఇఱుకు = కష్టము, గాసి = వృథా.
సుఖమున మేమే అని కష్టమునయీశ్వరుఁడని మూర్ఖులందురు.

ఆ. ఇరుగు పొరుగులందు । నిమిడికతోనుండి
తనకుఁ దానె మొదలి । తలఁపుఁ జూపి
ధర్మ మన్న యెఱుక । తన్నుఁ దాఁ బొడఁజూపు
కర్మఫలము వలనన । గలిగి వేమ. 509

తన నిరంతర కృషి ఫలితంగా చివర పొందగలిగే యానందము బొందుమనని వేమన స్వానుభవమిట చిత్రించెను.

ఆ. ఇరుగు పొరుగు వారి । కైనయు సంపదఁజూచి
తనకు లేదటన్న । ధర్మమేమి ?
* ధర్మ మన్న తొల్లి । తన్నుకఁ జచ్చిరి ॥వి॥ 510

పాఠా :- "కర్మఫలమువలన । గలుగువేమ."
పెరవారి కున్నదని మొరపెట్టుక చచ్చిన లాభం లేదని ధర్మమంటే న్యాయమని వాకొన్నాడు మనకవి.

కం. ఇరుమూఁడక్షర సాధన
పరుఁడగు నిర్వాతదీప । పద్ధతి మదిలో
గుటి మీఁటి బయలు సేరిన
నిరుపమ సానందమూర్తి । నిత్యుఁడు వేమా ! 511

పంచాక్షరి అనగా "నమశ్శివాయ" మంత్రమే. అది పఠించిన వారికి ఆనందం కలుగునని ఉద్బోధించెను.

కం. ఇరువది యారవ తత్త్వం
దరయఁగ జీవాత్మనెలవు । యలపరమాత్మ
న్నిరవందఁ గూర్చు గురుపద
మరయంగా నందుయోగి । యందురు వేమా ! 512

26 తత్త్వములు :— భూతములైదు, తన్మాత్రలైదు, కర్మేంద్రియములైదు, జ్ఞానేంద్రియములైదు, మనస్సు, అహంకారము, బుద్ధి, ప్రకృతిపురుషు లైదు, గురువులో "గురుర్ గీష్పతౌ శ్రేష్ఠే గురుర్ పితరిమున్భః" అని గురువుశబ్దనిర్వచనము,

ఆ. ఇలను జ్ఞానమనెడి । యీాతనేర్చినవాఁడు
జలధి యనెడు తమము । జడియక విడి
విలయ మనెడి గట్టు । వెఱవక దాఁటురా ॥వి॥ 513

అజ్ఞానమనే జలధిదాటుటకు సుజ్ఞాని యీాతనేర్చిన ప్రళయ మనే గట్టు భయము లేకుండా దాటవచ్చునని వేమన గొప్పగ చెప్పెను.

ఆ. ఇలను శూద్రుఁడౌట । నెఱుఁగరు మొదలను
మనసు లతని మీఁద । మరులుకొల్పి
కొల్వఁగారె ద్విజులు । కోటానుకోట్లెల్ల ॥వి॥ 514

ఆ. ఇలను శూద్రుఁడౌట । యెఱుగరో! వేముని
మనసు నతనిఁజోడ । మరులుకొనియె
కొలిచిరి ద్విజులెల్ల । కోటానఁగోట్లై. ॥వి॥ 515

శూద్రశబ్ద తద్భవము శూద్రశబ్దముగాని జ్ఞానముచేగాంచిన సర్వమూఒక్కటే!

ఆ. ఇల మిషలనుబన్ని । యేమేమి చెప్పినఁ
గలుగఁబోదు పరము । కపట ముడిగి
వెలయు మనసుఁబట్టి । వేడ్కచేఁచూడరా! ॥వి॥ 516

మనసే ప్రధానము. యితరమాటలు పనికిరావు

కం. ఇలమూఁడుదార్లు కూడిన
తలవాకిటి యింట మూరు । తంబులతోడన్
యల మూఁడొక్కటి తావున
కలఁగని చూడంగ శివుఁడు । కలఁడుర వేమా! 517

గంగా, యమున, సరస్వతీకలయుచోటున పంచప్రాణములతోగూడిన ఇళా ంగళా, సుషుమ్నా యనుస్థలమున అంతరదృష్టిని గనిన పరమాత్మగోచరించును.

ఆ. ఇల్లు కల్లజేసి । యిహము పరముఁజేసి
దీనవృత్తిచేతఁ । దిరుగుచుండి
భక్తిగలిగియున్న । ఫలమెట్లులేదయా! ॥వి॥ 518

యదార్థమిట నిరూపించెను.

ఆ. ఇల్లు కొల్లఁ జేయ । రిహపరములఁజూచి
దీనవృత్తిచేతఁ । దిరుగుచుండ్రు
భక్తికల్గియుండి । ప్రాజ్ఞులౌసజ్జనుల్ ॥వి॥ 519

కొల్ల=ఏమియులేకపోవుట.

ఆ. ఇల్లు గట్టఁగనిచ్చు । యిల్లుదూరఁగనిచ్చు
ఇంటి కగ్నియుఁ బెట్టి । కంటనిచ్చు
కంట నిల్పితే శివుని । మింటనే జేర్చురా ॥వి॥ 520

దేహధారియై దేహాన్నిపోషిస్తూ దేహవాసనల నంటక దేహంలో శివుని జూచిన ముక్తి.

ఆ. ఇల్లు నాలి విడిచి । యినుప కచ్చలగట్టి
వంటకంబు నీటి । వాంఛలుడిగి
యొంటినున్న యంత । నొదవునా? తత్త్వంబు ॥వి॥ 521

విరాగియై ఒంటరిగానున్నను చిత్తైకాగ్రతలేక తత్త్వమబ్బదు.

ఆ. ఇల్లు విడిచినట్లె । యిల్లాలి మదిరోసి
తల్లడంబుమాని । తలపు నిలిపి
మొడలుమరచి యోగ । ముల్లసిల్లెడునట్టి
వాఁడె పరమగురుఁడు । విసుధ వేమ. 522

సమాధి నిష్ఠుఁడే సాధకుడు.

కం. ఇల్లు సుమీ సంసారమె
ఇల్లు సుమీ యాయుధంబు । నిఁక విను చాలం
దల్లి సుమీ పంచాక్షరి
కల్ల సుమీ సతులవలపుఁ । గనుఁగొన వేమా! 523

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనునట్లు తల్లివంటి పంచాక్షరినే జపించుము.

ఆ. ఇష్టలింగముండ । నిఁక నేమిఁ గానక
పర్వతమున కేఁగు । పామరుండు
ముక్తిలేక నరుఁడు । మూర్ఖుడై చెడిపోవు ॥వి॥ 524

ఆత్మలింగము చూడక కొండలూ గుట్టలూ పరువు లెత్తిన ఏమిలాభం;

ఆ. ఇష్ట లింగ మేది । యిలశిలలింగంబె
నిష్ఠమీఱ మెడను । నీల్గఁగట్టి
కష్టపశువెకాని । కలుగదు మోక్షంబు ॥వి॥ 525

ఆత్మలింగ ముండగా మూఢులు రాతిలింగాలను పట్టుకొని దేవులాడెదరు.

ఆ. ఇష్టసిద్ధికొఱకు । నీరారుబీజముల్
కష్టమునను జదివి । కానఁలేఁడు
నిష్ఠలోన నిష్ఠ । నిజమని కనవలెను ॥వి॥ 526

షట్చక్రములలో హృదయములోనున్న చక్రమును "అనాహత" చక్రమందురు. దానిలో 12 బీజాక్షరములుగలవు. హృదయస్థానమందు అనాహత చక్రములో క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, ఇవి ఉన్నవి.

ఆ. ఇష్ట సిద్ధిఁ గోరి । కష్ట మొందఁగలేరు
నిష్ఠ నెఱిఁగినంత । నిష్ఠలోన
యష్టసిద్ధులందు । నమరుటఁ గానరో ॥వి॥ 527

అణిమాది సిద్ధులు ఎనిమిది :— అణిమ = తాను చిన్నవానివలె ఇతరు సులభసాధ్యుఁడై యుండుట, మహిమ = తాను గొప్పవాడుగా యితరులచే గ్రానింపబడుట: లఘిమ= ఇతరులు తన్ను పోల్చక యున్ననూ తాను ప్రచ్ఛన్నతలో ్వము గనుగొనుట ; గరిమ = గురుతుల్యుఁడై ఎల్లరకూ మాన్యుడగుట ; శిత్వం = అందరినీ వశపఱ్చుకొనుట ; ప్రాప్తి = తనకోర్కెలు నిరాటంకముగ ద్ధించుకొనుప్రజ్ఞగల్గుట; ప్రాకామ్యం = ప్రతిభ, అతిశయము, మాన్యతలుగల్గుట

* ఆ. ఇసుక బొగ్గు రాయి । యినుమును ధర్మంబు
కసవు పోసలు గట్టి । కాసి వాఁడు
పండ్లు తోమినట్టి । పాపాత్ముఁనడ్డమా ॥వి॥ 528

*ఆ. ఇసుక బొగ్గు రాయి । యినుముఁ జర్మంబును
గసవు పొల్లుఁ గట్టి । గట్టె పెట్టి
పల్లు దోమినట్టి । పాపాత్ముఁడెవరయా! ॥వి॥ 529

* దంత ధావన చేయుటకు యివన్నియూ దూష్యములు

ఆ. ఇసుక బొగ్గురాయి । యినుమును స్వర్ణంబు
గసవు పోచవలెను । గన్న వాఁడు
పరమ పదముఁ గాంచుఁ । బరిణామమందును ॥వి॥ 530

నిజమగు విజ్ఞాని మన్ను బంగారము వివిధవస్తుచయము సమానంగా చూస్తాడు

ఆ. ఇహపరంబు లందు । నింతులపై యాస
సహజ వృత్తి దగిలి । సమయు చంద్రు
రహిత మమర భక్తి । రాణింప దేలకో ! ॥వి॥ 531

సమయుట = చనిపోవుట
పరభామాపేక్షులు భ్రష్టులయి చచ్చెదరు.

కం. ఇహపర సౌఖ్యము లొల్లక
దహరమునను గుటినిడించి । దత్తము గాంగం
గుహరములో వెలి బయలున
మహదాకాశంబుఁజేరు । మహిలో వేమా ! 532

"భ్రూమధ్యే సచ్చిదానంద తేజః కూటరూపం తారక బ్రహ్మరూపం" అని శ్రుతి. నియమముతో "దహరా కాశము" నందు మనస్సుజేర్చి అంతటా మహదాకాశమును వీక్షింపవచ్చునని వేమన సూక్తి

ఆ. ఇహ పరాదులకును । నిది సాధనంబని
వ్రాసి చదివి విన్న । వారికెల్ల
మధ్య కర్మములను । మహిమతో నడఁచును
బరులకైన ముక్తి ! పథము వేమ. 533

తన బోధను వ్రాసి, చదివి, విన్న వారికి సర్వత్ర సౌఖ్య ప్రదమన్నాడు.

ఆ. ఇహపరంబులకును । నిది సాధనంబని
వ్రాసి చదివి విన్న । వారికెల్ల
మంగళంబు లౌనరు । మహిలోన నిజమిది ॥వి॥ 534

"కళ్యాణమస్తు రయే స్వస్తే కల్యాణం మంగళేపిచ" అనుధర్మమును యిట వేమన సిద్ధాంతీకరించెను.

ఆ. ఇహమునందు గురుని । కీదేహ మిచ్చినఁ
బరముఁ జూపి గుఱుతుఁ । బట్టి యిచ్చు
స్థిరముగాను బుద్ధి । చెడనీక చూడరా ॥వి॥ 535

"గురుర్బ్రహ్మా, గురుర్విష్ణు, గురు ర్దేవో మహేశ్వరః గురుర్ సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః" అని చెప్పెను.

ఆ. ఇహమునందు నేమి । యిడుములఁ బడినను
బరమ సాధనార్థ । పథముగాదు
గురుని యుక్తిమీఱి । గుర్తించిచూడరా ! ॥వి॥ 536
ఇచ్చట గూడా గురువును గొప్పవారిగాచెప్పెను.

ఆ. ఇహమునందు బాధ । లెన్నైనఁ బడవచ్చు
యముని బాధలేక । యమరవలెను
పరులబాధలేకఁ । బ్రతుకుఁడీ నరులార ! ॥వి॥ 537

ఆ. ఇహమునందుఁ బుట్టి । యింపారుచున్నట్టి
జనులు మృగ, ఖగములు । స్థావరములు
జంగమాదులనుట । జగతిలో భవకోటి ॥వి॥ 538
జంగమములు = పశుపక్ష్యమృగాదులు; స్థావరములు = చెట్లు

ఆ. ఇహమునందు సుఖము । లింపారకుండిన
బరమునందు నెట్లు । పడయవచ్చు ?
మొదటలేనిచేవ । తుదనెట్లు కలుగురా ॥వి॥ 539
చేవ = చెట్లమధ్యనున్న గట్టిభాగము.

ఆ. ఇహమునందు సుఖము । లీడేరఁగాలేదు
పరము నమ్మినేని । బ్రతుకనగునె ?
మొదటలేని సుఖము । తుదనెట్లుకల్గురా ? ॥వి॥ 540

ఆ. ఇహమునందు సుఖమె । యింపారలేదఁట
పరమునందు సుఖముఁ । బడయుటెట్లు
మొదట చేతలేక । తుదినేలఁగలుగురా ? ॥వి॥ 541
చేత = సత్కార్యము.

ఆ. ఇహమునందె చాల । యిడుములు వడిననుఁ
బరమసాధన పడ । తరముగాదు
పేద కనువు గలుగునె ? । పృథివిపై భాగ్యంబు ॥వి॥ 542
పేదవానికి పరమసుఖము లలవడవు.

ఆ. ఇహామునందు సుఖము । లింపార లేదట
పరమునందు సుఖము । బడయు టెట్లు ?
ధనము లేక సుఖము । తన కెట్లు గల్గురా ? ॥వి॥ 543

ఆ. ఇహామునందు చాల । నిడుమలు పడినను
బడుగు పొందఁగలడె । పరమపదవి
పేద కనువుపడునె ? । పృథివిపై భాగ్యంబు ॥వి॥ 544

బడగు = బక్కచిక్కినవాడు.

ఆ. ఇహామునందు నేమి । యిడుమలు బడినను
పరమసాధనార్థ । పదవిగాదు
వరలబోదు యెట్టి । వెరవునఁ జూచిన ॥వి॥ 545

వెరవు = మార్గము.

ఆ. ఇహామునందు నేమి ? యిడుమలుబడినను
పరమసాధనార్థ । పదవిగాదు
వరుల గారు యెట్టి । వెరవులఁజూచిన ॥వి॥ 546

"యెవరికి వారే యమునాతీరే" అను సంస్కృత లోకోక్తి నిటువాడెను.

ఆ. ఇహామునందుఁ బుట్టి । యింగిత మెఱుఁగని
జనుల నెంచిచూడ । స్థావరములు
జంగమాదులనుట । జగతినిఁబాపము ॥వి॥ 547

ఇంగితము = మంచిచెడ్డలు, వివేకములేని మనుజులు చెట్లరాళ్ళతో సమానము.

ఆ. ఇహాము విడిచి ఫలము । లింపుగఁ గలవని
మహినిఁ బలుకువారి । మతము కల్ల
యిహాములోనె పరము । నెనఁగుటఁ గానరో ! ॥వి॥ 548

" ఏమిజన్మం బేమిజీవనమూ యీపాడు కాయం బేమిసౌఖ్యం బేమిసుఖమిందు" అను సాధువుల తత్త్వాలను విమర్శించాడు మనయోగి.

ఆ. ఇహామున సుఖయింప । హేమతారకవిద్య
పరమున సుఖయింప । బ్రహ్మవిద్య
[1] కడమవిద్యలెల్లఁ । [2] గల్లమూఢులకెరా ! ॥వి॥ 549

పాఠాం :– 1 కడమవిద్యలెల్ల । రండముండలవిద్య.
2 కల్ల మూఢులవిద్య.

64 విద్యలు :— 1 ఇతిహాసము, 2 ఆగమము, 3 కావ్యాలంకార నాటకము 4 గాయకత్వము, 5 కవిత్వము, 6 కామశాస్త్రము, 7 దురోదరము, 8 దేశభాషా లిపిజ్ఞానం, 9 లిపికర్మము, 10 వాచనము, 11 అవధానము, 12 స్వరశాస్త్రము, 13 శకునము, 14 సాముద్రికము, 15 రత్నశాస్త్రము, 16 రథాశ్వగజకౌశలము, 17 మల్లశాస్త్రము, 18 సూదకర్మ, 19 దోహదము, 20 గంధవాదము, 21 ధాతువాదము, 22 ఖనివాదము, 23 రసవాదము, 24 జలవాదము, 25 అగ్నిస్తంభము. 26 జలస్తంభము, 27 ఖడ్గస్తంభము, 28 వాచస్తంభము, 29 వయస్తంభము, 30 వశ్యము, 31 ఆకర్షణము, 32 మోహనము, 33 విద్వేషణము, 34 ఉచ్చాటనము, 35 మారణము, 36 కాలవంచనము, 37 పరకాయప్రవేశము, 38 పాదుకాసిద్ధి, 39 వాక్సిద్ధి 40 ఘుటికాసిద్ధి, 41 ఇంద్రజాలికము, 42 అంజనము, 43 దృష్టివంచనము, 44 స్వరవంచనం, 45 మణిసిద్ధి, 46 మంత్రసిద్ధి, 47 ఔషధసిద్ధి, 48 చోరకర్మము, 49 చిత్రకర్మము, 50 లోహకర్మము, 51 అశ్మకర్మము, 52 మృత్కర్మము, 53 దారుకర్మము, 54 వేణుకర్మము, 55 చర్మకర్మము, 56 వస్త్రకర్మము, 57 లావకుక్కుట మేషాది యుద్ధకారక కౌశలము, 58 అదృశ్యకరణము, 59 దూతీకరము, 60 మృగయావిధి, 61 వాణిజ్యము, 62 పశుపాలన, 63 కృషి, 64 ఆసవకర్మము, వీనిని అరువది నాలుగు విద్యలనియూ చౌసీతి కళలని, చతుష్షష్ఠి కళలని, వాడుదురు.

ఇట రసవాదము = రసమునుకట్టి బంగారము చేయుట. వాదము నుడికారము.

ఆ. ఈకనులకు మిమ్ము । యెట్లు చూడఁగవచ్చు
చూపు కనులు వేఱు । చూపువేఱు
చూపులలో నుండి । చూడంగ వలయురా ॥వి॥ 550

బాహ్యచక్షులుగాక అంతర నేత్రముల గుండా పరమాత్మను చూడగలడు.

కం. ఈ కపట నాటకంబున
యీ కపటపుఁ జదువులన్ని । యింపు దలిర్పన్
యేకపటాత్మ్ముఁ డుసేసెనో ?
యీ కపటాత్మునకు మ్రొక్కి । యలరుము వేమా ! 551

లోక నాటకము ఆడించే జగన్నాటక సూత్రధారి.

కం. ఈకపట నాటకంబున
యీ కపటపు చదువు లన్ని । యీశ్వర యనఁగా

యే కపటాత్మని సృష్టియొ
యా కపటాత్మునకుమ్రొక్కి । తనరా వేమా ! 552

పై రెండు పద్యా లొకే విధంగా వున్నాయి.

ఆ. ఈకాలమును నేను । యింతమాత్రము వేడ
మనుజు డెవఁడు జూపు । మాయ కలిమి
తపము సేయ మంటి । తలక్రింద పడియేవు ॥వి॥ 553

భగవంతుని గూర్చి తపస్సు చేయుట కష్టముగా నికృష్టుల కుంటుందని విమర్శించెను.

ఆ. ఈకె లంటఁజేసెఁ । దోక లంటన జేసెఁ
గోకలంటఁజేసె । [1]గుట్టుమూసె
[2]మానరక్షణంబు । మర్యాద యని తెల్ప ॥వి॥ 554

పాఠాం :— 1 లోకమునకు 2 ఆకలంటఁజేసె యఖిల జంతువులకు

ఆ. ఈకెలనుచుఁ గొన్ని । తోక లనుచుఁ గొన్ని
కోకలనుచుఁ గొన్ని । గోచులనుచుఁ
* గొన్నియామెనున్న । గురుతును మాయగా ॥వి॥ 555

పాఠాం :- కచ్చమూసివేసి । కట్టఁడిజేసెరా

ఆ. ఈకెల బడఁజేసి । తోకలండలఁజేసి
కోకలండఁజేసి । కొలత మాయె
నాకు లండఁజేసి । నఖిలజంతువులకు ॥వి॥ 556

* పైమూడు పద్యములలో కొన్ని ప్రాణులకు వెంట్రుకలు, మనుజులకు బట్టలు, కొన్నిటికి యీకలు, కొన్నిటికి తోకలు మొదలగునవి ఉన్నవని సృష్టికర్త సృష్టి చిత్రాన్ని వర్ణించాడు.

ఆ. ఈఁగ తలవిషం బ । దిముడదు నీలోనఁ
దేలు తోక విషము । తెంపుఁ జూపు
పాము కోర విషము । పట్టిచంపునుగదా ! ॥వి॥ 557

యీపద్యము లోకవిజ్ఞానము.

ఆ. ఈఁగ తేనె రుచికి । నింపుగా జచ్చును
ఓగు కామరుచికి । నొఱిగిచచ్చు
త్యాగి గానివాని । ధర్మమ్మడుగఁ జచ్చు ॥వి॥ 558
ఓగు = పనికిమాలినవాడు ;

ఆ. ఈఁగ యెట్టిదన్న । నీశ్వరు వంటిది
తెలిసి చూడకున్నఁ । దేటపడదు
యదియు గురువులేక ! యబ్బునా ? తెలియంగ ॥వి॥ 559
* ఉపమానోపమేయములుగా యీగను మనసుతో పోల్చెను వేమన మహాయోగి.

ఆ. ఈఁగలేనిచోట । యిసుమంత బెల్లంబు
వేసినంతలోనె । వాసనెఱిఁగి
* గుంపు గుంపుగాను । గుయ్యనొచ్చియుముసురు ॥వి॥ 560
* పాఠాం :- "గుంపు గుంపులచట । గుయ్యనముసురును" మూడవ చరణంలో గణం తప్పినది. ప్రయోగం తప్పే.

కం. ఈ ఘటము నందుఁ జూచియు
నే ఘటమునింతె యనుచు । నెఱుఁగక మదిలో
నే ఘటముమీఁద వాంఛ య
మోఘం బనుకొనంగవలయు । ముఖ్యము వేమా ! 561
ఇచ్చట సర్వమూ ఏకత్వముగా నిరూపించెను.

కం. ఈఘన సూత్ర మెఱుంగమి
నీఘటమున శివుఁడుసేరి । యిరవు కొనంగా
నేఘట పటముల కందిక
తా ఘనుఁడై యాడుచుండుఁ । దథ్యము వేమా ! 562
ఘట పటము = హృదయ ఫలకము.
సూత్రము = శాస్త్రాంశములను సూటిగా జెప్పునది.
మనస్సున కందక శివుడు చిందువేస్తూ యుంటాడు

కం. ఈచెవిఁ గొఱికిన నొల్లరు
వాచవులకు విందుమన్న । వాక్యంబులచేఁ

క. ఈ తనువు నందుఁ జూచిన
నే తనువుల కింతె యనుచు । నెదిరిని దన్నుం
జూతురు లోఁగాఁ జూపున
నాతురముగఁ దపసులెల్ల । సమరఁగ వేమా! 570

భగవంతుడు సర్వ సముడని తపసులు తెలుసుకొందురని వేమన నుడివెను.

ఆ. ఈఁతరాని వాఁడి । కెగరోజి యెగరోజి
యేరు దాటఁగలఁడె । యీదఁబోయి
పరుడుగాని వాఁడు । పరలోక మందునా? ॥వి॥ 571

ఉచ్ఛ్వాస నిశ్వాసములు తెలియక నదిని యీదలేడు. అట్లనే బ్రహ్మ కాక బ్రహ్మత్వము సిద్ధించదని తెలిపెను.

కం. ఈఁతలు నేర్వని వారలు
లోతగునటువంటి బావి । లోఁ బడిపోరా
యీఁతలు నేర్చిన వారలు
నూతినిబడి మడియగలరె ? । నుగ్గుగ వేమా 572

లౌకికానుభవ వేదాంతానుభవమును శ్లేషగా వర్ణించాడు. మన యోగీంద్ర చంద్రుడు.

ఆ. ఈఁత వచ్చినపుడు । లోఁతని పించునా ?
ప్రాతతోషి కెపుడు । భయములేదు
కోఁతి కొమ్మకెక్కి । కుప్పించి దూకదా ? 573

అలవాటయిన కార్యములు అతి తేలికగా చేయుదురు

* ఆ. ఈఁత వచ్చినపుడు । లోఁ తని పించునా ?
పాత లంజె కటులె । భయములేదు
కోతి కొమ్మ కెక్కి । కుప్పించి దాటదా? ॥వి॥ 574

* పై రెండు పద్యములో కే భావం. పదజాలంతో ఉన్నాయి. కాని రెండవ పాదం మారింది.

అనుభవమైన వాళ్ళకు అన్నియు తేలిక.

క. ఈఁ తెఱిఁగిన హారైనను
లోఁతైనటువంటి నూతి । లోఁ బడిపోరా !

యీఁతలు * నేర్చిన యోగము
చే తిరుగక యున్న నేమి । చేయుద వేమా ! 575

* పాఠాం:- నేలా

కం. ఈ తెలుఁగని వారెల్లరు
లోఁతైనటువంటి నూతి । లోఁ బడిపోగా
యీఁతలు నేర్చిన సీలో
(మోతలు మరి చూడచూడ । (మొక్కెతి వేమా! 576

మో)తలు దశవిధనాదములు

కం. ఈఁ తెరుగని వారెల్లను
లోతైనటువంటి నూతిలోఁ బడిపోరా
యీ తెరిగిన వారెప్పుడు
నూతిని బడి మడియ గలరె । నుగ్గుగ వేమా ? 577

అనుభవశూన్యులదఃపతితులయ్యెదరు.

ఆ. ఈఁదవచ్చు నేరు । నేబాధ లేకుండ
యీది గురువు లేక । యందరాదు
సోది జెప్పు టేల ? । జొక్కిన మదిఁ జూడు ॥వి॥ 578

"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథాగ్రంథకోటిభిః" గురువులేక జ్ఞానము కుదురదు.

ఆ. ఈఁది దాటవచ్చు । నేసాగరంబైన
* సాధువృత్తితోడ । సమయు మాయ
పాదుకొనిన మనసు । పరిపూర్ణమందురు ॥వి॥ 579

ఏకాగ్రత నున్న మనస్సు ఎప్పటికైనా పరిపూర్ణ మందును.

ఆ. ఈఁది దాటగలఁడు । నేసాగరంబైన
సాధువృత్తితోడ । సమయమందు
పాదుకొనుచు మనసు । పరిపూర్ణమొందును ॥వి॥ 580

పైరెండు పద్యాలు ఒకేరీతిగా వున్నాయి.

క. ఈ దేహమెన్ని భంగులఁ
(బోది యొనర్చినను నేలఁ । బోవునుకాదే

మీఁదేఁటిగి మురికి గడుగుచు
భేదంబులుమానముక్తి । బెరయును వేమా.

క. ఈదేహమెన్ని భంగులఁ
బ్రోదియునొనంగ నెల । పోవుటకాదే
మీఁదేఁటిగి ముక్తి గడుగచు
భేదంబులు మాన ముక్తి । బెరయునువేమా !

పైరెండు పద్యాలొకేరీతిగా ఉన్నాయి. రెండవపాదం భేదంగావుంది. దాద్వ్యవసాయంగా చెప్పెను.

కం. ఈదేహి కెన్నిభంగుల
బోధయొనర్చినను నెంత । పొలుపగునటుగా
నీదేహి మలిన ముడిగిన
భేదంబులు మానిముక్తి । బెడగునువేమా.

పైరెండు పద్యభావచ్ఛాయలలోనే ఈపద్యంవుంది.

ఆ. ఈనినట్టి పులిని । బూనిచంపగవచ్చు
మనసు మర్మమరసి । కనఁగవచ్చు
* తారకంబు మరిగి । తగులుట సాధ్యంబు ॥వి॥
పాఠాం:- దైవమాయ తెలియ తనకసాధ్యంబగు ॥వి॥
ఎటువంటి అసాధ్యపు పనినైనా సాధింపవచ్చును గాని తారకమంత్ర స్యము దెలియుట కష్టము.

ఆ. ఈని వానిచేత । నిప్పించుఁ దనగతి
యిచ్చువానిచేత । నీయనీదు
* యీయ నీయకుండ । నితరులకర్తలా ॥వి॥
పాఠాం:- దైవమాయ తెలియ । తనకసాధ్యంబగు ॥వి॥
అన్నిటికీ ఈశ్వరుఁడే కర్త.

ఆ. ఈనెలోనె పుట్టి । యీనెలోఁబెటిగియు
నీనెలో నొకరికి । నియ్యలేదు
యీనెలోనివాఁడె । యీలేనివాఁడురా ॥వి॥

సృష్టికిహేతుభూతమై యోనిలోబుట్టి ఏపనియు చేయలేరు. ఏపనిచే ఈశ్వరుడే చేయగలడనినిటచెప్పుచున్నాడు.

కం. ఈ మాయఁజగము జూడఁగ
ప్రేమాస్పద దృష్టిలోనఁ । బెంపగుచుండుం
గామాంధ కారమునఁబడి
ధీమసమునఁ దెలియలేరు । దేవుని వేమా ! 587

కామపు దృష్టిలోబడి దేవుని తెలియలేకున్నారు

కం. ఈరారక్షర [1]జపమున
బోరాడినముక్తిగలదు । పూనినవారల్
[2]మారాడక । మదిలోపల
మాఱాడకపూర్ణమంది । మనెదరు వేమా ! 588

పాఠాంతరం:— 1 తపమున 2 వేఱెన్నని.
ద్వాదశాక్షర మహామంత్ర మహిమనిట ఉల్లేఖించెను.

కం. ఈరారక్షర మంత్రము
పోరాడని పఠన మమరి । పొందిక పడ నా
సారమె శరీరమూలము
నారూఢ తపంబు సుమ్మి । యవనిని వేమా ! 589

ద్వాదశాక్షరి మహామంత్రమూలమే శరీరము.

క. ఈ లోక చిహ్నలన్నియు
మేలుగ గురుశక్తిఁగూడి । మిన్నందినచోఁ
గాలుఁ డెదుర్కొనఁజాలడు
చాలును జన్మంబులనుచుఁ । జాటర వేమా ! 590

కాలుడు = యముడు.

కం. ఈలోక మర్త్యులందఱు
స్త్రీలోలత మగ్నులనుచుఁ । జెక్కొద రకటా
కాలుని మదిలో నెంచరు
మేలగు పురుషార్థ మహిమ । మెచ్చర వేమా ! 591

చతుర్విధ పురుషార్థములు :— ధర్మము; అర్థము, కామము, మోక్షము,

ఆ. ఈశ్వరంబులన్ని । యేఁడుపాళ్ళుగఁజేసి
యేఁడుమూర్తులకును । నెంచియిచ్చి
నిత్యకర్మమునను । నిలుచురా నెఱయోగి ॥వి॥ 592

సప్తస్వరాలు సప్తమూర్తాలకు పంచి యీయగలిగినవాడే యోగి యని వేదాంతగంభీరార్థమును వేమనకవి సూత్రీకరించెను.

ఆ. ఈశ్వరునకు నుంచి । తిసుమంత యగు సొడ్డు
* బ్రహ్మకే నొసఁగితిఁ । బాడుసొడ్డు
విష్ణుదేవు కిడితి । విపరీతమగుసొడ్డు ॥వి॥ 593

సొడ్డు = పంచెము, వేమన త్రిమూర్తులనుగూడా పరిహసించి వేదాంతములో సవాలు జేసెను.

శంకరుడు సగము శరీరము, విష్ణువు వక్షము, బ్రహ్మ వదనము వారిభార్యలకిచ్చి స్త్రీలోలురైరని నిట పరిహసించెను.

ఆ. ఈశ్వరుని దలంప । నేర్పుతో మెలగఁక
తనదు మూర్తినెల్ల । ధారఁబోసి
నిత్యకర్మములను । నిలుచురా నెఱయోగి ॥వి॥ 594

"అహం బ్రహ్మాస్మి" అన్నాడు; నెర = అసలైన

ఆ. ఈసునకును నిద్ది । యిసుమంతయగు సొడ్డు
బ్రహ్మకే నొసఁగితి । పాడు సొడ్డు
విష్ణుదేవుని కిది । విపరీతమగు సొడ్డు ॥వి॥ 595

పై రెండుపద్యాలు ఒకేభావంలోఉన్నాయి.

ఆ. ఈశుమీఁది భక్తి । యిసుమంతయును లేక
పాశమందుఁ జిక్కి । ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ । గాలుఁ డెఱుంగఁడా ॥వి॥ 596

ఆశాపాశములో నున్నవాడు కాశికి వెళ్ళినా లాభంలేదని చెప్పెను.

ఆ. ఈషణ త్రయంబు । నెడపంగ నేరక
మోహరాశిలోన । మునిఁగియుండు
జనులకెట్లు మోక్ష । సౌఖ్యంబు కలుగురా ! ॥వి॥ 597

ఈషణత్రియమును విడువనిదే మోక్షము రాదు.

తే. ఈషణాదుల నన్నింటి । నీడ్చిపట్టి
మోసపోకయు మదిలోనఁ । గాసిపడక
రోసి బయలునఁ జేరుట । వాసి యగును
యిట్టు లగునాతఁ డెన్నిక । కెక్కు వేమ. 598
యీషణత్రిములలోబడక యుంటె ముక్తిప్రదుడగును.

ఆ. ఈ సూటి గురుకృపను । యీత నేర్చినవాఁడు
యీషణ త్రయములను । యెగర విడుచు
* యెగరవిడిచి యపుడె । యోగీశ్వరుండాయె. ॥వే॥ 599
* యతి తప్పినది.

వాక్యము :— ఈ స్మృతి సామాన్యముగాదు. అష్టాంగయోగులకును, గురుముద్రభావులకును, సాంఖ్య తారక యోగలక్షణజ్ఞులకును, వ్యాస వాల్మీకాది వరమునీంద్రాదులకును, దీని రహస్యంబెవ్వరికి నెఱుకపడదు. ఇట్టి తేజంబుఁ జూడ రేచక, పూరక, కుంభకంబులవంటి యీ పరబ్రహ్మంబు తానె యనెఱుకపడదు. నే నజుండ గాను. హరిని గాను, హరుడ నైన సద్గురు కరుణా కటాక్షంబున నీకవిత్వంబుఁ జెప్ప బూనితిని గాని, దండివాఁడనని యెంచవలదు. నేనెంత వాఁడ నని నమస్కరించి, పరమ ఘోర భవ తారక తాండవమందలి జ్యోతి చిన్మయాకారం బిట్టిదని పరికింపంజూడ, స్థూల సూక్ష్మకారణంబులై యుండు, తర్కవాదులిట్టి వచనము నిజమో! యనిజమో! యని తర్కింపఁ గడఁగుదురు. అట్టివారలకు వట్టిదిగానే యుండును. మహినిఁ గొండ వీఁటి మహిపర్వత గుహాయందుఁ గొండవీటి యభిరామయ్యగారివలన, లంబికా శివయోగీంద్రులవారియొద్ద దొరికె ముక్తిపదవిఁజూడఁ దెలియఁ గలరా! కఠినంబుగాదె? సులభమైయుండునా? మహా తేజమై పారుచుండెడు చిద్రూపంబుఁ జూచిన పురుషుండు పృథివిలో నెవ్వరని చెప్ప శక్యము. ఎంతవారలైన నంతవారలైన నంతవారనియే చెప్పవలయును. సర్వకాల సర్వావస్థలయందు సత్సమాధి నోలలాడుచుండెడు నతఁడు యోగీంద్రుఁడని చెప్పబడును వేమా! 600

ఆ. ఉండడే సుశీలి । యుండును కొన్నాళ్ళు
యుండి, యుండి, యుండి । యుండలేక
యుండు వెరవుఁదెలిసి । గండిదొంగను బట్టి
చెండి; చెండి; తావుఁ । జేరువేమ. 601

గండిదొంగ = మాయ

విజ్ఞాని సాధనయోగం లోనుండి మాయను నశింపజేసి బ్రహ్మస్థానముజేరును.

ఆ. ఉండు నుండు జ్ఞాని । యుగములు చనినను
బ్రాణహాని లేదు । ప్రళయమునను
బ్రాణహానియైనఁ । బరమాత్మఁ గలియురా! ॥వి॥ 602

నిజమగు జ్ఞానికి యుగములులేవు., ప్రళయమును లేదు.

శ క ము లు :

౧ కృతయుగము :— హరిశ్చంద్ర, 2 నల, 3 పురుకుత్స, 4 పురూరవ, 5 సగర, 6 కా రవీర్యశకములు షట్చక్రవర్తుల శకములు

౨ త్రేతాయుగము :— 1 మాంధాతృశకము, 2 ధిలీప, 3 రఘు, 4 అజ, 5 దశరథ, 6 శ్రీరామ శకములు

3 ద్వాపరయుగము :— 1 నహుషు, 2 యయాతి, 3 దుష్యంత 4 విచిత్రవీర్య, 5 పాండుశకములు

౪ కలియుగము :— 1 యుధిష్ఠర, 2 విక్రమార్క, 3 శాలివాహన, 4 విజయానంద, 5 నాగార్జున, 6 కల్కి—శకములు.

కృతయుగ పరిమాణము 17,28,000 సం॥లు
త్రేతాయుగము 18,64,000
ద్వాపరయుగము 6,2,64,000
కలియుగము 4,32,000

నాలుగు యుగములు కలసి 43,20,000 సం॥లు. దీనినే మహాయుగమందురు; 71 మహాయుగములు ఒక మన్వంతరము. పదునాలుగు మన్వంతరములు ఒక బ్రహ్మ పగలు. బ్రహ్మ అట్టివి నూరేండ్లు బ్రతుకును; బ్రహ్మప్రళయము విష్ణుదినము. విష్ణువు నూరేండ్లుజీవించును; విష్ణుప్రళయము ఒక రుద్రదినము. రుద్రుడు నూంరేండ్లుబ్రతుకును. శ్రీ బ్రహ్మము ఆది యందు తనఆత్మ ప్రభావంతో యీబ్రహ్మాండభాండమును ఇందిమిడియున్న ఎనుబదినాలుగు లక్షల జీవరాసులను జంగమస్థావర విశిష్టంబులైన భువనంబులపాలించుచున్నాడు. బ్రహ్మాండపరిధియందు పరబ్రహ్మం నివసిస్తూ కాలనియమములతో నడుపుచున్నాడు.

84 లక్షల జీవరాసులు: వృక్షములు 20 లక్షలు, పక్షులు 10 లక్షలు, పురుగులు 11 లక్షలు, మనుష్యులు 4 లక్షలు, నీళ్ళయందలి జీవులు 9 లక్షలు జంతువులు 30 లక్షలు మొత్తం 84 లక్షలు.

స్వరశాస్త్ర కాలమానము
౬ ప్రాణములు ౧ ఫలము (విఘటిక = లిప్త)
౬౦ ఫలములు ౧ కాలదుంధుభి (ఘటిక)
౬౦ ఘటికలు ౧ దినము
౩౦ దినములు ౧ మాసము
౨ మాసములు ౧ ఋతువు
౬ ఋతువులు ౧ మనుష్య సంవత్సరం
అట్టి మనుష్యమాసము ౧ పితృదినము మనుష్య సం|| ౧ దేవదినము.

తే. ఉక్కు కత్తినిఁ జేఁబూని । యున్నవాఁడు
కుక్క నక్కలు బెదిరింపఁ । గొంకుపడఁడు
దృక్కు దృశ్యంబులను మించి । తెలియుఁ గానఁ
జక్కఁగా నొప్పుమనమున । జరుగు వేమ. 603

ఆ. ఉక్కు కళ్ళు దిన్న । నొగిఁ దేటఁగాఁజేయు
నుక్కు కల్లు దిన్న । నుడుగు వ్యాధి
యుక్కుకళ్ళుఁ గన్న । నుర్విఁ గల్పము లేదు ||వి|| 604

ఉక్కుభస్మము చేసి వాడినచో కాయకల్పమని ఆయుర్వేద గ్రంథమందు చెప్పబడియె.

ఆ. ఉక్కు చూర్ణముఁ దిన । నుడుగును గష్టమ్ము
లుక్కు చూర్ణముఁ దిన । నుడుగు క్షయయు
నుక్కు చూర్ణముఁ దిన । నుడుగును కర్మముల్ ||వి|| 605

ఉక్కు చూర్ణము కుష్ఠువ్యాధికి క్షయకుగూడా అనుపాన మార్పులచే వాడుదురు.

ఆ. ఉక్కు తుండము లైన । వూదించి నలగొట్టి
యొకటిగాఁ జేయొచ్చు । వసుధలోన
ఆత్మ వేరై వెనుక । నంటించుటరుదురా ||వి|| 606

ఆత్మవేరైనచో మరి అతుకదని వేమన చెప్పెను.

ఆ. ఉక్కు దిన్నవాఁడై । యుర్విపై సిద్ధుండు
యుక్కుఁ దిన్నవాఁడె । యుండు జగతి
నుక్కు సుధకు మీఱు । *గనెక్కువ కల్పంబు ॥వి॥ 607

* పాఠాంతరం "నెక్కుడు"
సిద్ధుడు = చాలా కాలము బ్రతుకువాడు.
ఉక్కుభస్మము దీర్ఘాయుష్యునిగ చేయునన్నాడు వేమన

ఆ. ఉక్కు బండ్లుఁ దిన్న । వృద్దెపిగాఁ జేయు
ఉక్కు బండ్లు దిన్న । నుడుగు వ్యాధి
వుక్కు పడక యున్న । వుర్విపై కల్పంబు ॥వి॥ 608

వృద్దెపి = ధృఢము ;

ఆ. ఉక్కు రసము జేర్చి । యుదుటగ సిందూర
హరి దళము చేత । హతముఁ జేయ
గ రస వాద మదియె । ధరఁజేయలే రది ॥వి॥ 609

ఇది బంగారు యోగము

ఆ. ఉక్కు శుద్ధిఁజేసి । యుంచి తినెడు వాఁడు
యుక్కు దిటవు వలెనె । యుండుఁ జగతి
నుక్కు చూర్ణము దిను । టొప్పగు కల్పంబు ॥వి॥ 610

దిటవు = బలము; శరీరపటుత్వము ఆయుర్వృద్ధి గలుగు నన్నాడు యోగి.

ఆ. ఉక్కు సుధగఁ జేసి । యుంచి తినెడివారు
వుక్కు తానుఁగూడి । యుండు జగతి
ఉక్కు సున్నము దిన । యెక్కుడి కల్పంబు ॥వి॥ 611

ఆయుర్వేద విధానము

ఉక్కు భస్మమును సింధూరముగాచేసి వాడుదురు. ఇది శరీరమునకు క్రొత్త రక్తమును గల్పించి పుష్టిని కల్గించును. సర్వవిషములు, శ్వేతకుష్ఠలు, మహాకుష్ఠులు నివారించు ననియు, జ్వరముల హరించుననియు వీర్యపుష్టిని, శరీర తేజస్సును గల్గించు ననియు ఆమవాతము, ఉబ్బుజాడ్యము, గ్రహణి, గుల్మము, ప్రమేహము, పాండువు, ప్లీహ, పైత్యోద్రేకము, దగ్గులు, రక్తవికారములు నివారించుననియు ఆయుర్వేద వైద్యులు చెప్పుచున్నారు.

మన యోగీంద్రులు అన్ని శాస్త్రములతో సహా ఆయుర్వేదము నాకళింపు చేసు కొన్న వాడు కాన యీఉక్కు చూర్ణపు ప్రాధాన్యతను పదే పదే నుగ్గడించెను. అయితే ఇవి అనుభవైక వేద్యముగా వాడవలెను. ఉక్కును చూర్ణము చేయువిధానమును ఏవ్యాధికి ఎంత మోతాదో, ఎంత అనుపానమో, ఎంత పద్యమో తెలియవలెను.

కం. ఉచ్చకు త్రోవగు తావున
ద్రచ్చంగా జగము పుట్టెఁ। దాతలనాఁడే?
హెచ్చగు కులజుండెవ్వఁడు
మచ్చిక మదిరోయు వాఁడె। మాన్యుఁడువేమా 612

అందరూ యోనిసంభవులే యని కులభేదం లేదని చాటెను వేమన.

ఆ. ఉచ్చ చెలమగోరి। యున్నది జగమెల్ల,
పిచ్చిపట్టి తిరిఁగి। పెనఁగు చుండ్రు
తుచ్ఛ సుఖము దీనిఁ *ద్రెంపగ లేరయా ॥వి॥ 613

* త్రెంపగ తప్పు, త్రుంచగ నుండవలెను. యోనిగురించి వాకొన్నాడు.

కం. ఉచ్ఛ్వఁదగు శ్వాస బ్రహ్మగు
నిచ్చలు నిశ్శ్వాస హరియె। నిజమెఱిఁగి సదా
యచ్చుపడ వానితోడను
మచ్చిక శివుఁజేర్చి వెలసి। మనరా! వేమా! 614

పూరక, కుంభక, రేచకములు వాకొనెను. అవి త్రిమూర్తులతో పోల్చెను.

కం. ఉచ్చను బుట్టిన తనువఁట
హెచ్చేమియొ కొంచెమేమొ। యేర్పడఁదెలియ
న్మచ్చరము మాని సత్యం
బచ్చన నిల్పినను బ్రహ్మ। మతఁడే వేమా! 615

గొప్పవాళ్ళ మనువాళ్ళకు దెబ్బగొట్టెను.

కం. ఉచ్చను బుట్టిన తనువిది
విచ్చలవిడి కులమువాని। విజ్ఞానములో
* కుచ్చితము మాని సత్వం
బచ్చుపడగఁ నిలిపెనేని। యధికుండు వేమా! 616

* కుచ్చితము తప్పు, కుత్సితము అని యుండవలెను. ఉన్నచో ప్రాస తప్పు;

*కం. [1] ఉచ్చను బుట్టిన తనువుకు
యెచ్చోటను, యేదికులము । యేదినిజంబౌ
[2] మచ్చరము మాను, సత్యము
యచ్చు పడ న్నిలిచెనేని । యధికుఁడు వేమా! 617

* 1 ఉత్స 2 మత్సరము. అని పాఠాంతరాలున్నాయి.

ఆ. ఉచ్చ వచ్చుచుండు । నిచ్చకు సరిగాను
మచ్చికైన మనసు । మర్మమెఱిఁగి
* హెచ్చుపదవి యందు । నేర్పడఁజూడరా ॥వి॥ 618

* పాఠా:— హెచ్చుకర్మములయు । ముచ్చటచూడరా !

మానసిక శక్తి ననుసరించి ఇంద్రియస్తంభన ఏర్పడును. అన్నిట మానసిక శక్తిని వాడెను.

ఆ. ఉచ్చలోన కామ । మెచ్చట కదలించి
ఉత్సుకతను జేసి । వుర్వి వెలసె
యిచ్చట కులజుండు । యెవ్వఁడు లేడయా ॥వి॥ 619

సంకల్పము వలన జన్మములు గలుగును

ఆ. ఉచ్చలోనె పుట్టి । యుచ్చలోనె పెరిఁగి
యుచ్చకాస పడుట । యుచితమగునె ?
యుచ్చ రోయు వాఁడు । యుత్తమ యోగిరా! ॥వి॥ 620

తన జన్మకు కారణస్థానము నాశించుట తెలివితక్కువ. విడచిన వాడే విజ్ఞాని.

క. ఉచ్చ సరితూఁగి పుట్టెడి
నెచ్చట నేమనుజుఁ డైన । నేర్పడ భువిలో
నిచ్చటఁ గులజుండెవ్వఁడు ?
విచ్చలవిడిఁ దెలియవలయు । వినరా వేమా! 621

పురుష వీర్యము స్త్రీ శోణితము పిండోత్పత్తికి మూలము.

ఆ. ఉచిత వంతుఁడైన । నుద్యోగ పరుఁడైన
సంప దమరి యున్న । సమయముననె ?
పరుల కుపకరించి । పాలింపఁ గల్గును ॥వి॥ 622

ఆ. ఉచిత వంతుఁడేని । యుద్యోగ పరుఁడేని
సాగి పారి యున్న । సమయమునను
పరుల కుపకరించి । పరగ రక్షించును ॥వి॥ 623
* ఉత్తమ లక్షణములను పేర్కొనెను.

తే. ఉచిత మిత్రులు, సతి, సుతు । లూరు, పేరు,
ధనము, ధాన్యంబు, బాడియు, । ఘన మతములు
నాశనం బొందు నివి యెల్ల । నమ్మఁబోకు
నీవె స్థిరుఁడ వెటుంగరా ? । నిన్ను వేమ. 624
(విమల గుణరాజ ! యోగీంద్ర । వేమనార్య !)
"యదృశ్యం తన్నశ్యం" అను సూత్రమునకు యీపద్యభావం సరితూగుతుంది.

క. ఉచితాహారము వల్లనె
యుచితంబుగ బుద్ధిసిద్ధి । యొప్పునటులనే
యుచిత గురుబోధ వల్లను
సుచరితుఁడై పరముఁగాంచు । సుమ్ముర వేమా ! 625
ఉచిత = సరియైన,
సరియైన విధముల ప్రవర్తించిన ఆనందమయుడు కాగలడు.

కం. ఉచ్చొచ్చి కచ్చి లోపల
తచ్చంగా జగము బుట్టె । తాతలనాఁడే ?
యిచ్చట కులజుండెవ్వఁడు ?
సచ్చరితలు యెందరనుచు । చాటర వేమా! 626
మనుజులలో మనుజు లనదగు వా రరుదు. "నూటికొక పురుషుఁడు. కోటి కొక ఇల్లాలు" అను సామెత వాడెను.

తే. ఉజ్జ్వలంబగు పరిపూర్ణ । మొందగానె
కుంభగత దీపశోభ ని । కుంభ లీల
కుంభకంబున మదిఁజేర్చి । కూడవలెను
గాక ! గాంభీర్యమూనిన । * కలదె వేమ. 627
పాఠా:- ఘనత
ప్రాణాయామములో కుంభకయోగాన్ని ప్రశంసించెను.

తే. ఉజ్జ్వలంబైన పరిపూర్ణ । ముపముజేసి
యాత్మజ్యోతిని బెనఁగుచు । నభినుతించి
మూర్తిసాధన మొందుట । ముఖ్యపదవి
కాక తలయూప బనియేమి । కలుఁగు వేమ
(విమల గుణరాజ! యోగీంద్ర । వేమనార్య!)

ఉపము = ఆధారము, పరిపూర్ణ మాధారంగా జేసుకొని బ్రహ్మైక్యసం
నము పొందుట శాశ్వతముగాని తలయూపుట వెఱ్ఱితనము.

క. ఉడుగునె క్రతువులుఁ దపముల
నడవుల దీర్థములఁ దిరిగి । నంతనె ధరలో
నొడయనిఁ గనుగొన జాలఁడు
కడుధీరత గురుఁడు సెప్పఁ । గలఁడిది వేమా!

ఆత్మేశ్వరుని జూపగల శక్తి గురునకేగలదు.

ఆ. ఉడుము తోకఁ బట్టి । యురిదిగా లాగిన
నడుఁగు విడక పూని । యానియుండు
మురికిపైనఁజేర । ముదమంద వలెనట్లు ॥వి॥

కాముకుఁడు అవమానమైనను స్త్రీ వాంఛవిడువడు.

ఆ. ఉతక లోని తలుపు । నూగించి నెట్టెడి
పదునెఱింగి లోనఁ । బట్టు పట్టు
మతినిఁగూడి మించి । మర్మంబు గానరో ॥వి॥

ఉతక = తలుపు తిరుగుటకు అనుకూలముగా అమర్చినకొయ్య;
మనస్సు పరమాత్మను బట్టుట కాధారము.

ఆ. ఉత్తతిత్తి దీని । యుపయోగములు లేవు
తిత్తి కొఱకు జెడును । దేవులాడి
కత్తిమీద సాము । కడతేర బోదయా ॥వి॥

కత్తిమీద సామువలె స్త్రీవాంఛ ప్రమాదకరము

ఆ. ఉత్తతిత్తి దీని । పొత్తున జీవుండు
సత్యము గనుఁ జేరి । సరసముగను
సుఖము, దుఃఖములను । సూత్రించు-గుంఢ్తురా! ॥వి॥

ఆ. ఉత్త తిత్తి దీని । యూపిరిఁ జేఁ గాక
పొత్తు మరవరాదు । పుడమిలోన;
మత్తుఁ జూపి నరుఁడు । మార్గొనవలెనయా ॥వి॥ 635
పై మూడు పద్యములలో కామినీ గర్హణం మనకవి చేశాడు.

క. ఉత్తమమగు జ్ఞప్తికినై
సత్తమ నిజరూప, భావ । సాదృశ్యములోఁ
బొత్తున । బారంగతుఁడై
హత్తెడు నధ్యాత్మ విద్య । ననువుగ వేమా! 636
ఆత్మను కూలంకషంగా తెలిసికొనిన వాడే అధ్యాత్మ విద్యా కోవిదుడు.

తే. ఉత్తమజ్ఞాన నిలయమా । నుపముచేత
భక్తిసాధించి పూర్ణతఁ । బడయవచ్చు
ముక్తి కిరవగు గురునాజ్ఞ । మొదటిదయ్య!
యది లభించిన సర్వంబు । నబ్బు వేమ. 637
గురూపదేశమునకు ప్రాధాన్యత నిచ్చెను.

ఆ. ఉత్తమ శివయోగి । యూహించి మదిమించి
సత్తమమునఁ బోరి । సరకుఁ గొనడు
పొత్తు మఱచి యుంట । పూర్ణభావంబురా! ॥వి॥ 638
జ్ఞానయోగి స్త్రీమమకారములో చిక్కడు.

ఆ. ఉత్తమాంశమూని । యు న్మహిలోఁ జేరి
మత్తు మించినట్లు । మరిగిరాక
సత్తమంబు మీటి । సాధింప ముక్తిరా! ॥వి॥ 639
బ్రహ్మమునందు విడనిమనసుతో జ్ఞానముపొందినవాడే ముక్తిప్రదుడు.

ఆ. ఉత్తముని కడుపున । నోగు జన్మించిన
వాఁడు చెఱుచు వాని । వంశమెల్ల
చెఱకువెన్ను పుట్టి । చెఱుపదా తీపెల్ల! ॥వి॥ 640
సహజముగా లోకనీతి చక్కగా వర్ణించెను,

ఆ. ఉత్తమోత్తముఁడగు । సర్వేఁద త్త్వజ్ఞుండు
మహిమఁ జూపువాఁడు । మధ్యముండు
వేషధారి యుదర । పోషకుం డధముండు ॥వి॥ 641

యోగులు మూడురకములు. వారివారి లక్షణాలను సలక్షణంగా వర్ణించెను.

ఆ. ఉత్త మోత్తముడెటు । లుత్పత్తిశూద్రుఁడే?
తల్లి శూద్రయోఁ । దరచి చూడఁ
దాను బాపఁ డనఁ న । ధర్మమె సాక్షిరా! ॥వి॥ 642

"జన్మానాం జాయతే" అనుసూక్తి ననుసరించెను.

ఆ. ఉదకమందు పాచి । యున్నదిచూడరా
మదిని యున్న మాయ । మట్టుపడక
సదనమందు బ్రహ్మ । సాక్షిగానెంచురా ॥వి॥ 643

శరీరభాండమునగల ఉదకములో బ్రహ్మమును పాచిని తెలసికొనుమని యోగి సూచించెను.

ఆ. ఉదకమందు మొసలి । యుబ్బి యేనుఁగుఁ బట్టు
మతక యేమొ? బైట । మసలఁ బోదు
యెఱుక గుట్టు దెలిసి । యేకమై యుండురా! ॥వి॥ 644

షడ్గుణములచే నీవు బంధింపబడుదువు. కాని ఒరుల నవి ఏమియూచేయలేవు.

కం. ఉదకము లోపలి తత్త్వము
వెదకియు దానగుటఁ దెలిసి । వేగమె మదిలో
నుదకము వలెఁ దాఁ దత్త్వము
మది దెలిసిన వాఁడె తత్త్వ । మయుఁడౌ వేమా! 645

తనువునందున్న బ్రహ్మము తెలసికొన్నవాడు తత్త్వవేత్త.

తే. ఉదధి లంఘించి దాటిన । యుత్తముండు
మదిని రామాజ్ఞ మీరక । మాయ లడఁచి
హృదయ మందున రామునిఁ । బదిల పఱచె
నౌర! మారుతి తత్త్వజ్ఞుఁ । డగుటవేమ. 646

హనుమంతుడు వాయుస్థంభన విద్యచే మనసున రాముని నిల్పి సముద్ర మవలీలగా దాటెనని వాయుస్థంభన, మనోనిశ్చయాన్ని నిరూపించెను.

ఆ. ఉదయమందు శివుని యూహించి । చూచిన
సుధయుఁ బుట్టి పరము । చూపుఁగాక
ముదము మించు మదిని । ముప్పిరిఁ గొనకున్నఁ
జేదు పుట్టి మాయఁ । జెఱుచు వేమ. 647

మనసులో శివుని మాయను జయించి చూడమని మనయోగి చెప్పెను.

ఆ. ఉదయమందు శూద్రుఁ । డుత్తమోత్తముఁడెట్లు ?
సతికి శూద్ర తనము । సత్యమె కద
తల్లి శూద్ర యాయెఁ । దానెట్లు బాపఁడో ! ॥వి॥ 648

స్త్రీ సహజముగా శూద్రురాలు ; ప్రతివాడు జన్మచే శూద్రుడే !

కం. ఉదయాద్రికిఁ బైనుండెడు
సదయుని మదినిల్పి చూడ । శక్యము గాఁగాఁ
గుదురుపడు జ్ఞప్తి నిలిపిన
నదియె పరిపూర్ణ సౌఖ్య । మందురు వేమా ! 649

సహస్రారము మీదనున్న పరమాత్మను జూచుటయే పరిపూర్ణము.

తే. ఉదర పోషణ కొఱకొన్న । నుబ్బిరాఁడు
మదిని లోగుట్టు విడువక । మర్మమూను
సదయ హృదయుండు శివయోగి । శాశ్వతుండు
నుపము సాధించి మించెడి । నుర్వి వేమ. 650

శివయోగి క్రమపద్ధతిని సాధించి ముక్తుడగునని సూచించెను.

ఆ. ఉద్ధరింపఁ గలుఁగు । నుత్తముండు కులంబు
మధ్యముండు దాని । మాటఁ గనఁడు
యధముఁడైన వాఁ డ । దగించు నొక్కఁట ॥ని॥ 651

వంశీయులయొక్క ధర్మము సూచించెను.

వాక్య :- ఉద్బుద్ధి లోక పట్టు । యురగంబు లోకపట్టు
కాకాలు యొకపట్టు । కలగుండ్లు యొకపట్టు
తొమ్మిది ద్వంద్వమాయ । పదిబద్ధమాయ
పులి బోనఁ బడె । నక్క నిక్కచూచె

కుక్క కూర్చుండబడెఁ । వాఁడో
వా డబ్బుఁడో । తెలియర వేమా !
కూట వేదాంతము.

ఆ. ఉన్న ఘనతఁ బట్టి । మన్నింతురే గాని,
పిన్న పెద్దతనము । లెన్నఁబోరు
వాసుదేవు విడిచి । వసుదేవు నెంతురా ! ॥వి॥
సహజనీతి చక్కని ఉపమానము

ఆ. ఉన్న తావు వదలి । యూరూరుఁ దిరిగిన
గన్న దేమి నరుఁడు । గ్రాసమునకుఁ
దన్ను లోనఁ జూడఁ । దమ మెల్ల వీడును ॥వి॥
"ఎంతవరకెళ్ళిన తెడ్డె గాడే" అను సామెతరీతి చెప్పెను.

ఆ. ఉన్న దన్న దెఱుక । యూహను రెట్టించి
మన్ను మిన్ను నడుమ । మాఱులేక
యున్నవాఁడె పరముఁ । గన్నవాఁ డగునయా ! ॥వి॥
భూమ్యాకాశముల మధ్యను ప్రకాశమానమైన పరమాత్మను తెలియుము.

ఆ. ఉన్న దానిని గను । మూపిరి బిగఁబట్టి
కన్ను మూసి యేమి । కానలేవు
విన్న దన్న దెఱుక । విజ్ఞానమందురా ! ॥వి॥
లేనిపోని పట్టిపోకిళ్ళను విమర్శించెను.

తే. ఉన్న నిర్వాణ నిజచర్యఁ । గన్నవాఁడు
తన్నుఁ దనలోనఁ జూచెడి । తత్త్వ మెఱిఁగి
సన్నుతించునుఁ బరమాత్మ । సమత మతినిఁ
గన్నుఁగానని వాఁడేమి । కాంచు వేమ.
మోహాంధుడేమియు గానలేడు.

ఆ. ఉన్నపుడు తా దినక । వుత్తపుడు లేదంటె
యెవరు యిచ్చువారు । యవనిలోన
వృక్షముంచిన వాఁడు । వుదకంబు బోయఁడా ! ॥వి॥
"పాదు పోయువాడు నీరు పోయడా" అను సామెతను వాడెను.

ఆ. ఉన్నయంత మనుజుఁ । డుపకారి కాలేక
కన్ను గనక యెల్ల । గర్వములను
దీను లయిన వారి । దిగువాయిగాఁ జూచి
పరముఁ గనక నూఁతఁ । బడును వేమ. 659

ఆ. ఉన్నయంత మనుజుఁ । డుపకారి గాలేక
కన్ను కానడంచు । ఘనుఁడుఁ బల్కు
దీనుడైన తనకు । దిక్కెవ్వరగుదురు ? ॥వి॥ 660

పైరెండు పద్యాల్లో ధనమదాంధులగూర్చి సూటిగా చెప్పెను.

ఆ. ఉన్నవార లెవరో ! । చన్నవా రెవ్వరో !
కన్నవార లెవరో ? । గానరారు
యున్న చన్న కన్న । నొక్కఁడే చూడరా ! ॥వి॥ 661

ఈయన్నిటికి కర్త పరమేశ్వరుఁడే.

ఆ. ఉనికి మేరు శిఖర । మున్నత్తతను జూచి
కనియుఁ గానబోవు । కదల దడియు
వినియు వినవు దాని । విమ లాంతరంగము 662

దీక్షతో వినుట, జూచుట ఉపక్రమించినచో ఉత్తేజమైన పరంజ్యోతి గానను.

కం. ఉపకారికి నుపకారము
నెప మెంచ్రని చేయ నెంత । నేర్పరి యగునా
యపకారికి నుపకారము
కృపతోఁ జేయుటయె? శస్త । కృత్యము వేమా ! 663

కం. ఉపకారికి నపకారము
నెపమెన్నుచు జేయరాదు । నేర్పరియైనన్
అపకారికి నుపకారము
కృపతో సేయంగవలయు । గుణనిధి వేమా ! 664

బద్దెనభూపాలుని. సుమతీశతక ము పద్యములు తారుమారుగా వేమనపేరుతో యిందు కూర్చిరి.

కం. ఉపజింపహాకు బ్రాగ్దిక్కునఁ
త్రిపుటికి మధ్యంబునందు । దీపము తానై
జపియించు రామమెవఁడొ
తపసిని గనుఁగొన్నవాఁడు । ధన్యుఁడు వేమా! 665

రామము = మనోహరమైన, ప్రియమైన.

కం. ఉపమరినై సత్యంబును
నెపములు లేకుండ నెంచు । నెఱజాణఁడవై
యుపవాసక్రియ దాటెఁడు
తపముననే తత్పరంబు । దరికొను వేమా! 666

ఉపమరి = ఉపాయశాలి (వెరివరి) "ఉపసమీపే యోవాసో జీవాత్మ పరమాత్మనోః। ఉపవాసస్సవిజ్ఞేయో నతు కాయ శోషణం" జీవాత్మ పరమాత్మను దెలియుట ఉపవాసము.

ఆ. ఉపము గలుగు నాతఁ । డూరకుండఁగ రాదు
గురుని తోడఁ బొందు । కూడవలయు
గురుఁడు సెప్పురీతి । గుఱిమీఱ రాదయా! ॥వి॥ 667

గురువాక్య మనుసరించి ఉపాయశాలి ప్రవర్తించును.

ఆ. ఉపముచేత గురుని । దపమునఁ జూడక
జపము సేయువాఁడు । చపలుఁ డగును
నెపమువడక మించి । నేర్పునఁ జూడరా! ॥వి॥ 668

గురువును గురుతుగా జూడమన్నాడు గురువు గురువు.

ఆ. ఉపముతోడ గురుని । యొప్పుగా సేవించి
జపము హృదిని జేయు । జాడ లెఱిఁగి
తపముఁ జేయువాఁడు । తత్త్వజ్ఞుఁడగు యోగి ॥వి॥ 669

తత్త్వజ్ఞఁడే ధన్యుఁడు

ఆ. ఉపము దోఁపసట్టి । యుపవాసముల లేదు
తపముచేయలేదు । తగులరాదు
జపము లోన గుఱిని । జవదాటకుండురా! ॥వి॥ 670

జప సూత్రముఁదెలసి తపశ్శాలి కావాలని చెప్పెను.

ఆ. ఉపవసించి నంత । నూరబందిగఁ బుట్టు
తపసియైె దరిద్ర । తను వహించి
శిలకు మ్రొక్కనగునె? । జీవము గలబొమ్మ ॥వి॥ 671

నిర్జీవికి జీవిమ్రొక్కుట అవివేకము.

ఆ. ఉపవసించు చుండి । యోగి నీళ్ళ మునిఁగియు
కూడువండి వేల్పు । గుడువు మనుచు
దాని నోరుకొట్టి । తామె తిందురు కదా! ॥వి॥ 672

ఆ. ఉపవాసము నుండి । యోగి నీళ్ళలో మునిఁగి
కూడువండి వేల్పుఁ । గుడువు మనుచు
దానినోరుఁ గొట్టిఁ । తమరె తిందురుగదా! ॥వి॥ 673

దేవతలపేరుతో దేబెలు తమ కుక్షి నింపుకుందురని పై రెండుపద్యములలో పరిహాసింపబడినది.

ఆ. ఉప్పు కప్పు రంబు । లొక్కరీతున నుండు
చెప్పఁజెప్ప వారి । చెవులు వెఱ్ఱి
పురుషు రూపొక్కటి । పుణ్యపురుషుఁడు వేఱు ॥వి॥ 674

" గణం తప్పింది.

ఆ. ఉప్పుఁ గప్పురంబు । నొక్కపోలిక నుండుఁ
జూడఁ జూడ రుచులఁ । జాడవేఱు
పురుషులందుఁ బుణ్య । పురుషులు వేరయా ॥వి॥ 675

ఆ. ఉప్పుఁ గప్పురంబు । నొక్కరూపున నుండుఁ
దవిలిచూడ వాని । చవులు వేఱె
పురుషరూపములనుఁ । బుణ్యాత్ములిట్టులే ॥వి॥ 676

పై మూడుపద్యముల భావం ఒక్కటే. రుచులనగా వాటి స్వతస్సిద్ధ కాంతులు వేరు.

ఆ. ఉప్పు చింతపండు । నూరిలో నుండఁగా
కరువులేల? వగవ । కాపులార;
తాళకంబు లేదొ? । తగరంబు లేదొకో ॥వి॥ 675

ఆ. ఉప్పు చింతపండు । లూరిలో నుండఁగా
గలి వదేల వచ్చెఁ । గాపులార;
తాళకంబెటుఁగరొ ? తగరంబు నెటుఁగరో ॥వి॥ 676

పై రెండు కొద్దిమార్పులతో ఒకేభావం.

రసవాదం యిట చెప్పెను. ఉప్పునీళ్ళలో వేసిన కరుగును. శరీరము అట్లే నశించును. చింతపండు బెరడునకెట్లు అంటి అంటక యుండునో ! అట్లేసంసారమున తా నుండవలయును. తాళకము నిప్పులో మాయ మగురీతి శరీరమూ మాయమగును. తగరము భూమిలో నశించురీతి శరీరము నశించును. యీవేదాంతార్థము విజ్ఞులు దెల్పుచున్నారు.

ఆ. ఉప్పు జెముడు పాలు । నూరనే యుండంగఁ
గలువు కలువ టండ్రు । కాపులార ;
* సత్తు పొత్తు చేసి । సాధించి చూడక ॥వి॥ 677

* పాఠాం :– సత్తు పిత్తకుండ । సాధింప నేరరో ॥వి॥
యిది రసవాదమే ?

ఆ. ఉప్పు, నీరు నట్లు । లూహించి చూచినఁ
గప్పురంబు జ్యోతిఁ । గలిసి నట్లు
తుప్పటిల్లు మదినిఁ । దొలఁగక శివుడుండు ॥వి॥ 678

తుప్పటిల్లు = కలసి, లీనమై,

ఆ. ఉప్పులేని కూర । * యూనంబు రుచులకు
పప్పులేని తిండి । ఫలములేదు
యప్పులేని వాఁడె । యధిక సంపన్నుఁడు ॥వి॥ 679

ఊనము = తక్కువ
పాఠాం :– "యెప్పుడు"

ఆ. ఉబ్బి గురుని వేడి । నిబ్బర పడువాఁడు
దబ్బ రాడఁ బోఁడు । తత్తరమున
నిబ్బరంపు మదిని । నిర్విష్టతను గాంచు ॥వి॥ 680

గురువుని తెలిసికొన్న వాడు జగద్గురువనబడును.

ఆ. ఉబ్బి గుట్టుఁ జూచి । యూహాను రెట్టించి
నిబ్బర పడువాఁడు । నిర్మలుండు
యబ్బరాని బయలు । నందును బొందును ॥వి॥ 681

కష్టసాధ్యమైన గురుతును తెలిసి పరిపూర్ణుడగును,

ఆ. ఉయ్యాలందుఁ జేర్చి । యూహించి నిద్రింప
నెయ్యమమర మదిని । నిలిపినపుడె
దయ్యమంత బ్రహ్మ । తన్మయ మందురా! ॥వి॥ 682

దయ్యము = పెద్దది;

ఆ. ఉరిదిగాను గాలి । యున్నతిఁగను మింట
దురితముగను వచ్చి । తొలఁగుచుండుఁ
బురముపైన నిల్చి । పూనికఁ జూడరా ॥వి॥ 683

ఉరిది = ఎక్కువ; మహదాకాశ పరంజ్యోతిని దర్శించిన బ్రహ్మత్వమందు నని వేమన వాకొనెను.

ఆ. ఉర్వి జనులు పరమ । యోగీశ్వరునిఁజూచి
తెగడువారె కాని ; । తెలియలేరు
* యమృతమందు రుచిని । హస్తమే మెఱుఁగును ? ॥వి॥ 684

* పాఠాం :— యమృత మాది రుచుల । హస్తంబదే మెర్గు.

ఆ. [1] ఉర్వి జనులకెల్ల । నొక్కకంచము బెట్టి
పొత్తు కుడిపి । కులము పొలయఁజేసి
తలనుఁ [2] జెయ్యిబెట్టి । తగనమ్మఁ జెప్పరా ! ॥వి॥ 685

పాఠాం "1 ఉర్వివారికెల్ల 2 "జేయిబెట్టి"
సర్వసమత్వం చిత్రించెను.
పలనాటి బ్రహ్మన అందరికిని "చాపకూడు" దినిపించెను.

ఆ. ఉఱుము మెఱుపురీతి । నొప్పెడు మదియందు
మరలు సేరి దాని । మహిమఁ జెఱుచు
నరులు మరుల దగిలి । నరకమందెదరయా ॥వి॥ 686

భ్రాంతులవలన భవ్యత్వము నశించును.

కం. ఉఱుముల టుఱిమిన యప్పుడు
శిరమునఁబడి క్రుంగునట్లు । చిత్తము భ్రమయుం
ధరఁ బిడుగెక్కడఁ బడినను
మురియుచుఁ గడచితిమటంద్రు । ముందుగ వేమా! 687

బాధల రాకకు భయము, వచ్చిపోయిన సంతోషము సామాన్యమానవులు పొందుదురు.

ఆ. ఉసురులేని తిత్తి । యిసుమంత యూఁదనే
పంచలోహములును । భస్మమౌను
పెద్ద లుసురు మన్నఁ । బెనుమంటలెగయవా? ॥వి॥ 688

ఉసురులేనితిత్తి = కొలుముతిత్తి.
మంచివాని మనసు నొచ్చిన మహాప్రళయం వచ్చును.

ఆ. ఊకయందుఁ బుట్టి । యున్నది యన్నంబు
ప్రాఁకునందు ఫలము । మానితమగు
సోకు గాలి పట్టి । శోధించుచుండురా! ॥వి॥ 689

అన్నమునకు ఊక, ఫలములకు చెట్లు ఆధారమగునట్లు ప్రభంజన వాయువు ప్రాణమున కాధారము.

కం. ఊకొనఁ జెప్పిన వినదది
ప్రాకటముగ లోకములను । పాలించెడు, నా
పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ । నెన్నుము వేమా! 690

పరిపూర్ణమును ప్రశంసించెను.

కం. ఊకొని వినఁగా వచ్చును
బ్రాకటముగ గథలనెల్లఁ । బలు తెలుఁగులుగా
నేకీభావము నందును
సోకుట దుర్లభము మదికి । సుడివడు వేమా! 691

"కథకు కాళ్ళులేవు" "చెంబుకు చెవులులేవు" అను నార్యోక్తుల నిటవాడెను.

ఆ. ఊగి యూగి లాగి । యున్నది గనఁగొరు
సాగ లాగి పట్టు । సాక్షిగాను
యోగమమర యుక్తి । యోజించి మించరా! ॥వి॥ 692

ఆ. ఊగి లాగి గాలి । యున్నతిఁ గనుఁగొను
సాగదోలి మనసు । సైగఁజేర్చి
వేఱు లేకయుంట । వేదవేద్యముసుమ్ము ॥వి॥ 693

ఆ. ఊగిలాగి గాలి । యురువడిఁ గనలేక
తోలుతిత్తి యందుఁ । దూఁగుచుండ్రు
పరమ సరణిఁ బట్టి । పైకొని చూడరా ! ॥వి॥ 694

ఈమాట ప్రాణాయామంగురించి చెప్పియు కుంభక యోగమును కొనియాడెను.

ఆ. ఊడిగంబుఁ జేసి । యుబ్బించి గురువును
గూడి పొందవలెను । గోర్కె లడఁచి
వేడి పరమపదవి । వెలయంగఁ జూడరా ! ॥వి॥ 695

ఊడిగము = సేవ.

ఆ. ఊడిగంబుఁ జేసి । యోదార్చి గురువును
వేడి మ్రొక్కి గుఱుతు । వెలయనెక్కి
పాడి యాడి ముక్తిఁ । బడయుటే మోక్షంబు ॥వి॥ 696

గురుకీలకముగా పరబ్రహ్మను గుర్తించుటయే ముక్తిగా వేమన నుడివెను.

ఆ. ఊతకట్టఁ బట్టి । యురదిగాఁ బోవచ్చుఁ
గోఁతి కొమ్మ లందుఁ । గుదిరినట్లు
జ్యోతి యందుఁ బొంచి । సోహంబుఁ గనవలె ॥వి॥ 697

"సోఽహం" అను శ్రుతి వాక్యము స్మరించెను.

ఆ. ఊని లాగి లాగి । యొనరంగ బిగఁబట్టి
పూని గాలి విడిచి । పురినిఁ జేర్చి
మేను మరచి యుంట । మితిలేని భావంబు ॥వి॥ 698

పూరక, కుంభక, రేచకములను తెలిసికొనుట గొప్పభావమన్నాడు.

ఆ. ఊపఁబోయి కొంత । యూగించి విడిచిన
నూగుఁ గాని గమ్యఁ । మొందలేదు
పట్టు పూన్కి కొలఁదిఁ । బనిసేయు లక్ష్యంబు ॥వి॥ 699

"ఎంత చెట్టుకంత గాలి" అను సూక్తి ననుసరించెను.

క. ఊపిరి లోనికి లాగుచుఁ
బ్రాపుగ లో నిలువఁజూచి । పనుపుగ విడుచుం

జూపోర్వని బయ లందుచు
గాపుగ నీలోనె నిన్నుఁ । గనవలె వేమా! 700
ప్రాణాయామపద్ధతిలో పరమాత్మను నీలోభావించమన్నాడు మనయోగి.

ఆ. ఊపిరి ఘట మందు । యుదకంబు లోపాలిన్
వరద రీతి తుర్లి । వణుకు చుండు
వణుకు * తెలిసిన వాఁడె । గుణవతి పుత్రుండు ॥వి॥ 701
పాఠాం :- "తెలియు"
శరీరములోనున్న పరమాత్మను తెలసినవాడే ముక్తికాంత పుత్రుఁడు.

ఆ. ఊపి రున్నయపుడె । యుప దేశ మందుము
రూపు మాయ నెపుడో । రూఢిగాను
బాపఁ డైన నేమి । బడబాగ్ని మ్రింగునా? ॥వి॥ 702
బ్రాహ్మణజన్మముచేత బడబాగ్ని మ్రింగునా!

తే. ఊపి రున్నంత వరకును । గాపురంబు
చేసి కడ తేర లేకయో । చిక్కుపడరె?
పాపలోఁజూపు మించుటే । పావనంబు
దాని మార్గంబె తెలియఁగాఁ । దగును వేమ. 703
ప్రాణముండఁగనే నేత్రబింబువులోనున్న నారాయణుని గనవలెను.

ఆ. ఊరకుండఁ దెలియ । నుత్తమయోగంబు
మానసంబు కలిమి । మధ్యమంబు
ఆసనాది విధుల । నధమ యోగంబురా! ॥వి॥ 704
ఆసనము లుచేయువారిని గారడీవాళ్ళగా బోల్చెను.

ఆ. ఊరఁ బందెఱంగ । దుత్త రావాచులు
చెడ్డ నరక మెల్లఁ । జెందుఁగాక
సాధ్వి మహిమ మెట్టు । స్వైరిణి యెఱుఁగురా? ॥వి॥ 705
జారిణి పతివ్రతమహిమ తెలియజాలదు. ఆవాచులు = శ్రేష్ఠమగు సామానులు

ఆ. ఊర్ధ్వ లోకమందు । నుచిత క్రమంబున
రూప మేమిలేక । రూఢితోను (నుండ)
బరమ యోగి చూచుఁ । బరమాత్ముఁ డితఁడని ॥వి॥ 706
పరమాత్ముని నిర్గుణరూపముతో చూడవలెను.

ఆ. ఊరి *పిచ్చికరీతి । పుర్విలో జనులెల్ల
నారి మణులఁ బొంది । నష్టమైరి
ముక్తికాంతఁ గూడి । ముద్దిడలేరయా! ॥వి॥ 707

పాఠాం :- "పిచ్చుకవలె". రెండవపాదంలో గణంతప్పింది.

అమిత వ్యసనపరులు అంగనాలోలురేగాని మోక్షాంగన పొత్తుబడయలేరు.

ఆ. ఊరి బావిలోని । యుదకము నిందించి
పాదతీర్థమునకు । భ్రమసి నారు
పాదతీర్థములను । ఫలమేమి యుండురా! ॥వి॥ 708

కపటగురుల పాదతీర్థము అపవిత్రమని చాటెను.

ఆ. ఊరిలోనఁ బుట్టి । యూరిలోనఁ బెఱిఁగి
యూరిలోనె జ్ఞాన । వంతుఁడయ్యె
యూరు విడిచిపెట్టి । యడవి జేరుటమేలు ॥వి॥ 709

2, 3 పాదములు యతులఁ తప్పినవి.

ఆశ్రమ చతుష్టయములలో అంత్యమే గొప్పదనెను.

వాక్యము. ఊరిలో బంగారు । వెలయిచ్చి కొనఁబోతె
యెవరేమి యందురో । యనుచు బెదరి
సత్యమే నిజమైన । సిద్ధ వర్తిరిజేస్తి
విమల గుణరాజ! యోగీంద్ర । వేమనార్య! 710

జ్ఞానజ్యోతి బజారులలో కొను వస్తువు కాదు.

తే. ఊర్జితానంద పరిపూర్ణ । యుక్తియుందు
స్వార్జితంబగు గురుభక్తి । సంతరించి
దుర్జయంబును దూలించి । తొలఁగఁజేయ
గర్జముగ ముక్తి లభియించు । గదర వేమ. 711

యీపద్యములో సమవృత్తములవలె వేమన మహాకవి గాబట్టి అందమైన ప్రాసల పొందికతో నడిపించెను. కర్జము = తప్పకుండ.

ఆ. ఊరుకాడుఁ దిరిగి । యున్నది కనలేక
పోరు గురులఁ గనక । పొందుపడక
తాఱుమాఱుగాను । దత్తరపడనేల ॥వి॥ 712

చిత్తచాంచల్యమువలన భ్రమసి సర్వత్ర తిరిగిన సౌఖ్యములేదు.

ఆ. ఊరు కొండవీడు । నునికి పశ్చిమవీధి !
మూగచింతపల్లె । మొదటియిల్లు
యరసిచూడ బయలు । నది ముక్తిశివుఁడయా ॥వి॥ 713

ఆ. ఊరు కొండవీటి । కునికి పశ్చిమవీధి
మూగచింత పల్లె । మొదటియిల్లు
యెడ్డె రెడ్డికుల మ । దేమని తెల్పుదు ॥వి॥ 714

పైరెండు పద్యములలో కొంచెం మార్పుతో తనచిరునామా తన కులమును నిష్పాక్షికముగా చెప్పెను.

ఆ. ఊరు నమిడి బావి । యుదకమ్ముఁ దెలియక
పాద తీర్థ ములను । భ్రమిసినారు
పాద తీర్థమన్న । ఫలమేమిక ద్దురా! ॥వి॥ 715

గురుపాదతీర్థమునకు ప్రాకులాడే వారిని వెంగళులుగా చెప్పెను.

ఆ. ఊరు నూరుఁ దిరిగి । యున్నది గనలేరు
మోర యెత్తిచూచి । మొనయలేరు
పాఱఁజూచు టదియె । పరబయల్గాదెకో! ॥వి॥ 716

పారజూచుట = నిదానముగా జూచుట.

ఆ. ఊరు యనుచు నుండు । లోగి సంతసింతురు
యడవియనుచు నుండు । నడలుచుంద్రు
యూరుయడవి రెండు ! నొకటిగాఁ జూచిన
నారితేరి యోగి । యతడు వేమ. 717

స్థల విచక్షణలేక సమత్వముననున్న చక్కని యోగిగా చిత్రించాడు.

కం. ఊరులు పల్లెలు మానక
వారక యడవిం జరించు । వాఁ డరుదెంచు
న్వేరులుఁ గూరలు మెసవెడు
వీఱఁడి కెట మోక్షపదవి । వినరా వేమా ! 718

వీరడు = వెఱ్ఱివెంగళప్ప,

ఆ. ఊరు విడువకుండు । నుత్తమ శివయోగి
పోరి చూచు మదినిఁ । బూర్ణ సుఖము
దారిలోని నక్క । తలపెట్టఁ బోవునే ॥వి॥ 719

నక్క = ఆశ ; షడ్గుణాల నతిక్రమించి మాయను నిర్జించిన వాడే మంచి యోగి. నక్కను మాయతో బోల్చెను.

ఆ. ఊసరిల్లి పిచ్చి । యుపమున రసమునఁ
జేర్చి నూరి సతులు । చెలువము గను
వశ్యమనుచు మగని । వరియించి పెట్టంగ
రోగ మమటి నీల్గు । రూఢి వేమ. 720

మరుల మందులని మగలకు ప్రయోగించే మహామారులను ముండమోపులుగా చేస్తుందీపద్యము.

* ఆ. ఋగ్యజుస్సు లెఱిఁగి । యోగ్యత లేకున్న
విప్రుఁ డైన నెట్లు । హితుఁడు యగును
భర్తగలిగి యన్య । భావించు సతివలె ॥వి॥ 721

* యతి తప్పు.

వేదములు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము, వేదము లెరిగినా విజ్ఞానము లేకుంటే శుంఠయని మనకవినూక్తి.

ఆ. ఋణము పెంచి యిచ్చి । హీనుఁగా నొనరించి
విడుచు తండ్రి వైరి । వీరుఁ డరయ
యలవి గాని యట్టి । యాలును నట్టులే ॥వి॥ 722

లోకధర్మమును రూఢిగా జెప్పెను.

ఆ. ఋణ మొసంగు నాతఁ । డినుఁడగుఁ దొలుఁ దొల్త
నదియు మరల నడుగ । యముఁడన నగు
యప్పుఁ జేసి తీర్ప । నరయని వారికి ॥వి॥ 723

ఇది లోక ధర్మము. ఇనుడు = సూర్యుడు (లోకబాంధవుడు)

ఆ. ఋతమనృత మెఱుంగ । నెవ్వరి తరమగు
స్థితియుఁ గతియుఁ దెలియఁ । దేట వడును
విన్న మాత్రమునను । వివరింపఁగా రాదు ॥వి॥ 724

సత్యాఽసత్యము లెరుగుట చాలకష్టము.

ఆ. ఋతువు ననుసరించి । స్థితికాలమున నొప్పు
గతినిఁ బట్టి మనుజు । మతియు నొప్పు
స్వేచ్ఛఁబట్టి యువిద । చెల్లాటమును నొప్పు ॥వి॥ 725
ఋతువు = తగినసమయము. స్త్రీస్వాతంత్ర్యమును గర్హించెను.

ఆ. ఋషి కులంబునందు । ఋషిగా జన్మించి
కులము గోత్రములను । గొప్పలైరి
బ్రహ్మసంతతెట్లు ? । బ్రాహ్మణు లెట్లైరి ? ॥వి॥ 726
జాతిలోగాక చేతలోయుంది.

ఆ. ఋషికులమున దాము । ఋషిగాజన్మించి
కులము గోత్రములను । గోప్యపఱుప
బ్రహ్మకులముగాక । బ్రాహ్మణులెట్లైరి ? ॥వి॥ 727
గోప్యము = రహస్యము బ్రహ్మకులము = బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః

ఆ. ఋషు లటడ వినుండి । రుచులు గోరుట రోఁత
నరులు కలిగి తినమి । నరయ రోఁత
* భార్యలనుచు వారి । భరియింపమియు రోఁత ॥వి॥ 728
* పాఠాం:— "ఎద్దులు గూడుటయె । యెన్న రానిరోఁత"
ఈ పద్యములో చక్కనినీతిని చిత్రించెను.

ఆ. ఋషులు గానుపింత్రు । హీనుల యట్టుల
వారిబోధ పెద్ద । మేరువంత
లోన నున్నయట్టి । జ్ఞానంబు మహిమరా ॥వి॥ 729
"ఎట్టి పుట్టలోనన ఎట్టి పాముండునో" అను వాక్యము ననుసరించెను.

ఆ. ఋషులెఱుంగ నట్టి । విషయంబు భువిలేదు
వారు చెప్పినంత । వరుస నగును
తెలియ కనెడువారు । దేబెలు నిజమయా! ॥వి॥ 730
ఋషులు గొప్పవారని చెప్పెను.

ఆ. ఎంగిలంత వట్టు । హితవుగా నెంచక
[1] యొగ్గియుందురంత । నుర్వి జనులు
కన్న యెంగి[2]లెంత? । [3] కనులెంగి లధికమా ॥వి॥ 731

పాఠాం :— 1 మట్టు 2 తినక 3 కనులెంగి
ఒగ్గి = విడచి "ఎంగిలన్నవారు వేదాంతులైయుంటె జగమెల్ల ఎవరెంగిలి" అను సూక్తి వాడెను.

ఆ. ఎంగి లెంగి లందు । రిలవేద శాస్త్రముల్
చదువునట్టి విప్ర । జనములెల్ల
నెంగి లవుట యెఱిఁగి । యెంగిలే కుడుతురో ! ॥వి॥ 732

ఆ. ఎంగిలెంగిలనుచు । నీనోఁటి తోడనే
వేదములనుఁ జదువు । వెఱ్ఱులార
యెంచిచూడ నదియె । యెంగిలి గాదొకో ॥వి॥ 733

బ్రాహ్మణులు ముఖ్యముగా ఎంగిలందురు. దానిని నిరసించెను. పైమూడు పద్యములు ఎంగిలిగురించి చెప్పెను.

ఆ. ఎంచియెంచి పూజ । లెన్ని సేయఁగనేమి
భక్తి లేని పూజ । ఫలములేదు
కన్న పూజసేయు । కారణమెఱుఁగుడీ ॥వి॥ 734

మాతాపితృభక్తి ప్రశంసించెను.

ఆ. ఎండ చీకటులకు । నిమ్మయి యుండెడు
నిండ కుండ లోన । నిద్రమరచి
దండియైనఁ బరమ । తత్త్వంబుఁ దెలియరా ! ॥వి॥ 735

నిశ్చలంగా నీలోనున్న బ్రహ్మను జూడుమనెను.

ఆ. ఎండనీడ చంద । మెఱుఁగనేరని యప్పు
డుండబోవఁ డాతఁ । డుర్విలోనఁ
దిండిపోతునాగఁ । దిరుగుచు నుండురా ! ॥వి॥ 736

మంచిచెడ్డ లెరుగని అవివేకిని సోమరిగా చిత్రించెను.

ఆ. ఎండనీడ చంద । మెఱుఁగ నేర్చిన యోగి
యుండు నెల్లకాల । ముర్విమీఁదఁ
దిండిపోతు వశమె ? । తెలియంగ జ్ఞానంబు ॥వి॥ 737

పై రెండుపద్యము లాక్షేభావములో నున్నవి. సోమరి విజ్ఞానము తెలియలేదని సూచించెను.

ఆ. ఎండ నీడ వన్నె । యేకమా నట్టుగ
నిండుకుండ లందు । నిలువఁజేసి
దండి తత్త్వ మెల్లఁ । దలపోసి చూడరా ! ॥వి॥ 738

సమస్తమును సమత్వముగాఁ జూచి హృదయములోని అసలు విషయాన్నందు కొమ్మన్నాడు.

తే. ఎండమావుల చాడ్పగు । నీ జగంబు
లుండుఁ బరమాత్మ యందును । దండిగాను
నిండుమదిలోన శోధించి । నెగడవలెను
* మిథ్యయను నమ్మకము పుట్టి మీఱఁ వేమ. 739

* పాఠాం:— "విమలగుణరాజ యోగీంద్ర । వేమనార్య !"

భ్రాంతినిటు జూపించెను. ఎండమావు=లేనిదున్నట్టుగా అగుపించునది.

ఆ. ఎండయనక తిరుగు । నిర వెఱింగినయోగి
నీడనున్న వానిఁ । జూడవలెనె !
ఎండ నీడలున్నె ? యెఱిఁగిన వారికి ॥వి॥ 740

ద్వంద్వాతీతుని ప్రశంసించెను.

ఆ. ఎండ యనకఁ దిరుగు । నెర వెఱింగినయోగి
యుండునెల్ల కాల । యుర్విలోన
తిండిపోతు వశమె ? । తెలియంగ జ్ఞానంబు ॥వి॥ 741

నెరవు = మూలసూత్రము.

నిజమగుయోగివలె సోమరి తెలియలేడు.

ఆ. ఎండలోనఁ జీక । ఏకమై యున్నట్లు
నిండుకుండ నీరు । నిలచినట్లు
దండిగఁ బరమాత్మ । తత్త్వంబుఁ దెలియరో ! ॥వి॥ 742

ప్రపంచము మంచిచెడ్డల కలయిక.

క. ఎండిన మానొక టడవిని
యుండిన శిఖ బొడమి తరుల । నొనరఁగఁ గాల్చున్
దండిగల వంశనాశము
చండాలుం డొకడుబుట్టి । సల్పునువేమా! 743

లోకనీతిని మనకవి వాకొన్నాడు. శిఖ = అగ్ని.

క. ఎండిన మానొకఁ టడవిని
నుండిన నందగ్ని పుట్టి । యూడ్చును జెట్లన్
దండిగల వంశమెల్లను
జండాలుం డొకఁడుపుట్టి । చదుపును వేమా. 744

చదుపును = పాడుచేయును.

ఆ. ఎంత కడుఁగ నోటి । యెంగిలి పోవునే ?
యెల్లకాల మందు । నెంగిలి తగు
యను దినంబుఁ జూడ । నన్నృత మాడెడు నోరు
నోరె ? పీత బొక్క । తీరు వేమ. 745

పీతకన్నమువలె అబద్ధాలాడేవారి నోళ్ళని వర్ణించాడు.

ఆ. ఎంత కష్ట ముండు । నంత పాపపుఁ జింత
చింతచేత మిగులఁ । జివుకు మనసు
చింతలేక యున్నఁ । జెడని సంపదఁగాంచు ॥వి॥ 746

మానసికానందమే మహాభాగ్యము.

ఆ. ఎంత కడుగ నోరు । యెంగిలి బోవునా ?
యకృతము లిడు నోరు । యదియు నోరె ;
యనుదినంబుఁ జూడ । యన్నృత మాడెడు నోరె
నోరు గాదు క్రింది । నోరు వేమ. 747

క్రిందినోరు = మలవిసర్జనావయవము (గుదము)

ఎవరిని ఏమీ అననినోరు ఘనమని, అబద్ధమాడేనోరు గుదముతో సమానమని చెప్పెను

ఆ. ఎంత కరువు గాని । యెంగిలి యన్నము
పరుల కిడెను ధర్మ । పరులఁ జూడ

యిలను బడిన యట్టి । యెంగిలాకులు నాకు
కుక్కలై పుడుదురు । కూడివేమ. 748

ఎంగిలి పరులకు పెట్టుట మహాపాపమని చెప్పెను.

ఆ. ఎంత కరువు లైన । యెంగిలి యన్నము
పరులకిడెడు ధర్మ । పరుల జూడ
భూమి యెంగిలైన । పుల్లాకు నాకెడు
శ్వానమై పుడుదురు । జగతివేమ. 749

శ్వానమై = కుక్కయై.

తే. ఎంత కాలము వ్యర్థమై । యంతవీలు
సంతసంబున జిక్కఁగా । జలకమాడి
పాత్రఁ బుష్పములిడికొని । పట్టుకొనియు
గుహాముఖము సొచ్చి కనుఁగొంటి । గురుని వేమ. 750

వేమన మంత్రోపదేశము పొందుటకు ముందటిచరిత్ర సూత్రీకరించెను.

ఆ. ఎంతకాల మున్న । నెఱుక లేకయే జీవి
చచ్చి పుట్టుచుండు । సహజముగను
యెఱుక మఱుపుఁ గలుగ । నెఱుఁగునా బ్రహ్మంబు ॥వి॥ 751

తెలసిన తరువాత మరచిన తప్పు.

ఆ. ఎంత క్షామ మైన । నెంగిలి యన్నము
పరుల కిడెడు ధర్మ । పరు లరయఁగ
నెంగి లుండు పుల్లె । లెప్పుడు నాకెడు
శ్వానములుఁగ బుట్టు । నోను వేమ. 752

పుల్లెలు = తినిన తరువాత విడిచిన విస్తరి.

ఆ. ఎంత చదువు జదివి । [1]యేనీతి విన్నను
హీను డవగుణంబు । మాన[2]డెందు
బొగ్గు పాలఁ గడుగ । బోవునా [3]మలినంబు? ॥వి॥ 753

చక్కని ఉపమానోపమేయములు సూచించెను.

పాఠాం:- 1 ఎన్ని విన్ననుగాని 2 లేదు 3 నైలంబు

ఆ. ఎంత చేసి చేసి । యేపాటు పడినను
రాచమూక నమ్మ । రాదు సుమ్మ
పాము చెలిమి విడువ । పదివేలు వచ్చిన ॥వి॥ 754

పాము స్నేహము రాజు స్నేహము ఒక్కటే.

ఆ. ఎంతనాఁటి నుండి । యెనసిన మోహమో!
చెలిమిచేత తల్లి । చెల్లె లక్క
యన్నదమ్ము లనెడి । యాభ్రాంతినే పడు ॥వి॥ 755

ఆత్మభ్రాంతి విడువరానిది;

ఆ. ఎంత నేర్పుతోడ । నేమేమి చదివిన
జింతలేని విద్య । చిక్కఁబోదు
పంతగించి మదినిఁ । బరికించిచూడరా! ॥వి॥ 756

చింత = విమర్శన

ఆ. ఎంతభాగ్య మున్న । నంత [1]నష్టపు జింత
చింతచేత మనసు । చివుకు మనును
చింతలేక యున్నఁ । [2]జెడ నోని సంపద? ॥వి॥ 757

పాఠాం:— "1 కష్టపు 2 చెడిన సంపదయేది"

ఎంతయున్న అంతఆశ; ఆశకంతులేదు. తగిన ఆశ యుండవలెనని బోధించెను.

ఆ. ఎంతభూమిఁ దిరిగి । యేపాటు పడుచున్న
నంటనీక ప్రాప్తి । వెంటఁ దిరుగు
భూమి క్రొత్తదైన । భోక్తలు క్రొత్తలా! ॥వి॥ 758

అదృష్టము ననుసరించి ఆయాఫలితములు కలుగునని వేమన సూక్తి.

ఆ. ఎంత మాత్రమైన । నెంగిలి గాకుండఁ
బలుక వశముఁగాదు । బ్రహ్మకైన
నెవ్వరనిన మాట । యెట్టు తాఁ బల్కును ॥వి॥ 759

"బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అను శాస్త్రోక్తి వాడెను.

ఆ. ఎంత వింత మదికి । నే మేమి తోఁచినఁ
జింతచేయరాదు । చిక్కువెట్టు
వింతలోనిఁ గుట్టు । వివరింపఁ దానగు ॥వి॥ 760
చింతాక్రాంతుడు కాకూడదు.

ఆ. ఎంత వేల్పు నకును । నెనఁగ నైవేద్యంబు
వాసనఁ గనకుండ । వండ లేరు
మీఁది మీఁది యనుచు । మ్రింగేరు గుక్కిళ్లు ॥వి॥ 761
గుక్కిళ్ళు = గుటకలు
వంటకములు వండి స్వామీ! నీవు తినుమని తామే దిన్నవారిని ప్రశంసించెను.

ఆ. ఎంత సంప దొనరు । నంత కష్టపు చింత
చింతచేత మనసు । చివుకు మను
చింత లేక నున్న । చెదరి సంపదఁ జూడఁ ॥వి॥ 762
ఒనరు = ఒప్పిన; దనచింత విడచి విజ్ఞానచింత పూనమన్నాడు మనవేమన;

ఆ. ఎంత సేవజేసి । యేపాటు [1]బడ్డను
రాచ [2]కృపను నమ్మ । రాదు [3]సుమ్ము
[4]పాముతోటి చెలిమి । పదివేలు చెప్పినా ॥వి॥ 763
పాఠాం:— 1 పడినను 2 మూక 3 రన్న 4 పాముతోడి పొంకుల, పదివేలకైనను
రాజులసే వకష్టమని చెప్పెను.

కం. ఎందఱు కొండల గాచిన
నెందఱు ముద్దియల । యెదుట నెనగఁ గనిన
న్నందరు లెందఱి కేమన
నందరినీ తల్లు లట్టు । లరయుము వేమా! 764
స్త్రీలను మాతృభావముతో గనమన్నాడు.

కం. ఎందఱో నాటిన బొందది
యొందఱో వట్టిన కుచంబు । లెందరో రుచిగా
నందిన పెదవదిఁ గల స్త్రీ
లందు మనన భ్రమలులేక । యరయుము వేమా! 765
స్త్రీశరీరము అనేకమంది రుచి చూచినది.

కం. ఎందాఁక మనసు నిల్చిన
నందాఁకను బూర్ణసుఖమె । యరుదుఁగ దోఁచుం
బొందిక మీఱిన బ్రహ్మము
సుందరమగు తన్మయంబుఁ । జూడర వేమా ! 766

తన్మయత్వముతో బ్రహ్మను జూడుము.

కం. ఎందును దలపఁగ లేఁడట
పొందుగఁ బరమాత్మయందుఁ । బొందుట యట్లే
ముందుగఁ దనుఁ దాఁ దెలిసిన
నందే పరమాత్మ దెలియు । నవవిని వేమా! 767

తన్ను దానుఁ దెలసిన బ్రహ్మను దెలిసినట్లే.

తే. ఎందు నెందును జూచిన । ముందె యగును
బొంది పొందక తోఁచెడి । పోక లయము
ముందె యెఱుకను మాయింపఁ । జెందుఁ బరము
సందె చీకఁటి నెలమాపు । సరణి వేమ. 768

నెలమాపు = నెలాఖరు, అమావాస్య ; సందెచీకటి అమావాస్య చీకటిలో
గలసిన తీరుగా మనసులో సందేహము లేనప్పుడే పరమాత్మలో లీనమగును.

ఆ. ఎందు నెఱుక వాని । కిహపరములు లేవు
ప్రాణహానిలేదు । ప్రణయమునను
ప్రళయ కాలమైన । బరమాత్మఁ గలియురా! ॥వి॥ 769

సర్వమూ బ్రహ్మగా నెంచిన ద్వంద్వములు లేవు ; ప్రళయము = నశింపు.

ఆ. ఎంబెరు మతమందు । [1] నెసఁగి మాంసముఁ దిని
మారుపేర్లు పెట్టి । మధువుఁ ద్రావి
వావి వరసఁ దప్పి । [2] వర్తించి చెడుదురు ॥వి॥ 770

* పాఠాంతరం 1 నెసగ. 2 "వలికి పాలౌదురు"
"వైష్ణవుల లోపముల నిట శోధించెను.
పెరుమాళ్ళ తీర్థము = కల్లు, లక్ష్మీప్రసాదము = చీల్చిన మాంసపు ఖండము
లకు లక్ష్మీప్రసాదమనియు వాడుదురు.

క. ఎక్కడ వెదకినఁ దానై
మ్రొక్కనుఁ దావెందులేక । మూలము తానై
చక్కఁగ నిర్భయుఁ డగుచును
నిక్కము నిన్నంటి యుండు । నిజముగ వేమా ! 771

ఇట సర్వవ్యాపకుఁడగు సర్వేశ్వరుని ప్రస్తావించెను.

క. ఎక్కడ సుతులెక్కటి సుతు
లెక్కడి బంధువులు సఖులు । నెక్కడి భృత్యుల్
1 డొక్కవడిపోవు వేళల
జక్కటికిని నెవరు రారు । సహజము వేమా ! 772

పాఠాంతరము. 1 "చిక్కుల దగిలిన వేళకు"
డొక్కవడిపోవు = చచ్చిపోవు ; "ఎవరికివారే యమునాతీరే" వాడెను.

క. ఎక్కడి చదువులు బోధలు
మక్కువ ననుభవములేని । మాటలువినఁగా
పుక్కిటి పురాణములకే
జక్కుల సంతోష మిలను । సద్గుణ వేమా! 773

పుక్కిట పురాణములు = కల్పనా కథలు.

ఆ. ఎక్కుడైన యాశ । లినుమడియై యుండఁ
దిక్కుపట్టి నరుఁడు । తిరుగుచుండుఁ
గుక్కవంటి యాస । కూర్చుండనీయదు ॥వి॥ 774

ఆశనుఁ గుక్కతో బోల్చెను.

ఆ. ఎక్కువయునుఁ దక్కు । వెటువంటి వారికిఁ ?
దనువు సతముఁగాదు । తధ్య మరయ
నెఱిఁగి తిరుఁగలేరిఁ । కేమనవచ్చును ॥వి॥ 775

సర్వసమత్వమును ఛలోక్తిగా సమన్వయించాడు.

ఆ. ఎక్కువెట్టిఁ గుఱుతు । కేకమై నంతటి
సొక్కి, సోలి యుండు । సూత్రముగను
ముక్కు, చెవులులేని । మూలమే పరమాత్మ ॥వి॥ 776

చిత్తైకాగ్రతతో అరూపబ్రహ్మమును అవలోకించుమనెను.

ఆ. ఎక్కువెట్టి మనుజు | డేకాంత మమరఁగ
దక్కఁగోరుచుండు | ధన్యుఁ డరయఁ
బ్రక్కనుండు నెఱుక | పరిపూర్ణ మందునా ? ॥వి॥ 777

ఏకాంతముగా నిశ్చలత్వముగా నుంటే పరిపూర్ణ మమరును.

తే. ఎక్కువెట్టిన రూపము | చిక్కువెట్టి
నిక్కబట్టుము నిజమని | సాక్కిముట్టి
చిక్కగను బూర్ణ మందుము | చిక్కవెందు
గురిని బెడియ కుపాయంబు | కుదురు వేమ. 778

ఏకాగ్రతతో ఉచ్ఛ్వాస నిశ్వాసములద్వారా పరమాత్మను సాధించ మన్నాడు కవి.

ఆ. ఎక్కువెట్టి పరము | నేకాంతమును గోరి
ముక్కుకొనను జూడ్కి | మొనయ నిల్పి
* సాక్కియుండు టదియె | సోహస్వరూపము ॥వి॥ 779

* యతి పోయినది. ముక్కుతో జూచుట భూచరీయోగము.

ఆ. ఎక్కువెట్టి మనసు | నేకాంతమునఁ జేర్చి
మ్రొక్కువాఁడె పరముఁ | దక్కువాఁడు
నిక్కిచూచునపుడె | నిశ్చాంత మబ్బురా! ॥వి॥ 780

లక్ష్యంగా పరమాత్మజ్ఞానము నిలిపిన ఆశ్చర్యము కలుగును.

ఆ. ఎగువ దిగువఁ జూడ | కేప్రొద్దు మదిలోనఁ
దగవులేని తలఁపుఁ | దలఁచి, వలచి
నీల్గి చూచు టెల్ల | నెఱజాణ విద్యరా! ॥వి॥ 781

నెఱజాణ = ముక్తికాంత.
అన్యతలపు లేక చిత్తములో బ్రహ్మము జూచుటే నెరజాణ విద్య.

ఆ. ఎగువఁ దిగువఁజూడ | నెఱుక గుణంబులు
తగిలి నంత*మెచ్చి | తమముఁజూపు
నిగమ గోచరుండు | నివ్వటిల్లఁగఁజూడు ॥వి॥ 782

పాఠాం :- "నొచ్చి" తరము

పట్టుదలతో చిత్తైకాగ్రతను వేదవేద్యుఁడుగూడా విస్మయము భొందును

ఆ. ఎగ్గు సిగ్గు లేని । దేకమై తోఁపఁగా
మొగ్గి చూచుటెల్ల । మూలవిద్య
తగ్గి యొగ్గ కెపుడు । తాకుట పరమురా! ॥వి॥ 783

ముక్తికాంతను విడువక మోహించినవాడే మోక్షప్రదుఁడు.

ఆ. ఎచటఁజూడ్కి నిల్పి । యెంతఁగఁ జూచిన
నచటఁ దోఁచు కళల । నందరాదు
యచలమైన వ్యక్తి । నందుట మోక్షంబు ॥వి॥ 784

సృష్టికి కారణమగుదానిపై చూడ్కి నిలిపినవాడే సుజ్ఞాని.

తే. ఎచటఁజూచిన నచ్చట । నేమి తోఁచు ?
నచటి దృశ్యము దృక్కుగా । నంటిపట్టి
రచ్చఁజేయుట ముక్తికి । రాజపథము
సచ్చిదానంద మపుడొప్పఁ । జాలు వేమ. 785

అవిరామంగా అవలోకనముల చే అంతటా నిండియున్న ఆనందమయుని ఆరాధింపుము.

ఆ. ఎచటినుండి వచ్చు ? । నెచటికిఁ దాఁ బోవు ?
నిద్ర చంద మెఱుఁగ । నేర్చునేని
యాత్మరాక పోక । లతఁడెపో శివయోగి ॥వి॥ 786

నిద్ర రాకపోకలకు మూలస్థానము. భ్రూకుటిగా తెలిసికొనిన వాడే శివయోగి. శివయోగి = మంగళప్రదుఁడు.

తే. *ఎచట గురినిల్పి చూచిన । నేమితోఁచు
నచటఁ దన్మయ గుఱినిష్ఠ । నందవలెను
రుచిరమగు ప్రత్యగాత్మయె । రూఢిపదము
యది లభించిన నానంద । మమరు వేమ. 787

పాఠాం :- " గురితో " గణంతప్పింది.

ప్రత్యగాత్మ = పరిశుద్ధాత్మ ; రూఢిపథము = అసలైన పదము.

ఆ. ఎచ్చు కులము బుట్టి । యెన్నాళ్ళు బ్రతికినా
జచ్చి పుట్టు టిలను । జాతకంబు
మెచ్చి మదినిపూజ । మెప్పుగాఁ బూనరా ॥వి॥ 788

ఏకులములో బుట్టినా చావుతప్పదు.

ఆ. ఎచ్చు కులము నొంది । యెన్నాళ్ళు బ్రతికిన
జచ్చిపుట్టు జన్మ । శతములుగను
మెచ్చినట్టి పూజ । మెప్పుగా బూనరా ! ॥వి॥ 789
పరమాత్మ మెచ్చుగా చేసిన పూజ ప్రధానం గాని కులముతోఁ బనిలేదు.

తే. ఎచ్చుగచ్చులు నుడివిన । నేమిఫలము ?
మ్రుచ్చు వేషంబు । బూనిన మూలమేది
యచ్చు పడఁ దన్నెఱింగిన । యతఁడె యోగి
సచ్చిదానంద పూర్ణుఁడౌ । జగతివేమ. 79
గచ్చులు = తమాషాలు; అచ్చుపడ = స్థిరపడ; మృత్యువేషము = భ్రాంతిలోపడి తిరుగుట.

ఆ. ఎచ్చు తక్కువనుచు । నెంచియు మదిలోన
కుత్సితం బెఱుఁగని । కూళజనులు
మత్సరంబుచేత । మూల లంటారుగా ॥వి॥ 791
మానవులలో యిన్నికులములు లేవన్నాడు.

ఆ. ఎట్టి జీవికైన । నిలఁ గాంత భ్రాంతియె
తెలియరయ్య యెపుడు । దేటఁగాను
మనస్సు, బుద్ధి, కన్న । మరియొక్కటగునయ్య ॥వి॥ 792
మనసూ, బుద్ధి ప్రధానమని మనకవీంద్రుల శాసనము.

ఆ. ఎట్టిజీవికైన । యిల యోనిపై మది
తెలియదయ్య యిపుఁడు । తేటఁగాను
మనసు, బుద్ధిఁ నున్న । మరియొక్కటగునయ్య ॥వి॥ 793
బుద్ధిగలిగి మెలగినవానికి ఉబలాటా లుండవన్నాడు.

ఆ. ఎట్టిమంత్రమైన । నెంగిలి గాకుండ
బలుక వశముఁగాదు । బ్రహ్మకైన
యెంగిలెంగి లందు । రీనోటి తోడనే ॥వి॥ 794
నోటిస్పర్శ తగిలిన ప్రతీది ఎంగిలిగనే వేమన వాడెను.

ఆ. ఎట్టియోగికైన । నిల మన్మథావస్థ
తెలియ వచ్చు నేని । దేటఁగాను
యోగమెల్ల నూడి । జోగియై పాడగు ॥వి॥ 795

కచ్చడాలు బిగించిన మునిముచ్చులుగూడా కాంతా కనకములను విడువలేరు.

ఆ. ఎట్టియోగికైన । నిల యోనిదుఃఖంబు
తెలియ దయ్యె యిపుడు । తేటగాను
మనసు బుద్ధినున్న । మఱియొక్కటగునయా ? ॥వి॥ 796

మర్మస్థానము మహిమను మనయోగీంద్రుఁడు పదేపదే ప్రస్తావిస్తున్నాడు.

ఆ. ఎట్టిరూపుఁ గనిన । నేర్పడు నీరూపు
నీదు రూపు జూడ । నిలుచుఁ దెలివి
* యట్టి తెలివిచేత । నాత్మయే తోఁచురా ! ॥వి॥ 977

* పాఠాం :- యిట్టి తెలివిచేత । యీశ్వరుండైతోఁచు.
"ఆత్మానాం సర్వభూతాని" అనుసూక్తిని యుక్తిగా వాడెను.

ఆ. ఎట్టివాఁడో తాన । దెఱుఁగఁడు తొలి పుట్టు
నీచ జీవనమున । నీమమేల ?
యెఱుఁగుడయ్య లోక । మీశ్వర మయమని ॥వి॥ 798

ఈశ్వరుఁడు = జంగమస్థావర విశిష్టంబులైన భువనంబుల సృష్టి, స్థితి, లయ కారణుండైనవాడే ఈశ్వరుఁడు.

ఆ. ఎట్టివాఁడు తాను । యెరుఁగఁడు తొలిజన్మ
నీచబ్రతుకు కింత । నీమమేల ?
కష్ట నరుల కెల్ల । గలుగునా మోక్షంబు ? ॥వి॥ 799

మోక్షము = విడివడుట.

ఆ. ఎట్టి వానికైన । బుట్టును మోహంబు
పుట్టు మోహ మూడ్చి । పూనికఁ గలిగి
గట్టుచేసి చూడఁ । గాన్పించు బ్రహ్మంబు ॥వి॥ 800

ఫలాపేక్ష ప్రతివానికి సహజము. కాని సరియైన ఫలాపేక్ష జ్ఞానులుకోరుదురు

ఆ. ఎట్టి స్త్రీలఁ గనిన । నింతంత యనరాదు
కాలవహ్ని లక్క । కఱిగినట్లు
యిట్టి గాఢ మోహ । మెంతైనఁ జేయురా! ॥వి॥ 801

"అతి సర్వత్ర వర్జయేత్" సు నుడి అందంగా పొందించాడు; గాఢము = దట్టము.

క. ఎడపక క్రతువులుఁ, దపములు
నడవుల వాసంబుఁ దీర్థ । యాత్రలుఁ జేయ
న్నొడయనిఁ గనుఁగొనఁ జాలఁడు
కడువడి గురునిష్ఠ పరుఁడు । కావలె వేమా! 802

తపము = అంతరేంద్రియముల తపింపఁజేయుటయే తపము; ఒడయడు = అధికారి (పరబ్రహ్మ), గురునిష్ఠ = గురుతుఁ జెప్పినవాడు గురువు. తన్మతము అనుసరించినదే నిష్ఠ.

తే. ఎడమ కుడి నాడుల నడుమ । నీడ్పుఁగాని
తడవ తడవకు బిగఁబట్టి । తాల్మితోడ
విడిచి లాగుచు మిన్నంది । వెలయుచుండ
నట్టి సాధనమునఁ గను । నాత్మ వేమ. 803

"శ్లో॥ ఇడావామె నాశాయాం దక్షిణే పింగళామతా సుషుమ్నా బ్రహ్మరంధ్రేంచ" అనునూక్తిని చెలిపెను.

ఆ. ఎద్దు రెండు తిన్న । నిహమున స్తంభించు
నెద్దు మూఁడు తిన్న । నిహము విడుచు
నెద్ద తెలియు మనుజుఁ । డేర్పడు యోగిరా! ॥వి॥ 804

ద్వంద్వాతీతుఁడు, త్రిగుణరహితుఁడే ద్విజుడు గాని తక్కినవారు నేతిబీరకాయవంటివారు గా మనకవి అభిప్రాయం.

ఆ. ఎడ్డెఁ దెల్పవచ్చు । నేడాదికైనను
మోనిఁ దెల్పవచ్చు । మాసమునను
మొప్పెఁ దెల్పరాదు । ముప్పదేండ్లకునైన ॥వి॥ 805

మొప్పె = తన ఆశయాలే ఘనమనుకొనే మూర్ఖుఁడు.

తే. ఎదుట గాన్పించుఁ దాని నె । పెంచరాదు
మదిని గుఱిపొంది యుండుట । మానితంబు

సదయ హృదయత సాక్షిగా । సంతరించు
హృదయరంజక మపుడగు । నెన్న వేమ. 806

ప్రత్యక్షముగా నున్న దానిని ప్రశంసించెను.

తే. ఎదురు నిలిపిన చూపులో । నేక మమర
నెఱిఁగి మఱిఁగిన తోఁడనే । యెంచరాదు
మదికి లోవెలి బయలగు । మఱుగుఁజేరు
స్థిరత జిత్తంబునకుఁ గూర్పఁ । దివురు వేమ. 807

సర్వేసర్వత్రా ప్రకాశించు పరబ్రహ్మను పరిపూర్తిగా తెలుసుకొను మని సూచించెను.

ఆ. ఎదుట నున్నవాని । నెప్పుడుఁ గానక
*నుదుటివాని వెదకఁ । బదరుచుంద్రు
పదటఁ గొడుకులకును । భ్రమయేలఁ దీఱదో! ॥వి॥ 808

పాఠాం:- "కుదుటి"

పదట = చెడిపె కొడుకేమో! అంగసాముద్రిక రేఖల కర్థం చెపుతామనే అల్పులను అపహసించాడు అధికుడైన వేమన.

ఆ. ఎదుటి తనబలంబు । యెంచుకో నేరక
ఢీకొని చలముననను । తాకనేని
వెలుఁగు పుంజు శావ । యెన్నాళ్లు నిల్చురా? ॥వి॥ 809

వెలుఁగుపుంజుసేవ = కోడిపుంజు యొక్క ప్రతాపము.

ఆ. ఎదుటి కలిమిఁ జూచి । యేడ్చెడి వారికి
భాగ్యమెటుల గూర్చుఁ । బరమ గురుఁడు
తనదు పూర్వకర్మ । దైవమెఱుంగఁడా! ॥వి॥ 810

"అవశ్యమను భోక్తవ్యం, కృతంకర్మ శుభాఽశుభం" అను నార్యోక్తి ననుసరించాడు.

ఆ. ఎదుటి తన బలంబు । లెంచుకో నేరక
ఢీకొని చలముననె । దీర్చనేని
యెలుఁగు దివిటి సేవ । కేర్పడు చందమా ॥వి॥ 811

యెలుగు = ఎలుగుగొడ్డు.

ఆ. ఎద్దు కన్న దున్న । యేలాగు తక్కువ ?
ఎఱుక లేక పోవఁ । దఱిఁగె విలువ
నేర్పెఱుఁగని వాని । నెఱయోగి యందురా? ॥వి॥ 812
మత్తుతో ప్రవర్తించరాదు.

ఆ. ఎద్దుకన్నఁ దెలియ । నెనుఁబోతు తక్కువ
వివర మెఱిఁగిచూడు । *వృత్తి యందు
నేర్పులేనివాని । నెఱయోధుఁడందురా? ॥వి॥ 813
పాఠాం :— విల్లుదరిగి
పై రెండు పద్యములొకే భావము.

ఆ. ఎద్దు కైనఁగాని । యేడాది తెల్పిన
మాట దెలిసి నడుచు । మర్మమెఱిగి
మొప్పె తెలియలేఁడు । ముప్పదేండ్లకు నైన ॥వి॥ 814

ఆ. ఎద్దునకును బుద్ధి । యేడాది చెప్పిన
మాట వినఁగ । నేర్చు మర్మ మెఱిఁగి
మూర్ఖుఁదెలుపరాదు । ముప్పదేండ్లకు నైన ॥వి॥ 815
పై మూడుపద్యము లొకేఛాయ నున్నవి.

ఆ. ఎద్దుమొద్దుకేల । యిల వేద శాస్త్రముల్
ముద్దరాలి కేల । ముసలి మగఁడు
చలిది లేనియింట । సంసార మదియేల ? ॥వి॥ 816

ఆ. ఎద్దుమొద్దువాని । కేలశాస్త్రంబులు
ముద్దునాతి కేల । ముసలి మగఁడు
చల్ది మిగుల నిల్లు । సంసార మేలరా ! ॥వి॥ 817
సంసారమును చక్కఁగా వర్ణించెను.

కం. ఎన్నఁగ మనసే కారణ
మన్నిఁటికిని జూడఁ జూడ ! నాత్మఁడు తానై

యున్నంత కాల * మిలలో
నన్నా! యిది తెలియ వలయు । నవనిని వేమా! 818

పాఠాం :— * " మెచ్చుట ; నున్నను నిది నిజము దెలియ నొప్పగ వేమా॥
"మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను సూక్తిని బ్రస్ఫుటించెను.

కం. ఎన్నాళ్ళిల దానుండెడి
నెన్నాళ్లిఁక దానునేర్చి । యెన్నిఁట వెలయుం
గొన్నాళ్ళకు దా జన్నను
మన్నాఁగద విద్యలెల్ల । మహిలో వేమా! 819

"సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం । నిర్మోహత్వే నిశ్చలతత్త్వం । నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" వాడెను.

కం. ఎన్నాళ్ళు బ్రతికి చచ్చినఁ
దన్నెఱుఁగని మర్త్యులకును । దలఁగును బరమా
పున్నమ చంద్రుని విమలపు
వెన్నెలలో బయలుసేరి । వెలయును వేమా! 820

పరంజ్యోతిని తెలియమన్నాడు.

క. ఎన్నాళ్ళుఁ బ్రతికి భువిలోఁ
గన్నెల వలపుననుఁ జిక్కి । కామాతురుఁడై
యున్నను జచ్చిన నొక్కఁటె
తన్నెఱుఁగని యీఁగజచ్చు । తర [1]మగు వేమా! 821

పాఠాం:— 1 "బడి"

ఇంతులఁ భ్రాంతులలో చిక్కేవారిని ఈగలతో పోల్చెడు యీ మేధానిధి.

ఆ. ఎనిమి దక్షరముల । నేర్పడ నెఱిఁగియు
వినియు గనఁగరాక । వెలయువానిఁ
దనువు మఱచి తెలియఁ । దత్త్వాత్ముఁడగునయా! ॥వి॥ 822

"నమో నారాయణేతి" మంత్రము జెప్పెను.

క. ఎనిమిది దిక్కుల బయలై
యెనిమిదిటికి నారికన్న । నెక్కుడుబయలై

వినరాని బయల నడచిన
గనరా యచ్చోట నన్ను । గలసియు వేమా ! 823

అష్టదిక్కుల నధిగమించి అనంతరూపముతో వెలిఁగే ఆదిశక్తిని గనమన్నాడు.

ఆ. ఎన్ని తనువులైన । మృతికి నడ్డముఁగావు
మృతినిఁగెలువ లేని । యెఱుకలేక
దొంగరీతిఁ గాక । దొరకునా ? మోక్షంబు ॥వి॥ 824

మృత్యువుని జయించలేనివాడు మోక్షార్హుడు కాడు.

ఆ. ఎన్ని తపము లేడ్చి । యెన్ని నోములునోచి
యెంచి కష్ట పడిన । నేమిలేదు;
గురుని బోధలేక । దొరక దెందును ముక్తి ॥వి॥ 825

గురుబోధ గొప్పదిగా వర్ణించాడు.

తే. ఎన్ని దినములు బ్రతికిన । నేమిఫలము ?
పిన్న పెద్దలు చెలరేగి । పేరులేక
యన్న దమ్ములు నాప్తులు । నందె చనిరి
మిన్న మార్గము తెలియక । మెలఁగి వేమ. 826

మిన్న మార్గము = తిన్నని మార్గము.
తనవారందరూ మార్గము తెలియక చచ్చిరి. తానైనా సాధించితే మంచిదని చెప్పెను.

తే. ఎన్ని దేవతలైనను । నీరహస్య
చిహ్నాలను బట్టి కనలేరు । చిన్మయంబు
తన్నుఁ దనలోనఁ గనుటయే । తన్మయంబు
చెన్నుమీఱంగ నిదెమేటి । తెన్ను వేమ. 827

కపట రహస్య తంతులు చేయు యోగులు తన్నుక చచ్చినా ధన్యులు కాలేరు.

ఆ. ఎన్ని నాళ్ళనుండి । యెనసిన మోహంబో ?
చెలిమిచేత నుండి । చెల్లలేక
తల్లి, దండ్రి, బిడ్డ । దాయాదు లనునట్టి
భ్రాంతిచేతఁ జిక్కు । బడియె వేమ. 828

తరతరాలుగా వచ్చిన దాయాదుల్నాటి మోహములోబడి కృంగిపోతున్నారు

ఆ. ఎన్ని ఫలములున్న । నేఫలంబెక్కుడు ?
యన్ని సుఖములందు । నధిక మేది ?
* కన్న ది కననిదయ । కనుపించు నారూపు ॥వి॥ 829

* గణము పోయెను.

అన్ని సుఖములలో ఆనందమిచ్చునది చిన్మయానంద దర్శనమే.

ఆ. ఎన్నిఁ [1] భూములఁగని । యేపాటు పడ్డను
నంటనీక శనియు । వెంటఁదిరుగు
భూమిద్రుత్తదైన । [2] భుక్తులు క్రొత్తవా ? ॥వి॥ 830

పాఠాం :— 1 "చోట్లు తిరిగి" 2 "భూమెలు"

ఎచ్చటికెళ్ళినా ఏమీలేదు. తన్ను దాను తెలుసుకుంటే తత్త్వం కుదురుతుంది.

ఆ. ఎన్ని మతము లైన । నేమంత్ర మైనను
సత్య మింతలేక । జాడ విడదు
సత్యము గలదేని । జగతిలో ద్విజుఁడగు ॥వి॥ 831

నిజమైన బ్రాహ్మణత్వము సత్యములోనే గలదు.

ఆ. ఎన్ని యెన్ని పూజ । లెన్ని చేసిననేమి ?
భక్తిలేని పూజ । ఫలములేదు.
భక్తిఁగల్గు పూజ । బహుళ కారణమురా ! ॥వి॥ 832

భక్తిప్రభావము బహుళార్థ సాధనమని ప్రశంసించాడు మనయోగి.

తే. ఎన్ని విద్యలునేర్చిన । నెఱుఁగరాదు
తన్ను నిర్గుణ మనజ్ఞప్తి । తాకవలెను
"నిర్గుణోనాస్తి" యన్నది । నిండియుండు
గురునిబోధకు నన్యమే । కొలఁదివేమ. 833

నిర్గుణారాధన శాశ్వత మన్నాడు.

క. ఎనుబది నాలుగులక్షల
యనఁ బరిగిన జీవరాసు । లన్నియు కడకున్
జనియించు విధము *ధరలో
వినఁజెప్పినవాఁడె వెట్టి । వేమన సుమ్మా ! 834

* పాఠాం :— "తెలిసిన, మనుఁజుఁడెపోదారిఁగాంచు మహిలో వేమా"

ఎనుబది నాల్గు లక్షల జీవరాసుల జన్మవిధానాలు వేమన వివరించాడు.

ఉ. ఎప్పుడుఁజూచి నన్నితర । మేమియుఁజూడక ముక్తినందగన్
రెప్పలుమూసి మూయకయు । రేయుబవళ్ళొకరీతి నుండఁగాఁ
దప్పుల నొందఁజేయు, యమ । ధర్ముని పాలికిఁ [1]జేరనేర్చునే ?
జెప్పఁగనేమి వేమనకుఁ । జెల్లును ముక్తి నిధానమన్నిటన్॥ 835

పాఠాంతరము. 1 " నొందనేర్చువే "

కన్నులు మూసిగాని మూయకగాని చూపునుద్రిప్పి కనుబొమల మధ్యనిల్పి పైదిక్కునందుండు చిదాకాశముఁ జూచుటయే ఖేచరీ ముద్రయని చెప్పెను.

తే. ఎమ్మెకాఁడన ఁదరుణుల । కెచ్చరికగ
భ్రమ ఘటించుచుఁ దిరిగిన । పాపి తుదకుఁ
గ్రమముగా యమభటకోటి । గాసిపెట్టఁ
దమకపడి పూర్వదుస్థితిఁ । దలఁచు వేమ. 836

ఎమ్మెకాడు = విలాసవంతుఁడు. స్త్రీవ్యామోహంతో తిరిగి చెడి చింతించే వాళ్ళనెందరినోజూచి యీవిధంగా వ్రాశాడు.

క. ఎరఁగొని యొఱుకను మరచెడు
పురమందునుఁజేరి గుఱిని । బూర్ణాత్ముఁడవై
బిరబిరఁ గుంభక మందుము
పరిపూర్ణ సమాగమంబు । పద్ధతివేమా ! 837

కుంభకమనఁగా ! రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమున మాత్రాసంఖ్యగ నిలుపుట యూర్ధ్వకుంభకమనియు, పూరించినవాయువును మాత్రాసంఖ్యముగ మూలాధారముగనిల్పుట అధోకుంభకమనియు అందురు.

ఆ. ఎరిఁగి చేయుపూజ । యెన్నఁడు చెడిపోదు
మొదటిపట్టు నెపుడు । వదలరాదు
మొదలు చెడినపూజ । మొనఁబట్ట నిలుచునా ? ॥వి॥ 838

ప్రకృతి రహస్యమును సమూలకంగా తెలుసుకొని ప్రవర్తించాలి.

ఆ. ఎఱిఁగిన శివపూజ । యెన్నఁడు జెడిపోదు
మొదలఁబట్టు పట్టు । వదలరాదు
మొదలు విడిచి గోడ । తుదిఁబెట్టఁగల్గునా ॥వి॥ 839

మూలబ్రహ్మను గుర్తించమని గోడనుపమానంగా చెప్పెను.

ఆ. ఎఱిఁగి మనసుఁబట్టి । యేకాంత మునఁజేర్చి
పరుఁగు విడక భావ । పరమునందు
తరముఁగాని బయలు । దాకుట పరమగు ॥వి॥ 840

నిశ్చల చిత్తే కాగ్రతతో నిర్మలాన్ని భజించుట నెరయోగి లక్షం.

తే. ఎఱిఁగి మరఁగిన దోడ్తోడు । నేమిలేదు
పోరి గురిమించి యుండుటే । పూర్ణ పదవి
యెందుఁ జూచినిఁ । బరిపూర్ణ మందఁగోరి
యందుకొని పూర్తిఁజెందుమీ । యవనివేమ. 841

భక్తివంచనలేక సచ్చిదానందమూర్తిని సమీక్షించనున్నాడు మనకవి.

ఆ. ఎఱిఁగి మరఁగి తిరిగి । యేకాంతమును గోరి
పరుగు లిడక యోగ । పథముఁ బట్టి
పరముఁగోరి మించ । బరిపూర్తిఁజెందురా 842

భావావేశంలేక పరబ్రహ్మను గుర్తించుటయే జ్ఞానికి లక్షణం.

ఆ. ఎఱుక కన్నను సుఖ । మేలోకమున లేదు
యెఱుక నెఱుఁగ । నెవని కెఱుక లేదు
యెఱుకసాటి దెఱుకె । యెఱుకయే తత్త్వంబు ॥వి॥ 843

బ్రహ్మను తెలిసికొనుటకు బ్రహ్మజ్ఞానము కావాలి.

ఆ. ఎఱుకఁగలుగు నాతఁ । డేయూర నుండక
తిరుగనేల ? దనదు । దివ్యమైన
పండు పండ వెనుక । ఫలము లేకుండునా ! ॥వి॥ 844

బ్రహ్మజ్ఞానమున మోక్షము తప్పక సిద్ధించగలదన్నాడు.

తే. ఎఱుకఁ దోడ్కొనిఁ దత్త్వంబు । నెఱుఁగు పెట్టు
లెఱుకఁదోలఁగినఁ దత్త్వంబు । నెంచరాదు
యెఱుక మఱుపుల కందని । యిరవుఁగనుమి
యెఱుఁగుచుండెడి దానినే । యెంచివేమ. 845

తత్త్వాన్ని తెలిసికొనుటకు ఎరుక సహాయంచేగాక మరొకమార్గము లేదు.
గొప్పపాదు గనుగొనిన పరంజ్యోతినిపట్టుటకు రాచబాటని వేమన మాట.

కం. ఎఱుకను బుట్టును దనువులు
మఱికిని దాముఱుగుఁ దనువు । మోయుటగాదా!
యెఱుకఁగల తనువు । నొందిన
మఱియును జన్మించుటెట్లు? । మహిలో వేమా! 846
సృష్టి, స్థితి, లయములకు ఎరుక కారణమన్నాడు.

ఆ. ఎఱుక నెంచిచూడ । నెఱిఁగించు చుండును
బరముఁ దాకి చూడఁ । బట్టువడును
గుఱికి బయలుఁ జేర । గుణరహితంబురా! ॥వి॥ 847
జ్ఞానంవలన లక్ష్యాన్ని తెలుసుకొనినచో సుజ్ఞాని కాగలడు.

ఆ. ఎఱుక నెఱిఁగెనేని । నెఱుకయే సాధించు
నెఱుక లేని యాతఁ । డెఱుఁగ లేఁడు
యెఱుకలేని యెఱుక । నెఱుఁగుట తత్త్వంబు॥వి॥ 848
జ్ఞానంలో విజ్ఞానాన్ని జూడమన్నాడు అదే తత్త్వం.

ఆ. ఎఱుక మఱుపులందు । నేమేమి తోఁచిన
సరికి గుఱియెకాదు । సత్యమునకు
బరమ నిర్గుణంబుఁ । బాటించి కనవలె ॥వి॥ 849
గుణరహిత చిత్తంతో సత్యాన్ని గ్రహించమన్నాడు.

తే. ఎఱుక మఱుపులు । గానిది యెఱుఁగలేరు
పరమ పరిపూర్ణ సుఖమూని । పట్టలేరు
ఉరుము బెదరని గుఱిగని । యుండలేరు
నిరుపమానంద సంతృప్తి । నిలుప వేమ. 850
లోకసహజములను చక్కగా చిత్రించెడు.

ఆ. ఎఱుక మాలుజీవి । యెంతకాలంబున్న
జచ్చి పుట్టుచుండు । సహజముగను
యెఱుక మరచుచోటి । నెఱుగుట బ్రహ్మంబు ॥వి॥ 851
ఎరుకలేనిమాటలు = తెలివిలేకపోవుట; తెలివి లేనివారు ద్వంద్వములలో చిక్కుదురు.

* ఆ. ఎఱుక మాలువాఁడిఁ । కేమేమి చదివినఁ
జదివి నంత సేపె । సద్గుణియగుఁ
గదిసి తామరందుఁ । గప్పకూర్చున్నట్లు ॥వి॥ 852

పాఠాం :- " ఎఱుకలేనివార । వేమేమిచదివిన "

తామరాకుపై నున్నకప్ప పద్మాసనస్థుఁడగు బ్రహ్మకంటె అధికురాలనని దిగి పంకములో యథారీతి భృంగును అట్లే అవివేకి ఎంతచదివినా ఏంలాభంలేదు.

ఆ. ఎఱుక యుంతువాని । కెఱుకయే యుండును
యెఱుక లేనివాని । కెఱుక లేదు
యెఱుకలేని యెఱుక । నెఱుగుట తత్త్వంబు ॥వి॥ 853

అతీత విషయాన్ని ఆకళింపు చేసుకొనుటయే తత్త్వజ్ఞానము.

ఆ. ఎఱుకలేని దొరల । నెన్నాళ్ళు కొలిచిన
బ్రతుకులేదు వట్టి । భ్రాంతి గాని
గొడ్డు టావుపాలు । గోకినా చేపునా ? ॥వి॥ 854

చక్కని నీతిని వాడెను.

ఆ. ఎఱుకలోని జగము । నెందాఁకఁజూచిన
గుఱికి బయలఁబ్రాకి । కోర్కెలడఁచి
సరికి బయలు నంటి । సంయమి గావలె ॥వి॥ 855

షడ్గుణాలను విడచిన సంయమి కాగలడని చక్కగా సరసోక్తిచే వ్యక్తంజేశాడు.

ఆ. ఎఱుఁగు వానిఁదెలుప । నెవ్వఁడైననుఁ జాలు
వారుల వశము కాదు । వోగుఁదెల్ప
నేఁటి వంకఁ దీర్ప । నెవ్వరి తరమయా ॥వి॥ 856

" తివిరియిసుమున దైలంబుదీయవచ్చు తవిలిమృగతృష్ణలో నీరు దాగ్రవచ్చు ।
తిరిగికుందేటికొమ్ము సాధింపవచ్చు చేరిమూర్ఖులమనసు రంజింపరాదు " భర్తృహరిని అనుసరించాడు.

ఆ. ఎఱ్ఱదాని ముఖము । నేప్రొద్దుఁ జూచిన
బ్రమ్మకైనఁబుట్టు । దిమ్మతెఁగులు
యిట్టి నవ్వోనేనిఁ । బట్టదా భూతమై ॥వి॥ 857

అంద మైన స్త్రీలజూచిన ఎటువంటివారైన డిందుపడి కుందుదురని చెప్పెను.

ఆ. ఎఱ్ఱి నాడు దాని । నేపారఁజూ
వేకి పుట్టి చాల । వెఱ్ఱిపట్టుఁ
బల్లుఁదెరచి నగిన । బట్టుఁబెన్భూతంబు ॥వి॥
స్త్రీనవ్విన చిత్తభ్రాంతి కలుగును. 858

ఆ. ఎలమిని ధనవంతుఁ । డెదిరిఁడన్నె ఱుఁగక
కన్నుఁగాన కిలను । గర్వ పడును
దీనుఁడైన వాఁడు । దేబెయా ధనికుని
నడుగఁబోవఁగష్ట । మగును వేమ.
ధనమదాంధుని దరిద్రుడు ధనమడిగితే తప్పక కష్టము కలుగును. 859

ఆ. ఎలమిని ధన కాంక్ష । యెదురు తన్నె ఱుఁగని
కన్నుఁగాన కెల్ల । గర్వమునను
పుట్టిన చెడుకట్టె । బుద్ధిహీనపు వాని
నడుగబోవు కష్ట । మంత వేమ.
ధనప్రమత్తుల స్వభావం వర్ణిచాడు. 860

ఆ. ఎలిమి మత మటంచు । నెల్లమాంసముఁదిని
మరుఁగు పేరుచెప్పి । మధువుఁద్రావి
వావి వరుసలేక । వర్తింత్రు మూఢులు ॥వి॥
మత గోప్యములని మహాదోషాలకు పాల్పడేవారియొక్క ప్రశక్తి. 861

తే. ఎల్లకుక్కల యెంగిలి । యిపుడు తెలిసెఁ
బడుచు కుక్కల యెంగిలి । ప్రాప్తమాయెఁ
జెడిపె యెంగిలియంతయు । శ్లేష్మమాయె
నిష్టమగువారి యెంగిలే । యెచ్చు వేమ.
జారస్వభావుల సమత్వమును చాటేడు. 862

ఆ. ఎల్లనేఁడు విన్న । నేలాగు నను́గాని
మనసు నిలుపువాఁడు । మంచివాఁడు
శివుఁడు భర్త కర్త ! । చింతింప నేలరా ! ॥వి॥
ఎప్పుడైనా మనసు నిల్పినవాడే గొప్పవాడు. 863

ఆ. ఎల్లలోకమందు । నేవస్తువున్నదో
తల్లి, పిల్ల, సందు । తగులునదియె
నిస్తరంగ వార్ధి । నియతిలోఁ జూడరా ! ॥వి॥ 864

నిస్తరంగవార్ధి = కదలికలేని అలలుగలసముద్రము (అనగా నిర్మలమనస్సు)

ఆ. ఎల్లి, రేపు, నేఁడు । యేలాగు, తనలాగు
యనుచు, బలుకుచుందు । రఖిల జనులు
శివుఁడు భారకర్త । చింతింపనేలయా ! ॥వి॥ 865

“ సర్వమును విష్ణుమయ మని శాంతిబొందు ” నిట వాకొన్నాడు.

ఆ. ఎలుక తోలు దెచ్చి । యేడాది యుతికిన
నలుపు నలుపే కాని । తెలుపుగాదు ;
కొయ్య బొమ్మఁదెచ్చి । కొట్టిన బలుకునే ? ॥వి॥ 866

చక్కని ఉపమానము.

ఆ. ఎలుక తోలుఁ దెచ్చి । యెందాక నుతికిన
నలుపుగాక నేల । తెలుపుఁ గలుగు ?
కొయ్యబొమ్మఁ దెచ్చి । కొట్టితే గుణియౌనె ॥వి॥ 867

868, 869. 870. యీమూడుపద్యాలు, ఒకేభావం. కొన్నిపదాలు మాత్రం మార్పు.

* ఆ. ఎలుఁగు తోలుఁదెచ్చి । యెంతగ నుదికిన
నలుపుగాక యేల । తెలుపుఁగల్గు
కొయ్యబొమ్మనెంత । కొట్టిన గుణియౌనె ? ॥వి॥ 868

ఆ. ఎవరికెవరు గారిఁ । కెవ్వరు రాఁబోరు
గవయ గోరుహంసఁ । గదియనొక్క
శివుని రూపమూని । సేవింప దొరకొను ॥వి॥ 869

“ ఎవరికివారే యమునాతీరే ” అన్నట్టు మానవులు ఒకరికొకరికి సంబంధం లేదు. సహస్రారమెక్కి పరబ్రహ్మను జూచుట జన్మసఫలత.

తే. ఎవ్వఁడజ్ఞాన । తిమిరంబు నేపుమాపి
జ్ఞానమను । వెన్నెలందొప్పఁబూనునేనిఁ

జంద్రుఁబోలినఁ గురునండ । సాధకముగఁ
గూడిననుగాని తీఱదు । కోర్కె వేమ. 870

అజ్ఞానాంధకారము, సుజ్ఞానచంద్రస్ఫూర్తివలన నశించును.

ఆ. ఎవ్వఁ డేమెఱుంగు । నింపైన వస్తువు
దేహ మేమెఱుంగు । దివ్యబోధ
విధముఁ దెలియఁ గోర । వేదాంత మెఱుఁగుడీ ॥వి॥ 871

అసలువస్తువును దెలియగ సాధ్యము కాదు.

* ఆ. ఎవ్వరి గుణజాల । మేమన్న మానదు
చక్కసేయ రాదు । కుక్కతోక
గదుసురాలు మగని । గంపతో నమ్మురా ! ॥వి॥ 872

* 1 పాఠా:— "ఎవ్వరెవరి గుణము లేమైన మానవు"

సహజనీతులు పూత ;

ఆ. ఎవ్వ రెఱుఁగ కుండ । నెప్పుడు పోవునో
పోవు జీవ మకట ! । బొంఁది విడిచి
యంతమాత్ర మునకె । యపకీర్తి నెఱుఁగక
విఱుగఁ బడును నరుఁడు । వెఱ్ఱి వేమ. 873

జనన మరణములు సహజములు అయినా అహంభావపరులు అనాదిగా ఉంటా మని అనుకొంటారు.

తే. ఎవ్వరెఱుఁగని తత్త్వంబు । నెఱుఁగు టెట్లు ?
లోను జూడంగ జూడంగ । లోకమగును
దలఁపు మఱపులు దాటుచే । తన్మయంబు
నిత్యపరిపూర్ణ సానంద । నిరతి వేమ. 874

బ్రహ్మానందపు బాటను చాటెను వేమన.

తే. ఎవ్వరెవరన నేనను । నేమెఱిఁగియొ
తా నెవండైన డెఱుఁగని । మానవుండు
యడిగినప్పుడైన లక్ష్యంబు । నమరఁజేయఁ
గొంత తెలిసెడి గాదయా । వింత వేమ. 875

మూలసూత్రం దెలియక మూర్ఖులు మురుస్తుంటారు.

ఆ. ఎసఁగు వేత్తయనుచు । నెఱుఁగ రేయీనరు
లేయు మార్గములను । వేలుపఁజూఁడు
యవని సృష్టికర్త । యంతకు గురుఁడెన్న ॥వి॥ 876
సర్వేశ్వరుఁడు సమస్తమున కధికారి.

ఆ. ఏండ్లు రెండుఁదిన్న । నిల పైని స్తంభించు
నేండ్లు మూఁడుఁదిన్న । నిహము వెలయు
యేండ్లు నరుఁడు దెలిసి । యే; యోగిగావలె ॥వి॥ 877
ద్వంద్వములను త్రిగుణాలను విడువమన్నాడు.

ఆ. ఏకచక్ర ధరుఁడె । యెల్లలోకంబులఁ
బాక మెఱిఁగి యేలుఁ । బ్రభుఁడు గాఁడు
రాకపోక లడఁచి । రాజిల్లు మదిలోన ॥వి॥ 878
విష్ణువు పాలనకర్త. లయకర్త శివుఁడు.

తే. ఏక మతమని నమ్మెడి । పోక విడక
తాకి, పరమను బయలునఁ । దానుజేర
సోకి నుండియు బండుచే । సూటె యగును
గాక పెరమార్గములనమ్మ । గాదు వేమ. 879
సోకి = ఆవహించి; సర్వసమత్వమే శాంతినిదానమని వేమన సూక్తి.

ఆ. ఏకమమర యుక్తి । పాకంబు గమకించి
సోకి పండుటెల్ల । సూటియగును
దాకి, తాకి, మిగిలి । తళుకొత్తవలెనయా! ॥వి॥ 880
స్వయంప్రకాశత్వమును సంపాదించమన్నాడు మనకవి.

ఆ. ఏకమునను జూడ । నెఱుక యేకంబౌను
భువిని సతినిఁ గూడు । పురుషుమాడ్కి
లోకకాంతునట్టు । లోపల వెలుగును ॥వి॥ 881
లక్షణముతో జూచిన అవినాభావ సంపత్తు గలుగును.

ఆ. ఏకమైన దాని । నెక్కడఁజూతురు ?
పాకమెఱిఁగి చెప్పు । పరుఁ డెవండు ?
లోకమాయఁ జూడ । లో వెలినిండెరా ! ॥వి॥ 882

పాకము = పరిపక్వము ; "అహంబ్రహ్మాఽస్మి" అను ఆర్యోక్తి నిట వాకొన్నాఁడు.

ఆ. ఏకమైన వర్ణ । మెఱిఁగిన యోగికిఁ
బరము నెఱిఁగిఁజూడ । భావమొందు
నాకృతులనుఁజేరి । యన్నిటఁదానౌను ॥వి॥ 883

"మయాప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మ యోగాత్ ।
తేజోమయం విశ్వమనన్త మాద్యం యన్మేత్వ దన్యేన నదృష్టపూర్వం"
భగవద్గీతా వాక్యం.

క. ఏకంబే బ్రహ్మంబని
ప్రాకృత వైకృతులఁదెలిసి । పరిశుద్ధుండై
యేకంబగు మదిఁదెలిసిన
శోకము మోహంబులేదు । సొరిదిన వేమా. 884

తాపత్రయములు బాపుటకు ఏకో నారాయణుఁడే సమర్థుఁడు.

క. ఏకబ్రహ్మము నిత్యము
వైకృతము లనంగఁదగిన । వస్తువులెల్ల
న్నేకత్వంబని యెఱిఁగిన
జోకంగాఁ గలుఁగు ముక్తి । సులభము వేమా ! 885

క. ఏకబ్రహ్మమె నిత్యము
వైకల్పిత మైనయట్టి । వస్తువులెల్లన్
యేకత్వంబని యెఱిఁగిన
శోకములేకుండ ముక్తి । సులువగు వేమా ! 886

ఆ. ఏకరూప గుణము । నెంచెడి గురిలోన
పాకమెఱిఁగి పూర్ణ । పదవి యందు
తేజమయిన బయలు । తెలియుట మోక్షంబు ॥వి॥ 887

సర్వత్రా ప్రకాశించిన జ్యోతిని దర్శించుటే మోక్షము.

ఆ. ఏకరూప మమరఁ । నెందాఁకఁ జూచినఁ
బోక యెఱుక వలనఁ । బొందుపడదు
తాకిమదిని నిల్పి । తత్తర మొందకు
నీకు నిహము పరము । నెగడు వేమ ౩

ఇహపరసాధనానికి పరబ్రహ్మను పట్టుకొనుటే ముక్తి;

ఆ. ఏకవర్ణ మందు । నెఱుకగల్గి యోగి
పరుల నెఱిఁగి పూర్ణ । పదవియందు
యాదరణములందు । నన్నిఁట దానగు ॥వి॥ ౪

ఏకవర్ణము = అవిరామంగా;
సమదృష్టి సత్యాన్ని తెలుసుకొంటుంది.

ఆ. ఏకసమమునందు । నెఱుకగల్గినయోగి
పరుల నెఱిఁగి చూడ । భావమందు
యాశలేక మించి । యన్నిట దానగు ॥వి॥ ౪

అదే యిది.

కం. ఏకాంతి మెరవుఁ గన్గొని
లోకాంతము ఁజేరఁబోయి । లోబయులగునా ?
పాకంబు ఁబూనిమించిన
నీక్షింపగు చిత్పరంబు । నెలవగు వేమా ! ౮

పద్ధతి తెలిసుకొన్న ఫలము బొందును.

కం. ఏకాంత మెరవుఁగన్గొను
శ్రీకాంతుని, బ్రహ్మమయునిఁ । జిన్మయుఁ బరునిన్
నాకార రూపుసాక్షి ; ని
రాకారమె పరమపదవి । యారయ వేమా ! ౬

త్రిమూర్త్యాకారమె దివ్యపదము.

క. "ఏకోబ్రహ్మ" మనంగా
వైకల్పిత మైనజగము । వారలకెల్లన్
సాకారత్వము లుడిఁగిన
శోకము మోహంబులేదు । శుభమగు వేమా ! ౬

తే. ఏగతినిఁ గోరివేడిన । నేమిసుఖము ?
రాగ, లోభ, గుణంబుల । బాగుపఱచి
యోగ, మందును నిల్పిన । నొనరుముక్తి
ఓగులకునెట్లు లభియించు । నోరివేమ. 894

రాగ, ద్వేషాలను పట్టిన తెలివితక్కువ వారలకు ముక్తిరాదని వేమన పలుకు.

కం. ఏగుణము లాపదల నిడు
నాగుణము లడంపవలయు । నాసక్తుండై
యేగుణములు మేలొనరుచు
నాగుణముల ననుసరించి । యలరుచువేమా ! 895

తన్నుదా విమర్శించుకొని మంచిని చేపట్ట మన్నాడు.

కం. ఏగోత్రము మీకెరుకగు
నాగోత్రము నందు రూపు । నలుపో, మెరుపోఁ
యేగోత్రము తెలివిపరుఁడో
యాగోత్రము దానిఁజూప । నగురా వేమా ! 896

గోత్రము = జలమైన వస్తువు.
జలముగలవస్తువు రూపము జూడకుండా చేపట్ట మన్నాడు.

కం. ఏచవి దొరికిన [1] వాల్లరు ?
వాచవికిని నిత్యమున్న । వాక్యంబులచేఁ
జూచిన [2] పడుచులు, వెరచిన
యాచందములాయె జగము । లన్నియు వేమా ! 897

పాఠాం:— 1 నొల్లరు 2 చయ్యన.

కం. ఏచవి దొరికి నొల్లరు
* వాచవికిని సతమటన్న । వాక్యంబులచేఁ
జూచినఁ బడుచులు వెఱచిన
యాచందమె జగములన్ని । యాయెనువేమా ! 898

పైరెండు పద్యాలొకే పోలికతో నున్నాయి.
యీరెండు పద్యములు ప్రేమగూర్చి వాకొనెనేమో ?

కం. ఏచిన పంచేంద్రియ సుఖ
నీచ వ్యాపార ముడిగి । నిజముగఁదానై
లో చూపు చూడ నొల్లక
వాచా బ్రహ్మంబు వదల । వలదుర వేమా ! 899

పంచేంద్రియ ఉన్మాదాన్ని తగ్గించి భగవన్నామస్మరణ విడువ వద్దన్నాడు.

కం. ఏచూడ్కిఁ నిలిచి యుండునో ?
యాచూడ్కిని బట్టిమదిని । నాగాదనకే
రేచక, పూరక, కుంభక
సూచన పరమనెడుఁ బయలు । చూడుము వేమా ! 900

రేచక, పూరక, కుంభకాల్తో పరిపూర్ణాన్ని చూడమన్నాడు.

కం. ఏజనుఁడు గుణకదంబము
నీజగమునఁ బట్టి నేర్చు । నిమిడిక పడఁగా
నాజనుఁడు ముక్తి కర్హుఁడు
రాజిత, పరిపూర్ణ ! హృదయ । రంజిత వేమా ! 901

పరిపూర్ణ ప్రకాశముతో రంజింపఁబడిన హృదయంగలవాడు వేమన.

తే. ఏడ్వ, మదినోవ ఫలమేమి । యేరు నిన్నుఁ
దిట్టగా నేమి ? లేక, ను । తింపనేమి
కలుగు భువి లాభలోభముల్ । కాలమహిమ
యనుచు సరిపెట్టు కోరాదె ? । యరయ వేమ. 902

ఏరు = యెవ్వరు ; శాంతి కాముకత్వమును చాటేను.

ఆ. ఏడు, నైదు,నారు, । నెనిమిది, తొమ్మిది
యేమి కట్టునుండి । యెట్లు తిరుగు ?
వాడి వాడి నంత । వాడదేయదియేమొ ? ॥వి॥ 903

ఏడు=వ్యసనములు. 5 = పంచేంద్రియములు. 6 = షడ్గుణములు, 8=అష్టమదములు, 9 = నవరంధ్రములు.

ఆ. ఏడు, నైదు, నారు, । నెనిమిది, యొక్కటి
యోడలోన నుండి । యోరసిల్లు
యోడ, యెక్కి తిరుఁగు । నోడయందె తత్త్వంబు ॥వి॥ 904

యీపై వివరించినవి శరీరములో ఒకటనఁగా మనసునకు సంబంధించియున్నవి. మనసున కధిపతి బుద్ధి.

ఆ. ఏడు మతము లందు । నెనసి చూడఁగఁబోవ
లింగ మతము కన్న । లేదు మతము
మతము మూలమెఱుఁగ । మర్మంబు లేదయా ! ॥వి॥ 905

శైవము, వైష్ణవము, గాణాపత్యము, కాపాలికము, పాషండము, అద్వైతము, ద్వైతము. యీఏడింటిలో శైవము గొప్పదని అభిమానంగా మనకవి చెప్పెను.

ఆ. ఏడు మార్గములను । నేకాంతమునఁ జేరి
యాడి, పాడి, ముక్తిఁ । గూడి వేడి
జాడ, లోనబయలు, । సాధించి మనవలె ॥వి॥ 906

1 దానము, 2 ధర్మము, 3 సగుణము, 4 ప్రతిమార్చనము, 5 జపము, 6 తపము, 7 తీర్థము ఇవి సప్తమోక్ష మార్గములు.

ఆ. ఏడె యక్షరముల నీయంద । మొందిన
నందు నిందు ముక్తి । యలరు, చుండు
నందు నిందుఁ దెలియ । నదియెపో బ్రహ్మంబు ॥వి॥ 907

సప్తాక్షరములుగల మహామంత్రము జపించిన సర్వమూ సాధించిన వాడగును.

కం. ఏతత్త్వ మమరఁ గోరెదో ?
యాతత్త్వము సరిగ నడుపు । మారసి స్వరముల్
ఖ్యాతిగ వర్ణములెన్నక
యాతురత న్నిలుపు మదిని । ననువుగ వేమా ! 908

సర్వశాస్త్ర విజ్ఞానాన్ని తెలుసుకొమ్మన్నాడు.

ఆ. ఏదికులము నీకు ? । నేదిస్థలంబురా ?
పాదుకొనుము మదినిఁ । బక్వమెఱిఁగి
యాదరించు దాని । నవలీల ముట్టరా ॥వి॥ 909

కులమూ, స్థలమూ లేనిదే పరబ్రహ్మం దానిని మనసులో నిల్పుకోమన్నాడు,

ఆ. ఏది కులము నీకు ? । నేది మతంబురా ?
పాదుకొల్పు మదినిఁ । బక్వమెఱిఁగి
యాదరించుదాని । యంతము తెలియుము 910
పైరెండుపద్యా లొకేరీతిగానున్నాయి. కాని, కొద్దితేడావుంది.

తే. ఏదికోరిన నీకోర్కె । యెఱుకయగును
యేదికోరిక నిండెనో । యిరవునగును
సాధు విద్యకు ధరలోన । సమములేదు
కోవిదులకిది తెలిసిన । గురుత వేమ. 911
కోవిదుఁడు = పండితుడు, సాధువిద్య = వేదాంత విద్య.

తే. ఏది దినకయుఁ బ్రతికిన । నేమిగలదు ?
వాదునకుఁజిక్కఁ దక్కని । వరుసఁగనుము
భేదబుద్ధిని ఁజూచినఁ । బెనగబోదు
సమతఁ గలవాఁడు యోగ్యుఁడు । జగతివేమ. 912
సమత్వమునకు సాటిలేదన్నాడు.

తే. ఏదియేదని మదిలోని । పాదుఁదెలిసి
కాదుకాదని పరికించి । కనులుదెఱచి
యాది మూలము గనుచుండు । నాత్మవేత్త
దానసే పరమానంద । మగును వేమ. 913
విమర్శయుతమైన బుద్ధితో గ్రహించినదే విజ్ఞత.

కం. ఏదే వఱకును నెంగిలి
సాదమె నై వేద్యమగును । జనువాసనచేఁ
బాదముల మీఁదఁబడి తల
మోదుకొనుచు మ్రొక్కనేమి । ముక్తిర వేమా ! 914
సాధించుటే ప్రధానము గాని సన్యాసులకు సాగిలిమొక్కరాదన్నాడు.

కం. ఏదేశము తిరిగినఁబని
లేదఁట ; తనమనసు కుదురు । లేకుండినచో ;

నాధారంబిక నింతియు
తాఁదెలియుట మనసుశుద్ధి । తత్త్వము వేమా ! 915

తలపుచ్చిన కుక్కవలె తిరిగిన తత్త్వము పట్టువడదు.

కం. ఏనాఁడు సుభిక్షము ? తన
కేనాఁడిరవయ్యె ? నచటి । కేగుమృగంబుల్
తానున్న చోటు విసికిన
మానవులను జివుక నేల ? । మహిలో వేమా ! 916

లోక సహజము.

కం. ఏనెవ్వఁడ ననుతలఁపున
మానసమున ఁబొడమనీక । మనుజుండకటా !
కానఁడు తనసంకల్పము
మానక ననుఁగనుట యెట్లు । మహిలో వేమా ! 917

తనకు తాను తెలిసికొనిన ధన్యుఁడు కాగలడు.

కం. ఏపాపమైనఁ జక్కఁగఁ
బాపును గురుమర్మ ఘటిక । బహుజన్మతతిం
జూపట్టి యడఁగఁద్రొక్కుచుఁ
గాపై మదిలోన వెలుఁగు । ఘనముగ వేమా ! 918

గురూపదేశమునకు సాటియైనది కుంభినిలో లేదని వేమన మాట.

ఆ. ఏపుమీఱ మదిని । నెంచి మించుటగుత్తు
రూపము ; భ్రమ, లడఁచి । రూఢిపడఁగఁ
గాపురంబు ఁజేరి । కడగండ్లుమానరా! ॥వి॥ 919

కడగండ్లు = కష్టములు ; ముక్తికాంతా సంగమంబు మోక్షప్రదమన్నాడు వేమనయోగి.

ఆ. ఏమహాత్మునందు । నీజగంబులు పుట్టె
నామహాత్మ భజన । యనువుమీఱ
నీమ, నిష్ఠ, నెఱపి । నెమ్మదిఁగనవలె ॥వి॥ 920

ఆ. ఏమి కాని దాని । నెఱుఁగుట లక్ష్యంబు
సాముఁజేసినట్టు । సాధ్య పఱచి
నీమ, నిష్ఠ, వదలి । నిర్గుణ మందరా ! ॥వి॥ 921

పరాశక్తిని పట్టుకొమ్మన్నాడు.

తే. ఏమి కానిది । పరతత్త్వ మెఱుఁగలేక
సోమయాజులు పశువుల । ప్రుక్కడించి
సామమేర్పడఁ జదివినఁ జావనేల ?
బాధ కములగు దుర్గుణ । పంక్తి వేమ. 922

* పాఠాం :— "1 యైనది 2 జావవేల ?"
యజ్ఞము చేసినవారు సోమయాజులు పశువధను నిషేధించాడు.

ఆ. ఏమి కొంచు వచ్చె ? । నేమితాఁ గొనుపోవు ?
బుట్టువేళ నరుఁడు । గిట్టువేళ
ధనము లెచటి కేగ ? । దానేగు నెచటికి ॥వి॥ 923

పంచభూతాత్మకమైన శరీరము పంచభూతములలో కలుస్తుంది.

ఆ. ఏమి చదివియేమి ? । యెఱుక లేకుండినఁ
జదువులందుఁ బరమ । సౌఖ్యమగును
మానసైక్యముననె । మఱిము క్తి కలుగురా ॥వి॥ 924

నిజమైన చదువుచదివి నియమములో నీలోనీవు యైక్యముగమ్మని నికరముగా ప్రకటించాడు.

ఆ. ఏమిసాధనముల నంద । నేమిఫలము :
తామసాన్విత మగును క్తి । దగులఁబెట్టి ;
నీమనిష్ఠలు మదియందు । నెరపవలెను
మనసు నిలకడఁ గనునట్లు । మనఁగ వేమ. 925

సాధన చతుష్టయము వలన సాధించేది లేదన్నాడు.

కం. ఏయెడఁజూచిన బ్రహ్మము
నీయెడ నాయెడను గలఁడు । నిబిడము గాఁధా

డాయను వెలియై తోఁచెడు
శ్రీయంబగుబట్టబయలు । స్థిరముగ వేమా ! 926

"ఏకో నారాయణో హరిః" అనునట్లు చిత్రించెను.

కం. ఏరా! జీవికి దేహము
పోరా ! యెరప్రొద్దు వోయెఁ । బుణ్యముఁగనరా !
మారాడని మనుగడకుం
జేరెడు విధమెట్టిఁగిమించి । జితపడు వేమా ! 927

మనుగడ = బ్రతుకుట.
మనుగడ మంచిదై తేనే మనిషి.

కం. ఏరాళమైన పదవిని
మారకుఁడై చూచువాఁడు మహితుఁడు సుమ్మీ ;
చేరువఁ జిత్తను మింటను
బోరినఁ బరిపూర్ణమమరుఁ । బొందిక వేమా! 928

పాఠా:- "చేరికయగు చిన్మింటను"

ఏరాళము = అధికము ; మనసు దగ్గరనున్న మహిత ప్రకాశమును మన్నన చేయుము.

కం. ఏరికి దక్కని చిన్మయు
దారికిఁ దోడ్పడెడు । నెఱుక తనలోఁదానై
పోరుచు బైకొనుచుండును.
సారెకు సమయింపఁ జూడు । సరసత వేమా ! 929

బైకొనుట = అతిశయించుట. చలనమును తగ్గించుట.

ఆ. ఏరుదాటి మెట్ట । కేగిన పురుషుండు
పుట్టి సరకుఁగొనక । పోయినట్లు
యోగపురుషుఁ డేల । నెడలిఁబాటించురా ! ॥వి॥ 930

శరీరాధారాంతో జగదీశ్వరుని గుర్తించమన్నాడు. పుటి = పడవలాంటిది.

కం. ఏరూప మెచట (జూచిన
నీరూపమె కానపించు । నిలిపి తెలవయా

నీరూపమె తా నెఱిఁగిన
ధారుణిలో నీశ్వరుండు । తానే వేమా! 931

కం. ఏరూపు మదినిగోరిన
నారూపే తోచు భ్రమల । నాఁగాదనమిం
ధారాళము గనుబ్రహ్మము
కోరికలను మించిచూడఁ । గుదురును వేమా! 932

కం. ఏరూపున । నారూపము
లోరూపునఁ జూచుచుండు । లోకారాధ్యుం
డేరూపుఁజూచు । వారికి
నారూపై కానుపించు । నభవుఁడు వేమా! 933

తనలోనున్న రూపమే తానంతటా చూడఁగలఁడు.

కం. ఏ వంక మనసు । గలిఁగిన
నావంకను నింద్రియంబు । లన్నియునేగు
న్నీ వంక మనసు కలిగిన
నే వంకకు నింద్రియంబు । లేగవు వేమా! 934

అన్నిటికి మనసే ప్రధానము.

కం. ఏ సూత్రము । నాసూత్రము
శ్రీసూత్రం బదియుఁ గాక । సిద్ధముగాఁగ
న్నాసూత్రము శ్రీ సూత్రము
నా సూత్రముఁ దెలియువాఁడు । నాథుఁడ వేమా! 935

శ్లో॥ "బిందుత్రికోణ వసుకోణదశారయుగ్మ
మన్వస్ర నాగదళ షోడశపత్రయుక్తమ్
వృత్తత్రయంచ ధరణీసదనత్రయంచ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయ"
శ్రీచక్రము పరదేవతా స్థానము.

కం. ఏసూత్ర మరసి । చూచిన
శ్రీ సూత్రంబది యుకాక సిద్ధముకాగన్

నా సూత్రము స్త్రీ సూత్రము
నాసూత్రముఁ దెలియువాఁడు । నాథుఁడు వేమా ! 936

పైరెండు ఒకేభావములో నున్నవి.

ఆ. ఐకమత్య మెన్న । నాల్మగలకు వాసి
మగనిబుద్ధియెల్ల । మగువ నేర్చు
దాని రక్షణంబె । వాని లక్షణమగు॥వి॥ 937

వాసి = యీడు "యథారాజా తథాప్రజా" అని వాడెను.

ఆ. ఐకమత్య మొక్క । టావశ్యకంబెప్డు
దాని బలిమి నెంతయైన గూడు
గడ్డి వెంటిఁ బెట్టి । కట్టరే యేనుంగు ॥వి॥ 938

వెంటి = గడ్డిపురివెట్టుట వెంటి "సంఘీభావం సర్వకార్యసిద్ధి" వాడెను.

ఆ. ఐదు చక్రములను । నాదినిఁ బడవైచి
యైదు చక్రములకు । నవల వెలసి
యైదు చక్రములకు । నడవి బైలైతోఁచు ॥వి॥ 939

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధములనెడు ఐదు చక్రములను ఆత్మజ్ఞానంచే నరికి ఆజ్ఞాచక్రముఁ గనవలెను.

ఆ. ఐదు చక్రములను । నాత్మలో తెగవేసి
యైదు చక్రములను । నమర దాచి
యైదు చక్రములకు నవలి । బయలుజూడు ॥వి॥ 940

ఆ. ఐదునైదు, నెన్న । నైదింటిచే కూడు
మూడు మూఁటఁజేరి మురియునొకటి
మురిసిన సకలంబు । మోహించి యుండురా ! ॥వి॥ 941

పంచేంద్రియములు, పంచతత్వములు, పంచభూతములలో గలయును ; త్రిమూర్తులలో త్రిగుణాలు గలసి మనస్సు సంతోషించును. అప్పుడే బ్రహ్మానందము కలుగును.

ఆ. ఐదునైదు నెన్మి । దాఁటును నొక్కటి
మోడలోన నుండి । మోరసిల్లు
నోడమెక్కి తిరుఁగు । నోడయడే? తత్త్వంబు ॥వి॥ 942

906, 944, ఈరెండు పద్యాలు 2, 3 చరణా లొకటే.

పృథ్వీపంచకము, ఉదకపంచకము, అగ్నిపంచకము, వాయుపంచకము, ఆకాశపంచకము, యీయిరువది యైదు మనశరీరములోని నుండు తత్త్వములు.

ఆ. ఐదునైదు నైదు । నైదింటి చేకూడు
* మూఁడు మూఁటచేరి । మురియు నొకటి
మురిసిన సకలంబు । మోహించి యుండురా! ॥వి॥ 943

* 943. 945 ఒకేరీతి, పృథివ్యాప్తే జోవాయు రాకాశములు 5 శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు 5; వా క్పాణి పాద పాయూపస్థలు 5 త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు 5 యీయిరువది వింశతి తత్త్వములందురు.

ఆ. ఐదుయక్షరముల । నానంద మొందిన
నందునిందు, ముక్తి । నలరు, చుండు
అందు నిందుఁ దెలియు । నదిమోపో బ్రహ్మంబు ॥వి॥ 944

పంచాక్షరీ మహామంత్రమే ప్రధాన మన్నాడు.

ఆ. ఐదు వర్ణములను । నానంద మెఱిఁగిన
* నందెపొంది ముక్తి । యలరుచుండు
నైదులోనఁ దెలియు । టదిమోపో బ్రహ్మంబు ॥వి॥ 945

946, 947, ఒకేరీతిగా నున్నను, భావం వేరు.

శివపంచాక్షరి = నమశ్శివాయ; నారాయణ పంచాక్షరి = నారాయణాయ; పాపములను పోగొట్టును.

ఆ. ఐదువ్రేళ్ళ బలిమి । హస్తంబు పనిఁజేయు
నందొకండు, విడ్డఁ । బొందిక చెడిపోవు
స్వామియుఁడొకఁడు విడినఁ । జెడుఁగదా పనిబల్మి ॥వి॥ 846

ఐకమత్యమును జెప్పెను.

ఆ. ఐనదాని కింక । కాని దానికినైన
నాడువారి, మాట । లాడుమన్న
సాహసమున పెక్కు । లూహాలు పనుతురు ॥వి॥ 947
ప్రతిదానికి ఆడువారు ఏదో మిషకల్పించి అల్లరి జేయుదురు.

ఆ. ఐనవారలంచు । నాప్తులటంచును
బందుగులను, నమ్మఁ । బాడిఁగాదు
తనకు నైన వాఁడు । తానుకాకింకేఁడు ? ॥వి॥ 948
“ యెవరికి వారే యమునాతీరే ” వాడెను.

కం ఒంటరిగా నున్నప్పుడు
కంటికి, మింటికిని, నడుమఁ । గాపురముగ నీ
యుంటను గన్గొని । పిమ్మట
జంటించు జితాత్మయుని । జపమున వేమా ! 949
ఏకస్థలమున ఏకాగ్రతతో భ్రూకుటిని వీక్షించ మనెను.

ఆ. ఒంటి కంబమందు । నొనరఁ గంకణమాను
యూరు కంకణముల । నమరనిల్పి
యవలదాటిచూడ । నది పరమాత్ముఁడౌ ॥వి॥ 950
* 1 పాఠాం :— స్తంభ.
చంద్రనాడిద్వారా షట్చక్రముల కుత్తేజంనించినట్లైతే ఏడవ చక్రమైన సహస్రారమునకు వచ్చును.

ఆ. ఒంటి కంబమందు । నొనరఁ జూచెదుజ్ఞప్తి
గూడి, యాడి, పాడి । కోర్కెఁదీర
మేడ దాటిచూడ । మితిమీరు చుందురా ! ॥వి॥ 951
సహస్రార చక్రముద్వారా విజ్ఞానాన్ని వీక్షించమన్నాడు.

ఆ. ఒంటి మేడలోన । నొనరంగఁ జూచిన
మంటి, మింటి నడుమ । మహితమగును
గంటిజ్యోతి మిగిలి । కలియనెక్కుముహంస ॥వి॥ 952
“ సాకారంచ నిరాకారం నిర్గుణంచ గుణాత్మకం తత్త్వం తత్పరమం బ్రహ్మ ఇతివేదాంత డిండిమః ” యిది పాటించిన గొప్పవాడగును,

కం. ఒకచిన్న బిలముఁ జొరఁగా
సకలంకుని తేజమందె సావరణంబై
నికరంబుగఁ జూపట్టును
సకలంబును సమయఁజూడు । సరగున వేమా! ॥వి॥ 953

"అవిద్యోపాధికో జీవో మాయోపాధిక ఈశ్వరః మయావిద్యా గుణాతీత ఇతి వేదాంత డిండిమః" అనుకరించెను.

కం. ఒకటని రెండని యెన్నుచుఁ
బ్రకటితముగ లెక్కపెట్టఁ । బైకొనుచుండు
న్నికరమున నెఱుక దాటిన
సకలేశుని గాంచుటదియె । సరసము వేమా! ॥వి॥ 954

గణింప వీలుగాని జగత్కర్తను తెలుయుటయే పరమార్థము.

కం. ఒకటను జ్యోతై ధరవే
ఱొకఁటను దాఁ గూడిమఱిగి । యొకటను నుండే?
యొకటం బుట్టట కాచుట
నొకటే సుఖముననె । యుండు నుర్విని వేమా! 955

శ్లో॥ యదానందరూపం ప్రకాశస్వరూపం నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యం అహంబ్రహ్మవృత్త్యైక బ్రహ్మం తురీయ పరబ్రహ్మ నిత్యం తదేవాహ మస్మిన్ అను సూక్తి ననుసరించెను.

ఆ. ఒకఁట, రెంట, మూఁట । యోగీంద్రులనుఁగూడి
యుదయ పర్వతంబు । మొదటఁగిరుల
క్రమమెఱింగి యల్ల । ఘనపట్టణము లెల్ల
వీరుఁడొక్కఁడేలు । వినర వేమ. 956

జ్ఞానోదయమున త్రిమూర్తులనుఁగూడి ప్రపంచాతీతుఁడు కావలెనని వేమన సూక్తి.

ఆ. ఒకటిక్రింద నొక్క । టొగిగుణకముఁబెట్టి
సరగుణ గుణియింప । వరసఁబెరుగుఁ
నట్టి రీతినుండు । నౌదార్యఫలములు ॥వి॥ 957

వేమనగారికి గణిశాస్త్రమునందుగూడా అభిమానమే!

ఆ. ఒకటిక్రింద నెక్క । టొనరఁ లబ్ధమువెట్టి
వలనుఁగా గుణింప । వరుసఁ బెరుగుఁ
నట్టిరీతి నుండు । నౌదార్య ఫలములు ॥వి॥ 958
రెట్టింపువలన ఎక్కువగును.

ఆ. ఒకటిలోనఁ గొట్టి । యొకటిలోనని పెట్టి
యొకటిలోనుజూడు । మొకటెచూపు
యొకటి యందెచూడ । నొనరంగము క్తిరా ! ॥వి॥ 959
అన్నిటికీ ఏకత్వమే ఆధారం.

ఆ. ఒకఁడు పిప్పిజేసి । యొల్లక విడిచిన
పిప్పి కాసఁజేయు । పేదవిటుఁడు
కుడిచి వేయు పుల్లె । కుక్కలు నాకవా ? ॥వి॥ 960
విటుల కుటిలవర్తనాలకు చక్కగా ఉపమానం జూపెను.

ఆ. ఒకఁడు చూడనేలఁ । నొకఁడు మెచ్చఁగనేల
* నొకఁడు పొగడనేల । వాసనేల
యొకనికైన హెచ్చు । వుర్విలోనెవఁడయా ! ॥వి॥ 961
* యతి తప్పింది. అందరూ సమానులే !

కం. ఒక తెకు లోలత భ్రమయక
సుకుమారుండన్ని రుచులఁ జూడఁగ వలెబో !
సకల వనంబులఁ దుమ్మెద
మకరందముఁ గ్రోలినట్లు । మహిలో వేమా ! 962
విలాసపురుషుడు తుమ్మెదలాంటివాఁడని గమ్మత్తుగా వర్ణించాడు మనకవి.

కం. ఒక దినమును నొక నెలయును
బ్రకటితముగ నొక్కయేడు । భావింపంగా.
నిఁక యుగముల కీలెక్కయె
సుకరంబగు జగములందుఁ । జూడర వేమా ! 963

కం. ఒక దినమును నొక నెలయును
నగణితముగ నొక్కయేడు । నరులకు నటుదా

యుగ, యుగముల, కీలెక్కలు
పొగడొందును జగములందు । పొలుపుగ వేమా ! 964

కాలమానము కూలంకషంగా యిచ్చాడు.

ఆ. ఒకనిఁ జెఱిచెదమని । వుల్లమందెంతురు
తమకు చే టెఱుఁగరు । ధరను నరులు ;
తమ్ముఁ జెఱుచు వాఁడు । దైవంబుగాదెకో ! ॥వి॥ 965

ఆ. ఒకనిఁ జెఱుతు మనుచు । నుల్లమందెంతురు
తమకుఁగలుఁగు చేటుఁ । దా మెఱుఁగక
తమ్ముఁ జెఱుచువాఁడు । దైవంబు గాఁడొకో ? ॥వి॥ 966

పైరెండుపద్యాలొకే రీతిగానున్నాయి. పదములు కొద్దిమార్పు మాత్రమే.
చక్కనినీతులు మిక్కుటముఁగా వాడుట వేమనకలవాటు.

కం. ఒకపద్యంబును మదినిడి
ప్రకటితమగుఁ గుట్టుఁదెలిసి । పరికించినచో
సకలంబును శ్రుత్యర్థము
నికరంబగుఁ గురురహస్య । నిలయము వేమా ! 967

“ గురువాక్యం శాస్త్రదృష్టం తృతీయ మాత్మనిశ్చయం ” వాడెను.

కం. ఒక బ్రహ్మాండముఁదలఁచినఁ
బ్రకటింపగఁ రాని వనగ । బహులోకంబు
న్నికట ములై యెట్లుండునో !
యకటా ! మీతాండవంబు । లట్టివె వేమా ! 968

శ్లో. “ నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం । నమంత్రో నతీర్థం న వేదా నయజ్ఞాః
నహింభోజనం నైవభోజ్యం నభోక్తా చిదానంద రూపశ్శివోహం శివోహం ”
వాడెను.

ఆ. ఒకరి నోరుఁగొట్టి । యొనరభక్షింతురు
వారి నోరు మిత్తి । వరుసఁగొట్టు
చేపపిల్లను[2]భువి । చేపలు చంపును
జనుఁడు[3]చేపపిండుఁ । జంపు వేమ. 969

* పాఠాం :— 1 యొకరు 2 పిండునేల (పిండుఁబెద్ద) 3 వానిబట్టి.
పిల్లడు = సమూహము, అల్పులను బల్లిదులు భక్షింతురనే నీతిని సూచించెను.

ఆ. ఒకరి కీడు వేరె । యొక్కరి కియ్యఁడు
ఒకరిమేలు వేఱె । యొకరి కీడు
కీడు, మేలు, వారు । పోడిమిఁదెలియరు ॥వి॥ 970

మంచిగాని, చెడ్డగాని మనస్సునుబట్టి యుండును.

తే. "ఒకరి యెంగిలి నోటను । నొకర నుడువఁ
దారక బ్రహ్మమై యిలఁ । దనరుఁగాదె?
యెందఱో తలచిన మది । యెంగి లనరె
యెంగి, లెంగిలి, యననేల? । నిఁకను వేమ. 971

రామనామమే తారకము; "రా" యనఁగా! తత్పదము "మా" యనఁగా! త్వంపదము. ఆరెండిటైక్యమే తత్త్వమని "సప్తకోటి మహామంత్రం చిత్తవిభ్రమ కారకమ్. ఏకమేవ! పరంమంత్రం గురురిత్యక్షరద్వయం"

ఆ. ఒక సందులో దూరి । యొక సందులో వచ్చి
యొక సందులోఁడాగి । వెలుపుఁజూపు
వెలుపు పుట్టినచోట । వివరంబు చూడరా! ॥వి॥ 972

సందు = ఆత్మ పరమాత్మలయొక్క కలయిక నీమనసులో నీవు చూడుము.

ఆ. ఒక్కఘటము లోనఁ । బెక్కురూపులు నిల్చి
నెన్ని, యెన్ని, రూపు । లెసఁగు చుండు
నవియుఁ దోలఁగనేని । నన్నియు బైకొను
నాత్మ తత్త్వ మిట్టు । లౌర వేమ. 973

సర్వమూ సర్వేశ్వరుని స్వరూపమే!

ఉ. ఒక్కఁడు రోగియాయె మఱి । యొక్కఁడు దిక్కుల భోగియాయె వే
ఱొక్కఁడు త్యాగియాయె । నటు డొక్కఁడు చక్కనిరాగి యాయె దా
నొక్కఁడుజ్ఞాని యాయె! విను మొక్క మహాత్ముని గానమెచ్చుటన్
నిక్క మివన్ని రూపములు । నీకునుఁ జెల్లుచునుండు వేమనా? 974

బ్రహ్మదేవుఁడు కడుపున బంగారము గలవాఁడాయెను. శివుని భిక్షాటన, విష్ణువు భోగములను, దక్షిణామూర్తి మహాయోగి, అర్ధనారీశ్వరుఁడు కామాస్తకుఁడు యీవివరించిన రూపములన్నియు వేమనకుఁగలవు; బంగారు పుచ్చకాయలుదినిఁ సన్యాసి యయినవాఁడు, సకలభోగము లనుభవించినవాఁడును మహాత్ముఁడై యోగసిద్ధి, బొందిన వాఁడునగు వేమన సర్వసమర్థుఁడు.

ఆ. ఒక్క తనువునకిలఁ । బెక్కు పాట్లనుఁబడి
పెక్కుదినములెల్లఁ । బ్రేలి, ప్రేలిఁ
యగ్నిలోనఁ బడునో? । యిలనక్కపాలౌనో ?
తెలియుమయ్య ! యికను । దేవ వేమ. 975

శరీరంగురించి పాట్లుబడుదురు. దేహమస్థిరం.

ఆ. ఒక్కతల్లి కడుపు । [1]నొనరఁగా పదిమంది
* పుత్రులు జన్మించి । పుట్టివెనుక
ఒకరికుండు బుద్ధి । యొకరికి య్యేఁడు హూరుఁడు ॥వి॥ 976

పాఠాం:- 1 "వసుధలో" * ఈపాదం గణభంగంగాను, తప్పుగాను వుంది. ఏక గర్భజనితులయ్యు వేరువేరు విధంగా ఉంటారని వేమనసూక్తి.

ఆ. ఒక్కతోలుఁదెచ్చి । యొనర బొమ్మనుఁజేసి
యాడునట్లు చేసి । యట్టె వైచుఁ
దన్నుఁద్రిప్పు వానిఁ । దానేలఁగానఁడో ! ॥వి॥ 977

జగన్నాటక సూత్రధారుఁడు జనుల నాడిస్తాడు.

ఆ. ఒక్క తోలుఁదెచ్చి । యొనర బొమ్మనుజేసి
యాడఁజేసి తూల । నవనివైచి
తన్ను నట్టిరీతి । తనర నాడించేటి
వాని తెలియరేమి । వారు ? వేమ 978

ఆ. ఒక్కనెంగిలిఁ గను । నొనరఁగాఁ దలఁచిన
బ్రహ్మ యెంగిలాయె । బహుగతులను
యిందఱిని దలఁచిన । నీవోరుగాదెకో ! ॥వి॥ 979

జగత్తంతా ఎంగిలని చక్కనినీతి చెప్పాడు మనకవి.

ఆ. ఒక్కప్రొద్దు వుండి । పరముఁజెందెదమందు
రెండిచత్తురు మూల । బండ జనులు
యొంటి ప్రొద్దుచేత ! వ్రతములుండఁగనేల ? ॥వి॥ 980

* 1 3 పాదాలలో యతి తప్పింది. 2వ పాదంలో గణం తప్పింది
వ్రతములు ఉపవాసాల్ని విమర్శించెను.

ఆ. ఒక్క ప్రొద్దుచేతఁ । బ్రక్కలెండును గాని
చిత్తమల్ల గురునిఁ । జేరఁబోదు
మూలమెఱుఁగ నతఁడు । ముక్తుండుగాఁడయా ॥వి॥ 981
ఉపవాసమువలన కృశించుటకంటె ఉపాయంతో అపాయం తప్పించుట ఉత్తమోత్తమ మన్నాడు మన వేమన.

ఆ. ఒక్కప్రొద్దు లుండి । యొగి నీళ్ళ మునిఁగియుఁ
గూడువండి వేల్పుఁ । గుడువు మనుచు
దానినోరు గొట్టి తామెల్ల । తిందురు ॥వి॥ 982
నానాతిథ్య తినుటకే నైవేద్యాలని నవ్వాడు మనకవి.

ఆ. ఒక్కప్రొద్దులున్న । నూరఁబందిగఁ బుట్టుఁ
బృథివి దపము సేయఁ । వేధ యగును
నిగిడి శిలకు మ్రొక్క । నిర్జీవు లౌదురు ॥వి॥ 983
ఒంటిపూట ఉపవాసం పందిగా పుట్టుటకునూ రాళ్ళకు మ్రొక్కుట శవమవుటకు కారణములు. ధన్యత్వమునకు తపస్సేమూలము.

ఆ. ఒక్క మనసు తోడఁ । నున్నది సకలము
తిక్కఁబట్టి నరులు । తెలియలేరు
యిక్కనెఱిఁగినడవ । నొక్కడే చాలురా! ॥వి॥ 984
యిక్క = మార్గము, ఉనికి పట్టు; మార్గముము దెలసి నుసలుమన్నాడు.

ఆ. ఒక్క యింటిలోనఁ । బెక్కు ఘటములు నిలిపి
నన్నియన్ని రూపు । లలరుచుండు
నవని దొలఁగనేని । నాయిల్లు బయలౌను ॥వి॥ 985
బహుభామలు బ్రతికుంటేనే; మరణిస్తే ఏమీ లేదు.

కం. ఒచ్చేది పొయ్యేదియును మఱి
చచ్చెడిదియుఁ గానలేరు । సహజం బనుచున్
విచ్చల విడిగాఁ దిరుగుచు
చిచ్చునఁబడు మిడుతవలెనె । క్షితిలో వేమా! 986
లోకసహజ నీతి చక్కగ వాడేడు.

ఆ. ఒట్టివాఁడు కీడు । వాడల పురుఁగువీడు
వట్టియూళ కీడు । వరుఁడుకీడు
పొట్టచేయి వాఁడు । సుమ్మెప్పుడునుకీడు ॥వి॥ 987
సంప్రదాయక విజ్ఞానాన్ని చమత్కారముగా వాడాడు.

ఆ. ఒట్టు [1] మాటనాలిఁ । [2] బోలిమాటల చేటు
పోటుమాలు బంటు । కూఁటిచేటు
పనికిమాలు తొత్తు । భత్యంబుచేటయా ! ॥వి॥ 988
పాఠాం :- " 1 మాలఁ " " 2 ఓలిమాడలచేటు "
నిరర్థకాలను నిరూపించాడు.

ఆ. ఒడల బూది పూసి । జడలు ధరించిన
నొడయఁడగును ముక్తిఁ । బడయలేఁడు
* తడికె బిట్టుపెట్టఁ । దలుపుతో సరియౌనె ? ॥వి॥ 989
పాఠాం :- * " దరికె " " తుడుక "
బూటకప్రయోగులకు బుద్ధివచ్చునట్లుగా శుద్ధమైన సూక్తులువాడేడు.

ఆ. ఒడలి మెఱుఁగుఁజూచి । నడ సొబగునుఁజూచి
వంకకొప్పుఁ జూచి । వనితఁ జూచి
విటులు కడుపులోన । వెతనొంద కుందురా ! ॥వి॥ 990
మందయానల అందాలజూచి విటులు డెందములో కుందుతారని అందంగా చెప్పేడు.

ఆ. [1] ఒడలు నల్లనైన । నోరుపుగల సతి
గుణము [2] మేల్మిఁబట్టి । కోటినేయు
ప్రాత యెనుముపాలు । రోఁతనవచ్చునా ? ॥వి॥ 991
పాఠాంత :— 1 " ఒడలు శిథిలమైన నోర్పైన సతియైన " 2 " గలిగనేని "
యెనుము = గేదె ; గుణవతిని ఘనముఁగా ప్రశంశించాడు.

ఆ. ఒడలుపెంచు లంజె । యుబ్బసంబున నైన
నూగి విటుని మీఁద । నొరిఁగె నేని
పంది కొక్కుమీఁద । బండి కల్లడట్టు ॥వి॥ 992
మదోన్మత్తతగల మదవతిని బండిచక్రముతో పోల్చాడు.

ఆ. ఒడలుపెంచు లంజ । వుబుసు పోకలకునై
వొక్క విటునిమీఁద । నొరిఁగెనేని
పంది కొక్కుమీఁద । వడగండ్లు బడ్డట్టు ॥వి॥ 993
కామోద్రేకముఁగల స్త్రీకి కాముకులెందరైనా గడ్డి పరకలే !

ఆ. ఒడలు బడలఁజేసి । యోగుల మనువారు
మనసు కల్మషమును । మాన్పలేరు
పుట్టమీఁదఁ గొట్ట । భుజగంబు చచ్చునా ? ॥వి॥ 994
ఉపమానములు వాడుటలో కాళిదాసునిశిష్యుఁడే మనకవి.

ఆ. ఒడ్డును పొడుగైన । గడ్డంబు నిడుపైన
దానధర్మ మిడక । దాత గాఁడు
యెనుము యెచటనైన । యేనుఁగుఁ బోలునా ? ॥వి॥ 995
డాబుకబుర్లు చెప్పేవాడు దాతగాడు.

ఆ. ఒడ్డుఁ బొడుగుగలిగి । గడ్డము బొడవైన
దానగుణము లేక । దాతయగునె !
యెనుము గొప్పదైన । నేనుఁగుఁ బోలునా ? ॥వి॥ 996

కం. [1] ఒడ్డెడు సతి వలపెఱుఁగునె ?
జడ్డునఁబడి తిరుగుఁగాక । జారుం డగునా ?
[2] యడ్డాదిడ్డము తిరిగే
తెడ్డెఱుఁగునె ? పాలతీపు । తెలియము వేమా ? 997
పాఠాంత :— 1 " ఒడ్డెయువతి " 2 " యడ్డము దిడ్డము "
జడ్డిగము=సాలు. యథార్థాన్ని సుబోధకంగా వాక్రొన్నాడు.

ఆ. ఒడ్డెవానికి గుఱు । తోర్చి చెప్పినఁగాని
తెలియఁబడద దాత్మ । తేటలేక
చెడ్డకొడుకు తండ్రి । చెప్పిన వినఁడుగా ! ॥వి॥ 998

ఆ. ఒదిగి యొదిగి గురువు । నొప్పుగా నొప్పించి
మదిని నిల్పి జాతి । మమత విడిచి
కదియుచుండుమయ్య । కలకాలమొకరీతి ॥వి॥ 999
కులాన్ని తొలగించి గురుతు తెలియమన్నాడు.

ఆ. ఒప్పులేని పెండ్లి । నొనర సేయఁగరాదు
కోడి [1]పందెముజూడ । మాడరాదు
కొట్టి [2]కొట్టక మునుపె । తిట్టనేరాదురా! ॥వి॥ 1000

1. 2 గణములు తప్పినవి.
లోకనీతులు చెప్పటలో అందెవేసినచేయి మనవేమన

ఆ. ఒరల కొఱకు భూమి । నెరపెడివారలు
నవని పతికి వశ్యు । లైనవారు
పాలవంటి కులము । పన్ను వెట్టినవారు
వాకెఱుఁగరు కాపు । వారు వేమ. 1001

కాపులు వ్యవసాయమే ముఖ్యంగా జూచుకొంటారు గాని స్వతంత్రత చమత్కారములు కోరరు.

ఆ. ఒరుల నోరులఁగడవ । కుండఁగబంధింప
లింగఁ డేమి దొంగి । లించినాఁడు
దేహమందు శివునిఁ । దెలియంగనేరరో ॥వి॥ 1002

లింగాధారణ కాక ఆత్మలింగార్చనే అధికమన్నాడు మనకవి.

ఆ. ఒల్ల నన్నఁ బోదిఁ । గొల్లె నెన్నఁగరాదు
తొల్లిచేయునట్టి । ధూర్తఫలము
యుల్లమందు వగవ । కుండుటయోగంబు ॥వి॥ 1003

" అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాఽశుభం " సూక్తిని వాడెను.

కం. ఒల్లనిపతి నొల్లనిసతి
నొల్లనిచెలికాని విడువ । నొల్లనివాఁడే
గొల్లఁడు గాఁడేధరలో
గొల్లనికిం గలవె వేటి । కొమ్ములువేమా! 1004

కం. ఒల్లని సతి నొల్లనిపతి
నొల్లని చెలికాని విడువ । నొల్లనివాఁడే
గొల్లఁడు గొల్లనికిని మది
నెల్లడఁ గొమ్ములును గలవె? । యెందును వేమా! 1005

పైరెండుపద్యాల్ లోకరీతిగా నున్నాయి. ఇవి సుమతీశతక పద్యాన్ని అనుకరించినవి.

ఆ. ఓగునోగు మెచ్చు । నోసరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ । బరము లుబ్ధుఁ
బంది బురదమెచ్చుఁ । బన్నీరు మెచ్చునా ? ॥వి॥ 1006

ఏవర్గంవారు ఆవర్గంవారినే మెచ్చుతారు.

ఆ. ఓగు బాగెఱుఁగని । యుత్తమూఢజనంబు
లిల సుధీజనముల । నెంచుటెల్లఁ
గరినిఁగాంచి కుక్క । మొఱిగిన సామ్యమా ॥వి॥ 1007

ఉపమానోపమేయములు ఉన్నతస్థాయిలో నున్నాయి.

ఆ. ఓగు బాగెఱుఁగని । వాట్టిమూఢజనుండు
యిలను మంచివారి । నెంచుటెల్ల
మృగముతోడ కుక్క । మొఱిగిన సామ్యమా ॥వి॥ 1008

తారతమ్యములు తెలియక తక్కువెక్కువలు నిర్ణయించుటెట్లు ?

ఆ. ఓగు బుద్ధి వీడి । యోగి గాఁవలెఁజుమీ !
భోగ మొసఁగుయుక్తిఁ । బూనరాదు
సద్గుణంబు మొదలఁ । జవిగానిచూడరా ! ॥వి॥ 1009

భోగలాలసత్వం లేక పూర్ణప్రజ్ఞ సంపాదించి పూజ్యుఁడవు కమ్మని సూచించెను.

ఆ. ఓగుబుద్ధి విడిచి । యోగి గావలెఁ గాని
భోగ మమరు యుక్తిఁ । బూనరాదు
సాగఁదోలి పిదపఁ । జవిఁగొని చూడరా ! ॥వి॥ 1010

ఆ. ఓజమాలు పొలఁతి । యోలి మాడలచేటు
పోటు కెడలుబంటు । కూఁటిచేటు
పనికిమాలు దాసి । బత్తెంబుచేటురా ! ॥వి॥ 1011

ఆ. ఓజలేని యాలు । యోలి మాడలచేటు
పాటులేని మగఁడు । కూఁటిచేటు
పనికిమాలు దాసి । బత్తెంబు చేటయా ! ॥వి॥ 1012

పైరెండు పద్యాలు ఒకేఛాయలోనున్ననూ భావము మాత్రం వేరు.
ఓజ = పనికిమాలిన; ఓలి = కన్యాశుల్కము.

తే. ఓటు పరులకు గల్గించు । నూహఁజెంది
కుత్సితులతోడఁ బనిఁ బడఁ । గూడికొన్న
నప్పు డైనట్టి వారల । యాప్తతఁ దన
గౌరవంబును మాపును । గాదె ? వేమ. 1013

దుర్మార్గులకు దూరంగా నుండమన్నాడు.

ఆ. ఓడ సత్వమెల్ల । నోగి సముద్రములోన
బండి సత్వమెల్ల । బైటనుండు
నాడు దాని సత్వ । మేడనో చూడరా ? ॥వి॥ 1014

ఆడుదాని ప్రతాపం మగని దగ్గరే ?

చిత్రపదం. ఓన్నమశ్శివా యని । నారవించన విడిచి
శివునిపై జ్ఞప్తి యుంచి । చేయంగ స్మరణంబు
జగతి యీనరులకు జన్మ । సాఫల్యమా ॥వి॥ 1015

శివపంచాక్షరి శ్రేష్ఠత్వము వాకొన్నాడు.

ఆ. ఓపగల్గుదు నని । యెక్కింత మిణికిన
నున్న వాసికూడ । సున్నచుట్టి
మూల అంకు లాగి । గేలి సేయుదురయా ! ॥వి॥ 1016

వాసి = పేరు; మిణుకుట = లేనివి చెప్పుట; మూలఅంకు = అసలు విషయము.

తే. ఓర గంటను సంపద । నొక్కమాఱు
కన్నఁ జాలును గామిని । కాంక్షఁజెందు
గాన నన్యునిగులసతి । కానకుండ
రక్షణముచేయదగు నెల్ల । రకును వేమ. 1017

"స్త్రీణాం ద్విగుణ మాహారః బుద్ధిశ్చాపి చతుర్గుణాః । సాహసం షడ్గుణం చైవ కామ మష్టగుణం భవేత్ " వాకొన్నాడు.

ఆ. ఓర పడఁగపాము । నోగిచూచు నేర్పున
చూరుక్రింద కాకి । చూచువిధము
యవ్విధమున యోగి । యాంతరజ్ఞప్తిచే
పారఁజూడ ముక్తి । పదము వేమ. 1018

అసలైనయోగీంద్రుని అంతర్యమును సహజోక్తిచే చక్కగా చెప్పెను.

ఆ. ఓర్పులేని భార్య । యున్న ఫలంబేమి !
బుద్ధిలేని బిడ్డ । పుట్టియేమి ?
సద్గుణంబులేని । చదువది యేలరా ? ॥వి॥ 1019
సహజనీతి ఉట్టి పడుచున్నది.

తే. ఓర్పులేనట్టి వారల । కోరుల యశము
విన్నకోలఁదినిఁ జెంపొందు । వెర్రి తెవులు
దాని పరిహారమునకునై । మానకెపుడు
తమ ఘనంబును జాటింత్రు । ధరణి వేమ. 1020

తే. ఔచితిం గన్న వాఁడెప్డు । నర్హమయిన
గౌరవమ్మునుఁ బదవినిఁ । గనుచు నుండు
సర్వజనులునుఁ బూజింప । సంతతమును
దండిదా కీర్తి నార్జించు । చుండు వేమ. 1021
ఔచితి = సహజస్వభావము. గొప్పవాడు సర్వత్రా గౌరవనీయుడు.

ఆ. ఔనటంచు నొకఁడు । డాడిన మాటకుఁ
గాదటంచుఁ బలుక । క్షణము పట్టు
దాని విలువఁ దీయఁ । దాతలుఁ దిగవలె ॥వి॥ 1022
మూర్ఖాత్మునితో ముచ్చటించడం ముప్పు.

ఆ. ఔననంగ వచ్చు నైనది । కానిది
యన్యుఁ డెదుటనుండి । యడుగఁడేని
నిలిచి యడుగువాఁడు । కలిగిన నిలువఁడు ॥వి॥ 1023
వాచాలుని లక్షణాలు వాకొన్నాడు.

తే. ఔను వేమన చెప్పిన । యాత్మబోధ
తెలియనేరని యజ్ఞాని । దేబెలెల్లఁ
దలనుఁ బాసిన వెంట్రుక । వలెను జూడ
భుక్తి ముక్తులుగానరు । భువిని వేమ. 1024
వేమన చెప్పినవి వేదోక్తులని చాటాడు.

ఆ. ఔర యాడుదాని । నాబ్రహ్మ సృష్టించెఁ
బురుషుపాలిటి పెను । భూతమట్లు
దాని వలను జిక్కఁ । గాని వాడుండునే ॥వి॥ 1025

స్త్రీదగ్గర అడకత్తెరలోనున్న పోకచెక్కవలె మగవాడుండును.

ఆ. ఔర యెంత వార । లల్లరి మానవుల్
ప్రభువునైన గేలి । పఱతురెన్నఁ
బాఁ దెగించువాఁడు । దండియౌ భువిలోన ॥వి॥ 1026

ఆ. ఔరసుండు నీకు । వారసుఁడౌఁగాక
వేశ్యయందుఁ బుట్టి । విధవ కొడుకు
నీవు పోయినపుడు । నీరైన వదలునే? ॥వి॥ 1027

ఔరసుఁడు = తనకులసతియందు గల్గినవాడు. వారసుఁడు = వంశానికి సంబంధించినవాడు. జారత్వందూష్యం.

అ. ఆ ల ఒడి క్రమపద్యాలు సమాప్తము.

## క

తే. కంకణముఁ గట్టి కైవల్య । కర్జ మంది
యంకురింపఁగఁ బరిపూర్ణ । మభినుతించి
జింక తాలుపు వెలుఁగందఁ । జిన్మయంబు
జేరనై నదియే ముక్తిఁ । దారి వేమ. 1028

కర్జము = పని, కార్యము ; కంకణముగట్టి = ఒకేపనిని స్థిరపరచుట ; జింక తాలుపు = ఈశ్వరుఁడు (చంద్రుఁడు) ; అంకురింపఁగ = మొలకలెత్తఁగ.

ఆ. కంకుభట్టనంగ । గాషాయములుఁగట్టి
కొలిచెఁ ధర్మరాజు । కోరి విరటుఁ
గాలకర్మఁ గతులఁ । గనిపెట్టవలెనయా! ॥వి॥ 1029

పాండవాజ్ఞాతవాసకథ యిచ్చట పేర్కొనెను.

ఆ. కంచిపురమున నున్న । కరిగిరి వరదుని
మనసుఁ దృఢముగ జేసి । * మ్రొక్కలేక
వేదుకార్థముఁ జూడ । వెళ్ళిపోదురు నరులు ॥వి॥ 1030

* యిచ్చట యతి తప్పినది. మ్రొక్కుచును ఉండవచ్చును.
(కరిగిరి) ఇందులో పదములు తప్పినది. కరి చర్మధారియగు నీశ్వరునకర్థము.

ఆ. కంచుకోలిమి వుంచి । కరఁగనిచ్చి దాన్ని
వంచి ఆరినవెనుక । వంపుదీరె
కాంచ కుమ్మరికాదు । కమ్మరికేతగు ॥వి॥ 1031

యోగసాధన యోగులకేగాని యితరులకు గాదు.

ఆ. కంచెఁ డన్నముఁ దినఁ । గా నేమి ఫలమయ్యె ?
ఈగ కడుపుఁ జొరగ । నిముడబోదు
నూఱునోము లొక్క । మూఱు అంకునఁ జెడు ॥వి॥ 1032

కడివెడు పాలలో చల్లచుక్క వేస్తే ఎట్లు విరుగునో అట్లే యిట జారత్వము నుదాహరించినాడు.

ఆ. కంటిఁ గంటిననుచుఁ । గర్మాధికారంబు
వెంటఁ గొనుచుఁ జెడును । వెఱ్ఱిఁజనుడు
బట్టఁబయట ముక్తిఁ । బాటించి చూడరో ! ॥వి॥ 1033

డాంబికులు తెలియని పనులు తెలుసునని తిరిగి "రెంటికిం జెడిన రేవడు" లౌతున్నారు.

ఆ. కంటి కావరమున । గానడు మరణంబు
మదముచేత దత్వ । మహిమఁ గనడు
భోగవాంఛచేతఁ । బురహరుఁ గానడు ॥వి॥ 1034

పురహరుఁడు = ఈశ్వరుఁడు (త్రిపురాసురులను వధించినవాడు)

కం. కంటికి మింటికి, నడుమను
నొంటరిగాఁ బయలుసేరు । నొప్పుఁగ లోనై
జంటించి మనస్సు నొక్కిన
మింటను నిన్నెఱుఁగవచ్చు । మేలుఁగ వేమా ! 1035

కన్నుకు సహస్రారమునకు మధ్యనున్న భ్రూకుటిని తెలుసుకోమన్నాడు.

ఆ. కంటి మింటికి మధ్యఁ । జంటబాయక తాను
* ముక్కంటిలో నిలువఁ । గలుఁగు ముక్తి
వేటికైన బ్రహ్మ సూటి । యొక్కడిదయ్య ॥వి॥ 1036

* గణములు తప్పినవి.

భ్రూకుటిని వీక్షించుటే వేమన సువాక్కు.

ఆ. కంటి దృష్టిచేత । గను విశ్వమెల్లను
దర్పణంబుఁగల్గఁ । దన్నుఁగనుచు
నాత్మతత్వ మార్గ । మారీతిఁ గనవలె
నార్య దర్పణంబు । నందు వేమ. 1037

ఇది దర్పణయోగము. అద్దములో నిశ్చల చిత్తముతో మండలము తన్నుఁ దాను జూచికొనిన యేరూపమునుండదు ; దీనినే దర్పణయోగ మన్నాడు.

ఆ. కంటి మంట చేత । గామునిఁ గాల్చియు
బెంటిఁ బాయలేడు । పెద్ద వేల్పు
పెంటిఁ బాసినట్టి । పెద్దలుఁ గలరొకో ॥వి॥ 1038

పెంటి = ఆడుది ; ఇచ్చట పార్వతి. అందరికీ కోరికలంకురించును.

ఆ. కంటిలోన మిన్ను । కలయికనఁగు ముక్తి
నంటి తిరుఁగు వాఁడె । యమలుఁ డగును
వంటకంబు కొఱకు । వాగ్గాటి జూపరా ॥వి॥ 1039

భ్రూమధ్యకళల బగ్ధాగ వీక్షింపమన్నాడు.

ఆ. కంటిలోనివానిఁ । గఱకంఠుఁ డెఱుగును
గంటిలోని వాని । మింట జూఁడు
కన్ను, మిన్ను, హృదయ । కమలమందెఱుగును ॥వి॥ 1040

నేత్రనాడిలోఁగల బ్రహ్మను హృదయకోశంలోఁ జూఁడమన్నాఁడు.

ఆ. కండ కావరమునఁ । గానఁడు మరణంబు
తను మదమునఁ గనఁడు । తత్వమల్లె
భోగవాంఛచేతఁ । బుణ్యంబు గానడు ॥వి॥ 1041

లోక సహజము ; తనుమదము = శరీర కావరము.

ఆ. కండచక్కెరయునుఁ । గలియుఁ బాలోసిన
దఱిమి పాము తన్నుఁ । దాకుఁ గాదె
కపట మున్నవానిఁ । గనిపెట్టవలెనయా! ॥వి॥ 1042

దుష్టులకు దూరముగా నుండుమని నీతిని బోధించాడు.

ఆ. కండచక్కెఱ తేనె । కలిపి చేతిలో పెట్ట
సద్దుచేయక తినును । సవతి కొడుకు
విషము చేతిలోఁబెట్ట । విసిరి పారేయడా ! ॥వి॥ 1043

విచక్షణ బుద్ధిని వివరించాడు వేమన.

ఉ. కండలు శ్రాద్ధదేవునకుఁ । గాలిన యస్తులు ; భూమిదేవికా
వండినకూడు కాకులకు । వానికి గప్పిన గుడ్డ మాలకౌ
మెండు ధనంబు రాజులకు । మేలగు భార్యలు మిండగాండ్రకే
నిండిన ప్రాణులందఱికి । నిక్కము పాపమేదక్క వేమనా ! 1044

“ శరభాంకలింగశతకము ” లోనున్న “ కండలు వహ్ని దేవునకుఁ గాలిన యమ్ములు భూమిదేవికిన్ ... ... ... ” పద్యము ననుకరించెను.

తే. కండ లెముకలు నెత్తురుఁ । గలిఁగి తనువు
మూత్ర మలములతో నుండు । ముట్టరాక
కాయజుని బాణమంచాసఁ । గల్గిఁజెడును
ఆసఁ బాపంగ నీవిధ । మరయు వేమ. 1045

కామము చేత మురికికొంపైన కాయమునే కాంక్షిస్తున్నాఁడు.

ఆ. కండలెల్లఁ గోయఁ । గా నేయజాలని
బండలోభి కాస । పడినఁ గలదె ?
కొండక్రిందఁ బసిఁడి । గోరినచందంబు ॥వి॥ 1046

“ అసాధ్యముఁగూర్చి ఆసపడరా ” దనే ఆర్యోక్తి ననుసరించాడు.

ఆ. కండ్లు, ముక్కులు, చెవులు, । కలములచే మూసి
* నోటివెంటనుఁగాలి । నేలవిడిచి
జనులు షణ్ముఖముద్ర । టనుచు బల్కుదురయా ॥వి॥ 1047

* యతి తప్పినది ; కనులు, చెవులు, ముక్కును మూసి బహిర్ముఖమైన దృష్టిని మనస్సును అంతర్ముఖముగా జేసి కనుబొమలనిల్పి నాద, బిందు కళలఁ జూచు షణ్ముఖి.

ఆ. కండ్లు మొత్తగనొక్కిఁ । గురునందుఁజేర్చితే
గురుని చిత్కళలన్ని । కండ్లకిచ్చు
పున్నతావునవుంచె । పూరికేమొచ్చురా! ॥వి॥ 1048

పూరు = శరీరము; బ్రహ్మనుఁదెలసికొనిన శరీరావసరముండదు.

ఆ. కంతకాశ్రయింత్రు । కలికంతుడాదిగా
వింతగానుఁ భ్రమసి । విసుకరెపుడు
కంతరహితమైన । కలికంతుఁ జూడరా ॥వి॥ 1049

కంత = స్త్రీమర్మస్థానము; స్త్రీభ్రాంతికి స్థాణుడైన శివుడే లొంగిపోయాడని తెలిపెను.

ఆ. కంబముననుఁ జొచ్చిఁ । కడ తేటిపోయెడి
తెలి వెలుఁగకయుండెఁ । దిరిగివచ్చి
తెరువుఁదెలిసిఁ దాట । దేవుఁ డందురుగదా! ॥వి॥ 1050

కంబము = మేరుపుకూటము; తెలుసుకోవలిసిన స్థానము తెలిస్తే దేవుడందురు.

ఆ. కంబళములుఁగట్టి । గంతలఁగజ్జల
బోడితలల సొంపు । పొల్పుమీఱఁ
గడుఁపు కొఱకుఁ దిరుఁగ । ఘనులౌదురా! వారు ॥వి॥ 1051

కంబళములు = రంగురంగుల కుప్పట్లు. లోకాన్ని మోసంజేసే వికారపు వేషాల్ని విమర్శించాడు వేమన.

ఆ. కంబళముఁగట్టి । గంతలు గజ్జలు
బోడితలలు కాని । బొంతచిరత
లాత్మదేవపూజ । లవిసేయనేరవు ॥వి॥ 1052

వేసమువేసి మోసంజేయుట గ్రాసమునకేగాని మోక్షానికి పనికిరాదు.

తే. కచముఁ గక్ష్యంబు, నోరునుఁ । గనులు, మేను,
నాభియును, బాహు మూలంబు । నాతికెపుడు
నోర్వఁదగినట్టి గాలుతో । నొప్పుచుండు
నింతకేయేం నాత్మిపై । భ్రాంతివేమ. 1053

గాలు = చెడువాసన; స్త్రీసర్వాంగాలు దుర్వాసనా సంభరితములని వేమన వర్ణించాడు.

తే. కచ్చడములేల బిగియించి । కట్టవలెను
బుద్ధి కుదిరికయుండిన । బోలుగోచి
యేమిచేసెడి? నదిలేమి? । నెంత బిగియ
గట్టినను ఫలముండదు । గాదె వేమ. 1054

"వాతో స్తే పెదిమి లడ్డునా!" సామెత వాడెను.

క. కచ్చడము క్షేత్రమయి తగఁ
దచ్చునఁగాఁ! జగముపుట్టెఁ । దాతలనాడే
యిచ్చటఁ గులజుండెవ్వఁడు?
సచ్చరితులె యందఱునని । చాటర వేమా! 1055

క్షేత్రము = స్త్రీ యోని (భూమి) అందరూ యోనిసంభవులే హెచ్చుతగ్గులేల?

ఆ. కచ్చమీద యాస । కనకంబుపై యాస
లేనివాడు పుడమి । లేనివాడు
కలిఁగెనేని యతఁడు । గానంగరాడయా! ॥వి॥ 1056

కచ్చ = స్త్రీయోని; కాంతా కనకములను కాంక్షింపనివాడు లేడు; ఉంటే వాడు ఘనుడే?

క. కచ్చలు కామలు నాడఁగ
తచ్చంగాఁ జగముఁబుట్టె । తాతలనాడే
యిచ్చట, కులజుం డెవ్వఁడు?
సచ్చరితులు నందఱనుచు । చాటర వేమా! 1057

స్త్రీపురుష శుక్ల శోణితముల సంయోగమే పిండోత్పత్తి; అయినచో కులమేల?

తే. కట్టికొట్టనుఁ జిక్కఁడు । కర్మఫలము
ముట్టి దాటిన మనుజుని । ముఖ్యముగను
గుట్టుఁదెలిసినవాఁడని । కూడవలెను
రట్టతఁడు సేయగా విను । రహిని వేమ. 1058

సుకరప్రాసతో తేటగీతను అతిసొంపుఁగా నడిపాడు మహాకవి.

ఆ. కట్టుబట్టఁ జూచి । ఘనత చెప్పగరాదు
కానరాదు లోని । కలిమితనము
జంగమైనపిదప । జాతినెంచగరాదు ॥వి॥ 1059
వేషాన్ని బట్టి విజ్ఞానము తెలియదు.

ఆ. కట్టువారలేరి ? । కట్టనివారేరి ?
కట్టి కట్టలేని । కర్మలేరి ?
గట్టిపఱచి లెస్స । కనుగల్గి జూడరా ! ॥వి॥ 1060
ఆటవెలఁది నటనా కౌశలముఁను ఆటవెలదులలోఁ జూపఁగలఁడు.

ఆ. కట్టెపేరులాడిఁ । గట్టిచెప్పఁగరాదు
కానరాదు లోని । కలిమితనము
జంగమైన పిదప । జాతినెంచగనేల ? ॥వి॥ 1061
జంగము = నిజమైన శివభక్తులు.

ఆ. కట్టెపైన నున్న । కట్టెకు ఘనమేమి ?
చెట్టుపైన నున్న । చేరుఘనము
కట్టె చెట్టుగలిసె । కటకటా ! దైవంబు ॥వి॥ 1062
కట్టె = శరీరము. బాహ్యశరీరము ప్రకృతి సంబంధము; ఆంతర శరీరము పరమాత్మసంబంధము.

ఆ. కట్టెయందు నిప్పుఁ । గానని చందమీ
తనువునందు నాత్మ । తగిలియుండు
మఱుఁగుదెలిసి శివుని । మాఱ్కొని చూడరా ! ॥వి॥ 1063
కట్టె = కఱ్ఱ; హోమాగ్నిని నెల్లి, బలుసు, రావికఱ్ఱలు ద్రచ్చి అగ్నిని సృష్టింతురు. ఇది ప్రాచీనఋషి సంప్రదాయము.

ఆ. కడఁకతోన నరుఁడు । కామంబుఁగట్టిన
చిత్తముననుఁజికిలి । చిత్రరూపు
కైవడి నిలనుండుఁ । ఘనుడాతడే సుమ్మి
యడవి యందో । పల్లె యందో వేమ. 1064
చికిలి = అతిసూక్ష్మమైన; సర్వేసర్వత్రా కామవర్జితుఁడు ఘనతగాంచును.

ఆ. కడcక నఖిలమునకు । నడినాళమందున్న
వేగుచుక్కవంటి । వెలుcగుcదిక్కు
వెల్గుకన్న దిక్కు । వేఱెవ్వరున్నారు? ॥వి॥ 1065

నడినాళము = బ్రహ్మనాళము. స్వయంజ్యోతికన్న మిన్నయేమున్నది?

ఆ. కడcక నింద్రియములc । గట్టివేయగలేక
చావువచ్చునపుడు । సన్యసించు
నాత్మజితముగామి । నందునా మోక్షంబు ॥వి॥ 1066

శ్మశాన వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము.

ఆ. కడcగి గాలిలేని । గగనంబు భంగిని
బలు తరcగలు లేనిc । జలధి మాడ్కి
నిర్వికారమునను । నిశ్చలత్వమున దా
నుండెనేని ముక్తి । యొనరు వేమ. 1067

చలన రాహిత్యము లేని చిత్తముతో చక్కని సాదృశ్యముల నిచ్చెను

ఆ. కడcగినట్టి యాస । కడతేఱ నియ్యదు
ఇడుములందుc బెట్టి । యీడ్చుcగాని
పుడమి జనులభక్తిc । బొడమంగనియ్యదు ॥వి॥ 1068

"తృష్ణ" నేరోగము నికృష్టమైనదని వేమన దృష్టాంతముతో స్పష్టీకరించెను.

గీ. కడcగి సంకల్పముల నెల్లc । గట్టిపెట్టి
చిత్తమున నేమితలcపక । చిత్రరూపు
వైవడిని నున్న నాతcడు । ఘనుcడు దలcప
నడవియందునో పట్టణ । మందో వేమ. 1069

చిన్మయ బ్రహ్మను దీక్షా వీక్షణేక్షణుcడయి చూడమన్నాడు.

ఆ. కడలి జూడ నలలు । కడుc జోద్యమైయుండు
మనసుc జూడ భ్రమల । మరcగియుండు
బరముcజూడ మనసు । పడుపాట దట్టురా! ॥వి॥ 1070

ప్రతివారు మంచికోసం ఎంచుతూ ఉండడం ప్రకృతి సహజము.

కం. కడలేని యాది కాలం
బెడఁ బడకుండగను జ్ఞాన । మెఱుఁగక యున్న
న్వీడువడు జడమతులను మఱి
నడవుఁడి ఘనులెల్ల ముక్తి । నట్టుగ వేమా! 1071

సుకరప్రాసలో పోతనకు సహాధ్యాయుఁడనిపించుకొన్నాడు మనకవి.

కం. కడు ధీరుండై యోగము
తొడబడి తన్నెవ్వరైన । దూషించినఁ దా
నొడలికి నేపాటొదవిన
జడియక సాధించువాడె । సాధువు వేమా! 1072

ఎట్టి పట్టులనైన దిట్టతనముతో గుట్టును గుర్తించ మన్నాడు.

ఆ. కడుపుకెంత మరులు । కళవళ పడుదురు
కడుపుకొఱకు నూళ్ళఁ । గహనములును
కడుపు కెట్లయయిన । గలుఁగును భుక్తిరా! ॥వి॥ 1073

ఆ. కడుపుకేల మనస । కళవళ పడియెదు
కడుపుకేడఁ దృష్టి । గలుఁగుచుండు
గడుపు రాతిలోని । కప్పకుఁ గలుగదా! ॥వి॥ 1074

ఆ. కడుపుకేల ? మీరు । కళవళ పడెదరు
కడుపు చల్ల పడఁగఁ । గలదు భుక్తి
కడకు రాతిలోని । కప్పకు లేదొకో ? ॥వి॥ 1075

ఆ. కడుపు కొఱకె నరులు । కళవళ పడుదురు
కడుపుకొఱకె యూళ్ళఁ । గహనములును
కడుపున కెటులైనఁ । గలుఁగును భుక్తిరా! ॥వి॥ 1076

పైనాలుగు పద్యములు ఒకేభావాన్ని స్ఫురింపఁజేసిననూ చిన్నచిన్న పదములు గలిగి తాత్పర్యమార్పు సూచించుచున్నవి.

ఆ. కడుపులోన మలము । కడమవి యెముకలు
కలదు మాంస మింత । కప్పుఁదోలు
మలము నెత్తి మీఁద । మానెట్టు కగ్గెరా ! ॥వి॥ 1083

మంచి చెడుగుల కలయికయే ప్రపంచము.

ఆ. కడుపులోన మలము । కడమెల్ల నెముకలు
అరసిచూడఁ బెద్ద । ముఱికితోలు
ఇట్టి దేహమునకు । నేమి సంసారంబు ॥వి॥ 1084

మల మూత్రముల కొంపకై మమత వద్దన్నాడు మనకవి.

ఆ. కడుపులోని మలము । కష్టమై యుండఁగా
నన్న మేమి కీడొ । యని తలఁచియె
ఉపమెఱిఁగిన మనుజు । లుపవాసముందురు ॥వి॥ 1085

ఉపవాసదీక్షను ప్రశంసించెను.

ఆ. కడుపులోని రోఁత । కడునోటి యెంగిలి
కడుగ వశమె బ్రహ్మ । కొడుకునకును
సత్యమున్నఁ గొంత । జగతిపై సిద్ధించు ॥వి॥ 1086

బ్రహ్మకొడుకు = ఎటువంటివాడైనఁ; యిదినుడికారం; సత్యనిష్ఠ జగత్ప్రసిద్ధిగా జూపించెను.

ఆ. కడుపులోనివాని । గానరాని నరుని
గష్ట పడుదురింతె । కానిజనులు
హీన మెఱుఁగ నాతఁ । డిది యేమెఱుగునో ? ॥వి॥ 1087

తనలో బ్రహ్మము దాఁకొన్నాడని జూపించెను.

ం. కడుబెద్ద పరాశరుడట
చెడు మాల గఱిత కడుపునఁ । జెలగి జనించె
న్వాడిఁ బెద్దవ్యాసుఁడాచెం
బడిదానికి జాతమయ్యెఁ । బాడిగ వేమా ! 1088

వశిష్ఠుని భార్య అరుంధతియందు పరాశరుఁడు జన్మించెను. పరాశరునకు యోజనగంధియందు వ్యాసుడు జన్మించెను. అరుంధతి మాదిగ ! యోజనగంధి బెస్త.

ఆ. కడు విచిత్ర మరయఁ । గాముని యంత్రంబు
పువ్వుబోడి చుక్క । బొట్టుఁ గన్న
గాంతిబెళుకుఁ గన్న । గడుసొక్కు పుట్టదా! ॥వి॥ 1089

మన్మధుని మహత్తును విశదీకరించాడు.

* ఆ. కతక నఖిలమునకు । నడినాళమందున్న
వేగుచుక్కవంటి । వెలుఁగు దిక్కు
వెలుఁగుకన్న దిక్కు । వేరెవ్వరున్నారు? ॥వి॥ 1090

* యతి తప్పినది. కతక అని ఉండకూడదేమో! కంటి పాపలో వలె ప్రపంచానికి పరంజ్యోతియే గురి.

కం. కథలనఁగా మున్నైనవి
కథలెన్నియొ చదివి చదివి । కలవరపడఁగా
బృధివిని మృతమిఁక నిక్కము
ముదమున బ్రహ్మంబునంట । ముక్తిర వేమా! 1091

ఎన్ని చదువుల చదివినా చావుతప్పదు. "యదృశ్యం తన్నశ్యం"

తే. కదలకుండఁగ మదినిల్పి । కదిసిపట్టి
నిదురలో నిద్రఁజూచుచు । నేర్పు మిగిలి
పదర కుండెడు వాఁడెపో । బ్రహ్మ నిభుడు
నిదియె సంతోషమునకెల్ల । నిజము వేమ. 1092

సుషుప్తిలో సూక్ష్మబ్రహ్మను కనుగొమ్మన్నాడు.

కం. కదలని జీవములందును
దుద మొదలుఁగ నాఱు రుచులు । తోలఁగక యుండుం
గదలెడి జీవములందును
వదలవు కష్టంబు సుఖము । వసుధను వేమా! 1093

చేతనాచేతనములు రుచులకు లోబడినట్టు సూచించాడు.

ఆ. కదలనియ్యకుండ । గట్టిగా లింగంబు
గట్టివేయ నేమి । కల్లచేయు?
భావమందు శివుని । భావించికానరో! ॥వి॥ 1094

మెడలో లింగాన్ని బంధించుటకాక ఆత్మలింగాన్ని బంధించుటాధిక్యమని అసలైన యోగి వేమన చెప్పెను.

ఆ. కదలి తూర్పునందు । ఘనత శోభిల్లగా
బరగ వర కతారు । పల్లె వెలసి
యచల నిష్టగూడ । నమరియుండెదర యూ ! ॥వి॥ 1095

వేమన చరమ దశయందు వశించినచోటే "కతారుపల్లె" అందుకే వాళో న్నాడు.

క. కదలెడు జీవములన్నియు
తుద మెక్కును మంచి రుచుల । దొలఁగక నుండన్
కదలని యాజీవంబులు
వదలక గర్వంబులడఁగె । వందఁగ వేమా ! 1096

మనస్సు చెదరని వారికి మమకారము లేదని మహాయోగి వాక్కు ; ముసలి వాళ్ళకు జింహాభిరుచు లుండును.

ఆ. కదిమి మదిలోన సాగర । గమన మెరిఁగి
నీది దాటెడు గురుశక్తి । నిబిడమైన
జపముచేతను తన్మయ । జూడఁ గనుము
విమల గుణరాజ । యోగీంద్ర వేమనార్య ! 1097

మనస్సును సాగర తరగలవలె చలించనీక గురుకీలక మెరిఁగి గురుతు గాంచుమని విమలగుణరాజు మహద్వాక్యము.

ఆ. కదిమి మదిలోని సాగర । గమన మెఱిఁగి
యీదిదాటెడు గురుశక్తి । నేరుపఱచి
జపముచేతను దన్మయుఁ । జూడ గనుము
మానసము నిల్కడనుగన్న । నౌను వేమ. 1098

మీది పద్యము బోలియున్నది. చరణము మార్పులేనిచో రెండూ ఒకటే.

ఆ. కదియబట్టి హంస । కళలంట గమకించి
సదయ హృదయమందు । సంతరించి
విదితమైన బయల । వెన్నంటిచూడరా ! ॥వి॥ 1099

హంసకళలనంటి అచలబ్రహ్మను అరయ మన్నాడు.

క. కదివాటి పాముకాటును
నదరఁగ నా షిడుఁగుపోటు । నలపులికాట్లు

న్వాదితముగ రాముసేటును
బుధహితమగు శిల్పితిట్టు । బొల్పగు వేమా ! 1100

కదివాటు = అదిమిపట్టిన; కళాకారులను కష్టపెట్టిన కష్టనష్టములను గొందురని హెచ్చరించెను.

ఆ. కదురు మానమునకుఁ । గట్టుహారమునకు
గాపు జగడమునకు । ఖడ్గమట్టె
మూఁడు మొనలమీద । ముజ్జగంబులునన ॥వి॥ 1101

త్రిసంఖ్యామానమును దివ్యముగా చెప్పాడు.

ఆ. కనకంబు సేయను । కలియుగంబున జనులు
పచ్చనాకులు దెచ్చి । పసరుపిండి
రాగి దుడ్డుకు నవిరి । రవళించి చూతురు ॥వి॥ 1102

రాగిని బంగారము చేయాలని రసవాదులు పడే తాపత్రయాన్ని విశదీకరించాడు.

ఆ. కనకగ్రామమునకు । గారణ కర్తలి
ట్లుండయగుచు నుభయు । లుండెరేని
గండ పక్షియుగళ । ముండిన రీతిని
యుద్దిగూడు బ్రతుకు । చుండు వేమ ! 1103

ఆ. కనక నగరమునకుఁ । గారణకర్తలి
ట్లుండనగుచు నిభయు । లుండెరేని
గండ పక్షియుగళ । ముండిన రీతియా ॥వి॥ 1104

గ్రామాధికారులు గ్రామస్థులకు గల్గించు కష్టాలు వాకొన్నాడు.

ఆ. కనకపర్వతమున । గాపురముండిన
ననిమిషేశ్వరునకు । నాసపోదు
కనక కుండలములు । కర్ణుని నడుగఁడే ? ॥వి॥ 1105

ఎంతటి వానికీ ఆశపోదు,

ఆ. కనకమన్నమంచి । కాంతలఁటన్నను
వలచియుందురెంత । వారలైన
దోయజాక్షిఁ బాయు । దొరలెవ్వరును లేరు ॥వి॥ 1106

కాంతా కనకములు కాంక్షనీయములు.

ఆ. కనక మవల దాటి । కడగండ్లు పడనేల ?
మనసు నిలుపవలెను । మర్మమెరిఁగి
యినుముఁ జేరి యగ్గి । యిమిడిన చందమౌ ॥వి॥ 1107

దుర్మార్గులను రక్షించుటకు సన్మార్గుడనేక పాట్లుఁబడును.

ఆ. కనకమున్న బోడుఁ । కాముఁడు, భీముఁడు
మిగుల దేజమంది । మెలఁగుచుండు
విత్తహీనుఁడైన । వెట్టులలోనేటు ॥వి॥ 1108

ధనములేనివాడు దరిద్రుఁడు ; కాముడు = మన్మధుడు.

ఆ. కనక మృగముఁబట్టి । కడుఁ బోరి చంపిన
నరుఁడు రాజరాజు । నమ్మిచూడఁ
దరముగాని కర్మ । మరుగుఁ దానంటిరా ! ॥వి॥ 1109

" వినాశకాలే విపరీతబుద్ధి " ని వర్ణించెను.

ఆ. కనక మృగము భువిని । గలుగ దంచెఱుగరో !
రాముఁడెఱుకగల్గు । రాజుగాఁడె ?
చేటుకాలమునకుఁ । జెడుబుద్ధి పుట్టెడు ॥వి॥ 1110

" బుద్ధిః కర్మాను సారిణి " రామాయణగాథ వాకొనెను.

ఆ. కనకమృగము భువిని । గద్దు లేదనలేక
తరుణి విడిచిపోయె । దాశరథియుఁ
దెలివిలేనివాఁడు । దేవుఁడెట్లాయెరా ? ॥వి॥ 1111

శ్రీరామచంద్రుని చిత్తచాంచల్యసత్తువును గుత్తగా జూపించాడు. (రామా యణ గాథ.)

ఆ. కనకమృగమువెంటఁ । గలదు లే దనుకొనుచు
రమణి విడిచిపోయె । రామవిభుఁడు
తెలివి మాలినతఁడు । దేవుఁడెట్లాయెనో! ॥వి॥ 1112
బంగారమువిూదాశకు, అంగనామణి ఆశకు లోబడ్డాడు.

ఆ. కనకమెడల మంచి । కాంతుల మెడలను
వలచియుందు । రెంత వారలైన
తోయజాక్షి బాయు । దొరలెవ్వరునులేరు ॥వి॥ 1113
శ్లో॥ " స్త్రీణాం ద్విగుణ మాహారః బుద్ధిశ్చాపి చతుర్గుణా
సాహసం షడ్గుణంచైవ కామ మష్టగుణంభవేత్ "

ఆ. కనఁగ సొమ్ములెన్నొ । కనకంబదొక్కటే
పసుల వన్నెలెన్నొ । పాలొకటియె
పుష్పజాతులెన్నొ । పూజయొక్కటెసుమీ! ॥వి॥ 1114
వేమన కవితా ప్రౌఢిమ యిందు వెల్లివిరుస్తుంది.

క. కనరానిది పరతత్త్వము
వినరానిది గురుని నింద । విని, కనియును దా
ననరానిది పెద్దలగతి
మనరానిది మానహాని । మహిలో వేమా. 1115
తొలినుడుల మలచి తీర్చిదిద్ది అబాలగోపాలాని కందించాడు మహాకవి.

ఆ. కన్నతల్లికి సమము । కలిని యెవ్వరు లేరు
గురుభక్తికైననుఁ । గురియులేదు
ఆనందమునకైన । ఆసెచ్చు లేదురా! ॥వి॥ 1116
" ఆనందో బ్రహ్మ " యను శృతి వాక్యము సూత్రీకరించెను.

ఆ. కన్నతల్లిదండ్రుల । కాపాడ కిడిచితే
కనియు పెంచిన ఋణము । కలినిబోదు
తలిదండ్రులుసురు కంటె । తపము సిద్ధించునా! ॥వి॥ 1117
" మాతాపితృభ్యోం నమః " వక్కాణించెను. ఉసురు = మనస్సును చివుకజేయుట.

ఆ. కనియుఁ గానకుండుఁ । గడుతీవి తోడను
వినియు వినకయుండు । విస్మయముఁగ
సంపద గలదేని । సన్నిపాతముపూను ॥వి॥ 1118

"యౌవ్వనే, ధన, సంపత్తి, ప్రభుత్వ మవివేకితా
యేకైక మప్యనర్థాయ కింవ చతుష్టయం"

ఆ. కనియుఁ గానలేడు । కదలింపఁ డానోరు
వినియు వినఁగలేఁడు । విస్మయమున
సంపదగలవాఁడు । సన్నిపాతకమది ॥వి॥ 1119

ధనమదాంధుని తత్త్వము ద్యోతకంజేశాడు మహాయోగి.

క. కనియుండి కానలేరట
వినియుండియు వినఁగలేరు । విస్మయమేమో!
కనుగ్రుడ్డి వినెడు చెవుడం
చనునది నిజమయ్యె జగము । నందును వేమా! 1120

కన్నులు, చెవులు వున్ననూ ధనవంతుడు బధిరాంధక శ్రవముగా నున్నారు.

ఆ. కనుక గ్రామమునకు । కరణము కాపుని
ట్లుండయగుచు నుభయు । లుండరేని
గండపక్షియుగళి । ముండిన రీతిని
బుద్ధిఁగూడి బ్రతుకు । చుంద్రు వేమ! 1121

యుగము = రెండు; గండపక్షి = గండభేరుండపక్షి.

ఆ. కనుల కావరముచే । కనబడదు శివబిందు
కానబడిన తన్ను । గట్ట నియదు
మదగజంబును బట్టి । మావటిఁ గట్టురా! ॥వి॥ 1122

గర్వము సర్వము చెరచును.

తే. కనుల చూడ్కిని జెదరక । గట్టినొక్క
తనువుపై యాస విడిచిన । తావుఁబట్టి
యున్నమనుజుడె శివుడయా । యుర్విలోన!
నతని కేటికి సుఖదుఃఖ । వితతి వేమ. 1123

మనస్సు, దృష్టి ఏకంచేస్తే "ఏకోనారాయణుడు" దాపునే ఉన్నాడు.

ఆ. కనుల చూపు నిలిపి । కాంతిని గమనించి
కాంచవలెను జిత్ర । కళలు దాటి
కోటకొమ్మ జేరి । కోర్కె లడంపరా ! ॥వి॥ 1124

నాద, బిందు, కళలను దాటి సహస్రారమందున్న పరంజ్యోతిని పరికించమన్నాడు.

ఆ. కనులఁ జూడబడని । కలుష విదూరుని
మనమునందు జేర్చి । మరలు కొనక
తనకు ముక్తిలేదు । తలఁపులు మెండైన ॥వి॥ 1125

ఆశాపాశముకట్టి ఏకోపాసన జేయమన్నాడు మాఋషి.

ఆ. కనులుపోవువాఁడు । కాళ్లుపోయినవాఁడు
ఉభయు లరయఁ గూడి । యుండినట్లు
పేద పేదఁగూడి । పెనగొని యుండును ॥వి॥ 1126

ఏజాతిపిట్ట ఆజాతిపిట్ట దరి జేరును.

ఆ. కనులు రెంటినడుమ । గానంత నిలిపిన
బొమలు మీటి చూడ్కిఁ । బొందఁజేయఁ
గ్రమమొతింగి లోనఁ । గాంతిని బట్టరా ॥వి॥ 1127

భ్రూకుటిని వీక్షిస్తూ పూర్ణాన్ని తెలుసుకోమన్నాడు మాకవి.

కం. కన్నగవరీతి సంపద
కొన్నాళ్లకు వ్రేగు జూపి । గొబ్బున వ్రాలున్
వెన్నెల చీకటి సరియగు
నన్నాశివలింగ మాయ । లన్నియు వేమా ! 1128

"కలిమిలేములు కావడికుండలు" అన్నాడు.

ఆ. కన్ను మిన్ను జేసి । కాంతిని గమకించి
తన్ను నిలిపిచూచి । తలఁపు వదలి
యున్నవాఁడు పరముఁ । గన్నవాఁడేయగు ॥వి॥ 1129

చిదాకాశం జూచినవాడు గోప్యమును కనుగొన్నవాడగును.

ఆ. కన్నులందు మదము । గప్పి కానరుగాని
నిరుడు ముందటేడు । నిన్న మొన్న
దగ్ధులైనవారు । తమకంటెఁ దక్కువా? ॥వి॥ 1130

నిరుఁడు = గతించిన వత్సరము. ఎటువంటివారికీ చావు తప్పదు.

ఆ. కన్నెతోడ వరుఁడు । కామించి గదియంగ
నొక్కమాఱు పిండముద్భవించె
నచట గులజుఁడేడి । యరయ హీనుండేడి? ॥వి॥ 1131

అందరూ యోని సంభవులే హెచ్చుతగ్గు లేల?

ఆ. కన్నెదాని మేను । కస్తూరి వాసన
ముసలిదాని మేను । ముఱికి కంపు
వయసుదాని మేను । వర్ణింపశక్యమా! ॥వి॥ 1132

స్త్రీవాంఛాపరులకు గోచరించు విధానమే యిది.

ఆ. కన్నెపడుచుఁగాంచి । కదలనీకుండిన
యూసఁబట్టి యొక్క । మూసఁబెట్టి
కఱఁగఁబెట్టి దాని । కడముట్ట జేయరా ॥వి॥ 1133

కామినీ కాంక్షితమును కడకు గెంటమన్నాడు.

ఆ. కన్నెమీఁద నాస । కనకంబుపై నాస
లేనివాడు పుడమి । లేనివాడు
గలిగెనే నతండు । గానంగరాఁడయా! ॥వి॥ 1134

భమిడిని భామినిని బావించనివాడు పరమగురుఁడు; భమిడి = బంగారము.

క. కన్నెల నవలోకింపనె
చన్నులపై దృష్టిపాఱు । సహజంబిలలో
గన్నులకింపగు దృష్టిని
దన్నెరుగుట ముక్తికిరవు । తపముగు వేమా! 1135

కచ కుచములే కాముకుల దృష్టినాకర్షించేవి.

ఆ. కన్నెవరుఁడుజేరి । కదియంగ నొక్కఁపు
డుచ్చయందుఁ బిండ । ముద్భవించు
హెచ్చు కులజుఁడేడి । హీనుఁడెవ్వఁడురా ! ॥వి॥ 1136

శుక్ల శోణితకలయికయే కారణశరీరము.

ఆ. కపట ముడిగి గురుని । కైదండ యొనరించి
యుపము తోడ భక్తి । యునికిజేసి
తపమెఱింగి నంత । ధన్యత వాడమును ॥వి॥ 1137

కైదండ = హస్తావలంబము.

ఆ. కపటమైన పనులు కడఁ । బెట్టి చూడక
తత్త్వమెట్లు తనకు । దగులుపడును
దగులఁబడినగాని । తనకు సాధ్యముకాదు ॥వి॥ 1138

నిజమునకు నీతినియమములే బాటన్నాడు మాకవి.

ఆ. కపటవేషమూని । కడగండ్లు పడనేల ?
విపినభూమిఁ దిరిగి । విసువ నేల
నుపముతోనె ముక్తి । యున్నది గనవలె ॥వి॥ 1139

వేషములు సంచారములు జ్ఞానానికి మార్గములు గావు.

కం. కప్పయు పామును బొడఁగన
కప్పను నాపాముమ్రింగె । కడు వేడుకతో
కప్పను వెడలం దిగిచే
విప్పగు యాచొప్పు దెలియ । వేమన నేర్చున్. 1140

ఇది పొడుపుకథగాయున్నది. కప్పజ్ఞానముగా పాముఅజ్ఞానముగా పోల్చబడినవి.

కం. కప్పయుఁ బామును బోరం
గప్పను సర్పంబుమ్రింగు । కైవడి మెఱయం
గప్పను వెడలం ద్రోసెడి
యొప్పున నాచొప్పుఁదెలిసి । యుండర వేమా ! ॥వి॥ 1141

విచిత్ర విడి కదళవలెనన్నా యిందు జ్ఞానాజ్ఞానములు కలసియున్నవి.

ఆ. కప్పురంపు మనసు । గాంక్షించు యోగికి
జ్ఞానదీప శిఖయుఁ । దా నటించుఁ
గానవచ్చు నాత్మ । క్రమమాణమై యెపుడు ॥వి॥ 1142
మనస్సునకు మూడు మార్పులు గలవు.

* ఆ. కప్పువిడిన మనసు । గాంక్షింప దెద్దియు
జ్ఞాన తపము మాని । కదలకుండు
మెచ్చునాత్మక్రమము । మిన్నంటియుండురా ॥వి॥ 1143
* ఇట వర్గయతి వాడెను. మాయనతిక్రమించినవాడు మహనీయుడు.

ఆ. కఫము మీఱి మరియుఁ । గనులు మూఁతలుపడి
బుద్ధి తప్పి చాలఁ । బుడమి మఱచు
వేళలందు నిన్ను । వెదకుటసాధ్యమా? ॥వి॥ 1144
అవసానకాలమందు అభవుని ప్రార్థించుట ఫలమివ్వనేరదు.

ఆ. కబ్బమొకటిపూని । గడగడఁ జదివిన
లోనియర్థ మెట్టు । తా నెఱుంగు
నెరుక మాలు చదువి । కేటికో తెల్పరా? ॥వి॥ 1145
కబ్బము = పుస్తకము. తెలివిలేని చదువులు అడవిగాచిన వెన్నెలవంటివి.

సీ. కమల భవాండంబు । కర్పటంబదియెంత ?
దానిలోపల జగ । త్త్రయ మదెంత ?
దాని నాల్గవపాలు । ధారుణీ స్థలమెంత ?
దాన నేడవపాలు । దీవియెంత ?
యందు దోఁమ్మిదవది । యగు తునియ యదెంత ?
యా తునియలభాష । లమితమయ్యె ?
అట్టి భాషలతోడ । నను మీఱఁగఁ గడు
బొలుపారుచున్నట్టి । భూము లెన్ని ?
యట్టి భూములేలెడి వార । లమిత నృపులు
ఘనులు పెక్కండ్రు కలరని । కడకు నెక్కిఁ

యొకరిదయ చాలగా నమ్మి । యుండు మనుజు
విభవమే మనవచ్చురా ! వెఱ్ఱివేమ ! 1146

మా వేమన కవీంద్ర చంద్రుని లోకజ్ఞానము బహుముఖ ప్రజ్ఞా పాటవ మిందు ద్యోతమగుచున్నది.

బ్రహ్మాండము తలపుకైౖ. మూడులోకములు దానిలో స్వల్పభాగములు. జలమయమగు ప్రపంచములో భూమి నాల్గవపాలు. ఆభూమి ఏడుద్వీపములుగా మారెను. ("జంబూప్లక్ష కుశక్రౌంచ శాక శాల్మల పుష్కరా ") యీసప్త ద్వీపములలో జంబూద్వీపము చాలచిన్నది. అందులో అనేకభాషలు మాట్లాడేవారు గలరు. వారిని పాలించే రాజులు అసంఖ్యాకులు గలరు. మన మానసికశక్తులు తెలియక అస్వతంత్రులై నిరంకుశులయి మదాంధులగు రాజులగొల్చి పొట్టకూటికై ప్రజలు దేబెలయి యున్నారు. ఎంతసిగ్గుచేటో తెలిసికొనుడు.

క. కమలభవాండము లెల్లను
విమలులు సుజ్ఞానులెల్ల । వీక్షింతురయా !
యమలంబౌ మనమునఁ దగ
సుమహిత పిండాండ మెపుడుఁ । జూడరవేమా ! 1147

విజ్ఞానులగు వారు బ్రహ్మాండ మంతయు దెలసికొందురు ; పిండము + అండము = పిండాండము,

ఉత్సాహ. కమలభవుఁడు వ్రాయఁదుడువఁ । గర్తయందురందరుం
గమలభవుని శిరము శంభు । కరముఁ జేరు టెఱుఁగరో ?
కమలభవుని నుదుట విశ్వ । కర్మయొకఁడె వ్రాసెరా ?
కమలజాండ గురుఁడతండె । ఘనమిదెఱుఁగు వేమనా! 1148

నానావృత్తములు వాడుటలో అందెవేసిన చేయి. దేబెలకేబ్రహ్మవ్రాత;

ఆ. కమలభవుఁడు సేయుఁ । గడుసృష్టి యందురు
హరి భరించుఁ జంపు । హరుఁడటంద్రు
మూర్తులిందఱైన । మూలమొక్కండెరా ! ॥వి॥ 1149

ఓంకారమే సృష్టికి మూలము.

క. కమలభవాండము లెన్నుచు
విమలపు సుజ్ఞానులెల్ల । వీక్షింతురయా !

విమలంబై మనముండగ
సమమగు పిండాండమెఱిఁగి । చాటరవేమా ! 1150

పిండ + అండములు = పిండాండములు, పిండము = కనుగ్రుడ్డు; అండము = పాప.

క. కమలములు నీటబాసిన
కమలాప్తుని రశ్మిసోకి । కమలిన భంగిన్
తమ తమ నెలవులుఁ దప్పినఁ
దమమిత్రులె శత్రులౌట । తథ్యము వేమా ! 1151

భద్రభూపాలుని సుమతీ శతక పద్యమిందు యేమహాత్ములు చేర్చిరో ?

ఆ. కమ్మరీని దుడుకు । కార్యవినాశంబు
వడ్లవాని దుడుకు । వారపిడుగు
కాసివాని దుడుకు । కాకుత్స్థు బాణంబు. ॥వి॥ 1152

కాకుస్థుడు = రాముఁడు. కాశవాడు = సిల్పి. శ్రామికులను కష్టపెట్టిన నష్టము గలుగునని గుణపాఠము.

ఆ. కరణ మధముడైనఁ । గాపులందఱుఁ గూడి
యెడ్డెయందురు సుఖ । మెచ్చె నేని
బిరుదు కరణమున్న । బిత్తె యనరొకో ! ॥వి॥ 1153

అధికారుల కానందము గల్పించుట కష్టము.

ఆ. కరతలంబు నెత్తి । కాలి నదిమిపట్టి
యూర్ధ్వ దృష్టిచేత । నొనరనిల్పి
సర్వమైతనరుటఁ । జాలనాయువుకల్గు ! ॥వి॥ 1154

చేతులను పైకిసాచి కాలి నదిమిపట్టి ఊర్ధ్వ దృష్టిగా అంగములను వశముగా చేయుట వీరాసనము. ఇది ఆయుర్వృద్ధి చేయును.

ఆ. కరములందు తమరు । గంగాధరుని బట్టి
తీర్థములకు బోయి । తిరుగుచుంద్రు
వెన్న బట్టినెయ్యి । వెదకిన చందమౌ ॥వి॥ 1155

తనలోనున్న తత్త్వము తెలిసికోలేక తడుము కొనుట బుద్ధుగు తనము,

ఆ. కరముకర ములయందు । గంగాధరునిఁగట్టి
తీర్థములకుఁబోయి । తిరుగువారు
చేత వెన్నయుండ । నేతి కేడ్చెడివారె? ॥వి॥ 1156

కొలది మార్పులతో రెండూ ఒకే రకముగా నున్నవి.

క. కలికంఠుని కోపమువలె
వరగౌతము శాపమట్టు । వర్ణింపంగా
జిరకష్ట జీవులై తగు
నరులను మదినొచ్చితిట్ట । నాశమె? వేమా! 1157

మంచివారి మాటలే మంత్రములు. యిది పౌరాణి విజ్ఞానము. వేమనకు పురాణేతిహాసాలు పుక్కిట బూరెలు.

ఆ. కలిగఁ గలిగఁబుట్టుఁ । గనకంబునకు వన్నె
పెనగఁ బెనగఁ బుట్టు । ప్రేమసతికి
ముదియ ముదియఁ బుట్టు । మోహంబు, లోభంబు ॥వి॥ 1158

"ముది విటుడు, తెధవలంజకు వ్యభిచార మెక్కువ"

చ. కలువలు గండముల్కలిగి । కష్టపుజీవిత మేర్పడంగ నే
గరిమను జీవరాసులకు । గట్టిగ నాయువు కల్గియుండునో!
మఱి వగవంగనేల! నిల । మాకిఁక లేదననేల! మాధ్యమా
యరయ దయాళుఁడైన పరమాత్ముఁడొకండగు దిక్కు వేమనా!

చంపకమును పంపకముగా వాడెను. "సర్వమును విష్ణు మయమని శాంతి బొందు"

ఆ. కరక్కాయలుదిని । కాశలు బిగగట్టి
కాంతలను విడుచుట । కానిగుణము
పేసి గడ్డఁ గట్టె । నేనుఁగు నిలుచునా! ॥వి॥ 1160

"దశమాత హరీతకీ" కరక్కాయ తినిన కామము నశించునని వైద్య శాస్త్రము. వేమన షట్చాస్త్రవిద్యా పారంగతు డనుటకు యిది నిదర్శనము.

ఆ. కర్మ గుణములన్ని । కడఁబెట్టి నడవమిఁ
దత్వమెట్లు తన్నుఁ । దగులు కొనునో?
నూనెలేక దివ్వె । నూవుల వెల్గునా! ॥వి॥ 1161

మడిపదార్థము ముఖ్యముగాదు అసలుపదార్థమే ఆధారము.

ఆ. కర్మగురుఁడు గాక । ధర్మంబుఁదెలియదు
కర్మజీవి మేలు । గానలేదు
నీరుచొరక లోతు । నీయూనఁ దెలియదు ॥వి॥ 1162

సూటిసూక్తులు తేటతెల్లముగా మహాయోగి వాడెను.

ఆ. కర్మజాల మనుచు । ఘనులెల్ల బలికిరి
కర్మమేమి ? దాని ఘనత యేమి ?
తెలుపౌ, నలుపౌ, యెరుపౌ । తెలిసిన బలుకుడు ॥వి॥ 1163

కర్మసిద్ధాంత పరులు కల్పనతే చేతురుగాని గమ్యస్థానమును గైకొనలేరని కమ్మనివాక్కులు గ్రుమ్మరించె కవి.

కం. కర్మజ్ఞానేంద్రియములు
నిర్మల హృదయమును జేర్చి । నిర్గుణ మతితో
ధర్మంబని వివరించుట
మర్మం బధ్యాత్మయోగ । మహిమము వేమా ! ॥వి॥ 1164

అధ్య + ఆత్మ = అధ్యాత్మ ; మొదటి ఆత్మస్వరూపము. సమానభావం బన్నిట వ్యక్తపరచాలి.

కం. కర్మనివృత్తై నప్పుడు
నిర్మలుడని భవుఁడు వాని । నిక్కమెఱుంగుం
గర్మము తీరెడు వేళను
ధర్మమె తన దేవుఁడనుచుఁ । దలతురు వేమా. 1165

కర్మముకన్న ధర్మమే గొప్పదని సిద్ధాంతమ్ము చేసెను శివయోగి.

ఆ. కర్మ ఫలములన్ని । కపటంబుగాఁ జూచి
ధర్మఫలములన్ని । తగిలియుండి
ధర్మ మర్మములను । దాటులే ముక్తిరా ! ॥వి॥ 1166

కర్మసిద్ధాంతాన్ని కాదని ధర్మసిద్ధాంము ధన్యమని చెపా ఎం.

ఆ. కర్మమధికమైనఁ । గడచి పోవఁగరాదు
ధర్మరాజు గొల్చె । తగని చోటఁ
గంకు భట్టనంగఁ । గటకటా ! యేమన ! 1167

కాలగతిని ధర్మజుడు కంకుబట్టుగా కాలముగడిపెను (భారతగాథ)

ఆ. కర్మమయుఁడుగాక । కర్మంబుఁదెలియడు
కర్మజీవి మేలుఁ । గానలేడు
నీరు సొరక లోతు । నికరము తెలియదు ॥వి॥ 1168
పనిలో ప్రవేశించినగాని పనియొక్క పద్ధతి తెలియదు.

క. కర్మము జ్ఞానికి దవ్వగు
గర్మమునకు జ్ఞాని దవ్వు । కల నిజ మిదియాఁ
గర్మజ్ఞానము లుడిగిన
నిర్మలునకుఁ గలుగు ముక్తి । నిజముగ వేమా ! 1169
వేదాంత విద్యా రహస్యములు దెలిసికొనుటలో వేమనకు సాటివారులేరు.

ఆ. కర్మమునను బుట్టి । కర్మంబులోఁజేరి
కర్మమెరుపడుటఁ । గానలేరు
కర్మబంధమునకె । కడతేఱ లేరయా ! ॥వి॥ 1170
కర్మ జీవుని బంధింపజేయునని కర్మను గట్టిగా విమర్శించెను.

తే. కర్మవశమున సంసార । కష్టములను
జెంది మోహాతిశయమునఁ । జెడును నరుడు
కర్మ రహితత సుజ్ఞాన । కలితతయును
జెంద మోహము లేటికి । జేరు వేమ. 1171
కర్మ = పని; తను చేసినపనే తనకాధారం.

ఆ. కఱ్ఱచేతబట్టి । ఘనసాధకము జేసి
విఱ్ఱవీఁగుచుండు । వీరుఁడైన
కాలమైనయపుడు । కాలునిచేతను
కష్టపడుచు చచ్చు । కడకు వేమ. 1172
ఎంతగొప్పవాడైన కాలునకు లోబడును.

క. కర్మాకర్మముల కొరకు
నర్మిలి నొకఁడుండులోన । నాత్మయు గర్త
ధర్మాధర్మములకు నది
నిర్మలమతి యైనవాఁడు । నిలుచును వేమా ! 1173
అర్మిలి = పిదప; సమస్తమునకూ సర్వేశ్వరుడేఁ కర్త.

క. కర్మా కర్మములెఱుగని
మర్మంబులు నింద్రజాల । మహిమలు విద్య
ల్కర్మము మర్మము ప్రాణులు
నిర్మలమతి దెలియవలయు । నిజముగ వేమా ! 1174

గజకర్ణ, అజకర్ణ, గోకర్ణ, టక్కు, టమార విద్యలే యైంద్రజాల విద[illegible]

క. కర్మా కర్మములెల్లను
కర్మవినోదులకు దెలియ । గా దెల్లపుడున్
ధర్మాధర్మము లేర్పడ
నిర్మలమతి దెలుపవలయు । నిజముగ వేమా ! 1175

నిర్మలమతి కర్మలయొక్క చరిత్రల దెలిసికొంటాడు.

క. కర్మాకర్మము లొక్కటి
కర్మవినోదునకుఁ దత్వ । ఘనునకు దెలియుం
ధర్మాధర్మము లేర్పడ
నిర్మలమతి దెలుపవలయు । నిచ్చలు వేమా! 1176

అవ్వ పేరే ముసలమ్మ.

తే. కర్ణములు, ముక్కుఁ, జెవులును । గట్టనేల ?
నిర్ణయంబగు ప్రణవంబు । నేర్పు మీఱ
ఘన చిదానంద ప్రజ్ఞలో । వినఁగనగును
మనసు నిలకడమాత్ర మే । మఱకు వేమ. 1177

జ్ఞానాంజనమును చక్షువులకు తగిలించి సర్వేశ్వరు జూచుట యోగమన్నాడు.

ఉ. కరువులు గండముల్ కఠిన । కష్టపు రోగము లెన్ని వచ్చినన్
గరిమను జీవరాసులకు । గట్టిగ నాయువు గల్గినంతనే
మరువగ వంగనేల మరి । మాటికి లేదననేల మూఢులై
యరయ దయాళుడైన పర।మాత్ముని జ్ఞానములేక వేమనా! 1178

దేశశోభాన్ని వర్ణించాడు లుబ్ధుల మనస్సుల నిర్ణయించాడు.

ఆ. కర్ణుఁడే మునుపును । ఘనులెవ్వరును లేక
దానశీలుఁడ నంచు । దలపబడెను
మేలుసేయ నతని । మెఱుఁగెవ్వఁడేఱుఁగురా ! ॥వి॥ 1179

ధాతలను ప్రశంసించెను. (భారత గాథ)

ఆ. కర్ణుఁడొకఁడె కాని । ఘనులెవ్వరును లేరు
దానశీలుఁ డనఁగ । ధరఁబరగెను
ఓగు నెంచఁబోవ । రుపకార ముండిన ॥వి॥ 1180

సర్వ కాల సర్వావస్థల విశ్వాసంతో ఉండే కుక్కను లెక్క చేయరు అవసరం పట్ల ఆదుకొనే యేనుగే గొప్ప.

ఆ. కలడన్న వారికి । కలఁడు సద్గురుఁడిందు
లేదన్న వారికి । లేదులేదు
బొమ్మరింటను మాయ । నమ్మనియ్యదు జనుల ॥వి॥ 1181

బొమ్మరిల్లు = శరీరము ; దేవుడు ఎవ్వరిమనస్సుబట్టి వారికట్లా అగుపిస్తాడు.

ఆ. కలను నిజరూపుగా । గన్న సంపదజూచి
ఆశ్చర్యపడు నరుఁడు । నిద్రలోన
తెల్లవారిన వెనుక । కల్లగాపోనయా ! ॥వి॥ 1182

యీపద్యాలు చిందర వందరగా జారిణీ చిత్తాన్ని హత్తి యుంది.

క. కలలోని సంపదలెల్లను
గలఁగని మేల్కాంచినతోడఁ । గనబడకేగుం
బలు భోగభాగ్య గణములు
కలరీతిగ నమ్మవలెను । ఘనముగ వేమా ! 1183

శాశ్వతములుగాని వాటిని శాశించాడు మహాకవి.

ఆ. కలవరించినవాఁడు । కడురమ్య నిద్రలో
తన్ను దెలుసుక తాను । తన్నుమరచు
తనువు మరచినవాఁడె । తారకబ్రహ్మంబు ॥వి॥ 1184

బ్రహ్మంబు దెలిసికొనవలె ననిన తన్నుతాను దెలుసుకోవలెను,

ఆ. కల్పమనఁగ నగును । గారణబీజంబు
కల్పమనఁగ శివుని । కల్పితంబు
అల్పుఁడేమి యెఱుఁగు । నానందభోగంబు ॥వి॥ 1185

కల్పము = బ్రహ్మదినము ; ఓగులు ఈశ్వరకల్పితమీసృష్టి యని యెరుగరు. కల్పమే కాలకల్పమునకు సృష్టికి బీజము.

ఆ. కల్ప మారగించి । కన్నులు ముకుళించి
బిట్టు బిగిసియుండు । బీదయోగి
మేకపోతు వలెను మెఱ । మెచ్చులకునయి ॥వి॥ 1186

లోకవంచకుల పోకడలు ప్రాకటము కానేరవని వాకొన్నాడు మహాకవి. మెఱమెప్పులు = ముఖప్రీతి వాక్యములు.

ఆ. కల్మషంబు పోక । కనుపింప దెందును
రూపమెవ్వరికిని । రూఢితోడ
దామసం బుడిగినఁ । దగఁగల్గు జ్ఞానంబు ॥వి॥ 1187

సత్వ, రజ, స్తమోగుణములు ; వీనిలోనున్న తామస గుణాన్ని దగ్ధంచేస్తే ధన్యుఁడు కాగలడని కవివాక్కు.

ఆ. కల్మషాదుల కడవ । కడుగ నేర్చినవాఁడు
యోగి యోగి యోగి । యతికి యతికి
యిచ్చ నణచిన వాఁడు । యిది కడుగనేరునా ! ॥వి॥ 1188

పాప పంకము నంటకయున్న మనః పద్మముగలవాడే మహాయోగి యగునని చెప్పెను.

ఆ. కల్యమారగించి । కన్నులు ముకుళించి
బిట్టు బిగిసియుండు । బీదయోగి
మేకపోతువలెను । మెఱమెచ్చులకునయి ॥వి॥ 1189

కల్యము = పొట్టనిండ చల్దన్నము తినుట. మేకపోతు గాంభీర్యము బీద యోగిది.

ఆ. కల్ల గురుఁడు గట్టు । నెల్ల కర్మంబుల
మధ్యగురుఁడు గట్టు । మంత్రచయము
ఉత్తముండుగట్టు । యోగసామ్రాజ్యంబు ॥వి॥ 1190

ఓగుగురుడు కర్మసిద్ధాంతాన్ని, మధ్యముఁడు మంత్రోపదేశాన్ని, ఉత్తమ గురుఁడు యోగాన్ని ప్రజలకు బోధింతురు,

ఆ. కల్లటికెకు భూతి । గట్టిగాఁ బెట్టిన
నందులోని కంపు । లడంగనట్లు
మెడనుఁ ద్రాడు వేయ । మెఱపుతో ద్విజుఁడౌనె ? ॥వి॥ 1191

కల్లు + అటికకల్లటిక = కల్లుకుండ; కల్లుకుండకు బూదిబూసి కంపు పోతుందన్నట్లే జంజెము వేసికొని బ్రాహ్మఁడననుట.

ఆ. కల్ల నిజముచేసి । కఠినభావముఁజెంది
ప్రల్లదంబులాడు । భక్తిలేక
మాయలాడు వాఁడు । మహితాత్ము సాటియా ॥వి॥ 1192

"ఉల్లి మల్లియౌనె? పిల్లి బెబ్బులియౌనె ? కాకి కేకి యౌనె గుక్క గుఱ్ఱమౌనె ? గోమాయు వావౌనె?" అను సామెత అనుసరించాడు.

ఆ. కల్ల నిజముఁ దెలిసి । గాలి భూతము రోసి
యింటిమీఁద నాస । యేల విడరో
నీఁటిమీద బుగ్గ । నిలుకడ కాదయా ! ॥వి॥ 1193

శరీరము నీట బుడగ వంటిది.

ఆ. కల్లనిజము రెండు । కఱకంట దెలుఁగును
నీరు పల్లమెఱుగు । నిజముగాను
దనయుని జన్మంబు । తల్లి దానెఱుగును ॥వి॥ 1194

అసత్తైన విషయాలను సిసలుగా చెప్పుటలో చేయికంది వేసుకొన్నాడు.

ఆ. కల్లయైన జగము । గనుటెల్ల నిజమని
నమ్మి భ్రమను జిక్కి । నాతిఁగూడి
యెల్లజనులు మఱతు । రేకాంతుడగు హరి ॥వి॥ 1195

"హాలాపాన విజృంభమాణ ... ... ... భాగవత పద్యభావంబిట ద్యోతక మవుతుంది.

ఆ. కల్ల లాడ లేమి ? । కానకిచ్చిన మఱుఁ
గలిమి లేములందు । వెలసియుండుఁ
నేటి కాల్వచూడ । నెక్కతగ్గినరీతి ॥వి॥ 1196

కలిమి లేములు నీటియొక్క ఆటుపోటులకు సాటన్నాడు.

ఆ. కల్ల లాడుకంటెఁ । గష్టంబు మఱిలేదు
కష్టమెపుడొ కీడు । గలుగఁ జేయుఁ
ద్విజుఁడ ననుట చూడ । ద్రిమ్మరితనమది ॥వి॥ 1197

ద్రిమ్మరితనము = వదరుబోతు. బ్రాహ్మణుఁడనని ప్రగల్భములుఁ గొట్టు వానిని తిట్టాడు వేమన.

ఆ. కల్లలాడుదు రిల । కంసాలి దొంగని
యతనిసొమ్ము కెట్టు । లతఁడు దొంగ
మన్ను బంగరుగను । మఱి చేసిపెట్టడా! ॥వి॥ 1198

విశ్వబ్రాహ్మణులను రసవాదమును ప్రశంసించెను.

ఆ. కల్ల లాడువాని । గ్రామభర్త యెఱుంగు
సత్యమాడువాని । సామియెఱుఁగుఁ
బెక్కుతిండిపోతుఁ । బెండ్లమెఱుంగురా ॥వి॥ 1199

సూటిగా మాటలు వాడుటలో మేటియైనకవి వేమన.

క. కల్లలు పలికెడు నరులకుఁ
దెల్లముగా బ్రహ్మవిద్యఁ । దెలుపుట యెల్లం
జల్లయు బాలును గలిపిన
చల్లకుఁ దోడంటినట్లు । సహజము వేమా! 1200

తెలిపైన గాడిదచేయు పనినే తెల్పెను మహాయోగి.

ఆ. కలిగింది తినివేసి । కదలకుండుండక
పెత్తనానికి పోవు । సాధువెదవ
బుద్ధిలేని వాణ్ణి । పంక్తిలో చేర్తురా ॥వి॥ 1201

నిలుపెల్ల లక్షణనియమములు తప్పి నీరసంగా యుంది.

ఆ. కలిగి ధర్మమీయఁ । గానని వారును
కలిగి తినకచాల । గ్రాగువారుఁ
కలిమి నెచటఁజూడఁ । గానకచెడుదురు ॥వి॥ 1202

తంగతోటలో దిష్టిబొమ్మలు వంటివారు కొందరున్నారు,

ఆ. కలిగినట్టులుండుఁ । గలుగకయుండును
మఱియు లేకయుండు । మఱియుఁ గలుఁగు
నాశకొలఁదిని శివుఁ । డందించు చుండును ॥వి॥ 1203
మెరుపు మెరసినట్లు భగవల్లీలలు మేల మాడుచుండును.

ఆ. కలిగినట్లుఁ బ్రతుకు । కలుగక యుండును
కలుగునట్లె బ్రతుకు । కలిగియుండు
బ్రహ్మదేవుడు వ్రాత । బానిస వ్రాతరా! ॥వి॥ 1204
బ్రహ్మవ్రాతని కొందరు భ్రమసి భవిష్యత్తును గంగలో కల్పుచున్నారు.

ఆ. కలిగినట్టె యుండుఁ । గలుగకయుండును
మఱియు లేకపోవుఁ । దిరిగి కలుఁగుఁ
గలిమినెచటఁ జూడ । గారడి యనవచ్చు ॥వి॥ 1205
మంగలి యద్దము మాంత్రికుని తంతులుగా లక్ష్మిని పోల్చాడు కవి.

ఆ. కలిగిన మనుజుండు । కాముఁడై, సోముఁడై
మిగులఁ దేజమునను । మెఱయుచుండు
విత్త హీనుఁడైన । నుత్త సన్యాసిరా! ॥వి॥ 1206
కాముఁడు = మన్మథుఁడు; సోముఁడు = చంద్రుఁడు.
"ధనమూలమిదం జగత్తని" వేమన పూర్ణానుభవాన్ని పూర్తిగా చిత్రించాడు.

ఆ. కలిగిన మనుజుఁడు । కాముఁడు, సోముఁడు
మిగుల దేకమునను । మెఱయుచుండు
విత్త హీనుఁ డెంత । రిత్తయై పోవును ॥వి॥ 1207
విత్తము = డబ్బు; రిత్త = లేకపోవుట.

ఆ. కలిగి పెట్టెనేని । కర్మ జీవులకెల్ల
తిరిపెమును దొరకదు । దీనులార!
తెలియఁ జూచుకొనఁడు । దృష్టాంతమెప్పుడైన ॥వి॥ 1208
తిరిపెము = బిచ్చము; పాత్రాఽఽపాత్ర విచక్షణ పాటించి పనులు చేయుమన్నాఁడు.

ఆ. కలిగియుఁ దినలేక । కష్టించురోగికి
నాడువారి మీద । నాశగలదె ?
అన్నమదముతోడ । నఖిల మదంబులు ॥వి॥ 1209

తేసెటీగలు తినక తెరవర్ల కియ్యక దేబెలై పోతాయి.

ఆ. కలిగి యున్న వానిఁ । గని పట్టి యిచ్చిన
మనువు ; ఁబొంగు । పాలు మరిగినట్లు
లోన నిగిరి కలిమి । లొట్టపోకుండునా ! ॥వి॥ 1210

మనువు = వియ్యము ; యిగిరి = లేకపోవుట; లొట్టపోవుట = వట్టిదగుట ; వున్నవారు వున్నవారితో వియ్యమందుట విశదపరచెను.

ఆ. కలిమిఁగల యతనికి । కన్యకనిచ్చుచో
మురియుచుంద్రు వెఱ్ఱి । మూఢజనులు
పూజఫలమె కాని । పూనికల్గిల్పునా? ॥వి॥ 1211

"భక్తిలేని పూజ పత్రిచేటు" వాడెను.

ఆ. కలిమిగల యతనికిఁ । గానుక నిచ్చుట
బావినీరు నదికి । పాఱ్చినట్లు ;
నిమ్నకు నిలరాశి । నీరెత్తి నట్లుండు
బేదకియ్య మనువు । పెరుగు వేమ. 1212

సూర్యునకు వెలుగుజూపుట మంచుకు చలువచేకూర్చుట మూఢులపని.

ఆ. కలిమి గల్గనేమి ? । కరుణ లేకుండిన
గలిమి తగునె ? దుష్ట । కర్ములకును
దేనె గూర్చు నీగ । తెరువునఁ బోవుఁదా ! ॥వి॥ 1213

"దానముచేయని ధనము దండుగచేటు"

ఆ. కలిమిఁ గలిగియుండి । కఠిన భావముఁజెంది
తెలియలేరు ప్రజలు । తెలివిలేక
కలిమి వెన్నెలగతిఁ । గానంగలేరయా ! ॥వి॥ 1214

"ఉపమా కాళిదాసస్య । భారవే రర్థగౌరవమ్" అనునట్లు వేమన యుపమానోపమేయముల చూపుటలో వారిశ్రేణినే పట్టెను.

ఆ. కలిమిఁ గలిగెనేనిఁ । గాముఁగాఁ జూతురు
లేమిచేతఁజిక్క । లేమ లధిపు
మదను వంటివాని । మాలఁగాఁ జూతురు ॥వి॥ 1215

విత్తమహిమ చిత్తభ్రాంతుల గల్గించునని వేమన విమర్శించుచు విశదపర్చాడు

ఆ. కలిమిగలుఁగ సకల । కులములకెక్కువ
కలిమి భోగ భాగ్య । ములకు నెలవు
కలిమిలేని వాని । కులమేమి కులమయా! ॥వి॥ 1216

"విత్తం విశ్వశ్రేయః" శృతిని వాడెను.

ఆ. కలిమిచేత మగనిఁ । గలిసియుండును గాంత
కలిమిలేని వేళఁ । గసరుచుండుఁ
గలిమి సతముగాదు । కానంగలేరయా! ॥వి॥ 1217

విత్తాన్నిబట్టి విభుని పూజలు.

ఆ. కలిమిఁ జూచి యియ్యఁ । గాయమిచ్చిన యట్లు
సమున కియ్య నదియు । సరసతనము
పేదకిచ్చు మనువు । పెనవేసినట్లుండు ॥వి॥ 1218

లోకనీతుల విలోకించి తారతమ్యాన్ని దారిగా జూపించాడు మహాయోగి.

ఆ. కలిమినాఁడు నరుఁడు । కానఁడు మదమున
లేమినాఁడు మొదలె । లేదు పెట్టఁ
గలిమి లేమిలేని । కాలంబుఁ గలుగునా! ॥వి॥ 1219

మానవసహజాన్ని మాటు వడకుండ సూటిగా చెప్పాడు.

ఆ. కలిమి తనదు పాలి । కర్మానుకూలంబు
బలిమి తనదు పాలి । బంధకంబు
కలిమి, బలిమి రెండు । తెలివికి హానిరా! ॥వి॥ 1220

ఇంట్లో ధనము, ఒంట్లో సత్తువ ఎప్పటికైనా నిరర్ధకమే!

ఆ. కలిమినాఁడు మగనిఁ । గామించి చూచును
లేమిఁ జిక్కునాఁడు । లేవకుండు
మనిన మగనినైన । మడియంగఁ జూచును ॥వి॥ 1221

స్త్రీల చిత్తాతి విచిత్రముల చిత్రించాడు.

మనిన = బ్రతికిన.

ఆ. కలిమి బలిమిఁజూచి । కనకము నాసించి
కన్య నియ్యఁ బూర్వ । గతులవెట్టొ?
పేదకనువు మీరఁ । బిల్లనిచ్చినవానిఁ
జెప్పనేల ? పరమ । శివుఁడు వేమ. 1222
ఉదారభావాన్ని ఉద్దీపింపజేశాడు

తే. కలిమి సుఖదుఃఖములకును । గారణంబు
సంపదలు గల్గ నెవరికి । శాశ్వతంబు
తెలివి సంపదఁ గలవాఁడె । దేవ సముఁడు
నిత్యమది కూర్చ దాయిని । నిజము వేమ! 1223
బహుముఖ ప్రజ్ఞాశాలి యని చెప్పకయే యీపద్యము తెల్పుచున్నది.

ఆ. కలియుగంబు నందు । ఘనతకు నైచ్యంబు
ఘనత నైచ్యమునకుఁ । గలుగుచుండు
శ్రద్ధభక్తి లేక । జనులుండ్రు గావున ॥వి॥ 1224
భక్తి శ్రద్ధలు భగ్నమయాయని కలియుగ మహిమ గణుతించాడు.

ఆఁ కలియుగమున నున్న । కాపు కులానకు
వేమన దనకీర్తి । విక్రయించె
నున్నధర్మమెల్ల । నుర్విపై నరులకు
గోరుబెట్టు వరము । గోరి వేమ. 1225
ఎటువంటి వారికిని స్వజాత్యభిమాన ముండును.

ఆ. కలియుగంబున ధర్మ । కోటి కొక్కఁడు గలఁడు
లేడు లేడని చెప్పు । లోభివాఁడు
అంత ధర్మిష్ఠయితె । ఆవలేమున్నది ? ॥వి॥ 1226
ఒంటి పాదం మనిషివలె కుంటుతుందీపద్యము.

ఆ. కలియుగమునఁ బుట్టి । కడతేఱగా లేక
యొడలు బడలఁజేసి । యుగ్రతపము
తమరుచేసి యేమి । తత్వంబు గనలేరు ॥వి॥ 1227
"కలియుగే స్మరణేన్ముక్తి" వాడాడు.

ఆ. కలియుగమున నున్న । కాపు కులమునకు
వేమన తనకీర్తి । విక్రయించి
నున్నధర్మమెల్ల । నుర్విలో నరులకు
కోరువెట్టెఁ బరముఁ । గోరి వేమ. 1228

వేమన కవిత్వము జెప్పునాటికి విశ్రుతులు బ్రాహ్మణులే? అందుకే పొందుగా తనకులాన్ని చెప్పాడు.

ఆ. కలుగు చింతలన్ని । కడకఁతో దాటఁగ
వెలుగుఁ జంద్రకాంతి । వేడుకలర
నివ్వటిల్లఁగోరు । నిర్గుణ యోగిరా! ॥వి॥ 1229

చిత్తభ్రాంతులను చితుకగొట్టి యోగివి గమ్మన్నాడు మహాయోగి.
నివ్వటిల్ల = ప్రకాశము.

తే. కలుగుచుండెడి కర్మము । లన్నిఁ ద్రొక్కి
నిలిచి నిర్గుణ పథమూని । నెలవెఱింగి
పలుకకుండెడు వాఁడెపో । పరమగురుఁడు
నిత్యసంతోష నిధియగు । నిజము వేమ. 1230

పరమ గురులక్ష్య లక్షణముల బాగుగా చెల్పాడు.

తే. కలుగు దోషములెల్లను । గాలఁద్రొక్కి
వెలుగునకు నావలను వెల్గు । వెలుగుఁజేరి
నిలిచి నిర్గుణ మందుటే । యిల సమాధి;
* చెలఁగు నేనట్లతఁడె పరమ । శివుఁడు వేమ. 1231

* యిచ్చట గణము తప్పెను. సమాధి = దశేంద్రియము బంధనచేసి అసలు విషయమును నిసలుగా జూచుటే సమాధియోగము.

ఆ. కలుగు సుఖములెల్లఁ । గల్లగా రోయుచు
మెలగుచుండువాఁడు । మిహిరు పగిదిఁ
దిరుగు నేర్పుచూడ । ధారుఁడే యగునయా! ॥వి॥ 1232

మిహిరుఁడు = సూర్యుఁడు; ద్వంద్వాతీతుడగువాడు ద్వాదశాదిత్యుల వంటివాడు.

ఆ. కలుపు దీసి నరులు । కాపాడి పయిరుల
బెంచు ప్రేమ వలెను । బెనిచి మదిని
ద్రుంచి దృశ్యములను । దెంపుగా నుండరా ॥వి॥ 1233

"మంచిని పెంచి చెడుగును ద్రుంచి మించినవాడే మిహిరుఁడురా!"

ఆ. కలువపూలవంటి । కన్నులుండిన నేమి?
చిలుక పలుకులట్లు । పలుక నేమి?
తెలివి బలిమిఁగ । తేజరిల్లగ నేమి?
తులువగామి నలరు । నెలఁత వేమ. 1234

స్త్రీకి రూపం పాపం గుణమే సుభూషణం.

ఆ. కలుష మానసమునఁ । గాన్పింపఁగా రాదు
అడుసు లోన భానుఁ । డడగినట్లు
తేఁటనీరు పుణ్య । దేహమట్లుండురా! ॥వి॥ 1235

అజ్ఞానాంధకారంలో సుజ్ఞాన సూర్యుడు నూటిగా కానరాడు.

తే. కలుషములనెల్ల ఖండించు । గతి నెఱింగి
చిన్మయానంద పట్టాభి । షిక్తుఁడైన
వానినెన్నంగఁ దరమె? యీ । వసుధయందు
బరమశివుఁడని వర్ణింపఁ । బడును వేమ. 1236

చిన్మయానందుని చేష్టల చిత్రించాడు.

ఆ. కలుష మెన్నికొనఁగ । గౌరవ హానిమే
యరయఁ దత్వమెన్న । నాత్మఘటిక
తెలిసినంతఁ దాను । స్థిరుఁడు గావలయురా! ॥వి॥ 1237

విజ్ఞానాన్నార్జించి అజ్ఞానానికి అట్టులు చాచరాదన్నాడు.

ఆ. కలుషమెల్ల దెలియఁ । దలవంపులకు మూల
మరయ దత్వమెల్ల । నాత్మఁబుట్టుఁ
దెలిసినందునకునె । ధీరుండు గావలె ॥వి॥ 1238

ధీరుఁడు = పండితుఁడు.

ఆ. కలుష మొక్కయింత । కాన్పింపదెందును
జూడ నెవరికైన । సొంపుమీఱఁ
దామసం బడంగఁ । దావెల్గు జ్ఞానంబు ॥వి॥ 1239

తామసగుణమును దరిజేరనీకపోవుటయే ధన్యత్వానికి బాట.

ఆ. కల్లుకుండకెన్ని । ఘనభూషణము లిడ్డ
నందులోని కంపు । చిందు లిడెదె
తులువ సదివికొన్నఁ । దొలిగుణ మేమగు ॥వి॥ 1240

"పుట్టుకతో వచ్చిన గుణం పుడకలతోగాని పోదు"

ఆ. కల్లుఘటికి భూతి । ఘనముగాఁ బెట్టియు
నందులోని కంపు । నణఁగనట్లు
మెడను త్రాడు వేయ । మెరపుతో ద్విజుఁడౌనె ॥వి॥ 1241

ఘటిక = కుండ; పవిత్ర వస్తుధారణ చేసికొన్నంతమాత్రమున అపవిత్రుఁడు పవిత్రుడు గాజాలడని మహితవాక్కు.

ఆ. కల్లుఁ ద్రాగు నరులఁ । గై పెక్కి యుండెడి
వారి సుఖముఁ దలఁప । వశముగాదు
ఒడలు మఱచి యోగ । ముల్లసిల్లెడు యోగి
త్రుళ్లి పడక మఱచి । తూగు వేమ. 1242

కైపెక్కి = మత్తెక్కి; కైపు దేశీయము రామాభ్యుదయ ప్రయోగము:

ఆ. కల్లుద్రాగువాని । కల్లు ముచ్చనరాదు
కల్లలాడువాఁడె । కల్లుముచ్చు
కల్లుఁ ద్రాగుకంటె । కల్లలాడుటె కీడు ॥వి॥ 1243

కల్లు ముచ్చు = మత్తెక్కిన గజదొంగ; అబద్ధము అన్నివిధాల చేటు.

ఆ. కల్లున కిడునట్లు । చల్ల కీయఁగలేరు
కొల్లకట్టలేరు । గురువునకును
బూయి కిచ్చునట్లు । పుణ్యానికీయరు ॥వి॥ 1244

కొల్లకట్టు = నిలువుదోపులు; బూయి = జారిణి.

ఆ. కల్లునీళ్లు ద్రాగి । కడుఁబెద్దవారితోఁ
జీరె విడిచి తిరుగు । సిద్ధులాలు
పనులు దీఱు వెనుకఁ । బాతలు గట్టురా! ॥వి॥ 1245

"వృద్ధనారీ పతివ్రతా" అను నార్యోక్తి వాడెను.

ఆ. కల్లు కిచ్చినట్లు । చల్ల కివ్వగలేరు.
కొల్ల కిచ్చినట్లు । కుడువలేరు ?
పొలుసు కిచ్చినట్లు । పుణ్యానికివ్వరు ॥వి॥

కొల్ల = దోపిడి ; పొలుసు = మాంసము.

ఆ. కళవళంబు మాని । నిలువరించినవాఁడు
తొడరి బయలు దాకి । తుప్పటిలుచు
యక్షయంబు నంది । యగ్గించు చుండును ॥వి॥ 1246

కళవళము = కంగారు ; తుప్పటిలుట = గంతులిడుట ; అక్షయము = స్థిరమగునది.

ఆ. కవిత గూర్పు బుద్ధి । గల్గజేసె నజుండు
సముచిత మతితోడ । జక్కగాను
యొనర సంధ్య నిష్ఠ । హోమ తర్పణముల
జెలగి కల్పనంబు । జేసె వేమ. 1247

జప, తప, హోమాది సత్కర్మలు సల్పి సత్కవిత్వ మలవరచుకొన్న చతురుఁడు వేమన.

ఆ. కష్టజీవి బ్రతుకు । కాష్టము పాలగు
నిర్దయాత్ము బ్రతుకు । నీట గలియుఁ
గ్రూరకర్ము బ్రతుకు । చోరులపాలౌను ॥వి॥ 1248

స్వభావోక్తిని జాలువారు రసముతో చిత్రించాడు మహాకవి.

తే. కష్టమున కోర్చి దమయంతి । కాదు సొచ్చి
దుష్ట కైరాతకునిఁ జూచిఁ । ధూళిఁజేసె
వ్యష్టియై సత్యవై భవ । మందెగాదె?
నిష్ఠ మదిఁగల పతిభక్తి । నియతి వేమ. 1249

చిత్తైకాగ్రతగల స్త్రీ చేయరానిది లేదు (నలోపాఖ్యానగాథ)

ఆ. కష్టమైన మనసు । గాంక్షించి యోగికి
జ్ఞాన దీపశిఖయుఁ । దానటింపఁ
గానవచ్చు నాత్మ । క్రమమైన జ్ఞప్తితో ॥వి॥ 1250
జ్ఞానదీపశిఖ = విజ్ఞానమనే దీపపువెలుఁగు "కష్టే ఫలే ?"

ఆ. కష్టమైన మలము । కడుపులో నుండంగ
నంతకంటెఁ జెడెడి । దన్నరసము
ఉపములేని జనము । లుపవాసముందురు ॥వి॥ 1251
శరీరాన్ని కృశింపజేసి చేయునదేముంది !

ఆ. కష్టలోభి వాని । కలిమికి నాసించి
బడుగువాఁడు దిరిగి । పరిణమించు
దగరు వెంట నక్క । తగిలినచందంబు ॥వి॥ 1252
"అందరాని పండ్ల కఱ్ఱులు చాచరాదు"

ఆ. కసవు దినునుగాదె ? । పసరంబులెప్పుడు
చెప్పినట్టు వినుచుఁ । జేయుఁ బనులు
వానిపాటిమైన । మానవుఁ డొప్పడా ! ॥వి॥ 1253
మానవత్వములేని మనిషి పశువుకంటె హీనుఁడు.

ఆ. కసవు నేరి తిన్న । పసరపు మైదిన
మాలడంద్రు వాని । మహిని జనులు
పందిఁ గోడి దిన్న ప్రాజ్ఞులందురు జనుల్ ॥వి॥ 1254
"గోబ్రాహ్మణ సంరక్షణార్థ మిదం శరీరం" అను శృతి.

ఆ. కసవు నేరి తినెడి । పసరము తినువాని
మాల యద్రు గాదె ? । మహిని జనులు
పందిఁ గోడిఁ దిన్నఁ । బాపు లందురు సుమీ ! ॥వి॥ 1255
"మత్స్యమాంసం మతిభ్రష్టః"

ఆ. కసి గలిగియుఁ బాప । కర్మలఁ బీడింతు
రల్లప్రభులు యముని । రల్లభటులు
వృశ్చికంబుఁగన్న । విడుతురే చంపక ॥వి॥ 1256

ఆ. కసువులు దినువాఁడు । ఘనఫలముల రుచి
గానలేఁడుగాదె । వానియట్లె
చిన్న చదువరులకు । మిన్న జ్ఞానమురాదు ॥వి॥ 1257

కసవు దినువాడు = బుద్ధిలేనివాడు.

ఆ. కసవుఁ బసికిఁ జేసె । గాలి ఫణికిఁ జేసె
మన్నెరలకుఁ జేసె । మరవకెట్లొ
కుంభిని జనులకును । గూడట్లు చేసెరా ! ॥వి॥ 1258

మను + ఎఱ్ఱలు = ఏలుఁగు పాములు, మన్ను పాములు ; కుంభిని ; = భూమి ; ఫణి = పాము ; పసి = ఆవు.

ఆ. కస్తురి యటుచూడఁ । గాంతి నల్లగనుండుఁ
బరిమళించు దాని । పరిమళంబు
గురువులైనవారి । గుణము లీలాగురా ॥వి॥ 1259

రూపమునగాక లోపలున్న శక్తినే గమనించవలయును.

ఆ. కస్తురివలపేల ? । గజరాజమున కైన్న
దనదు మదపుధార । తావిగాక
యోగికేల రంభ ? । యోగహర్షంబుండ ॥వి॥ 1260

ఎవరి కేదియున్న భూషమో అదియే గాని అన్యమైనచో వికారముగానుండును.

క. క్రమమున దేహత్రయముల
విమల జ్ఞానంబుచేత । వివరించినచో
నమలంబగు నస్తోకము
కొమరొప్పఁగ జాగ్రతందు । గూడుము వేమా! 1261

అస్తోకము = ఎడతెగని ; దేహత్రయములు = స్థూల, సూక్ష్మ, కారణ దేహములు.

ఆ. క్రతువు చేసితనుచుఁ । గడు విఱ్ఱవీగుచుఁ
గడుపునిండ నేయిఁ । గుడిచి త్రేపి
రాగమెత్తురేల ? । భాగాంతకు లనక ॥వి॥ 1262

యజ్ఞయాగాదుల మిషతో పొట్టనిండ పట్టుబడి పట్టుటకే ?

ఆ. క్షమ గలట్టి యతఁడు । సాధువై శోభించు
నోర్పుఁబోలునట్టి । దుర్వి గలదె ?
వన్నెవచ్చు మేలు । లెన్నియైననుగూడు ॥వి॥ 1263

క్షమ = ఓర్పు ; ఓర్పు కూర్పులతో నేర్పరియై నెగడిన వాడే నెరయోగి.

ఆ. కాంచనంబుపైనఁ । గాంతలపైనను
బ్రహ్మకైనఁబుట్టు । రిమ్మతెగులు
తోయజాక్షి విడుచు । దొరయెవ్వఁడునులేడు ॥వి॥ 1264

కాంతా కనకాలను కాదన్నవాడు లేడు.

ఆ. కాంచనంబుమీఁది । కాంక్షమోహము గప్ప
విడువలేరు ప్రజలు । విశ్వమునను
గాంక్ష గలుఁగువారు । కానంగలేరయా ! ॥వి॥ 1265

కాంచనము = బంగారము ; కాంక్ష = కోరిక ;
కోరిక లూరనివారు ధారుణిలో లేరు.

ఆ. కాంత కుంకయైనఁ । గాని కులంబైన
బాయలేక విటుఁడు । భ్రమసియుండు
మరిగి గ్రుడ్డికుక్క । మాంసంబుఁ గొన్నట్లు ॥వి॥ 1266

కుంక = చెడిపె ; కామానికి కళ్ళులేవు.

ఆ. కాంతపైని ప్రేమ । స్వాంతము రంజించు
జింతదీఱుఁ దరుణి । చిక్కనప్పుఁడె
వింత యమరఁబోదు । విశ్వసాక్షిని గూడ ॥వి॥ 1267

స్వాంతము = మనస్సు ; ఆడదానియందు ఆత్మఉంచినట్లు అది బ్రహ్మ యందు అమరనీయదు.

ఆ. కాంతమీఁదియాశ । కనకంబుపైనాశ
లేనివాఁడు పుడమి । లేనివాఁడె
కబురులేలఁ జెప్పఁ । గాన్పింప దెలియరా ! ॥వి॥ 1268

క. కాంతము భస్మముఁజేసిన
శాంతులకది జ్ఞానసాంఖ్య । సంజీవి యగుం

గాంతలఁ దలపక యుండిన
శాంతముగల దైవమగునుఁ । జగతిని వేమా! 1269
కాంతభస్మము శాంతినిస్తుంది.

ఆ. కాంత మేనుఁజూచి । కలవర పడెదరు
కడుపులోని రోతఁ । గానలేక
యింతరోతచేత । కీదేహమేలరా! ॥వి॥ 1270
శరీరము మలమూత్రముల కొంప.

ఆ. కాంతయందె వెడలి । కాంతకే యాసించి
గాసిఁ బడఁగనేల? । కాంతచేత?
కాంత విడుచువాఁడు ఘనతర యోగిరా! ॥వి॥ 1271
స్త్రీవ్యామోహం త్రెంచినవాడే సిద్ధయోగి.

ఆ. కాంతల కందంబు । కురులు, స్తనంబులు
* మగవారి కందంబు । మీసమొక
గుళ్ళకు యందంబు । గోపురంబొక్కటే? ॥వి॥ 1272
* యతి తప్పు; అందచందాలు అందరి కొక రకంగా నుండవు.

ఆ. కాంతసింధురంబు । కడుఁ బిత్తరోగికి
నొనర మధువుతోడ । నొసఁగినంతఁ
దనరు దేహబలిమి । ధన్యుడై గట్టెక్కు ॥వి॥ 1273
కాంతాసింధూరము శరీరమునకు పుష్టినికల్గించును. వేమన ఆయుర్వేద పారంగతుఁడు.

ఆ. కాకి కన్నబిడ్డ । కాకికే యందంబు
కోడి కన్న బిడ్డ । కోడి కందం
యోగికన్న కళలు । యోగికే యందంబు ॥వి॥ 1274

ఆ. కాకి గట్టున కూసు । కోడి కొక్కొర కూసు
కుక్క క్షీళ్ళని మొఱుగు । కలియుగమున
హాస్యంబు సేయువాఁ । డన్ని కూతలు కూసు ॥వి॥ 1275
ఒక్కొక్కస్వరం ఒక్కొక్కజాతికి చిక్కింది.

ఆ. కాకిగూటిలోన । కోకిలమున్నట్లు
భ్రమరమగుచు పురుగు । బ్రతికినట్లు
గురునిగొల్చువెనుక గురువు । తానౌనయా ! ॥వి॥ 1276

ఆ. కాకిపై కొంగెక్కి । యాట్లాడుచుండంగ
పిల్లి రెంటిని పొంచి । పట్టుకొనెను
మళ్లిచూడబోతె । మూడు కానకపోయె ॥వి॥ 1277

మనస్సుపై బుద్ధిని ధృవపరచుట యీరెంటిని జ్ఞానము హరించగా నిరామయత్వం నెరవేరుతుంది. యీపద్యం లక్షణ విరుద్ధం.

ఆ. కాకులున్నగూడు । కోకిలకగునట్లు
భ్రమరచేత కీటకము । మనుమాడ్కి
సత్యముక్తి విని । చెడుగెడు నరుఁడయా ! ॥వి॥ 1278

అతుకుల బొంతగా అమరిన యీపద్యము అన్యులదేమో.

ఆ. కాటికి హితమైన । కాయంబు యెన్నాళ్ళు
* భక్తిశాయను నిల్చు । భూమిమీద
జాగ్రత్తపడువాడె । జాణుండు, ధీరుండు ॥వి॥ 1279

* యతి పోయింది ; ఎక్కడినుంచి వచ్చిన వస్తువు తుద కక్కడికే చేరును.

క. కాదనఁడెవ్వరి తోడను
వాదాడఁగఁబోడు వెఱ్ఱి । వాని విధమున
న్భేదాభేద మెఱింగియు
వేదాంత రహస్యమెఱిఁగి । వేమన నుడువున్. 1280

" వెఱ్ఱివేమనవాక్కులు వేదమయ్యె " వేదముతే వేమనవాక్కులు.

క. కాదని యెవ్వరితోడను
వాదాడక తిరుగువెఱ్ఱి । వానిన్బలెనే
భేదాఽభేదములడచిన
వేదాంతరహస్యమెల్ల । వేమననేర్చున్. 1281

వేదాంతరహస్యము = ఉపనిషద్వాక్యము వేద + అంతము = వేదాంతము.

ఆ. కానసంబుఁ జేరి । కడు శ్రమనొందిన
నా నలుండు రాజ్య । మందె మరల
బుద్ధినొక్కి యెఱుక । పోకార్చుటయె ముక్తి ॥వి॥ 1282

"కష్టే ఫలే" నలచరిత్రనిట సాణ్యంగా వాడేడు యోగి.

తే. కాననము సొచ్చి తిరుగుట । మానవలెను
బూని మదమత్సరాళిని । బొలియఁ జేసి
మాని నిజకేళిదరిఁ జేరు । మాన్యుఁడరయ
ధ్యాన ధారణ యోగము । లూన్చని వేమ. 1283

షడ్గుణముల సమయించుటయే యోగసిద్ధికి ఉత్తమమార్గము.

క. కానన సమమగు జ్ఞానము
బూనక తన్నెఱుఁగదరమె ? । భువిలో నెప్పుడుం
దానని యెఱుఁగుట తత్వము
నేనని వర్ణించువాఁడె । నేర్పరి వేమా ! 1284

తత్వము = బ్రహ్మజ్ఞానము ;

ఆ. కానరాని బయలు । గనుటయే క్షేమంబు
మేనుమఱచి నిద్ర । మెలఁగినట్టు
తాను దానుగాను । దలఁపు మఱపుదాటు ॥వి॥ 1285

"నే" ననే మమకారము లేకుండాజెయ్య మన్నాడు కవి.

ఆ. కానరాని వాని । కనుపించువానితో
కాపుచేయ నలుక । కరుణతోడ
కానరాని వాని । కరుణేమి కందురో ! ॥వి॥ 1286

ప్రకృతి ప్రభావము బహుముఖ ప్రజ్ఞలో బాహాటంగా చాటాడు.

ఆ. కానలేక భువిని । గాలారఁ దిరిగినఁ
బూని మదిని నిలుపఁ । బూనుటరుదు
మేను మఱచి నిద్ర । మెలఁగెడికై వడి
దావకంబు మఱచి । తగులు వేమ. 1287

గాలార = జాను తెనుఁగు ; జాను తెనుఁగు పలుకుబడులు చిలుకుటలో చిలుకల కొలికి పలుకులవలె చిత్తానికి హత్తింపఁజేస్తాడు యోగి.

ఆ. కానలేదు నుదురు । కన్నులు, వీపులు
నోసలు గానలేదు । నొప్పుగాను
తన్నుగానలేదు । తత్వమే మెఱుగును? ॥వి॥ 1288

తన్ను తాను ఱెలియలేనివాడు దైవాన్ని ఎట్లు తెలుసుకోగలడని వేమన ప్రశ్న.

ఆ. కానలేఁడు నుదురు, । కర్ణము ల్వీపును
నోఱుల గానలేదు । నెత్తిమీఁద
దన్నె కానలేఁడె? । తత్వమే మెఱుఁగును? ॥వి॥ 1289

అసాధ్య కార్యాన్ని సాధింపలేరు.

ఆ. కానలేరుగాని । కలియుగంబున నున్న
మనుజులందఱికిని । మానమొకటె
దార్ఢ్యముగలవారు । తనవలెఁజూడక
పరులఁ దూలనా । డుదురు రవేమ. 1290

"చ॥ మదవతు లెల్లవారలకు । మారుని గేహము లొక్కటే గదా!"

ఆ. కానవచ్చువానిఁ । గనుపించువానితోఁ
గాపుచేయ నలుక । కరుణతోడఁ
గానరానివాని । కరుణేమి కందురో! ॥వి॥ 1291

వేమన ప్రకృతి రహస్యబాటలో పయనించి నూటిగా వెల్లడించాడు.

ఆ. కాని కులముదైన । గంటి కింపైనపుడు
విటుఁడు దలచెనేని । విడువలేఁడు
మరిగి గ్రుడ్డికుక్క । మాంసంబుదిన్నట్లు ॥వి॥ 1292

"తాను వలచినది రంభ, తాను మునిగినదే గంగ"

ఆ. కానివానిచేత । గాసులీసము లిచ్చి
వెంటఁదిరుగుటెల్ల । వెఱ్ఱితనము
పిల్లి పట్టెఁ గోడి । పిలచిన బలుకునా! ॥వి॥ 1293

ఆ. కానివానితోడఁ । గలిసిమెలఁగుచున్న
హానివచ్చు నెంత । వానికైన
నీఁగ గడుపుఁ జొచ్చి । యిట్టట్టుసేయుదా! ॥వి॥ 1294

ఆ. కానివానితోడ । గలిసి వర్తించునే
హానివచ్చునెంత । వానికైనఁ
దాటి క్రిందఁ బాలు । ద్రాగిన చందమౌ ॥వి॥ 1295

"సహవాస దోషేణ గుణేభవేత్"

ఆ. కాపుకులజు లెంత । కర్ములైనను గాని
పాపరాశి కొంత । పరిసిపోవు
వివరమెఱుగనట్టి । వెట్టిజీవులుగాక ॥వి॥ 1296

ఆ. కాపు చెప్పినట్లు । కరణంబు నడచిన
కరణమునకు మంచి । కలిమి, బలిమి,
కాపు కాదటంచు । కరణము నడచిన
కీడు తప్పరాదు । పాడు వేమ! 1297

"రైతులే రాజ్యపాలకులగు రాజులు"

ఆ. కాపు బల్మియున్న । గరణాని కది బల్మి
కరణము బలమెల్ల । కాపు బలిమి
కాపు సంతసంబు । కరణము సంతోష
మరసిచూడ లోక । మందు వేమ. 1298

కాపు కరణములు అవినాభావ సంపత్తితో నుందురు.

ఆ. కాపులు, గరణాలు । గంసాలి, భక్తులు
కట్ట కడవరకును । గష్టపడగఁ
బరగి గుఱ్ఱములకు । బాపలకును దక్కు ॥వి॥ 1299

కష్టమొకరిది ఫలమింకొకరిది. "కష్టపడువానికి కడకాళ్ళు, కూర్చున్నవానికి గుండెకాయలు.

ఆ. కాపులేనియూరు । కరణమునకు కీడు
కరణము పగచేత । కాపు కీడు
కాపు కరణములను । కావడి కుండలు ॥వి॥ 1300

"క" కారాలన్నీ కలసియుంటే కల కల లాడును.

ఆ. కాను క్రోధములను । కలిగియు మఱపుచే
నిష్ఠ: దేవగురుని । నెఱుగలేరు
యిష్ఠ మెరుగు నతడె । యిల బుద్ధిమంతుడు ॥వి॥ 1301
దీక్ష దక్షతకు దారి!

ఆ. కామ చింతఁజిక్కి । కనుఁగాననేరవు
నీమ నిష్ఠలఁ దగి । నియతి మీఱి
తామసంబు నడఁచి । తన్మయ మందరా ! ॥వి॥ 1302
" కామానికి కండ్లులేవు " తామసాన్ని తన్నినవాడు ధన్యుఁడు.

ఉ. కాముకుఁడైనవాఁడు ధన । కాంక్ష వహించినవాఁడు మత్తుఁడుం
బామరుఁడైనవాఁడు బరి । పాటి నెఱుంగనివాఁడు మూర్ఖుడు
న్నోమర సేయువాఁడు మఱి । ముక్తినిగాంచునె యెన్ని భంగులం
న్వేమనవాక్య మొక్కటియు । వీసరపోవునె ! దారిఁదప్పినన్॥
ధూమజ్యోతిస్సలిల మరుతాం......(మేఘసందేశము) వాక్యాన్ని వాడాడు.

ఆ. కామ మోహములను । గలిగియుండు నరులు
ఇష్ట దేవగురుల । నెఱుఁగలేరు
ఇష్ట మెఱుగు నతఁడె । యిల మంచి బుధుఁడౌను ॥వి॥ 1304
పండిత లక్షణాలు వాకొన్నాడు.

ఆ. కామ వికారుఁడు । కాంతమాటలు వినుచు
యోగశాలి యైతె । యొగిరి తన్ను
రెండులేనివాఁడు । కుండచట్లను కడుగు ॥వి॥ 1305
" రెంటికింజెడిన రేవడే " వీడు.

ఆ. కామి గాని ఘనుఁడు । ఘనుఁడు గాడాయెనేఁ
గామిఁగాడె కృష్ణ । సామి ముందు
కామిగాని ఘనుఁడు । గణపతి గాఁడొకో ! ॥వి॥ 1306
కామము లేనివాడు గనపడడు. పురాణాలన్నీ పుక్కిట బట్టేడు.

ఆ. కామిగానివాఁడు । కవిగాఁడు, రవిగాఁడు
కామిగాని మోక్ష । కామిగాఁడు
కామియైనవాఁడు । కవియగు రవియగు ॥వి॥ 1307

వాడుక మాటలు పద్యాలుగావాడి "వహ్వారే ?" యనిపించుకున్నవాడు కవిచంద్రుఁడు !

ఆ. కామియైన హరుఁడు । ఘనుఁడు గాఁడాయెనా !
కామియైన విష్ణు । ఘనుఁడుగాఁడె ?
కామిగాక మోక్ష । కామిగాఁ డిలలోన ! ॥వి॥ 1308

ఆ. కామి యైయ్యుఁ గాక । ఘనుఁడు ఘనుండగు
గామి కృష్ణుఁ డరయ । ఘనుఁడు గాఁడొ ?
కామి గాని ఘనుఁడు । గణపతి గాఁడొకో ? ॥వి॥ 1309

అష్టాదశ పురాణ సారాన్ని ఆకళింపు జేసుకొన్నాడు యోగి.

గీ. కాయకంబైన పరిపూర్ణ । కల్పమంది
స్థాయి పడగాంచి మించెదు । స్థానమందు
మోక్ష సుఖతత్త్వ పూర్ణంబు । ముట్టవలెను
బరమ శివుఁడని వర్ణనఁ । బడయ వేమ. 1310

కాయకల్ప సిద్ధి ఘనతను సూచించేదు.

ఆ. కాయఁగాయ గాల్చి । కనకంబుఁ జూడరా !
కాయ యనగ బ్రహ్మ । కాయమంద్రు
కాయఁ దెలియునతఁడె । కౌస్తుభ ధరుఁడౌను ! ॥వి॥ 1311

కౌస్తుభధరుఁడు = విష్ణువు. బంగారు యోగము.

ఆ. కాయగూరలు దిని । కాషాయ వస్త్రము
లొప్పడినెత్తిగలిగి । కూడు చుంద్రు
తలలు బోడులంట । తలఁపులు బోడులా ? ॥వి॥ 1312

ఆ. కాయమందు గురుని । కరుణతో గనుగొని
బాధ గురువులు సేయు । భోదలేల ?
కారణార్థులు చూచి । పారిపోదురు ప్రజలు ॥వి॥ 1313

ఆ. కాయమీఁద మ్రాను । ఘనముగా నుండును
మ్రానుమీఁదఁ దీగ । మలయుచుండు
తీఁగమీఁద మ్రేళ్లు । త్రిపుర తాండవమాడు ॥వి॥ 1314

ఇది విచిత్ర విడికథ = వీణ ; ఆధ్యాత్మికముగా అర్థమౌతుంది.

ఆ. కాయముఁ దగఁగూడి । కడఁగి యోగిగ నున్న
గాయమిలను బడిన । ఘనుఁడుగాఁడు
కాయముననె ముక్తి । గతికేగవలెనయా ! ॥వి॥ 1315

కాయము = శరీరము : దేహము ద్వారానే ముక్తిని సాధించుట మూల మన్నాడు.

ఆ. కాయమును గడఁగియు । గనక యావలనున్న
కాయమును విడచిన । యోగి
కాయమందు ముక్తి । గతికేగవలయురా ! ॥వి॥ 1316

పైపద్య చ్ఛాయలే యీపద్యముననున్నవి.

ఆ. కాయమున్న యప్డె । కామాదులను ద్రోసి
జ్ఞానమార్గమునకుఁ । గడఁగవలయు
జాగుచేయఁ గాయ । మేగిన నేమగును ॥వి॥ 1317

జాగు = ఆలస్యము ; "దీపముండగానే తేరుకొని యిల్లు చక్కబెట్టుకో" అనే సూక్తి ఉటంకించాడు.

క. కాయము విడిచెడు వేళను
న్యాయంబుగ బుద్ధినొక్క । నమ్రత తోడన్
జ్ఞేయంబగు పరిపూర్ణము
చాయను గని పరిణమించుఁ । జయ్యన వేమా ! 1318

అవసాన దశలో అజామిళుఁడు "హరిహరీ" అంటే అదుకొన్నాడు శ్రీహరి.

ఆ. కాయజుఁడైన వెనుక । కానుంబు యేడిది ?
మాయయేడిది ? స్త్రీల । మరులుయేడ ?
అన్ని మంటినిగలసె । ఆత్మయొక్కటి నిలచె ॥వి॥ 1319

కాయజుఁడు = మన్మథుఁడు ; అందచందాలు, అనంగుడు, అంగనలు, అన్నియు మన్ను పాలే.

క. కారంబు తినఁగనేరరు
దూరము నడవంగలేరు । తోనుండెడి సం
సారంబె యీదనేరరు
వీరులు నరులందు రెంత । వెఱ్ఱియొ వేమా! 1320

వీరుల లక్షణాలు వివరంగా చెప్పేడు వేమన.

ఆ. కార్తవీర్యువంటి । ఘనులెవ్వరును లేరు?
వీర్యశౌర్యమునను । విఱ్ఱవీగి
పరశురాముచేత । బాధలు పడి చచ్చె! ॥వి॥ 1321

గర్వము సర్వముజెరచును; కామధేనువు నాశించి కార్తవీర్యార్జునుడు కడతేరాడు.

ఆ. కార్యగురులు గలరు । కలియుగంబున జూడ
కారణార్థులు జనుల । కండ్లబడరు
కోకిలతో సమము । కాకియెందున నగునె? ॥వి॥ 1322

క. కార్య గురుసేవఁ జేసిన
ధైర్యంబగు బోధఁజెప్పి । దమ మొసఁగదురా!
స్థైర్యంపు గురుని వేడన
వార్యంబగు బయలుజేర్చు । వడిగా! వేమా! 1323

ఆ. కారుకారు గురులు । కాగుణితముఁ జెప్ప
శాస్త్రపాఠములనుఁ । జదివిచెప్ప
ముక్తిదారిఁ జూపు । మూలమంత్రము గదా! ॥వి॥ 1324

ఆ. కాలకంఠునెదిరి । ఘనముగాఁ బోరిన
యర్జునునకు వశము । కర్జమైన
పాశుపతము గలిఁగె । పగతులఁ దునుమాడ ॥వి॥ 1325

కాలకంఠుఁడు = శివుడు; కర్జము = పని; యీకథ కిరాతార్జునీయ గాథ

క. కాలగతి యెంతవారికి
వాలాయము చులకఁదనము । వచ్చుట యరుదా!

వ్రేల గిరి నెత్తు కృష్ణుఁడు
తేలఁడె వటపత్రమందుఁ । దెలియర వేమా! 1326
కాలానుగుణ్యంగా ఘనులైనా మారక తప్పదు. (భాగవత గాథ.)

ఆ. కాలచక్రము వలె । కలవాని మనసెల్ల
చెలఁగి తిరుగుచుండు । చెంచలించి
చక్ర గతిని విడువ । స్తంభించు మనసపుడు ॥వి॥ 1327
కాలప్రవాహానికి కలిగిన వారి మనసునకు లంకె వేశాడు.

ఆ. కాలచక్ర మెఱుఁగ । గాలేక యెప్పుడు
సంధ్య జపముచేయు । జాణలార
సంధ్యజపములోను । జాడలెట్లుండును? ॥వి॥ 1328
బ్రాహ్మణులు త్రిషవణ స్నానములుచేయుట ఆరోగ్యానికే యని నిర్ణయించాడు. త్రిషవణము = మూడువేళలు.

ఆ. కాలధర్మ మెఱిఁగి । కపటవృత్తులు మాని
యాలు పిల్లలందు । నాశవదలి
మేలుగాను శివుని । మేల్కొని పూజించు ॥వి॥ 1329
సద్భక్తుని ధర్మకర్మలు చక్కగా నిరూపించాడు వేమన.

ఆ. కాలమధికమైన । గడచి పోవగరాదు
ధర్మరాజు గొల్చె । తగని చోటఁ
గంకు భట్టనంగఁ । గటకటా! వేమన ॥వి॥ 1330

క. కాలము కాలమటనకను
మేలుగ తానొక్కరీతి । మితి మీరగ దా
గాలు నెదుర్కొను జ్ఞప్తిది
వాలాయము శివుని । గూడి వర్ధిలు వేమా! 1331
మృత్యువుని జయించే మిన్నమార్గమును ఎన్నుకోమన్నాడు.

కం. కాలము తనకిక చాలా
కాలము గలదంచు నున్న । కాలము నందున్

కూలుఁడు తనుఁ దా దెలియక
గూలెను తొలిజామునందు । గొబ్బున వేమా ! 1332

"రేపన్నవారి పొరుగున నుండగూడదు" రేపని బద్ధకము ప్రాప కానికే భంగము.

కం. కాలముఁదెలియక చాలఁగ
గాలము గలదంచు నున్న । కాలము నందుం
గూళుఁడు తనుఁ దా ఁదెలియక
కూలెడు తొలిజామునందు । గొబ్బున వేమా ! 1333

సోమరితనముతో శుష్కించరాదనే సూక్తిని సూత్రీకరించె వేమన.

కం. కాలముల మహిమఁదెలియక
వాలాయము నిత్యమంచు । వరలుదురింతే ?
యేలనో కాలముఁ దెలియరు
వాలాయము చాటుమయ్య । వసుమతి వేమా ! 1334

కాలముయొక్క ఘనతను గణింపక కూలుట తగదన్నాడు.

ఆ. కాలవశముఁ బట్టి । కర్మజీవుల పిండు
మత్తులగుచును మద । మత్తులైన
మత్తులైన జనుల । మనసేఁటి మనసయా ! ॥వి॥ 1335

మందమతితో నుండరాదని పొందుగా జెప్పెడు.

కం. కాల కాలమ్ములనక
మేలుగ తానొక్కరీతి । మితి మీఱఁగఁ దా
గాలు నెదుర్కొను జ్ఞప్తిని
వాలాయము శివునిగూడి । వర్ధిలు వేమా! 1336

* గణములుతప్పు ; మార్కండేయుని భాతి శివుని మరువక మనసార ధ్యానించి మరణాన్ని గడువ మన్నాడు.

ఆ. కాలి సంకెలయగు । గరిమతోఁదనభార్య
చేతి విఱిచికట్లు । శిశువులెల్ల
సరిపడు చెరసాల । సంసార కూపంబు ॥వి॥ 1337

సంసార బంధనాన్ని చక్కగా నిరూపించాడు శ్లేషలో మనకవి.

ఆ. కాల్చిన మరునాడు । కాగితంబును వ్రాసి
బంధు జనులను వేగ । బిల్వనంపి
పాలంట పోతురు । పాపిష్టి ధగిడీలు ॥వి॥ 1338

ధగిడీలు = చెడ్డవారు; బ్రతికిన నాళ్ళలో భార్యపోరు, చచ్చినచో సోకండాలు.

ఆ. కాలు గాలుఁ గూడి । కాయంబులును గూడి
తోలుఁ దోలుగూడి । దొమ్ము లాడి
జిడ్డు జిడ్డుగూడి । జీవంబు లాడెరా ! ॥వి॥ 1339

స్త్రీపురుష సంయోగాన్ని చిత్రంగా వర్ణించాడు. కామశాస్త్రాన్ని కంఠస్థం చేసియుంటాడు.

ఆ. కాలుఁ గాలుఁబెనచి । కరమునఁ జన్నంటి
చన్ను పాడిచి చాల । జప్పరించి
పాలుద్రాగువాఁడు । పతియౌను, సుతుఁడౌను ॥వి॥ 1340

ఆ. కాలు చేయిలేదు । కంచుకంబు గలదు
కొమ్ములేక యురికి । చిమ్ము వేగ
గరిడిలేక చంపుఁ । గడుఁబెద్ద చోద్యమా ॥వి॥ 1341

కంచుకంబు = రవికె; విచిత్ర విడికథ. స్త్రీస్తనాలను చిత్రాతి చిత్ర విచిత్ర రూపవర్ణనాతిశయముగా వాడెను వేమన.

ఆ. కాలునికినిఁ జిక్కి । కక్కస పడనేల ?
మేలుగాను గురుని । మెప్పు వడసి
ప్రాలు మాలకుండ । పరమార్థ మందరా ! ॥వి॥ 1342

పరమార్థము = తీరనికోరిక; పరమార్థాన్ని ప్రాలుమాలక పట్టుచున్నాడు.

ఆ. కాలుని యందలి । కష్ట కాలమందు
హఠము శాయగలేరు । ఘటము తోడ
జీవుఁ డున్నంతలోఁ । భావజ్ఞుఁగావలె ॥వి॥ 1343

పద్యము లక్షణవిరుద్ధం ; హఠయోగం శరీరసౌష్ఠవము కొరకే.

ఆ. కాలు చేయి వంచి । గాలి నిండఁగఁజేర్చి
నేల వ్రాలి కొన్ని । నిలిచి కొన్ని
యాసన ముఖవిద్య । లభ్యాస విద్యలు ॥వి॥ 1344

అష్టాంగయోగాలు అభ్యాసమునకు అసలు విషయాలను సిసలుగా తెలియ లేవనుట.

తే. కాలు నెదిరింప నేర్చిన । ఘనుని జూడ
మేలు మేలగు మదియందు । మెలఁకువ మరి
యేలుచుండును సుఖమను । నిరవుజేరి
వానిమార్గ మనుసరింప । వలయు వేమ. 1345

ఆ. కాళ్ళుముంద రేరు । కడ కీదగాలేక
ముగ్గు రీతగాండ్రు । మునిఁగినారు
నరుఁడె యీదునన్న । నగుఁబాటు గాదొకో? ॥వి॥ 1346

స్త్రీమాయా ప్రపంచము. దానిని దాటినవారే ధన్యులు. త్రిమూర్తులే తికమకలు పడ్డారు.

ఆ. కాళ్ళు కైలువంచి । కష్టంబునకు నోర్చి
నిలిచి కూర్చునుండి । నిగిడి యుండు
ఆసనముల నెన్న । నధమ యోగములురా! ॥వి॥ 1347

ఆసనములువేసే మోసగాళ్ళను దూసిపెట్టాడు మాయోగి.

ఆ. కాళ్ళు చేతులుండ । గర్మలు చేయక
యోగి ననుచు । సా కదొకటి పన్ని
మౌని యైన ననరె । మాయల మారని! ॥వి॥ 1348

కష్టపడి కర్మలు చేసినవారు ఘనులు. తదన్యులు దంబాలరాయళ్ళుగా చిత్రించాడు కవిచంద్రుఁడు.

ఆ. కావవలయు మగఁడు । కాంత నెల్లప్పుడు
కావ లేనివాఁడు । చావ వలయు
కాపు లేనిదాని । కాపుర మడగరా! ॥వి॥ 1349

పడతులను బహుజాగ్రత్తగా భద్రపరచుకోమన్నాడు.

ఆ. కావవలయు ధనముఁ, । గాంత నెల్లప్పుడు
కావ లేనివాఁడు । చావవలయు
కాపులేని దాని । కాపుర మటుగనా! ॥వి॥ 1350

ఆ. కావిపంచెఁ గట్టి । కడుయోగి వలె నుండి
వెలికి గోర్కెలెల్ల । విడిచిపెట్టి
తొరగి తిరుగువాఁడు । దొంగసన్యాసిరా! ॥వి॥ 1351
నూటికి 99 స్వాములు భోగలాగసులు, చపలచిత్తులుగా నున్నారు.

ఆ. కావిబట్టఁ గట్టి । ఘనయోగివలె నుండి
వెలయు రాత్రిగాఁగ । విడిచిపెట్టి
తొడరి తిరుగువాఁడు । దొరకోలుసన్యాసి ॥వి॥ 1352
దొరకోలు సన్యాసి = పచ్చిమోసగాడు.

ఆ. కావుకావు మనుచు । కరుణకై యేడ్చుచు
శిశువు క్షుత్తుచేతఁ । జిక్కి చొక్కఁ
బాలనిచ్చునట్టి । పడతికిఁ బుణ్యంబు ॥వి॥ 1353
క్షుత్తు = ఆకలి. పాలిచ్చిన పుణ్యము పడతికే దక్కును.

ఆ. కావుకావు మనుచు । కాళ్ళుండి పలికెడి
కాకి కరణిఁ బల్కి । కానరారు
బాపలైనవారు । బ్రహ్మము నెఱుఁగంగ ॥వి॥ 1354
“ కావు ” అనేశబ్దము కాకికూతవలె యుండకూడదు.

ఆ. కాశి కాశియనుచుఁ । గడువేడ్కతోఁ బోదు
రందు గలుగు దేవుఁ । డిందులేఁడె?
యిందు నందుగలఁడు । హృదయంబు లెస్సైన ॥వి॥ 1351
శ్లో॥ కాశ్యాంహి కాశతే కాశీ కాశీ సర్వప్రకాశికా ।
సా కాశీ విదితాయేన తేనప్రాప్తా హి కాశికాః ”
కాశీ శబ్దమునకు ప్రకాశమని యర్థము.

ఆ. కాశికి జనువాని । కర్మమేమనవచ్చుఁ
దిరుగనేల కాళ్ళు । తీఁటగాని
కూలికైవనితలు । కొనినీళ్లు మోయరా! ॥వి॥ 1356

కాళ్ళదట కోసమే కాశీయాత్ర.

ఆ. కాశికి జనెదనని । కాళ్ళు, ముఖము వాచి
తిరిగి కష్టపడిన । తెరువు గలదె?
చచ్చి మరల ముక్తి । సాధింప గలరొకో? ॥వి॥ 1357

చచ్చి ముక్తిని సాధించినవారు జగాన లేరు.

ఆ. కాశికి జనెదనని గంత । గట్టఁగనేల ?ఁ
గాశితీర్థమునకు । గాసియేల ?
దోసకారులకును । దొరుకునా ! యాకాశి ॥వి॥ 1358

కాశికి పోవ మోసాలెన్నో వేస్తారు.

ఆ. కాశికేగుదునని । కడఁగట్టగానేల ?
వాసి తీర్థమునకు । వగవనేల ?
దోషకారికెట్లు । దొరుకురా యాకాశి ! ॥వి॥ 1359

కడగట్ట = కాశీకావిడి గట్ట. "కాశీకెళ్ళినవాడు కాటికి వెళ్ళినవాడు తిరిగి రాడు.

ఆ. కాశికేగుదుమని । కష్టపడగ నేల ?
సిగ్గెరుగరు సుమ్మి । సృష్టివారు
శిల్పిపదము సోకు । శిల వేల్పుకాదొకో! ॥వి॥ 1360

కంసాలి కాలితో త్రొక్కి చిత్రించిన శిల కాశీవిశ్వేశ్వరుఁడు.

ఆ. కాశికేగునట్టి । కష్ట మేమనవచ్చు ?
చేరబోయి విగత । జీవుఁడైన
నెలఁతకు సగమిచ్చి । నేలనీళ్ళు మోదురా! ॥వి॥ 1365

విగతజీవుడు = చచ్చినవాడు. భర్తపుణ్యం సగం భార్యకు వచ్చును.

ఆ. కాశికేగునతఁడు । కడఁగి వేడుకతోడ
నెరవెఱింగి మేను । విడిచెనేని
నెలతకు దనులిల్చి । నెలనీరు మోయడా! ॥వి॥ 1362
తనరూపము తనయుఁడిగా భార్యకర్పించుట తథ్యము గదా!

ఆ. కాశి నీళ్ళు మోసి । కాళ్ళు, మొగము వాచి
యొందు సుఖము లేక । యొండి యొండి
చచ్చి వెనుక ముక్తి । సాధింపగలరోకో! ॥వి॥ 1363
కాశీయాత్ర పేరుతో కడగండ్లుపడి చెడిన బహుగులను నుడివెను.

ఆ. కాశి బోదుననుచు । గడ కట్టగానేల ?
కాశితీర్థమునకు । వగవనేల ?
దోసకారికెట్లు । దొరుకురా యాఁకాశి! ॥వి॥ 1364
"దూరేవి దొమ్మరిగుడిసెలు చేసేవి గంగాస్నానాలు"

ఆ. కాశిబోవువాని । కర్మ మేమని జెప్ప
బాపహేతు వుండి । వచ్చెనేని
మనసు కాశిఁజేరు । మరి ముక్తి లేదురా! ॥వి॥ 1365
చేసే పాపాలన్నీ భస్మాసురునివలె కాశీవెళ్ళి విశ్వేశ్వరుని నెత్తిపై రుద్దాలని దురుద్దేశం.

ఆ. కాశి బోవువాఁడు । కడగి వేడుకతోడ
వెరవెరింగి మేను । విడచె నేని
నెలతకు సగమిచ్చి । నెరి సగమును గోను ॥వి॥ 1366
సీ॥ భక్తయోగ పథన్యాసి వారణాసి
భవ దురిత శాత్రవఖరాసి వారణాసి ;
స్వర్ణదీ తట సంభాసి వారణాసి ;
పావనక్షేత్రములవాసి వారణాసి ॥

ఆ. కాశి బోవువారి । కష్టమింతేగాని
తిరుగనేల కాళ్ళు । తీటగాక
కూల్మికై వనితలు । కొని నీళ్ళు మోయరే? ॥వి॥ 1367
మానసిక కాశీ చూడాలిగాని మాయ కాశీని జూడకూడదు.

ఆ. కాశి, మధుర, కంచి, గయ, ప్రయాగయు, సేతు,
వాసతోడ వాని । నాత్మఁ జూచి
వాసనను దెలియుము । వట్టి వెట్టి విధంబు ! ॥వి॥ 1368

"అయోధ్యా మథురా, మాయా, కాశీ, కంచీ అవంతికాపురీ ద్వారావతీ చైవ సప్తైతే మోక్షదాయకః"

ఆ. కాశియాత్రకు బోయి । గాసి బడుటకునైన
కాయంబులో శివుని । రాజుఁజేసి
కుండలిపై నిలిచి । కండ్లు మూస్తుండనుచు ! ॥వి॥ 1369

నీలోనున్న శివుని నిరతము ధ్యానించ మన్నాడు.

ఆ. కాశియాత్ర కేగి । గంగస్నానముఁజేసి
కష్టపడిరి ముక్తి । గానలేక
యెనుము దిరుగుచుండు । నెనుబోతు వెంబడి ॥వి॥ 1370

యెనుము = గేదె; కాశీపేరుతో కాంతలు తమ కాంతులను విడచి పర కాంతుల వెంటబడతారు.

ఆ. కాశియాత్రఁ జేసి । గాసిఁ జెందగనేల ?
రోసి గుణవికార । రూపమడఁచి
మోసపోక యెఱుక । మూలంబు గనువాఁడు
గాసిఁజెందబోడు । ఘనుఁడు వేమ !

గాసి = కష్టము; గుణత్రయము నరికట్టినవాడే నిజమైన కాశీ దర్శించినవాడు.

ఆ. కాశియాత్రఁజేసి । గాసిపడుటె కాని
మోసమగును । దాన ముక్తి లేదు
పాశ ముడుగఁబూను । ఫలమె యాకాశిరా ! ॥వి॥ 1372

ఆశాపాశము గోయుటయే వారణాసికి బోయిన ఫలము.

క. కాషాయ మమరఁ గట్టియు
వేషములకుఁ జిక్కు బువ్వ । విరివిగ దొరకుం
గోషాయి క్రియలఁ దనువును
బోషించుట ముక్తిగాదు । పూనకు వేమా. 1373

గోషాయీల వేషాలను దూషించేడు.

ఆ. కాషాయ వస్త్రాలు । కాయంబుపై గప్పి
శివయోగుల మటంచు । భవము విడక
భువి తిరుగువారికి । భవమెట్లుపోవురా ! ॥వి॥ 1374
శివయోగుల చిత్తచాంచల్యములను చిత్రాతిచిత్ర విచిత్ర సూత్రముల వాడేడు

క. కించిన్మాత్రమును మదికిఁ
జంచలమును బుట్టనీక । జాగ్రతతో నా
సంచిత మగు గురుభక్తిని
మించిన పరిపూర్ణమూని । మెలఁగుము వేమా ! 1375
స్థిరప్రజ్ఞుని శ్రేష్ఠత్వాన్ని సూచించేడు.

* ఆ. క్రింద పొయ్యేపాలు । కాచి పక్వముగాను
కూటవేసుకయేల । కుడువలేరు ?
తెలివి యెంతటికైన । తేట పరుచుట యెవరో ? ॥వి॥ 1376
* పద్యముతప్పు సందర్భము సరసంగాలేదు.

ఆ. క్రింద యగ్నిజ్వాల । కించిత్తు తగిలిస్తె
పైని యగ్నిజ్వాల । నయన ములను
తెరవ నివ్వకజేసి । తరిమికొట్టును మూల ! ॥వి॥ 1377
హృదయాగ్నిని ప్రజ్వలింపజేస్తే జ్ఞానజ్యోతి ప్రకాశించునని వాడెను.

ఆ. క్రిమియు, మట్టి, యగ్గి, । గృధ్రఁ, కాకంబులుఁ
గుక్క, నక్క లెల్లఁ । గుల్లిపడిన
యొడలి దనఁగఁజూతె । యొడలేలఁ బెంతురా ! ॥వి॥ 1378
సమస్తజీవులు శరీరమును విడచును. దేనికి రక్షణ? గృధ్రము = గ్రద్ద.

ఆ. కిటుకెఱుంగ నీక । కేవల నిష్ఠతో
మౌన ముద్రనుండు । మాయయోగి
ఉన్నదెల్లఁ జెప్పు । నుత్తమయోగిరా ! ॥వి॥ 1379
యోగుల తారతమ్యములను బాగుగా కవిచంద్రుఁడు చెప్పాడు.

గీ. క్షితిని చేలాది కర్మలు । చేతికొలది
చేయ దుర్గంధ మరుగునే । చెలగుగాక

మరియు మల, ముష్టిన్యాయమే । మార్గమనుచు
విశ్వదాభిరామ యిదియు । వినురవేమ. 1380

ఇది వేమనగారిది కాదేమో ?

ఆ. క్షితిని బ్రోదిఁజేసి । కృతమును రక్షించి
గతము నడచి శుద్ధ । గతి వహించి
మృతిని మించి సకల । మతముల మదినుంచి
చెప్పుచుండు రాజ । యోగివేమ ! 1381

రాజయోగము, సాంఖ్యము, తారకము, అమనస్కము చెప్పునది.

ఆ. క్షితిని సతికిఁ దగిన । శృంగారములు గల్గి
విభుని కరుణలేక । వెలయదెంచు
నీదు కృపయులేక । నేర్పులు చెల్లవు ॥వి॥ 1382

పురుషుఁడే పాలతికి సౌభాగ్యవు విభూషణము.

ఆ. క్షితి వెలదికి దగు । శృంగారములు నున్న
విభుని కరుణలేక । వెలయునట్లు
దైవకృపలులేక । తలపులు చెల్లవు ॥వి॥ 1383

స్త్రీకి పతిభక్తి; యోగికి దైవభక్తి శ్రేష్ఠము.

కం. క్షితి శిశుహత్యలు చేసిన
మతిలేకున్నట్టి కుమతి । మనుజులబాధల్
గతులెంతో యెంతో దానికి
మితమును నే జెప్పలేను । మేదిని వేమా ! 1384

“ శిశుహత్యా మహాపాతకం ”

ఆ. కీలకము లడంచి । బైలెఱింగినవాఁడు
సింధుపుత్రి మాయ । జిక్కఁ డతఁడు
గౌరి యంతవాఁడె । జనులకు శక్యమా ! ॥వి॥ 1385

శ్రీమహావిష్ణువే శ్రీలక్ష్మికి లోబడిన నూక్తిని నిటవాడెను.

ఆ. కీలుఁదెలిసి మదిని । గేవలాత్మనుగూడి
భావమందుసొక్కి । బయలుఁదాకి
చేరియుంట ము క్తి । జెందంగఁ బూనరా ! ॥వి॥ 1386

మూలాన్ని తెలసి ము క్తిని చేరుకో మన్నాడు.

కం. క్షీరము నీరము రెండును
చేరికయగు దారిదెలిసి । చిట్టాడవలెన్
తారుకొని శివుని జీవుని
పోరుము పరిపూర్ణ మతిని । పొందిక వేమా ! 1387

" క్షీరనీర న్యాయంగా శివ జీవేశ్వరులు కలవాలి.

ఆ. కుంటి కుక్కకేల ? కుందేటి పరువులు
పిరికిబంటుకేల ? । బిరుదు గొడుగు
ముసలిముండకేల ? । ముసిముసి నగవులు ॥వి॥ 1388

ఎవరు ఎందుకు పనికివచ్చెదరో వారు అదే పనిచేయాలి.

ఆ. కుండంత పాలులో । కాసంత చేపిడిన
గుమగుమా వాసనల్ । గుట్టుపడును
చేపు విడవకపోతె । చెడి పురుగు పట్టురా ! ॥వి॥ 1389

* యతితప్పు ; పెద్దభాండములో కస్తూరివేసిన ఘుమ్మని వాసన వచ్చును.

ఆ. కుండ కుంభ మండ్రు । కొండ పర్వత మండ్రు
యుప్పు లవణమండ్రు । యొకటిగాదె !
భాషలింతె వేరు । పరతత్వ మొక్కటి ॥వి॥ 1390

పరతత్త్వము గూర్చి ఎవ్వరేమనినా దానికే చెందును.

ఆ. కుండ చిల్లిపడిన । గుడ్డ దోపఁగవచ్చు
బనికి వీలుపడఁగ । బాగుగాను
గూలఁబడిన కుండ । కుదురుట యరుదయా ! ॥వి॥ 1391

పేదసంసారాన్ని ప్రోదిచేసే విధానం నేర్పేడు.

ఆ. కుండ పగిలెనేని । క్రొ_త్తది గొనవచ్చు
భూ తలంబునందు । బొందుగాను
గూలఁబడిన నరుఁడు । కుదురుట యరుదయా! ॥వి॥ 1392

కూలబడినవాడు = చెడినవాడు; నీతి మాలినవానిని రీతిగా మార్చలేము.

క. కుండలి యోగముఁ దెలిసిన
బండాలముయోగికేల? । బాలికఁబొందం
దండిగ నాతను వొందను
మెండుగ నొక ముక్తికాంత । మెలఁగుర వేమా! 1393

"సర్వేషాం యోగతంత్రాణం తథాధారోహి కుండలి" అని కుండలిగురించి మెండుగా జెప్పెను.

ఆ. కుక్కకు సలిగలిగి । కూతలెల్లనుమఱచి
నక్కరీతిగనుండి । నెగసిపడెను
ఎగసి పడినంతట్లో । నాదంబు బుట్టురా! ॥వి॥ 1394

మనసునకు వికారము గలిగిన మార్గముఁ దప్పును.

ఆ. కుక్క గఱచెనేని । గూయసీయక పట్టి
ప్రక్క విఱఁగదన్ని । పండఁబెట్టి
నిమ్మకాయఁ దెచ్చి । నెత్తినరుద్దినఁ
గుక్కవిషము దిగునుఁ । గుదురు వేమ. 1395

ఇది ఆయుర్వేదము గురించి వ్రాసినది.

ఆ. కుక్క గోవు కాదు । కుందేలు పులికాదు
దోమ గజముగాదు । దొడ్డదైన
లోభి దాతగాడు । లోకంబులోపల ॥వి॥ 1396

గజము = ఏనుగు; నీతులు పూతగా నిండించాడీ పద్యాన్ని.

ఆ. కుక్కఁ జూచి సామి । గొలుచుట నేర్చుకో
కాకిఁ జూచి హితుల । కలయికఁ గను
గాడిదెఁ గని యోర్పుఁ । గడువడిఁ దెలియరా! ॥వి॥ 1397

కుక్క విశ్వాసము, కాకి కలుపుగోలతనము, గాడిద ఓర్పుఁజూచి మానవులను అట్లు ప్రవర్తించమన్నాడు యోగి.

ఆ. కుక్క తోకఁదెచ్చి । క్రోవినిఁ బెట్టిన
క్రోవి ఛాయనుండుఁ । గొంతవరకు
క్రోవి తీసిచూడ । గొడవలివలె నుండు ॥వి॥ 1398

క్రోవి = గొట్టము; సహజానికి మార్పులేదు.

ఆ. కుక్కతోకఁ దెచ్చి । గొట్టంబుఁజేర్చినఁ
గ్రోవిచెంతనుండు । గొంతతడవు
ఎంతచెప్పఁ జెడుగు । పతంబుమానునా? ॥వి॥ 1399

నీచునకు బుద్ధిగరుప నీలకంఠుని తరము గాదు.

* ఆ. కుక్కతోలుఁదెచ్చి । యెరుపుబొమ్మనుచేసి
యాడునట్లు చేసి । యట్టె వేసె
తన్నుఁద్రిప్పువానిఁ । దానేల కానడో! ॥వి॥ 1400

* యతి తప్పు; "తను పెను బాము బట్టుకొన తద్వదనంబుననుండి యీగలన్ గని తిననెంచు కప్పగతి కాలభుజంగము తన్నుమ్రింగ గా ... (చూడుడు వా)

ఆ. కుక్కఁ దినెడివాఁడు । గురులింగ జంగంబు
పందిఁ దినెడివాఁడు । పరమయోగి
యేనుగుఁ దినువాడి । కెంత సుజ్ఞానియో! ॥వి॥ 1401

కుక్క = మనస్సు, పంది = అహంకారము; ఏనుగు = మదము; నిగ్రహించిన యోగిక బ్రహ్మానుభవి

ఆ. కుక్క నందలమునఁ । గూర్చుండఁబెట్టిన
నొక్క మనసుతోడ । నుండఁబోదు
ఆత్మ నిలుపలేని । యజ్ఞానియును నట్టె ॥వి॥ 1402

నీచుని ఉన్నతస్థానములో కూర్చోబెట్టిననూ లాభము లేదు.

ఆ. కుక్కనాలుకకోసి । కూరవండుకు తింటె
* నక్కతానైపోను । నిమిషమునను
నక్కతానై వెనుక । నడవిఁజేరుట యరుదు ॥వి 1403

* యతి తప్పు; కోపము పాపమునకు మూలము.

ఆ. కుక్కను నట్టింటఁ । గూర్చుండ బెట్టితే
కుదురుగా మనసుంచి । కూలఁబడదు
నప్రయోజకుఁడు యీ । భువి నెట్టులుండురా? ॥వి॥ 1404

భావము గొప్పదే ; పద్యము పాడైయుంది కవిచక్రవర్తిది కాదేమో ?

ఆ. కుక్క మనుజుకంటె । గుణమెంత కలిగిన
మనుజు గుణము । సాటి మర్మమేది ?
కుక్కకంటెఁ జెడుగుఁ । గుణహీనుఁడగువాఁడు ॥వి॥ 1405

గుణహీనుడగువాడు కుక్కకు పోలడు.

ఆ. కుక్క యేకతంబుఁ । గొక్కెర ధ్యానంబు
గాడ్దె రాగమెన్నఁ । గప్ప మునుక
ఆత్మనెఱుఁగు భావ । మదియేలఁ జేయరో ! ॥వి॥ 1406

కుక్క నిశ్చలత, కొంగ జపము; కప్ప నీటిలో మునుక యిట్లే చపలుల కార్యము లుండును.

ఆ. కుక్క యే మెఱుంగు । గురులింగ జంగంబుఁ
బిక్క యొడిసిపట్టి । పీకుఁగాక
సంతపాక తొత్తు । సన్యాసి నెఱుగునా ? ॥వి॥ 1407

పరమనీచులు భక్తుల, పండితుల ప్రాభవాన్ని పరికించలేరు.

ఆ. కుక్క యేమెఱుంగు । గురులింగదేవుని
నక్క యేమెఱుంగు । నొక్కప్రొద్దు
మూర్ఖుఁ డేమెఱుంగు । మోక్షంబుత్రోవను ! ॥వి॥ 1408

తక్కువ బుద్ధివారు తారతమ్యాన్ని గమనించలేరు.

క. కుక్కలనగఁ బసిపాపలు
నక్కల బూజించినారు । నాకేశునకై
చొక్కముగ జీవహత్యలు
మిక్కుటముగఁ జేసెదమని । మించిరి వేమా! 1409

అసందర్భముగా అగతాయులు వ్రాసినారేమో యిపద్యాన్ని.

ఆ. కుక్కుట మననంబు । కొక్కెర ధ్యానంబు
యశ్శుల నోసఁట నోనరు । నట్లుర్రాసెఁ
దొల్లి జేసినట్టి । దోషంబు తగిలెనో! ॥వి॥ 1410

కుక్కుట మననము = కోడివ్రతము. తనధన్యత్వాన్ని తానే దిద్దుకోవాలి

ఆ. కుక్కుట వ్రతంబు । కొక్కెరధ్యానంబు
ఖరము ధూళిపూఁత । కప్పమునుక
చిత్తశుద్ధిలేక । చేయు జపముసాటి ॥వి॥ 1411

నీచుల గుణాల నెన్నో వ్రాశాడు.

క. కుటిలమగు ఋషి కులంబునఁ
బటుతరముగఁ బుట్టినట్టి । బాపనవార
లుక్కుటిలంబుఁ గానలేక యె
యటు బ్రహ్మకులంబనంగ । నమరునె? వేమా! 1412

కుటిలము = కపటము; బ్రాహ్మణుల కపటపు విషయాలను చెప్పాడు;

ఆ. కుడువఁ గూడులేక । కూడఁబెట్టగ లేక
విడువ ముడువలేక । గడవలేక
నడవసాఁగియున్న । నడపీను గంమరు! ॥వి॥ 1423

గడవలేని మగనిని గడు గాయమైన పడతి భావించేవిధానము.
నడపీనుగు = జీవచ్ఛవము.

క. కుదురుగ గుద గుహ్యంబుల
మృదునాభిని హృదయరంగ । మేళనపరుడై
పదిలముగ బ్రహ్మరంధ్రము
బొదలఁగ మదినెఱుఁగువాఁడె । పూర్ణుఁడు వేమా. 1414

షట్చక్రములు :— 1 మూలాధారచక్రము :— గుదస్థానమందు నాలుగు రేకులు గలిగి యుండును.

ఆరేకులలో " వ, శ, ష, స " అక్షరము లుండును. అపరంజి కాంతిభూమికి నివాసము. యీ చక్రమున గణపతికి ఆరునూర్ల జపము జరుఁగును.

2. స్వాధిష్ఠచక్రము :— ఇది మర్మస్థానమందు ఆరురేకులు గలిగి " బ, భ, మ, య, ర, ల " అను అక్షరములతోఁగూడి యుండును. పగడ కాంతి జలములకు స్థానము. ఇందు బ్రహ్మకు ఆరువేల జపమంత్రములు జరుగును.

3. మణిపూరకచక్రము :— ఇది నాభియందు పదిదళములతోఁగూడి "డ, ఢ, ణ, త, థ. ద, ధ, న, ప, ఫ," యను వర్ణములు గలిగి యుండును. పసుపుకాంతి అగ్నికి స్థానమైనది. ఇందు విష్ణువునకు ఆరువేలమార్లు జపమంత్రము జరుగును.

4. అనాహత చక్రము :— ఇది రొమ్మునందు పన్నెండు రేకులుగలిగి "క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ" అను అక్షరములు గలిగియుండును. స్ఫటికకాంతి గాలికి స్థానము ఇందు రుద్రునకు అజప మంత్రము ఆరువేల మారులు జరుగును.

5. విశుద్ధచక్రము :— ఇది కంఠమందు పదునారు రేకులతోఁగూడి "అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః" పదునార క్షరములు గలిగి యుండును. ఇంద్రనీలకాంతి ఆకాశమునకు స్థానమైనది. ఇందు జీవాత్మునకు క్షేత్రజ్ఞునకు వేయిమార్లు అజపమంత్రము జరుగుచుండును.

6. ఆజ్ఞేయచక్రము :— ఇది కనుబొమలమధ్య రెండుదళములుగలిగి "హం, క్షం" అను రెండక్షరములతోఁ గూడియుండును. మాణిక్యకాంతి అంతఃకరణము నకు స్థానమైనది. ఇందు పరబ్రహ్మమునకు వేయిమార్లు అజపమంత్రము జరుగును.

7. సహస్రారచక్రము :— దహనాకాశస్థానమందు వేయిదళములుగలిగి ప్రణవాక్షరముతోఁ ప్రకాశించుచుండును. కోటిసూర్యులకాంతి గలిగియుండును. ఇది బుద్ధికి లయస్థానమైనది. ఇందు శ్రీగురువర్యునకు వేయిమార్లు అజపమంత్రముజరుగును.

## విశేషాంశములు

యీచక్రములను షడాధారములందురు. ఇందు యిరువదొక్క—వెయ్యి ఆరు వందలు మార్లు అజపమంత్రము షడ్దేవతలకు జరుగును. అజపమంత్రమనఁగా జపించ కయే జపించుట యని యర్థము. మూలాధారము మొదలు కపాలమువరకూ వీణా దండమువలె బ్రహ్మదండి మేరువు అనుపేర్లు గల వెన్నెముక యున్నది. దానినంటి యీచక్రములున్నవి.

ఆ. కుమ్మరవానికి జ్ఞానము
నెమ్మదిగాఁదెల్పవలదు । నిరసించుసుమీ
బమ్మను నేనన్నప్పుడు
భ్రమ్మరియై చెడునుఁగాక । తిరుఁగదు వేమా! 1415

పద్యము పేలవంగా ఉంది.

ఆ. కులము గలుగువారు । గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱ । వీగువారు
పసిడిగల్గువాని । బానిసెకొడుకులు ॥వి॥ 1416

ఎంతగొప్ప తనమున్నా హిరణ్యమునకు తలొగ్గువారే!

ఆ. కులముచేత బట్టి । గుంఫించనేటికి ?
పాదు లున్నచోట । బ్రబలు విత్తు
లేటికులములింక । నెక్కడి ద్విజుఁడయా ! ॥వి॥ 1417

విజ్ఞానమున్నవాడే వినుతింపఁబడును. గుంఫించి = ఎగిరి.

ఆ. కులము నీరుచేసి । గురువును వధియింప
బోసఁగ నేనుఁగంత । బొంకు బొంకె ।
బేరు ధర్మరాజు । పెనువేఁపవిత్తయా ! ॥వి॥ 1418

శ్రీకృష్ణుఁడు చెప్పించినమాట. (భారతగాథ)

ఆ. కులములేనివాఁడు । కలిమిచే వెలయును
కలిమిలేని వాని । కులము దిగును
కులముకన్న నెన్న । గలిమిప్రధానంబు ! ॥వి॥ 1419

కలిమి సర్వత్రా కల కలలాడును. యీ నగ్నసత్యాన్ని నాణెంగా వాడెను

ఆ. కులములోన నొకఁడు । గుణహీనుఁ డుండినఁ
గులము చెడును । వాని గుణమువలన
నెలమిఁ జెఱకునందు । వెన్ను పుట్టినరీతి ॥వి॥ 1420

ఖ్యాతి అపఖ్యాతులకు కారకుడొక్కడే.

ఆ. కులములో నొకఁడు । గుణవంతుఁ డుండినఁ
గులము వెలయు వాని । గుణముచేత
వెలయు వనములోన । మలయజంబున్నట్లు ॥వి॥ 1421

మలయజము = మంచిగంధపుచెట్టు వంశ ప్రదీపకుని వలననే వంశం ఆచంద్రార్కము నిలచును.

ఆ. కులము వలనఁ గొంత । బలము వలనఁ గొంత
కలిమివలన గొంత । గర్వమొదవ
అంకు చదువు జదివి । అంకునఁజెడుదురు ! ॥వి॥ 1422

అంకుచదువు = పనికిమాలిన విద్య. "యౌవనే ధనసంపత్తి, ప్రభుత్వమవివేకితా యేకైక మప్య నర్థాయ కింవచతుష్టయం"

ఆ. కులము హెచ్చు తగ్గు । గొడవలు పనిలేదు
సానుజాతమయ్యె । సకల కులము
హెచ్చుతగ్గుమాట । లెక్లైయుంగఁగ వచ్చు ? ॥వి॥ 1423

సానుజాతము = సమిష్టి.

"సమస్తజీవానాం సమదృష్టి చేతః"

ఆ. కులుకు గుబ్బఁ జూపి । గొబ్బున వలపించి
చేతికాసులెల్లఁ । జేరఁదీయు
నతను చేతి కత్తు । లమరంగఁ గాంతలు ! ॥వి॥ 1424

అతనుఁడు = మన్మథుఁడు ; అంగనలందాల జూపి ఎంతవానికైనా భంగము చేతురు.

ఆ. కులుకుఁ జనులఁజూపి । గొబ్బున మరిగించి
చేతికాసులెల్లఁ । జేరదీసి
యఁలతిఁ జేసికొందు । రిల వారకాంతలు ॥వి॥ 1425

అలతి = తేలిక ; ఇంతులకు సామంతులుగూడా పాదాక్రాంతులు కాగల రని స్వానుభవముగా మహాకవి చెప్పెను.

ఆ. కుళ్లు బోతు నొద్ద । గూఢిమాట్లాలాడిన
గొప్పమర్మములనుఁ । జెప్పరాదు
పేరుతీరుఁ దెల్పు । నూరెల్ల ముట్టించు ॥వి॥ 1426

అనూయాపరులకు అమోఘవిషయాలు చెప్పుట తగదని వేమనసూక్తి.

ఆ. క్షుత్తు దప్పి నిద్ర । క్షుభితములై యుండు
రిత్త లోకమాయ । రీతిగాంచె ?
సత్తు పూర్ణసుప్తి । సాధింప వలెనయా ! ॥వి॥ 1427

ఆకలి దప్పులుమాని పూర్ణమును అందుకొనుటయే అమోఘమార్గం.

ఆ. కూట పరవశంబు । గోర్కెలు లేకుండ
నాటవలెను బుద్ధి । నయముగాను
చోటు కనని వెలుఁగు । ( జొచ్చుటే మోక్షంబు ॥వి॥ 1428

సాహస్రార మందుండే వెలుఁగును తిలకించుటయే దివ్యమార్గము.

క. కూటము చిన్మయ రూపము
పాటింపను దరముగాదు । పదరక మదిలోఁ
జోటెఱిఁగి నిండినంతట
వాటంబగు పూర్ణమదియె । వశమగు వేమా! 1429

జీవాత్మ పరమాత్మల యొక్క కూడికయే కూటము.

ఆ. కూటవాసి యగుచు । గుణములఁ బచరించి
నీఁట నీడవలెను । నిలిచియుండు
నుదక ఘటముఖముల । నుపరిఁ జూచినఁగాని
సూర్యుఁడొకఁడుగాఁడె । చూడు వేమ. 1430

కూటభాగముఁ దెలసి నేత్రాంతర దృష్టి నిల్పి నిఖిలేశ్వరస్థానము జేరును.

ఆ. కూఁటికి గతిలేక । కూర్చున్న వానికి
నాడుదాని మీఁద । నాసగలదె
అన్నమదముచేత । నన్నిమదంబులౌ ॥వి॥ 1431

"అన్నమయా జీవమయా"

ఆ. కూఁటికి నెడఁబాసి । కూర్చున్న మనుజుఁడు
వెలఁదులఁ గనుఁగొన్న । వెతలఁ జిక్కుఁ
జెలఁగి యగ్నిఁ జూచు । శలభంబు చాడ్పున ॥వి॥ 1432

శలభము = మిడుత. అంద రాని పండ్లకు జ్జులు చాచరాదు.

ఉ. కూఁటికి లేనివానివలెఁ । గోపములేకయు నెల్లతావుల
న్మాటకు మాటకుం దగిన । మంచి వినీతులు పద్య పద్ధతి
న్నాటిగఁ బూని చెప్పుచును । ధారుణిలో శివరూపధారియై
మాటుగ నున్న యోగివి స । మానులెవ్వరు నీకు వేమనా!

సకల శాస్త్రపారంగతుఁడై స్వానుభవముతో స్వశక్తిని స్వ జనులకు వినిపించాడు వేమన.

ఆ. కూడదేమిసేఁసె? । కులమేమిచేసెను?
భూమియేమిచేసె? బొంది కట్టె
నరుఁడు పడెడు పాట్లు । నగుబాట్లు చూడఁగా! ॥వి॥ 1434

సర్వమూ జగన్నాథము,

తే. కూడఁబెట్టిన వారిని । క్రుంగఁజేసి
తోడువచ్చిన వారిని । దూరుఁబెట్టి
తిండిపెట్టినవారిని । దిట్టి, కొట్టి
గట్టివాఁ డను వాఁడును । గాడ్దె వేమ! 1435

"కృతఘ్నునియొక్క లక్షణాలు కూర్చిపేర్చి చెప్పాడు.

ఆ. కూడి పరవశంపు । కోర్కెలులేకుండ
నాటవలెను బుద్ధి । నయముగాను
చోటుఁ గనని వెలుగుఁ । జొచ్చుటే మోక్షము ॥వి॥ 1436

"లోకంబులు లోకేశులు । లోకస్థులు తెగిన తుది నీలోకంబగుపెం
జీకటికవ్వల నెవ్వం । డే కాకృతి వెలుగు నతని నే సేవింతున్. (భాగ)

ఆ. కూడుఁ గుడిచి లెస్స । కూర్చున్నవాడైన
నాడుదానిఁ గన్న । నట్టె తగులు
నన్నసార మొదలి । కతి మదం బిడు సుమీ! ॥వి॥ 1437

"వయసు కులుకా బాతు కులుకా!"

ఆ. కూడుఁ జీరఁ బొసి । గుళ్ళ పంచలఁ బడు
నట్లు వ్రాసె బ్రహ్మ । యతుల నుదుఁట
దోయజాక్షిఁ జేర । దోషంబు లంటురా! ॥వి॥ 1438

అందీపొందని భావాలతో కొందరు వేమన పద్యాలను తారుమారుచేశారు.

ఆ. కూడుఁ బెట్టుకున్నఁ । గుక్షిలో జఠరాగ్ని
భక్షణంబుఁ జేయు । గుక్షి మలముఁ
గూడు విడచి మలము । గుడుచురా యుపవాసి ॥వి॥ 1439

యుపవాసవ్రతాన్ని యీసడించాడు యోగి.

ఆ. కూడు విడిచియు శత । కోటి పడగలెత్తి
మాటుపఱచి దాని । మంటఁగలిపి
కాటికేగువేళ । గూటికి మోసమై
దాటిపోదురు జము । దరికి వేమ. 1440

కోటికి పడగెత్తుట నాటినించి నేటికీ ఉన్నదే! యిది సంప్రదాయక విజ్ఞానము

ఆ. కూర యుడుక వెనుకఁ । గూడునా కసవేర
నెఱుక గలిగి మునుపె । యేరవలయు
స్థలము తప్ప వెనుక । ధర్మంబు పుట్టునా ! ॥వి॥ 1441
"చేతులు కాలిన వెనుక ఆకులు పట్టుట"

ఆ. కూరలేని తిండి । కుక్కతిండనిపించు
మాఱులేని తిండి । మాలతిండి
ధారలేని తిండి । దయ్యపుఁ దిండిరా ! ॥వి॥ 1442
ప్రాచీనాచార భోజన విధానాన్ని పూర్తిగా వివరించాడు కవి.

ఆ. కూర్మి ద్రుపదపుత్రి । కొప్పుఁ బట్టీడ్చిన
సింహబలుని చావుఁ । జెప్పఁదరమె
మోహభ్రమను జిక్కి । మొనగాఁడు నీల్గడా ! ॥వి॥ 1443
ఇంతుల భ్రాంతిని యెంతటివాడైనా చిక్కి అంతమవుతాడు.

ఆ. కూల కూళ్ళు మేయు । గుణమంత చెడనాడు
నెట్టివారు మెచ్చు । రట్టివానిఁ
గొయ్య దూలమునకుఁ । గుదురునా జ్ఞానము ? ॥వి॥ 1444
పనికిమాలిన తిండి తినువాడే భ్రష్టుడు.

ఆ. కూలి నాలిఁజేసి । గుల్లాపుఁ బనిజేసి
తెచ్చిపెట్ట నాలు । మెచ్చుచుండు
లేమిఁ జిక్కు విభుని । వేమాఱుఁ దిట్టును ॥వి॥ 1445
"గడనజేయు మగని కౌగలించును నాతి । గడనలేకయున్న కాలఁదన్ను"

ఆ. కూళఁ గూళ మెచ్చు । గుణవంతు విడనాడి
యెట్టివారు మెత్తు । రట్టివారి
మ్రాను దూలములకు । జ్ఞానంబుఁ దెల్పునా ! ॥వి॥ 1446
జోడీకి జోడీయే !

ఆ. కూళఁ గూళ మెచ్చు । గుణవంతుఁ జెడనాడు
నట్టి హీను మెచ్చు । రెట్టివారు
మ్రాను దూలమునకు । జ్ఞానంబు దెలియునా ! ॥వి॥ 1447
మ్రానుదూలము = కఱ్ఱమొద్దు.

ఆ. కూళతోత్తు పొందు । గుల్లాముకే కాక
సజ్జనునికిగాదు । సమ్మతంబు
పేడ దిన్న పురుగు । బెల్లమే మెఱుఁగురా! ॥వి॥ 1448

గులాము = బానిస. అయోగ్యులకు యోగ్యవస్తువు లక్కరలేదు.

ఆ. కృష్ణ పర్వమందుఁ । గృత్తిక లైదుండుఁ
గృత్తు లైదు పట్టి । కృష్ణ మ్రింగె
వెలయు కృష్ణు లైదు । వేమన మ్రింగెరా! ॥వి॥ 1449

వేదసారాన్ని వేమన్న వెన్నముద్దలాగ చేశాడు.

ఆ. కేవలాంతరాత్మ । జీవుండు నిజమని
వట్టి వాదులాడు । నట్టివారిఁ
ద్రొక్కిపట్టి నాల్క తుదఁ । గోయవలయురా! ॥వి॥ 1450

అంతరాత్మయే నిజమని అబద్దాలాడు వారి నాల్కలుకోయమన్నాడు వేమన.

క. క్షేత్రంబున క్షేత్రజ్ఞుని
గాత్రంబునుఁ జూచి నియతిఁ । గ నలక్ష్యంబున్
రాత్రింబవలును నొకటిగ
సూత్రించిన గలుఁగు ముక్తి । సులభము వేమా! 1451

క్షేత్రము = శరీరము; క్షేత్రజ్ఞుడు = శరీరవాసి; గాత్రము = శరీరము; తెలివి మరపులలో బ్రహ్మను వీక్షించమన్నాడు.

ఆ. కైక పుట్టి చెఱచెఁ । గాకుస్థు పట్టంబు
సీతపుట్టి లంకఁ । జెఱిచె మున్ను
చెప్పరాదుగాని । చిత్రాంగి చెఱచెరా! ॥వి॥ 1452

" స్త్రీణాం ద్విగుణమాహారః బుద్ధిశ్చాపి చతుర్గుణాః సాహసం షడ్గుణంచైవ కామ మష్టగుణంభవేత్ "

ఆ. కైకపుట్టి చెఱిచెఁ । గా రాము పట్టంబు
సీతపుట్టి లంక । చెఱిచెఁ గాదె
కౌరవులను జెఱిచె । గా ద్రౌపదియుఁ బుట్టి ॥వి॥ 1453

స్త్రీలు నాశన కారులని సూచించెను.

తే. కైకవల్లను రాముఁడు । కానకేగె
సీతఁ గోల్పోయి దశకంఠు । నే తలఁడుంచి
తిరిగి పట్టాభిషిక్తుఁడై । తేజరిల్లె
రామకథ కెల్లఁ గైక కా । రణము వేమ. 1454

కైక కల్పనలచే రామాయణ మంత రక్తిగా ఉంది.

ఆ. కైపు మీఱు వేళఁ । గడను జేరఁగ రారు
అనువుఁదప్పి మాట । లాడరాదు
సమయ మెఱుఁగనతఁడు । సరసుండు గాఁడయా ! ॥వి॥ 1455

కైపు = మత్తు; సమయానుకూల సరసత చక్కగా ఉండును.

ఆ. కైపు వస్తువులను । గాంక్షించి సేవింపఁ
* గాని పనులొనర్చు । మేలెఱుఁగక
అట్టివాను వారి నధము । లందురు సుమీ ! ॥వి॥ 1456

* యతిభంగము; మత్తుని సేవించు వాని చిత్తము ఉత్తలపడుతుంది.

కం. కైలాసము వైకుంఠము
బైలై యుండంగ ప్రకృతి । భావంబుగ-మీ
రే లోకమంచు వెదకిన
కైలాసము గనగ లేరు । క్రమముగఁ వేమా ! 1457

శరీరమునందే అన్ని లోకములవలోకించినవాడే ఆత్మానందుడు.

ఆ. కొంకణంబు సేరఁ । గుక్క సింహంబుగాదు
కాశి కేగఁ బంది । గజముగాదు
వేఱుజాతివాఁడు । విప్రుఁడుగాఁడయా ! ॥వి॥ 1458

కొంకణంబు = పుణ్యక్షేత్రము; స్థానము మారిన మాత్రమున ఆధిక్యత రాదు.

కం. కొంచెపు నరసంగాతం
బంచితముగ హాని దెచ్చు । నది యెట్లనఁగా
నించుక నల్లియె నొక్కిన
మంచమునకుఁ జేటువచ్చు । మహిలో వేమా ! 1459

సుమతి శతకపద్యమును కుమతులెవరో వేమనపద్యాల్లో చేర్చారు.

ఆ. కొండదండి మామ । కొండ కూతురె యాలు
గొండమేటి విల్లు । గొండయిల్లు
గొండవంటి దొరయు । గండయి పోయెనా ! ॥వి॥ 1460

కొండదండి = పర్వతరాజు (హిమవంతుఁడు); కొండకూతురు = పార్వతి; ఆలు = భార్య; కొండమేటి = పర్వతశ్రేష్ఠుఁడు (మేరువు); కొండయిల్లు = కైలాసగిరి; కొండవంటిదొర = మహాగొప్పరాజు ; గండు = ఘనము.

ఆ. కొండ కుధరమన్నఁ । గుండ భాండం బన్న
నుప్పు లవణమన్న । నొక్కటె కద
భాషలెన్నియైనఁ । బరతత్త్వ మొక్కటే ॥వి॥ 1461

భాషల మార్పేగాని భావమొకటే.

ఆ. కొండ గుహల నున్నఁ । గోవెల లందున్న
మెండుగాను బూది । మెత్తియున్న
దుష్ట మానవులకు । దుర్బుద్ధి మానునా ! ॥వి॥ 1462

ఎన్ని చేసినా కుక్కతోక వంకరే !

ఆ. కొండమీఁద జ్యోతి । కొమరు దీపింపఁగా
నిండి పూర్ణముండు । నిబిడముగను
అండఁ జేరకున్న । నంటఁగ రాదయా ! ॥వి॥ 1463

నిబిడము = దట్టము; దేనినైనా సన్నిహితత్వం చేసుకొంటేనే సారమబ్బుతుందని సర్వం సహాసర్వజ్ఞుఁడు యోగివాక్కు.

ఆ. కొండముచ్చు పెండ్లి । కోఁతి పేరంటాలు
మొండివాని హితుఁడు । బండవాఁడు
రండరాజునకును । గొండఁడు దళవాయి ! ॥వి॥ 1464

“ అబద్ధము పెండ్లికి ముడ్డివాయిద్యము ” లాగ యీపద్యము పరిహాసంగానే యున్నది.

ఆ. కొండరాళ్లు దెచ్చి । కోరికఁ గట్టిన
గుళ్ళలోనఁ దిరిగి । కుళ్ళనేల
బాయరాని శివుఁడు । ప్రాణామై యుండంగ ! ॥వి॥ 4465

ఆత్మలింగాన్ని హత్తుకొన్నవాడే ఆనందపరుఁడు.

ఆ. కొండరాళ్ల వెంట । గోడు కుడువనేల ?
వట్టి రాళ్ళఁ గూర్చి । వనఁట లేల ?
బాయరాని శివుఁడు । ప్రాణమే యగుఁగదా ! ॥వి॥ 1466

వనట = బాధ; క్షేమంకరుఁడే శివుడు.

ఆ. కొండ రేఁడు మామ । కొండకూతురు యాలు
కొండయిల్లు పసిడి । కొండవిల్లు
కొండ వంటి దొరవు । కుంటెన నడతురా ! ॥వి॥ 1467

కుంటెన = అడ్డంగా; ఉత్కృష్టమైన రేడు ఉఛ్ఛిష్టంగా నడుస్తాడా!

ఆ. కొండలెల్ల దిరిఁగి । తిండి గొన గపిసేన
దండుచేసి గొల్చె । ధరణి విభుఁడు
లంకనేలె నొకఁడు । లక్ష్మీ కటాక్షాన ! ॥వి॥ 1468

" సీ॥ కోరి మండను పెట్టుకొనువాడు యొకృడు
వలపుకాడై పొందు వాడొకండు " (వరవిక్రయం)

ఆ. కొండలెల్ల మోయు । మెండైన కపులను
దండుఁ జేసె రామ । ధరణి విభుఁడు
లంక ముట్టడించి । లావరులను జంపె ! ॥వి॥ 1469

" క్రియా సిద్ధిసత్వే భవతి నోపకరణే "

ఆ. కొండెకాఁడు చావఁ । గొంప వాకిటికిని
వచ్చి పోదు రింత । వగపు లేక
దూడ వగచునె భువిఁ । దోడేలు చచ్చిన ! ॥వి॥ 1470

దుర్మార్గులు చస్తే దుఃఖించేవా రుండరు.

ఆ. కొండెగాఁడు చావఁ । గొంత దనుకఁ బోవు
వంతుకింతె కాని । వగపు లేదు
కొంకనక్క చావ । గొత్తె లేమిటి కేడ్చు ? ॥వి॥ 1471

వేమన లోకానుభవమును నూటిగా చెప్పాడు.

ఆ. కొంత నల్లగ నుండు । కొంత యెఱ్ఱగ నుండు
కొంత తెల్లగ నుండు । కువలయమున
నొక్కరీతిగ నుండ । దాగి కారణంబేమి? ॥వి॥ 1472

నల్పు తామసము; ఎఱుపు రాజసము; తెలుపు సాత్త్వికము.

ఆ. కొంపలోన నున్న । కోర్కెలు భేదించి
పరగ హృదయమట్టె । పదిల పఱచి
గృహము నిల్పువాఁడు । బహుతత్త్వవేదిరా! ॥వి॥ 1473

కొంప = శరీరము. సత్ప్రవర్తనచే గాత్రాన్ని చక్కబరచమని రాజయోగి హితోపదేశం.

ఆ. కొంపలోన మఱుఁగు । కోకలోన మఱుఁగు
కన్నతల్లి మఱుఁగు । కడుపు మఱుఁగు
ఇన్ని మఱుఁగులందు । నీశుండు మరుఁగురా! ॥వి॥ 1474

ఉన్నదున్నట్టుగా తిన్నగా వ్రాయుటలో అసమానుఁడు వేమన.

ఆ. కొక్కు ధ్యానము మఱి । కుక్క యేకాంతంబుఁ
బిల్లి గురగురనుచు । బెనుచు స్మరణ?
ఆత్మెఱుఁగని జపము । లవి యేమిలెక్కరా! ॥వి॥ 1475

"ఆత్మనాత్మవివేకులే నిజముగా నత్యంతసౌఖ్యోన్నతుల్"

ఆ. కొట్టిఁ దిట్టనైన । గట్టి మాటాడిన
నూరుకున్న యట్టి । యోర్మికాఁడు
వాఁడె పరమశివుఁడు । వర్ణింప శక్యమా! ॥వి॥ 1476

ఓర్పు నేర్పు కూర్పులకు తావుడు.

కం. కొట్టినఁ దిట్టిన గట్టిగఁ
గట్టి బిగించినను గాని । కరకరి చేయం
గట్టడి పని యనకుదీండును
దిట్టముగ శివునిఁ దలచు । తీర్పరి వేమా! 1477

ఏమయినా శివుని విడువకుండుటయే శ్రేయస్కరము.

ఆ. కొట్టినా కొట్టక । తిట్టినా తిట్టక
కోరికినా కోరకక । కూలఁబడక
తాను తానై యుండు । తారక వరయోగి ॥వి॥ 1478
దూషణ, భూషణ, తిరస్కారములను సంతోషముతో జూచేవాడే రాజయోగి.

ఆ. కొడుకు గలిగెనేని । గునిసి యాడఁగ బోరు
కూతు రొకతె పుట్టు । గునియుచుండ్రు
తనకుఁ గొమరుఁడైనఁ । దనువెల్ల దోఁచునో! ॥వి॥ 1479
ఇది సామాన్యుల సహజము.

ఆ. కొడుకును బ్రతికించు । కొన లేదు శంభుండు
కొడుకును బ్రతికించు । కొనఁడు శౌరి
దేవతాంతరములు । దీననె కనుపించె ॥వి॥ 1480
శివుని కొడుకెవరో తెలియలేదు; మన్మధుఁడు యీశ్వరునిచే చనిపోయెను.

ఆ. కొడుకును వరియింపఁ । గోరి వచ్చినదానిఁ
దండ్రి పెండ్లియాడ । ధర్మమగునె ?
తప్పని తెలియకదీఁ । దాఁ జేయు పాపంబు
తప్పదెపుడు భువిని । దగులు వేమ ॥ 1481

రాజమహేంద్రవర భూపాలుడు రాజరాజనరేంద్రుఁడు కొడుకైన సారంగ ధరునకు పెండ్లికి చిత్రాంగిని మాట్లాడి తాను వివాహంచేసుకొన్నాడు. ఆ పాపమే వంశ క్షయమయినది.

ఆ. కొప్పు సొగసుఁ గన్నఁ । గుచ కుంభములు గన్న
జెప్పరాని తావు । చెలిమిఁ గన్న
ముప్పిరి గొనుచుండు । మునికైన మోహంబు ॥వి॥ 1482
స్త్రీ అవయములన్నియు మునిముచ్చులనుగూడా ముగ్ధులను చేయునని వేమన మొగమాటంలేక చెప్పెను.

ఆ. కొమ్మ ద్రిమ్మరైన । ద్రిమ్మరుల వలచు
సరస విటుల నేల । సమ్మతించుఁ ?
బేడఁ దిన్న పురుగు । బెల్ల మేమెఱుఁగురా! ॥వి॥ 1483
కొమ్మ = ఆడది; ద్రిమ్మరి = తిరుగుబోతు.

క. కొమ్మలు, గొరిజెలు, దోలును
సమ్మతిగాఁ గాళ్ళుఁ । గడుపుఁ జంకలు బిక్క-
ల్నమ్మక మగు ననుబంధము 14
లిమ్మహిఁ గోమటికి । గోత్ర మేర్పడ వేమా !

వైశ్యుల అవయవములు చెప్పకుండా వైశ్యులని చెపుతాయి.

ఆ. కొయ్యముండఁ బట్టి । కొంకక జ్ఞానాగ్ని
చేతఁ గాల్చి, బూది । చేసెనేని
అంత ముక్తుఁడౌ నిఁ । కానంద భరితుఁడౌ ॥వి॥ 14

కొయ్యముండ = అజ్ఞానమనే కట్టె.

ఆ. కొలుచు గురునిఁ గొసరి । కొంగచాడ్పునఁ బోరి
చేపలెల్లఁ బట్టి । చేర్చిపెట్టి
శివుని కొసఁగువాఁడె । శివయోగి యందురు ॥వి॥ 14

"సర్వము దైవార్పణ మస్తు"

ఆ. క్రొత్తకుండఁ దెచ్చి । కోరి వంటలు సేసి
కాకులకు నిడెదరు । కర్మలార !
పెంటఁ దినెడి కాకి । పెద్ద యేలాగయ్యె ! ॥వి॥ 13

కర్మకాండాన్ని ద్వేషించాడు యోగి.

ఆ. క్రొత్త సుద్దులైన । గురుబోధచే విన్న
గర్మయుక్తి యాగ । కాండ తతులు
ప్రాత సుద్దులైనఁ । బాయునా పాపంబు ? ॥వి॥ 14

పాపముఁ బాయుట పరమావధి.

ఆ. క్రొవ్వు పట్టు పొరలు । గూరకర్మల పొర
ల్నొవ్వఁ జేసినట్టి । రవ్వ పొరల
వెవ్వరైన నేమి ? । యినజువాకిటఁ గాని
యవ్వలికిని బోవు । నటర వేమ. 14

ఇనజుఁడు = సూర్యకుమారుడు యముడు.

ఆ. కోట కోట తిరుగఁ । గొమ్ము లేనఁగు గాదు
త్రాఁటిపట్టె సందు । తగిలి యుండుఁ
బోటు బంటునైనఁ । బొర్లింపక విడఁడు ॥వి॥ 1490
విచిత్ర విడికథ; వేదాంతార్థ మున్న దేమో!

ఆ. కోటల కందంబు । మాటల బిగి యొకటి
గోడల కందంబు । గార యొకటి
తలుపుల కందంబు । చిలుక యొకటేనయా! ॥వి॥ 1491
* యతి తప్పు; "దీని భావమేమి తిరుమలేశ" అనునట్టు] యున్న దీపద్యము

ఆ. కోటలోపల నున్న । తేటైన పన్నీరు
కండ్ల నెంచేలాగు । కలుగఁజేసి
దుర్మార్గులను బట్టి । దుఃఖంబుఁ బెట్టురా! ॥వి॥ 1492
స్త్రీ సొబగు చిత్తాలను హత్తించి చింతెస్తాడు పురుషుఁడు.

ఆ. కోటి కళల మించు । కూటమున కవలి
యవధి దాటవలయు । నూర్జితముగఁ
జెనక మించువాఁడు । చిన్మయానందుఁడు ॥వి॥ 1493
సహస్రారము నవలోకించినవాడే సాహసుఁడు.

కం. కోటికి సంపాదించిన
కూటికి సరిపోదెఁ బ్రతుకు । గుంపులు నడిగెన్
యేటికి నీ సంసారము?
చోటికి నిను కన్నవాడె । సుదినము వేమా! 1494
ముక్తికాంతను జూచుటయే మోక్షప్రదము.

ఆ. కోటి దానమిచ్చి । కోపంబు నొందెనేఁ?
బాటి సేయ రతని । ప్రజలు మెచ్చి
సాత్వికగుణములను । సర్వజ్ఞుఁ డౌనయా! ॥వి॥ 14·5
"కోపమునను ఘనము కొంచెమైపోవును" కోపం పాపానికి బాట.

ఆ. కోడి కూసిన ధ్వని । కోకిల విని కూసు
కోకిల ధ్వని విని । కాకి కూసు
కాకి కూసినదెరిగి । లోకమే కూసురా ! ॥వి॥ 1496

"లోకులు కాకులు" "లోకము మూయను మూకుడున్నదే"

ఆ. కోఁతిఁ బట్టితెచ్చి । క్రొత్తపుట్టము గట్టి
కొండముచ్చు లెల్లఁ । గొలిచినట్లు
నీతిహీను నొద్ద । నిర్భాగ్యు లుందురు ॥వి॥ 1497

"ఎవరి పిచ్చి వారికానందము"

ఆ. కోపమునను ఘనత । కొంచమై పోవును
గోపమునను మిగుల । గోడుఁ జెందుఁ
గోప మడఁచెనేనిఁ । గోరిక లీడేరు ॥వి॥ 1498

"లోకవృత్తమెరుగు ప్రాకృత భవయోగి । పసిడిపలుకులవిని భ్రమసిపోర"

ఆ. కోపమునను నరక । కూపముఁ జెందును
కోపమునను గుణము । కొఱఁత వడును
గోపమునను బ్రతుకు । కొంచమై పోవును ॥వి॥ 1499

"మధురభావాలతో మంజులార్భటులతో చెలఁగి వేమనపల్కు వెలయు భువిని"

ఆ. కోమటికి దురాశ । కొండలు పాములు
చందనంబు సోన । చంద్రకళలు
ఆశకు మితి లేదిఁ । కక్కడ గతిలేదు
వచనశుద్ధి లేని । వాఁడు వేమ. 1500

నిక్కచ్చిగా విమర్శించే స్వభావము వేమనకే దక్కింది.

ఆ. కోమటి నిజ నిష్ఠ । గురికి రాదెన్నఁడు
లోభిగుణము చేత । లోన కడఁగుఁ
బులియు దాసరి కిడఁ । బొలుపగు చందమా ॥వి॥ 1501

నిర్మొగమాటంగా ప్రతివారిని విమర్శిస్తాడు.

ఆ. కోమటి మదిఁ గోరు । క్షామమే యెల్లెడ
వైద్యుఁ డోరుల కెపుడు । వ్యాధిఁ గోరు
వారవనిత ధనికుఁ । జేరఁదీయగఁ గోరు ॥వి॥ 1502
లోకస్వభావాన్ని ప్రాకటతర భావాలతో కేకవేశాడు వేమన.

క. కోమటి వేమన త్యాగము
భూమిఁ బ్రసిద్ధంబు కల్ప । భూజము చేతన్
పాముున్న పగిది దురగా
రాముుం డున్నాడు చేర । రా దెవ్వరికిన్ ॥వి॥ 1503
పెదకోమటి వేమారెడ్డి మహాదాత అయనదగ్గర తురగా రామయ్యప్రధాన మంత్రి ఈచరిత్ర నిట వాకొన్నాడు.

సీ. కోరిక వలరాజు । కుడిచివేసిన పుల్లె
పద్మనాభుఁడు మోయు । పసిడిదట్టి
నేడ్కతో జనులెల్ల । విప్పినట్టి భరిణె
గారవముల కెల్లఁ । గప్పచిప్ప
అజుఁడు దినము దప్పి । కారగించెడు గిన్నె,
రాజులు పట్టిన । గాజుకుప్పె
చుక్క కప్పెర శివు । సొగసు కిరీటంబు
మహిమ నింద్రునిసొక్కు । మందుబుఱ్ఱ,
పాడఁ జదువ నేర్చి । పరికించి చూచిన
నాడనేర్పు దాను । నేడ నేర్చు
నింతకంటె జెట్ట యిఁక । నేమి కావలె
విశ్వదాభిరామ । వినుర వేమ. 1504
పుల్లె = విస్తరాకు; పసిడి = బంగారము; బుఱ్ఱ = చెంబు. ఇది కూట వేదాంతం.

ఆ. కోరి ద్రుపద పుత్రి । కొప్పుఁ బట్టీడ్చిన
సింహబలుని చావుఁ । జెప్పఁ దరమె
మగియు కాలమునకు । మొనగాఁడు నీల్లడా! ॥వి॥ 1505
బలముగా స్త్రీలను చెరపరాదు; గుణపాఠం బోధించాడు.

క. కోరిన కోరిక లెల్లను
మీఱంగా జరుగు నటర । మెచ్చరు భువిలోఁ
గారణకర్మ ప్రకారము
కోరిన కోరికలు జరుఁగుఁ । గొల్చిన వేమా. 1506

కారణ కర్మమే కార్యమును సాధించునని సూచించాడు.

ఆ. కోరి మదిని గురునిఁ । గొలువు జేయుట మేలు
గారవమునఁ దెలుపుఁ । గహనవిద్య
దూరదృష్టి నిలిపి । తోడరుట మోక్షంబు ॥వి॥ 1507

గహనవిద్య = మోక్షవిద్య; గురుభక్తిని గుర్తించమన్నాడు మాయోగి.

నా ద నా మ క్రి య - ఏ క తా ళ ము

1. కోలు కోలు పరమ గురుని - కోరి చేరవే
కాలకర్మ జనము లాను - కడకు జిమ్మరే ॥కో॥

2. కాల మెడియోని మూల - కదలకుండ నొత్తిబెట్టి
మూలబంధ యూర్ధ్వ గతుల - మొనయు డెవ్వడో ॥కో॥

3. ప్రాణ పాన వాయువులను - పరగ నైక్యములనుఁ జేసి
పూని కాయసిద్ధి బొందె - పుణ్యు డెవ్వడో ॥కో॥

4. ఇంటిలోన మింటి నడుమ - కంటి లోన కన్ను దెరచి
కంటిపాప నంటి పెనగు - ఘనుడు యెవ్వడో ॥కో॥

5. మాటలాడు నారు రుచుల - మేటి బ్రహ్మరంధ్రమంద్రు
మేటి మాట మూరగించు - మనుజు డెవ్వడో ॥కో॥ 1508

యోగసాధనముల దేశకవి తారీకులలో తేనెలొలుకు భావపు చిలుకలతో ముద్దగు పలుకులు పలికాడు యోగి.

ఆ. కోళ్ళు, మేకలు గొట్టి । కుంభముల్ సరిగొండి
గంగమ్మకని మ్రొక్కి । మ్రింగనేల ?
తాను గంగై యుండ । తన కెదిరి గంగెవరు ? ॥వి॥ 1509

గ్రామదేవత గంగిమ్మను కంగారుగా విస్మరించాడు.

క. కౌండిన్యుఁడు ముండకొడుకు
మాండవ్యుఁడు కప్పకపుడు । మహిలోఁ బుట్టెం
జండాలి మతంగ మునిని
బిండంబుగఁ బెట్టలేదె । పృథివిని వేమా ! 1510

" నారదో రజకీ పుత్ర కౌండిన్యోముండ కేసు తామతంగశ్చ మాతంగశ్చ అగస్త్యో కుంభసంభవః ... " వజ్రసూచికోపనిషత్తు.

తే. కౌతు కాన్వితమై యొప్పు । కడిమి యెఱుకఁ
గఱపు చుండెడి క్రైరాస । గతుల మీఱి
యంతరంగమున మట । నచల వృత్తి
కలిత మొందుచు నుండును । ఘనుఁడు వేమ. 1511

అచలము = పరిపూర్ణము ; కౌతుకము = ఆనందము ; క్రైరాస గతులు = చెడ్డపనులు ;
హృదయములోనున్న పరిపూర్ణవిద్యను సాధించమన్నాడు.

తే. ఖండకమ్ములు ధరియించి । యుండునట్టి
వారలందఱు యోగులై । నారె ? జ్ఞాన
సాధనం బున్న నే కాని । సాధు వగునె ?
కాక తగుఁ బిచ్చివాఁ డనఁ । గాను వేమ. 1512

ఖండకము = గోచి ; సాధనలే సాధువులు ; వేషములనుగారు.

తే. ఖండ పరశువుఁ బూజింప । దండి దా వి
భూతి నిచ్చును గావున । నీతి గలిగి
శివునిఁ బ్రార్థించు తఱి నను । భవము నందఁ
జేయు నైశ్వర్య మిచ్చుట । చేత వేమ. 1513

శివుని యోగాధ్యనుభవ రూపము అగు త్రిశూలము ఖండపరశువు.

ఆ. ఖగములందుఁ జూడ । గా ముచ్చటగ నుండు
తెగలు గన్ననైనఁ । దేటపడదె ?
దేవుఁడీని సొగసు । దేబె నీకేలరా ! ॥వి॥ 1514

రూపం, చిత్రలేఖనం, కవిత్వం, స్వతహా వచ్చునవి,

ఆ. ఖచర వరుల భూమిఁ గనఁ। బడ రందువు
కానవచ్చినంత। గౌరవింతె?
తల్లి దండ్రి గురులు। తత్సము లేమైరో ॥వి॥ 1515

ఖచరులు = దేవతలు. ప్రత్యక్షదైవములు తల్లిదండ్రులే!

ఆ. ఖనులఁ బుట్టు లోహ। సంగణము దెల్లడ
బనికివచ్చు నొక్క। యినుమె చాల
నైన జులుపకరతు। రది యెచ్చుగా నుంట ॥వి॥ 1516

ఎక్కువ ఉపయోగంగా నున్నవానిని హీనంగా జూచుట వాడుకగానున్నది.

ఆ. ఖరము పాలు దెచ్చి। కాచి చక్కెర వేయ
భక్ష్యమగునె యెన్న। భ్రష్టుఁ డట్టి
యొంతలంకరించి। యొసగింపఁ బొసగునే? ॥వి॥ 1517

ఖరము = గాడిద.

ఆ. ఖలుల తోడి పొందు। కలుషంబుఁ గలిగించు
మానదెంత మేటి। మానికైన
వారిఁ జేరదీయ। వలవదు చెడుదువు ॥వి॥ 1518

"భ్రష్టశ్య కావాగతిః"

ఆ. ఖలులు తిట్టిరంచుఁ। గలవర పడనేల?
వారి తిట్ల నేమి। వాసి చెడును
సజ్జనుండు తిట్ట। శాపంబదౌనురా! ॥వి॥ 1519

మంచివాని వాక్కే మహామంత్రం.

ఆ. ఖేచరి యగు ముద్ర। కీ లెఱుఁ దెలిసియు
వాదు లాడకుండు। వారలెల్ల
మాయ గెల్చువారు। మహి మీఁద ధన్యులు ॥వి॥ 1520

ఖేచరీ ముద్ర వేసినవారే వాసిగాంచగలరు.

ఆ. ఖేచరీ ముద్రకు। కీ లెఱుంగగలేక
వాదు లాడునట్టి। వారినెల్ల
త్రొక్కి నాల్కఁబట్టి। తుద గోయవలయురా! ॥వి॥ 1521

యీముద్రరహస్యములు: కన్నులు మూసిగాని మూయకగాని చూపునుద్రిప్పి కనుబొమ్మల మధ్యనిలపి పైదిక్కునందుండు చిదాకాశము జూచుటయే ఖేచరీ ముద్ర యనబడును. ఈసాధన పరులు పద్మాసనము గాని సిద్ధాసనము గాని వేయవలయును.

## క్ష

ఆ. క్షమ గలట్టి యతఁడు । సాధువై శోభించు
ఓర్పుఁ బోలునట్టి । దుర్వి గలదె?
వన్నెవచ్చు మేలు । లెన్నియైనను గూడు ॥వి॥ 1522

“ క్షమా సర్వత్రపూజతే ” క్షమ = ఓర్పు.

ఆ. క్షామకాల మందు । సమయును జంతువుల్
భూమి యందుఁ బంట । లేమి లేక
కామ మప్పుడైన । గాలిపో దేమిరా ! ॥వి॥ 1523

క్షామము = కరువు; ప్రళయాంత మందైనా కామాన్ని బాసినవారు లేర న్నాడు యోగి.

ఆ. క్షితిని జౌలాది కర్మలు । చేతి కొలఁదిఁ
జేయ దుర్గంధ మరుగునే చెరఁ
ఘరియమల ముష్టి నాయమా । మార్గ మనుచుఁ
దెలియ లేలకొ తేటగాఁ । దెలుపు వేమ. 1524

చౌలాది కర్మలు = పంచాంగములో ముహూర్తభాగంలో ఉపయోగించే 16 కర్మలు.

గీ. క్షితిని బ్రోది చేసి । శ్రుతమును రక్షించి
గతము నడచి శుద్ధ । గతి వహించి
మృతిని మించి సకల । మతముల మదినుంచి
యొప్పుచుండు రాజ । యోగి వేమా ! 1525

రాజయోగి లక్షణములు విరాజమానంగా వర్ణించాడు. వృత్త్యను ప్రాసాంత్య ప్రాస నియమము లమోఘమగు బాటలో నడిపించు నేర్పు కలదు. అందుచే లేసుహాకవి అయ్యాడు.

ఆ. క్షితి వెలదికిఁ దగిన । శృంగారములు నున్న
విభుని కరుణలేక । వెలయ దెందు
నీ కృపయును లేక । నేర్పులు చెల్లవు ॥వి॥ 1526

భట్టబాణుని కాదంబరీ మహాకావ్య వాక్ఛట ఉల్లేఖించాడు మహాకవి.

కం. క్షితి శిశు హత్యలు చేసిన
మతిలేకున్నట్టి కుమతి । మనుజుల బాధల్
గతు లింతో యంతో దానికి
మితమును నేఁ జెప్పలేను । మేదిని వేమా ! 1527

శిశుహత్యా భ్రూణహత్యలు మహాపాతకమని వాకొన్నాడు.

ఆ. క్షీరము, నీరము రెండును
జేరిక యగు దారిఁ దెలిసి । చిట్టాడవలెం
దారుకొని శివుని జీవునిఁ
బోరము పరిపూర్ణమతిని । బొందిక వేమా ! 1528

క్షీరనీరన్యాయంగా శివ జీవేశ్వరుల కలయిక మంచిదన్నాడు కవికోకిల

శ్లో॥ అవిద్యోపాధికో జీవో మాయోపాధిక ఈశ్వరః ।
మయా విద్యాగుణాతీత ఇతి వేదాంత డిండిమః ॥

కార్యోపాధి గతో జీవః కారణోపాధి యీశ్వరః
కార్యకారణ విముక్తః పూర్ణబోధో విశిష్యతే ॥

బ్రహ్మైవేద మమృతం పురస్తాత్ పశ్చాద్బ్రహ్మ దక్షిణ తశ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్॥

— ముండకోపనిషత్తు

ఆ. క్షుత్తు దప్పి నిద్ర । క్షుభితములై యుండు
రిత్త లోకమాయ । రీతిఁ గాదె
సత్తు పూర్ణ సుప్తి । సాధింప వలెనయా ! ॥వి॥ 1529

క్షుత్తు = ఆకలి. లోక మాయను విడచి సాత్త్వికబ్రహ్మను సాధించమన్నాడు

క. క్షేత్రంబున క్షేత్రజ్ఞుని
గ్రాతంబున జూచి నియతిఁ । గ లక్ష్యంబౌ
రాత్రియుఁ బవలును నొకటిగ
సూత్రించినఁ గలుగు ముక్తి । సులభము వేమా ! 1530

క్షేత్రము = శరీరము ; క్షేత్రజ్ఞుఁడు = జీవుడు. శరీరములో బ్రహ్మను జూచుటే బ్రహ్మానందమని మాభవ్యునివాక్కు.

# గ

ఆ. గంగగోవు పాలు । గంటెడైనను జాలు
కడవడైన నేమి । ఖరము పాలు
భక్తి గలుగు కూడు । పట్టెడైనను జాలు ॥వి॥ 1531

గంగగోవు = సాధువైనఆవు; ఖరము = గాడిద.

ఆ. గంగ పాలుముంచుఁ । గదలని గతి తోడ
ముఱికి యేఱు పాఱు । మ్రోత తోడ
దాత యోర్చునట్లు । ధమ డోరువగ లేఁడు ॥వి॥ 1532

యోగ్యాఽయోగ్యముల లక్షణాలు చక్కని 'ఉదహరణలతో వాడాడు

ఆ. గంగ వాఱు నెప్పుడుఁ । గదలని గతి తోడ
ముఱికివాగు వాఱు । మ్రోత తోడఁ
బెద్ద పిన్నఁ దనము । పేరిమి యీలాగు ॥వి॥ 1533

చక్కని సామ్యముల వాడుటలో సరసపద భావౌన్నత్యాన్ని ప్రకటించుటలో ప్రజ్ఞాశాలి వేమన.

ఆ. గంగ స్నానమాడి । ఘనమైన వారెల్ల
భంగపడిరి పెక్కు । బాధలంది
గంగనీటి కన్న । గయ తీర్థముల కన్న
నన్న వేము తీర్థ । మెచ్చు వేమ.! 1534

"గంగా సర్వపాపహారిణీ" అనుటకంటె వేమన సూక్తులనుసరించిన అఘము త్రుళ్ళుతుంది.

క. గంగాధరుడే దైవము
సంగీతమె చెవులకింపు । సర్వజనులకు
శృంగారమె యుపభోగం
బంగజుడే మృత్యుహేతు । వరయగ వేమా! 1535

గంగాధరుఁడు = ఈశ్వరుఁడు;

క. గంగా యమునల నడుమను
బంగారు బొమ్మ వోలె । బాలిక యుండు

న్సంగతిగఁ జెలిమిఁ జేసిన
భంగము లేకుండ ముక్తి । పరమగు వేమా! 1536

గంగా, యమునా, సరస్వతి మధ్యనున్న ముక్తికాంతను జూడమన్నాడు మాయోగి విమర్శకుడు.

కం. గంగా స్నానము చేసిన
బంగారము కొల్ల వెట్టి । పలువుర కీయ
న్సింగారమె పరవనితా
సంగము పాపఁబోనర్చు । జనునకు వేమా! 1537

గంగాస్నానముతో పరవనితాదోషము పోవునా ?

ఆ. గండికోటలోన । కస్తూరి మృగ ముండు
రాజుగాఁడు గొప్ప । రౌతు గాఁడు
నెంతవారికైన నెత్తిన । పడఁగొట్టు ॥వి॥ 1538

గండికోటను పాలించే ప్రభువులపాలనను యీసడించేడు యోగి.

ఆ. గండికోట లోనఁ । గత్తి బట్టిన యంత
రాజుగారి దొడ్డ । రౌతుగాఁడు
ఎంతవారి నైన । నెత్తి గొట్టునా ? ॥వి॥ 1539

ఆ కోట పెద్దలు చెప్పుకోదగినది కాదని సూచించాడు కవికోకిల.

ఆ. గంపెడంత తవుడు । గంపలోఁ బెట్టక
చన్ను పట్టనీదు । కొన్న బఱ్ఱె
వారకాంత కేల । వలచెద రూరక ॥వి॥ 1540

ఎరవేస్తేగాని యెవ్వరూ రారు.

ఆ. గంధకం పెట్లుప్పు । కాల్చి ముష్టును దీసి
జెముడు బొగ్గులు । సరిగ జేర్చి నూరి
పలువిధ బాణముల్ । గలుగు జేతురు గదా! ॥వి॥ 1541

దీపావళి బాణసంచులు వ్రాశాడు యోగివర్యుడు.

ఆ. గగనంబు భగముగా । గళితంబు గన్పింప
మనసును వుచ్చించి । మౌనముంచి
బుసలు బెట్టుచు జ్ఞాన । బురు గెళ్ళ తరవరా! ॥వి॥ 1542

ముక్తికాంతయొక్క మూలమును సూక్ష్మముగా గ్రహించమన్నాడు యోగి

తే. గగన గమ్య నిరాలయ । గతిని మనసు
సమర సత్వంబుగా నెంచి । సాక్షి యగుచు
భ్రమ లడంచిన బ్రహ్మంబు । బట్ట బయలు
క్రమ మెఱుంగమి లోనెల్ల । దమమె వేమ ! 1543

భ్రాంతులుపోతే బ్రహ్మ మవలీలగా పట్టువడును. గగనము = ఆకాశము.

తే. గగన గోచర నిర్గుణ । గమ్య మూని
తనుము మీరిన ధ్యానంపు । తత్పరమున
దెమల కందులో మోక్షంబు । తెరువుగాదె ?
విమల సుజ్ఞాన మబ్బిన । వెలయు వేమ. 1544

చిదాకాశంచూస్తే చిన్మయ బ్రహ్మ మగుపిస్తాడని వేమనవాక్యం.

తే. గగనగోప్య నిరాలయ । ఘట్టమందు
విమల నిర్మల నిష్కళ । వేరిజేరి
తన్ను గని చింతఁ జేయుచే । తత్పదంబు
గురు కటాక్షము లభియింప । గుదురు వేమ. 1545

మహదాకాశమునందు మనసుంచినచో మహనీయుఁడు కాగలడని వేమన సూటిమాట.

గీ. గగన చిత్త దృష్టి । గద్దియపైఁ జేర్చి
యనువరైన యాతఁ । డచల మంటి
యుజ్జ్వలాంశ మందు । నూహించు దత్వము ॥వి॥ 1546

ఉజ్జ్వల = ప్రకాశమానమైన; సహస్రారమందు లక్ష్యము నుంచుటే లావణ్యము.

తే. గగన మగు బ్రహ్మభావముఁ । గాంచు టరుదు
జగము మఱచెడు గుతిఁ గను । జాణ లరుదు
నిగమ తత్వ నిరూఢులై । నిల్చు టరుదు
సుగుణ నిర్గుణ తప మూని । జూడు వేమ. 1547

పదలాలిత్యము, భావప్రాభవము, ఔచిత్యపు సొంపు, పద్యపు నడక క్రొత్త దారిఁజూపుచు కోమలంగా యున్నవి యోగి పుంగవుని పద్యములు.

ఆ. గగన మమర జూడ్కి । కనుబాట నిక్కించి
నిలిచి చూడఁ జూడ । నిలుచు సుఖము
సుఖములోని వరుస । సూత్రింప బ్రహ్మంబు ॥వి॥ 1548
“ సుఖాంతం బ్రహ్మదిష్ఠితం ”

ఆ. గగన మార్గమందు । తగవులాడితె గదా
వేమన్న సద్గురుఁడు । వేట్క లలర
కరుణ నీపై నుంచి । వరము లెచ్చుగ యిచ్చు ॥వి॥ 1549
మా వేమన గురుఁడు మహదాకాశంలో విహరించ మన్నాడు.

ఉ. గట్టిగ నల్వురేడ్వురని । కండలు గోసియు తెల్వి లేకయున్
గొట్టియు ముగ్గురిండ్లపుడె । గొల్వక ముక్తియు గల్గనేర్చునే
బొట్టును భోగముం భుజము । పొక్కులు బూడెదపూత లూరకే
పెట్టుట గాక భూప్రజకుఁ । బేర్మిని వేమ నృపాల శేఖరా! 1550
నల్వురు = మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ; ముగ్గురు = దుఃఖము, జన్మము, కర్మము ; అభిమానము, అవివేకము, మాయ.

ఉ. గట్టిగ నార్గు రేడ్వురిని । గండలు గోసియు నేవురన్ మెడల్
గొట్టియు ముగ్గు రిళ్ళు చెడ । గాల్పగ ముక్తియు గల్గనేర్చునా!
బొట్టును బోనమున్ । భుజము పొక్కులు బూడిదపూత లూరకే
పెట్టుట గాక భూజనులు । పేర్మిని వేమ నృపాలశేఖరా! 1551
గీ. “ మధుర మంజుల భావ సమాస యుక్తి స్వానుభవ యోగ నిర్మల భవ్యశక్తి
పూర్ణబోధా మలానంద భుక్తి రక్తి వేమనార్యుని శక్తిగా పృథివి నెంత్రు ”

ఆ. గట్టిచదువు చదివి । గప్పాలు గొట్టిన
చట్టమైన చదువు । చదువలేక
వట్టి మాటలాడ । వ్యర్థులే కారొకో! ॥వి॥ 1552
గప్పాలు = పనికిమాలిన మాటలు.

ఆ. గట్టి సాధువిద్య । కానంతె యనుకొని
గాఢవిద్య నేర్చి । కన్న ఘనత

సాధు సజ్జనముల । సాంగత్య మెఱుఁగక
బాధపడుదు రకట ! । బడల వేమ. 1553

" సాధుసంగంబు సకలార్థ సాధనంబు "

ఆ. గట్టుమీఁద నున్నఁ । గాన్పించు సర్వము
తెలివి తేటపడినఁ । దెలియు నెల్ల
లోక విషయములును । లోని రహస్యముల్ ॥వి॥ 1554

గట్టు = సంసార కూపమును దాటే కొండ ; లోకములు = జనులు.

ఆ. గట్టుమీఁది మన్ను । చట్టుపైఁ దగురాయి
పుట్టలోని వాని । బుడుగు త్రొడుగు
గట్టిగాను నూఱఁ । గనకము పుట్టురా ! ॥వి॥ 1555

బంగార యోగమును చెప్పెను. పుట్టలోనివాని బుడుగు త్రొడుగు = పాము త్రొడుగు.

తే. గట్టురాచూలి పతియైన । గంగ ధరుని
గుట్టు మదిలోనఁ దెలిసినఁ । బట్టు విడక
చట్టువలె మనమందుట । శాశ్వతంబు
దిట్టయగు నట్టి యాతఁడే । తెలియు వేమ. 1556

గట్టురాచూలిపట్టి = హిమవంతునికూతురు పార్వతి. తేటగీతులకు గూడ ప్రాసలుపయోగించి భవిష్యన్మహాకవులకు బాటవేశాడు యోగి.

ఆ. గట్టురాళ్ళఁ దెచ్చి । కాళ్ళచేతుల ద్రొక్కి-
కాసి యులుల చేత । గాసిఁ జేయు
మొఱకురాళ్ళ కెరఁగు । మొప్పెల నేమందు ॥వి॥ 1557

" గీ. విగ్రహారాధన పెట్టులకే గాక
విజ్ఞాను లాదారి వెదుకబోరు "

ఆ. గట్టువాయి జార । కాంత కాదనవచ్చు
గుట్టు దాఁపలేక కూత । లిడును
మగని మాత్ర మెపుడు । నగడు చేయును సుమీ ॥వి॥ 1558

అగడు = రట్టు. గయ్యాళిగంప మగనిని గకవికచేయును.

తే. గట్టువిలుకాని మదిఁ జేర్చు । గుట్టుఁ దెలిసి
నట్టివానిని వెన్నంటి । యలరు నాతఁ

డట్టి వాఁ డిల మోక్షంబు । నందు నెపుడు
కామ ముఖ శత్రు తతి నెల్ల । గడచి వేమ. 1559

గట్టు విలుకాఁడు = మేరుపర్వతము విల్లుగా కలవాఁడు ఈశ్వరుడు; ఈశ్వరుని నమ్మిన యీప్సితములు నెరవేరును.

కం. గడన గల పురుషుఁ గనుగొని
యుడుగులకును మడుగు లిడుదు । రతివలు ధరలో
గడన విడు పురుషుఁ గనుగొని
నడపీనుఁగు వచ్చెనంద్రు । నాతులు వేమా ! 1560

భద్రభూపాలుని "సమతీ శతక" పద్యము యిదీ ఒక్కటే ఛాయగానున్నవి.

ఆ. గడ్డటంచుఁ దెలిపి । ఘన మంత్రమును జెప్పి
డాబుపంచె కట్టుఁ । డంకు సామి
చిన్నె లింతెకాని । శ్రీవైష్ణవమతంబు ॥వి॥ 1561

డంకుసామి = వైష్ణవ మోసపు గురువు.

తే. గణన కెక్కుడునవి యెల్ల । గదియ నొక్క
జడియుటేలను ? పరిపూర్ణ । జలధి దాటి
తడవ తడవకు దన్మధ్య । దనరవలెను
సాధనంబున దలపడ । సాగు వేమ. 1562

క. "పరిపూర్ణము దాటంగను సరిగా గురినిల్పి గురుని సాకుట మేలౌ"

ఆ. గతము చేసినట్టి । కర్మబంధము లన్ని
పరిసిపోవు సత్య । గురుని వలనఁ
గుమ్మరి కొక యేఁడు । గుదియకు నొక నాఁడు ॥వి॥ 1563

సరియైన గురుని వలన సమస్త పాపములు సమయునని సరసుని వాక్కు.

ఆ. గతము జూతమన్నఁ । గలఁ గన్న యర్థంబు
నడుచు కాలమేమి । నమ్మరాదు
క్షణము లోని బ్రదుకు । సంసార విభ్రాంతి ॥వి॥ 1564

"మాతానాస్తి పితానాస్తి నాస్తి బంధు సహోదరః"

ఆ. గతికి మతి యటంచు । గమకించి నంతలో
మదికిఁ గతియుఁ గల్గు । మహితముగను
సతికి సుతులు పుట్టి । సంతుష్టిఁ జేరరా ! ॥వి॥ 1565

“ మతి ఎట్లున్న గతి యట్లుయుండు ” సద్గతికి సంతసము గాదా !

ఆ. గద్దె గణముని తలలు । కోరికెలును
ముద మొసగ శకున । ములకు చెలగు
ప్రశ్నలూ పదివేలు । పరికించి చూడంగ
నవును కాగ పోవును । వేమా ! 1566

* పద్యము పూర్తిగా లక్షణ విరుద్ధము.

ఆ. గద్దె గణము నిద్ర । కలలు గోరికలును
ముద మొసంగు శకున । ములును జెలఁగు
ప్రశ్నలు పదివేలు । పరికించి చూడంగ ॥వి॥ 1567

గద్దె = సోదిచెప్పిన అరుగు ; మోసపు సన్యాసులు మూఢనమ్మకములు గల్పింతురు.

తే. గమన గమ్య నిరాలయ । గతిని మనసు
సమర సత్వంబుగా నెంచి । సాక్షి యగుచు
భ్రమ లడంచిన బ్రహ్మంబు । బట్ట బయలు
క్రమ మెఱుంగమి లోనెల్లఁ । దమమె వేమ. 1568

ఆ. “అజ్ఞానులగువారి౦ ధకారము చొచ్చు ; సుజ్ఞానులగువా । రజూచు వెలుఁగు”

తే. గమన గోచర నిర్గుణ । గమ్య మూని
దమను మీఱిన ధ్యానంబుఁ । దత్పరంబు
దెమల కందుట మోక్షంబు । తెరువుగాదె ?
విమల సుజ్ఞాన మబ్బిన । వెలయు వేమ. 1569

“ ఆది మధ్యాంత శూన్యాయ యమలానంత మవ్యయం
అచలాత్మాయ వాచ్యాయా గురవే కేవలాత్మనే ”

ఆ. గమన మమర జూడ్కిఁ । గను బాట నిక్కించి
నిలిపి చూడఁ జూడ । నిలుచు సుఖము
సుఖములోని వరుస । సూత్రింప బ్రహ్మంబు ॥వి॥ 1570

“ ఆత్మాతీతం కేవలాత్మా । దేహోనాస్తికదాచన
అస్తినాస్తీతికోవాదా నిర్ణయో నాస్తి సర్వదా ”

తే. గమ్యమగు జ్ఞాన మందుట । గగన విద్య
జ్ఞాన ముదయించి మించఁ బ్ర । జ్ఞాన మమరుఁ
బరగు ప్రజ్ఞాన మందు లే । బ్రహ్మపదవి
పరశివుఁడగు నిది యంద । ధరను వేమ. 1571

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ।
అహం త్వాం సర్వ పాపేభ్యో మోక్షయిష్యా మిమాశుచ"

సీ. గయు డంబరీషుండు, । ఘన శశిబిందువు
రుచికుఁడు, బృథుఁడు, మరుద్వతుండు
భరత సుహోత్రులు । బరగు శ్రీరాముండు
నాది వపనగరు, లవని మరియు
భార్గవుఁడు, యయాతి । పరగ భగీరథుఁ
డల శిభి, మాంధాత । లనఁగ నొప్పు
నిటువంటి యధిపతు లేడ్గురు తొమ్మండ్రు
పదునాల్గు రథిపులై బ్రబలి రవని
నిట్టి నృపవర్యు లెందరో । గిట్టి రహహ
చూడఁ జూడంగ నీమాయ । చోద్యము కద
విశ్వమందును సర్వఘ । శాశ్వతంబు
దెలిసియును గార్యముల గాన । రిలను వేమ. 1572

షట్చక్రవర్తులను షోడశ మహారాజులును పొగడేడు.

ఆ. గర్భ చిహ్న గలిగి । ఘన బాధ లేర్పడఁ
దగిలి కష్టపడును । తల్లి కట్ట!
పిండ ముదయమైనఁ । బ్రియముగాఁ జూపెడి
నండజనుల కాపె । యరయ వేమ. 1573

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

ఆ. గర్వ, మింద్రియములఁ । గట్టివేయఁగ లేక
చావు వచ్చునపుడె । సన్యసింప
నాత్మ జయములేదె? । యంటునా మోక్షంబు ॥వి॥ 1574

" గీ. చావు దరిజేరినప్పుడే । సన్యసించు
పదము గలవాడు మానడు మగువ మమత
యెంత పండితుడైనను । యిద్ధరిణిని
విదిత మని జెప్పె వేమన్న । విజ్ఞదృష్టి

ఆ. గరుడ సేవ జేసి । ఘనతతో భుజియింప
వలె నటంచు నరులు । వాంఛ దీఱఁ
బలుకుచుంద్రు గాని । భావంబు గానరు ॥వి॥ 1575

ఆ. ''కంచి గరుడసేవ కాయ । కష్టమె గాని కాగలట్టిది నొక్క కాసు లేదు''

ఆ. గాజుకుప్పె లోనఁ । గడఁగుచు దీపంబ
దెట్టులుండు జ్ఞాన । మట్టు లుండుఁ
దెలిసినట్టి వారి । దేహంబు లందును ॥వి॥ 1576

దివ్యోపదేశములు దేదీప్యమానంగా మానవులహృదయాలలో వెలిగించగల శక్తి వేమనకే గలదు.

ఆ. గాడిదె తనువంత । గంధంబుఁ బూసిన
నేమి యెఱుంగజాల । కెగసి తన్ను
నీడుగాని వారి । యిష్ట మీలాగురా ! ॥వి॥ 1577

ఇష్టములేని వారి సరసము యీలాగే యుండును.

ఆ. గాడ్దె బూడ్దెనుఁ గోరు, । గజము మంటినిఁ గోరు
పంది మురుగుడు నీళ్ళ । బడను గోరు
కవులు గ్రాసము గోరు । గురుపూజ గోరునా ! ॥వి॥ 1578

ఎవరికి తగిన కోరికలు వారి కూరునంటాడు కవితాపితామహుడు.

ఆ. గాడ్దె మేని నిండ । గంధంబుఁ బూసిన
బూది లోనఁ బడియుఁ । బొరలు మరల
మోటువారి సొగసు । మోస్తరీయది సుమీ ! ॥వి॥ 1579

సహజోపమానములు వాడుటలో చతురుఁడు మహా మహోపాధ్యాయుడు.

ఆ. గాడ్దె యేమెఱుంగు । గంధంబు వాసన
* నక్క యేమెఱుంగు । గొప్ప, కొద్ది
యల్పు డేమెఱుంగు । హరునిగొల్చు విరక్తి ॥వి॥ 1580
* యతి తప్పు ; నీచులు గొప్పవారిని తెలియలేరు.

ఆ. గాయ కూరలు తిని । కాషాయవస్త్రముల్
బోడినెత్తి గలిగి । బొరయుచుండు
తలలు బోడు లౌను । తలపులు బోడులా ? ॥వి॥ 1581
క. " మోపపుసన్నాసులకిల గ్రాసమునకు బోడితలలు
కాంతలవలపుల్ వాసియు పన్నెయుగూర్చును "

ఆ. గాలి గాలిఁ గలిసె । గగనంబు గగనంబు
మన్ను మన్ను గలిసె । మంట మంట
నీరు నీటఁగలిసె । నిర్మలంబై యుండె ॥వి॥ 1582
" నదీనాం సాగరో గతిః "

ఆ. గాలి ఫణికిఁజేసె ! గసవుఁ బసికిఁజేసె
మంటి నెరకుఁ జేసె । మరవ కిలను
బుడమిలో జనులకు । బువ్వట్లు చేసెరా ! ॥వి॥ 1583
ప్రకృతి పరిణామం భవిష్యత్తును భద్రపరచు యుండును.

ఆ. గాలిఁ బాముతిన్న । గప్పల తినకున్నె
దుష్టబుద్ధియున్న । దుండగమున
మనుజుఁడరయనిట్లె । మాంసంబుదిను సుమీ ! ॥వి॥ 1584
" మత్స్యమాంసం మతిభ్రష్టం "

ఆ. గాలియందె పుట్టి । గాలియందె పెరిగి
గాలిఁ దెలియలేరు । గాదె నరులు
గాలియందె యాత్మ । కల దదె తత్వంబు ॥వి॥ 1585
జగత్ప్రాణుడను నామము వాయువునకు కలదు.

మత్త. గాలి రాకలుఁబోకలుండెడు । కాలమే బ్రతుకాయరా !
లీలతోఁ బరమాత్మనెంచగఁ । లేని మాయలగంటిరా !

చాలనమ్మియు నాత్మకీలును । సాధనంబునఁ గానరా !
మేలుగా నిక నీవు నీయెడ । మేళగింపర వేమనా ॥ 1586

మత్తకోకిలలు చిత్తమునను హత్తే భావమున నిర్మించెను.

తే. గాలి రేచక పూరక । గతులెఱింగి
కీలుకొని కుంభకంబున । గెరలుచున్న
నీలకంఠుని ప్రత్యక్ష । నిలయమదియె ?
బాగుగా నది కన్ననే । యోగి వేమ. 1587

"నీలకంఠుని నిలయమును తెలిసికొనుటకు ఉచ్ఛ్వాస నిశ్వాసములే ఊతకఱ్ఱ"

ఆ. గాలిలేని దీప । కళిక చందంబున
నలలు సుళ్లు లేని । జలధి రీతి
నిశ్చలాత్మ యెన్న । నిర్వికారంబున
నుండెనేని ముక్తి । యండ్రు వేమ. 1588

చలనరాహిత్యమైన ఆత్మచే పట్టుబడును ముక్తి.

తే. గాలి లోనికి లాగెడు । గతి నెఱింగి
పూని విడిచెడు మర్మంబు । పోకఁ గనుచు
హంస లోనెంచి కుంభించు । ననుదినంబు
యోగసాధక మాసించు । యోగివేమ. 1589

యోగసాధనాన్ని యుత్కృష్టముగా వివరించాడు.

ఆ. గాలి వశ్యములేక । గగనమం దెట్లు ?
ముక్తికాంతను బట్టి । మొత్తుటెట్లు
కుంటిబాపఁడు తేనె । కాసించి నట్లురా ! ॥వి॥ 1590

అంత్యచరణము అయోమయంగానే యున్నది.

ఆ. గాసిఁజెందనేల । గతికామమును మించి
వాసిగాను భక్తి । వరుసఁదెలిసి
మోసపోక యెఱుక । ముగియుటఁ గానరా ! ॥వి॥ 1591

భక్తిచేతనే బ్రహ్మజ్ఞానమును పొందమన్నాడు కవి.

తే. గాసిఁ బడఁబోను । మాయచేఁ గట్టువడను
గలిమి గనుల వారినెప్పుడు । గానఁబోను
నీదు పంచాక్షరంబుల । నియతముగను
దలఁచుచుండెద 'శివ' చూడు । దయను వేమ. 1592

" గీ. మానసికమైనశక్తిచే । మహిని వెలిగి
బ్రహ్మపథమును సాధించు । బ్రాహ్మణునకు "

కం. గ్రామము, భూములు, మానియు
బ్రేమయు, దయ యింతలేక । భీకరమతులై
భామల, సుతులను వదలక
పాములఁ బడనేల ? నడవి । పట్టిన వేమా ! 1593

యోగాభ్యాస, అరణ్యసంచారములు నిరర్థకములని కవీంద్రుని వాక్కు.

ఆ. గ్రాసమింతలేక । కడుఁ గష్ట పడుచున్న
విద్య యేల నిలుచు । వీలుగాక
పచ్చికుండ నీళ్ళు । పట్టిన నిలుచునా ? ॥వి॥ 1594

గీ " తెలుగుభాషామ తల్లికి వెలుఁగు నిచ్చు
వివిధరచనలు గావించె వేమసుకవి "

ఆ. గింజ చెడఁగనాడు । కీడుతోనే తాకు
గింజ చెడకయున్న । కీడులేదు
గింజ గలుగువారి । లంజె పంచనెయుండి
కందకుంద్రు జగతి । గడఁగి వేమ ! 1595

కూటవేదాంతమో ! విచిత్రవిడికథయో యిుదిమిడియున్నది.

ఆ. గీము విడిచిపెట్టి । గిర్కురు మనకుండ
జీవముడుగు లేక । శివునిఁ దలచు
మనసు గొల్పకయును । మాయచేఁ బొరలెడు
పాపజనుల కెచటి । పరము వేమ. 1596

గీము = నివాసస్థలము ; మాయను దాటనిదే మనసుకు కుదురదు.

తే. గుట్టు గురుభక్తిలో ముట్టి । మిట్టిపడక
బెట్టివలెఁ బోరిలో । మర్మ మిట్టిదనుచు
నట్టు పడఁజూచి మించు శే । నాటకంబు
పిట్టకభురులచే నేమి ? । గిట్టు వేమ ? 1597

మిట్టిపడుట = అహం ; నాటకంబు = నటించేది.

ఆ. గుడులు దేవతలని । గుర్తులు గావింత్రు
ముష్టి బాపలనుచు । మూల్గనేల ?
మొప్పెలకును దారిఁ । జెప్పిర ప్రాజ్ఞత ॥వి॥ 1598

భక్తిప్రపత్తులకు ప్రారంభదశ గా విగ్రహారాధన బ్రాహ్మణులు నేర్పేరు.

ఆ. గుడ్డువచ్చి పిల్ల । గోరడాలాడిన
విధముగా నెఱుఁగక । వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారి । గవ్వింతురూరక ॥వి॥ 1599

గోరాడము = చెలగాట లాడుట. జ్ఞానులను గుర్తించుట కష్టము.

ఆ. గుణగణంబులెల్ల । గుచ్చితమును బొందఁ
దగిలి భ్రమలఁజిక్కి । దండధరునిఁ
దోడితెచ్చుఁగదర । తొలగింపకున్నను ॥వి॥ 1600

దండధరుఁడు = యముడు. "కుత్సితుండు యమునికూటిలో చిలుకరా"

ఆ. గుణ గణంబులెల్లఁ ? । గుచ్చిత నేర్పులఁ
దగిలి భ్రమలఁ జిక్కి । దండధరుని
తోడితెచ్చుఁ గదర । తొలగించకున్నను ॥వి॥ 1601

"దండధరుని యింట వండుకు తిందురు దేబె లెల్ల తప్పు తెలిసి చేసి"

ఆ. గుణము గల్గియున్నఁ । గులపతి నెవ్వారు
నిందఁజేయలేరు । సీతఁ జూచి
గుణము లేకయున్నఁ । గులహీనురాలయా ! ॥వి॥ 1602

క. "గుణమె ప్రధానము నాతికి । మనమే ప్రాధాన్యమగును మానవులకిలన్"

ఆ. గుణము తీరు లేక । కులమెల్లఁ జెడిపోయె?
స్త్రీల నడతవలన । సిగ్గుపోయె
చవిటి నేలవలన । జలమెల్ల చెడిపోయె ॥వి॥ 1603

సహజనీతులు జాలువారించి చెప్పుటలో కవిచక్రవర్తి వేమనకవి.

ఆ. గుణరహితుఁడు మేలు । కోరి తాఁ బొందియు
నెంచఁడెపుడు దాని । నెచ్చుఁ గనఁడు
గుణయుతునకు మేలు । గోరంత చేసినఁ
గొండగా జూచు । కొనును వేమ. 1604

గుణవంతునకు గోరంత మేలు కొండంతగా గన్పించును.

ఆ. గుణములు గలవాని । కులమెంచఁగా నేల?
గుణము గలిగెనేనిఁ । గోటిసేయు
గుణములేనివాని । కులమెంత గొప్పైన
నెంచవలదు నీచుఁ । డెన్న వేమ. 1605

గుణము కలవాడే కోవిదుఁడు.

ఆ. గుణయుతునకు మేలు । గోరంతచేసినఁ
గొండయగును వాని । గుణముచేత
కొండ యంత మేలు । గుణహీనుఁ డెఱుగునా? ॥వి॥ 1606

గుణవంతుండు గుడ్డిగా ప్రవర్తించడు.

ఆ. గుణవతి గల గృహము । గోము నొందించును
చీకటింట దివిటె । చెలఁగునట్లు
దేబెయున్న కొంప । దివ్వె నిల్పినయట్లె ॥వి॥ 1607

గోము = కోమలము. గుణవతియున్న యిల్లు దేదీప్యమానంగా నుండును.

ఆ. గుణవతియగు యువతి । గుడి చక్కగానుండుఁ
జీకటింట దివ్వె । చెలఁగురీతి;
దేవి యున్న యిల్లు । దేవార్చన గృహంబు ॥వి॥ 1608

చిన్న దీపము దట్టమైన చీకటిని పోగొట్టును.

ఆ. గుణవతి యను ముక్తి । గుప్త పుత్రులను గంటె
అతి ప్రియంబుతోను । గతులుఁ గల్గు
అంగంబులోనున్న లింగంబు । జూపించు ॥వి॥ 1609
మంచియువతి గర్భముల మహితు లుద్భవిల్లి మహేశ్వరుని జూతురు.

తే. గుణ వికారంబులను ద్రొక్కి । గుట్టుఁదెలిసి
ధణ ధణాన్విత ప్రణవంబు । దాట గానె
తృణము సర్వం బటంచును । దృష్టి గలిగి
గణుతి జేయును మిన్నక । ఘనుఁడు వేమ. 1610
గీ. “ ప్రణవనాదంబు ధణధణారవముతోడ
సుగుణ మణులకుఁ గాన్పించు సూటిగాను ”

ఆ. గుణ విహీన జనుని । గుణ మెంచఁగా నేల ?
బుద్ధిలేనివాని । పూజ యేమి ?
మనసు లేనివాని । మంత్రంబు లేమయా ! ॥వి॥ 1611
ఆ. “ ఉప్పులేని వఁట పప్పుడుగు బోనంబు
గుణము లేని యట్టి జనుని బ్రతుకు ”

ఆ. గుణికి జ్ఞాన మహిమ । గోరంత చెప్పిన
గొండ యగును వాని । గుణముచేత ;
గొండ యంత విద్య । గుణ హీనుఁడెఱుఁగఁడు ॥వి॥ 1612
సలలిత శబ్దజాలములలో సహజనీతు లుట్టిపడే రచనాజాణత్వము వేమన్న దే!

ఆ. గుమ్మ యెట్టిదైన । దిమ్మరి వలచును
సరస విటుని కేల ? । సమ్మతంబు
పేడఁ దినెడు పుర్వు । బెల్ల మేమెఱుఁగురా ? ॥వి॥ 1613
గుమ్మ = స్త్రీ ; ఎటువంటివారికి అటువంటివారే జోడు.

ఆ. గుఱ్ఱమునకుఁ దగిన । గుఱుతైన రౌతున్న
గుఱ్ఱము లిల నడచు । గుణము గాను
గుఱ్ఱము లిల నడచు । గుణమేలఁ దెలియరో ! ॥వి॥ 1614
“ రౌతునుబట్టి గుఱ్ఱము ” అను అర్యోక్తియొక్క అమరిక యే యీపద్యం.

ఆ. గుటికి రావు జగతిఁ । గోమటి నిష్ఠలు
లోభితనము చేత । లోని కడఁగు
బులియు దాసరి కిడు । పోలుపగు చందమా ॥వి॥
"పెద్దపులి పేరంటాండ్రకు బెట్టునా !" అను సామెతవంటిదను.

క. గుటి గానలేక మర్త్యులు
పరిచిత శాస్త్రముల వాద । పద్ధతి గనర
గ్గుటి గురువు జ్యోతి సీయను
దటిఁ దెలిసిన వాఁడె యోగి । ధరలో వేమా !

"క॥ గురిఁదెలియు వాఁడు గురువగు
సరిగా లక్షణముఁదెలియ శాస్త్రజ్ఞుఁడయా !"

ఆ. గురు చరణముఁ బట్ట । గుక్కలు గఱచునా !
గురు చరణము విడువఁ । గుక్క గఱచుఁ
గుక్కకున్న గుణము । గురునకు లేదురా ! ॥వి॥
కుక్కలు = దుర్గుణాలు ; సరియైన గురువును మరువుగా జూడమనా

ఆ. గురు డంత్యకాలాన । గుణవంతునిగఁ జూచి
తాను సాధించిన । తత్వ విద్య
మర్మంబులెల్లను । మానక నేర్పురా ! ॥వి॥
సద్గురువు లక్షణాలు చక్కఁగా చెప్పెను.

క. గురుఁడగు నాత్ముఁడు, శిష్యుఁడు
పరగంగా జీవుఁడనుచుఁ । బరికించుచు నీ
గురు, శిష్య పరమ యోగం
* గురుతరముగఁ గూర్చువాఁడు యోగిర వేమా !
* యతి తప్పేమో ! తనయుఁడు జనకునిఁబోయి ; శిష్యుఁడు గురుని :

క. గురుడనగా పరమాత్ముఁడు;
పరగంగా శిష్యుఁడనఁగ । పటు జీవుడగున్
గురు, శిష్య, జీవసంపద
గురుతరముగఁ గూర్చునతఁడె । గురువగు వేమా !
"గురువు శిష్యుఁడాయె! శిష్యుండు గురువాయె! భజగోవింద గోవింద

క. గురుఁడనగ ధేనువై తగు
వరశిష్యుఁడు వత్సమగుచు । వర్తింపంగా;
దరి గలిగినప్పు డొసగును
నిరుపమ లక్ష్యామృతంబు । నిజముగ వేమా! 1621

గోవత్స న్యాయంగా గురుశిష్యానురాగములు కోమలంగా వర్ణించాడు

క. గురుఁడనగాఁ బరమాత్ముఁడుఁ
బరగంగా శిష్యుఁడనఁగఁ । బటు జీవుఁడగుం
గురు, శిష్య, జీవ సంపద
గురుతరముగఁ గూర్చునతఁడె । గురువగు వేమా! 1622

త్రిమూర్త్యాత్మకుడు దివ్యగురువు.

కం. గురుఁడనగా మొదలంతకు
గురుశిష్యులనఁగ నెల్ల । కొమ్మలు; గానం
గురువును గానగఁ జాలరు
ధరలోపల మనుజులెల్ల । దలపఁగ వేమా! 1623

గీ. "గురువు వృక్షమయ్యె! గురుతరశాఖలు
తద్గుణంబులయ్యె । తప్పకుండ
శిష్యగణములెల్ల చెలఁగె కోతులరీతి"

ఆ. గురుఁడు శిష్యుఁ డనఁగ । గొనయెట్టి మేలెట్టి
గురువు శిష్యుఁ డనెడి । గుఱుతు లెట్లు?
గురునకుండఁ దగిన । పరువె లేకుండిన ॥వి॥ 1624

"గుణహీనుడా గురువు గుడ్డివాడె!"

ఆ. గుఱుతుగాను జెప్ప । గురువెవ్వఁడును లేఁడు
గుఱుతెఱుంగు శిష్య । వరుఁడు లేఁడు
గురుఁడు శిష్యుఁ డనుట । గ్రుడ్డెద్దు చేనుగా! ॥వి॥ 1625

అసలుసూత్రం తెలసిన శిష్యుఁడూ గురువూ ఒక్కరే!

ఆ. గుఱుతు గూడుచేసి । గుణము వత్తిఁగఁజేసి
సరవి గర్మ సమితిఁ । జమురు జేసి
మూలనొక్క జ్యోతి । ముట్టించి చూడరా ! ॥వి॥ 16

గూడు = ప్రమిదె; సుజ్ఞానమే ఆత్మజ్యోతి.

ఆ. గుఱుతు తిథుల వలనఁ । గులమెల్లఁ జెడిపోయె
స్త్రీల నడత వలన । సిగ్గుపోయె
నేహ్యా పల్వలముల । నిలయెల్లఁ జెడిపోయె
జార్ల వలన బ్రతుకు । సమయు వేమ. 16

శుభాఽశుభముల కలయికయే ప్రపంచ వ్యాద్యములు.

ఆ. గుఱుతు తీరులేక । కులమెల్లఁ జెడిపోయె
స్త్రీల నడతవల్ల । సిగ్గుపోయె
*చొటి నేల వల్ల । బలమెల్లఁ జెడిపోయె ॥వి॥ 16

* యతి తప్పు; అజ్ఞానములో సుజ్ఞానంపడి శూన్యమయింది.

ఆ. గుఱునితోడఁ బొందు । కూడి యుండినవాఁడు
చేరి బ్రహ్మమంటి । చెలఁగి యుండు
మఱుఁగు తెలిసెనేని । మర్మంబు లేదయా ! ॥వి॥ 16

గురుభక్తులకు గురుతర జ్ఞానమబ్బునని పదేపదే వేమన ప్రకటించాడు;

ఆ. గుఱుని నిందఁజేసి । గుట్టెఱుంగని వాఁడు
యముని బాధ నొందు । గ్రమముగాను
దేశిలోని యీఁగ । తెలుఁగగు గానంగ ॥వి॥ 16

క్రమము తప్పిన కష్టములందును.

ఆ. గురుని పరమగురుని । గుఱుతుగాఁ దెలియక
గురువు గాను వలయు । గ్రుడ్డిరీతి
గురునకు గురువైన । గురుఁడు ప్రాణేశుండు ॥వి॥ 163

ప్రాణేశుండు = పరబ్రహ్మ; పరమ గురుని పాటించిన శిష్యుఁడే భవ్యుఁడు;

ఆ. గురుని శిష్యుని యతి । గుఱుతుగా మదిలోనఁ
గానలేఁడు భ్రాంతి । మానలేఁడు
గురుని శిష్యుఁడెందు । గుఱియదే జ్యోతిరా ! ॥వి॥ 1632

గురుశిష్యుల గురుతు దివ్యజ్యోతిగాఁ జూడెను మహాయోగి.

* ఆ. గురుని నెల్లప్పుడు । జ్ఞప్తిమఱవక యుంటె
ఇంద్రియాదులను జ । యించి నట్లె
గాడ్దెల కెల్లనుఁ । గలుగునా గురుభక్తి ॥వి॥ 1633

* యతి తప్పు ; యీపద్యము భావసమన్వితము గాలేదు.

ఆ. గురుని పాదయుగము । గురుతుగా తా నమ్మి
గురుని హృదయముఁ దెలిసి । మరువ కెపుడు
గురుకులవాసంబు । గోరుటె యదిమేలు ! ॥వి॥ 1634

"గురుకులాశ్రయంబు కోరి భజించుటే శిష్యకోటికెల్ల శ్రేయమబ్బు"

ఆ. గురుని ముందుగ దలచి । గాయత్రి పఠియించ
వెనుక బ్రహ్మను గూర్చి । వేడ వలయు
అటువెనుక శివునితో । ఆట్లాడ వలెనయా ! ॥వి॥ 1635

క "యతిపోయిన మతిపోవును
మతిపోయిన కుకవులెవరో,! మార్చిరి దీనిన్"

ఆ. గురుని శిక్షలేక । గురుతెట్లుఁ గల్గునో ?
అజుని కైన వాని । యబ్బకైన
తాళపుఁజెవి లేక । తలుపెట్లు లూడును ? ॥వి॥ 1636

అజుఁడు = బ్రహ్మ ; అజుఁడు = దశరథుని తండ్రి ;

ఆ. గురుని సహాయంబు । గల్గి కృతార్థుడై
యున్న మానవునికి । యేమి కొఱత
అన్ని తెలిసిన వాఁడు । అవిధేల పడునయా ! ॥వి॥ 1637

తప్పులతడికగా తయారుచేశారు యేప్రబుద్ధులో !

ఆ. గురుని సేవఁ జేసి । గురితోడ భజియింప
వలె నటంచు నరులు । వాంఛ దీర
బలుకు చంద్రుఁ గాని । భావంబు గానరు! ॥వి॥ 1638

భావమే పనులకు మూలము.

తే. గురు పరంపర నావిద్య । గూఢ మెఱిఁగి
పరమ పరిపూర్ణ మందుట । పరవశతర
నిరుప మానంద సుఖకేళి । నెరప వలెను
బరమశివుఁడన భాసిల్లు । ధరణి వేమ. 1639

వేమన తన గురు పరంపరను విజయవంతమని చెప్పుకొన్నాడు.

ఆ. గురు పుత్రుఁడై వెనుక । గుణము విడువగ రాదు
* గురుని మనసుకు గర్వ । మెంచ రాదు
గురుఁడు హరుండాయె । హరుఁడు గురుఁడాయె! ॥వి॥ 1640

* యతి పోయినది. గురుపుత్రుఁడే పరమ శివుడు.

ఆ. గురు బృహస్పతియును । గుణమించుకయు లేక
చందమామ కిచ్చె । శాప మపుడు
గురుఁడు కోపమూనఁ । గూడ దెప్పటికైన ॥వి॥ 1641

"ఆత్రగానికి బుద్ధిమట్టు" (తారాశశాంకం కథ.)

సీ. గురు బోధఁ దెలియనిఁ । గుటిల శాస్త్రంబులు
పరికింపఁగా నేమి? ఫలము గలుగు?
నాత్మైక్య మెఱుంగక । యఖిల యోగంబులు
సాధింప ఫలమేమి । సాధ్య మగును?
దన్మయత్వంబును । దానెఱుంగని వాని
సేవఁ జేసిన నేమి । సిద్ధిఁ గలుగు?
మది చేతెఱుంగక । చదువులు పెక్కులు
చదివిన ఫలమేమి । సత్యముగను?
ననుచు సద్గురు బోధగా । ననవరతము
వేయి నోరులఁ జెప్పిన । మాయ జగము

వానినే చేయఁ జూతురు । వాస్తవంబు
మదినిఁ దెలియంగలే రీశు । మహిమ వేమ. 1642

సీసపద్యము నడకలో శ్రీనాథుని గొప్పవాడంటారు కాని వేమన శ్రీనాథుని మించాడు; వేదాంత రహస్యాన్ని విస్తృతంగా వివరించాడు.

తే. గురుముఖంబున నెఱిఁగిన । గుఱ్ఱు విడక
నిస్తరంగ సముద్రంబు । నియతి మనసు
నిలిపి యపరోక్ష మందుట । నిర్గుణంబు
దాన పరిపూర్ణ సంతోష । మూనువేమ. 1643

నిస్తరంగ = కదలికలేని, అలలులేని. చపలత్వము కానివాడే సాధకుడు.

ఆ. గురువు గలుగు నాత్మ । గురు తెఱింగెడు మని
కాల మెల్ల రిత్తఁ । గడిపి రయ్యె!
గురువు దొరకు నపుడు । కూలు నీ దేహంబు ॥వి॥ 1644

రిత్త = లేక పోవుట; కూలును = నశించును. కాలము వృథాగా గడపరాదు.

ఆ. గురువు గూడుఁ జేసి । గుణము వత్తిగఁ జేసి
సరవి కర్మ సమితి । చమురు చేసి
మూల నొక్క-జ్యోతి । ముట్టించి చూడరా! 1645

అజ్ఞానాంధకారములో నణగినవారిని గురుజ్ఞాన జ్యోతి వెలిగించును.

ఆ. గురువు చిల్లగింజ । కుంభమీ దేహంబు
ఆత్మ కలుష పంక । మడుగుఁ బట్టఁ
దెలిసి నిలిచెనేని । దివ్యామృతము తేఱు! ॥వి॥ 1646

ఉపమానోపమేయములు వాడుటలో వసుచరిత్రను మించాడు.

ఆ. గురువు తానయినను । హరునిఁ దాఁజూపును
బ్రహ్మలోక మతఁడు । పారఁ జూపు
శిష్యు నరసినట్టి । చీకటిఁ బాపురా! ॥వి॥ 1647

శిష్యధ్వాంత రాశిభేది గురువు.

ఆ. గురువుఁ దానయ్యును | గుణమించుకయు లేక
చందమామ కిచ్చె | శాప మతఁడు
గురుఁడు కోపమూనఁ | గూడ దెప్పటికైన ||వి|| 1648

"గురుర్ గీష్పతి శ్రేష్ఠే గురుర్ పితరి మక్ష్యః" ఇతి శబ్దార్ణవః.

ఆ. గురువునకును బుచ్చు | కూరైన నీయరు
అరయ వేశ్య కిత్తు | రర్థ మెల్ల
గురుఁడు వేశ్య కన్న | గుణహీనుఁ డేమొకో! ||వి|| 1649

గుణహీనులకు గురువు తృణకల్పుడు.

ఆ. గురువు పరమ గురుని | గురుతుగాఁ దెలియక
గురువు గాను నుండు | గ్రుడ్డి రీతి
గురునకు గురువైనఁ | గురుడు ప్రాణేశుండు ||వి|| 1650

క|| "గురువులకెల్లను మూలము
పరమేశుడె; వేదశాస్త్రపద్ధతి దెలియన్"

ఆ. గురువు పాదములకు | గుల్లాములై సేవ
మనసు కరిగేట్టు | మహిని చేసె
* కరుణ బుట్టిన వెనుక | కించింత చూపించు ||వి|| 1651

* యతి తప్పు; గులాము = బానిస; (తురకపదము). గురుకటాక్షము గురుని చూపగల దన్నాడు.

ఆ. గురువుల గనినప్పుడె | శరణు చాయగవలయు
శరణు చేసిన ఫలము | శీఘ్రముగను
భక్తి తప్పక యుంటె | భువి యందు సిద్ధించు ||వి|| 1652

మతిలేనివారి యతుకులబోఁత ;

ఆ. గురువు లనుకొని దొంగ | గాడ్దె భడవాలెల్ల
ధనముకై యాసింత్రు | ధరణి యందు
మనుజులేమారించి | మోసపుత్తురు గదా! ||వి|| 1653

తప్పుడువారు వేమనపద్యాలు ముప్పిడిగా చేరిషేరు,

ఆ. గురువు వచ్చు చున్నఁ । గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు । దొరకు ముక్తి ?
మగని లెక్కఁ గొనని । మగువకౌ గతి పట్టు ? 1654

ఎవరికి తగు గౌరవము వారికీయవలెను.

ఆ. గురువు లేక విద్య । గుఱుతుగా దొరకదు
నృపతి లేక భూమి । తృప్తిగాదు
గురువు విద్యలేక । గురుతర ద్విజుఁడౌనె? ॥వి॥ 1655

ఉన్న విషయాలను తిన్నగా చెప్పుటలో మిన్నయే వేమన్న.

ఆ. గురువు శిష్యుఁ డనగ । గొనలెట్టు మొదలెట్టు
గురువు శిష్యుఁ డనెడి । గురుతు లెట్లు?
గురుని కుండఁదగిన । పరువు లేకుండిన ॥వి॥ 1656

గురువుకుండ దగిన పరువులేనివాడు తరువుతో సమానము.

ఆ. గురువు శిష్యుం డనగ । కొనయేది మొదలేది
కోరియున్న దొడ్డ । కొంచెమేది
గురువు నట్టి శిష్యు । గురువుగాఁ దెలియదే ? ॥వి॥ 1657

గురుశిష్యాద్భేదాద్వ్యవసాయసాంకరాలంకారము నిట ఉల్లేఖించెను.

ఆ. గురువు శిక్ష లేక । గురుతెట్లు కలుగునో ?
అజునికైన వాని । యబ్బకైన
తాళపుఁ జెవిలేక । తలుపెట్లు లూడురా ! ॥వి॥ 1658

శిలాక్షరాలవలె సిద్ధాక్షరములు శీఘ్రముగా జెప్పేడు కవి.

తే. గురువు సెప్పిన యుక్తులు । గూడి మిగిలి
మఱపు లేదని నిజమూని । మహితుఁడగుచు
నెరపు చుండును శివయోగి । నేర్పుతోడ
బరము సాధింప నతనికే । ర్పడును వేమ. 1659

“ విన్నదానిని కన్నదానిని తిన్నగా మననము చేయండి ”

ఆ. గురువు సెప్ప విద్య । గురువునకునుఁ దెలుసు
గురువు సెప్పు విద్య । గురువు యెరుగు
గురువు మహిమ బరమ । గురువునకును దెలుసు ॥వి॥ 1660
అన్ని తెలసినవాఁడే గురువు.

ఆ. గురువు సెప్పు విద్య । గురుతునఁ దెలియును
గుఱుతు మీఱ కునికి । గురుఁ డెఱుంగు
గురువు మహిమ పరమ । గురువునకేఁ దెలియు ॥వి॥ 1661
క. "గురువే దైవము, తల్లియు గురువే తండ్రి, యును చెలులు గురువే సర్వం"

ఆ. గురువు సేవఁజేసి । గుఱితోడ భుజియుంప
వలెనటంచు నరులు । వాంఛ దీఱఁ
బలుకుచుంద్రు గాని । భావంబుఁ గానరు ॥వి॥ 1662
గురుసేవ పరమోత్కృష్టసేవ యని పరమ గురువాక్యం.

తే. గురు శిష్య భావంబు । గరిమ తోడుతఁ జూడ
కర్పూర జ్యోతియై । కలిసి యుండు
గురు శిష్యులను జూడ । హరుఁడు సంతోషించు ! ॥వి॥ 1663
అవినాభావ సంబంధము గురుశిష్యులకే గలదు.

ఆ. గువ్వ కొఱకు మేను । కోసి యా శిబిరాజు
వార్త విడువరాక । కీర్తి కెక్కె
నోగు నెంచఁబోవ । రుపకారి నెంతురు ॥వి॥ 1664
"కృతయుగే బలిర్దాతా । త్రేతాయాం రఘునందనః ।
ద్వాపరే సూర్యపుత్రశ్చ కలౌ రాయని భాస్కరః"

తే. గుహల యందుండ్రు గురు లను । కొనుట కంటె
మహిత గుణుఁడగు సర్వేశు । మదిని నిలిపి
గుణము లన్నియు సరిఁజేసికొన్న యపుడె
గురుతు నిలుచును దావచ్చు । గురుడు వేమ. 1665
గుహాలోనుండి క్రుమ్ములాడినకంటె గుణాన్ని గురుతుగా నిలుపాలి,

ఆ. గుహలలోనఁ జొచ్చి । గురువుల వెదకంగ
క్రూర మృగ మొకండు । తార సిలిన
ముక్తి దారి యదియె । ముందుగాఁ జూపురా ! ॥వి॥ 1666

మూఢ నమ్మకము వదలి గాఢమగు భక్తిశ్రద్ధలు ప్రూనమని బోధించేడు.

తే. గుహలు పదివేలు సొచ్చిన । గుణము పోదు
నియత గురు భక్తి కావలె । నేర్పు మీఱ
మహిత పరతత్వ భావంబు । మధుర మగును
దాని సాధింప నేమఱు । పూను వేమ. 1667

ఏమరు = అజాగ్రత్త; పరతత్వాన్ని యేమరకుండా సాధించమని కవిసూక్తి.

ఆ. గుహ్యాశ్రమచేత నే కదా । కులము గల్గె
గుహ్యాశ్రమ లేక పోయిన । కులము లేదు ;
గుహ్యాశ్రమచేత గనలేరు । గుణము ముక్తి
విమల గుణధామ ! యోగీంద్ర వేమనార్య ! 1668

స్త్రీమర్మస్థానము వలన సృష్టిజరుగుచున్నదని స్త్రీని తెలిసిన మాసిద్ధుడు వచించాడు.

ఆ. గుహ్య సురత మిలను । గోరుచుందురు సదా
గుహ్యకు సురతంబె । కులము విద్య
గుహ్య చేత నరులు । ఘోర నరకమందు
గూల బడుదు రకట ! । గురుఁడ వేమ. 1669

యోనికాసించియే యోగులు భ్రష్టులగుచున్నారని వేమనపలుకు.

క. గూఢార్థము ఘను డెరుగును
మూఢాత్ముండేమి యెరుగు ? । మొనసిన వేళన్
గాఢాలింగన సౌఖ్యము
ప్రౌఢాంగన యెరుగు గాని । బాలేమెరుగున్ ? 1670

గూఢార్థము = రహస్యభావము ; గాఢాలింగనము = ప్రేమచే దట్టమగు కౌగలింత ; ప్రౌఢాంగన = నేర్పరియైన స్త్రీ.

ఆ. గూబచేర గృహము । గునిసి పాడుగఁ బెట్టి
వెళ్లి పోదురెంత । వెఱ్ఱి వారొ?
గూబ గృహము లేమి । కూర్చురా కర్మంబు ॥వి॥ 1671

గుళ్ళలోఁగల గోపురముల జూచుట గుణహీనులకు పరిణతి.

ఆ. గూబవలె గ్రుడ్లు ద్రిప్పిన । గుణము రాదు
లోభ మోహము లుడుగంగ । లాభ మగును
దేబెలై భిక్షమెత్తుట । తీర్చ దెపుడు
డాబు చేసిన లక్ష్య మ । డంగు వేమ. 1672

కపటయోగుల గాలించి చెప్పిన వాక్యములివి.

ఆ. గృహము గూడు గుణముఁ । గెరలు వత్తిగఁ జేసి
సత్య మనెడు కర్మ । చమురు పోసి
మూల మనెడు జ్యోతి । ముట్టించి చూడరా! ॥వి॥ 1673

సాధకునకు చక్కని సామెత జూపించడంలో నేర్పరి కవిదిగ్గజం.

ఆ. గృహము దేహ ముండె । గేవల గుణ ముండె
దాని నిలిపి కొసియు । దీనిఁ దీర్చఁ
గానరాదె నీకు । నానంద సుఖమిది ॥వి॥ 1674

దేహపోషణచే దివ్యమైన శక్తిని కూర్చుకొమ్మన్నాడు మనకోవిదుఁడు.

ఆ. గెంటి మెరుకను చిన్మంట । నంట నగును
కంటి కింపగు గురుశక్తి । మింటఁ జేర్చి
జంట బాసిన ఘనుడె । పో జ్ఞానుఁ డరయ
విమల గుణరాజ! । యోగీంద్ర వేమనార్య! 1675

ద్వంద్వాతీతమైన ద్వాదశాదిత్యుని గనినవాడే విమల గుణములతో వెల్లి విరియగలడని వేదాంతునిసూక్తి.

తే. గెంటి మెఱుకను జిత్తను । మంట నిలిపి
కంటి కింపగు గురు శక్తి । మింటఁ జేర్చి
జంట బాసిన ఘనుఁడె పో । జ్ఞానుఁ డరయ
బంటు తన మది పరమందుఁ । బనికి వేమ. 1676

నిజమైన ధీరుఁడై దివ్యజ్యోతిని జూడమన్నాడు సుకవి.

ఆ. గొడ్డుటావుఁ బితుకఁ । గుండఁ గైకొని పోవఁ
బండ్లు నూడఁ దన్ను । పాల నీదు
లోభివాని నడుగ । లాభంబు లేదయా! ॥వి॥ 1677

లోకనీతులు పూతలుగా జెప్పటలో ఖ్యాతినార్జించాడు కవిరాజు.

ఆ. గొప్పపిరుదుఁ గన్నఁ । గుచ కుంభములుఁ గన్నఁ
జెప్పరాని చోట । చేవ గన్న
ముప్పిరి గొను నయ్య । మొనసిన మోహంబు! ॥వి॥ 1678

మోహముయొక్క వికారాన్ని ముచ్చటించాడు.

ఆ. గొఱ్ఱె గుంపులఁ దోడేలు । కొదవ దీఱఁ
జొచ్చి పట్టును గొఱ్ఱెలఁ । జొరవ గాను
గుక్క గనుఁగొని । గొల్లనిఁ గూసి లేప
యదరిచియుఁ బోలుఁ । దోడేలు నతఁడు వేమ. 1679

అన్యాపదేశంగా విన్యాసోక్తులచే వేదాంతవిద్యను విశదీకరించాడు.

ఆ. గొఱ్ఱెలు పదివేలు । కూడి యుండిన చోటఁ
దల్లినెఱిఁగి వచ్చు । దాని కొదమ
పరమ యోగి నెఱిఁగి । భక్తుండు వచ్చురా! ॥వి॥ 1680

కొదమ = పిల్ల; "గగనేచ మేఘః గిరౌ మయూరః" సామ్యం.

ఆ. గోగణముల నెల్ల । గొల్లఁడై పోషించి
కృష్ణుఁడనఁగ నెగడె । కృత ముఖుండు
కృష్ణ వలువ లడుగఁ । గేకచే వేలిచ్చె! ॥వి॥ 1681

వేలిచ్చె = అభయహస్తము; (నుడికారము) భారతగాథ.

ఆ. గోచి పాతఁ బెట్టి । కోరి తా మునినంచు
మనసు లోని యాశ । మాన లేఁడు
ఆకృతెన్న వేఱె । కాశయన్నఁగ వేఱు ॥వి॥ 1682

ఆశకును ఆకృతికిని అంటియుండుటలేదు.

ఆ. గోచి యూడె ననుచుఁ । గోఁతి యాటలనాడి
వెట్టి యోగి నూరు । వెడలు మంద్రు
ఎవరి గోచు లూడ । వీ(ప్రొద్దు గ్రుంకిన ॥వి॥ 1683

గోచూడుట = నుడికారము ; అందరంతరే ?

ఆ. గోచి విడుచు యోగిఁ । గోఁతిన నాడించి
వెట్టివానిఁ జేసి । వెతలఁ జిక్కఁ
జేయునయ్య లేమి । చేసెద రోరేల ! ॥వి॥ 1684

రేల = రాత్రి ; మోసపు సన్న్యాసులు గోచులుబిగించి రాత్రి వారాంగనా కౌగిళులలో ఓలలాడుదురని స్వానుభవముగా యోగి పలికెను.

ఆ. గోప బాలుడగుచు । గో వర్ధనంబును
లేవనెత్తి నిలిపె । లీల తోనె
మురళి గాన లోలు । ముదమందఁ జూడరా ! ॥వి॥ 1685

శ్రీకృష్ణలీలామృత మిట పలికెను.

ఆ. గోపురంబు, ప్రహరి, । కోనేరు, తేరులు
పూలతోట, గుడులు, । పొందుగాను
దేవరనుచు బోఁగ । దిగఁబట్టి మ్రింగెరా ! ॥వి॥ 1686

తేరు = రథము ; అర్చకులు చేయు అగడము లుల్లేఖించెను యోగి.

ఆ. గోపురముల గుట్టు । కోనేర్లు తేరులు
యాకుల కురుగుడులు । యడలగాను
నేవరుట బోతెగ । లట్టు కొనెనయా ! ॥వి॥ 1687

ఆయోమయునగరములో ఆతతాయి గుణములవలెనున్నది.

ఆ. గోసి తీసె ననుచు । కొట్లాట లాడించి
వెట్టియనుచు । నూరు వెళ్ళగొట్టు
తరుణులకును నెదుట । తా గోచి విప్పడా ॥వి॥ 1688

కామాతురుల కంగారుని శృంగారముగా జెప్పెడు.

ఆ. గౌతమ్నరి తిట్టు । కఱకంఠు కోపంబు
దీన జనుఁడు రోసి । తిట్ట నదియు
స్వర్ణకారు తిట్టు । సరగునఁ దాకురా ! ॥వి॥ 1689
అ. పేదవాని బాధ పృధివికిచేటగు । మంచివానిమాట మంత్రమగును.

ఘు

కం. ఘంటారవమును మదిలో
వింటి న్నే గంటఁ గంటి । విమలపుఁ గాంతి
న్వొంటాడక బ్రహ్మంబును
గంటిని వగ కాదు నన్నుఁ । గనుఁగొన వేమా ! 1690
ఘంటారవము = దశావిధనాధములు; ఆత్మావలోకన అవసరమన్నాడు.

ఆ. ఘటముఁ గాన్గఁ జేసి । ఘనగుణ మెద్దుగా
దవిలి కర్మములను । నువులఁజేసి
తెలిసి గానుగాడుఁ । దిలకార కాత్మము ॥వి॥ 1691
తిలకారకుఁడు = తెలుకలి ; ప్రజానిత్యకృత్యములు బాహ్యాంతరార్ధముల గుండా వేదాంత విద్యబోధ ప్రజలకిచ్చెను.

ఆ. ఘటము గాన్గఁ జేసి స్ఫుటమైన యెద్దును
నిర్గుణాంశ మదిని । నిలిపి గతులు
తెలిసి గానుగాడ । దివ్యామృతము పుట్టు ॥వి॥ 1692
విజ్ఞానామృతమును నువ్వులనుండి నూనెవలె శరీరములోనుంచి తీయమన్నాడు

ఆ. ఘటము చక్కగ నుంటె । గాలి చేతికిఁ జిక్కు
ఘటము మెత్తగ నుంటె । గాసి పడును
ఘటము పోయిన వెనుక । ఘటమెట్లు పలుకురా ! ॥వి॥ 1693
గాసి = కష్టము ; ఘటము = శరీరము, కుండ ; శరీరపోషణ చేయమన్నాడు.

ఆ. ఘటము జలములందు । గగనంబు కాన్పించు
ఘటము జలములేమి । గగన మేది ?
ఘటములోన జ్యోతి । క్రమమునఁ దెలియుఁడీ ॥వి॥ 1694
హృదయ ఘటములో నున్న మహదాకాశం గాంచుమని వేమనవాక్కు.

ఆ. ఘటము నింద్రియములఁ । గట్టి వేయగఁ లేక
చావు వచ్చునపుడు । సన్యసించు
ఆత్మశుద్ధిలేక । యందునా మోక్షంబు ? ॥వి॥ 1695

“ చేతులు గాలిన వెనుక ఆకులు పట్టుట ”

ఆ. ఘటము యెఱ్ఱగ నుండు । ఘనము తెల్లగనుండు
మనసు నల్లగ నుండు । మాటలేదు
వీటి మర్మము దెలియ । యెవరబ్బ తరమయా ! ॥వి॥ 1696

విచిత్రవిడి కథగానున్న కూటవేదాంతము; కోవిదులను కూలంకషముగా దెలిసి కొమ్మని కోవిదుని సవాలు.

ఆ. ఘటములోన నున్న । గతులన్నియునుఁ గోసి
దిటవుచేసి మనసు । తేటపఱచి
ఘటము నిల్పువాఁడు । ఘనతత్త్వ యోగిరా ! ॥వి॥ 1697

గతికొలది మతి ; మతికొలది గతి యగును.

ఆ. ఘటములోని దీప । కళిక చందంబునఁ
గుదురు గలుగు । నిండుకుండ రీతి
నిశ్చలత్వ మమరి । నిర్వికారంబునఁ
నుండినంత ముక్తిఁ । గంటు వేమ. 1698

నిశ్చలమనస్సును నిర్ణయించాడు.

క. ఘన చిత్రదీప సామ్యము
మనసున నిర్గుణము దాకి । మసలక తానై
విని కని వివర మెఱుంగక
మనవలె లోగుట్టు మరిగి । మహిలో వేమా ! 1699

దీపకళిక వలె లోనప్రకాశించే ఆత్మజ్యోతి ;

తే. ఘన చిదాకాశ మైనట్టి । గతి నెఱింగి
యనిల, రేచక, పూరకం । బనువు కాను
బనుపడఁగ లాగి కుంభించి । పాటు పడర
మనెడు సుజ్ఞాన మమర నే । మరక వేమ. 1700

రేచక, పూరక, కుంభకముల ప్రస్తావించాడు

ఆ. ఘనత వృక్షమునను । కాయ తాఁ బుట్టెను
కనులు మూఁడు గలవు । కాఁడు శివుఁడు
పయిన చర్మముండు । పరమయోగియు కాడు
తియ్య నీరుతోడ । దిరుగు వేమా! 1701

పొడుపుకథ ; జవాబు కొబ్బరికాయ; తిరుమలేశుని తీరిలో వ్రాశాడు.

ఆ. ఘనమైన నమృతంబు । కొననాలుకతో చిక్క
ఒప్పి తాగితే గదా । దప్పితీరు
తామసంబున నుంటె । తాపంబు తీరునా! ॥వి॥ 1702

ఇది లంబికాయోగము యీయోగము సాధించిన వారికి ఆకలిదప్పులుండవు, శరీరచ్ఛాయ బంగారపురంగుగానుండును.

క. ఘనసార మగ్ని దరికొనఁ
గనసారంబగును గాదె? । కారణవిద్యా
ఘనసారము విద్యాగ్నికి
ఘనసారమె కంటకంబు । గలుగుర వేమా! 1703

ఘనసారము = కర్పూరము ; ఘన = గొప్పదైన ; సారము = శ్రేష్ఠము ; ఘనసారమువలె ఘనసారమందుచే ఘనత్వము.

## చ

ఆ. చంద్ర సూర్య గతుల । జర్చించి వేగమే
రంధ్రమునను జొచ్చి । రంగు మీఱఁ
జంద్రశాల జేరి చైతన్య । మందరా! ॥వి॥ 1704

చంద్రశాల = సహస్రారము ; చైతన్యముగలిగి చంద్రశాలను గుర్తించ మన్నాడు.

ఆ. చంద్ర సూర్య నాడి । సంధులో గాలిని
ముందు లాగి, విడిచి, । మూలమెక్కి
కుమలకుండఁ బట్టి । కుంభించి కానరా! ॥వి॥ 1705

కుమలకుండ=చెడిపోకుండ ; రేచకము 16 అం ప్రమాణము, పూరకము 6 అం. ప్రమాణం, కుంభకము 4 అం. ప్రమాణము.

ఆ. చంద్ర సూర్యాగ్ని కూడిన । చంద్రశాల
జేరి పరశివ ధ్యానంబు । చింతఁజేసి
చిన్మయానందమున జేర । తన్మయంబు ॥వి॥ 1706

చిన్మయానందమునఁ జేరినవాఁడే తన్మయుడని తన్మత మెరిగిన సద్గురునిమాట.

తే. చంద్ర సూర్యాగ్ను లేర్పడ్డ । చంద్రశాల
జేరి పరశివు నా ర్తితోఁ । జింతచేసి
చిన్మయానందమునుఁ జేరఁ దన్మయంబు
ము క్తిమూలం బిదే జన । ములకు వేమ. 1707

ము క్తి కాంతకుమూలము సహస్రారము గు ర్తించుటే ?

తే. చంద్ర సూర్యుల గతిలోనే । చక్క వెట్టి
కుంద కెప్పుడు గురునాజ్ఞ । జెందఁగోరి
యెందుఁ జూచిన ప్రత్యక్షు । మెన్ను చుండు
దాన నేర్పడు నిత్య ము । దంబు వేమ. 1708

ముముక్షాపేక్షులు దీక్షతో పరోక్షములోనున్న పరమును పరికించగలరు.

ఆ. చంద్రుడనంతవాడె । శాపంబు చేతను
కళల హీనమొంద । కలిఁగెఁ గదర !
పుడమి జనులకెల్ల । బుద్ధు లట్లుండురా ! ॥వి॥ 1709

గురుశాపమువలన తరుగు పెరుగుల తనువువాడయి తన్నులను బాధిస్తాడు.

ఆ. చంద్రునీడ నునిచి । చక్కగా రవిమీద
నుండఁజూచి కొంత । మండఁ జేసి
వెన్నెలం గలియుటె । వెలయంగ ము క్తిరా ! ॥వి॥ 1710

సూర్యచంద్ర నాడులయొక్క సూక్ష్మముఁదెలసినవాడే సుజ్ఞాని.

ఆ. చక్రధరుని వేడి । జలధి దాటఁగవచ్చు
వికృతమైన బుద్ధి । వెతల బెట్ట
నక్ర మెన్న గజము । నయమార భక్షించు ॥వి॥ 1711

నక్రము = మొసలి ; బుద్ధితక్కువగానున్న పెద్దవాడిని కొద్దివాడైనా క్రుంగదీస్తాడు.

కం చతురోపాయ సమర్థత
వితరణ గాంభీర్య ధైర్య । విభవ స్ఫురణన్
జతగూడి యుండి నప్పుడె
అతులితుఁడౌ నతఁడె రాజు । నగురా ! వేమా ! 1712

చతురోపాయములనగా: 1. సామ, 2. దాన, 3. భేద, 4. దండోపాయములు.

ఆ. చదలు భంగి గంద్రము । సాధువు మూఢులు
తానువారినల్లె । కాననగును
దీనికెంత దవ్వొ । దానికి నిది యంతె ॥వి॥ 1713

చదలు = ఆకాశము ; దవ్వు = దూరము ; "ఈవూరి కావూ రెంతదూరమో ! ఆవూరికీ వూరంతే !"

తే. చపల చిత్తములో నున్న । జాడ లెఱిఁగి
యపరిమిత చిన్మయాకృతి । ననుసరించి
తపము నెరవేర్చు నతఁడెపో । తత్త్వ విధుఁడు
హర్ష నిలయుండుఁ బరమశివుఁ । డగును వేమ. 1714

హర్షము = ఆనందము ; తపము = శరీరాన్ని తపింపఁజేయుట ; తత్త్వ విదుడు = శరీరశాస్త్రము కూలంకషము గా తెలుసుకొన్నవాడు.

ఆ. చపలచిత్తవృత్తి । జయమంది గమకించి
నిపుణుఁడయ్యె యోగ । నియతి మీఱి
తపముఁ జేయువాఁడు । తత్త్వాధికుండురా ! ॥వి॥ 1715

యోగము = నిజమును తెలియుట ; "తపస్స్వాధ్యాయ నిరతం"

క. చపలాత్ము లగుచుఁ గొందఱు
విపరీతపు గోర్కెలూని । విడువఁగలేకే ?
నిపుణుల మనుకొనుచుంద్ర
య్యపవర్గంబైన బయలు । నందరు వేమా ! 1716

"మ. పదలాలిత్యకవిత్వ తత్త్వరచనాభావం
బులిపద్యమం దుదయించెన్"

ఆ. చమట కారేటట్టు । చట్టకు పసిపెట్టి
గడియించి నన్నంబు । గుడువవలయు
తల్లిదండ్రులసొత్తు । తినుట కారాదయా ! ॥వి॥ 1717
"స్వార్జితం చ ఉత్తమం విత్తం, మధ్యమం పిత్రార్జితం, అధమం భ్రాతృసంపాద్యం"

క. చరణంబులు పది తోకలు
పరగంగా మూఁడు తలలు బైటనె తిరుగు
న్వర భూమి తల్లడిల్లఁగ
విరవొందఁగ దీని దెలియు । మిలలో వేమా ! 1718
ఇది వేదాంతార్థమును విచిత్రవిడికథల గలిగిన పద్యరత్నము. నాగలి పొడుపు కథ : శరీరము వేదాంతము.

తే. చర్చమీఱిన జ్ఞానంబు । సంతరించి
మూర్ఛఁజెందిన యట్లున్న । ముక్తిగలుగుఁ
గూర్చి మెచ్చఁడె ? గుఱిదాటి । కోవిదుండు
తీర్చు గురువరి జేరంగఁ । దివిరి వేమ. 1719
చర్చమీరిన = కార్యాతీతములైన ; బాహ్యస్పృహ లేకుండుటయే ముక్తి.

ఆ. చర్మమునకు స్పర్శ । సరవితోఁ దెలియుఁడు
కర్మములు పొసగుటఁ । గానలేరు
చర్మ కర్మములివి । జగతిలో నరులకు ! ॥వి॥ 1720
చర్మము = శరీరము ; కర్మము = చేసేపని.

ఆ. చర్మ మెపుడు జీవ । సౌఖ్యంబు గోరును
జీవి కర్మములను । జేరుఁ గాక
జీవి కర్మమెల్లఁ । జెడ రోయఁ దత్త్వమా ॥వి॥ 1721
" కర్మాంతం తత్త్వం "

ఆ. చింత చెంత నుండుఁ । జేమంతి, పూబంతి
కాంతఁ జూడఁదలచుఁ । గౌగలింప
సంత మంతనమున । నాసంచ కేళ్ళి రా ! ॥వి॥ 1722
కామముచే కాంతను కౌగలించినవాడే ఘనుడు

తే. చింతనామృతపాన వి । శేష మత్త
చిత్త మమరిన ఘనులందుఁ । జిన్మయంబు
వినుతి కెక్కని పరిపూర్ణ । విద్యయగును
అట్టివారల గురులఁగా । నరయు వేమ. 1723

వేమన పోతనామాత్యుని సహాధ్యాయత్వము నిటజూపించెను.

ఆ. చింతపండు, రాగి, చిలు మూడఁగొట్టెడు
నట్టి యోగి యిలను । గట్టివాఁడు
ఉప్పు మూసనుంచి । యూది తాఁ జెడనేల ! ॥వి॥ 1724

బంగారుయోగమును బ్రస్ఫుటించాడు కవిదిగ్గజం.

ఆ. చింతపండు రీతి । చేరి చేరక భువిని
సన్యాసి యోగంబు । సలుప వలయు
సంసారి యిట్లుండె । సన్యాసి కధికమా ! 1725

ఊరిడిపలె వర్తించినవాడే ఉత్తమ యోగి.

ఆ. చింత పారఁదోలి । చెవియొగ్గి వినఁగనె
కొంత హితవు లమరి । కోర్కెఁ దీర్చుఁ
గాంతఁ జేరె మరగి । గుమకించి చూడరా ! ॥వి॥ 1726

ముచ్చటఁగా ముక్తికాంతతో యత్తచిత్తుఁడగుట ఉత్తమము.

ఆ. చింత మాని కొనను । జేరిన నలకాంత
వింతఁజూపి చనును । విడువరాదు
పంతగించి దానిఁ । బట్టిననే మేలు ! ॥వి॥ 1727

ముక్తికాంతయొక్క ముచ్చట ముక్తసరిగా జెప్పేడు ముముక్షువు.

తే. చింత వలదయ్య గురువర । మంతనమున
నంకితంబుగ నామంబు । నమరఁజేసి
నాదుభక్తిని మీ యందుఁ । బాదుకొల్పి
చెప్ప సాగితిఁ బద్యముల్ । క్షితిని వేమ. 1728

అభిరామయ్య అనగా వేమన గురువు; ఆయనను మోసంచేసి గురూపదేశం పొంది పశ్చాత్తాపయుక్తముగా గురుపదములంటి చెప్పిన పద్యమిది.

ఆ. చిక్కి దక్కఁబోదు । చిగురించు మదిలోన
నిక్కఁ బట్టి గుఱుతు । నెఱయఁ జూచి
సొక్కియున్న ఘనులు । సూత్రాత్ము లగుదురు ॥వి॥ 1729

మనస్సు లక్ష్యముంచి గురుని జూచినవాడు సూత్రము తెలసినవాడగును.

ఆ. చిక్కియున్న వేళ । సింహంబు నైనను
బక్కకుక్క మీఱి । బాధసేయు
బలిమి లేనివేళఁ । బంతములెల్లవు ॥వి॥ 1730

బలముయొక్క ప్రాధాన్యత ప్రస్తావించాడు కవికుల గురువు.

ఆ. చిగురుఁజెట్టు మీఁద । చింతపువ్వులు పూచి
నిమ్మపండు పండు । నిమిషముసను
దారు చెడకమునుపె । దానిని దినవలె ॥వి॥ 1731

కూట వేదాంతాన్ని వాటుగు బాటలో పరువులెత్తించెను.

ఆ. చిత్తమందు నుండు । శివునిని భావించి
భక్తితో హృదయము । పదిలపరచి
నిత్యమెరుగు వాఁడు । నిశ్చల చిత్తుండు ॥వి॥ 1732

పరిపూర్ణము తెలిసినవాడే పరమభక్తుడు.

ఆ. చిత్తమందు శివునిఁ । జింతించి చూచిన
హొత్తు కొనుచు బదవి । హానిలేక
పొత్తు మఱవఁగానె । పొందురా! సుఖకేళి ॥వి॥ 1733

ముక్తికాంతయొక్క మూలము తెలసిన పూర్ణానందము బొందగలడని పూజ్యుని వాక్కు.

ఆ. చిత్త మనెడు వేరు । శిథిల మైనప్పుడె
ప్రకృతి యనెడు చెట్టు । పడును విడవఁ
గోర్కులనెడు పెద్ద । కొమ్మ లెండునుగదా! ॥వి॥ 1734

వృక్షముతో చిత్తాన్ని ఒయ్యారంగా పోల్చాడు యోగి.

ఆ. చిత్త మవలీల జేర్చెడు । చిన్మయుండు
మత్తుఁడై మించి పరమార్థ । మహిమఁ గూడి
యున్నదన్నది కన్నది । యెన్నబోడు ॥విమల॥ 1735

సుకర ప్రాసలువాడుటలో నికరమైన ప్రజ్ఞ చూపించాడు నెరయోగి.

తే. చిత్తమవ్వల జేర్చెడు । చిన్మయుండు
మత్తతయు లేక పరమాత్మ । మహిమఁ గూడి
యున్నదన్నది కన్నది । యెన్నఁ బోక
నిత్యవస్తువె గుఱుతింప । నేర్చు వేమ. 1736

నిత్యము = శాశ్వతము ; విజ్ఞాని శాశ్వతము కొరకే ప్రయత్నము చేస్తాడు.

ఆ. చిత్తము గలయోగి । శివునివలెనె యుండు
మధ్యయోగి యుండు । మిడుతవలెను
నిత్యుఁడైన యోగి । నీవలె నుండురా ! ॥వి॥ 1737

ఉత్తమ, మధ్యమ, అధమ యోగులను నిర్ణయించాడు ; మిడత=మిట్టిపడేది.

క. చిత్తము, బుద్ధియు, మనసును
హత్తు నహంకార గుణము, నాత్మకు లోగా
మొత్తముఁ జేయఁగ నేరని
మత్తులకును లేదు ముక్తి । మహిలో వేమా ! 1738

త్రిగుణాలను నిలుపలేనివానిని దేబెగా వాడెను.

క. చిత్తరువు ప్రతిమ కైవడిఁ
జిత్తమ్మును కల్ప మడఁచి । చిరతర బుద్ధిం
జిత్తునఁ దెలిసిన వాఁడై
యెత్తిన సుజ్ఞాని యందు । రిహమున వేమా ! 1739

ఏకాగ్రచిత్తు డగువాడు లోకారాధ్యుడు కాగలఁడు.

తే. చిత్తవృత్తులు మదియందుఁ జేరనీక
రిత్త బయలున గుఱి మించి । రే బగల్లు

మత్తుఁడై యుండు వాఁడెపో । మాన్యుఁ డరయ
సత్తుఁ దెలిసి యొకరి జేర । సరవి వేమ. 1740

బయలునుఁజూచినవాఁడే బ్రహ్మవేత్త.

ఆ. చిత్త వాజి నెక్కి । శిక్షింప నేరక
తత్తరపడి నంత । దరల నేల ?
వారణాసి తనకు । వైయాసి గాఁబోలు ॥వి॥ 1741

వారణాసి = కాశి; మనసు అనే గుఱ్ఱాన్ని ఎక్కి వారణాసిని జేరినవాఁడే పరమయోగి.

ఆ. ఆత్మశుద్ధి కల్గి చేసిన । పుణ్యంబు
కొంచెమైన నదియుఁ । గొదవ గాదు
విత్తనంబు మఱ్ఱి । వృక్షంబునకు నెంత ? ॥వి॥ 1742

భక్తిప్రపత్తులకు పరిమితిలేదు.

ఆ. చిత్త శుద్ధియొకటి । శ్రేష్ఠలాంఛనమగు
నిఖిల పుణ్యకార్య । నిర్వహణము
నద్దిలేక చేయ । ననువుగా నొప్పదు ॥వి॥ 1743

“ చిత్తం శ్రేష్ఠాఽతిశ్రేషం ”

ఆ. చిత్త శుద్ధి లేక । సీమలు దిరిగినఁ
గష్టమానసుండు । కానలేఁడు
భక్తి గలుగువాఁడె । పరమగురుం డౌను ॥వి॥ 1744

సీమ = నాడు, “ భక్తిశ్రద్ధానుష్ఠానం పరమయోగీంద్ర లక్షణం ”

ఆ. చిత్రదీపములవలెఁ । జింతల నిగ్రఁ ద్రొక్కి
మిత్రముగను మనసు । మెలఁకు వెలిఁగి
శత్రు గుణములెల్ల । సాధించుటయె ముక్తి ॥వి॥ 1745

చిత్రదీపము = రంగురంగుల దీపము. శత్రుగుణాలు సమసిన సరియైనజ్ఞాని యగునని వేమన వాక్కు.

ఆ. చిత్రమంత మహిమ । సిద్ధికిఁ జిన్నది
పుత్రుని భువి గనెను । బూర్వమందుఁ
దండ్రి లేని సుతుఁడు । ధాత్రిని నేలెరా ! ॥వి॥ 1746

విచిత్రవిడికథ మరియు కూటవేదాంతము క్రమమ్మరించాడు కవిచంద్రుఁడు.

క. చిన్నది మెలఁప్రాయంబునఁ
గన్నది; పతిలేక సుతుని । గడుఁ జిత్రముగా
నెన్నఁడు రతి సుఖ మెఱుఁగదు
చిన్నియ్యక పెనిచె నౌర ! । జగమున వేమా ! 1747

చిత్రాతి విచిత్ర చిత్రంబులగు కూటవేదాంత విద్య గురుకులము వారలకు గూర్చెను యీపద్యములు. పోడుపుకథ (రాట్నము.)

ఆ. చిన్ననాఁటనుండి । చేసిన కర్మంబు
పిన్న పెద్దలకును । బెఱిగి వచ్చు
మంటి మింటి నడుమ । మది నిల్పి చూడరా ! ॥వి॥ 1748

"చేసినవాడికి చేసినంత మహదేవా" అను నార్యోక్తి.

ఆ. చిన్నబిడ్డను లేమి ? । చేతి బిడ్డను లేమి ?
పెద్ద బిడ్డను లేమి ? । పృథివి యందు
ఇన్ని బిడ్డల తోడు । యమధర్మరాజొకడె ॥వి॥ 1749

మన మనుగడను మంచిగా మార్చాలన్న యమధర్మరాజును జెప్పుదురు మనవారు

ఆ. చిన్మబిలముఁ జేరి । చిన్మాత్రుఁడవు కమ్మ
వన్నె మిగిలినంత । కన్నె వచ్చి
చన్ను గుడిపి నిన్ను । మిన్నందఁ జేసెడి
నెన్నరాని మహిమ మెఱుఁగు వేమ. 1750

మోక్షకాంత నీ ధ్యాననిష్ఠల కలవడి లాలించి పాలిచ్చి పెంచగలదు.

కం. చిన్మయ బాలుని మదిఁ గల
తన్మయ పురియందుఁ జూచి । త్రగులక యున్నం

జన్మములు దాటవచ్చును
సన్మననమునఁ బూర్ణ మనుల । సారము వేమా ! 1751

చిన్మయబాలుని = చిన్మయబ్రహ్మమును ; మంచిమనసులో పూర్ణమును మననము చేయుట మార్గమని యోగిసూక్తి.

తే. చిన్మయానందపురి నడి । సీమఁ జేరి
తన్మయుండైన పరశివ । తత్త్వవేత్త
మన్మయం బగు రాజ్యంబు । మరిగియుండు
జన్మరాహిత్య మందు । నిజమ్ము వేమ. 1752

తేటగీతికలోగూడా వాటమైన ప్రాసానురక్తితో తేటతెనుగు మాటల దాటును వేదాంతాన్ని సూటిగా జెప్పాడు కవిరాజు.

కం. చినుకులు పడఁగా మొలచిన
ఘనతరమగు సస్యమందు । గాచిన కొలుచు
ల్మనుజులు దినఁగా నప్పుడు
కన నింద్రియములకు భ్రాంతి । గలుగును వేమా! 1753

చంద్ర, మరుత్, మన్మథ, మేఘోపాలంబన విరహులయెడ బ్రస్తావింతురు.

ఆ. చినుగుబట్ట కాదు । చీనాంబరము గాని
ముఱికి యొడలు గాదు । ముక్తి కాని
పరమ యోగి మహిమ । పరికింప నరుదురా ! ॥వి॥ 1754

బాహ్యవేషములుగాక అంతర నిర్మలత్వమే ఆనందకేళి.

ఆ. చిన్నె లంతె కాని । సృష్టి లౌకిక మగు
నందువల్ల నేమి । యాశ కద్దు
ఒక్కడైన వాఁడె । యుత్తమ పురుషుండు ॥వి॥ 1755

"చిత్తైకాగ్రత శ్రేష్ఠమనుమిమ్మా ; చిదానందునిచేయగబాటా"

ఆ. చిప్పఁ బడ్డ స్వాతి । చినుకు ముత్యంబాయె
నీటఁబడ్డ చినుకు । నీళ్ళఁ గలిసెఁ
బ్రాప్తము గలచోట । ఫలమేల దప్పురా ? ॥వి॥ 1756

లోకజ్ఞానాన్ని ఆఫలోకించిన వాడు.

ఆ. చిఱుతనాఁడు నీవు । చేసిన కర్మంబు
మఱతువేమొ ? మదిని । మల్లడించి
తఱిమి ముట్టుఁ జావు । తలపడినప్పుడు ॥వి॥ 1757

కర్మజీవులు కర్మబద్ధులు కాగలరు.

ఆ. చిలుక గర్భమందుఁ । జెలగి శుకుఁడు పుట్టె
మఱియొకండు పుట్టె । ఖరము వలన
నిట్టి ఋషికులంబు । నెంచంగఁ బనిలేదు ॥వి॥ 1758

మన పూర్వ బ్రహ్మవేత్తలగు మహర్షులందరూ నానాయోని సంభవులే.

ఆ. చిలుక గర్భమందు । శ్రీశుకుఁ డుదయించి
మునివరేణ్యులందు । ముఖ్యుఁ డయ్యె ?
బ్రత్తికాయఁ జిత్ర । పటములు పుట్టవా ? ॥వి॥ 1759

మనస్సే ప్రధానముగాని మానముగాదు.

ఆ. చిలుకనోరు గొట్టి । చిత్తజు మెడగట్టి
కచ్చడంబు బిగియఁ । గట్టుకొన్న
మనసు వశముఁగాదె । మహి నేమి పాపమో ! ॥వి॥ 1760

చిలుక వాహనుడు, పుష్పములు ధనస్సుగా గలవాడు, తుమ్మెదలు అల్లె త్రాడుగా గలవాడు, శరీరములేనివాడు మన్మధుఁడు. వాడిని గెలుచుట కష్టము.

ఆ. చిలుము పూడిన రాగి । చెల్లును పరమందు
చిలుము పూడని రాగి । చెల్లఁబోదు
పులుసు వోల్లని రాగి । చిలుమెట్లు పూఁడురా ? ॥వి॥ 1761

చిలుము = ఖిలము ; వస్తుగుణ తత్త్వవేత్త్వ వేదాంతకవి త్త్వ తత్త్వవేత్త్వ.

ఆ. చీకటింటఁ జేరఁ । జేదివ్వె లేకయె
ఠాక గానరాదు । రూఢిగాను
రాక పోక లడఁచి । రవములో విని సౌఖ్య ॥వి॥ 1762

గాలి రాక పోకలడచి హృదయ కుహరములోనున్న జ్యోతిని జూడమన్నాడు.

ఆ. చీకటింటఁ జేరి । చింతింపఁ బనిలేదు
రాక పోక లెఱిఁగి । రంగు మీఱ
నొక తేజ మంటి । యిలః ద్రొక్కి చూడరా ! ॥వి॥ 1763
అంధకారములోబడి యలమటించనేల ? విజ్ఞానముతో వెలగరాదా !

ఆ. చీకటింటఁ బుట్టిఁ । జీకటిఁ బెరిగిన
జీకటి మఱుఁగున నె । చిక్కనేలఁ
జీకటిఁ దెలిసిన । సృష్టి కాన్పింపదా ? ॥వి॥ 1764
మగువనూ మాయనూ మనసునుంచి విముదల చీటీ నుపయోగించమన్నాడు.

ఆ. చీకటింటికిఁ బోయి । చంద్రునిఁ బిలిపించి
పూడ్చిపెట్టిన సొమ్ము । పెళ్ళగించి
యముని వీపునఁ బెట్టి । యెత్తించుకొని పోర ! ॥వి॥ 1765
మతులు బోయే యతుల గతుల రీతిగా యతుక బడింపీపద్యము.

ఆ. చీకటెచట దాఁగు । సిగ్గెచటనుఁ దాఁగు
నాకలెచట దాఁగు । నాత్మలోన
నిద్ర దాఁగుచోట । నిజ మని తెలియరో ! ॥వి॥ 1766
భ్రూమధ్యమే పూర్ణాన్ని తెలయగలదు.

ఆ. చీమ కుట్టనేని । జీవు కనుపించును
జీవు డెంత దాని । జీవ మెంత
చీమవంటి గురుని । సృష్టిలో నెఱుఁగరా ! ॥వి॥ 1767
అణువులలో అణువు గురువులలో గురువు గణనకెక్కెను.

ఆ. చీమ దూరగ లేని । చిట్టని యడవిలో
దుర్జనుం డేలాగు । దూరగలడు ?
అట్లు గాదని దూర । నామంట నిలబోదు ॥వి॥ 1768
జ్ఞానారణ్యాన్ని జొరగా జ్ఞానులే సమర్థులు.

ఆ. చీము రక్తముఁ జలము । జిడ్డు తొమ్మిది పుండ్ల
కైన మందు నొకటి । నందుఁగొంటి
పాప నాశకుఁడగు । పరమేశు పదభక్తి ॥వి॥ 1769
నవ రంధ్రముల నొలికే నానారక్తమును కట్టించుటకు నారాయణుడే కర్త.

ఆ. చీరఁగట్టి రాత్రి । సిగ్గున నొరగును
బగలు చీరవిడుచు । ప్రజల యెడల
జేడె గాదుర యిది । చే వాడికత్తిరా ! ॥వి॥ 1770
శ్లేషలో స్త్రీకిన్నీ విచిత్ర పద్యానికిన్ని చెప్పేడు

క. చీలలుగ నైదు వుండిన
జాలుగఁ దను వనెడి రథము । జగములఁ దిరుగుం
జీల యొకటి యూడి పడిన
వేళను దను వనెడి రథము । వీడును వేమా ! 1771
పంచవాయువులు గల్గిన శరీరమును రథముతో రమ్యంగాపోల్చాడు రాజయోగి.

ఆ. చుక్కలన్ని నెంచి । లెక్కపెట్టగ వచ్చు
* సూర్య చంద్ర కాంతిఁ । జూడవచ్చు
ఆత్మనాథుని తోటి । ఆట్లాడు టరుదురా ! ॥వి॥ 1772
ఆత్మలింగాన్నవలోకించుట మహాకష్టము.

తే. చెంది చెందని చూడ్కి లో । నందుకొనుచు
నెంచుఁ జూచినఁ దన్మధ్య । మెఱిఁగియున్న
సుందరాకార కాంతిలోఁ । జూడ్కితగిలి
పొందరానట్టు బయలంది । పొందు వేమ. 1773
హృదయములోనున్న పరమాత్మని లీలగా చూడమన్నాడు.

కం. చూచెడి వరకే సాధన
చూచిన మదియందు దోచి । సులభం బగునా
తోచెడి మర్మము నీవని
కాచుక సద్గురుని గోరిఁ । గనవలె వేమా ! 1774
సాధకునకు నన్నియూ అవలీలగా అందగలవు.

ఆ. చెట్టు చేమ గొట్టి । చుట్టు గోడలఁ బెట్టి
యిట్టు నట్టు పెద । యిల్లు గట్టి
మిట్టిపడును నరుఁడు । మీఁది చేటెఱుఁగక ॥వి॥ 1775
“ అహంబ్రహ్మాస్మి ” అను అహంకారము కూడదు.

ఆ. చెట్టునందుఁ బుట్టి । చెలరేగు కాయలు
దనరు కాంతి తోడఁ । దగిలి పండ్లు
పండు వానిఁ దింద్రు । వర్ణంబుఁ దెలియు దే ! ॥వి॥ 1776

శరీరములో నుదయించిన మోక్షఫలము విచక్షణతో నీక్షించ మన్నాడు కవి.

ఆ. చెట్టుపాలు జనులు । చేదందు రిలలోన
నెనుము గొడ్డు పాలె । యెంత హితవొ
పదుగురాడఁగానె । పాటియై ధరఁజెల్లు ॥వి॥ 1777

"నలుగు రన్నమాట నాణెమౌ బాటరా ! ఐక్యమత్యమున్న యడ్డేమి యుండునా !"

ఆ. చెట్టు పుట్టు చోట । చెలరేగు కాయలు
ధరణి కత్తిచేత । తరుగవలయు
వండి తినిన కాయ । వర్గంబుఁ దెలియుఁడీ ! ॥వి॥ 1778

చెడ్డ విడచి శీఘ్రమె మంచి నార్జించుము.

ఆ. చెట్టు బట్ట వెనుక । చే తోకువై యుండు
వంత తాడు గట్టి । వగడు గంద్రు
యాడువారి కింత । నడగుట జెప్పరో ! ॥వి॥ 1779

అంతరార్థము శబ్దార్థములు అగోచరములుగా నున్నవి.

ఆ. చెట్టుమీద నీడ । చెలగి యింతయు లేదు
చెట్టు మునిగి నీరు । చేరలేదు
చట్టు రీతి నుండ । చెట్టేల చచ్చురా ! ॥వి॥ 1780

కూట వేదాంత కోవిదులకు నూటిప్రశ్న

ఆ. చెట్టు మొదటి పాలు । శివుని కంటను దీసి
చెట్టు మొదటఁ బోసి । శివునిఁ గొలిచి
చెట్టు వలెనె యున్నఁ । జావెట్లు కల్గురా ! ॥వి॥ 1781

పాదరసమును గుళిక కట్టే విధానము నిదానంగా తెలుసుకొమన్నాడు.

ఆ. చెట్టు మొదలు లేదు । చెలగి కొమ్మలు నాల్గు
బట్ట బయట మ్రాను । పండ్లు పండుఁ
దినఁగనె చవిలేదు తీపులు । మెండయా ! ॥వి॥ 1782

సాధన చతుష్టయముచే శరీరభ్రాంతులను సాధించ మన్నాడు.

ద్రిప్పలు పడకయె చూచిన
నొప్పుగ జగమెల్ల నిండి । యుండును వేమా ! 1788

తనను తాను తెలుసుకొన్నవాడే ధన్యుడు.

ఆ. చెప్పులోని రాయి । చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు । గాలి ముల్లు
నింటి లోని పోరు । నింతింత కాదయా ! ॥వి॥ 1789

దీనిని లోకనీతిగా వేదాంత పరముగా విజ్ఞాన పరమార్ధములుగా ప్రాజ్ఞు లూహింతురు.

ఆ. చెఱకు తోట లోనఁ । జెత్త కుప్పుండినఁ
గొంచెమైన దాని । గుణము చెడదు
మెఱుక గలుగు చోట । నెడ్డవాఁడున్నట్లు ॥వి॥ 1790

ఉపమానోపమేయములు ఉన్నత స్థాయిలో నున్నవి.

ఆ. చెఱకు తీపి లేమిఁ । జెత్తనాఁ బడునట్లు
పరగు గుణములేని । పండితుండు
దూఱువడును గాదె । దోష మటుండఁగ ॥వి॥ 1791

" పండిత స్సమ దర్శనః "

ఆ. చెఱకులోన నైన । జెడ్డగుణం బున్నఁ
దీసివేయ కున్నఁ । దినఁగఁ బోనఁగ
దంతిపురపు ద్రోహి । యాఁతఁడెట్లుండురా ! ॥వి॥ 1792

" తల్లిదండ్రినైన । తనగురువునైన, తప్పుచేయ శిక్ష । తక్కరాదు "

ఆ. చెలగి గృహము ధనము । క్షేత్రము ద్విజులకు
దాన మిచ్చునట్టి । ధర్మ పరులు
బహుళ కాల మిలను పాలన । చేయుచు
నిండు భోగములను నుండు వేమా ! 1793

ద్విజులు = రెండు పుట్టువులు కలిగినవారు (బ్రాహ్మణులు)
" బ్రాహ్మణో మమదేవతాః "

ఆ. చెలిమితోడ ముందు । చింతించి గగనంబు
బలముతోడఁ బ్రాకి । భావ మూని
ఫల విహీనమైన । భావ చిన్మయమంది
విలయ మొందువాఁడు । విభుఁడు వేమ. 1794

వేదాంతులకు విజ్ఞానామృతాన్ని పెదజల్లాడు వేమనార్యుడు.

ఆ. చెలిమి మీఱ మదిని । జింతలు విడనాడఁ
బిన్న పెద్దలకును । బెఱిగివచ్చు
మంటి మింటి నడుమ । మదినిల్పి చూడరా ! ॥వి॥ 1795

పరంజ్యోతిని పరికించే వారికి బాట సూటిగా విరచించాడు.

ఆ. చెవిని నిల్లుగట్టి । చెప్పెను వేమన
బట్ట బయల నుండు । బ్రహ్మమనుచు
బుద్ధి గలిఁగి యందుఁ । బొంది సుఖింపుఁడీ ? ॥వి॥ 1796

“ వేదాతీతుడు వేమనసుమ్మా । వేమనవాక్యము వేదము సుమ్మా ! ”

ఆ. చెవుల లోను బుట్టు । రవమె యాకాశంబు
కన్నుల గనునదియె । కళల జ్వాల
ముక్కులోని గాలి । ముక్తికిఁ ద్రోవరా ! ॥వి॥ 1797

ముక్కుతో గాలి, కంటితో చూపు, చెవుల రవము ఇవి ముక్తికి మూలములని ముక్తసంగుడు ముక్తసరిగా జెప్పెను.

ఆ. చెవుల విన్న యట్టి । రవమును వివరించి
మనసఁ దెలిఁగినపుడు । మరులు కొనును
చెవులు శబ్దమునను । జెడరోయ ముక్తిరా ! ॥వి॥ 1798

దశ విధ నాదాలను విని హృదయములో లీనము చేయుటే ముక్తి :

సీ. చెవులు గోరును మంచి । జిలిబిలి పాటలుఁ
డియ్యని మాటలఁ । దెలుఁగు వినఁగఁ
జర్మంబు గోరును । సరవి తోడుత శీత
మృదుల సంపర్క సం । ఘదల నెప్పుడుఁ

గన్నులు గోరును । గమనీయ వర్ణంబు
లైనట్టి రూపంబు । లనువు తోడ
నాలుక గోరును । నయము తోడను దీపు,
నొగరు, గారముఁ । జేదు నుప్పు బులుసు
ముక్కు-గోరును సద్గంధ । ములను జెలఁగి
చెవులుఁ, జర్మంబు, గన్నులు, । జిహ్వ, ముక్కు,
నిన్నియును గూడి నటువంటి । యింటిరోసి
తన్ను గనుగొని సుఖియింపఁ । దగును వేమ. 1799

పంచేంద్రియ భ్రాంతుల వంచించిన వైరాగి వైరాగి.

క. చేకొని పరోప కారం
చే కొంఆగా మహిమ లెల్ల । నెఱిఁగెడు విధమై
ధీకాదికమును జెప్పెను
సాకారము గాఁగఁ గాని । యంత్యము వేమా! 1800

నీతి శాస్త్రన్ని నిర్మలభావముతో చెప్పేడు.

ఆ. చే కొనుచును దమకుఁ । జే సాచి నంతలోఁ
జెడిన ప్రజల రక్ష । సేయలేని
తనదు సాగు లేమి? । తన తను వదియేమి? ॥వి॥ 1801

"ఆపద్ధర్మం అంచితశీలం మానస పూజా మానుషధర్మం"
ఆపదలో ధర్మాన్ని, మానసములో పూజించమన్నాడు.

ఆ. చేటు వచ్చు వేళఁ । జెడనాడు దైవంబు
మేలువచ్చు నేని । మెచ్చు కొనును
గరిమ మేలు, కీళ్ళు, కావటి కుండలు ॥వి॥ 1802

సహజ కవిత్వము సహజోపమానములు జాలువారించు చతురత
మాకవి చతురాననునకే గలదు.

ఆ. చేటు వచ్చెనేనిఁ । జెడనాడు దైవంబు
మేలు వచ్చెనేని । మెచ్చుఁ దన్ను
చేటు, మేలుఁ దలపఁ । జేసిన కర్మముల్ ॥వి॥ 1803

"కర్మణ్యే వ్యాధి కారస్తే మాఫలేషు కథానిచ"
కీడున దేవుని, మేలున నేనని అంటాడు అజ్ఞాని.

క. చేతస్సంకల్పంబున
నీతిగ వర్తించి నపుడె । నిర్మల పదవుల్
ప్రీతిం బొందక యుండును
భూతలమున నధిక యోగ । పురుషుఁడు వేమ. 1804

" శ్రీరాజయోగ సామ్రాజ్యం నిర్వికల్ప విరాజితం
తస్యానుభవసిద్ధ్యర్థంగురుసేవా కరోతియః "
గురుసేవయే ఉత్కృష్టము.

క. చేతస్సంకల్పంబులు
నీతి న్వర్జించి నపుడె । నిర్మల పదవుల్
ప్రీతిగఁ బొందు నటందురు
భూతలమునఁ బరగు । యోగ పురుషుఁడు వేమా ! 1805

మనస్సంకల్పములు మంచివైతే మహైశ్వర్యముఁను పొంచియుంటాడు.

ఆ. చేయఁదగిన వేళఁ । జేసెడి కార్యంబు
వేగపడి యొనర్ప । విష మదాను
బుడమకాయ చేదు । ముదిసిన దీపౌను ॥వి॥ 1806

తొందరపడి యేపనీ చేయరాదు.

క. చేయవలెను సంసారము
చేయఁగఁ దాఁ జెరుపకుండు । జిత వెఱుఁగ దగుం
జేయక, చెఱుపక, యెఱిఁగిన
మాయకు లోబడక యుండు । మహిలో వేమా ! 1807

జిత = జయించిన; చెడ్డపనులుచేయక ఇతరులచెరుపకుండుటయే శ్రేష్ఠము.

తే. చేరి యష్టాక్షరము లెంచి । దారి మిగిలి
కోరికలు లేని మోక్షాధి । కారియగుచు
బోరి చిత్పరమందినఁ । బొంచి మించు
దారి విడనాడుటను ముక్తి । తలఁగు వేమ. 1808

అష్టాక్షరీ మహామంత్రం అన్నిటికన్నా మిన్నయని మావేమన్న తిన్నగా జెప్పాడు.

తే. చోరులకుఁ జిక్కిపోయిన । తీరె యగును
నోట గుణియించు మత్రంబు । నీటఁ గలియు

మాటలందును బరమాత్మ । మరిగిరాడు
చిత్తమున స్వస్థతయె లేమిఁ । జెడుగు వేమ. 1809

"సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం, నిస్సఙ్గత్వే నిర్మోహత్వం,
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః ॥భజగో॥
మోహము లేకుండా తత్త్వాన్ని తెలిసినవాడే ధన్యుడు. జీవన్ముక్తుడు.

## చ

ఆ. చందమామ నీడ । జక్కఁగాఁ దనలోన
నుండఁ జూచి కేల । నూది పట్టి
వెన్నెలలు బయటను । వెదకినంతనె ముక్తి ॥వి॥ 1810
దివ్యజ్యోతియొక్క దేదీప్యమును తనలో చూడమన్నాడు యోగిపుంగవుఁడు.

ఆ. చందమామ వెలుఁగు । జక్కఁగా బరికింపు
వెన్నెలందలరెడి । వెలయు బయట
దానిరూపుఁ దెలియఁ । గానె ముక్తి ఘటిల్లు ॥వి॥ 1811
పైపద్యభావానిని పదమార్పులతో యీపద్యము వ్రాయడమైనది.

ఆ. చంద మెఱిఁగి మాట । జక్కఁగా జెప్పిన
నెవ్వడైన మా । రికేల పలుకు
చందమెఱింగి యుండు । సందర్భ మెఱుఁగుమీ ! ॥వి॥ 1812
లోకులకు ప్రాకటమైన హితోపదేశము.

ఆ. చంప గూడ దెట్టి । జంతువు నైనను
జంపవలయు లోక । శత్రు గుణము
తేలు కొండిఁ గొట్ట । దేలేమి చేయురా ? ॥వి॥ 1813
శత్రుగుణ సమూహాన్ని సమయజేయమన్నాడు.

ఆ. చంప దగిన యట్టి । శత్రుఁడు తనచేత
జిక్కెనేని గీడు । సేయరాదు
పొసఁగ మేలు జేసి । పొమ్మనుటే చాలు ॥వి॥ 1814
మేలిమి బంగారమునకు సువాసన యిచ్చినట్లు వేమన పద్యాలు
భావములు యొప్పుచుంటాయి.

ఆ. చంపఁ దలఁచు రాజు । చను వగ్గలౌ బిచ్చుఁ
జెఱుపనున్నఁ బగఱఁ । జెలిమి సేయు
గఱవనున్న పాము । నెఱి దాఁచుకొని యుండు ॥వి॥ 1815

నెఱి = పడగ. దుర్మార్గ లక్షణాలను వివరించాడు.

క. చంపిన బాపము వచ్చునుఁ
జంపిన బున్నెంబు వచ్చు । సర్వజ్ఞులకుం
జంపఁగ మనుపఁగ జెఱుపఁగ
నంపిన యావిధికె తెలియ । నౌరా వేమా! 1816

దుర్గుణములను దునుముటయూ, సద్గుణములను సాకుటయూ జ్ఞానుల లక్షణములు.

ఆ. చక్కగాను మదిని । జర్చించి కనవలె
ముక్కు తుదిని మించి । మురిపము గను
దృక్కు బ్రహ్మమనుచు । మొక్కినంతనె ముక్తి ॥వి॥ 1817

దృక్కులతో ముక్కుతుదను చక్కఁగా చూడమని మాసాధుబోధ.

ఆ. చక్కగాను మదిని । సాధించి కనవలె
నిక్కచూచు నెఱుక । నేర్పు మీఱ
ముక్కు తుదిని చూపు । ముదమందఁ జూడరా! ॥వి॥ 1818

ఆ. "కార్యసాధన కంటె । ఘనమైన చెదిలేదు, శ్రద్ధ భక్తి మించు । శక్తిలేదు"

ఆ. చక్కఁజేసి మదిని । సాధింపనేరమి
ముక్కుమీఁద దృష్టి । మొనయు టరుదు
నిక్కమైన జ్యోతి । నిన్నంటి యుండురా! ॥వి॥ 1819

నాసాగ్ర వీక్షణముచేత నవ్య పదాధిష్ఠితుఁడ వగుదు.

ఆ. చక్కఁదనము లేల? । సంపత్కరము లేల?
విద్య లేల? భూమి । విరివి యేల?
పుత్ర పదవి కన్నఁ । బుట్టునా! పదవులు ॥వి॥ 1820

"అపుత్రశ్చా గతిర్నాస్తి" పున్నామ నరకము దాటుటకు పుత్రుడు గావలయునని యోగి భావము.

క. చక్కని పూనిక తోడను
ముక్కు తుదన్నిలిపి మనసు । మూలముఁ గనమి
న్దక్కదు నిత్య వినోదము
దృక్కగు నా బయలుసేర । దృఢమగు వేమా! 1821

శాశ్వతానంద మందఁగోరిన చక్షుర్జ్ఞానము సాధించ వలయును.

ఆ. చక్కని సతియైన । సరసు రాలైనను
యే యొరులను గాన । నీయకున్న
నందె గ్రుంకినంత । నయ్యాట లాడదా! ॥వి॥ 1822

"ఆ. పగలు భార్యను బట్టి । బంధించు మగవాడు, మాపు వేళ నాతి । ప్రాపుగోరు"

ఆ. చక్కనైన వాని । ముక్కువఁ గన్నంత
దక్కువగును జూచుఁ । దనదు విభుని
ఆమ బుద్ధికంటె । నపర బుద్ధి యిఁకేది ॥వి॥ 1823

" రాజును జూచిన కండ్లు మొగుడును జూచి మొత్తును.

క. చక్కెరఁ గలిపి తినంగా
ముక్కిన తవుడైన లెస్స । మోహము గుమర
న్వొక్కడు బానిస యైన
న్మక్కువగను దివ్యభామ! మహిలో వేమా! 1824

రసికురాలైన కాంత తనకు సరి గాకపోయినా రసికుఁడు
పస గలిగినట్లే భావిస్తాడు.

ఆ. చచ్చిపడిన పశువు । చర్మంబు, గండలు
బట్టి పెరికి తిను । బరగఁ గ్రద్ద
అదియె మేలుర పతి । బ్రదికుండఁ బెటికేడి ॥వి॥ 1825

భర్తను బాధించే భార్య భ్రష్టురాలని భావం వ్యక్తము జేశాడు

ఆ. చచ్చిన పీనుఁగుఁ జూచి । నయ్యయ్యోయని
యేడ్చి గుంపులుఁ గూడి । పాడ గట్టి
కాటి కెత్తుక పోయి । కాల్చి వేతురు గదా! ॥వి॥ 1826

శ్మశాన వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము, పద్య మెల్ల
కలగూర గంపగా సాంబారు పులుసు రుచివలె నున్నది.

ఆ. చచ్చు వారలెవరు ? । చావని వారెవరు ?
చచ్చి బ్రతికి యుండు । జనము లెవరు ?
విచ్చల విడిగాను । వివరించి చూడరా ! ॥వి॥ 1827

పొడుపు కథగానే యున్నది. ఆత్మకు నాశనము లేదని అసలు భావం.

ఆ. చచ్చువారిఁ జూచి । చావని పుట్టని
తత్వమెల్ల నాత్మఁ । దలపుఁ జేసి
యరసి చూచినట్టి । యతనికే మోక్షంబు ॥వి॥ 1828

జన్మరాహిత్యాన్ని సాధించమని బోధించాడు మా సుబోధకుఁడు.

ఆ. చచ్చువారినిఁ గని । చావు నిశ్చయమని
తత్వమెల్ల నాత్మఁ । దలఁచి, తెలిసి
నదురు బెదురులేని । నడఁగల్గ ముక్తుఁడు ॥వి॥ 1829

అదురు బెదురులేక కుదురు గల్గినవాడే సుధానిధి.

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ । జావెంచివగచెడు
దీన నరుల వెఱ్ఱిఁ । దెలుపరాదు ;
ప్రాణమునకు మృత్యు । బంధంబు లుండునా ? ॥వి॥ 1830

శరీరానికే గాని ఆత్మకు చావులేదు.

ఆ. చదివి చదివి కొంత । చదువంగ, చదువంగ
జదువు చదివి, యింకఁ । జదువు చదివి
చదువు మర్మములను । జదువ లేఁడాయెరా ! ॥వి॥ 1831

" క. చచ్చిన చావని చదువులు
విచ్చల విడి చదువ వలయు విజ్ఞత మెరయన్.

ఆ. చదివి చదివి చదివి । చావంగ నేఁటికిఁ
జావులేని చదువుఁ । జదువ వలయుఁ
జదువులేక కోటి । జనులు చచ్చిరి గదా ! ॥వి॥ 1832

శాశ్వతానంద మిచ్చిన చదువే చదువు.

ఆ. చదివి, చదివి, చదివి । సారముఁ గనలేక
తిరిగి, తిరిగి, తిరిగి । దిమ్మరాయె ?
మరిగి, మరిగి, మెఱిగి । మఱ్ఱిల్లి చచ్చెరా ! ॥వి॥ 1833

“ పదలాలిత్యము, భావప్రాభవము నీ పద్యాలలో వేమనా !
గుడి గూడెన్ మధుర ప్రవంతియయి గైకోవయ్య మావందనాల్ ”

కం. చదివిన, దొరకదు మోక్షము
కుదురుగ మది నిలిపి గుఱ్ఱు । కొనసాగిన యా
చదువును మదిలోఁ జదివిన
చదువే పరిపూర్ణ బోధ । సారము వేమ. 1834

చదువులలో సార మెల్ల చదివినదే నిజమగు చదువు.

ఆ. చదివి నతని కన్నఁ । జాకలి సతి మేలు
కులము వేల్పు కన్న । గుక్క మేలు
సకల సురల కన్న । జార భామిని మేలు ॥వి॥ 1835

లోకాన్ని విజ్ఞాన విలోకనములతోఁజూచి సుజ్ఞాన బోధగా
దీన్ని సృష్టించాడు.

ఆ. చదివినయ్య కన్న । ముదుసలయ్యే మేలు
గృహము వేల్పు కన్న । గేదె మేలు
బాపనయ్య కన్న । బైనీఁడు మేలయా ! ॥వి॥ 1836

బైనీడు = బుడబుడక్కలవాడు ; బుద్ధితక్కువ చదువులు ఎద్దులను చేస్తాయి

ఆ. చదువరి మతి కన్న । సాధకు మతి మేలు
వేదములను లేదు । వాదములను
ఒడలు శుద్ధిఁ జేసి । యొడయునిఁ జూడరా ! ॥వి॥ 1837

వేద విద్యకన్న సాధన విద్యయే సర్వోత్కృష్టమని శాసించాడు

ఆ. చదువు చదువుకున్న । సౌఖ్యంబులును లేవు
చదువు చదివెనేని । సరసుఁ డౌను
చదువు మర్మమెఱిఁగి । చదివినఁ జదువురా ! ॥వి॥ 1838

“ క. చదువులలో మర్మమరసి చదువుట మేలౌ ”

—

ఆ. చదువు చదవనేల? । సన్యాసి కానేల?
షణ్మతములఁ జిక్కి । చావనేల
నతను భజన చేసి । యాత్మలోఁ దెలియుఁడీ! ॥వి॥ 1839

అతను = బ్రహ్మము; తనువులేని మన్మథుడు కోరిక లీరికలెత్తగా వారను జేరినవాడే సారమెరిగిన సరసుఁడు.

ఆ. చదువు రాదటన్న । సామాన్యత యికేల?
బుద్ధి కుదిర కున్న । పొంది కొకటి
గురుని గూర్చ ముక్తి । కరతలామలకమా ॥వి॥ 1840

కరతలామలకము = అరచేతిలో ఉసిరికాయ

క. చదువుల కందఁగ రానిది
ముదమున వదరంగనేల? । ముచ్చిలి యుక్తుల్
విదితములుగ మదిలోపలఁ
గుదిరిచి బ్రహ్మంబు నెంచి । కూడుము వేమా! 1841

బ్రహ్మజ్ఞానము నెరిగిన చదువే చదువుము.

ఆ. చదువులందు లేదు । శాస్త్రంబులను లేదు
వేదములను లేదు । వాదములను
బయటనుండు ముక్తి । పాటించి చూడరా! ॥వి॥ 1842

వేద, శాస్త్ర, పురాణేతిహాసములు చదువుట వాదములకే.

ఆ. చదువులందు లేమి । శాస్త్రంబులను లేమి
వాదములను దైవ । భేదములను
బయటనున్న ముక్తిఁ । బాటింప లేరయా! ॥వి॥ 1843

తర్కశాస్త్రము వలన తన్నుకొనుట తప్ప తత్ఫలమంద లేదు.

ఆ. చదువులందుఁ బాడి, । మొదవులందును, స్త్రీల
పెదవులందు, రాజ్య । పదవు లందు
నాశ లుడిగినట్టి । యయ్యలు గలరొకో! ॥వి॥ 1844

అంత్యాను ప్రాస నియమములు వాడుటలో పోతనగారి సహాధ్యాయత్వము సార్థకము చేసుకొన్నాడు కవి.

ఆ. చదువులందు రాజ । పదవులందును బాడి
మొదవు లందు స్త్రీల । పెదవు లందు
నాశ లుడుగునట్టి । యయ్యలు ముక్తులు ! ॥వి॥ 1845

వ్యామోహ ముడుగనిదే వనితా సంగమము యెవ్వారి సాధ్యముగాదు.

ఆ. చదువు లన్ని చదివి । చాల వివేకియై
కలుష చిత్తుఁడైన । ఖలుని గుణము
దాలిగుంటఁ గుక్కఁ । దలఁచిన చందమా ॥వి॥ 1846

దాలిగుంట = పొయ్యి ; పొయి బూడిదలోనున్న కుక్కబుద్ధివలె చదివిన ఖలుల బుద్ధులని మాఘునివాక్కు.

ఆ. చదువులన్ని చదివి । చాల వివేకింపఁ
గపటి కెన్నడైనఁ । గలదె ముక్తి ?
నిర్మలాత్మకునకె । నిర్వికల్ప సమాధి ! ॥వి॥ 1847

నిర్వికల్ప సమాధి = శాశ్వతానందపదవి ;
" మన్నుమిన్నుల వెన్నుదన్నేవన్నెగుత్కే తెన్నులెగసెడి
మిన్నమాటల మేల్మి మా వేమన్నదే మరిలేరికెవరు "

ఆ. చదువులన్ని చదివి । చాల వివేకియై
మగిడి తన్నెఱుఁగక । మంద జనుఁడు
విసుగు చదువటంచు । వెట్టియై చెడిపోవు ! ॥వి॥ 1848

విజ్ఞానాన్ని తెలుసుకోలేక అజ్ఞానులై అలమటించే వార్ని జూపించాడు.

క. చదువులు చదిచెడి యయ్యలు
పదవిని బొందంగ లేరు ? । పరమార్థమునం
బెదవులు గదలక యుండ
న్మదిలో నిది రాజయోగ । మార్గము వేమా ! 1849

" రాజయోగము రమ్యమందురు "

ఆ. చదువులెన్ని చదువ । సాధింపగా రాదు
ముక్తి నొరుల వలన । పొందరాదు
తాను కష్టపడిన । తగినంత సుఖమిచ్చు ! ॥వి॥ 1850

" కృషితో నాస్తి దుర్భిక్షం । జపతో నాస్తి పాతకం "
పనిచేస్తే బీదరికము, జపము చేస్తే పాపము పోవును.

ఆ. చదువు లెల్లఁ జదివి । సర్వజ్ఞులై యుండి
బ్రహ్మ విద్యలెల్ల । పదటఁ గలిపి
పడతి దలఁచునంతఁ । బరమ యోగము మాను ॥వి॥ 1851

పదట = బంద, బురద ; " స్త్రీల జూచినంత చిత్తంబు చెడిపోవు కచ్చడాలు గట్టు ఘనులకైన "

ఆ. చదువు వానికన్న । చాకలి తా మేలు
గుణము వేల్పుకన్న । కుక్క మేలు
* సర్వామరల కన్న । సకలేశ్వరుఁడు మేలు ॥వి॥ 1852

* గణ భంగమైన పద్యము గణు తింప దగినదే !

ఆ. చనఁగఁ జనఁగఁ దాకు । జను త్రోవలోఁ గాశి
వినఁగ వినఁగ బ్రణవ । విభవ రవళి
కనఁగ కనఁగఁ బుట్టుఁ । గారణ మాయరా ! ॥వి॥ 1853

సాధనము చేత సర్వమూ సాధ్యపడును.

ఆ. చను గుడిచిన శిశువు । సరస నిద్రింపంగ
స్వప్న మందుఁ జొచ్చి । సరగఁ బాడె
నగవు నేర్పుగాఁగ । జగమున జనులెల్ల
వింతఁ జూతు రపుడు । వెఱ్ఱివేమ. 1854

కలలు నిజముగా భావించి గాబరా పడువారల అవివేకతను జూపించేడు.

కం. చను వారెల్లను జనులం
జని పోయిన వారి పుణ్య । సత్కథ లెల్ల
న్వినవలె, గనవలె, మనవలె
ననిమిషులకుఁ దెలుపఁగూడ । దంత్యము వేమా ! 1855

అనిమిషులు = దేవతలు ;
దొంతర దొంతరలగా పదజాలము దొర్లించి మించాడు.

కం. చన్నుగవ రీతి సంపద
కొన్నాళ్ళకు బ్రేగుఁ జూపి । గొబ్బున వ్రాలు

న్వెన్నెల చీకటి సరియగు
నన్నా శివలింగ మాయ । లన్నియు వేమా ! 1856
అతీతమైన అనుభవ జ్ఞానము అంగనలచే సంపాదించి శృంగారముతో బంగారు భక్తిని ప్రబోధించాడు ప్రాకృతుడు.

ఆ. చన్ను గుడిచి పెరిగి । చన్నున కాసించి
చన్నువల్ల ముక్తి । చప్పనాయెఁ
జన్ను విడుచువాఁడు । సర్వదా యోగిరా? ॥వి॥ 1857
ఎన్ని చెప్పినా తిన్నగా అచ్చటికొస్తాడు.

కం. చన్నులు గుడిచియు మనుజులు
చన్నులపై గాంక్ష దగిలి । చత్తురె భువిలోఁ
జన్నులు మాంసపు ముద్దలు
చన్నులయం దేమికలదు । సారము వేమా ! 1858
మూన్నాళ్ళ ముచ్చట గొలిపే మురికిదేహంకోసం మురియవద్దన్నాడు

కం. చన్నులు పరసతి కొప్పినఁ
గన్నులకును బాప దృష్టి । గదియక మునుపే
యెన్నిక మునుఁ దా గుడిచిన
చన్నులుగాఁ జూడవలయు । సత్యము వేమా ! 1859
" మాతృభావము జూపి మసలవలయును "

ఆ. చన్నులు పరసతి కొప్పిన
వన్నియఁ గానంగ మదిని । వలవ దనికొన
న్మన్నొకటఁ దాను గుడిచిన
చన్నులె యనిఁ దలఁచునతఁడె । సాధువు వేమా ! 1860
ఆదే ఇదియైనా పదమార్పు సుధారసంగా ఉంది.

ఆ. చమురు గలుగు దివ్వె । సరవిగా నుండును
చమురులేని దివ్వె । సమసిపోవుఁ
దనువు తీరనేని । దలఁపుఁ దోడనె తీఱు ॥వి॥ 1861
" నిండుకుండ తొలకదు వెలితికుండ తొలకును "

ఆ. చాకి వాఁడు కోక । చీకాకు పఱచియు
మయిలఁబుచ్చి మంచి । మడుపుఁ జేయు
బుద్ధిచెప్పువాఁడు । గ్రుద్దిన నేమయా ? ॥వి॥ 1868
దిద్దితీర్చినవాడే దివ్యునిగా భావించాలి.

ఆ. చాడికాని మాట । చావిడిలో నిక్కు
వేటఁ బో శునకము । వెలయ నిక్కు
వెలదిఁ జూచునపుడు । విటకాఁడు నిక్కురా ! ॥వి॥ 1869
నిక్కు = బిరుసెక్కు ; సమ భావాలను జతగూర్చాడు ;

ఆ. చాలదయ్యె యింక । చార్వాక మతరీతి
శక్తి శైవ మనుచుఁ । జాల నమ్మి
సరణి మిగిలి చెడదె । చండాల సేవచే ! ॥వి॥ 1870
మతముల నదళించి మానవ మతమే మతముగా గ్రహించమన్నాడు

ఆ. చాలు చాలు నిలను । జనన మరణములు
మేలుగాని మాయ । మెలఁకువెఱిగి
పాలుమాల కిలను । భక్తిచేఁ బూనుము ! ॥వి॥ 1871
భక్తిని దాని ప్రాధాన్యతను ప్రస్తుతించాడు కవిసింహుడు.

ఆ. చాలుఁ జాలులేర । చార్వాక మతసంజ్ఞ !
తిరిగి తిరిగి మేలు । తెలియలేక
మలము మూత్రమాని । మంటి పాలై రొకో ! ॥వి॥ 1872
చార్వాక మత విధానముల అసహ్యించుకొన్నాడు.

ఆ. చావుఁ దెలియువాఁడు । సన్యసించుటదెట్లు ?
కడప లందుఁ గులముఁ । జెడిన యట్లు
పాప మొకటె మీద । ఫలమేమి లేదురా ! ॥వి॥ 1873
కడప = ఆత్మ ; మానసిక భావము తెలిస్తే కులము లేదు.

ఆ. చావు నేఁడో రేపొ । జతపడి వచ్చును
పెక్కునాళ్ళు కూడఁ । బెట్ట నేల ?
ననుచు నాశ లుడుగు । నంతటి వారేరి ? 1874
పుట్టినవాడు గిట్టక మానడు.

ఆ. చావు వచ్చినపుడు । సన్యసించునదెల్ల
గడకు మొదటి కులముఁ । జెడుటె కాదె
పాపమొప్పు వేత్తె । ఫలముండ బోదయా ! ॥వి॥ 1875

" దీప ముండగనే యిల్లు చక్క బెట్టుకో "

క. చావెద్దియొ పుట్టువు నదె
చావన భయ మందనేల ? । జన్మింపక ము
న్జీవికి దేహము లేదను
భావములో గుఱుతు నిలిపి । బ్రదుకుము వేమా ! 1876

" గురు ర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః
అన్యథా లభితం నాస్తి సత్యం సత్యం పునః పునః. "
సత్యము అన్నిటి కన్నా శ్రేష్ఠము.

ఆ. చుక్కలిన్ని యనుచు । లెక్కఁబెట్టఁగ వచ్చు
సూర్యమండలమునుఁ । జూడవచ్చు
ఆత్మనాథుతోడ । నాటలాడు టరుదు ! ॥వి॥ 1877

" చతుర్విధా భజంతేమాం జనా సుకృతి నోర్జున
అర్థో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ " (గీత)
అర్జునా నాలుగు విధములుగా నన్ను భజింతురు.

క. చుట్టుకొని యున్న మాయను
నెట్టుము గురుభక్తి మీఱ । నియతాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన
మట్టిట్టును జెదరకుండ । ననువుగ వేమా ! 1878

" జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మాత్కురుతే ర్జున " (గీత)
అర్జునా ! జ్ఞానాగ్ని చే సర్వపాపములు భస్మమగును.

ఆ. చుట్టు గోడఁ బెట్టి । చెట్టుఁ జేమయుఁ గొట్టి
యిట్టు నట్టు పెద్ద । యిల్లు గట్టి
మిట్టి పడును మీఁది । పట్టేల నెఱుఁగఁడో ! ॥వి॥ 1879

" అనిత్యాణి శరీరాణి విభవో నైవ శాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః " (గీత)
మృత్యువు మనల నానుకొని యున్నది

ఆ. చుట్టు పరిజనంబు । సుఖలీల చెలువంబు
నడుమ నాయకతయు । న ర్తనంబు
బ్రహ్మపదము మీరు । బ్రతుకుఁడు జనులార ! ॥వి॥ 1880

" నిరంజనం, నిష్ప్రతిమం, నిరీహం. నిరాశ్రయం నిష్కళమ ప్రపంచం
నిత్య ధృవ నిర్విశేష స్వరూప నిరంతరం రామ మహం భజామి "
రామనామము నిత్యము పారాయణ జేయుము.

ఆ. చూచి యనఁగఁ దగును । సూచన కనరాదు
చూడరాని దేది ? । చూడరాదు
చూడఁదగినదైనఁ । జూడంగ వలయురా ! ॥వి॥ 1881

" నిషేధేకృతే నీతి నేతీతి వాక్యై సమాధి స్థితానాం
యధాభాతి పూర్ణం అవస్థా త్రయాతీ తమేకం
తురీయం పరంబ్రహ్మ నిత్యం తదేవహామస్మి " (శంకర భాష్యం)
పరబ్రహ్మ నిత్యుడు.

క. చూచెడువరకే సాధన
చూచిన మదియందుఁ దోఁచి । సులభంబగునా !
తోఁచెడి మర్మము నీవని
కాచు కొనియు గురునిఁగోరి । కనవలె వేమా ! 1882

" భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమణో పాసకం మనః
భ్రమణేశ్వర భావిత్వం । భ్రమమూలమిదం జగత్ "
భ్రమచేత మనస్సులు తిరుగును.

ఆ. చూచువారికెల్లఁ । జూడ వేత్తెయుండుఁ
జూపుఁ జూచి తెలియఁ । జూచువారు
చూచినట్టి చూపు । చూపు తా మగుదురు ! ॥వి॥ 1883

" తీర్త్వా మోహార్ణవం హత్వా । రాగ ద్వేషాది రాక్షసాం
యోగశ్శాంత సమా యుక్తో హ్యాత్మారామో విరాజతే "
(యోగవాసిష్ఠం)
మోహము విడచి యోగము సాధించుడు.

ఆ. చూపు కొంచెమైనఁ । జుక్కలు కాన్పింపఁ
బ్రాపు వెలుఁగు లేదు । పరువుఁగాదు
జ్ఞాన దీపము వలెఁ । గన్నులకును దోఁచు ! ॥వి॥ 1884

సూక్ష్మ వీక్షణముల చేత సుందరానంద కారుని జూడమన్నాడు.

తే. చూపు చెదరని వృత్తిలోఁ । జూడ్కినంటి
యేపు మీఱిన మదియందు । రూపు మాపి
తన్నుఁ దాఁ గాంచుచుండును । దత్త్వవేత్త
నిర్వికారుండునా భువి । నెగడి వేమ. 1885

" సర్వేషా మపిదానానాం బ్రహ్మదానం విశిష్యతేః
వార్యన్న గో మహీవాస తిల కాంచన సర్పిషాం " (మనుస్మృతి)
బ్రహ్మత్వము గొప్పది.

క. చూపున ముద్రలు గనుఁగొను
చూపే గుఱి మనన సంజ్ఞ । చులకన యగునా
చూపునఁ దోఁచెడి యుక్తికిఁ
బ్రాపగు భవునెంచి మదిని । బనుపడు వేమా ! 1386

" నాహం దేహో నేంద్రియాణ్యం తరంగం నాహం కారః
నిత్యః ప్రాణవర్గో నబుద్ధిః దారా పుత్ర క్షేత్ర విత్తాది దూరసాక్షీ
ప్రత్యగాత్మా శివోఽహం. (శంకరభాష్యం)
అన్నీ అనిత్యం.

ఆ. చూపు రూపుల రెంటిని । జూచి దాని
యన్నియును గాక తన్నుఁ । దాగన్న దాని
నిర్మలంబుగ మదినెంచు । నిర్మలుండు
నిర్గుణ బ్రహ్మ మరచేత । నిలుపు వేమ. 1887

" నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి " (గీత)
యోగం చేసుకోమన్నాడు.

తే. చూపు రూపుల రెంటిని । జూచుదాని
నీకుఁ దెలియంగ మదినుంచ । నేర్పుఁ గనుచుఁ

గాపురంబగు కైవల్య । కర్త మూను
నిర్మల జ్ఞాని పనిఁబూని । నిజము వేమ. 1888

"వాచాతీతం మనోతీతం భావాతీతం నిరంజనం
జ్ఞానాతీతం స్థిరంనాస్తి సర్వాతీతం సదాచలం"
అన్నిటికి మిన్న బ్రహ్మం.

కం. చూపులఁ జూపై లోఁచెడి
రూపములకు రూపమదియె । రూపము గాకే
దాపై లోపల వెలుపలఁ
గాపగు పరిపూర్ణ మూని । కనవలె వేమా! 1889

చూపు నిలిపిన జూడవచ్చును పరిపూర్ణమును.

తే. చూపులోఁ జూపు వెలిచూపు । చూడనేల?
నాది యంతము లేనట్టి । దచలమగును
వేద గురుమూర్తి మది నుంచు । వేగముగను
సాధకం బెల్ల నలవడు । సరగ వేమ! 1890

సాధన చతుష్టయముచే వేదాతీతుని వీక్షించమన్నాడు వేమన.

ఆ. చూపులోని చూపుఁ । జూడంగఁ జూడంగ
దెలివిలోని తెలివి । వెలుఁగుచుండు
నిద్రలోని నిద్ర । నిజమని తెలియరో! ॥వి॥ 1891

నిద్రలోని నిద్రఁ నియమములతో జూచినవాఁడే నెరయోగి.

ఆ. చూపులోని చూపుఁ । జూడగాఁ జూడగాఁ
జూపులోనె బ్రహ్మ । చూడఁబడును
పెరుగుఁ దరువగాని । తరివెన్న రాదయా! ॥వి॥ 1892

విజ్ఞాన వీక్షణముల చేత విశ్వమయుని వీక్షించుటే శాశ్వతమని గురు వాక్కు.

ఆ. చూపులోని చూపుఁ । జూడనేర్చినవాఁడు
చూపులోన నుండి । చూచువాఁడుఁ
జూడఁజూడఁ దన్నుఁ । జూచు నిక్కంబురా! ॥వి॥ 1893

తన్ను దాను జూచిన వాఁడే తత్త్వవేత్త.

ఆ. చూపులోని చూపు । సుజ్ఞాన దాయిని
మనసులోని మనసు । మాయ తవులు
ఎఱుకలోని ఎఱుక । పరమయోగంబురా ! ॥వి॥ 1894
చూపుని, ఎరుకను, మనసును ఏకంచేయుమని కవి సుధాకరుని హెచ్చరిక.

ఆ. చూపులోని చూపు । సూక్ష్మమౌఁ దెలియంగఁ
జూపులోని చూపు । శుభ్రమగును
జూపులోని చూపు । సురవర గమ్యమ్ము ॥వి॥ 1895
సురలోకానికి వెళ్ళాలంటేఁ సుజ్ఞానిచూపు చూపులోని జూడమనుట

ఆ. చూపు వెలయఁజేసి । సూక్ష్మపు వృత్తిచేఁ
జిత్త మనెడు దివ్వె । చెన్ను పఱచి
పాప మనెడు తిమిర । మేపాఱఁ బాపని
పాపజాతి గురుఁడు । పశువు వేమ. 1896
అజ్ఞానాంధకార దిగ్గజమును విజ్ఞాన హరిచే హరింపఁజేయమన్నాడు

ఆ. చూరఁగొనుము దొరకు । సుజ్ఞాన మెల్లను
బార వేయు మెల్ల । పాపగుణము
దారిఁదెలియ బుధుల । దాపునమెలఁగురా! ॥వి॥ 1897
"చ. యుది యొక వేదవాక్కిదియె యీ సచరాచర జాలమెల్ల సృష్టిదమయి వేమనార్యుని విశిష్టము దెల్పెడి మేలుకొల్పురా !"

ఆ. చూలు వలనఁ బుట్టి । సుఖ దుఃఖములు రెండు
పతికి, సతికిఁ బుట్టుఁ । బరగు సుతుఁడు
సతికి, సుతుని వలన । సౌఖ్యంబు గలుగును ॥వి॥ 1898
తల్లి ననుసరించినవాడే తనయుడు.

ఆ. చొక్కమైన పరము । చుఱుకరివై చూడక
ముక్కుతుదను గూర్చి । ముదముతోడ
దక్కఁ జూచినంత । దగ్గరై యుండురా ! ॥వి॥ 1899
చుఱుకరి = మంగలికత్తి; సూక్ష్మమయిన పదును గలిగే జ్ఞానకత్తిచే అజ్ఞాన వల్లిని అంతం జేయమన్నాడు.

## ఛ

ఆ. ఛందమెఱిఁగి మాట । చక్కఁగాఁ జెప్పిన
నెవ్వఁడైన మాటిఁ । కేలఁ బలుకు ?
ఛందమెఱుఁగ ముందు । సందర్భ మరయుము ॥వి॥ 1900

యుక్తాయుక్త విచక్షణ ; ఉత్ప్రేక్షాలంకారము.

ఆ. ఛత్రమున్నఁ దగిన । ఛాయ యేర్పడియుండు
శాస్త్ర మెఱుఁగఁ దగిన । జ్ఞానమొదవు
నబ్బ యున్నవాని । కండ యున్నట్టులే ! ॥వి॥ 1901

సహజ ఫలిత పరిణామముల చలోక్తిగా జెప్పాడు.

ఆ. ఛదలు భంగి గంద్రు । సాధువు మూఢులు
తాను వారినల్లె । కాన నగును
దీనికెంత దవ్వొ । దానికి నిది యంతె ? ॥వి॥ 1902

ఛదలు = ఆకాశములు ; చద పురుగులు ;
అన్యోన్యములు అలసత్వముగానే యుండును.

ఆ. ఛల్ది పుట్టినపుడు । సాపడ నైపదు
నాతిఁ గన్నయపుడు । నీతి తగదు
చేటు మూడినపుడు । మాటలు దోఁపవు ॥వి॥ 1903

యీపద్యము త్రిగుణములు, త్రిమూర్తులు, త్రికరణములు
త్రిసంధ్యలు రీతిని దలపింప కవి వాడెను.

ఆ. ఛాగములను గోసి । జన్నంబులను జేసి
పడయు దేవలోక । ఫల మదేమొ ?
జంతు హింస పాప । మింతన రాదురా ! ॥వి॥ 1904

ఛాగము = మేకపోతు ; జన్నము = యజ్ఞము, “ అహింసా
పరమో ధర్మః ” అనే సూత్రాన్ని సూత్రీకరించాడు. హింసకూడదు.

ఆ. ఛాత్ర ధర్మ మెఱింగి । చక్కని భక్తితో
గురుని సేవఁ జేయఁ । గుదిరి నపుడె ?
సర్వ మర్మములును । జక్కగా విడిపోవు ॥వి॥ 1905

ఛాత్ర ధర్మము = రాజ ధర్మము ; గురుసేవ మరగిన వారికి మరుగు లుండవు.

ఆ. ఛాయ నొసఁగుఁ జెట్టు । సాధువు బోధట్టు
లడఁగి దరినిజేరఁ । బడయ వచ్చు
నట్టు నిట్టు దాట । నది పోవ దిదిరాదు ! ॥వి॥ 1906

ఛాయ = నీడ; "సాధు సంగంబు సకలార్థ సాధనంబు"

ఆ. ఛాయలోని ఛాయ । చక్కఁగా గుర్తించి
కోయవలెను భ్రమల । గొంకులేక
మాయ మాయమౌను । మహితత్త్వమందురా ! ॥వి॥ 1907

"ఉష్ణం ఉష్ణేన శీతలం" మాయ మాయ చేతనే ద్రుంచవలెను. వేడి వేడిచే శీతలమగును.

ఆ. ఛిద్ర మెన్నువాఁడు । శిష్యుఁడు తానౌనె ?
ఛిద్ర మెఱుఁగువాఁడు । శిష్యుఁ డగును
ఛిద్ర మెఱిఁగి విడువ । భద్రంబు చేకూఱు ॥వి॥ 1908

ఛిద్రము = పనికిమాలినది ; మంచి చెడ్డలు తెలిసి మసలుకొన్నవాడే మహాత్ముఁడని సూచన.

ఆ. ఛురిక తోడఁ గోయఁ । జొప్పడునే కాని
దాని పిడిని గోయఁ । దరమె నీకుఁ
దెలివిలేక మేని । బల మేమి పనిచేయు ! ॥వి॥ 1909

సూత్రమెఱిగిన వాడే సుజ్ఞాని, ఛురిక = కూరకత్తి ;

ఆ. ఛేద్య మైనదానిఁ । జేపట్టినాఁడని
మూల వస్తువెట్టు । కేలఁ బట్టు ?
దాని నూనఁ గలుగు । దార్ఢ్యంబు లేకున్న ॥వి॥ 1910

ఛేద్యమై = ఛేదింపదగినది ; ఆశాపాశము విడువనిదే అమృతము దోసిలిలో రాదు ;

## జ

ఆ. జంగ మాఖ్య భక్తి । సంధి వేఱుగలేదు
సగుణభావ మిదియు । శాస్త్ర విధియు
నిర్గుణంబు వీడు । నెఱవేది యెఱుఁగఁడు ॥వి॥ 1911

జంగమము = కదలికగలది ; "మానవ సేవయే మాధవసేవ"

ఆ. జంగమైన వెనుక । జాతి నెంచవలదు
జాతిలోన నుండు । నీతులన్ని
జాతి, మతము విడిచి । చని యోగిఁ గావలె ! ॥వి॥ 1912

జాతి మతాలన్నీ చెండినవాడే జంగమ మనిపించుకొంటాడు

కం. జండా వేయగ వచ్చును
కొండలు పెకలించవచ్చు । కుదిరిన మదిలో
నిండారగ పరిపూర్ణము
జెండాడగ ముక్తిత్రోవ । జెలగును వేమా ! ॥వి॥ 1913

కుదురైన మనసుతో భక్తిని పదిలపరచిన సాధింపరాని దేదియూలేదు.

ఆ. జంత్ర మంత్ర మహిమ । జాతవేది యెఱుంగు
మంత్రవాది యెఱుఁగుఁ । దంత్రమహిమఁ
దింత్రిణీక మహిమఁ । దినువాఁ డెఱుంగురా ! ॥వి॥ 1914

జాతవేది = అగ్ని ; తింత్రిణీ = చింతచిగురు. అనుభవజ్ఞులకు అన్నివిషయాలు అవగాహన యగు. “వివిధానుభవవేది వేమనార్య.”

ఆ. జంతు రాసులందు । జనియించి, జనియించి
దిమ్మ పట్టి నట్టు । తిరిగి, తిరిగి
తనువు నిత్య మనుచుఁ । దలపంగ నవ్వరో! ॥వి॥ 1915

“ యీ, తనువే శాశ్వతమా ? సుఖంబు సతమా ! తత్త్వజ్ఞయూహింపుమా!”

ఆ. జగడ మాడుచుండుఁ । జాడీల కోరెప్డు
సాధు జనుల మీరి । బాధపెట్టు
యముఁడు తప్ప వేరెతు । రందరు వానికి ॥వి॥ 1916

“ గయ్యాళి గంపలకు జగము గడగడ లాడునని మనఘను నువాచ ”

ఆ. జగడమునకు బోదు । జారిణీ యెప్పుడు
మాయఁజేసి పురుషుఁ । మమత బెట్టు
కాని మాటలాడు । గయ్యాళి సతతము ॥వి॥ 1917

వ్యభిచారి చలితేలు వంటిది. గయ్యాళి కంద్రీగలా నుండును.

ఆ. జగతి రక్షించేటి । జీవుండు నీలోన
తెలియకుండగ నిల్చి । తేజరిల్లు
తేజరిల్లిన వాణ్ణి । తేటఁగా జూడరా ! ॥వి॥ 1918

"తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీత రాగిణాం
ముముక్షూణా మపేక్షోఽయ మాత్మబోధో విధీయతే"
ఆత్మబోధ గొప్పది.

కం. జగ మరయ నింద్ర జాలము
జగ మనగా మాయ సుమ్ము । జ్ఞానాదులకు
న్భగవంతుఁ డగును బ్రహ్మము
నిగమాగమ నిర్వికార । నిపుణుఁడు వేమా ! 1919

"క స్త్వంకోఽహం కుత ఆయాతః కామేజననీ కోమే తాతః
ఇతిపరి భావయ సర్వమసారం విశ్వంత్యక్త్వా స్వప్నవిచారమ్"
ఎవ్వరికి యెవ్వరూ లేరు.

క. జగమున గురుఁ డుదయించిన
జగమున గల జనులు శరణు । శరణన రోక్కో !
జగమెఱిఁగి మ్రొక్కఁ జూచెడి
జగధీశ్వరు విశ్వవిభుని । శరణను వేమా ! 1920

విశ్వ విశ్వంభరాధిపుని వీక్షించి దక్షుఁడవు కావలె ;

ఆ. జగమునందు లేదు । జలము లందును లేదు
నిగమ వేద్యమైన । నిజ పదంబు
సగుణ నిర్గుణముల । సాధించి చూడరో ! ॥వి॥ 1921

"మోక్ష కారణ సామగ్ర్యాంయామ్ । భక్తిరేవగరీయసీ
స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే" (శంకర చూడామణి)
అన్నిటికి భక్తి గొప్పది.

ఆ. జగమునను జనులకుఁ । దగినట్టి దగు లింగ
ముండ రాతిలింగ । ముండనేల ?
రాతి లింగమేమి । రక్షించునో సృష్టి
చేయ నేరదయ్యె । క్షితిని వేమ. 1922

ఆత్మలింగాన్ని అర్చింగక శివలింగంతో చిక్కులు బడుదురని జిజ్ఞాసు సూక్తి.

క. జగములు, యుగములు గ్రుంగెడు
జగదాత్ముఁడు నిత్యుఁ డగును; । జప తపములలో
నిగమాంత రార్థవేద్యం
బగణితముగ బ్రహ్మ బయలు । నందును వేమా! 1923

"చ. అగణిత శబ్దజాలములనంది పురందర శంకరాదియా
నిగమ సుగోచ రార్యుల మనీషుల నెగ్గెడు వేమనార్యుడే।"

ఆ. జఠర మందు జ్యోతి । చాల దేదీప్యము
కానలేరు నరులు । కలుష మతులు
కన్ను విచ్చి చూడఁ । గా దేవుఁ డున్నాఁడు! ॥వి॥ 1924

జఠరము = విష్ణుస్థానము; కన్నులు విచ్చి చూచి తిన్నని దేవుని కనుగొనుము.

ఆ. జలధి నీది దాటి । సంభ్రమింపగ వచ్చు
గడవరాద టెఱుక । గతుల నెంచి
తడయు చెల్ల హాని । తన్మయ మూనరా! ॥వి॥ 1925

దేనినైనా సాధించ వచ్చుగాని ఎరుకను సాధించుట సాధ్యము గాదు.

ఆ. జడల భూతి బూసి । జడల ధరించిన
నొడయుడైన ముక్తిఁ । బడయలేఁడు
తడికె బిర్రుఁ బెట్ట । తలుపుతో సరియౌనె? ॥వి॥ 1926

మోసం కోసం వేషంవేసే గోసాయిలను రోషించాడు లోకగురువు.

ఆ. జడలు గట్టనేల? । సన్యాసి కానేల?
నొడలు విఱుచు కొనెడి । యోగ మేల?
ముక్తికాంతఁ బట్టి । ముద్దాడనే కదా! ॥వి॥ 1927

ఇది అందంచిందులుద్రొక్కిన అమృత సమానభావంతో అంత రంగము నుబ్బూత లూచే శైలితో నలరారుచున్నది.

ఆ. జడలు దాల్చుటెల్ల । జగము ఛీ యనుటెల్ల
యొడలు విరుచుటెల్ల । యోగమెల్ల
ముక్తికాంతఁ బట్టి । ముద్దాడు కొఱకురా! ॥వి॥ 1928

ముముక్షాపేక్షులు ముక్తికాంతకొరకు మురిపెముతో పలుపోకలు పోవుదురు.

ఆ. జతుక మంటు రీతి । జాబిల్లి వెలుగంది
ప్రతి ఫలింప గుణిని । బరిణమించి
వెదుకవలెను మదిని । వేదాంత మర్మంబు ॥వి॥ 1929

జతుకము = లక్క; హృద్వీధిలో వేదాంత విజ్ఞానాన్ని వెదుకవలెను.

ఆ. జనన కాలమందు । జందెపుం బ్రాళ్ళేవి ?
తనకు లేవు తన । జననికిని లేవు
నడుమ జందె మేయ । నగుంబాటు గాదకో ? ॥వి॥ 1930

యజ్ఞోపవీత ధారులమీద అభాండము పారేశాడు.

ఆ. జనన మరణములకు । జంగమములు సుమ్మి
జనని జనకు లిలను । జలధి రీతి
వినుతి జేసి గురుని । వెన్నంటి చూడరా ! ॥వి॥ 1931

జననీ జనకులు గురువు వీరు ముగ్గురే ఆరాధ్య దైవములు.

ఆ. జనన మరణములకు । సంధ్య ద్రాడును లేదు
సంధ్యద్రాడును లేదు । జనని కెపుడు
తల్లిశూద్రురాలు । దా బాపడెట్లురా ! ॥వి॥ 1932

"జన్మనాంజాయతే శూద్రః కర్మణాం జాయతే ద్విజః"
పుట్టువుచే అందరూ శూద్రులే.

ఆ. జనన మరణములకు । సస్వతంత్రుండు గాండు
మొదటం గర్త గాండు । తుదను గాండు
నడుమ గర్త నగుట । నగుం బాటు గాదకో! ॥వి॥ 1933

అన్నిటికీ కర్త ఆత్మారాముండే అని మా ఆత్మానందు నువాచ.

ఆ. జనన మరణములన । స్వప్న సుషుప్తులు
జగములెల్ల నిండి । జనము లుండు
నవనిలో జనంబు । లరయంగ లేరయా ! ॥వి॥ 1934

"జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం జాగ్రథ జాగ్రథ"
పుట్టువు, ముసలితనము, చావూ మూడూ దుఃఖమే ?

ఆ. జనన మరణములను । జంధ్యపు డ్రాడున్నె ?
జంధ్య మిడగ లేదు । జనని కెపుడు
తల్లి శూద్రురాలు । తానెట్లు బాపఁడో ! ॥వి॥ 1935
ఊర్వసి శూద్రురాలు వశిష్ఠుఁడు బ్రాహ్మడెట్లయ్యెనో !

ఆ. జనన మరణవేళ । స్వాతంత్ర్యమూ లేదు
తేగలేదు మున్ను । పోగ రాదు
నడుమ గ ర్త ననుట । నగుబాటు గాదొకో ! ॥వి॥ 1936
తానే క ర్తనని వికచికపడతాడు.

తే. జనన, మరణ, సుషుప్తులు । తనకు నెపుడు
జరుగుచుండఁగ నరుఁడు తా । జంగమనుట
తెలియ నజ్ఞాన మగుఁ గాక । కలుగ నగునె ?
బుద్ధి గలవారలను కొండ్రె । పుడమి వేమ. 1937
నరుఁడు స్వతంత్ర అస్వతంత్రాధికారి యని స్వామీజీవాక్కు.

క. జనన మశాశ్వత మనియున్
గనుగొను వాఁడిలను మోక్ష । కాంక్షి యన దగున్
ధనము, నశాశ్వత మనుచున్
జననము నశ్వర మటంచు । చాటుము వేమా. 1938
ధన, జనన, మననములే మనస్సు ;

ఆ. జననము నకు మున్ను । జనని గర్భములోన
మునుపు చేసినట్టి । ముష్కరంబు
ననుభవించి వెడలి । యాశను విడలేరె ? ॥వి॥ 1939
" అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాఽశుభం "
చేసిన కర్మ అనుభవించవలెను.

ఆ. జనన మెట్టు కలిగె ? । జాతి యెయ్యది యయ్యె ?
జనన మరణములకు । జాడ లెఱుంగ
దినఁగ వినఁగ, దీని । వివరించి కానరో ! ॥వి॥ 1940
అన్నిటికీ కారణుఁడైన అద్వబ్రహ్మను అరయుమన్నాడు.

ఆ. జన్నములను మరియు । జన్నియల ననేక
ముల నొనర్చియున్న । ఫలము గాన
రాకయుండు నాతి । లేకున్న నూ్రతాన ! ॥వి॥ 1941

ప్రపంచాతీతయగు "స్త్రీ" ప్రకృతి పురుషునకు పరమావధియని
మా వరకవీశ్వర వాక్కు.

ఆ. జన్మ పూర్వమందు । జను డడిగిననీని
కర్మజీవి యగును । కలియుగమున
పెట్టువారి కెపుడు । పుట్టువె సాక్షిరా ! ॥వి॥ 1942

పెట్టిపుట్టినవానికె రెట్టింపు దిట్టతనము జూపట్టును.

ఆ. జన్మ, మరణ, సుషుప్తుల, । జగములెల్ల
జరుగు చుండంగ నురుఁడుగా । జంగమనుట
నదియు దెలియగలేరు యీా । యజ్ఞులైన
భూప్రజలు బుద్ధిలేకను । పొసగు వేమ. 1943

మానవ ధర్మమును తెలియనివాడు మానవుడే గాఁడు.

తే. జన్మ మరణాద్య వస్థల । జాడ మీాటి
మన్మయం బగు పరిపూర్తి । మఱుఁగుఁ జేరి
తన్మయాకృతి నొందు శే । తత్పదంబు
నిర్వికారుని కిది కల్గు । నుర్వి వేమ ! 1944

నిర్వికార స్వరూపుడగు నిఖిలేశ్వరు నెరుగుటే నిశ్చల తత్త్వము.

క. జన్మము నెత్తిన మనుజుఁడు
మన్మయ పరిపూర్ణ మార్గ । మహిమం బెఱుఁగం
దన్మయత నొందనేర్చును
జన్మయు పరమేశు మదిని । జేర్చిన వేమా ! 1945

చిన్మయ బ్రహ్మాన్ని చీటికీ మాటికీ సిసలుగా చిత్తమున హత్తించుటే
ఉత్తమ యోగి లక్షణం.

ఆ. జన్మముల నికెన్ని ? । జన్మంబు లెత్తునో
కర్మ ధర్మములకు । గణన యెంతో ?
కర్మ ధర్మములను । గడతేఱ లేరయా ! ॥వి॥ 1946

కర్మ ధర్మములఁ గడతేరినవాడే కర్త.

ఆ. జన్మ వదలి వేరు । జన్మంబు లెత్తంగ
గర్మ ధర్మములకు । గణన గలదె ?
కర్మ ధర్మములను । గడతేఱ వచ్చునా ? ॥వి॥ 1947

కర్మసిద్ధాంతాన్ని కదలించాడు.

తే. జన్మ సాఫల్యమును గోరి । జయము నొందఁ
దన్మయుండైన గురుఁ జేరి । తలపు నిలిపి
మన్మయానంద పరిపూర్తి । మఱుఁగుఁ జేరు
చిన్మయాకృతి కాన్పించుఁ । జెలగి వేమ. 1948

" సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వాం సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాసుచ "
అన్నియూ విడచి మమ్ము కోరుము.

ఆ. జన్మ రక్ష లయము । సల్పఁగా భువికెల్లఁ
గర్తల మని విశ్వ । కర్మలంద్రు
పుట్టి పెరిగి, గిట్టి పోదురే ? యేలనో ?॥వి॥ 1949

విశ్వబ్రాహ్మణులు విశ్వాన్ని సృష్టించామని విఱ్ఱవీగుతారు.

ఆ. జనుఁడు తెలివినొందఁ । జంచలింపదు మది
దైవమును దెలిసినఁ । దగులు బుద్ధి
తిపురు భానుఁజూచి । తిమిరంబు నిలుచునా ! ॥వి॥ 1950

భానుఁడు = సూర్యుడు ; తిమిరము = చీకటి,
తెలివినందిన వానికి సర్వమూ తేటగానే కాన్పించును.

క. జప, తప మార్గము లన్నియు
నుపవాస క్రియలఁ గూడి । యుండును జూడం
జపలత్వ మడఁపఁజాలక
యుపమరివై గుణము లడఁచి । యుండరవేమా ! 1951

" బ్రహ్మసత్యం జగన్మిథ్యా స్యపరోక్ష జ్ఞానాగ్ని నా
బ్రహ్మైశ్వర్యాన్ సంకల్ప బీజ సంతాప రూపం తపః "
బ్రహ్మమే సత్యము.

ఆ. జపము బాహ్య పూజఁ । జాలగాఁ జేసియు
గపటము విడలేక । కష్టనరులు
ముక్తినొంద లేరు । మునిగిరి తమమున ॥వి॥ 1952

"గురువాక్య సుషుమ్నాయాం విపరీతం భవేజ్జపం సోఽహంసోఽహం
ఇతి ప్రోక్తా మంతయోగచ్చ ఉత్స్యతి" (పురుషసూక్తం)
గురువాక్యము గొప్పది

క. జపములు సేసినఁ జిక్కఁడు
విపినములందున్న గాని । విడుచునె భ్రమలా
జపమాల మంత్రసిద్ధికి
నెపమెన్నని మోక్షపదవి । నిలుచుర వేమా! 1953

"అహింసాతు తపోయజ్ఞో వాఙ్మనః కాయకర్మభిః"
అహింసకన్న తపస్సు గొప్పది కాదు.

ఆ. జయము భయము, దాటి । చలపట్టి యుండును
దయకుఁ బాత్రుఁడగు । ను ధర్మపరుఁడు
నయముగాను గురుని । నమ్మి నెమ్మది వేడు ॥వి॥ 1954

"గురువాక్యం మహామంత్రం తంత్రం శూన్యం నిజం నిజం"
గురువాక్యంకన్న మంత్రము లేదు.

ఆ. జలధిలో స్తంభంబు । నిలిచెలాగున నాటి
గుండ్రంబుగా పూరి । గుడిసె చేసి
పూరిగుడిసెకు బోయి । పుణ్యాచనము జేయు ॥వి॥ 1955

హృదయాన్ని పదిల పరచుటకే విదితమగు విశ్వము పుట్టినది.

క. జలములు, పుణ్యస్థలములు
గలవీ లోకంబులందుఁ । గడు దూరముగా!
వెలసిన తీర్థస్నానం
బలమట గద మోక్షమేది? । యలసట వేమా! 1956

గంగా స్నానాలకెళ్ళి భంగమందుట కంటే హాంగుగా నీలోం రంగని పొంగించుకోమన్నాడు మాయింగితజ్ఞుఁడు.

క. జహ, దజహల్లక్షణముల
బహు విధములు గుఱుతులంది । బాహాటముగా
గుహఁజేరి పొందుపడఁగను
దహనున కర్పించి యెఱుఁగ । దలఁగుర వేమా ! 1957

దహనుఁడు = అగ్ని ; గుహలజేరి కునుకుట కంటే గోప్యమైన గోవింద నామ స్మరణమేలు.

కం. జాగ్ర త్స్వప్న, సుషుప్తు లు
దగ్ర గతి నిర్మించువాఁడె । ధన్యుఁడు భువిలో
నాగ్రహము వలవ దెవరికి
నాగ్రంబుగ దెలియ వలయు । నఖిలము వేమా ! 1958

మాటని పాటించిన వాడే మేటి.

ఆ. జాగ్ర తనఁగ నేమి ? । జన్మ మనఁగ నేమి ?
జన్మమునకు నరయ । జాగ్రతాయె
జన్మ జాగ్రతలను । సాధింపరా ! ము క్తి ॥వి॥ 1959

జన్మజాగ్రత్తల జాడల పోడిమి తెలిసినవాడే జ్ఞాని.

ఆ. జాణ లయినట్టి । చప లాయతాక్షుల
వలపు లరసి చూచి । భ్రమయ నేల ?
బయలి రాల నరసి । పరికింపగా నేల ! ॥వి॥ 1960

అ. వలపు కాంతల జూచి।వాపోవగా నేల? రాళ్ళరప్పల మొక్క-।రాట్టదేల?

ఆ. జాత సూతకములు । సత్యమై యుండంగ
నంటి నంత నెట్టు । లంటు కలుగు
వితము గానలేరు । వెలయంగ జీవులు ॥వి॥ 1961

జాతాశౌచము, మృతాశౌచము లేవు అన్నాడు. అశౌచము=అంటు.

ఆ. జాతి, కులము లంచు । జనులెల్ల బద్ధులై
భావపరము నందుఁ । బ్రాలుమాలి
చచ్చి పుట్టుచుంద్రు । జడమతులై భువి ! ॥వి॥ 1962

"జాతి నాస్తి, కులం నాస్తి, నాస్తి దేహో సిరి సంపదాః"
సర్వము నాస్తిగానే యున్నది.

ఆ. జాతి, నీతివేఱు । జన్మం బదొక్కటి
అరయఁ దిండ్లు వేరె । యాక లొకటి
దర్శనములు వేఱు । దైవమా నొక్కటి ! ॥వి॥ 1963
ఏకేశ్వరోపాసన జేకొనమన్నాఁడు మాయేకైక యోగి.

ఆ. జాతి నీతి వేరు । జన్మంబు లొక్కటి
యరయ తిండ్లు । వేరె యాకలొకటె
పసుల వన్నె వేరు । పాలెల్ల యొక్కటే ! ॥వి॥ 1964
సహజోపమాన సంలబ్ధ ధురీణతా బంధురుఁడగు మాయోగికి
కులమతాదికల్పితములు కంటగింపులు.

ఆ. జాతి నే నెరుగను । జగతి నేనెరుగను
నిగనిష్ట నేనెరుఁగ । నియమముగను
యిన్ని యెక్కడఁ బుట్టె । యీసంధిఁ దెల్పరా ! ॥వి॥ 1965
భేదభావములు కుతర్కవాదములకేగాని కోవిదులకుగాదు.

ఆ. జాతి భేదంబులు । నీతి భేదంబులు
చర్మభేదములను । కర్మములను
చిత్తశుద్ధి కొరకు । చేసెరా దైవఁబు ॥వి॥ 1966
"ఉ. ఎక్కడ జాతి, భేదమన యెక్కడ; శాశ్వతమేది తెల్పి నీ,
వెక్కడ వాడవో యెచటి కేగెదవో వచియింపు వేమనా!"

ఆ. జాతి భేదమెంచి । జన్మము తెలియక
ముక్తిఁ గానలేరు । మూర్ఖజనులు
జాతు లెంచనేల ? । జన్మంబు దెలియరో ! ॥వి॥ 1967
నీతిలేనివారికే జాతి; నియమముగల వారికి నిఖిలమూ సమానమే ?

ఆ. జాతి, మతము విడిచి । చని యోగిగా మేలు
జాతితోనె యున్న । నీతి వలదె
మతముఁ బట్టి జాతి । మానకుంట కొఱంత ॥వి॥ 1968
మతములు మానవకల్పితములు జాతులు గుర్తించక వర్గముల
నెంచేవారు పరమనీచులు.

ఆ. జాతి మతము విడచి । చను యోగికామేలు
జాతితోడ నున్న । నీతి లెస్స ?
మతములన్ని బాపు । మనుజుఁ డొక్కఁడు లేఁడు ॥వి॥ 1969

నీతిమించిన ఖ్యాతి నిఖిలములో లేదు.

ఆ. జాతియందు మిగుల । జాతి యే దెక్కువో !
నెఱుక లేక దిరుగ । నేమి ఫలము ?
నెఱుక గలుగువాఁడె । హెచ్చైన కులజుండు ॥వి॥ 1970

నే నెవరి నని తెలుసుకొనినవాడే అధికుఁడు.

ఆ. జాతిలోన నెట్టి । జాతి ముఖ్యం బంచు
నెఁఱుగ లేక । తిరుగ నేమి కలదు
యెఱు కెఱిగిన వాని । కే జాతి కానేమి ! ॥వి॥ 1971

విజ్ఞానవేత్త విశ్వాతీత మహత్తర యోగభావంతో విశ్వజాతినే విశ్వసిస్తాడు.

ఆ. జాతివార లెల్ల । జాతివిద్యలు నేర్చి
జాణలైరి మీఁటి । జగతిలోన
బ్రాహ్మణులను వారు । బ్రహ్మము నెఱుఁగక ! ॥వి॥ 1972

బ్రాహ్మణులు గర్వములో బ్రహ్మజ్ఞానము తెలియక భ్రష్టులైరని మాబ్రాహ్మణుని వాక్కు.

ఆ. జాతి వేఱు లేక । జన్మ క్రమంబున
నెమ్మదిని నభవుని । నిల్పి నేని
నఖిల జనుల లోన । నతఁడు ఘనుండయా ! ॥వి॥ 1973

అభవుడు = బ్రహ్మ ; విచక్షణలేక విశ్వమయుని వినుతించినవాడే విజ్ఞుఁడు.

ఆ. జాతి సూతకములు । సత్యమై యుండంగ
నంటినంత నెట్టు । లంటు కలుగు
వితముఁ గానలేరు । వెలయంగ జీవులు ! ॥వి॥ 1974

సుతక నిష్టలను పాతకములను సూత్రీకరించాడు మాయోగి.

ఆ. జాతులందు నరసి । జాతి ముఖ్యత నెన్న
నెఱుక గల్గువారె । యెచ్చు గారె ?

ఎఱుక లేనివార । లే జాతి యైనను
మాలకంటె జెడుగు । మహిని వేమ. 1975

తన్ను తానుఁ దెలసినవాడే ధన్యుఁడు.

ఆ. జాతులందు నెట్టి । జాతి ముఖ్యమొ చూడు
మెఱుక లేక తిరుగ । నేమి ఫలము!
ఎఱుక గలుగు మనుజుఁ । డే జాతిగలవాఁడొ? ॥వి॥ 1976

"ఎరుకలేని వాడెంతటి వాడైన మాసిపోవు భ్రమల మాసిపెట్టు"

ఆ. జాతులందు మిగుల । జాతి యేదెక్కువో?
యెఱుక లేక తిరుగ । నేమి ఫలమొ?
యెఱుక గలుగువాఁడె । హెచ్చైన కులజుండు ॥వి॥ 1977

"ఆ. జాతిజాతియంచు । జావగనేలను
వేమనార్యపల్కు । వినుచునికను
జాతిమీరువిషచి । నీతిగా యొప్పుడీ"

ఆ. జార పురుషునకును । జాజిపూవుల తోడఁ
బాన్పు వేయునయ్య । పాత లంజె
సొంత మగనిమీఁదఁ । జింతనిప్పులు చల్లు ॥వి॥ 1978

చింతనిప్పులు (నుడికారము); మక్కువగలవారిపై మగువలు మమకారం జూపిస్తారు

ఆ. జారపురుషు మీఁద । సద్భక్తి నిలుపుచు
బతికి నిచ్చకముగఁ । బరగుభంగి
బరము కోఱకు యోగి । పాటించు దేహంబు ॥వి॥ 1979

"యోఽన్యథా సంతమాత్మానా మన్యథా ప్రతిపద్యతే!
కింతేన నకృతం పాపం చోరే ణాత్మాపహారిణా"

ఆత్మానందము గొప్పది.

ఆ. జారుపైని ప్రేమ । జలజాక్షి యుంచెడి
తీరుగాను మదిని । దెలివి గలిగి
గురుని గోరి పొందుఁ । గూడుట ముక్తిరా! ॥వి॥ 1980

"శా. జారస్త్రీ విట సంయుతంబయిన యాసంగంబు గా ప్రేమతో
జారున్నిర్మల పూరుషుం గనుట విశ్వాత్రీతషా వేమనా!"

ఆ. జ్ఞాత యైన వాని । నేతగా భావించి
నీతు లెఱుఁగవలయు । నియతి గలిగి
జ్ఞాను లున్న లాభ । మూనునే ? తెలియుమి ॥వి॥ 1981

నేతగా భావించి నీతినెరిగినవాడే ఖ్యాతినార్జించిన జ్ఞాని.

ఆ. జ్ఞాన నిష్ఠఁ బూని । మేను మఱచు వాఁడు
కామిగాఁడు మోక్ష । కామి గాఁడు
నీమ నిష్ఠ లుడుప । నిర్గు మందురా ! ॥వి॥ 1982

"చతుర్వేద ధరో విప్ర సూక్ష్మబ్రహ్మనవిద్యతే వేదభార
భరాక్రాంతస్సవై బ్రాహ్మణ గార్ధభః" (శ్రుతి)
వేదము చదివి విధి తెలియని బ్రాహ్మణుఁడు గాడిదతో సమము.

ఆ. జ్ఞాన భావ పరము । గనుఁగొన కున్నను
మానరాదు మనసు । మమతఁ దగిలి
పూని జన్మములను । బొందురా ! భువిలోన ॥వి॥ 1983

జ్ఞానోదయం లేనివానికే జనన మరణములు.

ఆ. జ్ఞాన మనగ నేమి ? । ధ్యాన మనగనేమి ?
భక్తియనగ నేమి ? । ముక్తి యేమి ?
రక్త మాంసపు దేహ । యుక్తిచే దెల్పురా ! ॥వి॥ 1984

"మోక్ష కారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే"
మోక్షానికి నిజభక్తి యుండవలెను.

ఆ. జ్ఞాన మనగపల్కు । ధ్యాన మనగా బుద్ధి
భక్తి యనగ పట్టు । ముక్తి గలుగు
రక్త మాంసంబు వి । రక్తి మార్గంబురా ! ॥వి॥ 1985

"ఆత్మాతీతః కేవలాత్మా దేహోనాస్తి కథాచన
అస్తికాస్తీతి కోఽవేద నిర్ణయోనాప్తి సర్వదా"
ఆత్మను తెలిసినవాడే బ్రహ్మ.

ఆ. జ్ఞాన ముద్రచేతఁ । గనఁగ వచ్చెడి తత్త్వ
కదియె మదికి శ్రేష్ఠ । మనుచు మునులు
పలికిరద్దె తెలియఁ । బరమార్థ మగునయా ! ॥వి॥ 1986

"ఆత్మానాత్మ వివేకేన పునః సంసార నివృతిహిః
తద్వినాజన్మ కోట్యాపి బంధచ్ఛేదో నసిధ్యతి"
ఆత్మ, అనాత్మభేదము తెలిసిన ముక్తి.

ఆ. జ్ఞాన మెన్న గురువు । జ్ఞాన హైన్యము బుద్ధి
రెంటి సందు రిమ్మ । తేచునపుడు
రిమ్మఁ దెలిసె నేని । రెండొక్క రూపెరా ! ॥వి॥ 1987

"భ్రూమధ్యే సచ్చిదానంద తేజః కూటరూపం తారకబ్రహ్మం"
నిటలమున తారకబ్రహ్మను జూడుము.

ఆ. జ్ఞానవంతునిఁ జూచి । సరి కర్మ బుద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి । విడువలేక
వెఱ్ఱి కనని ప్రకృతి । వెదకినఁ గల్గురా ! ॥వి॥ 1988

"గీ. చూపులోనన యొక వింతజూపు జూచు
నడకలోనన యొక వింతనడక నడచు
నవ్వులోనన యొక వింతనవ్వునవ్వు
అత డున్మత్తుడో జ్ఞాని యైనవాడొ"

ఆ. జ్ఞాన వంతుని కడు । కర్మ సంబద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి । విడువలేక
వెఱ్ఱి కనని ప్రకృతి । వెతకిన కల్గురా ! ॥వి॥ 1989

"జడతలేకయె యుండును జడుని భంగి"

ఆ. జ్ఞాన వర్యులఁ జూచి । కేరడంబుల జేసి
వెక్కిరింతురు మూల । వెధవలెల్ల
అట్టి నడతల కెముడు । గట్టిగా నవ్వడా ! ॥వి॥ 1990

"భ్రమేణాఽహం భ్రమేణత్వం భ్రమేణో పాసకం మనః
భ్రమేణేశ్వర భావత్వం భ్రమమూల మిదం జగత్"
భ్రమచే జగత్తు కలిగెను.

ఆ. జ్ఞాన సుజ్ఞాన గతులొప్పు । జాడ లెఱుఁగ
నగును దైవజ్ఞులగు వార । లరసిరేనిఁ
బాలు నీరును భేదింపఁ । బరగు హంస
లట్టి సామర్థ్య మొప్పువా । రవని వేమ. 1991

హంస క్షీరనీర న్యాయము నిట నుల్లేఖించెను.

క. జ్ఞానికిఁ గర్మం బేటికి ?
జ్ఞానికిఁ గర్మంబు వలదు । సత్పురుషులకున్
జ్ఞానమె । కర్మంబైనను
మానవులకుఁ గర్మ ముక్తి మహిలో వేమా! 1992

మయ్యేవ సకలం జాతం ! మయి సర్వప్రతిష్ఠితం మయిసర్వం లయం
యాతి, తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యఽహం " (గీత)
నాచేతపుట్టి, పెరిగి, నశించును జగత్తు.

ఆ. జ్ఞాని యనెడు వాఁడు । ఘనతేజ మందును
బూని సుఖముఁ జెంది । పుట్ట బోఁడు
తానె తాను గాను । దనలోనె వెలుగును ॥వి॥ 1993

" ఆత్మా నాత్మ వివేకులే నిజముగా నత్యంత సౌఖ్యోన్నతుల్ "

ఆ. జ్ఞానియైన వాని । మానక పూజించు
మనుజుఁ డెప్పుడుఁ బరము । నను ముదంబు
సుఖము నందుచుండు । సూరులు వర్ణింప ॥వి॥ 1994

" బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః
ధ్యానశబ్దేన విఖ్యాతః పరమానందదాయకః "
జ్ఞానముచేత పరమానందుఁడగును.

ఆ. జ్ఞానులమని యెంచి । చపలాత్ము లగువారు
తెలివి లేమిఁ దమ్ముఁ । దెలియలేక
కష్ట గహనమందు । గర్వించి యున్నారె ! ॥వి॥ 1995

గహనము = అరణ్యము ; అజ్ఞానములోనున్నవారికేమున్నను అడవి గాయు వెన్నెల.

కం. జిత్తులమారు లనం దగు
తొత్తులతోఁ గూడ నేమి । తుష్టి కలుగురా !
చిత్తమున బ్రహ్మ । మరయుము
సత్తానీకప్పు డొప్పుఁ । జాలగ వేమా ! 1996

జిత్తులు = చిక్కనడవడిక గలవారు ; మాయస్త్రీలను గలియ అయోమయానందం.

కం. జిలిబిలి మాటలు పలికెడు
కులటల నమ్మంగరాదు । కుహన యథారా !

తెలివిగ నవమానించును
దొలి ప్రియమును జూపఁబోదు । తొలఁగర వేమా ! 1997

జిలిబిలి = ముఖప్రీతి మాటలు ; కులట = జారిణి ; కులట కూటమి కూడ దన్నాడు.

ఆ. జిహ్వారసము వల్ల । జీవంబు పోషించు
బ్రహ్మ మన్న రసము । బడయ లేరు
రసముఁ ద్రాగునట్టి । రాజులు చావరే ? ॥వి॥ 1998

" అన్నం పరబ్రహ్మము ;

ఆ. జిహ్వా రుచుల గోరు । జీవించు నంతకు
సతియు, బతియుఁ గోరు । సుత, ధనముల
హవ్య వహుఁడు చూడ । నన్నింటి గోరురా ! ॥వి॥ 1999

హవ్యవహుఁడు = అగ్ని ; విజ్ఞానదీపాన్ని వెలిగించి తెలుగు వెలుఁగులో కలిపాడు వేమన్న.

ఆ. జిహ్వాలంపటంబు । జీవనంబై యుండు
జిహ్వాలంపటంబె । జీవపోష
జిహ్వా చేతఁ జనులు । చిక్కి నొచ్చిరి గదా ! ॥వి॥ 2000

నోటిరుచి కాసించి నూటి తెలుసుకొనలేక పలుపాట్లుఁబడుచున్నారు.

కం. జిహ్వాసు రుచులనె కోరును
జిహ్వాకు మఱియొకటఁ గలుఁగు । చింతేడనయా !
జిహ్వాకుఁ జింతలు దొలఁగవె
జిహ్వాన్నె బ్రహ్మనన్నఁ । జెల్లును వేమా ! 2001

సర్వవిషయాలను సంగ్రహించినది జిహ్వా ?

ఆ. జీవకోటి మేన । జీవాత్ముఁ డున్నట్టి
చోటిని గనలేక । సుఖము విడిచి
స్థిర మటంచు నమ్మి । జీవాత్మ తిరుగును
స్థిరము జీవముక్తిఁ । జెందు వేమ. 2002

జీవాత్మని తెలియలేక చిక్కులు పడుట చిత్తవికారులపని.

## పూర్ణ సమాధి

5వ వాక్యము : జీవగుణ చిత్తమున తారకమున అర్చించి తొమ్మిది వాకిళ్లు - తొలగనీయక మూసి, ఆరు వొకటి జేసి అనలంబు చల్లార్చి, మూటిలోని మేలు మూలమెరిగి, యెనిమిది ఖండించి, యోగమైన చోట యెరుక బొంది ; సుషుప్తి, అవస్థలయందు - తామసము విడి పించి, చంద్రకిరణము లోన సందు దెలిసి, మార్తాండుని రీతి మల యుచు, జ్యోతిర్మయాకార దృష్టి నిలువజేసి, పూర్ధ్వద్విష్కుర్తు డై కుండలి రేచి, బ్రహ్మాండ జామిాళ అమర పీఠము వాని, కోటి లాపుల వాని, కొలువు దెలిసి, కోటిసూర్య ప్రకాశమైన బాట వెడలి, పొంది ; నిర్వికల్ప తత్సమాధి నోలలాడి, రేచక, కుంభక, పూరకముల గురి యాడి, ప్రణవనాథ బ్రహ్మ పట్టు దెలిసి, ముప్పిరి గొన్నట్లు మురి యుచు, దనలోన తెలివి తనదని తెలివితోడ మించి, పరవశంబున పలుకు వీడిబోక, పాపములకు పట్టు బడక, జరా మరణంబు లేని తావు గైకొని, గురు కటాక్ష వీక్షణమందు ప్రసాదింప తగును ; యింపుతో యీా జగ మెల్ల తానై బ్రోచు. అనర్గళమైన అదృశ్యము సిద్ధిబొంది, సిద్ధికి ప్రయోగసిద్ధి బొంది, సొంపైన పెద్దరహస్యము మాని, తత్సమాధి నోలలాడు వాడు యోగివరుఁడని చెప్పవలెను విశ్వదాభి రామ । వినుర వేమ ॥ 2003

తేనెలొలుకు జాను తెనుగులో దివ్యమగు పదలాలిత్యముతో సహ జోక్తుల గుంపుతో, ప్రతివానికి తెలిసే భాషలో వేదాంత విద్యను కూలం కషముగ తరచి వడబోసి నిగ్గుదీసి అందించాడు వేమన మహాకవి.

ఆ. జీవగుణము గలుగు । జీవుండు బ్రహ్మంబు
సాటి వచ్చునెట్లు ? । సరవిఁ దెలియ
నూరి కుక్క సింగ । మొక్కటి యగునొక్కొ ॥వి॥ 2004

సింగము = సింహము ; ఆత్మ పరమాత్మతో సమానంగా గాదు.

ఆ. జీవగుణ మెరుగక । జీవుండు తానుగా
యోగి యగునె ? । యోగ ధాటి లేక
వదరు చుండగానె । వచ్చునా మోక్షంబు ? ॥వి॥ 2005

డాంబిక వేషధారులకు తత్త్వము చిక్కదు.

ఆ. జీవనముఁ దెలిసిన । జెలగి మది చలించు
దైవ మగ పడినను । దగులు బుద్ధి
దీప్త భానుని గని । తిమిరంబు నిలుచునా ? ॥వి॥ 2006

దేవుని జూచిన మాయలు నశించును.

కం. జీవంబగు జీవేశుఁడు
జీవుని కొక యిల్లు చూపఁ । జింతల దొంతై
కావరమున గర్వించుచు
భావములో శివుని మఱచి । భ్రమగొను వేమా ! 2007

కండకావరము చేత మిండని గనలేక పలుబాధలఁబడును పాపజనుఁడు.

ఆ. జీవభావ మెఱుఁగ । జెడ దెన్నఁటికి మతి
దైవమును నెఱుంగఁ । దనరు బుద్ధి
తేజ ముదయ మందఁ । దిమిరంబు నిలువదు ॥వి॥ 2008

అసలఁ విషయాన్ని తెలిసిన అజ్ఞాన మేదీ ?

ఆ. జీవభేద మెరిగి । చెడిపోని వారికి
భావి జనుల చెలిని । పట్టు పడదు
నెరుగుగడీ జీవంబు । నీశ్వరు నిన్యముని ॥వి॥ 2009

" అతుకులత్తా మారుమనుము " వలె నున్నదీపద్యము.

ఆ. జీవభేద మెఱిఁగి । చెడిపోని వారలు
బ్రహ్మభావ మొంది । పఱచు చంద్రు
నీరు ముత్యమైన । నీరుగా మాఱునే ॥వి॥ 2010

పరబ్రహ్మను బొందిన జీవుడు తిరిగి జీవుఁడు గాలేడు.

ఆ. జీవ ముండు చోటు । స్థిరముగాఁ దెలియక
తిరుగు నస్థిరమగు । దేహమందుఁ
దిరుగ నేల ననుచుఁ । దెలియలేఁ డజ్ఞాని ॥వి॥ 2011

మాయామోహితుఁడు మమకార మావరించిన మానసుఁడు.

ఆ. జీవముండే వరకు । జనులు దగ్గఱ జేరి
చుట్టరిక మెంతు చట్ట । నమ్మి
జీవుఁ డేగిన వెనుక । జేర రావల దరికి ॥వి॥ 2012

బ్రతికిన నాడే బంధువులు లేనినాడు ఎవ్వరూ లేరు.

ఆ. జీవముం దెలిసిన । జెలగి మది చలించు
దైవ మగుపడినను । దగులు బుద్ధి
దీప్తభానుని గని । తిమిరంబు నిలుచునా ? ॥వి॥ 2013

విజ్ఞానుల వెలుగునీడలలో అజ్ఞాన మంతరించును.

ఆ. జీవమునను నాత్మ । స్థిరతను గానక
తిరుగు నస్థిరమును । గుఱిగ నమ్మి
స్థిరము నస్థిరమును । దెలియ జీవికి ముక్తి ॥వి॥ 2014

స్థిరాఽస్థిరముల స్థితుగతుల నెరిగిన సిద్ధుఁడుఁ గాగలఁడు.

కం. జీవము శాశ్వత రూపము
భావమునను నిలిచి లోనె । పరుడై యుండుం
గేవల నిర్గుణ మదె యగు
గావరమును కడకుఁద్రోసి । కనవలె వేమా ! 2015

నిర్గుణాసక్తుఁడె నిర్మలానందుఁడు.

ఆ. జీవమేడ నుండు ? । భావ మెక్కడ నుండు ?
కాపురంబు లేదుఁ । గదిసి యుండు ?
దనరుచున్న రెంటి । స్థలమేల ? దెలియరు ॥వి॥ 2016

జీవభావముల స్థానముల గుర్తించినవాడే జ్ఞాని.

ఆ. జీవలింగ పూజ । జితపడు వారికి
శిలల లింగములకుఁ । జింత యేలఁ ?
జక్కెరఁ దిను నోరు । చవిగోనునే చేదు ! ॥వి॥ 2017

ఇది సహజోపమానముగా నిర్మించాడు ఘన సహజకవి,

ఆ. జీవ లింగపూజఁ । జేసిన వారికి
శిలల రూపమందు । జింత యేలఁ ?
జెలఁగి మధువుఁ గ్రోలఁ । జేదు రుచించునా ? ॥వి॥ 2018
మధువు = తేనె ; విగ్రహారాధనను విడువ మన్నాడు వేమన.

ఆ. జీవ వశము రీతి । జిన్మాత్రతను మించి
భావ మమత నమరు । పట్టు పట్టి
కలియు హంస మదిని । గర్మ సన్న్యాసివై ॥వి॥ 2019
క్షీరనీరాలను హంసవేరుపరచు విధమున పరమహంసలు ప్రవర్తిస్తుంటారు

ఆ. జీవసంజ్ఞ గలుఁగు । జీవతత్త్వంబును
జీవపరునిఁ గురునిఁ । జెందఁజేసి
తనువు నిలుపువాఁడు । తాను తానై యుండు ॥వి॥ 2020
జీవేశ్వర సంధానము శ్రేష్ఠమగునది.

కం. జీవాత్ము డెప్పు డుండెడి
తావునుఁ దాఁ దెలియలేక । తగ నస్థిరము
న్భావమున నమ్మి తిరిఁగెడి
జీవికి ధర ముక్తిఁ గలుగఁ । జెల్లునె? వేమా ! 2021
జీవాత్ముని స్తుతించుటయే ముక్తికి మార్గము.

కం. జీవాధారము నీరము
జీవాధారంబు గాలి; । చెలఁగుచు నుండుం
గావలసిన నవి యొక్కరి
యావిని గోరకయ చిక్కు । నిలలో వేమా ! 2022
ప్రకృతి ప్రసాదము సర్వప్రాణులకు సమాన హక్కు ;

కం. జీవాధారుఁడు రుద్రుఁడు
సేవార్చన పరుఁ డటగుచు । స్థిరమతి వెలుఁగు
న్భావాతీత పరంబుగ
గావించును మనసు, బయలు । ఘనముగ వేమా ! 2023
చరాచర జగత్తునకు కర్త శంకరుఁడే !

కం. జీవికి జన్మమె బంధము
భావంబున నెఱుక మాఱి । బయలై నంతం
ద్రోవగు బ్రహ్మానందము
సేవయె "హంసోఽహ" మదియు । స్థిరమగు వేమా! 2024

"అథచైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతం"

ఆ. జీవికి భయపడిఁ । జిక్కి యున్నది తనువు
తనువులోపల జీవి । తగిలియుండు
జీవ, తనువును మాయ । జగతి నుంచెను బ్రహ్మ ॥వి॥ 2025

"వాచాతీతం మనోతీతం, భావాతీతాం నిరంజనం జ్ఞానాతీతం
స్థిరం నాస్తి సర్వాతీతం సదాఽచలం"
అచలము నాశ్రయింపుము.

ఆ. జీవిఁ జంపు టెల్ల । శివభక్తిఁ దప్పాట
జీవు నరయ నిజము । నీ వెఱుఁగవె?
జీవుఁడు, శివుఁ డగుట । సిద్ధం బసిద్ధంబు? ॥వి॥ 2026

సర్వమూ యీశ్వరమహిమే?

ఆ. జీవి జీవిఁ జంప । శివునిఁ జంపుటె యగు
జీవుఁ డరసి తెలియ । శివుఁడె కాదె
భావమందు వేఁగఁ బరికించి చూడరా! ॥వి॥ 2027

"మానవసేవయే మాధవసేవ"

ఆ. జీవి జీవిఁ జంపి । జీవికి బెట్టంగ
జీవి దాన బలిసి । జెలఁగుచుండు
జీవ హింసకులకుఁ । జిక్కునా మోక్షంబు? ॥వి॥ 2028

మోక్షము చిక్కాలంటే హింస మానవలయును.

ఆ. జీవి తొలగనపుడె । జీవనౌషధ మిచ్చి
జీవి నిలుపవలయు । జీవనముగ
జీవి తొలగనేని । జీవనౌషధ మేల? ॥వి॥ 2029

బ్రతికున్నప్పుడే బాగుచేయాలి చచ్చినతరువాత చేసేది శ్రాద్ధమే!

కం. జీవిని దెలియక వేఱుగ
దేవుని భ్రమఁ దిరుఁగు నరుఁడు। దేవుని నెఱుఁగం
జీవుం డని వివరించిన
భావింపఁగ జీవి బట్ట। బయలగు వేమా! ॥వి॥ 2030
జీవుని తెలియలేక దేవునికోసం దేవులాడే వారే దేబెలు.

కం. జీవిని దెలిసిన దనుకను
దేవుని భ్రమ మెలఁగు నరుఁడు। దేవుం డనంగా
జీవుఁడె యని వివరించిన
బావింపన్ముక్తి బట్ట। బయలుర వేమా! 2031
మానసిక శక్తికలిగిన మానవుఁడే మాధవుఁడు.

ఆ. జీవియందు భ్రమలు। చేరియుంటయె కద్దు
జీవి భ్రమలయందుఁ। జిక్కు దేవుడు
జీవి జీవియైనఁ జిన్మాత్రమగు బయల్ ॥వి॥ 2032
జీవియొక్క తత్త్వాన్ని జీర్ణించుకున్నవాడు జిజ్ఞాసుడగు వేమనయే.

ఆ. జీవిలోన నుండు। స్థిరమును గానక
తిరుగు నస్థిరమునె। వరుస నమ్మి
స్థిరము, నస్థిరమును। దెలియ జీవికి ముక్తి ॥వి॥ 2033
స్థిరాఽస్థిరములు దెలిసినవారే సిద్ధులు.

ఆ. జీవిఁ జంపువెల్ల। శివభక్తిఁ దప్పారే?
జీవు నరసి కనుఁడు। శివుఁడె యగును
జీవుఁడు శివుఁ డనుట। సిద్ధంబు తెలియరా! ॥వి॥ 2034
జీవేశ్వరోపాసనయే శ్రేష్ఠమగును.

ఆ. జీవుఁ డనఁగ మీరు। చిక్కులు పడనేల?
వాయు, వాకసంబు, । వహ్ని కూడి
దేహి యనఁగ బరఁగె। దేహంబు లందొప్పి ॥వి॥ 2035
పంచభూతములే ప్రపంచాని కాధారము.

ఆ. జీవుఁ డిలను నిండి । సృష్టిలో నుండంగ
శివుని వెదకఁబోవు । జీవుఁ డరయ
జీవుఁడు శివుఁ డనెడి । చిహ్నంబుఁ దెలియక ॥వి॥ 2036

నీలోవున్న యీశ్వరుని నిర్ణయించుకొమ్మన్నాడు.

ఆ. జీవుఁ డుండు నెపుడు । శిరము, కంఠములందు
ఫాలమందు నుండుఁ । బరమమాత్మ
చిక్కుఁ గనులయందు । జీవాత్మ పరమాత్మ ॥వి॥ 2037

ఆపాదమస్తకము ఆభవునాస్థానమే.

ఆ. జీవుఁడె యగసాలి । క్షితిలోనఁ దెలియంగ
భావమైన తాను । పరమ శివుఁడు
వాయు వనెడి యతఁడె । వసుధ బ్రహ్మము గాదె ॥వి॥ 2038

అగసాలి = కంసాలి; నిర్మాత, విశ్వకర్మ; జీవంబోసినవాడు జీవబ్రహ్మ.

ఆ. జీవునందు జీవి । జనియించు టది యెరిగి
*జీవి రెండవగతుల । జాత మొంది
జీవి కోటికి పరుఁడు । జీవేశుఁ బరమేశు ॥వి॥ 2039

* యతులు పోయినవి; యతులకు గతులను హితోపదేశం జేశాడు వేమన.

కం. జీవునిఁ దెలిసిన దనుకను
దేవుని భ్రమ బొరలు నరుఁడె । దేవుఁడుఁ దలపన్
జీవుండని వివరించిన
భావింపఁగ ముక్తిఁబట్ట । బయలగు వేమా! 2040

జీవేశ్వరులకు అభేదముగానున్న వాడే శ్రేష్ఠుఁడు.

ఆ. జీవులెల్ల ముందు । జీవాత్మ పరమాత్మ
జత లెఱుంగఁ బాప । జలధిఁ బడరు
నావఁ గడపువాఁడు । నట్టేట మునుగునా ? ॥వి॥ 2041

తెలిసిన వానికి అలసట లేదు.

ఆ. జెట్టి సాముఁజేసి । క్షితిలోనఁ బేరెత్తి
దుష్టబుద్ధి చేతఁ । దొలఁగుఁ దెలివి
కష్ట మొకటె కాని । కడ తేఱుటే లేదు ॥వి॥ 2042

జెట్టిసాము = వస్తాదు ; అహంభావము అన్నిటిని జెరచును.

కం. జెండా వేయఁగ వచ్చును
గొండలు పెకలింప వచ్చుఁ । గుదిరిన మదిలో
నిండారగఁ బరిపూర్ణముఁ
జెండాడగ ముక్తిత్రోవ । చెలఁగును వేమా ! 2043

మోక్షసామ్రాజ్యాన్ని వీక్షించినవాడు అక్షయుడయి అలరారును

ఆ. జ్యోతి జ్యోతిని గలసె । జోలఁ బాడఁగనేల?
చూపు చూపున గలసె । సూటియేల ?
మిన్ను మిన్నున గలసె । ముక్తి కేడ్వఁగనేల ? ॥వి॥ 2044

“ రాత్రౌ వివక్త దేశేన దీపం సంస్థాపయత్నతః
గురూపదిష్ట మార్గేణ మనసాలోక యన్మునిః ”
రాత్రికి దీపమువలె జ్ఞానానికి గురువచనం.

ఆ. జ్యోతియందె పుట్టె । సొంపైన నాదము
బిందు వమరె నాద । మందుఁ దెలియ
బిందు వందుఁ బుట్టెఁ । బృథివి యాకాశముల్ ॥వి॥ 2045

“ చక్షుర్మధ్యే స్థితంగుహ్యా మాంగుష్ఠేపర్యమాత్రకం
తదర్థంచాపి పర్వార్థం తశ్యాగ్రేసూక్ష్మకం ధృవం ”
రెండుకనుల నడుమ అంగుష్ఠమాత్రస్థలము జూడుము.

## జ

ఆ. జంకులేని మదిని । జగధీశు నుంచిన
మంకు బుద్ధి మాని । మట్టుపడును
బంకమందుఁ బురువు । పడి పొర్లుచుండదా ! ॥వి॥ 2046

“ గుహ్యాద్గుహ్యాతరంగుహ్యాం చక్షుస్థానేషు తిష్ఠతి
తస్మాద్దిర్లక్ష్యే తేదృశ్యం ఆపాదతలమస్తకం ”
బ్రహ్మను మాత్రము జూడుము.

ఆ. జక్కి నెక్కి వీధి । జక్కగా వెలువడ
గుక్కలిన్ని వెంటఁ । గూయఁ దొడగు
ఘనుని కోర్వలేని । కాపురుషులు నిట్లె ? ॥వి॥ 2047

"అచలం నిర్మలం శాంతం కాయస్థం తేజఉచ్యతే
అమలం నిర్మల దేవం శూన్య వ్యాపినిరంజనం"
నిరంజనుని అర్చింపుము.

ఆ. జడలు దాల్చుటెల్ల । జగము చీ యను టెల్ల
నొడలు విఱుచుటెల్ల । యోగమెల్ల
ముక్తికాంత దయకు । మూల మానవి కాదె ? ॥వి॥ 2048

"తజ్జ్యోతి విమల స్థానేజ్ఞేయం ప్రత్యక్షగోచరమ్
పద్మగర్భం చతుష్టంచ తస్థమోనాత్ర సంశయః"
బ్రహ్మ విష్ణుపుగర్భములో పుట్టి సృష్టి చేసెను.

ఆ. జన్మములను, మఱియు । జన్మియల ననేక
ముల నొనర్చియున్న । ఫలము గాన
రాకయుండు నీతి । లేకున్న మాత్రాన ॥వి॥ 2049

"రక్తంశ్వేతం తథాకృష్ణం నీలపీతాది శోభితం
తన్మధ్య దర్శం యేనా తజ్జ్యోతి బ్రహ్మ"
కేవలం బ్రహ్మను జూడుము.

ఆ. జల్లి నొందరాదు । జవమీరి గనరాదు
ఆదిమూలమైన । ఆత్మ మరుగు
పోరి, జేరి, పొంది । పూర్ణము నందురా ! ॥వి॥ 2050

"భ్రూవోస్థానే అధఃపద్మం ద్విదళం తటాటశోభితం
హంక్షం ద్వ్యక్షర సంయుక్తం వర్తతే వాయుమండలం"
రెండక్షరములు గల వాని నర్చింపుము.

ఆ. జల్లిమాట లనుచు । జగమునఁ దిరిగెడు
కల్లగురుఁడు గట్టు । నెల్లకర్మ
పల్లు పురుగు సేరి । పలవింపఁ జేయదా ! ॥వి॥ 2051

దంత క్రిమివలె దరిద్రపు గురుఁడు దాపు రిస్తాడు.

కం. జవదాటనేల గుటిగా
భవహరమగు భక్తిఁబూని । పరిపక్వముగా
ధృవమైన బయలుఁ జేరఁగ
శివ మన్మయ చిన్మయంబు । చేకుఱు వేమా ! 2052

భవహరము = జన్మలేకుండుట; పరిపక్వము = ఆరముగ్గుట; చిన్మయము = పరంజ్యోతి;

ఆ. జవ్వనంబు నందు । జవరాండ్రతో పొందు
గోరకుండువాఁడి । కీడ లేఁడు
కాని దాని గోర । కయె యున్న ఘనుడురా ! ॥వి॥ 2053

కామానికి లొంగనివాడే ఘనుఁడు;

ఆ. జవ్వనమ్మునందు । జవరాండ్రతోఁబొందుఁ
గోరకుండు నాతఁ । డూర లేఁడు
కాన దానిఁగోర । కయె యున్న ఘనుఁడురా! ॥వి॥ 2054

అదే ఇదిగా పాఠిగాను.

తే. జాగు సేయక గురుసేవ । జరిపి దాన
యోగ యోగాంగముల నేర్చి । యోగు లగుచు
నాశలను మానుటనె గాదె । యచల తపము
సిద్ధి నొందును ముక్తికిఁ । జేర్చ వేమ. 2055

ఆశాపాశముల ద్రెంచి ఆత్మజ్యోతిని వీక్షించ మన్నాడు వేమన.

తే. జాడగల గుటి మేడలో । జోడు గూడి
వేడి యష్టాక్షరము లందు । విధ మెఱింగి
కూడి యాడెడు వాఁడె పో । కోవిదుండు
సత్వ సంసిద్ధిఁ బడయంగ । జాలు వేమ. 2056

అష్టాక్షరీ మహామంత్రము ఆత్మలో మననము చేసినవాడు ధన్యుడు.

ఆ. జాణ డైనయట్టి । చపలాయతాత్ముఁడు
తలఁపు లరసి చూడ । వలసెఁ గాక
కష్ట జీవి యైనఁ । గాన్పించునా వ్యాప్తి? ॥వి॥ 2057

చపలాయతాత్ముఁడు = స్థిరములేనివాడు; అచంచల హృదయులకు ఆత్మానంద ముంటదు.

ఆ. జాణల మనియెదు । చపలాత్ము లగువారు
తెలియలేరు తమ్ముఁ । దెలియలేరు
కష్టమైన యడవి । గాట్పడి యున్నారు ॥వి॥ 2058

జాణ = నేర్పరి ; తరతమ భేదము తెలియక తంటాలు పడతారు.

ఆ. జాణలైన యట్టి । చపలాయతాత్ముల
* తలపు లరసి చూసి । భ్రమయనేల ?
బయలి రూపులెల్లఁ । బరికింపఁగా నేల ? ॥వి॥ 2059

* యతి తప్పు; బాహ్య సుందరులు బ్రహ్మాన్ని జూడలేరు.

తే. జారు చనుదోయిఁ బైకెత్తి । చేరబిగియఁ
గంచుకముఁ గట్టు కామినీ । కపటవేష
ధారిణుల వలఁబడి నీవు । దగులు కొనకు
తలఁగు మది నరకము చేర్చు । దారి వేమ. 2060

కంచుకము = రవికె ; స్త్రీమూర్తినిజూచి చిత్తము తత్తరించేవారు రిత్తైపోతారు.

ఆ. జాలలోన నుండి స్త్రీల । వీధులవంకఁ
జూడనీయ రాదు । సుమ్ము వినక
చేతురేని యట్లు । చేటులు మూడురా ! ॥వి॥ 2061

జాలములు = కిటికీలు ; మానినీరూప వీక్షణాసక్తులు మందబుద్ధులని మహాకవి వాక్కు.

ఆ. జాలి నొంద రాదు । జవదాటి కనరాదు
ఆదిమూలమైన । యాత్మ మఱుఁగు
పోరి చేరి పొంది । పూర్ణము నందరా ! ॥వి॥ 2062

బ్రహ్మమును సాధించుటకు బహు ప్రయత్నము లవసరము.

ఆ. జోకనలము దిన్న । మేక జాతులకెల్లఁ
గాక యేలఁబోయెఁ । గాయశుద్ధి ?
లోకులు మఱి వేడ్కఁ । బోకలు పోదురా ! ॥వి॥ 2063

కాయకల్ప చికిత్స నీసడించాడు యోగి.

## ఝ

ఆ. ఝకట మాడుచుండు । జాడీలకో రెడ్డా
సాధుజనుల మీఁది । బాధపెట్టు
యముఁడుతప్ప వెఱతు । రందఱు వానికి ॥వి॥ 2064
పేచీలు కోరునకు పెద్దలు జడియుదురు.

ఆ. ఝకటమునకుఁ బోదు । జారిణి యొప్పదు
మాయజేసి పురుషు । మమతఁబెట్టు
గాని మాటలాడు । గయ్యాళి సతతము ॥వి॥ 2065
జారిణి జారుని వచించును గాని చీరి జగడము లాడదు.

ఆ. ఝరము జేనెడుండు । సాగఁగా నది యయి
క్రోశమాత్రమింక । గోపయు నగు
సార మొప్పు మొదలు । సాధించుకోవలె ! ॥వి॥ 2066
ఝరము = సెలయేరు; యేటి ప్రవాహమువలె నూటిగా బ్రహ్మాన్ని తెలియమన్నాడు.

ఆ. ఝరము వెలయదాన । సాగును బెదయేరు
భక్తినుండి తెలివి । ప్రబలునట్లె
మూలమేరుపడిన । ముక్తికి మార్గమౌ ! ॥వి॥ 2067
సాగర సంగమమువలె సర్వమూ సాధించ మన్నాడు.

ఆ. ఝషము నీరువెడలఁ । జచ్చుటే సిద్ధము
నీట నుండెనేని । నిక్కి పడును
అండతోలఁగఁ గలుగ । నందజేపని యట్లె ? ॥వి॥ 2068
ఝషము = చేప; స్థానబలిమిచేత తన్నుక చస్తారు.

ఆ. ఝషము వలనుజిక్కి । జలమందె యుండినఁ
బ్రదికియుండు గాని । ప్రతిభగనదు
తరుణి విడువకుండు । గురువుల చందాన ! ॥వి॥ 2069
“ గురువులు తరుణుల వలపుల
మరిగిన సర్వంబు మరచు మమకారముతో న్ ”

## ట

ఆ. టంక మదుకకున్నఁ । బొంకంబు గారాదు
స్వర్ణ భూషణంబు । జగ మెఱుంగు
భటుఁడు వెంటలేక । ప్రభుఁడు శోభింపఁడు ॥వి॥ 2070

ద్వంద్వముతో కూడినదే అందము.

ఆ. టంకుయోగి యెంత । టాటోటుచేసిన
వివర మరసినంత । వెగటుపడును
పరమునందు నరక । బాధయు సిద్ధంబె ॥వి॥ 2071

టాటోటు మాటలతో బూటకములు చేయు టక్కరులను వెక్కిరించాడు వేమన.

ఆ. టంకువానిఁ దుదకు । అంకులంజెయుఁ జేర్ప
దింక నేలఁజెప్ప । నితరఘనుల
మంకుపను లొనర్ప । మర్యాద వాయురా! ॥వి॥ 2072

మోసగానిని జారిణీకూడ చేరనివ్వదు.

క. టక్కరులఁ గూడి తిరుగుచు
నెక్కుడుకాలంబు జ్ఞాన । మెరుఁగఁగలేకే
నొక్క వెలయాలిపొందే
మిక్కిలి మోక్షమ్మటంచు । మెలఁగితి వేమా! 2073

తాను "పచ్చాపయిలీసు"లో నున్నప్పుడు విచ్చలవిడిగా వేశ్యా ముచ్చటలలోనున్న గొడవ తడివాడేమో!

ఆ. టక్కరులను గూడి । యెక్క సక్కము లాడ
నిక్కమైన ఘనుని । నిరుకు చెడును
ఉల్లితోటఁ బెరుగు । మల్లెమొక్క కరణి ॥వి॥ 2074

అతీతా నాగతోపమానోపమేయామృతాన్ని అందించాడు.

ఆ. టక్కుమాట లాడి । చిక్కులఁ బెట్టిన
నిక్క మెఱుఁగునతఁడు । నిర్వహించుఁ
జక్కనైన జ్ఞాన । సారంబుఁ దెలియరా! ॥వి॥ 2075

జ్ఞానసారాన్ని మానసములో నిరికించ మన్నాడు.

ఆ. టక్కుయోగి యెంత । టాటోటుఁ జేసిన
విడర మరసినంత । వెగటుఁగలుగు
బరము సున్న ; నరక । బాధయు సిద్ధంబు ॥వి॥ 2076
మోసగాడికి మోక్షములేదు ముప్పు తప్పదు.

ఆ. టాకిచేసి చెప్ప । నేకోలందియొ చూడు
గుఱుతు రూఢిచేసి । కొనుచు నమ్ము
కర్మ మనుభవింపు । కానివిచేయకు ॥వి॥ 2077
" అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం "

క. టాటోటు నమ్మగూడని
మాటలె యెల్లప్పుడుఁ బలుకు । మహిలో వానిం
గూటమునకు దగడంచును
జాటించిన మేలుసుమ్మి । జనులకు వేమా! 2078
కూటము = కలయిక ;
" కామ్యానాం కర్మానాం న్యాసంసన్యాసం కవకోవిదుః
సర్వకర్మపలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః " (గీత)

ఆ. టెప్పణములు సేసి । చప్పని మాటలఁ
జెప్పుచుందు రన్ని । స్మృతులు శ్రుతులు
విప్పి చెప్పనేల । వేదాంత సారంబు ॥వి॥ 2079
" దేహో దేవోలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః త్యజేదజ్ఞాన
నిర్మాల్యం " సోఽహం " భావేనపూజయేత్ "
నేనెవడనని యెంచవలెను.

ఆ. టీక వ్రాసినఁ । ట్లనేకులు పెద్దలు
లోకమందుఁ జెప్పి । రేక మతమె
కాకులట్టి జనులు । కానరా మర్మంబు ॥వి॥ 2080
" బోధోన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైకసాధనం
పాకశ్యవహ్నివత్ జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి "
మోక్షము పొందుము.

ఆ. టెక్కె మెత్తి చెప్పు । మొక్కఁడే దేవుఁడు
నిక్కముగను లోన । నిలిచి యుండుఁ
జక్కఁజూచు నతని । సంతోషమున ముంచు ॥వి॥ 2081
దేవుని నీలో ధ్యానించుము.

ఠ

ఆ. ఠక్కు మాటలాడి । చిక్కులఁ బెట్టిన
నిక్క మెఱుఁగు నతఁడు । నిర్వహించుఁ
జక్కనైన జ్ఞాన । సారంబుఁ దెలియరా ! ॥వి॥ 2082
మోసం పనులు చేసి గానిచెందడం తగదు.

ఆ. ఠావుఁ దెలిసినతఁడు । తా వీలు వెంబడి
నేవిధమున నైన । నిరవు సేరు;
భావ మెఱుఁగకున్న । బరమందు టెట్టురా ! ॥వి॥ 2083
కీలు తెలసి, లీలఁ గ్రహించుట మేల్తరమని వేమన చెప్పాడు.

ఠా. ఠంగణాలు బలిసి । నింగికి నెగిరినఁ
జెట్టు చివర పండు । చేతఁ బడునె ?
పుస్తకములు సదువఁ । బొందునా మోక్షంబు? ॥వి॥ 2084
ఠంగణాలు = గంతులేయుట ; చదివిన మాత్రంచే విజ్ఞానమురాదు.

ఆ. ఠీవి మిగులఁ గలుగఁ । డెక్కెమ్ము లెత్తించి
యూరు వేలవచ్చు । నుడిగి నపుడు
మంచి త్రోవ కొఱకె । మహిని యత్నింపరా ! వి॥ 2085
ఉడుగుట = చచ్చుట ; టెక్కెము = జండా ;
చచ్చినతరువాత వచ్చే సారమును జూడుము.

ఆ. ఠీవి లేదటంచు । డెంధంబు లోనెంచి
జ్ఞాని నెఱుఁగ లేని । మానవుండు
డాంబికునకు లొంగి । డయ్యురా ! కడపట ॥వి॥ 2086
డయ్యుట = అలసిపోవుట ; వేషాలనుజూచి మోసపోవద్దని
సూచించాడు.

ఆ. తీవి లేకయున్న । డిల్లపోఁ డెన్నఁడు
నిక్కమైన జ్ఞాని । నిలుకడఁగను
ఎంత లాపదలు నిఁ । కెన్నఁడు నెన్నఁడు ! ॥వి॥ 2087

డాబు లేకపోయినంత మాత్రనచేత జ్ఞానికి వంతుకు కలగదు.

## డ

క. డంబములు పలుకువాని ని
జంబుగ దా నమ్మునట్టి । జనుఁ డరయుఁగ జ్ఞా
నం బిసు మంతయు లేని మృ
గం బని యెంచుటకు । నడ్డు కలదా ! వేమా ! 2088

లేనిపోని డాబులు చెప్పువాడు ద్విపాద పసువని చెప్పవచ్చును.

ఆ. డంబమేల ? నీ జగంబున నెవ రెట్లు
చూడ నేమి ? నిన్ను । నాడ నేమి ?
అరయ బరమునకును । హానియౌ డంబము ! ॥వి॥ 2089

డాబు దర్పములు పరమార్థానికి పరమ శత్రువులు

ఆ. డగ్గఱకుము పాప । డాంబికులను నీవు
మోసపుత్తురయ్య । దోస మనక
క్రూరమృగము లట్టి । వారురా ! నమ్మకు ॥వి॥ 2090

డగ్గఱకుము = చేరకుము ; మోసగాళ్ళ స్నేహము ముప్పు ఘటించునని యోగివాక్కు.

ఆ. డాగుపడిన పండు । బాగు లేదందురు
అట్టి డాగు తమది । యరయ లేరు
తమ్ము నెంచువారు । తమడాగు కానరే ? ॥వి॥ 2091

డాగు = మచ్చ ; మానసములో మచ్చబడిన కానవచ్చు నంతా మచ్చగానే.

ఆ. డాగుపడిన వెనుక । డాలుకొనఁగ లేవు
అరసి చేయుమయ్య । యన్ని పనులు
తెలియకున్న నడుగు । తెలిసిన వారిని ॥వి॥ 2092

డాలుకొనుట = సిద్ధపడుట ; తెలిసినవారి నడిగి తెలిసికొనుము.

ఆ. డిందుపడిన వాని । నెందును లెక్కింప
రిందు నందుఁ గాన । నెట్టు లయిన
మందమతివి గాక । మహిమను చూడరా ! ॥వి॥ 2093

డిందు = క్రిందు ; నీవుమహిమనెంచి పతితుడవుగాక నిశ్చయానికి రమ్మనిబోధించేడు కవిచంద్రుఁడు.

ఆ. డింభకులను దిద్ది । దేవగాఁ గైసేయ
బట్టరాని గర్వ । పటిమఁ గంద్రు
అజ్ఞులకును దెలుపు । నాత్మబోధయు నిట్లె ॥వి॥ 2094

డింభకుఁడు = కుఱ్ఱవాడు ; కైసేయుట = బాగడుట ; అజ్ఞు లగు వారికి ఆత్మబోధ అనవసరము.

ఆ. డీకొనంగఁ దగదు । డెంద మెఱుంగక
అడుగవచ్చి కొంత । యనిన వానిఁ
జెప్పునంత వినియు । మెప్పుగాఁ బలుకుమీ ! ॥వి॥ 2095

డీకొనుట = ఎదిరించుట ; చెప్పినపనులు చేసి ఫలమందుకో

ఆ. డెందమందుఁ దలచు । డెప్పర మెప్పుడు
నోర్వలేని హీనుఁ । డోరుని కట్టె
తనకు మూఁడు సుమ్మి । తప్ప దెన్నఁటికైన ॥వి॥ 2096

“ ఓర్వలేని తనము ఒప్పదు మనిషికి
మెప్పుపొందు పనులు తప్పకుండుమీ ”

ఆ. డొక్క లెండిపోయి । డొక్కు తానయ్యును
మమత మానలేఁడు । మానవుండు
ఎల్లి తాను జావ । నెవరుద్ధరింతురో ! ॥వి॥ 2097

లోభత్వము వలన తిండి తినకుండుట, ఉపవాసాది వ్రతముల ననుష్ఠించుట శరీరము శుష్కించుటకు మూలములు. బక్కచిక్కిన వాడెం దుకును పనికిరాడు.

త

ఆ. తండ్రికన్న సుగుణి । తనయుఁడై యొప్పినా !
చిన్న పెద్దతనము । లెన్న రెవరు
వాసుదేవు విడిచి । వసుదేవు నెన్నరా ! ॥వి॥ 2098

వయసుచే గాక ప్రాజ్ఞతచే పెద్దతనము వచ్చును.

ఆ. తండ్రి ధనముగలిగి । తనయులు లేకున్న
పుత్రవాంఛ చేతఁ । బొరలుచుండుఁ
బుత్రులు గలిగినను । భూమిమీఁదనుఁ బుణ్య
పురుషు డందురనెడి । బుద్ధి వేమ. 2099

"అపుత్రస్య గతిర్నాస్తి" సూక్తినివాడెను. పుత్రులు లేనిదే గతిలేదు.

ఆ. తండ్రిమాటలు విని । తల్లిని దెగటార్చి
పరశురాముఁ డేమి । ఫలము గనెర?
నిలువ నీడలేక । కులగిరిఁ జేరఁడా! ॥వి॥ 2100

"మాతృదేవోభవ" "తల్లికంటె వేరుదైవము గలదె?"

ఆ. తండ్రి సొమ్మదైన । దాయాది సొమ్మైన
బరుల సొమ్మలైనఁ । బ్రాప్తధనము
దయను దీనులకును । దాన మిచ్చినవాఁడె
బహుళ పుణ్యజనుఁడు । పరగ వేమ. 2101

"పాత్రదానంబు సుంతైన ఫలము గాంచు
ఫలము లేదెంతయిడిన నపాత్రమునకు"

ఆ. తంత్ర మంత్రములను । దారక మబ్బునా!
యంత్రబలము గురుని । మంత్రమూని
చింతఁ జేయునపుడె । చిన్మయు మందురా! ॥వి॥ 2102

చిన్మయబ్రహ్మమును ఛీ యనక ఆప్యాయముగా అందుకొమ్మన్నాడు

ఆ. తంత్రవాదు లెన్న । దఱచుగా నున్నారు
మంత్రవాదులరయ । మహిని లేరు
జంత్రగాని బొమ్మ । చందంబె యూమెరా! ॥వి॥ 2103

మంత్ర, తంత్ర, యంత్ర, జంత్రములు మహిమల నిడలేవు

క. తక్రముతో నుద్భవమై
తక్రమ్మునఁ దేలు వెన్న । తరబడి సంసా
ర క్రమమునఁ బుట్టియు ఘన
చక్రముఁ గుర్తింపనగును । జతురత వేమా! 2104

తక్రము = పెరుగు: సంసారచక్రాన్ని చతురతతో సాధింప మన్నాడు

ఆ. తగదు తగ దటంచుఁ । దగువారు చెప్పిన
వినని వాఁడు చెడును । గొనకు నిజము
మునులు చెప్పు ధర్మ । ముల మీఱ నింతెరా! ॥వి॥ 2105

మునులు చెప్పిన స్మృతులే ముఖ్యములు

ఆ. తగవు తీర్చువేళ ధర్మంబుఁ దప్పిన
మానవుండు ముక్తి । మాని యుండు
ధర్మమునె పలికిన । దైవంబు తోడయా! ॥వి॥ 2106

ధర్మానికి దైవానికి అవినాభావము.

ఆ. తగిన కులజుఁడైనఁ । దనయెత్తు ధనమైన
లెక్కఁగొనక చెప్పు । నిక్క మొకఁటఁ
బరమసాధ్వి చూడఁ । బరుల నంటదు సుమీ ॥వి॥ 2107

పరుల నంటనిదే పరమసాధ్వి.

ఆ. తగినసతియుఁ బతియు । ధర్మంబుగాఁ గూడఁ
గడు బలుండు పుట్టు । ఘనత తోడఁ
బరుషుఁడు బలుఁడైనఁ । బుత్రుఁడు ప్రబలును ॥వి॥ 2108

“ వాగరావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందేపార్వతీపరమేశ్వరౌ ’’
పార్వతీపరమేశ్వరులకు నమస్కరించుచున్నాను.

* ఆ. తగులు సతినిఁగూడి । శిశువుగా రమియింప
కడు బలుండుఁబుట్టు । గట్టిగాను
పురుషుఁ డబలుఁడైన । బుత్రు లబలులురా! ॥వి॥ 2109

* యతిపోయినది ; బీజము బలమైన బిడ్డ ఘన మగును.

ఆ. తటుకున ధన పుత్ర । తరుణి భ్రమలనుండి
క్షీణమొందు దేహి । చింత చేత
కటకటా! యీ దేహి । కడ తేర లేఁడయా! ॥వి॥ 2110

గార్హస్థ్యాన్ని విడచి సన్యాసి యగుట సన్యాసి యగుటకే?

యాభి మాసావధారసంబులునూ, వైచిత్ర్యాది చతుష్టయమునూ, దిగ్వా తార్కాది చతుర్దశేంద్రియాధిష్ఠాన దేవతలునూ, యీఅరువది;36+60= 96 తత్వములు.

తే. తత్వములలోనఁ బరమాత్మ । తత్వమెఱిఁగి
నిత్య నిర్ముక్త పరిపూర్ణ । నిలయమంది
సరి పరబ్రహ్మ మయమందు । సంచరించు
నతఁడెపో పరశివుఁ డన । నగును వేమ. 2115

పరిపూర్ణ భావాన్ని పరిపూర్ణంగా వ్యక్తపరచాడు.

ఆ. తత్వ మెందునఁ బుట్టె ? । తపము యెందునఁ బుట్టె ?
యోగమెందునఁ బుట్టె ? । యోగి వరులు
శివరూపుఁ గనుఁగొన్న । సిద్ధుఁడే సకలంబు ॥వి॥ 2116

సిద్ధిబొందినవాడే శివసమానుఁడు.

ఆ. తత్వమెఱుఁగువాడు । దైవంబు నెఱుఁగును
సర్వసారములనుఁ । జూవఁజేయుఁ
గదళి మ్రింగు వాఁడు । గరళంబు మ్రింగునా ! ॥వి॥ 2117

కదళీఫలము = అరటిపండు ; గరళము = విషము ; తత్వ మెరుఁగుట దైవత్వ మందుట.

ఆ. తత్వవాదులుండ్రు । ధరనెందఱైనను
దత్వవేదిఁ జూడ । ధరణిలేఁడు
కలిగెనేని వానిఁ । గానంగరాడురా ! ॥వి॥ 2118

నిజతత్వాన్ని దెలిసినవానిని నిర్ణయించుట కష్టము.

ఆ. తత్వసిద్ధిచేత । తలయూచి పలుమారు
నవ్వును పలుమారు । నాతిగాదు
నాతిపే రదేమి ? । నవ్వుపే రదేమి ? ॥వి॥ 2119

ముక్తికాంతా హాసమును ముముక్షులే తెలిసికొంటారు ;

ఆ. తత్వహీనులుండ్రు । తఱచుగా భువిలోనఁ
దత్వ మెఱుఁగువారు । తఱచు లేరు
కలిగెరేని వారు । కాన్పింపరారయా ! ॥వి॥ 2120

తత్వ జ్ఞానాన్ని కూలంకషముగా తెలిసినవారు అరుదు.

ఆ. తథ్యమైన పూర్ణ । తత్వము నీలోన
మిథ్యమడఁపగానె । మిత్రమగును
సత్య నిత్యకర్మ । సాక్షి బ్రహ్మంబురా ! ॥వి॥ 2121
నిత్య సత్యాన్వేషణుఁడే నెఱయోగి.

కం. తనకర్మము తీరంగా
మనమున సద్భక్తి గల్గు । మహి నెట్లనగా !
నినుఁ డుదయింపఁగఁ । జీఁకటి
ఘనముగఁ జనునట్టె చనును । గర్మము వేమా ! 2122
అజ్ఞానాంధకారమును బాసిన సుజ్ఞాన సూర్యోదయ మగును.

కం. తనకాంతియె బయలెల్లను
దనకాంతియె యడుగుమడుగు । ధరపై నెన్నం
దనకాంతియె శుద్ధాంతము
తనకాంతియె తలఁపు వలని । తగులగు వేమా ! 2123
మాయా పురుష లక్షణములను చక్కగా తెలియమన్నాడు.

ఆ. తనకుఁగలుగు పెక్కు । తప్పు లటుండఁగాఁ
బరుల నేఱుచుండు । నరుఁడు తెలియ
నోడ లెఱుఁగఁ డనుచు । నొత్తి చెప్పగవచ్చు ॥వి॥ 2124
పరుల తప్పుల నెన్నుట యొప్పదు.

ఆ. తనకుఁ జేయుమేలు । తాఁ దెలియఁగనేర్చు
నెలమితోడఁ గుక్క । యొఱుక భువిని
దనకుఁ జేయుమేలు । తాఁ దెలియంగలేని
మనుజుఁ డెంత ఖలుఁడో । మహిని వేమా ! 2125
“ మిత్రఘ్నశ్చ కృతఘ్నశ్చ యస్తు విశ్వాసఘాతుకః
త్రయస్తే నరకంయాంతి యావచ్చంద్ర దివాకరః ”
చేసినమేలు మరచిన సూర్యచంద్రులున్నంతవరకు నరకముననుండును.

ఆ. తనకు నొప్పిపుట్టి । తనువెంత బడలిన
కూళవిటుఁడుఁ యువతిఁ । గూడు సుమ్మి
పండ్లు పడినఁ గుక్క । పసరంబుఁ గఱవదా ! ॥వి॥ 2126

పసరము = ఆవు. సుఖవ్యాధుల బాధలకైనా సహించును గాని జారిణీ సురతం విడిచి పెట్టడు.

ఆ. తనకు బ్రాప్తిలేక । దాత లివ్వరటంచు
దోష బుద్ధిచేత । దూరు టెల్ల
ముక్కువంక జూచి । ముకురంబు దూరుట ॥వి॥ 2127

ముకురము = అద్దము ; సహజోపమానములు జాలువారుచున్నవి.

ఆ. తనకు బ్రాప్తిలేక । దానము చిక్కమి
దైవనింద వెట్టి । తనముఁ గాదె?
కర్మజీవులేల । కర్మంబుఁ దెలియరో ! ॥వి॥ 2128

తన కర్మకొలది దాపురించును.

ఆ. తనకుఁ బ్రాప్తిలేదు । దాత యిచ్చునె యంచు
నొఱుల దూరుటెల్ల । నోగుబుద్ధి
కలిమి లేమి కతన । గష్టమె తోఁచురా ! ॥వి॥ 2129

తనకు ప్రాప్తి లేనిదే దాత ఏలాయిస్తాడు

ఆ. తనకుఁ బ్రొద్దుపోని । తరుణం బదైనచో
వినకతీర దధిక । విద్యలైనఁ
* బాలతి వినదె ? ప్రియుని । కొఱకుఁ గాకధ్వని ॥వి॥ 2130

* యతిపోయినది ; ఉబుసుపోకకై ఉవిదలు యూగులాడుచుంటారు;

ఆ. తనకు భాగ్యమున్నఁ । దక్కువ లేకుండ
గలుఁగు భాగ్యమెల్లఁ । గల్ల యనుచు
నమ్మకముగఁ జూచు । నఘుఁడగు యోగిరా ! ॥వి॥ 2131

కలిమి లేములందు సమబుద్ధిఁ గలవాడే యోగి ;

ఆ. తనకు మేలుచేయ । తా దెలియఁగ నేర్చు
నెలమితోడ కుక్క । యెరుక భువిని

తనకుచేయు మేలు । తాఁ దెలియఁగలేని
మనుజుఁ డెంతఖలుఁడో ? । మహిని వేమ. 2132

విశ్వాసహీనుని విశ్వసించరెవ్వరు :

క. తన కుల, గోత్రము, లాకృతి
తన సంపద కలిమి, బలిమి, । తన కేలనయా !
తనవెంట రావు; నిజమిది
తనసత్యమె తోడవచ్చుఁ । దనతో వేమా ! 2133

" సత్యంవద, ధర్మంచర " సత్యము పలుకుము ; ధర్మముచేయుము.

ఆ. తనకు లేనినాఁడు । దైవము దూఱును
తనకుఁ గలిగెనేని । దైవమేల ?
దనకు దైవమునకుఁ । దగులాటమే శాంతి ॥వి॥ 2134

అవివేకుఁడు ఉన్నచో తాను, లేనిచో దేవుని తిట్టును ;

క. తన కేనాడును భిక్షుము
తన కేనాఁడును భగంబు । తనరవలయు నం
చను దన దశకై యెల్లెడ
మనసందున జివుకుచుండు । మనుజుఁడు వేమా ! 2135

నిద్రా, భయ, మైథునములు, నిరతము నరునకవసరము.

క. తనగుణము తనకు నుండఁగ
నెనయంగా నొరునిగుణము । నెంచును మదిలోఁ
దనగుణము తాను దెలియక
వనరి యొరుని ననెడువాఁడు । భ్రష్టుఁడు వేమా! 2136

ఒరుల తప్పుల నెంచుట ఓగుతనము.

క. తనతల్లి లోపమెఱిఁగిన
మనుజుఁడు చింతిల్లునెపుడు । మానసమందుం
దనయాలి లోపమెఱిఁగిన
ఘనుఁడైనను దాని విడుచుఁ । గదరా ! వేమా! 2137

తల్లిలోపమునకు తల్లడిల్లును భార్యలోపమునకు బహిష్కరించును.

క. తన దారాపుత్రులయెడ
ననురాగముఁ జూపవచ్చు । నన్యాయముగా!
దన గతులుచెఱచికొని వా
రిని బెనుపఁగ నుద్ధరింత్రె । తేపట వేమా! 2138

దారాపుత్రుల భ్రాంతి దగ్ధంచేసి తత్వాన్ని తెలుసుకో?

ఆ. తనది తను వటంచు । తరుణి భ్రమలఁజిక్కి
చిక్కిపోవు నరుఁడు । చింతచేత
కడకు తేరలేఁడు । కటకటా! సంసారి ॥వి॥ 2139

సంసారాభిలాషులు సతిభ్రాంతితో కృంగి కృశిస్తారు.

ఆ. తనదు కర్మచేతఁ । దాను లోకములోనఁ
దనదు తల్లిగర్భ । మునను బుట్టెఁ
దనదు కర్మ మఱచి । దగనిది చేయునా! ॥వి॥ 2140

స్వకర్మాను చరణ సర్వోత్కృష్టము.

ఆ. తనదు కర్మచేత । దాను లోకములోనఁ
దనదు తల్లిగర్భ । మునఁ బుట్టెఁ
దన్ను మఱచి యింకఁ । దగనిది చేయునే? ॥వి॥ 2141

తను చేయుకర్మయే తనకుదారి

ఆ. తనదు తల్లి లంజె । తనయాలు మాదిగె
శ్రీపతికి గురువు వ । సిష్ఠుఁ డరయఁ
దపముగలుగ ద్విజుఁడు । తర్కింపఁ గలమెట్లు? ॥వి॥ 2142

బ్రహ్మత్వము వలన బ్రాహ్మణీకము, ఊర్వసి పుత్రుఁడు; అరుంధతి భర్త సూర్యవంశానికి పురోహితుఁడు వశిష్ఠుఁడు. (రామాయణగాథ)

ఆ. తనదు దత్తము పర । తత్వమొకఁటెఁ గాగ
చూడ కనుభవింప । చోద్య మిలను
తొడరి యాలునమ్మి । తొత్తును గొన్నట్లు ॥వి॥ 2143

కావలసినది విడచి కారానిదానికి కరములుఁజాచుట అజ్ఞాని లక్షణము.

ఆ. తనదు దాన మవనిఁ । దనబిడ్డ సమమగుఁ
దండ్రి దానమెల్లఁ । దనకుఁ దోడు
అన్యులిచ్చు దాన । మది తల్లివంటిది ॥వి॥ 2144
దానములయొక్క తారతమ్యాన్ని వచించెను.

ఆ. తనదు దేహమందుఁ । దనకున్న పరివార
మందఱిని బిగించి । హర్ష మొసఁగ
నెల్లచావులెఱిఁగి । యిందందు యోజించి
నడవ మేటివర్త । నమురా? వేమ. 2145
దశేంద్రియ యోగ్యాద మడచి తత్వాన్ని తెలుసుకోమన్నాడు.

ఆ. తనదు దేహమందు । దత్వార్థ మెన్నుచు
మందబుద్ధికాక । మహితు డయియు
లోనిగుట్టుఁ దెలిసి । లోకంబునందును
మెలఁగువాఁడు జ్ఞాని । తెలియ వేమ. 2146
తనలోని తత్వాన్నిఁ దెలిసినవాడే తత్వజ్ఞాని.

ఆ. తనదు నాత్మయందు । దైవంబు వెలయఁగ
దీర్ఘయాత్రలకిలఁ । దిరుగు నరుఁడు
గంధపుఁ దునుకలను । గాడ్దె మోసినయట్లు ॥వి॥ 2147
తీర్థయాత్రలకు వెళ్ళుట నిరర్థకము.

ఆ. తనదు నృపతితోడఁ । దనయాయుధము తోడ
నగ్ని తోడఁ బరుని । యాలితోడ
హాస్యమాడు టెల్ల । నగును ప్రాణాంతమ్ము ॥వి॥ 2148
చక్కని ఉపమానములతో లోకులకు నీతిని బోధించాడు.

ఆ. తనదు నీడ శిశువు । తాఁ జూచుచున్నట్టి
తనదు నీడజూచి । తన్ను మఱచి
పనులొనర్చు నెపుడు । భ్రాంతునేమందు ॥వి॥ 2149
తనకుతానే గొప్పవాడననుకొనుట తెలివితక్కువ.

ఆ. తనదు పూర్వకర్మఁ । దలపోయ నేటికి
తనదుఁ బ్రతుకుకారణ । దలఁచిచూడ
ఇట్టిజన్మ, కర్మ । యికముందు నెలదని
తలచువాఁడె తెలివి । పరుఁడు వేమా! 2150

ప్రారబ్ధము, సంచితము, ఆగామి; త్రికర్మలు తెలిసికొనినవాఁడే ధీరుఁడు

ఆ. తనకు బాగుఁ గోరి । ధర్మంబుఁ జెప్పినఁ
దిట్టుచుండు నధముఁ । డెట్టయెదుట
గడ్డివేయ పోట్ల । గొడ్డు కొమ్మాడించు ॥వి॥ 2151
వేమన కవితా ప్రతిభ వేనోళ్ళ చాటిస్తుందీపద్యము.

ఆ. తనదు భ్రాతలెల్ల । దానంబు సేయంగఁ
దనకు ఫల మటంచు । మినుక రాదు
తనదు కాలుఁ గోయఁ । దన తమ్ముఁడేడ్చునా ? ॥వి॥ 2152
" ఎవరికి వారే యమునా తీరే "

ఆ. తనదు భ్రాతృవరులు । ధర నేలు చుండఁగాఁ
దనకు నుండు నంత్రు । వెనుక వారు
తనదు కాలు గోయఁ । దమ్ముఁడు నొచ్చునా ! ॥వి॥ 2153
ఒకరిది ఒకరికి రాదు.

ఆ. తనదు మనసు చేత । దర్కించి జ్యోతిష
మెంతఁ జేసె ననున । దెంచిచూడఁ
దన యదృష్టమెల్ల । దైవంబ యెఱుగును ॥వి॥ 2154
మతిపలెనే గతి ; యీగతి తెలియక శాస్త్రాలపై పంతురు.

ఆ. తనదు రూపమెల్లఁ । దనలోనఁ జూచియు
మనసు దీపముగను । మమత విడిచి
యనుదినమును గాంచు । నతఁడెపో బ్రహ్మంబు ॥వి॥ 2155
ఆత్మజ్యోతిని అవలోకించిన వాఁడే బ్రహ్మవేత్త.

ఆ. తనదులోని జీవ । తత్వముఁ దెలియక
వేఱఁటంచు దలఁచి । వెదకులెల్ల
భాను నరయ దివ్వె । పట్టి వెదకిన రీతి ॥వి॥ 2156
తనలోని తత్వము దెలియక దవ్వులకేగుట నవ్వులపాలు.

ఆ. తనదుపతి సధర్మ । మునఁ దానె చాటఁగా
సాటెపూరుషుండు । పాటిఁ దెలుప
నెఱుగలేని నరుఁడు । నరమాత్రుఁడును గాఁడు ॥వి॥ 2157
ఇంటివాడు "ఇదిగో" అంటే పారఁగువారు పాలికేక వేయును.

అ. తనదు సొత్తొరునికి । దానంబుగా నిచ్చి
చూడ కనుభవింపఁ । జోద్య మిలను
దొడరి యాలినమ్మి । తొత్తును గొన్నట్లు ॥వి॥ 2158
అసలు వస్తువును విడచి నకిలీదానికి నాశించినట్లే ?

ఆ. తనదుసొమ్ముఁ జూడ । దానమియ్యఁగ వచ్చు
నవని దొడ్డుగాద । దెవరికైన
నదురు బెదురులేక । యన్యుల సొమ్ముల
దానమిచ్చుటేఁటి । తగవొ వేమ ? ॥వి॥ 2159
అత్తసొమ్ము అల్లుడు దారవోయు విధము.

క. తన నిజరూపముఁ జూడం
గను దగుమార్గంబుఁ దెలియఁ । గావలెనన్న
న్ఘన గురుని యండఁ జేరక
యొనఁగూడునె సాముఁజేయ । నుర్విని వేమా! 2160
గురూపదేశములేక గుట్టుతెలియదు.

క. తననీడ తనకు శతృవు
తననీడే తనకు సాక్షి । తనదేహమురో
తనవారె తనకుశతృలు
తనమనసే తనకు తోడు । తథ్యము వేమా ! 2161
తనమనసుగాక అన్యులు తనకుశత్రువులే !

ఆ. తనను బోలినవియు । ధరబుట్టినవి కావా
పరగఁ దన్నుఁబోలి । బ్రతుకఁ గాదె ?
జ్ఞాని జ్ఞానిం జంప । గారణ మేమిరా ! 2162

బ్రహ్మప్రాప్తికి ప్రయత్న మవుసరము.

కం. తనప్రాప్తి తనకునుండగ
తనదుఃఖము తనకు గాక । తగులునె యొరులన్ఁ
దనచేయు మంచి, దనకే
యను కూలించెడిని జౌర । ధన్యులవేమా ! 2163

* యతిలోటు ; తనచేయుపని తనకు వెనుదన్నును.

కం. తనమతమునె తానెఱుఁగఁడె
మనమునఁ దలపోయ నెవసి । మార్గం బగునో !
యనయము నీజాలంబును
గని మెలఁగుట ముక్తికిరవు । గదరా ! వేమా ! 2164

జాలము = క్రమము ; అసలువిషయము క్రమముగా గనుట ముక్తికి మార్గము.

కం. తనమదిఁ గపటము గలిగినఁ
దనవలెనే కపటముండుఁ । దగజీవులకుం
దనమది కపటము విడిచినఁ
దనకెవ్వఁడు గపటి లేఁడు । ధరలో వేమా ! 2165

“ యద్భావం తద్భవతి ”

కం. తన యూ లన్యుని గను నను
ననుమానము కలుగు ననుచు । నంతకు ముందే
పనిఁబూని చక్క పఱచిన
మనుజుండా వ్యధను గనఁడు । మదిలో వేమా ! 2166

“ అనుమానం పెనుభూతం ” జాగ్రత్తాభయం నాస్తి.

తే. తనయుండు పెరిగితె । తొయ్యని కాలాన
పోషించునని తల్లి । పెంచి విడిచె
పెంచినకష్టంబు । యెంచి తీర్చగవలయు ॥వి॥ 2167

యీపద్యము వేమన మహాకవి గారి గంటమునుండి వచ్చినది కాదేమో !

ఆ. తనయుఁ డెవ్వఁడేనిఁ । దన తండ్రికంటెను
బేరుఁ దెచ్చునట్టి । పెద్దయైన
జనకు హీనపఱప । సాహసించినఁ జేటు
మూఁడు నిహపరముల । ముందు వేమ. 2168

తనయుఁడు గొప్పవాఁడైనా తండ్రిని దూషించరాదు.

ఆ. తనయుఁ డోదవె ననుచుఁ । దాఁ బొంగుచుండును
వాఁడు దుష్టుఁడైన । గోడుఁ గూర్చుఁ
దులువవాండ్రఁ గూడి । మెలగనీరాదురా ! ॥వి॥ 2169

చెడ్డస్నేహము చేయించరాదు ;

ఆ. తనయులఁ బరిజనుల । దనసతిం దన్నును
దీర్పు చేసికొనుచుఁ । దెలివిఁ గలిగి
జగమునకును మేలు । తగునంతగాఁ జేయు
నతఁడె యిహపరముల । నలరు వేమ. 2170

తనవారిని సక్రమబాటలో నడిపించి దేశకళ్యాణాన్నిగూర్చి సేవజేయించుట మేలు.

ఆ. తసర నృపతితోడ । తగ దుర్జనునితోడ
నగ్నితోడఁ బరుని । యాలుతోడ
నాస్యమాడుటెల్ల । నగును ప్రాణాంతమ్ము ॥వి॥ 2171

మానవుని మంచిదనానికి నీతిని బోధించెను.

ఆ. తనలోన బంగారు । తళుకులాడుచు నుండ
యితరబంగారంబు । యేల మనకు ?
మనసు రాగినిఁజేసి । మర్మంబు గాల్పరా ! ॥వి॥ 2172

• తనకున్నదానిని తన్ని అన్యులనాసించేవారు వెఱ్ఱిశెంగళప్పలని వేమనసూక్తి.

క. తనలోనే సకలంబును
తనువుం దానగుట యెఱిగి । తారక మాత్మన్
దనుననుచు బరిణమించిన
మనుజునకును ముక్తికలదు । మహిలో వేమా. 2173

తారకమే తనశరీరమని తలపోయువాడు ధన్యుఁడు.

క. తనలోపల సకలంబును
దనరం దానగుట నెఱిగి । తారక మాత్మం
గనుగొనుచు బరిణమించిన
మనుజునకును ముక్తిఁగలదు । మహిలో వేమా! 2174

"తారకము సూక్ష్మరూపమనెనన్నా"

క. తనలో సర్వంబుండగ
దనలోపల వెదకలేక । ధర వెదకెడి యీ
తనువుల మోసెడి నెద్దుల
మనములఁ దెల్పంగవశమె? । మహిలో వేమా! 2175

ఎద్దువలె మొద్దుగానుండక ముద్దుగా సుద్దుల నార్జింపుము.

ఆ. తనవలెనె యవియును । ధరఁ బుట్టినవికావె?
పరగఁ దన్నుఁబోలి । బ్రతుకుఁ గాదె?
జ్ఞాని జ్ఞానిఁజంపఁ । గారణమేమిరా! ॥వి॥ 2176

అంతయూ ప్రకృతి సంభవమే!

ఆ. తన విపత్తు దెలియఁ । దప్పించుకొనఁజూచు
నెట్టి మనుజుఁడైన । నెట్టులైన
నరకబాధ వినుచు । నరయఁడే ధర్మంబు? ॥వి॥ 2177

నరకమంటే నరునకుభయం.

ఆ. తన విరక్తి యనెడి । దానిచేతనె చిక్కి
మిగిలి వెడలలేక । మినుకుచున్న
నరుని కేడ ముక్తి । ధరలోన లేదయా! ॥వి॥ 2178

ముక్తి గావలసిన చిక్కులు పడరాదు.

తే. తన్మయాకార వృత్తిలో । దగిలి మెలఁగఁ
జూపులోఁ జూపు నంటుచు । సొంపు గాను
భానుకోటి ప్రకాశమౌ । బయలుఁ జేరి
పరమ పరిపూర్ణ భావుఁడై । పరగు వేమ. 2179

కోటిసూర్యుల కాంతినిబోలు బ్రహ్మమును గోరమన్నాడు యోగి పుంగవుడు.

క. తనసంరక్షణ కొఱకై
మనమునఁ గార్యంబుఁ బూని । మనుజులఁ జెరుపం
దినదినము గడచు చుండెడి
మనుజాధముఁడే యసురుఁడు । మహిలో వేమా! 2180

తనసుఖముల కై యితరుల చెరిపినవాడే రాక్షసుఁడు.

ఆ. తనసతి నపథమున । తనుతానె చొనుపుగా
సాటి పూరుషుండు । సరగు దెలుప
నెఱుగలేని నరుఁడు నరమాత్రుఁడును గాఁడు ॥వి॥ 2181

సూక్ష్మమైన ధర్మాన్ని సూటిగా జెపుతాడు వేమన.

ఆ. తనియు బిండమునను । తగిలిన మనుజుండు
పుట్టలేఁడు వాఁడు । పుడమి లోన
నట్టి పుట్టుక గన । నవనిలో లేదయా! ॥వి॥ 2182

గర్భములో అడ్డు తిరిగిన పిండము బ్రతుకుట కష్టము.

ఆ. తనివితీఱ గురుని । ధ్యానించి మదిలోన
దనువు మఱచు గురుని । దాకి నపుడె
తనరుచుండు బ్రహ్మ । తన్మయ దృష్టిలో ॥వి॥ 2183

గురువు శిష్యుఁడు. శిష్యుఁడు గురువు.

కం. తను దానై బయలందుచు
ననుమానము లేక తానె । యచలుండగుచు
న్వినయ విధేయత లొందిన
మనమే యానందరూప । మౌనము వేమా! 2184

తన్ను దాను మించిన వాడే మౌని.

కం. తనుఁదాఁ దెలియుట తత్వము
తనకన్యులు బోధసేయ । ధరలోఁ గలరే?
తనుఁదాఁ దెలియక యుండినఁ
దన కెవరును దెలుపలేరు? । తథ్యము వేమా! 2185

తనను తెలిసి కొనుటకు తానే కర్త.

ఆ. తను భరించు నతనిఁ । దన యాయుధమ్మును
అగ్ని నింక,c బరుని । యాలి నెన్న
సరసమునకుఁ గానఁగ । జావె సిద్ధించురా! ॥వి॥ 2186

నిరంతరము ఎల్లవారలు యెరిగి పాటింపదగిన మూటినీతులు యీపద్యములో నున్నవి.

ఆ. తనువ దెవరి సొమ్ము? । తనదని పోషింప
ధన మదెవరి సొమ్ము? । దాఁచు కొనఁగఁ
బ్రాణ మెవరి సొమ్ము? । పాయ కుండఁగనిల్ప ॥వి॥ 2187

తనువు. ధనము, ప్రాణము యీమూటిని తనవనే భ్రాంతిపడరాదు.

ఆ. తనువనఁబడు నింటఁ । దగు శత్రు మిత్రులఁ
దెలియలేని వాని । తెలి వదేలఁ?
దెలిసి చక్క పఱుప । దివ్యా మృతమ్మదే? ॥వి॥ 2188

శరీరములోనున్న సుజ్ఞానాజ్ఞానముల చక్కబరచినవాడే సాధువు.

ఆ. తనువనేటి యింట । దవ వహ్ని గాల్పంగ
మేను గాల్పనేల? । మిథ్యఁ గాక
దాసు తప్పునకును । దండన గాబోలు ॥వి॥ 2189

తనకర్మ తనకు దప్పదన్నాడు.

కం. తను వలచినఁ దావలచును
దను వలవక యున్న నెవఁడుఁ । దావలవ డిలం
దనదు పటాటోపంబులుఁ
దనమాయలుఁ బనికిరావు । ధరలో వేమా! 2190

తనవలె ప్రపంచ ముండును.

ఆ. తనువు తను వటంచుఁ । దపియింత్రు జనులార!
తనువు లస్థిరమని । తలఁప రాదె?
తనువు కానఁబడమిఁ । దగులునా మోక్షంబు ॥వి॥ 2191

తనువశాశ్వతము మోక్షము శాశ్వతము.

ఆ. తనువు తానను కొనుఁ । దనకు వాసనఁ బట్టి
జనన, మరణములను । జక్క జిక్కి

పొలుపు నందెఱుఁగక । పొల్లాడు చుండెడి
భ్రాంతిజీవికేఁటి? । పరము వేమ. 2192

భ్రాంతులకు చిక్కినవారు బ్రహ్మనెరుగరు.

ఆ. తనువు నడవిఁ జేసి ! తనలోనె కూర్చుండి
తపము చేయలేని । తపసులెల్ల
నడవి యందుఁ జేరి । యలజడ పడెదరు ॥వి॥ 2193

మానసిక తపస్సు చేయుచున్నాడు.

ఆ. తనువునందు నగ్ని । దరి కొని కాలంగఁ
గాల్చుకొనుట యేమి । కర్మమునకొ ?
కాల్చుకొన్న యంత । ఘనుఁడు తా నాయెనా ! ॥వి॥ 2194

వైష్ణవమత సంప్రదాయములగు చక్రాంకితములు వేయించుకొనుట వెఱ్ఱితనమని వేమన్న మతము.

ఆ. తనువు నస్థిరమిక ధనము నస్థిరమని
తెలుప నేర్చు తానుఁ । దెలియనేర్చు
పాత్రుఁడైనయోగి । పరమాత్ముఁ డేసుమ్ము ॥వి॥ 2195

అన్నిటిని విడచి అడవియున్నవాడే అపరబ్రహ్మ.

ఆ. తనువు పెట్లుప్పుఁగా । తఱుచైన గంధకం
తామసంబునఁ బరచి । భూమియెల్ల
జెముడు బొగ్గులుఁ జేసి । చెర్చాల నూరరో ॥వి॥ 2196

దీపావళికి ఉప్పొట్లాలు పేల్చు విధముగా శరీరమును వేల్చుము.

ఆ. తనువు పోవువేళ । ధనమును, బాంధవు
ల్వెంట రారు నిజము । వెఱ్ఱులార !
తనువువిడిచి పోవఁ । దనకు దోడౌ గురుతె ! ॥వి॥ 2191

గురువుచెప్పిన గురుతే అంత్యకాలములో ఆధారము.

ఆ. తనువు యెవరిసొమ్ము ? । తనదని పోషింప
ధనము యెవరిసొమ్ము ? । దాచు కొనఁగ
ప్రాణ మెవరిసొమ్ముఁ ? । బాయకుండఁగ నిల్ప ॥వి॥ 2198

"నా" అని చెప్పుకోదగ్గది యేదియూలేదు. అంతా జగన్నాథునిదే.

ఆ. తనువు లస్థిరమని । ధనము లస్థిరమని
తెలుపగలఁడు తాను । తెలియలేఁడు
చెప్పవచ్చుఁ బనులు । సేయుట కష్టమా ! ॥వి॥ 21

చెప్పుట తేలిక చేయుట మహాకష్టము.

ఆ. తనువు లస్థిరములు । ధర్మము నిత్యము
చేయుకర్మ మెల్ల । చెడని పదవి
కని, విని మరి తెలియ । గనరు నరపశువులు ॥వి॥ 22

ధర్మము ధృవతార వంటిది. అజ్ఞానులీమా తాన్ని తెలియలేరు.

ఆ. తనువులోన జీవ । తత్త్వ మెఱుంగక
వేరె కలదటంచు । వెదక నేల ?
భానుఁడుండ దివ్వెఁ । బట్టి వెదకురీతి ॥వి॥ 22(

సహజోక్తికి అనుకరణ మావశ్యకము.

ఆ. తనువులోన నున్న । తత్త్వంబుఁ దెలియక
వేరె యాత్రఁబోవు । వెఱ్ఱి వారు
గంత మోసి మోసి । గాడిద తిరుగదా ! ॥వి॥ 220

గంత = గోనిసంచీని రెండుగాఁజేసి బరువు మోయుట కుపయోగించేది; "అంతకుదగ్గ బొంత" అను సామెత వాడబడినది.

ఆ. తనువులోన వెదకి । ద్వైతంబు మొనఁ జేసి
ముందు కర్మములను । మూలఁ ద్రోసి
మనసు నిజముఁ జేసి । మమతలన్నియు రోసి
మోక్షగామి నిలుచు । మొనసి వేమ. 220

వికారాలు విడచి మోక్షగామి ముందుల విషయాల నందుకొమ్మన్నాడు.

ఆ. తనువు విడిచి తాను । దరలి పోయెడివేళఁ
దనదు భార్య, సుతులుఁ । దగినవార
లొక్కరైన నేగఁ । రుసురు మాత్రమె కాని
తనదు మంచితోడు । తనకు వేమ. 220.

మరణించినప్పుడు తనమంచి చెడ్డలే తోడు గాని "మావా" రను వారెవ్వరూ రారు.

ఆ. తనవు శోధఁజేసి । దైవము మొనఁజేసి
ముందు కర్మములను । మూలఁద్రోసి
మనము నిజముజేసి । మమతలన్నియు రోసి
మొనసి నిల్చువాఁడు । మోక్షి వేమ. 2205

మొన = గురి; మోక్షి = ముక్తిపొందినవాడు; పరబ్రహ్మను గురిగా భావించుట ముక్తి.

ఆ. తన్నుఁ గన్నయట్టి । తల్లి వంటిది సుమ్ము
అన్యకాంత న్యాయ । మరసి చూడఁ 2206
గన్నదాని జనులు । కానంగ లేరయా! ॥వి॥

మానినులందరినీ మాతృరూపముతో దర్శించుము.

ఆ. తన్నుఁగొట్టినవార్ల । తల మరుగుగానిల్చి
దూషించ గలవాఁడె । దొడ్డ పాపి
అందరిని దండించ । సుందరీశుఁడు లేడ ॥వి॥ 2207

సుందరీశుఁడు = ఈశ్వరుఁడు; పరోక్షమున భాషించుట నీచము.

ఆ. తన్నుఁజూచి యొరులు । దగ మెచ్చవలెనని
సొమ్ములెలమిఁ బెట్టు । నెమ్మిమీఱ
నొరుల కోఱకు దాన । యుబ్బుచునుండును
దన్ను దెలియలేఁడు । ధరణి వేమ. 2208

తనఅందచందాలను పరులు చూచి ఆనందిస్తారనుకొంటాడు.

ఆ. తన్ను తాఁ దెలిసిన । తత్వజ్ఞులకెల్ల
దాపుగా కనబడును । తారకంబు
నోటిమాటలవల్ల । నాదఁబు పలుకునా ॥వి॥ 2209

* యతి తప్పు; సాధనవలన తారకము సాధింపనగును.

ఆ. తన్నుఁదాఁ దెలిసిన । దైవంబు మఱిలేదు
తానె దైవమంచు । దత్వయోగి
తలఁచుచుండు నెపుఁడు । ధరలోన నరయంగ ॥వి॥ 2210

తన్నుతాను తెలిసికొనిన దైవ సమానుడు.

ఆ. తన్నుఁదాఁ దెలిసినఁ । దానెపో బ్రహ్మంబు
తనువులోని ముక్తిఁ । దగిలి యుండుఁ
దన్నెఱుఁగని వాఁడు । తానెట్టి బ్రహ్మంబు ? ॥వి॥ 2211
తన్నెరుగనివాడు బ్రహ్మమునుఁ జూడగలడా !

ఆ. తన్నుఁ దానెఱుఁగఁడు । తానెవ్వరికి నేర్పుఁ
బ్రాలుమాలి తిరుఁగు । పశువు కొడుకు
కాసుల కొఱకై నఁ । గర్మములఁ బెట్టురా ! ॥వి॥ 2212
పశువు కొడుకు = బసవన్న (నుడికారము)

ఆ. తన్నుఁ దెలియక తినుట । తిండితిండే కాదు
వుడికి వుడకనివంట । వంట కాదు
దిక్కులేనివాఁడు । ధైర్యుఁడే కాదయా ! ॥వి॥ 2213
పరిజ్ఞానాంశములను భాషించేడు

ఆ. తన్నుఁ దెలియ కున్నఁ । దగ వేదములవెట్టి
సర్వసంపదలను । సాబువెట్టి
ఆరుశాస్త్రములు నిఁ । కాపురాణములును
జబ్బులనుచు జగతిఁ । జాటువేమ. 2214
తన్నుతాను తెలియనపుడు పురాణేతిహాసముల చదువు అనవసరం.

అష్టాదశ పురాణములు

1. బ్రహ్మము, 2. పద్మము, 3 విష్ణు, 4. శివ, 5, భాగవతము, 6. నారదీయము, 7. మార్కండేయము, 8 బవిష్యోత్తరము 9. ఆగ్నేయము, 10. బ్రహ్మకైవర్తనము, 11. లింగము, 12. వరాహ, 13. స్కాందము, 14. వామనము, 15. మత్స్య. 16. కూర్మ, 17. గారుడ, 18. బ్రహ్మండ పురాణములు.

ఆ. తన్నుఁదెలియు నట్టి । దైవజ్ఞు లెన్నంగ
నిన్నుఁదెలియలేని । నిలువ రైరి
మాయ దెలియకున్న । మంటిపాలైరయా ! ॥వి॥ 2215
మాయతెలియనిచో మన్ను పాలే యగుదురు.

ఆ. తన్నుఁ దెలియు వారు। త్రై వజ్ఞులెంతయు
నిన్ను తెలియులేని। నిలువ రైరి
మాయఁ దెలియకున్న। మంటపాలైరయా! ॥వి॥ 2216

త్రైవజ్ఞులు = త్రికాల వేదులు.

ఆ. తన్నుఁదెలిసిన వెనుక। తత్వ శాస్త్రములేల?
తన్ను మఱచినవెనుక। తగవులేల?
తాను యెవ్వఁడు తన్ను। తాఁ దెలుసు యెవ్వఁడు ॥వి॥ 2217

తన్ను ఎవరు తెలుసుకొందురో వారిని తాను దెలిసికొన్న వాడే ధన్యుడు.

ఆ. తన్ను వెదకి చూడఁ। దానెయా జీవుండు
తత్వమరయ నగునుఁ। దానె యాత్మ
మన్ను మిన్ను లేదు। మాయయు లేదయా! ॥వి॥ 2218

ఎక్కడేమీ లేదు విజ్ఞానికి.

ఆ. తన్నెఱుఁగని వాఁడు। తానె తానై యుండుఁ
దన్నెఱుంగు వాఁడు। దానె తాను
దనువులేని వాడుఁ। దానె తానా సుమ్మి ॥వి॥ 2219

తనశరీరమును తెలిసికొనుటే ఘనతరము.

ఆ. తన్నెఱుంగువాఁడు। తానె తానై యుండుఁ
దన్నెఱుఁగని వాఁడు। దానెతాను
దనదు లోనివాఁడు। తానెతా నవునయ్యా! ॥వి॥ 2220

తాను తానైనవాడే పూనికైన బ్రహ్మము.

ఆ. తపము, జపము లెల్ల। ధాత్రి జనులకెల్ల
నొనర శివునిఁ జూఁడ। నుపముఁ గలదు
మనసుఁ జెదరనీక। మరిలోన జూడరా! ॥వి॥ 2221

చిత్తమందు శివుని హత్తించుటే జపతపములజాడ.

ఆ. తపము లాదిగ నియమముల్। దశవిధములు
మతియు, దానము, శివపూజ,। వ్రతము, జపము

వినుట, యాస్తిక్యమును, । సిగ్గు వెలయ నిదియె?
చిత్తశుద్ధికి హేతువు । స్థిరము వేమ. 2222

నవ విధ భక్తిమార్గములచే జగన్నాథుని చేరవచ్చును.

ఆ. తపము లేల ? యరయ ? । ధాత్రి జనులకెల్ల
నోనర శివునిఁ జూడ । నుపము గలదు
మనసు చెదరనీక । మదిలోనఁ జూడరా ! ॥వి॥ 2223

చిత్తచాంచల్యములేక శివుని జూచుటయే ఉన్నతోపాయము.

కం. తపమేర్పడ నష్టాక్షరి
జపమునఁ బరితృప్తి నొంది । జైత్రుండైన
న్నెపములు తోఁపని నిర్గుణ
తపమే పరబయలటంచు । దలఁపుము వేమా ! 2224

"ఓంనమో నారాయణాయ" అష్టాక్షరి ; యీ మంత్రములో విష్ణుపరముగను. శక్తిపరముగను, ద్వంద్వార్థములున్నవి.

ఆ. తప్పఁగల్గెనంచు । తాటోటు చేసిన
గూడియున్నలక్ష్మిఁ । గ్రుంగిపోవు ;
ఓటికుండ నీళ్లు । నుండని చందాన ॥వి॥ 2225

అబద్ధమాడుట దరిద్రహేతువు

ఆ. తప్పునొప్పుఁ దెలిసి । దైవ సంకీర్తన
ల్సేయువారు హరికి । సేవకాళి
నీ తెలుఁగక తాము । నిందింపరాదయా ! ॥వి॥ 2226

తప్పొప్పుల తత్వాన్ని తప్పకుండా తెలుసుకోవాలి.

ఆ. తప్పు పలుకుపలికి । తాటోటుఁ జేసిన
గూడి యున్నలక్ష్మి । గ్రుంగి పోవు
నోటికుండ నీర । మొనరంగ నిలుచునా ! ॥వి॥ 2227

ఆధారాలు లేనిదానిలో యేదియూ యుండదు.

ఆ. తప్పు లెన్నువారు । తండోపతండము
లుర్వి జనులకెల్ల । నుండు తప్పు
తప్పు లెన్నువారు । తమ తప్పులెఱుఁగరు ॥వి॥ 2228

తండోపతండము = గుంపులు గుంపులు. ఇతరుల తప్పులెన్నుట కూడదని హితోపదేశము.

ఆ. తప్పు వేసమూని । ధరలోనఁ దిరిగెడు
నేతలెల్ల మిత్తిఁ । జేరుటకును
కడుపునిండినంత । కష్టంబులేలరా ! ॥వి॥ 2229

తెలిసి తప్పుచేయుట దేబెతనము.

ఆ. తప్పు సాక్ష్య మిచ్చి । ధర్మంబు పడఁగొట్టి
వట్టినిందఁ బెట్టు । వాజగొట్టు
అట్టి వారికెల్ల । ననుభవంబుండురా ! ॥వి॥ 2230

వాజగొట్టు = దేవిరిగొట్టు; అబద్ధపుసాక్ష్యములుజెప్పిన హానివచ్చును.

క. తమకించిన విషమించును
దమకించినఁ దల్లియైనఁ । దగఁ దెగఁజూచుం
దమకింపఁ గార్యహానవు
దమకించిన ప్రాణభయము । తప్పదు వేమా! 2231

తమకము = తొందరపాటు ; తొందరతో చిందులుత్రొక్కిన మందులు నిందల పాలౌతారు.

ఆ. తమకుగలుగు పెక్కు । తప్పు లట్లుండఁగా
నొరుల నేరమెంచు । నోగెప్పుడును
జక్కిలంబుఁ జూచి । జంతికేరినయట్లు ॥వి॥ 2232

చక్కిలము = పంచధారతో చేసినది ; జంతిక = పెసరపిండితో చేసినది ; తక్కువవారు ఎక్కువవారికంటె నిక్కుతారు.

ఆ. తమకు బంధువనుచుఁ । దానె తోడుకవచ్చి
కలిమి, బలిమి, వయసు । కలిమిఁజూచి
దక్షిణను నొసంగి । తరుణి నిచ్చిన మేలు ॥వి॥ 2233

యీడూ, జోడూఁజూచి యిచ్చిన కన్యాదానము గొప్పదని లోకానుభవము జూపెను.

ఆ. తమకు సాటియంద్రు । దైవజ్ఞులగు నరు
ల్పరగ గూఢభావ । మెఱుఁగలేక ?
ఇట్లు మాయఁ బడిన । నెట్లు తెలియునుమాయ ? ॥వి॥ 2234

జ్యోతిష్కులగువారు మేమేగొప్పవారమంటారు ; అదే అజ్ఞానము.

సీ. తమ తలంపులలోనఁ । దత్వశిఖామణిఁ
దలచినవారెల్లఁ । దత్వవిదులు ;
ఘనమైన నిబిడాంధ । కారంబునను జ్యోతి
ననువునఁ జూచిన । నతఁడె యోగి;
శివునిలో జీవుని । జీవునిలో శివు
నొనరఁ దెలియువాఁడు । యోగదృక్కు;
సాంఖ్యయోగంబున । సర్వంబు శివుడని
నిశ్చయించినవాఁడు । నిర్మలుండు;
ఇట్టి జాడఁ గాన । నెందఱైనను నేమి ?
ఘట్టు కాలశివుని । బట్టగలరె ?
పొట్ట జీవుఁ బాసి । పోయి తానుబ్బునా ? ॥వి॥ 2235

వేదాంతులలోని వర్గాలను తెలియజేసేదు.

కం. తమమునఁ జచ్చిన మనుజుఁడు
మమతను దాఁబుట్టుచుండు । మరణము కొఱకే ?
శ్రమఁ దీర్చు గురుని వేడిన
"భ్రమమూల మిదం జగత్తు" । బయలగు వేమా ! 2236

అసలువిషయము తెలియనివాడు జననమరణ యుక్తుడగును.

ఆ. తమము మించిన ధ్యానంబు । తత్పదమగు
విమల సుజ్ఞానమను ప్రజ్ఞ । విడిదిఁగనుచు
నిర్ణయంబును గనుచుండు । నేర్పుతోడ ॥వి॥ 2237

తత్పదము = అచంచలముతో అంతటా ఆరని వెలుఁగు.

ఆ. తమ్ముఁ డెదురుపడియుఁ । దలపడి తిట్టిన
నరకఫలమె కాని । నగవుకాదు
తమ్మ శివబంటు । తనకన్న నల్పుడా ! ॥వి॥ 2238

వివరమెరుగని అవివేకితనము పాపమార్గమునకు మూలము.

ఆ. తఱచు కల్లలాడు । ధరణీశు నిండ్లలో
వేళ వేళ లక్ష్మి । వెడలిపోవు
నోటికుండలోన । నుండునా నీరము ? ॥వి॥ 2239

అబద్ధమాడిన అధికుడైనా భ్రష్టుఁడు కాగలఁడు.

ఆ. తఱచు చదువు చదువ । దర్కవాదమె కాని
దివ్యమైన తెలివి । తేటపడదు
పసిరికాయ పురుఁగు । పగిదిని జెడిపోవు ॥వి॥ 2240

పసిరి కాయపురుఁగు = గోసంగిపురుగు ; విజ్ఞానము లేనిచదువు అజ్ఞానమునకు మూలము.

ఆ. తరుచు జీకటివిడి । తరితోడఁ దనుమరచి
మనమునందు మనసుఁ । బదిలపరచి
గరిమ యున్నయట్టి । ఘనుఁడెందు లేఁడురా ! ॥వి॥ 2241

అసలైన యోగానికి అంతస్సులనిర్మించి శర్మదముగా జెప్పెడు వేమన.

ఆ. తఱుచు తమముఁ బాపి । తరితోడఁ దనుమఱచి
పరమునందు మనసు । పదిలపఱచి
కదియనున్న యట్టి । ఘనులెందఱున్నారొ ? ॥వి॥ 2242

“ అచలం, నిర్మలం, శాంతం, కాయస్థం తేజఉచ్యతే।
అమలం, నిర్మలం, దేవం శూన్య వ్యాపినిరంజనం ”
అమలుఁడు నిరంజనుడగు బ్రహ్మమును పాసింపుము.

ఆ. తఱచు తనువు బాసి । తరితోఁ దనుమరచి
తాను నే ననఁదగు । తలఁపు మఱచి
యుండునాతఁడు గద । యుత్తమ యోగిరా ! ॥వి॥ 2243

“ ఆత్మజ్యోతి ప్రభావేన సోమ సూర్యాగ్ని భాసతి
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్తతే సకలం జగత్ ”
అంతరాత్మలోనున్న జ్యోతి సూర్యచంద్ర, అగ్నిరూపములుగా నిరంతరము ప్రకాశించును.

చ. తరుణిని బెండ్లియాడి తగు । తమ్ములు, నన్నలు బావయంచన
న్వరుసల జిక్కి సొక్కి మఱి । వాంఛలచేతనె, తేనెయీఁగవై
సరవి మునింగి నాతనికి । సత్పథ మబ్బునె ? నిన్ను గానకీ
ధరణిని లేదుముక్తియిఁక । దాఁపక చెప్పుమువెఱ్ఱివేమనా 2244

తేనెటీగవలె పిసనారివయి దివ్యమైన స్థానము చేరక దేబెవగుట మేలా !

ఆ. తరుణి పుణ్యవతిగ । వరునిబట్టియె యగు
పాపి యగును మగనిఁ । బట్టియె యిల
భర్తవర్తనంబె । పడఁతికి గ్రాహ్యంబు ॥వి॥ 2245

భర్త = భరించినవాడు ; మగనిబట్టి మగువమారఁగలదు. “యథా రాజా తథాప్రజా ”

ఆ. తరుణి యంగమెల్లఁ । బురుషుఁ డెఱుంగును
బురుషు నవయవముల । పొలతి యెఱుఁగు
జీరఁ గట్టుకున్న సిగ్గానో ? । యెగ్గానో ? ॥వి॥ 2246

మహోన్నతపదవి యధిష్ఠించి జూచి చెప్పిన మహావాక్యములు.

ఆ. తరుణి యన్నఁగన్నఁ । దనయుని జూచిన
మరుని కళలు మించి । మనసు పాఱుఁ
బాపజాతి మనసుఁ । బట్టంగరాకుంట ॥వి॥ 2247

స్త్రీకి కామోద్రేకములో కండ్లు కానరావు.

ఆ. తరుణి, సుతులు, ధనము, । ధాన్యముల్, సంపద
లెంత చుట్టుకొనిన । నంత చేటు
పసిరికాయ పురుగు । పద్ధతిఁ గానరో ! ॥వి॥ 2248

దారా, ధన, ధాన్య, భోగ, భాగ్యములు తన్ను బంధించి !

ఆ. తరుణి సొగసుకానిఁ । దనయుని గన్నను
మరుని కళల మించి । మనసు పాఱుఁ
బాపజాతి మనముఁ బట్టంగ । రాదయా ! ॥వి॥ 2249

మనసుని బంధించి మమకారం విడచుట మానినులకు ధర్మం.

ఆ. తరువఁ దరువఁ బుట్టుఁ । దరువునం దనలంబు
దరువఁ దరువఁ బుట్టు । దధి ఘృతంబుఁ
దలపఁ దలపఁ బుట్టుఁ । దనువునఁ దత్వంబు ॥వి॥ 2250

తరువు = చెట్టు ; దధి = పెరుగు ; అలవాటుచేత అన్నియును సాధింపవచ్చును. ఇది సంప్రదాయ విజ్ఞానము.

కం. తలఁగని మది దృఢతను గుఱి
గలిగెడు ప్రత్యక్షపదవిఁ । గైగొని నంత
నిర్వ్యయమగు పరము బయలని
తెలియును చిన్నభముజేరి । తిరముగ వేమా! 2251

చిన్నభము = చిదాకాశము ; గురిగా బ్రతికిన బ్రహ్మదర్శన కాగలదు.

కం. తలఁచినఁ దత్వం బగునే ?
తలఁపక తామూరకున్నఁ । దత్వం బగునే ?
తలఁచుట తలఁపమి రెండును
దలఁపక తానుండెనేనిఁ । దత్వము వేమా! 2252

యేవిధముగా తలచవలయునో దెలుసుకొనుటమేలు.

క. తలఁచిన నిరతము మదిఁగల
తలఁపే సిద్ధించు ధాత్రిఁ । దత్వజ్ఞునకుం
దలఁపుం బటిమముకొలఁదిని
దలఁపకయే ముక్తిగలుగుఁ । దథ్యము వేమా! 2253

తానుతలపే తత్వానికి మూలము.

క. తలఁచినను శూన్యతత్వము
తలఁపక యుండినను శూన్య । తత్వంబదియాఁ
దలఁచినఁ దలఁపీడేరును
దలఁపక యుండినను దానె । తత్వము వేమా! 2254

“ చిదాత్మా సర్వదేహేషు యాప్తతేజోతిర్నాటకం తజ్యోతి చక్షురగ్రేచ గురునేత్రేచ పశ్యతి ” చిదాత్మను జూడుము.

క. తలఁ దాకినపుడు తలఁతురు
తలక్రిందై పడినయపుడుఁ । దలఁతురు శివునిం

బలుగాకు లిలను సాజము
కలనాఁడెన్న రె యదేమి । కర్మమువేమా ! 2255

" ఆపదమ్రొక్కులు, సంపద మరపులు సహజమే "

ఆ. తలను జేయివెట్టి । తా నభయంబిచ్చి
దర్పణం బొసంగి । తన్నుఁ జూపి
మంగళంబు సేయు । మంగలి హీనుఁడా ॥వి॥ 2256

కులత్వాన్ని కూలద్రోసి గొప్పవాడవగుము.

ఆ. * తలను వామహస్త । మభయహస్తం బిచ్చి
దర్పణంబుచేతఁ । దన్నుఁ జూపి
మంగళంబు చేయు । మంగలి హీనుఁడా ! ॥వి॥ 2257

* యతితప్పు ; వామహస్తంబు = ఎడమచేయి ; మంగళంబు=శుభం.

ఆ. తలనుఁ బాగ పైని । దగు పచ్చడము బొజ్జ
చెవుల పోగు లరసి । చేరునర్థి
శుద్ధపశువు లనుచు । బుద్ధిలో నెఱుఁగక ॥వి॥ 2258

డాంబికులను తగులవద్దన్నాడు.

ఆ. తలను వ్రేలవేసి । తాలిమించుక లేక
యోగి తెఱచుఁ గన్ను । మూగయగుచు
జ్ఞానమది యెటాను ? । గష్టపు దేహమా ॥వి॥ 2259

నిద్రాముద్రితుడైన ముముక్షువుగాడు.

ఆ. తల నెఱకలు నెరసి । తనువెంత వదలినఁ
గూళవిటుఁడు యువతిఁ । గూడఁ జూచు
పండ్లుపడ్డ కుక్క । పసరముఁ జీకదా ॥వి॥ 2260

ముసలయినా కామము ముదియదు : నెరసి = తెల్లబడి.

తే. తలపనెదిలేక భేదంబు । తలఁపనీక
జోలలందును నర్థియై । జోలలాడు
చున్న యోగీంద్రుడని చెప్ప । నుచితమగును
వేమననియెడు యోగిని । వెలయవేమ. 2261

వేమనను యోగి యని అందరూ వినుతిస్తున్నారు.

చ. తలపఁగ మూలదుంప పర । తత్త్వముదెల్పను శక్యమేభువిన్
బలిమిని యాత్మగుట్టు మది । భావనసేయఁగ బ్రహ్మతత్త్వమున్
గలుగును ముక్తి జీవులకు । కావున నాత్మనిదానదృశ్యమీ
సలలిత సత్యరూప మని । చాటెను వేమన లోకమెల్లెడన్ 2262

మధురభావాలతో, మృదుశబ్దజాలములతో, సలలిత శయ్యాపాకము
లతో ముముక్షులకు మోదమిచ్చునట్లుగా రచించే డీపద్యము.

చ. తలపఁగ మూలమందుఁ బర । తత్త్వముఁ దెల్పగవాసిగాదు లో
బలిమిని కాత్మగుట్టు మది । భావమునెంచఁగ బ్రహ్మకల్పమై
కలుగును ముక్తి జీవులకుఁ । గావున నాత్మ నిదానదృశ్యమీ
సలలిత శక్తిరూపమని । సన్నుతి వేమనచేసెఁగల్పమున్. 2263

వేమనకు "ఆటవెలదుల" యందు జూపిన యభిమానము తక్కిన
ఛందముల గన్పడదు. ఇటీవలి వారు కొందరీవృత్తాలువ్రాసి వేమన
కంటఁకట్టినారేమో!

ఆ. తలఁప వశముఁ గాదు । తత్త్వంబు బ్రహ్మంబు
తెలియలేఁడు బ్రహ్మ । దేవుఁడైన
నిసుకబావి త్రవ్వ నెవ్వరి । వశమయా ! ॥వి॥ 2264

చుక్కలను లెక్కించుట సూర్య, చంద్రకిరణముల పరిమితి గణు
తించునట్టులే పరబ్రహ్మ తత్త్వమును దెలిసికొనుట.

ఆ. తలఁపుచేతఁ గల్గుఁ । దారక బ్రహ్మంబు
తలఁచి చూడఁ దానె । తత్త్వమగును
దలఁపులోని తలఁపు । తానె తన్నెఱిగిన ॥వి॥ 2265

తన్నెఱిఁగినవాఁడే ధన్యుఁడు.

ఆ. తలఁపుఁ దలపఁ గూలి । తగసేయ కీయఁడు
వలపుదీఱ నీయఁ । గలుగుకూక
ముక్తినీని గురుఁడు । ముచ్చుళ కొడుకయా ! ॥వి॥ 2266

అన్వయ మందం లేదు.

ఆ. తలఁపునందు శివుని । దలపోయఁగా లేక
తలఁపుఁదెల్ల బయటి । తలఁపుఁజేసి
తలఁపు తానెయైనఁ । దత్వజ్ఞుఁ డగుసుమీ !॥వి॥ 2267

"ఆ కాశ వత్సూత్మ్మశరీర ఆత్మానదృశ్యతే
వాయువదంతరాత్మాన బాహ్య కాభ్యంతరస నిర్మలా
త్మజ్ఞానోల్కయా పశ్యతి చాంతరాత్మా"
ఆత్మ గొప్పది.

తే. తలఁపు మఱపులు లేవందు । దాకినపుడె
తాను బ్రహ్మంబులోఁ జేరి । తలఁగ కుండుఁ
దత్పథంబును మరిగిన । తానె బ్రహ్మ
జ్ఞాన మిద్దెరిఁగినఁ గల్గు । ఘనత వేమ. 2268

"యతితప్య ;" యోజాగర్తి సుషుప్తస్థో యశ్యజాగ్రఛన్న విద్యతే
యశ్యనిర్వాసనా బోధః సజీవన్ముక్త ఉచ్యతే"

ఆ. తలఁపులోని తలఁపుఁ । దలపోసి తెలియరా !
తలఁపులెల్ల విడిచి । తగినభంగి
తలఁపులోని తలఁపె । తత్వంబు నాత్మరా ! ॥వి॥ 2269

"ఓంకార ధ్వనినాదేన వాయుసంహరణాత్మకం
నిరాళంబ సముద్గశ్యాత్రతత్రా నాదోఽలయంగతః"
ఓంకారము వేదము

ఆ. తలఁపులోని మరులు । తలఁ పెఱుంగఁగ లేమిఁ
దలలు బోడులైన । ఫలము లేదు
తలలు బోడులైనఁ । దలపులు బోడులా ! ॥వి॥ 2270

"యత్ర యత్రమనో యాతి తత్ర తత్ర లయం గతః"
మనస్సును బ్రహ్మములో గలుపుము.

ఆ. తలఁపులోనె కలుగుఁ । దారకబ్రహ్మంబు
తలఁచిచూడఁ దానె । తత్వ మగును
తలఁపులోని తలఁపు । తానె తన్నెఱిగిన ॥వి॥ 2271

"హృదయం నిర్మలం కృత్వా చిత్తసూన్య మనామయం
అహమేకం సర్వ మితి నైతత్పశ్యే త్పరంసుఖీ"
నీవే నేనను బ్రహ్మము నుపాసింపుము.

ఆ. తలఁపులోనె కలుగుఁ । దా దైవ మేప్రొద్దు
తలఁచి చూడ నదియుఁ । దత్వ మాను
ఊరకుండ నేర్చు । నుత్తమ యోగిరా ! ॥వి॥ 2272

" మాయాంతు ప్రకృతిం విద్యా న్మయి నస్తుమహేశ్వరం
తశ్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్ "
సర్వత్రా మహేశ్వరుడు ప్రకాశించును.

ఆ. తలవ్రాలు చక్కఁగా । తల్లజుఁడు వ్రాసుంటె
తనకు తానే తాను । తపసి యవును
తపసియైు హెచ్చేమి । తాను నరుఁడేగదా ! ॥వి॥ 2273

" నొసటవ్రాసిన వ్రాలుకన్నఁ గలదా ! నూరేండ్లు చింతించినన్ "

క. తల యెదుగఁబెట్టి దీక్షా
కలితుండై ముక్కుమూయ । ఘనమా ! యిలలో
పల నిట్టుముండచేసినఁ
దలచెదరె సువాసిని యని ! దానిని వేమా ! 2274

వేషములన్నీ మోసములకే; సువాసిని = మగడుపోయిన ముండ.

తే. తలవరులకైన నొక్కప్డు । ధర్మమొప్పు
సామియానన యొనరించి । తా మెఱుగమి
గురుల హితబోధ మీఱెడు । కూళలకును
నరక కూపంబె శరణమా । నరయ వేమ. 2275

తలవరులు = గ్రామకాపరులు (తలారులు) గురుబోధను విననివారు
పరమ దుర్మార్గులు.

ఆ. తల్లి కెదురుకొనుట । తండ్రి కెదురుకొంట
యన్న కెదురుకొనుట । యరయ మూడు
పాతకము లటంచు । వర్తింపు మెఱుకతో ! ॥వి॥ 2276

సత్ప్రవర్తనకు చక్కనినీతి.

ఆ. తల్లి గన్నతల్లి, । తనతల్లి, పినతల్లి
తండ్రిగన్నతల్లి, । తాతతల్లి
యెల్లశూద్రులైరి । యేఁటిబ్రాహ్మణుఁడు తా ! 2277

పుట్టువుచేతఅందరూ శూద్రులే !

ఆ. తల్లిగర్భమందుఁ । దా జనియించియుఁ
దనదు భోగసతికిఁ । దానె పుట్టెఁ
దల్లులిరువురైయ్యెఁ । దను వొక్కటేయెరా ! ॥వి॥ 2278
"ఆత్మానాం పుత్రరూపశ్చ"

ఆ. తల్లిగర్భమందుఁ । దాఁ బుట్టినప్పుడు
అఱుత లింగమేది ? । యరసిచూడ
నడుమ లింగమూన । నగుఁబాటు గాదొకో ! ॥వి॥ 2279
అరుత = కంఠమునందు ; ఆద్యంతములందు లేని అలంకారములు మధ్యనెందుకు ?

ఆ. తల్లి గౌరియగును । దండ్రియా శంభుండు
ప్రమథగణము లఖిల । బంధువితతి
తనకుఁబుట్టినిల్లు । తనరుకైలాసంబు; ॥వి॥ 2280
విఘ్నరాజైన వినాయకుని చరిత్రాంశమిందు చిత్రింబఁబడినది.

ఆ. తల్లి చంటిపాలుఁ । దనజంట పాలును
రుద్ర వీర్యమునను । భద్రపఱచి
దానిభూతిఁ జేసి । తామ్రంబుపైఁ జల్లు ॥వి॥ 2281
బంగారు యోగముచేయు విధమిచట ప్రస్తావింపఁబడెను ; రుద్ర వీర్యము = పాదరసము.

ఆ. తల్లి దండ్రి గలరు । తగజన్మ జన్మలఁ
దనకుఁ దెల్పువానిఁ । గనఁగ లేరు
నాదమే పరమని । నమ్మిన వారికి
నిహమునందును బర । మొసగు వేమ.
ప్రణవనాదమే పరమ సోపానము.

ఆ. తల్లి, తండ్రి చావ । దనయుఁడు తానేడ్చు
మగఁడు చావ నాలు । వగచుచుండు
గార్య వశమెకాని । కలుగదు మోహంబు ॥వి॥ 2283
బుడబుడేడ్పులతో తడబాటేగాని మనస్ఫూర్తిగా మననము చేయలేరు.

ఆ. తల్లి తండ్రి చావఁ । దా నాలితోఁ గూడి
యిల్లు గట్టుకొన్న । యింపులెల్ల
గొఱత మీఱితొంగ । కూడడిగ నయట్లు ॥వి॥ 2284

ఎంత విచారములోనున్న దురాశాపరులు మోహమును విడువలేరు.

ఆ. తల్లి తండ్రి పూజ । దారిఁగనక కొంత
పాపకూప మందుఁ । బడుటయేల ?
దాన ధర్మములకు । దైవంబు తానాయె ॥వి॥ 2285

" మనస్థం మనమధ్యస్థం మధ్యస్థా మనవర్జితం మనసా మనసా
లోక్య స్వయంసిద్ధ్యంతి యోగినః "
మనసులోనున్న బ్రహ్మను యోగిచూచును.

ఆ. తల్లితో రమించె । తండ్రి యజ్ఞముఁ జేసి
తనయు డల్లె రంభ । దనరఁగూడె
తల్లిని రమియింత్రు । దబ్బర విప్రులు ॥వి॥ 2286

యజ్ఞముఁజేసినవారు రంభా రంభోరు సంభోగమును వాంఛింతురు.

ఆ. తల్లి దండ్రిమీఁద । దయలేని పుత్రుండు
పుట్టనేమి వాఁడు । గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు । పుట్టవా గిట్టవా ! ॥వి॥ 2287

లోకులకు చక్కని హితోపదేశము.

ఆ. తల్లి దండ్రి బాసి । తనయాలితోఁ గూడి
యిల్లు పట్టియున్న । యింపదెల్ల
గొర్తికాడి దొంగ । కోరిన చందంబు ॥వి॥ 2288

గొర్తి = కొరత ; సుఖాన్ని ఎట్టి కష్టమైనా కోరుదురు.

ఆ. తల్లి దండ్రి యన్న । దమ్ములాత్మ సఖులు
నెలమి బంధు భృత్యు । లెల్లజనులుఁ
గలిగి వర్ధిలింగ । ఘనతమీఱెడి నూర ॥వి॥ 2289

తనబంధుత్వముతో కలసియున్నవాడు ఘనుఁడు.

సీ. తల్లి దండ్రియు జేరి । తను రతిసల్పగా
రాగంబు మించును । రమ్యముగను
ఐదునాళ్ల కదియు । నామంబు దధియును
చేర్చి గలిపినట్లు । చెలగుచుండు
పదివారముల గట్టి । పడి యుండి యండమా
నెలమి పదేనింట । నిండుగాను
నెలకును శిరము దా । నెనయ నేర్పడుగాని
పద కరంబులు రెండు । పద్ధతియగు
మూడో నెలకు దర । మొనరు నాల్గింటను
నడుము పార్శ్వంబులు । నలరుచుండు
ఐదో నెల కవయ । వంగాలుగల్గును
నారుకు నేత్రంబు । లమరు సరిగ
ఏడవనెల జీవమెచ్చుఁ । గాఁబ్రభవించు
నెనిమిది జ్ఞానంబు । నెనసియుండు
తొమ్మిది నెలలోన । తొడరి ధ్యానముగల్గు
తొలగక తనపూర్వ । దుఃఖమెల్ల
పదినెలలకు పిండ । పరిపూర్ణమై ధర
బుట్టినప్పుడుఁ దాను । బుద్ధి మఱచి
మంచములఁబడి తనమూత్ర । మలములందు
బొరలుచున్నట్టి యామావి । ఘట్టువులకు
గతులు గలిపించి వారిని । కరుణఁజూచి
వెతలఁ దీర్చును వేమన । విశ్వమందు ! 2290

యీపద్యములో పిండోత్పత్తి విధానమంతయు వివరంగా వివరింపబడినది.

ఆ. తల్లి తండ్రి హితుల । దగిన చుట్టములెల్ల
నేఱికోరి బాలు । నెరుపుఁజూచి
పడుచు నిత్తురింతె । భాగ్యమియ్యఁగలేరు ॥వి॥ 2291

అందచందాలుఁ జూతురు గాని వానియోగ్యతా ఉ యోగ్యతల జూడరు.

ఆ. తల్లి తొలుత లంజె । తనయాలు మాదిగ
తాను బ్రాహ్మణుఁ డనఁ । దగెను జగతి
తపముచేత ద్విజుఁడు । తర్కింపఁ గులమేది? ॥వి॥ 2292

వశిష్ఠుని గురించి చెప్పిన దీపద్యము.

ఆ. తల్లిదండ్రు లందు । దారిద్ర్యయుతులందు
నమ్మిన నిరుపేద । నరుల యందుఁ
బ్రభువునందుఁ జూడ । భయభక్తు లమరిన
నిహముఁ బరముఁ గల్గు । నెసగ వేమ. 2293

దీనిని అనుసరించి నడచినవారు అందరి అనురాగము పొందగలరు.

ఆ. తల్లిదండ్రులతోటి । తగవులాడుట కీడు
పరభామలను చెయ్యి । పట్ట కీడు
పెద్దల దూషించు టది । పెద్దకీడురా! ॥వి॥ 2294

ధర్మశాస్త్రాన్ని తత్వంగా మార్చి చేటగీతులలో జెప్పాడు.

ఆ. తల్లిదండ్రు లనుచు । తత్త్వంబుఁ దెలియక
యోని లింగమునను । నుద్భవించి
విష్ణువరయ తల్లి । వెలయ రుద్రుఁడు తండ్రి ॥వి॥ 2295

ప్రకృతి పురుషులు శివవిష్ణాంశల నుద్భవించెను.

మ॥కో॥ తల్లిదండ్రులు, నన్నదమ్ములుఁ । దాత బంధుగులేలరా!
మళ్ళి జన్మములేని సద్గురు । మర్మభావము నందరో?
పుల్లయైనను రాదు వెంటను । భూమి దాటి యటేగగాఁ!
గల్ల భ్రాంతిని వీడి వేమన । కారణంబునుఁ గానరా! 2296

మత్తకోకిలను చిత్తానికి హత్తేభావముతో మెత్తనిపలుకులతో యోగి పుంగవుడు రచించాడు.

ఆ. తల్లిదండ్రులవల్ల । తిండి సాధన మాయ
తల్లిదండ్రులె తనకు । శత్రులైరి
తల్లిదండ్రులు యెపుడు । తెచ్చి పెట్టంగలర ॥వి॥ 2297

యీపద్యము సాహిత్యపు ముక్కు మొగము లెరుగని బడుద్ధాయి వ్రాసి యిందు చేర్చవచ్చును.

ఆ. తల్లిదండ్రులు గదా । తనకు గురుదైవంబు
తల్లిదండ్రులె గదా । తనకుతోడు
తల్లిదండ్రులవల్ల । తనవారమెనేగదా ! ॥వి॥ 2298
మాతాపితరుల మమతవలన మానస ముద్భవించింది.

ఆ. తల్లిదండ్రులెన్న । దనమొదలి గురువులు
బార్వతీభవులును । బరమగురువులు
కూలివాండ్ర జగతి । గురులన ద్రోహంబు ॥వి॥ 2299
తల్లిదండ్రులు తరువాతనే తక్కినవారు.

ఆ. తల్లి దండ్రు లెంద ? । అల్ల జన్మము లెన్ని ?
తిరిగి యెఱుఁగనట్టి । దిక్కు లెన్ని ?
స్థిరము, నస్థిరంబుఁ । దెలియలేఁ డజ్ఞాని ॥వి॥ 2300
“ జన్మంమృత్యు సుఖందుఃఖ వర్జితం జాతి నీతి కులగోత్రదూరగం
సిద్ధివర్తజగతోశ్చకారణమ్ । తత్సదాహ మితిపకాన మాశ్రయ ”
జన్మలేదు జాతిలేదు.

ఆ. తల్లిదండ్రు లెవరో ? । తనకు జన్మము లెన్నొ ?
తిరిగి యెఱుఁగనట్టి । దిక్కులెన్నొ ?
స్థిరమునస్థిరంబుఁ । దెలియఁడే యజ్ఞాని ॥వి॥ 2301
“ సంకల్ప ప్రభవాన్కార్మా త్యక్త్వా సర్వానశేషతః
మనసై వేంద్రియ గ్రామంవినియమ్య సమంతతః ”
మనసు కోరికయే పనులు

ఆ. తల్లిని చేపట్టి । తత్వమెఱుఁగకపోతె
నలుపైన యుల్లంబు । తెలుపుఁగాదు
తెలుపుచేసినవాఁడె । తల్లికి పురుషుండు ॥వి॥ 2302
ముక్తికాంతను మొనసి వెనుకకు తిరుగవద్దన్నాడు.

ఆ. తల్లి నెఱుఁగువాఁడు । దైవంబు నెఱుఁగును
మన్ను నెఱుఁగువాఁడు । మిన్ను నెఱుఁగు
మిన్ను మన్నెఱిఁగిన । తన్నుఁదానెఱుఁగురా ! ॥వి॥ 2303
“ ఆకాశోవ్యాప్యావకాశశ్చ ఆకాశవ్యాపితమ్ చయత్
ఆకాశశ్చ గుణశబ్దోనిశ్చబ్దో బ్రహ్మఉచ్యతేః ”
శబ్ద బ్రహ్మ గొప్పది.

ఆ. తల్లి బిడ్డలకును । దగవు పుట్టించెడు
ధనము సుఖముఁ । గూర్చ దని వచింత్రు
కాని గడనలేక । గడచుట యెట్లురా ! ॥వి॥ 2304

ధనముయొక్క శ్రేష్ఠత్వమును చెప్పెను.

ఆ. తల్లి బిడ్డలకును । దగవు పుట్టించెడి
ధనము సుఖముఁ । గూర్చునని గడింత్రు
కాని యెల్లయెడల । ఘన దుఃఖ కరమది ॥వి॥ 2305

ధనము దుఃఖమునకు మూలము.

కం. తల్లి యనుచును మునుగను
యిల్లాలా ! యనుచు లేతురింపుగ ధరలో !
కల్లరి మనుజుల గుణములు
చెల్లంబో ? చూడనిట్లు । క్షితిలో వేమా 2306

కల్లరి మనుజుల గుణాలను తెల్లముగా జెప్పినాడు.

ఆ. తల్లి యాలునయ్యెఁ । దగఁ గోడలును నయ్యె
గోడలిని గనంగఁ । గూతురాయె
మాయ విడువ ముక్తి । మహిలోనఁ గల్గును ॥వి॥ 2307

దేహస్పర్శలవలన దివ్యజ్ఞానముతో వావి వరుసల జూడమన్నాడు.

ఆ. తల్లి యున్నయపుడె । దనదు గారాబంబు
ఆమెపోవఁ దన్ను । నరయరెవరు
మంచి కాలమపుడె । మర్యాద నార్జింపు ॥వి॥ 2308

క. చులకన జలరుహతంతువు । చులకన తృణకణము దూది చులకనసుమ్మా !
యిలనెగయు ధూళిచులకన । చులకన మరి తల్లిలేనిసుతుడు కుమారా !
(ధృవోపాఖ్యానము.)

ఆ. తల్లియేడ్వ వినక । తనయాలు వగచిన
జాలిపడెడు వాఁడు । జడుఁడు సుమ్మి
తారతమ్య మెఱుఁగ । నేరని పశువగు ॥వి॥ 2319

తల్లీ భార్యయొక్క తారతమ్యమును తెలియనివాడు పశువుకన్న హీనుఁడు.

ఆ. తల్లియొకతె భువిని । దండ్రియు నొక్కఁడు
నెల్లలోకములను । నెంచిచూడఁ
గల్లగాదు గౌరి । కరకంఠులే సుమీ! ॥వి॥ 2310

" వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ "
పార్వతీ పరమేశ్వరు లోకమునకు తల్లిదండ్రులు.

ఆ. తల్లివలనఁ బుట్టి । తల్లి చన్నుగుడిచి
తల్లితోడ జాణ । తనము లాడి
తల్లి నాలనియెడి । తత్వ మేమందురా! ॥వి॥ 2311

తల్లిరూపమే భార్య కాదా!

ఆ. తల్లి సంతలంజె । తండ్రి కుండుఁడు గోళుఁ
డాలును సుతులెల్ల । నట్టివారె?
తెలుగు చుట్టములకు । సిగ్గేల లేదొకో! ॥వి॥ 2312

కుండుఁడు = తండ్రియుండఁగా రంకుమగనికి బుట్టినవాఁడు;
నానారకాలగా జన్మించిన నరజన్మములకు వావివరసలేమి ?

క. తల్లీ యనుచును మునుఁగుచు
నిల్లాలా యనుచు లేతు । రింపుగ ధరలోఁ
గల్లరిమనుజుల గుణములు
చెల్లుంబోఁ జూడ నిదియె । చిత్రము వేమా! 2313

చిత్తచాంచల్యముగల మానవుల చిత్రాతిచిత్ర ప్రవర్తనల ప్రస్తా
ించాడు పరమగురుఁడు.

ఆ. తళుకు బెళుకుఁజూచి । ధరలోని జనులెల్ల
కద్దు లేదటంద్రు । ఘనతగాను
ఇదిగో యదిగో? యనుచు । నిఁక నెక్కడందురు ॥వి॥ 2314

" ఓమిత్యే కాక్షరం బ్రహ్మ ఓంకార ప్రభవోవేదః "
ఓంకారమే వేదము ఆదిశక్తికూడా!

ఆ. తవుటి కరయఁబోవ । తండులంబుల గంప
శ్వాన మాక్రమించు । సామ్యముగను
కోమటోని సొమ్ము । క్రూరులపాలౌను ॥వి॥ 2315

తండులను = బియ్యము ; చిన్నవస్తువుకోస మాసించి నమిన్నవస్తువు పోవును.

ఆ. తవుటికరయఁ బోవఁ । దండులంబుల గంప
శ్వాన మాశ్రయించు । సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము । వసుధ నీచులకబ్బు ॥వి॥ 2316

శ్వానము = కుక్క ; దాచిన ధనము ధర్మానికగునా !

ఆ. తాటికల్లుఁ దెచ్చి । తాళకంబును వండి
కూటికింత యేల । గుఱుతు మీఱ
కాటి మహిని వండి । కడతేఱ లేఁడయా ! ॥వి॥ 2317

బంగారు యోగము ప్రస్తావించెను.

ఆ. తాతఁ గన్నతల్లి । తమతండ్రిఁ గనుతల్లి
తన్ను గన్నతల్లి । తల్లి తల్లి
తల్లి శూద్రురాలు తానెట్లు । బాపఁడో ! వి॥ 2318

స్త్రీ లందరూ శూద్రరూప ధారులే ?

ఆ. తాత చేసినట్టి । ధరహింస కెల్లని
ప్రాప్తియుండినట్టి । యుత్తముండు
సకలజనులయందు । సత్యవంతుండయ్యె ? ॥వి॥ 2319

"వారసత్వపు హక్కు పట్టి కల్ల."

ఉ. తాత జనించెఁ గన్యకకుఁ । దండ్రులుఁ దామును గుండగోళకు
ల్మాత పరానుకూలినియె । మక్కువ ద్రౌపదిభర్త లేవురే!
నీతులు సెప్పఁ బాండవుల । నీమము లిట్టివటంచు నెన్నుచు
న్భూతలమందు నెంతయును । బూమెల జేసిరి వెఱ్ఱివేమనా! 2320

భారతకథ పరస్పరవిరుద్ధము. కురుపాండవుల తాత వ్యాసమహర్షి. కన్యయగు "యోజనగంధి" కి పరాశరుని వలన బుట్టెను. "కౌరవులు" భర్తగతించిన పిదప విధవయైన గాంధారికి పుట్టుటచే "గోళకులు."

అనఁగా గాంధారి జన్మనక్షత్రమునుఁబట్టి విధవయగునని తెలిసి ముందుగా గొఱ్ఱెకిచ్చి పెండ్లిచేసి దానిచావునుఁజూచి ధృతరాష్ట్రున కిచ్చి పెండ్లిచేసిరి. అందుచే గాంధారి విధవ. వీరితండ్రులైన ధృతరాష్ట్రు, పాండురాజు లిరువురూ, దాసీకిపుట్టిన విదురునితోసహా మువ్వురూ వ్యాసపుత్రు లౌటచేత కుండగోళకులే? పాండవుల తల్లులగు కుంతీమాద్రులు భర్తయుండగా యమ,వాయు,యింద్ర, యశ్వినీదేవతలవలన పంచపాండవులఁబడసిరి.వీరునూ కుండకులే? పాండవులకు కూటస్థురాలగు ద్రోవతి పంచ భర్తృక. అందుచే పాండవచరిత్ర పవిత్రమని జనులకు మఱుగుపరచి కవులు కల్పించిరి.

ఆ. తాత తల్లి తండ్రి । తర్లిపోవఁగఁజూచి
జాతి కులములనెడి । చపల తేలఁ ?
దాను దానయైన । దలఁపంటి యుండరా ! ॥వి॥ 2321

వెనుకకుఁజూడక నిన్ను నీవు జూచుకొనుము.

కం. తానగుట యెఱిఁగి సర్వముఁ
దానగుటయుఁ దెలిసి యేక । తత్వము తాఁగా
దానెఱిఁగి పరిణమించిన
మానవునకు ముక్తిగలుఁగు । మహిలో వేమా ! 2322

తననుఁదానుఁ దెలిసికొనుటయే ధన్యత్వము.

ఆ. తాన తానైన బయలునఁ । దనరి బుద్ధి
పూనికను నిల్పునప్పుడే । పూర్ణమందు
“నిర్ణయోనాస్తి” సర్వత్ర । నిండు నదియె
దాని గాంచిన బ్రహ్మణ్యుఁ । డౌను వేమ. 2323

బ్రాహ్మణ్య పదానికి పరిజ్ఞాన మవసరము.

కం. తాననఁగ నెవ్వఁడయ్యెనో ?
యేనన నెవ్వండు గలఁడో । యెఱుకగు దానిం
దానని మనమున నెఱుఁగక
పూనెడు జీవుండు జడుఁడు । బొంకరి వేమా ! 2324

“ కస్త్వం ? కోఽహం? కుత ఆయాతః ? కామేజననీ ?
కోమేతాతః ? భజగోవిందం ”
నేనెవరను ? ఎక్కడనుంచి వచ్చానని భావించుము.

ఆ. తానననఁగ నెవఁడో? । తనవార లన నేరో ?
తెలిసి తెలియలేరే ? । తిక్కనరులు
అరిది పిసినికాయ । పురుగు । పద్ధతిగాఁగ ॥వి॥ 2325
భ్రాంతులుడిగి తానెవరనే భావము భద్రతకు మూలము.

కం. "తా" ననెడి యహంకారము
మానక తనుఁదానె చెఱచు । మైమఱపించుం
న్నే నని పలికెడి వారికి
మానునె దుష్కర్మఫలము ? । మహిలో వేమా ! 2326
"ఆత్మాఽఽనాత్మవివేకేన పునస్సంసార
నివృత్తిః తద్వినాజన్మ కోట్యాభి ర్బంధచ్ఛేదో నసిద్యతి"
ఆత్మ అనాత్మ తెలియుట జన్మలేక పోవుట.

క. తానవుటఁ దెలిసి మదినొక
తానును లేకుండుటెల్లఁ । దను దానెయనం
దానెటేఁగి పరిణమించిన
మానవులకు ముక్తిఁ గలదు । మహిలో వేమా ! 2327
తన నిజ పరిస్థితిని దెలిసి తత్వ్వము కుదిరిన అదియే ముక్తి.

ఆ. తానుఁగా పండని । మానుపై కాయని
పెరికి తినుటకు వేగ । పండుపండె
కట్టితో గొట్టితే । కమిలిపోకుండురా ! ॥వి॥ 2328
పరిపక్వముగా పరిపూర్ణము సాధించనియెడల మోక్షఫలము చెడును.

ఆ. తాను గుడువలేక । తగవేది యాప్తుల
జేరనీయఁ డట్టి । చెనటి పశువు
చేనిలోని బొమ్మఁ । జేసి కట్టినయట్లు ॥వి॥ 2339
తినక యితరులకు పెట్టనివాడు గిట్టనివాడే ?

ఆ. తాను జన్మమెత్తి । దాన ధర్మములీయ
గర్మగతిని యముఁడు । కష్టపఱచు
గర్మ, ధర్మములను । గడఁ ద్రోయ బ్రహ్మంబు ॥వి॥ 2330
గర్మ, ధర్మములకు గర్త ధర్మమే ?

ఆ. తాను తనువు యనుచు । ద్వయమని పలికెడు
మోహ వారిరాశి । మునిగి యున్న
జనులకెల్ల మోక్ష । సంగతి సిద్ధించు ॥వి॥ 2331

" మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం మయి సర్వం
లయం యాతి తద్బ్రహ్మా ద్వయ మస్మ్యహం " (శంకరునది)
నాచే అందరు పుట్టిరి

ఆ. తాను దనువటంచు । ద్వయమని పలికిన
మోహవార్ధి లోన । మునుగు నరుఁడు
గానలేఁడు మోక్ష । గతియెట్లు సిద్ధించు ? ॥వి॥ 2332

" మోక్ష కారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభి ధీయతే " (వివేక చూడామణి)
అన్నిటి కన్న భక్తి గొప్పది.

ఆ. తాను దానె యనెడి । తత్వంబులోఁ గల
యన్వయంబుఁ దెలియ । డబ్బి తోడు
తాను దానె యైనఁ । దల్లడంబేలరా ! ॥వి॥ 2333

" భ్రమేణాంఽహం భ్రమేణత్వం భ్రమేణోపాసకం మనః
భ్రమేణేశ్వర భావత్వం భ్రమమూల మిదం జగత్ "
భ్రమయే జగత్సృష్టి. (వివేక చూడామణి)

ఆ. తాను దప్పకుండఁ । దన మనంబున నిల్పి
తావు జేరునట్లు । తంత్ర పరచి
తాను తావుఁజేరి । తావుఁ దానేకమై
* తానుఁ దాన యగుచు । దిరుగ వేమ. 2334

యతి తప్పు ; తనను తాగుర్తించి గుర్తును గ్రహించినవాడే గుణ
గణ్యుఁడు.

ఆ. తాను దినక తగిన । ధర్మముఁ జేయక
కొడుకులకని ధనముఁ । గూడఁ బెట్టి
తెలియఁ జెప్ప లేకఁ । దీఱిపోయిన వెన్క
సొమ్ము పరులఁ జేరం । జూడు వేమ. 2335

లుబ్ధాగ్రేసర చక్రవర్తుల యథార్థాన్ని చిత్రించెను.

ఆ. తాను దిరుగు భూమి । క్షామడాంబరమైనఁ
బరగు దేశమునకు । జరుగ వలయుఁ
గొలనవెండిపోవఁ । గొక్కెర లుండునా ॥వి॥ ! 2336

దట్టమగు కరవుతో దద్దరిల్లినవారు కలిగిన స్థలమునకు కదలిపోవుట లెస్స.

ఆ. తాను నింద్రియములనుఁ । దనర జయించినఁ
దత్వ మరసి చూడఁ । దాన యగును
రాజయోగి యిట్లు । తేజ రిల్లుచునుండు ॥వి॥ 2337

యోగులందరిలోను రాజయోగులే రమ్య మన్నాడు.

ఆ. తాను నిర్మలుఁడుగఁ । దనరు గుణములన్ని
చెయ్యలేని గురుఁడు । చెడు గురుండు
గుడ్డితట్టు నెక్కఁ । గునుకు నటానురా ! ॥వి॥ 2338

గుడ్డితట్టు = గుడ్డిగుఱ్ఱము ; గుడ్డిగుఱ్ఱము నెక్కువాడు చేరవలసిన స్థలము చేరలేడు అట్లే గురువులునూ.

క. తానును జనులేమని కొనఁ
బూనుదురో దానినరసి । పొందిక చెడ నీ
రాని పథంబున నడచిన
దానవె ధర్మాత్ముఁడంద్రు । తన్నిల వేమా ! 2339

ఈరాని పదము = అతీత మార్గము ; అతీత మార్గమున వర్తించుటయే వైరాగ్యము.

క తానును నేనని వేఱుఁగ
మానసమునఁ దలచునట్టి । మానవు డెటులుం
గానఁగ నేరఁడు తత్వము
మానులతోఁ దిరిగి యైన । మహిలో వేమా ! 2340

భేదాన్ని పాటించిన వాడు వాదాలకే.

క. తానును నేర్పరి యైనను
దానకములఁ దన్నుఁ దానె । తప్పించు కొనుం
దా నెన్ని విధములను మఱి
తానే పరమాత్మ యనుచుఁ । దలఁపర వేమా ! 2341

తన్ను దాను తెలసిన తత్వజ్ఞాని.

క. తానును సమస్త భువనము
లోనను వెలయంగఁ దెలిసి । లోన వెలుపలం
దానై వెలుఁగఁగ నేర్చిన
మానవునకు ముక్తి గలుఁగు । మహిలో వేమా! 2342
అంతటనూ తన్నవలోకించినవాఁడే అనఘుఁడు.

ఆ. తాను నేనని యెడి । తప్పులో బెడిదంబు
మాని కడు వివేకి । మహిమ గనరె?
యూరకున్న వాఁడె । యుత్తమోత్తముఁడురా! ॥వి॥ 2343
" ఆ. వాదములకు బోక । భేదంబులేకను
సమత నుండు వాడు । సాధువగును "

ఆ. తాను నే నని యెడు । తత్వ భేదంబును
మాని యల వివేక । మహిమఁ దనరి
యూరకున్న వాఁడె । యుత్తమోత్తముఁడు రా! ॥వి॥ 2344
" విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తినీ
శునిశ్చైవ శ్వపాకేశ పండిత స్సమదర్శనః " (శుక్రనీతి)
సమానము గనువాఁడే పండితుఁడు.

ఆ. తాను పుట్టు చోటిఁ । దాఁజూచి పలికినఁ
దాను దిరుగు బుద్ధి । ధరణి లోనఁ
దాను బుట్టు చోటు । తత్వంబుఁ దలపోయు ॥వి॥ 2245
సృష్టికి హేతుభూతమును నీక్షించుటయే తత్వము.

ఆ. తానుఁ బుట్టిన రోత । తాఁ దెలియ లేకను
యితర రోతాదులు । యెంచు నరుఁడు
యెక్కడ చూచినా । ఒక్కఁడే గురుఁడయా! ॥వి॥ 2346
రోతలోపుట్టి రోతలో పెరిగి రోతలోనే నాశన మగుచున్నాడు.

ఆ. తాను బుట్టు చోట । తత్వంబు తలపోయ
తాను బద్ధి దిరుగు । ధరణి లోన
తాను బుట్టు చోటె । తత్వంబు దలచిన ॥వి॥ 2347

మ. మలమూత్రంబుల కొంప కాళ్ళ పడుచున్ మాలిన్యమున్బాని చి
త్తలతన్ భ్రాంతులలోన ప్రాకగను నిత్యాలోచనా దక్షుడై
యిలపై బుట్టి పెరింగి చచ్చి యకటా యేమేనిగొంపోవునా ?
అకలంకాత్ముని జేరుటే సుకరమా ఆనందమింపారగాన్ !

ఆ. తాను మెలగు చోటఁ । దనరంగ నుండెడు
జంగమయ్యను గని । సరగ గఱచు
కుక్క బుద్ధి యాయె । గుణ మేలమానురా ! ॥వి॥ 2348
నీచుడు నేర్పరిని గుర్తింపలేడు.

ఆ. తాను విమలుఁడైన । తనగుణ మంతయు
శివుని కిడని గురువు । చెడుగు గురువు
గ్రుడ్డి గుఱ్ఱ మెక్కి । గుడిఁ జుట్టి నట్లౌను ॥వి॥ 2349
గుణములేని గురువు గుడ్డి గుఱ్ఱమే.

ఆ. తాను వెలయు భూమిఁ । దనరంగ దిరిగెడు
జనులఁ గాంచి పొంచి । సరగ గఱచు
కుక్క బుద్ధి యంట । గుణమేల మానురా ! ॥వి॥ 2350

ఆ. తాను సంకల్ప రూపుఁడై । తమక మొందుఁ
దాను సంకల్ప రహితుఁడై । తగులు ముక్తి
ముక్తియనఁ జిత్తా శూన్యంబు । మోక్ష మదియ
దీని నిక్కంబుఁ గనువాఁడె । మౌని వేమ. 2351

ఆ. తాను సకల మౌటఁ । దనలోని సకలంబు
తనదు లోని వెలుగుఁ । దానె యెఱిఁగి
యున్న మానవునకు । నొనరంగ ముక్తిరా ! ॥వి॥ 2352
తనలో నున్న వెలుఁగును తాను జూచినవాడే తత్త్వజ్ఞ చంద్రుఁడు.

కం. తాను సమస్తంబనియును
లోనన వెలయంగ దెలిసి । లోనన తెలియున్
తానై వెలగఁగ నేర్చిన
మానవునకు ముక్తి గల్గు । మహిలో వేమా ! 2353
"మనసా మన ఆలోక్య స్వయం విశ్యంతి యోగినః"

ఆ. తానె తత్వమనుచుఁ । దలపోయఁగా లేక
మాఱుఁ దత్వ మనుచు । మఱుగు చుండు
గర్మ ఫలము లేక । కలుగునా తత్వంబు ॥వి॥ 2354

"మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"
మనస్సే బంధమోక్షాలకు కారణము.

ఆ. తానె తత్వమయ్యుఁ । దన్నెఱుంగఁగ లేక
మాయఁ దత్వమనుచు । మఱుగుచుండు
ధర్మ కర్మములను । దా రోయఁ దత్వమా ॥వి॥ 2355

"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మాత్కురుతేర్జున" (గీత)
జ్ఞానాగ్నిచే సర్వమూ దహించబడును.

ఆ. తానె తా ననియెడి । తత్వంబు లందుకు
నన్య మెఱుఁగకుండ । నబ్బుతోడు
తానె తానయైనఁ । దల్లడంబేలరా! ॥వి॥ 2356

కం. తానే నేర్పరి యైనను
మానినిఁదగు మెలకుఁ వెఱేఁగి । మహినేలు జుమీ
దానిని స్వేచ్ఛగ విడిచెడు
హీనుఁడు తానైనఁ దుదకు । నేడ్చుర వేమా! 2357

నేర్పరియైన జనుఁడు నిత్యము ముక్తి కాంతను శక్తితో బంధిస్తాడు.

కం. తానైన శుద్ధుఁ డౌనెట
మే నెన్నఁగ విమల మంట । మేనో తానో
పూనుకొని చేయు తీర్థ
స్నానంబేఁక నెవరికన్న । నగరా వేమా! 2358

నీవూ నేనను భేధము నిశ్చలాత్ములకు లేదు.

కం. తానొకటిఁ దెలియు నన్నది
తాను మెయిన్లేక యెల్ల । తావులుఁ దానై
తానెఱేఁగి పరగ మించిన
మానవునకు ముక్తి కలదు । మహిలో వేమా! 2359

సర్వమూ తానుగా భావించినవాడే ప్రాజ్ఞుఁడు.

కం. తానొట యెఱిఁగి సర్వము
తానొటయుఁ దెలిసి యెల్ల । తత్త్వముఁ దానై
తానెరిఁగి పరిణమించిన
మానవునకు ముక్తికలదు । మహిలో వేమా! 2360
సర్వేసర్వత్రా తానేనని భావించినవాఁడే ధన్యుఁడు.

కం. తామరపాకున నీళ్ళుగ
వేమఱుఁ జరియించు బుద్ధి । వెదకరు శివుని
న్నీమహి నమ్మఁగరాదని
ధీమనసమునఁ దెలియలేరు । దేవుని వేమా! 2361
ఉపమానములతో ఉజ్జ్వాత లూచి జ్ఞాన భాస్కరోదయము
గలిగించాడు దీనిద్వారా!

క. తామరయందలి నీర్వలె
వేమన చరియించుచుండు । వెదకుచు శివునిన్
ఈమాయ నమ్మరాదా!
ధీమంబునఁ దెలియనగునె? । దీనిని వేమా! 2362
విషయలోలుడుగాక వేదాంత వీథులలో విహరించేడు వేమన.

క. తామరపైఁ దగు నీరన
వేమరు జరియించుచుండ్రు । వెదకుచు శివుఁ దా
మీ మాయ నమ్మఁగా రా
దీ మనమున దెలియనేర । రీశుని వేమా! 2363
మాయ నంటకుండఁగా మసలు మన్నాడు.

ఆ. తామసంపుఁ బనులు । తగవెందులకునైనఁ
దామసంబు నుడుగఁ । దగు సుజనుఁడు
తామసంపునెంచు । ధరలోన నధముండు ॥వి॥ 2364
తామసము=వేగిరపాటు లేక తొందరపాటు.

తే. తామసంబంటు బుద్ధిన । దగులఁబెట్టి
నీమ, నిష్ఠలు మదియందు । నిగుడఁజేసి

కామవర్గము జయమందఁ । గనును ముక్తి
యామహాత్ముని సేవింప । నగుర వేమ! 2365

తామసము లేని ధీమంతుని సేవించుట శ్రేయస్కరము.

ఆ. తామసించిచేయఁ । దగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు । విషమ మగును
పచ్చికాయఁ దెచ్చి । పడవేయ ఫలమౌనె? ॥వి॥ 2366

విషమ మగును=చెడిపోవును.
నీతిని ప్రబోధిస్తుందీ పద్యము.

ఆ. తామసించు చోట । తగనట్లు డాయెనా!
సౌఖ్యభూమి కపుడు । జరుగ వలయు
కొలకులింకె నేని । కొంగలందుండునా! ॥వి॥ 2367

కొలకు=చెరువు; తొందరపాటు జ్ఞానమును పాడుచేయును.

ఆ. తామసేంద్రియముల । దనర జయించిన
తత్వ మరసి చూడఁ । దానె యగును
రాజయోగి యిట్లు । తేజరిల్లుచు నుండు ॥వి॥ 2368

రాజయోగి లక్షణాలను రమ్యముగా చెప్పెను

ఆ. తాము కన్నవారు । దముగన్నవారును
జచ్చుటెల్లఁ దమకు । సాక్ష్యమె కద
బ్రదుకుటెల్ల దెలియఁ । బ్రహ్మకల్పంబులా! ॥వి॥ 2369

పుట్టుట గిట్టుటకొరకే?

ఆ. తాము గడనసేయు । ధనమెల్లఁ దమదని
నమ్మియుంద్రు వెఱ్ఱి । నరులు భువిని
తా మొరులకొసంగఁ । దమకదియే కల్గు ॥వి॥ 2370

దానము చేసినదే దక్కును.

ఆ. తాముఁ దినక యటులె । ధర్మముఁ జేయక
కొడుకులకని ధనము । కూడఁబెట్టి

తెలియఁ జెప్ప లేక । తీఱిపోయిన వెన్క
సొమ్ము పరులఁ జేరుఁ । జూడు వేమ. 2371

పూర్వులు కూడబెట్టిన సొమ్ము భూమిలో పాతిపెట్టేవారు. దానినే పాతనియు నిక్షేపమనియు అందురు.

ఆ. తాము దిరుగు భూమి । క్షామ డాంబరమైన
బరగు దేశమునకు । జరుగ వలయు
గొలన బెండి పోవ । గొక్కెర లుండునా ! ॥వి॥ 2372

కరువు కాటకములు కల్గినచోట నరులుండుటరిది.

ఆ. తామునిలుచు చోఁట । దైవము లేఁడని
పామర జనులు తిరు । పతులకరుగ
జోగువేడి చేతి । సొమ్మెల్లఁ బోఁజేసి
చెడియు గృహములఁ జొరఁ । బడరె వేమ ! 2373

"తిరుపతిక్షౌరము" అను జాతీయములలో రెండర్థములు గలవు వున్నది. పోవుట పనిపూర్తిగాకుండా ఫలితములు గొనుట.

ఆ. తాము బలిమిఁ బెట్టఁ । దమకు బల్మినిగల్గు
నడుగనిడినఁ దాము । నడుగ గలుగు
నిందు నీనివాని । కెందును గల్గదు ? ॥వి॥ 2374

యీవిని యెంతయో పొగడెను.

ఆ. తామువెలయు నూర । క్షామంబు వాటిల్ల
నట్టియూరు విడిచి । యవలఁ బోరె
కొలఁకు లెండినంతఁ । గొక్కెర లుండునా ! 2375

వైభావములతో పద్యములఁజెప్పుట పరిపాటి.

ఆ. తా మొరులకుఁ బెట్టఁ । దమకునుఁ గలఁగును
నడుగ నిడినఁ దాము । నడుగ గలరు
నిందు నీనివాని । కెందును గలుగదు ॥వి॥ 2376

వేమన కవితారీతులు హృదయముల కత్తించుటకయి వాడును.

ఆ. తారకంబుఁ జూచు । దారివేఱుగఁ గద్దు
సమముగాను జూడఁ । జక్కఁ బడును
వెఱ్ఱిగాను జూడ । వెలుఁగెల్లఁ బాఱురా ! ॥వి॥ 2377

మంచిబుద్ధిగాఁ జూచిన మంచిగాను చెడ్డబుద్ధిఁజూచిన చెడ్డగాను గన్పడును.

ఆ. తారకంబును గంటె । తామసం బణఁగును
తామసం బణఁగితె । కామ మణఁగు
కామ మణఁగితె శివుని । నామ మొక్కఁటి నిలుచు ॥వి॥ 2378

తామసము తగ్గినచో తత్త్వము బోధపడును

ఆ. తారక మంత్రంబు । తాను తానై వెలసి
వేళ సమయము లేక । వెంట నంటి
ముద్దు లాడుమటంచు । మొఱపెట్టు చున్నది ॥వి॥ 2379

ముక్తికాంతను ముద్దులాడుటనగా తారకము తత్త్వము తెలియుటే.

కం. తారకము మోక్ష పదవికి
నారద జప మంత్ర రామ । నామంబనుచుం
గూరిమి దలఁపఁగ నేరరె ?
ధారుణిఁ బామరులు దాని । ధన్యత వేమా ! 2380

"నారాయణ" అష్టాక్షరిలో "ర"; శివ పంచాక్షరిలో "మ" యున్నూ రెండూ కలసిన తారకమంత్రము; అనగా విష్ణు, ఈశ్వర శక్తి మంత్రములు.

ఆ. తాఱు మాఱు గాక । తత్త్వదర్శనమూని
మేరు శిఖర మెక్కి । మెలఁగు వాఁడు
గేరి మెఱుక లోన । గీఁటడఁగించురా ! ॥వి॥ 2381

పరిపూర్ణములోని పరమార్థాన్ని తెలుసుకుంటాడు మేరుశిఖరము వీక్షించినవాడు.

ఆ. తాళకంబుఁ దెచ్చి । తాఁటికమ్మ రసాన
వండు నిపుణతెఱఁగ । వెండి యగును
గల్లగాదు నిజము । కలకంఠ నీయాన ॥వి॥ 2382

యిచ్చట బంగారుయోగము గురించి చెప్పినది.

కం. తావరముల భక్షించును
భావింపఁగ జంగమములు । బహువిధ రుచులం
గావరమున నంతుండక
తీవరముగఁ దమ్ముఁదామె । తిందురె వేమా ! 2383

అల్పజీవులు నధికజీవులు భక్షించునట్లు అధికారులు అనధికారుల బాధలుపెట్టుదురు.

ఆ. తావసించుచోటఁ । దగనల్ల డాయెనా
సౌఖ్యమున్నదరికి । జరుగవలయుఁ
గొలఁకు లింకెనేనిఁ । గొంగలందుండునా ? ॥వి॥ 2384

వీలుగాని తావులు విడచుట మేలని వేమ సూక్తి.

ఆ. తావుఁ దప్పకుండ । దన మనంబున నిల్పి
తావుఁ జేరునట్లు । తంత్రపఱచి
తానుదావుఁజేరి । తావుఁ దా నేకమై
తాను దాని కాఁగ । దనరు వేమ. 2385

ఆత్మస్థానముతో పరమాత్మస్థానమును పరికించిన భవ్యుఁడు.

ఆ. తావులేని చోటఁ । దావు తానై యుండుఁ
దావుగలుగు చోటఁ । దాను లేఁడు
తావుతానె యైనఁ । దత్వంబుఁ దెలియరా ! ॥వి॥ 2386

బేధభావములో వాద మేర్పడును.

ఆ. త్రాఁడు పామటంచు । తాఁ జూచి భయపడి
తెలిసి త్రాఁడటన్నఁ । దీఱు భయము
భయము తీఱినపుడె । బ్రహ్మంబు నంటురా ! ॥వి॥ 2387

" సర్పరజ్జుభ్రాంతి " సంస్కృత లోకోక్తిని అనుసరించాడు.
సర్పరజ్జు = త్రాడునుజూచి పామనుకొనుట

ఆ. త్రాఁడు మెడను వేసి । తనకు శూద్రత్వంబు
పోయెననెడి దెల్ల । బుద్ధి లేమి
మదినిలువక త్రాఁడు । మఱివన్నెఁ దెచ్చునా ! ॥వి॥ 2388

జ్ఞాన నిష్ఠయే ప్రధానమనియూ ఆచార అనాచారములు అనవసర మనెను.

క. త్రాసును ధరలోఁ బడసిన
వేసియుఁ దానొక్క తడవ। వివరింపంగా
పీసంబెక్కువ యైనను
భాసురముగ నొఱగు నొక్క। వంకకు వేమా! 2389

సత్యవాక్పాలనాసక్తిని చెప్పెను

క. త్రాసును వడిసెల లంజెయు
భాసురగతి నొక్కరూపు। పరికింపంగా
పీసంబధికం బైనను
వాసియుఁ జెడ నొక్కవంక। వ్రాలుర వేమా! 2390

త్రాసు వడిసెలవలె జారిణియు వ్యత్యాసము జూపించుచుండును.

ఆ. తిండి, నిదుర, మాని। తెలివి బొత్తుగలేక
ముక్తికొఱకుఁ దిరుగు। మూఢ జనులు
వెఱ్ఱి కుక్క బట్టి। వెదకిన చందంబు ॥వి॥ 2391

యుపవాసాది వ్రతములు యోగ్యములు గావన్నాడు యోగి.

ఆ. తిట్టికొట్టి రేని। తిరిగి మాటాడక
యట్టు నిట్టుఁ జూచి। యదరి పడక
తన్నుఁగాని యట్లు। తత్త్వజ్ఞ డుండును ॥వి॥ 2392

తత్త్వజ్ఞుడు ప్రకృతి నంటడు.

ఆ. తిట్టి కొట్టిరేని। తిరిగి మాటాడక
యూరకున్నఁజూడ। నుర్వి మీఁద
వాఁడగుఁ బరమాత్మ। వర్ణింప శక్యమా! ॥వి॥ 2393

యుర్విమీద = భూమిమీద; ద్వంద్వాతీతుఁడే ధన్యమూర్తి.

ఆ. తిట్టి కొట్టిరేని। తిరిగి మాటాడక
యట్టు నిట్టు చూచి। యదరి పడక
తన్ను గానియట్లు। తత్తర పడకున్న
నట్టివాఁడె బ్రహ్మ। మారర! వేమ. 2394

అదురూ బెదురూ లేనివాడే ఆనందయోగి.

ఆ. తిట్టనేని మొట్టు । మొట్టినం గొట్టును
గొట్టనేని యముఁడు । కొద్ది పఱచుఁ
గోప మెంచ (జేర్చుఁ । బాపపు నరహత్య ॥వి॥ 2395

నరహత్యా పాతకుల గూర్చి నరులకు బోధించాడు.

ఆ. తిత్తిలోని శివుని । స్థిరముగా దెలియక
తిక్కపట్టి నరుఁడు । తిరుగు చుండుఁ
దిక్కదెల్ప గురుఁడి । టొకఁడు లేఁడురా ! ॥వి॥ 2396

తిక్క = తనభావమే గొప్పదనుట; తిత్తి = హృదయకోశము.
(ఇది నుడికారము)

కం. తిన్నగఁ (దిపుటిని గనుగొని
యున్నను నాదంబు వినఁగ । నూహింపుము లో
మిన్నుకని నిన్ను మఱతువు
వెన్నెలలో బయలుసేసు । వెరవున వేమా ! 2397

వేదాంత సారాన్ని వెన్నముద్దలవలె జిజ్ఞాసుల కందించాడు.

ఆ. తిరిగి తిరిగి తిరిగి । త్రిమ్మరి గానేల ?
దీర్థయాత్ర లనుచుఁ । దెలివి మాలి
తెలివిలోని గురునిఁ । దెరపిగాఁ జూడరా ! ॥వి॥ 2398

" అడియాసా పడిదుఃఖము " సామెత.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు । ద్రిమ్మరి కాఁగానె
యందువల్ల నేమి । యధిక మొప్పు ?
నంతరంగ మెఱిఁగి । నప్పుడే శివుఁడౌను ॥వి॥ 2399

దేహాయాసము వలన దివ్యత్వము రాదు.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు । మరులు కొనుటకాక
యందు వలననేమి । యాసలేదు ?
అంతరాత్మ నిల్పు । నతఁడెపో బ్రహ్మంబు ॥వి॥ 2400

అంతరాత్మను ఆనందంగా యుంచినవాడే బ్రహ్మనందుడు.

ఆ. తిరిగి తిరిగి యింకఁ । దిరుగంగఁ దిరుగంగఁ
దిరిగి తిరిగి కొంత । తిరిగి తిరిగి
తిరుగనట్టి త్రోవఁ । దిరుగ లేఁడాయెరా! 2401

అసలువిషయము తెలియక అయోమయముగా ప్రవర్తించవద్దని హితోక్తి.

ఆ. తిరిగివచ్చువేళ । మరలి పోయెడివేళ
వెంటఁదేరు ధనము । నంటఁ బోరు
తానెటకును జనునో । ధనమొందుఁబొవునో! ॥వి॥ 2402

ధనముకోసం మనిషి దాసుడగుచున్నాడు ఘనత్వమును కోలుపోకూడదు.

ఆ. తిరిపగాఁ డయినను । దిరిప మెత్తినయట్టి
తిరిపమందె తాను । తిరిప మిడిన
తిరిపము తిరిపమున । దిగఁబడిపోవురా! ॥వి॥ 2403

తిరిపము = యాచన; తనకున్న దానిలో పెట్టమని లోకోత్తర విషయాన్ని వేమన చెప్పెను.

ఆ. తిట్టివాని మిగుల । దీవింపఁగారాదు
వెట్టివాని మాట । వినఁగరాదు
వెట్టికుక్కఁ బట్టి । వేటాడ వచ్చునా! ॥వి॥ 2404

తిట్టి = చేపలపట్టే సాధనము; తిట్టివాడు = పనికిమాలినవాడు.

ఆ. తిరుగవలయు మనసు । తిరిగిన వఱకును
దిరుగునట్టి మనసు । విఱుగవలయుఁ
దిరిగి విఱిగెనేని । దేవుఁడు తానయా! ॥వి॥ 2405

లోకభ్రాంతులను వెదకిపట్టి విడచినవాడే దిట్ట.

ఆ. తిరుపతాత్రలుఁ గోరి । తలవెంట్రుకల నిచ్చి
వెంక టేశు గోరి । వేడనేల
అందున్న శ్రీహరి । యిందు లేఁడాయెనా! ॥వి॥ 2406

యతి తప్పు; తీర్థయాత్రలకు తిరుగుట తెలివితక్కువని వేమన భావము.

ఆ. తిరుపతికినిఁబోవ । దురక దాసరిగాడు
కాశి కరిగి లంజ । ఘనతఁ గనదు
కుక్క సింహ మగునె ! । గోదావరికిఁ బోవ ॥వి॥ 2407

యాత్రలు సేవించుటకన్న ఆత్మను బంధించుట మిన్న అన్నాడు వేమన్న.

ఆ. తిరుపతికి బోవఁ । దురక దాసరిగాఁడు
కాశి కేగఁ బంది । గజము గాదు
వేఱు జాతివాఁడు । విప్రుండుగాఁడయా ! ॥వి॥ 2408

గజము = ఏనుఁగు; విజ్ఞానమే వెలయించఁగలదు.

ఆ. తిరుమలందు కుక్క । తిరుగ సింహముఁగాదు
కాశిఁబోవ పంది । గజముఁ గాదు
భరతమూఁడు లంజ । పతివ్రతగాదురా ! ॥వి॥ 2409

యెంతగొప్పతనమున్నా యీసరులు హెచ్చుగారు; యీసరులు = తక్కువవారు

ఆ. తిరుమలకునుఁ బోవ । తురక దాసరిగాఁడు
కాశి బోవలంజ । గరిత గాదు
కుక్క సింహమగునె ? । గోదావరికిఁబోవ ॥వి॥ 2410

గరిత = స్త్రీ; తక్కువవారు ఎక్కువ కారని మాటిమాటికి చెప్పుచున్నాడు వేమన.

మ. తిలలం దైలము, పాల వెన్న, శిలలం । దెల్లంబుగా లోహము
జ్జ్వల దీపాంకురమందు ఖజ్జలము । కాష్ఠశ్రేణియం దగ్ని, భూ
తల ఖాతంబున నీరు ; గల్గుటయు । తధ్యంబంచు నూహించి దా
దలపన్ యత్నము సేయకున్న దగునే ? । ధర్మంబు
వేమార్యయా 2411

తిలలు = నువ్వులు ; తైలము = నూనె; ఖాతము = గొయ్యి; కాష్టము = కట్టె; శిల = రాయి.

ఆ. తివిరి లేమియింట । తరువుకాఁడె మెరుగు
మొఱ్ఱఁబెట్టి నే_త్తి । మొత్తుఁగాని
పతిత ధర్మమెన్న । పడుచు కట్టెమెరుగు ॥వి॥ 2412

తరువు కాడు = దొంగవాడు; తివిరి=ప్రయత్నించి; పతితధర్మ ము= చెడిపోయిన ధర్మలు, హెచ్చైన ధర్మము.

ఆ. త్రిగుణ భావములో మించి । తిరుగు వాఁడు
జగతిపై యాసవిడి బ్రహ్మ । జంత్రమందు
నిప్పు నివురున యున్నట్లు । నిలుతు రవని
* విమలగుణరాజ । యోగీంద్ర వేమనార్య ! 2413

నివురు గప్పిన నిప్పువలె బ్రహ్మజ్ఞాని యుండును.
*పాఠా :- గనగ లేగయ్య వారల । ఘనత వేను.

కం. త్రిజగంబుల నిర్మించియుఁ
ద్రిజగంబులు భు_క్తి ము_క్తి । తీరిచి నడపు
న్నజ హరి రుద్రులు తానై
భజియింపఁగ విశ్వకర్మ । బ్రహ్మము వేమా ! 2414

విశ్వ+కర్మ=సమ_స్తపనుః చేయువాడు; త్రిమూర్తులకు మూలమే విశ్వకర్మ.

కం. త్రిపుటికిఁ జూడ్కి ని బై నిడి
యుప జిహ్వకు సూటిచేసి । యు న్మదిలోనే
తప మొనరించెడు భక్తుఁడు
నిపుణుండై వెలుఁగులోనె । నేర్పున వేమా ! 2415

బ్రూకుటిని ఉపమద్వారా వీక్షించుటే ము_క్తి.

తే. త్రిపుటిపైఁ జూపునిలుపంగఁ । దేజ మమరుఁ
బట్టుగల పట్టుగాఁగని । భావమందు
నిట్టి నిలువున గమకింపు । నిర్గుణంబు
బట్ట బయలగుఁ గన్గొని । పరగు వేమ ! 2416

ప్రకాశమానమైన ము_క్తి కాంతిను పరికించుట పరబ్రహ్మ స్వరూపము.

ఆ. తీపికెల్లఁ దీపి । తెలియంగఁ బ్రాణంబు
ప్రాణవితతి కన్నఁ । బసిఁడి తీపి
పసిఁడికన్న మిగిలి । పడఁతి మాటలుతీపి ॥వి॥ 2417

పసిడి = బంగారము ; లోకానుభవాన్ని వేమన చక్కఁగా చిత్రించాడు.

ఆ. తీర్థయాత్ర కనుచుఁ । దిరుగఁబోయినవాఁడు
పామరుఁడు గాక । భక్తుఁ డగునె ?
తీర్థ యాత్ర చేత । దివ్యుండు గాఁడయా ! ॥వి॥ 2418

మానశిక యాత్రచేసినవాడే మాన్యుఁడు.

ఆ. తీర్థ యాత్రలకును । దిరుగుచు జనులెల్ల
మొనసి తీర్థములను । మునుఁగ నేల ?
దోషకార్య కెట్లు । దొరకురా యాకాశి ॥వి॥ 2419

మూటి సంగమమే కాసి.

ఆ. తీర్ప నార్ప లేని । తీర్పరి తనమేలఁ ?
గూర్ప విప్పలేని । నేర్పదేల ?
పెట్టి పోయ లేని । వట్టి బీరములేల ? ॥వి॥ 2420

శుద్ధులను ఒద్దికఁగా ప్రబోధించేడు.

ఆ. తీర్చి కట్టనేనిఁ । దెలియ భారద్వాజ
కూర్చినట్లు పనులు । కూడునెట్లు ?
జేటు గాకపోవు । సిద్ధమా శకునముల్ ॥వి॥ 2421

ఇది శకునశాస్త్ర సంబంధమగు పద్యము వేమనకు అన్ని శాస్త్రాల అనుభమున్నది.

యీపద్యము శిఖి నరసింహ శతకములో వర్ణించినది.

ఆ. తీవ్ర కోపమునను । దీర్ఘయాత్రకుఁ బోయి
ముఱికి దేహమందు । ముంచి ముంచి
పలువ కుక్క లేమి । ఫలముఁ గన్నారయ్య ? ॥వి॥ 2422

పలువ కుక్కలు = పనికి మాలిన వారు (నుడికారము) పనికి మాలిన వారికి పరమార్థములు తెలియవు.

ఆ. తుంగ ముత్తియంబుఁ । దొరసి పుట్టిన యట్లు
ముందు గల్పకంబు । మొలచి నట్లు
చెంగటందు గోవు । చెలగి పుట్టిన యట్లు
ఒనర వేమఁడుట్టె । నుర్వి వేమ. 2423

అపురూపమైన ఆదర్శాలు జూపించుటకే ఆంధ్రలో వేమన్న పుట్టాడు. ముత్యములు ఏనుగు కుంభస్థలములందు, వెదురులోను, తుంగ దుబ్బులలోను, పంది కోరలలోను పుట్టును.

ఆ. తుంటి వింటివాని । తూఁపుల ఘాతకు
మింటమంట నడుమ । మిడుకఁ దరమె?
యింటియాలి విడిచి । యెట్లుండ వచ్చురా! ॥వి॥ 2424

తుంటవింటి వాడు = చెరుకుగడలు విల్లుగాగలవాడు మన్మథుఁడు. మారవికారాన్ని మార్చరాదు.

ఆ. తుమ్మచెట్ల ముండ్లు । తోడనెపుట్టును
విత్తులోననుండి । వెడలునట్లె
మూర్ఖునకును బుద్ధి । ముందుగానెపుట్టు ॥వి॥ 2425

గీ॥ పూవు పుట్టినతోడనే తావిఁగొలుపు
సద్గుణపు చిన్నెలట్టులే సజ్జనులకు
విషము పుట్టినతోడనే పొసగు చేదు
దుర్గుణపు చిన్నెలట్టులే దుర్జనులకు.

ఆ. తులసి కారములును । దూముపై నీరము
పఱచి దాన దుష్ట । పాలు వోసి
కఱగి రాగిపైని । క్రమముగా నుంచరా! ॥వి॥ 2426

ఇది హేమకారక విద్యగా నున్నది. పాఠాం: తురుసు.

కం. తూలాట యింట నేర్పడ
వాలాయముగఁ జెడు నరుఁడు । వసుమతిలోన
న్లోలాక్షి విడిచి చనినను
మేలిమిగా బ్రదుకవచ్చు । మేదిని వేమా! 2427

తూలాట = అల్లరి; భార్యాభర్తల కలహము భ్రష్టత్వానికి మూలము.

ఆ. తెలుగు మంగలవాఁడు । తలమాత్రమే గొరుగు
నరవ మంగలవాఁడు । నంతగొరుగు
మాల మంగలవాఁడు । మూఁడాంతరమ్మయా! ॥వి॥ 2428

"గీ॥ దేశచాలనంబుఁ జెల్విపుట్టఁగఁజేయు
కరణ మఁనమునందుఁ గలుఁగఁజేయు"

ఆ. తెరల మఱుఁగునఁగల । తేజమంతయుఁజూచి
మఱియు బ్రహ్మమందు । మనసు నిలిపి
గరిమ నున్నయట్టి । ఘనులెందుఁ గలరయా! ॥వి॥ 2429

ముసుగు వేసుకొన్న ముక్తికాంతను మోసినవాడే మోక్షాధికారి.

ఆ. తెరువు ముక్కుచాయ । దేఁగలిగిన మీఁద
నందుఁ గనఁబడునదేఁ । యరయ లేరె?
అరసి చూడ బయలె । యల్లదే ముక్తిరా! ॥వి॥ 2430

తెరువు = మార్గము; ముక్కుతుదను వీక్షించుటే మోక్షమునకు మూలము.

ఆ. తెరువు మూటి చాయ । దేవర గిరిమీద
నమరియున్న చిత్ర । మగయలేరు
అరసి చూడ చూడ । అది ముక్తిపదవియా ॥వి॥ 2431

మూడురకముల చాయల జూచుట ముముక్షుల కర్తవ్యము.

ఆ. తెల్లచామంతియు । తోటలో నొకభామఁ
గోక కట్టుక పువ్వు । గోయుచుండి
నదియెవ్వతో దాని । బెదిరించి చూడరా! ॥వి॥ 2432

యతి పోయినది.

"ఆ కూట వేదాంతాన్ని కూర్చాడు వేమన్న
పొడుపుడు కథవలె పొలుపుమీర!

ఆ. తెల్లవారక మునుపె । తిక్క జనులనుఁ బట్టి
గొంతు గోయఁగ వలయు । గురువులైతె
వెట్టి ప్రసంగాలు । వెధవరాలకు తగద ॥వి॥ 2433

సుజ్ఞానము కల్గుటే తెల్లవారుట. చెడుగుణాలను ఛేదించమన్నాడు.

సీ. తెల్లవారకముందు । తిన్నగా వారింటి
చెంత దాగితిఁ । జింతచెట్టుమీఁద
సరగున నతఁడేగి । స్నాన సంధ్యలు తీర్చి
కుసుమాళి చేకొని । గుహను జొచ్చి
యందున్న యోగికి । వందనంబులు సేసి
ముందున్న రామయ్య । మోముఁ జూచి
మంత్రోపదేశము । మఱునాఁడు చేయంగ
వేగ రమ్మని శిష్యు । యోగి పలుక

వింటి నంత యతని । వెనువెంటనే దాగి
వదినఁ బ్రార్థించి మాయన్న । యదబుచేత
వాసి రామయ్యశివయోగి । దాపుఁ జేర
నాఫలంబేను గనవయ్యో । నప్పుడు వేమ. 2434

వేమన్న మంత్రోపదేశ చరిత్ర సంక్షిప్తముగా చెప్పుకొన్నాడు.

ఆ. తెలియఁ దనదుభార్య । తెరఁబారు సంకెల
చిన్నశిశువులెల్లఁ । జీల లరయ
నరసిచూడఁ దనువె । యల చెఱసాలరా! ॥వి॥ 2435

సంసారాన్ని చెరసాలగా వర్ణించాడు.

ఆ. తెలియ భాగవతులె । తెలివి గలారింక
నందఱెట్టు లగుదు । రకట! భువిని
నయిన వారినిగన । నతఁడెపో శివయోగి ॥వి॥ 2436

భాగవతులు = భగవంతుని భజనపరుఁ; తెలియదగినవారిని దెలుసుకొన్నవాడే దిట్ట.

తే. తెలివి తేజమ్ము విజ్ఞాన । దృష్టి యగును
భద్రమగు జ్ఞప్తిలోఁ గల । భావపరము
నిర్గుణాకారమై యొప్పు । నిజముఁ గనుము
తెలియ నీవాదు మేటిపీ । యిలను వేమ. 2437

వేదాంత పరిజ్ఞానాన్ని విపులీకరించాడు యోగి.

తే. తెలివి నందెను గురుసంజ్ఞ । తేటఁబడఁగ
నింను నంమును బరిపూర్ణ । మేరుపడుటఁ
బరమ సుఖమందఁ గోరును । భవ్యయోగి
మాయ జిక్కఁడు తక్కఁడు । మహిమ వేమ. 2438

మాయల బడనివాఁడే మంచియోగి

ఆ. తెలివి నిలిపి చూడు । దీపించునా కళల్
కళ లుడుపక చూడు । కలుగు బయలు
బయలునంటి చూడు । బ్రహ్మంబుఁ గాంచెదు ॥వి॥ 2439

ముక్తపదగ్రస్తముతో ముక్తి సౌధమునకు సోపానము ఏర్పరచి
సూటిగా జెప్పాడు

ఆ. తెలివి నొందలేక । తిరమునుఁ బడయక
తిరుగు నస్థిరుఁడయి । దేహి జగతిఁ
దిరుగనేల ? కర్మఁ । దెలియఁడయ్య జ్ఞానిఁ ॥వి॥ 2440

అజ్ఞాని జ్ఞానమార్గమును తెలిసికొనుట కష్టము.

ఆ. తెలివి యనఁగఁబడెడి । తిరమునుఁ దెలియకఁ
దిరుగు నస్థిరుఁడగు । దేహి జగతిఁ
దిరుగనేల ? ననుచుఁ । దెలియఁడే యజ్ఞాని ॥వి॥ 2441

అజ్ఞాని మంచీచెడ్డ లాలోచింపక అధోలోకములో పడును.

చ. తెలిసిన మూర్ఖరావణుఁడు । ధీరజనంబుల కై వడి న్ధర
న్వలచియె తెచ్చు సీతకయి । బాంధవ కోటులతోడజచ్చె దా
దెలియఁగ లేని చేతనని । తెల్పిన లోకుఁ డికెంద ఉండినం
దెలిసియు మాయలోఁ బడమిఁ । దెల్పితి రే బగలుండు
వేమనా ! 2442

తెలిసిన మూర్ఖలక్షణాల కుదాహరణగా రావణు చరిత్ర వాకొన్నాడు

ఆ. తెలుపఁ బడ్డ వాఁడు । దేవతా భక్తుండు
మాటలేనివాఁడు । పోటు బంటు
కాసు లేని వాఁడు । కడు బ్రహ్మచారియా॥వి॥ 2443

" ఉ॥ నీతులుపూతలై పటు మణీమయ సౌధములోన నున్న యూ
నాతి సంభోగ లాలసతనంది చరించగలటి భావనా
స్ఫీతచరిత్రుడై తెలసె వేమన యుర్విని తెల్పిగూర్చ...

ఆ. తెలుపు మాయఁజేసి । దిట్టఁ దనంబునఁ
దెలుపు భస్మముగను । దేటపఱచు
విధముకన్నఁ బరస । వేదియు లేదురా ! ॥వి॥ 2444

పరుసవేది లోహములను బంగారముగా మార్చును. దుర్యోధనుని వద్దను కొండవీటి రెడ్డిరాజుల యొద్ద యున్నట్లు చరిత్రాధారం.

ఆ. తెలుపు మాయటంచు । దేవర యంచును
వెంటఁ బడెడివాండ్ర । వెతలు దీర్ప
నెవ్వఁడైనఁ జెప్పు । నేదైన నొక్కటి
యట్టిదెల్ల నమ్మ । నగునె వేమ? 2445

విన్నదానిని విమర్శించుకొన్నవాడే విజ్ఞాని

ఆ. తెలుపువాఁ డెవండు ? । తెలియు వాఁడెవ్వఁడు ?
గుట్టెఱుంగునంత । బట్ట బయలు
సారది భాండమందు । సూర్యుని చందంబు ॥వి॥ 2446

అంతటానిండిన బ్రహ్మమునకు భాండస్థితసూర్యునకు అభేద వ్యవసాయము కల్పించాడు.

ఆ. తెవులుఁ బడ్డవాఁడు । దేవతాభక్తుండు
ఈతె లేనివాఁడు । పోటు బంటు
కాసు లేనివాఁడు । కడు బ్రహ్మచారియౌ ॥వి॥ 2447

కొరతగా నున్నప్పుడు పరికిస్తాడన్నియు.

ఆ. తేకువమర బుద్ధి । తెల్లముగా నిల్పి
తాక నది ప్రణవపు । ధ్యాన మగును
సోకి మించువాఁడె । సురలోకమును బొందు ॥వి॥ 2448

ఓంకారమును శంక లేక సాధించమన్నాడు.

ఆ. తేనె తెఱల జూడఁ । దేనెటీఁగ యెఱుంగు
సుమరసంబు జూడ । భ్రమర మెఱుఁగు
బరమయోగి జూడ । భక్తుఁ డెఱుంగురా ! ।వి॥ 2449

సుమరసము = పుష్పములలోనున్న తేనె; భ్రమరము = తుమ్మెద ; జ్ఞానులకే జ్ఞానమబ్బును.

ఆ. తేనె, పంచదార, । తీయమామిడిపండుఁ
దిన్నఁగాని తీపిఁ । దెలియరాదు
కన్న నింపుపుట్టు । గామిని యధరంబు ॥వి॥ 2450

అన్నిటికన్న ఆడదాని అధర సుధారసమే మిన్న యని వేమన్న కన్నది చెప్పాడు.

ఆ. తేనెలో మాగిన । తీయ మామిడిపండు
తినగ తినగ తీపు । తెలియరాదు
వెలకు చిక్కనిపండు । పరయోగి తినుచుండు ॥వి॥ 2451

మోక్షఫలమును ముముక్షువులు జ్ఞానధనముతో కొందురు.

ఆ. తేలునకు నిఁకెంత । తెలియఁ గొండివిషంబు
ఫణికి నుండు విషము । పండ్లయందు
దెలివిలేనివాండ్ర । దేహమెల్ల విషంబె ॥వి॥ 2452

" ఆ. బద్దెనభూపాలు భావంబువాకుచు
పలుమార్లు దెల్పెను పరమయోగి "

ఆ. తేలుపిల్లకు విషము । తోక కొండెనయుండు
పాము పిల్లకు విషము । కోఱనుండు
దుష్ట నరునకు విషము । దేహ మాద్యంతంబు ॥వి॥ 2453

నకిలీకవి యెవరో మక్కికి మక్కిగా మార్చి వేమనకు చేర్చాడు.

ఆ. తొడల మెఱుపుఁ । జూడ దొడ్డచనుఁ జూడ
వగలుఁజూడ దాని । వన్నెఁజూడ
విటుఁడు నిలుచునెట్లు । విరహాగ్నిఁ జొరకయె ॥వి॥ 2454

విరహము పలువిధముల వివరించెను.

ఆ. తొత్తు తొత్తెకాని । దొరసానిఁ గాఁబోదు
అడఁచు టింతె దాని । కైనగుణము
మిత్త్రిక్రూళ్ళ దొంగ । మేలెట్లు నేర్చురా ! ॥వి॥ 2455

కక్కూర్తికవి భావచౌర్యము చేసినట్లు నీచపోరుని ఉపహరించెను.

ఆ. తొత్తుతోడఁ బొందు । దోషంబు దోషంబు
లంజెతోడఁ బొందు । లజ్జ చెఱుచు
జారతోడ బొందు । చావునకే యగు ॥వి॥ 2456

తొత్తు = దాసీది; లంజె = వెలయాలి; జార = వ్యభిచారి

ఆ. తొత్తుతోడఁ బొందు । తొట్రి పెసలమూట
ముచ్చుతోడి పొందు । తెచ్చు నిందఁ
దలవరిదగు పొందు । తలతోనె తీఱురా ! ॥వి॥ 2457

తొట్రి = చినిగిన; స్త్రీల కూట పలితములు చిత్రించాడు చిత్రముగ.

క. తొమ్మది ద్రంతల తిత్తికి
నిమ్మగు సొమ్ములును గులము । నేఁటికిఁ జెపుమా !
నమ్మకు దేహము నా దని
నెమ్మది బ్రహ్మమును దెలియు । నే నని వేమా ! 2458

నవరంధ్రములు : కండ్లు 2, ముక్కులు 2. చెవులు 2, నోరు 1, గుర్మస్థానము 1, గుదము.

క. తొమ్మిదితొఱ్ఱల తిత్తిని
నమ్మి శివునిఁ దలఁపలేక । నశియింపంగా
నిమ్మహి గృధ్రచయంబులు
సమ్మతిగా నిన్నుఁ దినును । జక్కఁగ వేమా ! 2459

నవద్వారముల కొంపను నమ్మవద్దని యోగి వేమన ఉపదేశము.

ఆ. తొమ్మిది రంధ్రాల । తోలుబొమ్మకు లోన
చొక్కపు చోరులు । చోద్య మరయ
* జ్ఞానరత్నముల । హరించగోరుచు నుంద్రు ॥వి॥ 2460

యతితప్పు; చోరులు = షడ్గుణములు ; రత్నము = జ్ఞానము.

సీ. తొమ్మిదివాకిళ్ళు । తొలుతనే శిశువున
కేర్పడియుండెడి । నెనయఁ జూడఁ
జెవులుఁ, గన్నులు, ముక్కుఁ । జెలఁగు నోఱును, మఱి
గుదమును, గుహ్యంబుఁ । గూడ జేర్చి
యందు తొమ్మిదితూటు । లమరి యొప్పారఁగా
నాధారముల టాఱు । నానఁ జేసి
భేదంబులేకను । పెరిగెడి దేహంబు
పది వాయువుల తోడ । విదితముఁలుగ
నిన్ని కల్పించి దేహాగ్ని । నెనయఁజేసి
తన్ను మఱపించి లోకంబు । తగులఁ గలిపి
వాఁడు మరిగియు నానక । వరుసగాను
బుట్టఁజేసెను గాదె యీ । పుడమి వేమ. 2461

మానవుని అవయవ నిర్మాణమును, వేదాంతపరిభాషలో విపులంగా వివరించాడు యోగి వేమన

ఆ. తొట్టిమానిలోని । తొఱటి జీవుల నెల్ల
మొల్లలేక చంపు । ముదముతోడ
నగ్ని లేనిమంట । యదియేమి చోద్యమో ? ॥వి॥ 2462

మొల్ల = ఆయుధము; తొఱటిజీవులు = అజ్ఞానులు ; తొట్టి మాను = శరీరము;

ఆ. తొట్టిలోది చిలుకలు । దొరకొని కూయంగ
అందులోని దొకఁటి । యాది వెదకు
ఆది వెదకి చిలుక । యామెపో బ్రహ్మంబు ॥వి॥ 2463

శరీరములోనున్న పంచవాయువులలో ధనంజయవాయువు బ్రహ్మను శోధించును.

ఆ. తొట్టివాని మిగులఁ । దూలి దీవింపకు
వెట్టివాని మాట । వినఁగఁబోకు
వెట్టికుక్కఁబట్టి । వేటాడవచ్చునా ? ॥వి॥ 2464

పనికిమాలిన వాళ్ళతో పరిహాసములు తగవు.

ఆ. తొట్రివాని మిగుల । తొందర బెట్టకు
వెఱ్ఱివానిమాట । వినఁగరాదు
వెఱ్ఱికుక్క బట్టి । వేటాడవచ్చునా! ॥వి॥ 2465
వైపద్యభావమే మార్పులతో ఇందు కూర్పబడినది.

తే. తొల్లి చేసినపాపంబు । తొలఁగు కొఱకె
పుట్టి చచ్చి తిరిగియును । బుట్టి పుట్టి
గురునిఁ జేరియు వేడి తాఁ । గొల్వవలెను
విమలగుణరాజ? । యోగీంద్ర వేమనార్య! ॥వి॥ 2466
"పూర్వకర్మానుఫలితమే పాసగుజన్మ"

తే. తొల్లిఁజేసినపాపంబు । తొలఁగుకొఱకె
పుట్టిచచ్చి తిరిగియును । పుట్టి పుట్టి
గురునిఁజేరియు వేడి తాఁ । గొల్వవలెను
వేఱు మార్గములేదెట్లు? । వెదకవేమ. 2467
"పూర్వపాపమే యీజన్మను పొందించినదిగా వేమనవాక్య—

ఆ. తోకగలుగువానిఁ । దొఱకి గొంతులుగోసి
మేఁక జీవములను । మెడలు విఱచి
కడమ జీవములను । గాల్చియుఁ దినెదరు ॥వి॥ ꞉468
యజ్ఞ యాగాది పేరులతో జీవహింస చేయు చిత్తాలు చిత్రిం
చాడు శ్రేష్ఠుఁడు.

ఆ. తోకలేని యెలుక । తోలులేని పండు
చప్పరిస్తున్నది । త్రిప్పి త్రిప్పి
యీమాట తప్పైతె । నేమీూన చూడరా! ॥వి॥ 2469
చమత్కారంగా వేదాంతఫలాన్ని సుజ్ఞానుల కందించాడు.

ఆ. తోటకూరకైన । దొగ్గలి కైనను
తవుటి కుడుము కైన । దవిటికైన
గావ్యములను జెప్పు । ఘనులెల్ల ధనపరుల్ ॥వి॥ 2470
కుకవుల కక్కుర్తి కూతలను నికరముగా ప్రకటించాడు.

ఆ. తోటకూరకైన । దోగ్గలికైనను
తవుటి కుడుముకైనఁ । దవుటికైనఁ
గావ్యములను జెప్పు । గాండ్యాలు ఘనమైరి ॥వి॥ 2471

గాండ్యాలు = పనికిమాలు కవులు.

ఆ. తోలు కడుపులోన । దొడ్డవాఁడుండఁగ
రాతిగుళ్ళ నేల । రాశిఁబోయ ?
రాయి దేవుఁడైన । రాసులు మ్రింగదా ? ॥వి॥ 2472

విగ్రహారాధనను నిగ్రహించమని నీటుగా చెప్పెను.

ఆ. తోలుఘటము లోన । దోలఁగక యున్నప్పు
డాలుమగలుఁ బ్రీతి । నలరుచుంద్రు
జీవి ఘటముఁవిడువఁ । జిక్కూడిపోవురా ! ॥వి॥ 2473

ప్రాణ మున్నంతవరకే భార్యాభర్తలు అదిపోతే యేదీలేదు.

ఆ. తోలుతిత్తిలోనఁ దోలుతఁ । బుట్టిన తాను
వెనుకఁ దెలియవలయు । వివర మరసి
వెనుకఁ దెలియలేమి । వెఱ్ఱియై చెడిపోవు ॥వి॥ 2474

వెనుకా ముందు ఆలోచించినవాఁడే వేదాంతుఁడు.

ఆ. తోలుతిత్తిలోనఁ । దోలుతఁ బుట్టినవాని
వెదకి తెలియవలయు । వివరముగను
వెదకి తెలియలేక । వెఱ్ఱులై చెడిపోరె ? ॥వి॥ 2475

పదముల మార్పులే. పైభావమే ఇట పరిస్ఫుటమగుచున్నది.

ఆ. తోలున కట్టెట్టి । తోసినంతటి లోన
కామంబు పైనుంచి । క్రింద దిగును
* క్రింద దిగినంతట్లో । కళదిగిపో నరుఁడు ॥వి॥ 2746

*యతితప్పు; స్త్రీ పురుష సంయోగము శిశోత్పత్తికి మూల మన్నాడు.

మ. ఘనుఁడై వేమన సర్వశాస్త్రముల తా గాలించి క్రోడీకరిం
చిన భావంబును సర్వమానవులకున్ శ్రమించగా దెల్పె ని
త్య నవీనామల వేదభాష్యములతో తత్త్వంబు జోడించి భూ
మిని లేరెవ్వరు వేమనార్య సములన్త్రైలంబు గల్గించుచున్ ॥

"'లి' కారో లీనరాహిత్యం 'గ' కారో గమ్యవర్జితం అనామయ మసంగత్వా త్తల్లింగం పరమశివః " లింగం లీనం గమ్యం నవిద్యతే " (ఉత్పత్తి)
లింగమనగా ఈశ్వరుని జేర్చునది.

## ద

ఆ. దగ్గఉన్న వాఁడు । దట్టుఁడు, దత్తుఁడు
ఎడము పడినవాఁడు । దుడుకు గడుసు
అనుసరించువారి । కయ్యేడుఁ గార్యముల్ ॥వి॥ 2477

ఇది తండ్రీ కుమారుల సంబంధ కుటుంబ విషయము.

ఆ. దనియు పిండమునను । దగిలిన మనుజుండు
పుట్టలేఁడు వాఁడు । పుడమిలోన
నట్టి పుట్టుకఁ గన । నవనిలో లేదయా ! ॥వి॥ 2478

గర్భగోళమున అడ్డుతిరిగిన పిండమువలన తల్లికిగాని పిల్లకుగాని గండము తప్పదు.

తే. దర్పణంబునఁ దనరూపు । తగిలినట్లు
నేర్పుగలిగిన మదిలోన । నీదురూపు
మర్పణంబుగ నెఱుకలో । నడఁచిచూడ
నోర్పు కలవాఁడె నేర్పు తా । నొనర వేమ ! 2479

అద్దములో నీడవలె ఆత్మలో పరమాత్మ చూడుము.

ఆ. దర్శనంబులందు । ధర షణ్మతములందు
వర్ణమాశ్రమమును । వదల కెపుడుఁ
దిరుగుచున్నవాఁడు । ధరలోన నజ్ఞాని ॥వి॥ 2480

సర్వసమ్మత మతము నాశయించమని వేమన మతము.

ఆ. దరుచు చదువు చదువ । తర్కవాదమె కాని
దివ్యజ్ఞానమునకు । తేటపడదు
పిసిరివాయుపురుగు । పగిదిని చెడిపోవు ॥వి॥ 2481

పిసిరివాయు పురుగు = పట్టుపురుగు; చదువు తర్కవాదమునకేగాని జ్ఞానమునకు గాదు.

ఆ. దశముకొని యొకప్డు । దారిద్ర్య మేర్పడ
హీనకార్యములు స । హించి చేయుఁ
బరువుమాయు నింతె । ఫలమట్టె చిక్కదు ॥వి॥ 2482

దరిద్రములో మనిషి యేపనైనా ఆదాయముకోసము చేస్తాడు.

ఆ. దశ గలారినెల్లఁ దమ । బంధువు లటంద్రు
దశయు లేమి నెంత్రు । తక్కువగను
దశ యునంగను దశ । ధన మొప్పుటొక్కటే ॥వి॥ 2483

డబ్బుంటే మావారు. అది లేనప్పుడు పైవారుగా భావింతురు.

తే. దశమంగళ గృహాను । దాగి నిలిచిన శివుని
*పట్టలేక పోయిరి । పెద్దలెల్ల
పిరికి జీవులకెల్ల । దొరకునా! యాశివుఁడు ॥వి॥ 2484

*యతిపోయినది; హృదయ కుహరములోనున్న యీశునిఁ జూడ మన్నాడు.

తే. దశమి, యేకాదశి యని । వ్రతములఁ బూని
మెదుకుఁ దినకున్న దుర్గుణ । మది యడఁగునె
పుట్టపై గొట్ట నురగంబు । గిట్టఁబోదు
తీరెఱుంగని మౌఢ్యమిా । తెలఁగె వేమ ! 2485

మౌఢ్యము = మూర్ఖత; భుజగము = పాము; ఏకాదశి వ్రతము చేయువారు దశమి ఒకపూట, ఏకాదశి పూర్తిగాను ఉపవసించి ద్వాదశిని పారణము చేయుదురు దానిని వేమన వ్యర్థమన్నాడు.

ఆ. దశయనంగ నెండు । ధనముంటయే యంద్రు ?
కూడు నిద్రలేక । కుందుటె కద
రాఁగనుండబోవ । బాగుగా నేర్పించు
ధనము నెంచు బెట్టి । తలఁపొ వేమ. 2486

దశను డబ్బును వాదాన్ని కావన్నాడు వేమన

ఆ. దశరథుండు రామ । ధరణీశుఁ బట్టంబు
గట్టఁజేయఁ దలపఁ । గట్టె జడలు
తలఁపు మనదిగాని । దైవిక మదివేఱ ॥వి॥ 2487

దైవమే దశ.

కం. దశవాయువుల నొసంగియు
వశుఁడై తా నున్నయట్టి । "భవునెఱుఁగవె యో
పశుపా!" యని యముఁ డనగ వి
వశుఁడవు మున్నగుదు వీలు । వడిఁగను వేమా! 2488

: దశవిధ వాయువులు :

1 ప్రాణవాయువు. 2 అపాన, 3 ధ్యాన, 4 సమాన, 5 ఉదాన, 6 నాగ, 7 కూర్మ, 8 కృకర, 9 దేవదత్త, 10 ధనంజయ వాయువులూ; ఇవిగాక, 11 వైరంభ, 12 ముఖ్య, 13 అంతర్యామి, 14 ప్రభంజన వాయువులునుఁ గలవు.

మూలాధారము నుండి "ఓం" అని వెడలినది చక్రమందు "అం" అని తాకి "సం" అని ఇడా పింగళులలోగా కపాలమును ముట్టి అక్కడినుండి ముక్కు మార్గముగా వెడలి 12 అంగుళములు ప్రమాణముపైకివచ్చి 4 అంగుళములు లయమయి 8 అం॥ మరల లోపలికి పోవును. ఆధారచక్రమున 600, స్వాధిష్ఠానమున 600, మణిపూరకమున 600, అనాహతమున 600, విశుద్ధమున 1000, ఆజ్ఞాచక్రమున 1000, సహస్రారమున 1000, ఇట్లు 21,600 శ్వాసములు దినము ఒక్కటికి నడచును. నిమిషమునకు 15 శ్వాసలు, హోరకు 900 శ్వాసలు.

: హంస వివరము :

1 "హ" కారము, 2 బిందువు, 3 "స" కారము. ఇవే నాదు, బిందు, కళలునూ, సోమ, సూర్య, అగ్నిమండలములునూ పురుష, పుత్ర, స్త్రీ ప్రవాహాములునూ శుక్ల, మిశ్ర, రక్తములని చెప్పఁబడినది.

ఆ. దశము కొని యొకప్పు । దారిద్ర్య మేర్పడ
హీనకార్యములు న । హించి చేయు
బరువు మాయునింతె । ఫలమింత చిక్కదు ॥వి॥ 2489

దశముకొని = లేకెత్తి; దారిద్ర్యమున నికృష్టపనులు చేయించును.

ఆ. దక్షయాగ మెఱుఁగుఁ । దమ ప్రబుకెల్లను
వీర విష్ణుఁ డపుడె । పాఱెఁగాదె
శివుని నిందఁ జేయ సిగ్గేది । ద్విజులకు ॥వి॥ 2490

శివనింద విష్ణునిగూడా లొంగదీసెను (వీరభద్ర విజయము)

కం. దాఁచిన తనువల వలచును
దను వలువక యున్న దన్ను । దా వలవడినన్

దనరు పటాటోపంబులు
తనమాయలు పనికిరావు । ధరలో వేమా ! 2491
ఆటవెలది హావభావాలవలె అయోమయంగానే యున్నదీ పద్యము.

ఆ. దాఁచిన ధనమునకుఁ । దాను గొడుకులు
వాంఛపడుటె కాని । వట్టిభ్రమలు
భాగ్యహీనునకును । ఫలము లభించునా ? ॥వి॥ 2492
భాగ్యహీనులకు భాగ్యము చిక్కదు.

ఆ. దాత గానివాని । దఱచుగా వేఁడిన
వాఁడు దాతయగునె? । వసుధలోన
నవురు దర్భయౌనె? । యబ్ధిలో ముంచిన ॥వి॥ 2493
అవురు = ఆవిరిగడ్డి; తక్కువవానిని ఏమిచేసినా ఎక్కువ కాడు (నీతి)

ఆ. దాత యైనవాఁడు । తానె మున్ని చ్చెడిఁ
గానివాఁ డొసఁగునె । కానియైన
జలము దప్పితీర్చు । మల మెట్లుతీర్చురా ! ॥వి॥ 2494
మలము = మూత్రము,
ఎందుకు ఉపయోగపడునో దానినందుకే ఉపయోగించవలెను.

ఆ. దాత లేని కొంప । దయ్యాల పెనువాఁడ
నీతిలేనిమాట । రాతివేట
ప్రీతిలేని లంజె । ఘాతకియై తోఁచు ॥వి॥ 2495
వేమనసూక్తి సధారము యీపద్యములో జాలు వారుచున్నది. (నీతి)

ఆ. దాన ధర్మములకుఁ । దగు తేపు తేపని
కాల లయము సేయు । కష్టజనుఁడు
తా నికేమి యౌనో ? । తన బ్రదు కేమౌనో ?
మాయఁ దెలియలేఁడు । మహిని వేమ. 2496
చేయగల పనికి రేపనుట చాదస్తము.

ఆ. దానధర్మములను । దాఁ జేసి పుట్టమిఁ
గర్మగతిని యముఁడు । కష్టపఱచుఁ
గర్మ ధర్మములను । గడవీడ బ్రహ్మంబు ॥వి॥ 2497

కర్మ, ధర్మములను వీడినవాడే బ్రహ్మము.

ఆ. దాన, ధర్మములను, । దయయు, సత్యము, నీతి,
వినయ, ధైర్య, ధుర్య । వితరణములు
రాజు పాలిఁటికిని । రాజయోగంబులు ॥వి॥ 2498

రాజు లాచరింపవలసిన రమ్యమగు గుణములఁ జెప్పెను రెడ్డిరాజు.

ఆ. దాన మడుగువాఁడు । ధరలోన నధముండు
దాన మడుగ నతఁడు దైవ సముఁడు
దాన మీనివాఁడు । ధన్యుండు గాఁడయా ! ॥వి॥ 2499

అడుగుట, అడుగకుండుట, యీయకుండుట, వీటినుద్ఘాటించాడు.

ఆ. దాన మమరఁజేయ । దరిఁ జేర్చు నయ్యది
మనమె నమ్మెనేని । మాయముంచు
జ్ఞానకలిక నమ్మఁ । జంపురా ! వైరుల ॥వి॥ 2500

జ్ఞాన మార్జించినవారికి శత్రువు లుండరు.

ఆ. దాన మమరఁ జేసి । దరిఁజేరు నొకవంక
మనము నరిసి పిదప । మాయ వీడు
జ్ఞానకణిక నమ్మ । జంపును వీరుల ॥వి॥ 2501

జ్ఞాన కణిక = దివ్యజ్యోతి.

ఆ. దాన మరసిఁ జేయు । దాత దగ్గఱఁ జేరి
వక్ర భాషణములు । వలుకు మొఱకు
చందన తరువందు । సర్ప మున్నట్లయా ! ॥వి॥ 2502

చందన తరువు = మంచిగంధపు చెట్టు; ఉపమానోపమేయములు ఉన్నతస్థాయిలో నున్నవి.

కం. దానము చేతుల కగునను
జ్ఞానంబును నేఱుఁగనెల ? । ఘనతరముగ దా

దానమె తమ తత్పద మని
మానవు లెంచంగవలయు । మహిలో వేమా ! 2503

తత్పదము = బ్రహ్మపదము; దానమన్నిటికన్న మిన్న.

ఆ. దానములను జేయ । ధర చేతులాడక
బహు ధనంబు గూర్చి । పాతిపెట్టి
తుదను దండుగనిడి । మొదలుగా చెడు నరుఁడు ॥వి॥ 2504

దానము చేయనివాని ధనము దండుగుగుకే; మొదలుగా = మూలముతో సహా;

ఆ దానములను జేసిఁ । దరిజేరు నొకవంక
మాన మొకటి నమ్మ । మాయఁ దగులు
జ్ఞానమరసి నమ్మ । గడతేర్చు వైరుల ॥వి॥ 2505

దాన, మాన, జ్ఞాన, "న" కార త్రయములయొక్క తారతమ్యాలను చెప్పెను.

ఆ. దానములను జేసి । ధర కీర్తిఁ జెందంగ
బహుధనము లొసఁగియు । భక్తిలేమిఁ
దుదను జెడు నరుండు । మదిఁ గడగండ్లచే ॥వి॥ 2506

కడగండ్లు = ఎక్కువకష్టము; భక్తిలేనివానికి బాధలే ?

ఆ. దానములను నన్న । దానమే దొడ్డది
గానములను సామ । గాన మెచ్చు
ధ్యానములను శివుని । ధ్యానమే శ్రేష్ఠంబు ॥వి॥ 2507

ఆ. దాన మొసంగుకన్న । దేనంబు మఱిహెచ్చు
దేన మొనరు కన్న । దెలివి హెచ్చు
తెలివికన్న నాస । దెగవేసినది హెచ్చు ॥వి॥ 2508

ముక్తపదగ్రస్తమున మోదమిచ్చిన ఆటవెలదిలో ముక్తకంఠముగా ముక్తిమార్గమును చెప్పెను.

ఆ. దాని ధనమునకుఁ । దానును కొడుకును
వాంఛఁబడుటె । కాని వట్టి భ్రమలు
భాగ్యహీనునకును । ఫలము లభించునా ? ॥వి॥ 2509

లభ్యముగాని ధనము లభించుటెట్లు ?

క. దాపున నున్నది యద్దము
మాపున నీమాపుఁ జూచి । మాఘిగఁ గని యా
పాపకు లోనగుచూపునఁ
బ్రాపై శివుఁడుండుఁ గనుము । పనుపడి వేమా! 2510

ఇది దర్పయోగమంటారు. దీనిని మనకవి వాడాడు.

ఆ. దార బందిగంబు । తనయులు సంకెల
ల్బంధువర్గమెల్లఁ । బహారిగోడ
మోహ మెఱుఁగలేఁడు । మొక్కలికాఁడయా ! ॥వి॥ 2511

మొక్కలికాడు = మోహములో మునిగినవాడు. మూఢాత్ములు మోహములో మునిగిపోవుదురు.

క. దారా పుత్రాదులతో
కూరిమిఁ గూడంగ నేమి ? । కుదురగు మనసున్
వేరుపడఁగ నిల్చినచో
సారంబుగ ముక్తిఁ గల్గు । సద్గుణ వేమా । 2512

సంసారములో చిక్కనివాడు జ్ఞానోత్తముఁడు.

ఆ. దాస తను నెఱుఁగకఁ । దాసు లెట్లగుదురు
వైష్ణవం బెఱుఁగక । వైష్ణవులటు;
మనుచు గాలుపులను । మరిఁబడ నేలరా ! ॥వి॥ 2513

చక్రాంకితములు వక్రమార్గానికే ?

గీ. దాసరివలెఁ గావచ్చును । వేషమునను
జంగముగ నుండగావచ్చు । నంగుఁ దప్పి
పరగ పదివేలకైనను । బ్రాహ్మణుండు
విశ్వమందున కాబోఁడు । వినుర వేమ. 2514

శైవవైష్ణవ భక్తుల వేషాలు వేయవచ్చును గాని బ్రహ్మజ్ఞానము గల బ్రాహ్మణుడు గానేరఁడు.

ఆ. దాసరట్టులఁ గావచ్చు । వేషమునను
జంగముగ నుండఁగావచ్చు । లింగమేసి

ధర్మవర్తులు సజ్జను । ల్మర్మమెఱిఁగి
దేవుఁడే వారి రక్షించు । దివిరి వేమ. 2560

అందరూ మానవులే! మాధవునిబిడ్డలే? అప్ప = బాబూ (కన్నడము)

ఆ. దేవపూజలందు । దేవాలయములందు
దేవుడంటు జెప్పి । తెరువుఁ జూపె
తెలియ విశ్వమెల్ల । దేవాది దేవుఁడు ॥వి॥ 2561

"శా. విశ్వాతీతుఁడు వేదవేద్యుఁడయి నిర్వీర్యప్రతాపోన్నతిన్
శశ్వద్భక్తుల రక్షజేయు సతమున్ సానందుడై దాపుతో"

ఆ. దేవపూజ సేయ । దివ్యభోగము గల్గు
తత్వ మెఱిఁగనేని । దైవసముఁడె?
యేమిలేని పరస । కేగతి లేదురా! ॥వి॥ 2562

పూజచేయనివా డభాజనుండు.

ఆ. దేవ భూములందు । దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి । సేవఁజేసి
తెలియ విశ్వకర్మ । దేవాది దేవుఁడో ॥వి॥ 2563

విశ్వకర్మ విశ్వవినుతుడు.

ఆ. దేవళములలోను । దీర్థంబు లందును
మూల మెఱుఁగకున్న । ముక్తిలేదు
ఆత్మమూల మెఱుఁగ । దది యెట్లు తెలియురా! ॥వి॥ 2564

ఆత్మమూల మెరిగి ఆనంద పడుడు.

ఆ. దేవుఁడనఁగ వేఱు । దేశ మందున్నాఁడె?
దేవుఁడనఁగఁ దనదు । దేహముఁపయి
వాహనంబు నెక్కి వడిఁ । గదలును జూడ ॥వి॥ 2565

దివ్యజ్ఞానముంటే దేహములో దేవుని దిట్టగా జూడవచ్చును.

తే. దేశ దేశమ్ము దిరుగుట । తిండి కొఱకె
పూని వేషము వేయుట । పొట్టకొఱకె
మనసునందు గుఱిఁగాంచిన । మరిగి, తిరిగి
పుట్టకుండెడి పదవిని । బూను వేమ. 2566

పొట్టకోసం బూటకము పూనవద్దన్నాడు.

ఆ. దేశ దేశములను । దిరుగంగఁ దిరుగంగ
నాత్మయందు ధ్యాన । మంటుకొనునె ?
కాసులకును దిరుగఁ । గలుగునా మోక్షంబు ? ॥వి॥ 2567

బ్రిమ్మరి తనము దేబెత్వమునకు మూలము ; కాసులు = బంగారము.

ఆ. దేశ నామము వేరె । దేశంబు లొక్కటే
గుళ్లనామము వేరె । గుడియు నొకటె
దైవనామము వేరె । దైవంబు ఒక్కటే ॥వి॥ 2568

అన్నియూ ఒక్కటే !

ఆ. దేశ వేషములను । తేటసేయఁగ దేవుఁ
డాత్మలోన నుండు । నణఁగి పెనఁగి
వేస మరసిచూడ । గ్రాసంబు కొఱకయా ! ॥వి॥ 2569

" వేషాలు వేయుట గ్రాసముకొరకే "

ఆ. దేహగుణములెల్ల । దెలిసిన శివయోగి
మోహమందుఁ దగిలి । మోసపోఁడు
ఇంద్రజాలకుండె । యెందును జిక్కునా ! ॥వి॥ 2570

శివయోగి యేచిక్కునకూ చిక్కడు.

ఆ. దేహనామము వేఱె । దేహంబు ఒక్కటే
దేహవర్ణము వేఱె దేహ । మొకటే
జన్మక్రతువులు వేఱె । జన్మంబు ఒక్కటే ॥వి॥ 2571

పదముల మార్పుతో భావముల కూర్పుతో జెప్పాడు.

సీ. దేహం బనిత్యంబు । దేహి నిత్యంబని
దేహేంద్రియాదులఁ । దీవ్రగతిని
మోహంబులెల్లను । మొదటికి వర్జించి
యాపరమాత్మతో । నైక్యమంది
చిత్తశాంతిని బొంది । చిన్మాత్రము వినాగ
నిరంతంబుఁ జూడక । యెప్పటికిని
సర్వ మాత్మ యటంచు । సత్యంబుగా జూచు
వారె తత్వజ్ఞులు । వసుధలోన

నట్టి వారల మర్మంబు । లరయుటకును
హరి హర బ్రహ్మలకునైన । నలవిగా ద
టంచు శాస్త్రంబులెల్ల ని । ట్లని వచింపఁ
దెలిసి చెప్పెను వేమన । దేశికుండు 2572

దేశికుఁడు = విజ్ఞానగురువు ;
"మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయి నస్తు మహేశ్వరం
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్"
మృత్యుంజయుఁడగు పరమేశ్వరుఁడు యోగీశ్వరుడని తెలియవలయును.

కం. దేహ భ్రమములు వీడక
సాహసమున ముక్తిఁ బొంద । శక్యంబగునా !
మోహంబులెల్ల దీఱిన
బాహాటముగా నతండె । పరుఁడగు వేమా ! 2573

దేహభ్రాంతులు దీరినవెనుక తన ఆనందమును అంతమయ్యేనని దేహి తుదిని మోక్షము గోరును.

ఆ. దేహ భావమెల్లఁ । దెలియంగఁ జూచిన
నఖిల హేయములకు । నాలయంబు
పరసతి గమనంబు । ప్రత్యక్ష నాశంబు ॥వి॥ 2574

పరసతీ సంగమము ప్రాణసంకటము గల్గించును.

ఆ. దేహమందు వెలయు । తేజంబు పరమాత్మ
కాయమందె యుండు । కార్యమెల్ల
నెంచిచూడ లోక । మేది వేరే కాదు ॥వి॥ 2575

సర్వమూ నీదిగాభావించి సర్వేశ్వరుని భజించుము.

ఆ. దేహ మాత్మరూపుఁ । దేటతెల్లముఁ జేసి
యవలి చూపుఁ జూపు । నతఁడె గురువు
భ్రమరము తనరూపు । క్రిములకిచ్చినరీతి ॥వి॥ 2576

భ్రమర కీటన్యాయము = తుమ్మెద తోటకూరపురుగును తన గూటి యందు పెట్టి "ఝుం కార" ధ్వని చేసి చుట్టూ తిరిగి దాన్ని తనవలె జేసుకొనును.

తే. దేహ మాత్మలు వేర్వేరు । దెలియలేక
మోహమునఁ జిక్కి బద్ధుఁడై । మునుగు టేల ?
సాహసంబున గురుభక్తి । సలుపవలెను
విమలగుణరాజ ! యోగీంద్ర । వేమనార్య ! 2577

ఆత్మ, దేహమును దెలియక మోహములో పడుట మూర్ఖత్వము.

తే. దేహ మాత్మలు వేఱని । తెలియలేక
మోహమునఁ జిక్కి గాథలో । మునుఁగు టేల ?
సాహసంబున గురుభక్తి । సలుపవలెను
వివరమాతండు తెలిపెడి । వేగ వేమ. 2578

గురుభక్తి వలన గుగునభిమానము పొందును.

క. దేహము లెస్సగ నుండిన
పోహణ తత్వంబులన్ని । పొందుగఁ దెలియుం
దేహము బడలికఁ బడినను
పోహణ తత్వములు వచ్చి । పొందవు వేమా ! 2579

" ఓం" మిత్యేకాక్షరం బ్రహ్మ ఓంకార ప్రభవో వేదః
ఓం కారము జపించు వారే ధన్యులు

ఆ. దేహ మూలమందు । దేహి దేవుఁ డటంచు
దెలిసియున్న బుధులు । తీర్థయాత్ర
లరయఁ బోరు జగతి । నాత్మ తామై యుండి ॥వి॥ 2580

దేవుఁడు దేహములో నున్నాడని దెలిసిన తీర్థయాత్రలతో పనిలేదు.

తే. దేహశక్తియు లేనట్టి । దీనునకును
జక్కగా బోధచేసెడి । చతురుఁడుగను
నిక్కముగ విశ్వకర్మ తా । నీటుమెఱయ
రామయాఖ్యను పిలిసిల్లె । రహిని వేమ. 2581

తన గురువగు అభిరామయ్యను గూర్చి చెప్పెను.

ఆ. దేహసంకటమ్ము తెగఁ । దేరకాంద్రయ్యు
మోహదృష్టి వీడి । మూలమెఱిఁగి

యూహా యొకటిపన్ని । యుల్లంబుసాధించి
స్నేహమెఱుఁగ యోగ । సిద్ధివేమ. 2582

“ తథా సర్వగతో దేహీ దేహమధ్యే వ్యవస్థితః
మనస్థో దేహినాం దేవో మనో మధ్యే వ్యవస్థితః ”
పరమాత్మను గూర్చి చింతింపుము.

క. దేహాభిమాన ముండగ
మోహాదులు జన నవారి । ముంచును కలగా
నీహారి విషయ భావన
కూహాదులుబోవు మేలు । గొన్నను వేమా ! 2583

నిద్రా ముద్రితుఁడవు గాక నెరవెరుఁగుము.

క. దేహాభిమాన ముండగ
మోహాదులు విడుచునెట్లు ? । మునులకునైన
న్సాహసమున నది విడువనె
“సోహ” మ్మని యెఱుగవచ్చు । సుమ్మీ వేమా ! 2584

“ సోహం ” ను నమ్మి దేహవాసనను తెగగొట్టమన్నాడు.

కం. దేహికి దేహమె యిల్లని
మోహము చేతను గుబుద్ధి । మురియుచు నుండుం
దేహియు దేహము నంటని
హోహణయగు బట్టబయలు । హొందుగ వేమా ! 2585

హోహణ = కూర్పులు, నేర్పులు.
దేహీ దేహములంటని దివ్యత్వమును పొందమన్నాడు.

కం. దేహియు జ్ఞానానలమున
దాహంబై దేహ మెల్లఁ । దల్లడ పడఁగా
దేహములోఁ । బొర్లాడుచు
మోహము విడ శివునిఁజూడు । ముక్తికి వేమా ! 2586

అనలము = అగ్ని ; మోహ కాష్ఠములను జ్ఞానానలముచే దహింప
జేయ మన్నాడు.

ఆ. దైవ కంటకుండు । ధనముచే గర్వించి
సకల సంపదలను । చాల దనిసి
కడకు తాను మేలుఁ । గానక చెడిపోవు ॥వి॥ 2587

దైవదూషణ తన్ను భ్రష్టునిఁ జేయును.

ఆ. దైవఘటన లేక । దైవ సుజ్ఞానంబ
దేల వచ్చు ? రెంటి । కెరుక పడక
యెఱుగ నెఱుగువాని । కెఱుకలోఁ గనుపించు ॥వి॥ 2588

భగవంతుని దయలేక ఫలప్రాప్తి కానేరదు.

ఆ. దైవమతుల నరులు । తమవంటి వారని
యరసి గూఢతత్వ । మెఱుగలేరు ?
ఇల్లు మూయఁబడిన । నెట్లు మర్మమెఱుంగ ॥వి॥ 2589

అంధకారములో నున్న వారికి అసలు తెలియదు.

ఆ. దొంగతనము వలన । ద్రోహ మెంతయుఁజేసి
యెవ్వరెఱుఁగకుండ । నిముడు కొన్నఁ
దాము చేయుపనులఁ । దగులుకొనరె ముందు ॥వి॥ 2590

తాము చేసినవే తమతో వచ్చును.

ఆ. దొంగతనము, అంకు । దొరసియుండు జగతి
అంకులాడి కింత । శంకపుట్టు
దొంగకెన్న రే వె । లుం గొప్ప కానట్టు ॥వి॥ 2591

రేవెలుంగు = చందమామ
జారచోరత్వాలు దూష్యములన్నాడు.

ఆ. దొంగ తెలివిచేత । దొరకునా మోక్షంబు ?
చేతగాని పనులఁ । జేయరాదు
గురుఁ డనంగవలదు । గుణహీనుఁ డనవలె ॥వి॥ 2592

" ఆ. గురువు దొంగయైన కులమెల్ల దొంగయా
మాత జారయైన కూతురట్లె ?

ఆ. దొంగ మంత్రములను । దొరకొనునా ముక్తి ?
చేతఁగాని చేత । చెల్లదెపుడు
గురువటంచ్రడె వాని । గుణహీనుఁ డందురు ॥వి॥ 2593

"యత్ర యత్ర గ నోయాతి తత్రలయం గతం"
మనస్సే విధినున్న పరిణామ మావిధమే ?

ఆ. దొంగమాట లాడ । దొరకునా మోక్షంబు ?
చేతఁగాని కూత । చెల్లదెపుడు
గురువు వద్దఁగాక । గుణనిధి కాబోఁడు ॥వి॥ 2594

గురువువద్దనే శిష్యుని కూతలు ; పరునిదగ్గర రాణింపవు.

ఆ. దొంగమాట లాడ । దొరకునా మోక్షంబు ?
చేతఁగానికూత । చెల్లదెపుడు
గురువుపద్దు గాదు । గుణహైన్యమదియగు ॥వి॥ 2595

పై పద్యభావము పదమార్పులలో వచ్చింది ; హైన్యము = నీచము.

ఆ. దొడ్డవాఁడ ననుచు । దొరలదగ్గఱఁ జేరి
చాడిఁ జెప్పె పాప । జాతి నరుఁడు
చాడిఁ జెప్పువాఁడు । సాయుజ్య మందునా ? ॥వి॥ 2596

సాయుజ్యము = బ్రహ్మలో లీనమగుట

ఆ. దొడ్డవాండ్ర మనుచుఁ । ద్రోవ డొంకలు కట్టి
యడ్డమైన జనుల । నంటఁగట్టి
దోఁచుకొన్న యట్టి । దోష మెక్కడఁబోవు ? ॥వి॥ 2597

దారిలో ముండ్లు పెట్టుట మహాపాపము

ఆ. దొడ్డివాఁడు పెద్ద । తోడేలు నైనను
మట్టుఁజూచి దాని । మర్మమెఱింగి
గొడ్డు గొఱ్ఱె నైనఁ । గొని చననీయఁడు ॥వి॥ 2598

నిజమగు గురువు శిష్యుని రక్షించును.

ఆ. దొమ్మ తెగులుచేతఁ । దూలిన గేదెకు
వాతవేయ బ్రతికి । వచ్చెనేని
బ్రాతయెనుము పాలు । రోఁతన వచ్చునా! ॥వి॥ 2599

దొమ్మరోగము వచ్చిన ఆవులకూ గేదెలకు వాతలు వేస్తారు
(రైతు విజ్ఞానము)

ఆ. దొమ్మ మాయకొఱకు । నమ్మవారికి వేఁట
లిమ్మటంద్రి దేమి । దొమ్మ తెవులొ?
అమ్మవారి పేర । నందఱుఁ దినుటకా! ॥వి॥ 2600

అమ్మవారి జాతర అంపర బూతులు తీరుటకే.

ఆ. దొమ్మరాటవాని । దోర్బల మెల్లను
బొట్టకూఁటికొఱకె । పట్టినదగు
నదియె యోగికమర । నానంద మందఁడా! ॥వి॥ 2601

చిదానందు డగు యోగి సదానందుడగుతాడు.

ఆ. దొమ్మరింటి నుండి । తొంగిచూచుచు రాఁగ
నెఱిఁగినట్టి వార । లెదురు పడినఁ
జచ్చు నంతకంటె । నొచ్చి పాఱఁగఁజూచు ॥వి॥ 2602

“క. దొమ్మర గుడిసెల దూఱిన
ద్రిమ్మరులకు బుద్ధి తెచ్చు? ద్రిమ్మరికత్తే?”

ఆ. దొమ్మరీని లంజె । తోఁ గూడ దోసంబు
పాపజాతి మనసు । పాడుచేయు
వీడు గదలిపోవ । వేఁడెంత యేచ్చునో ॥వి॥ 2603

మోహాకాంతునకు మోహిని పోవ మూర్ఛవచ్చును.

ఆ. దొరసాని యెవ్వతె? । దొర కుమారుం డెవఁడు?
ధరణి యనఁగ నేమి? । కరణ మెవఁడు?
దీనిభావముఁ దెలిసి । జ్ఞాని కావలెనయా! ॥వి॥ 2604

ప్రశ్నోత్తరములగా పద్యమువ్రాసి భావప్రాధాన్యాన్ని గొనమన్నాడు.

ఆ. దొరసాని సొంపెల్ల । దొర కుమారుం డెరుగు
దొర కుమారుని సొంపు । ధరణి యెరుగు
ధరణి సొంపెల్లను । కరణంబు యెరుగురా! ॥వి॥ 2605

ముక్తపదగ్రస్తముతో బాహుళ్యమునందలి విషయాన్ని వివరించాడు.

ఆ. దోఁపు నిచ్చువాఁడు । తులకించు నెఱదాత
దోఁచుకొన్న వాఁడు । ద్రోహియయ్యె
ప్రాపుఁ జూపువాఁడు । పరమ పుణ్యుండయ్యె
ప్రాపుఁ జెఱచువాఁడు । పశువు వేమ. 2606

తులకించు = ప్రకాశించు; నెఱదాత = సరియైనదాత;
ప్రాపు = ఆధారము.

ఆ. దోషగుణ మనియెడి । దుర్మతి మాయచే
మోసపోయి పుట్టి । మునిఁగిరందు
దోషగుణము ముందు । దుస్సంగతులు వీడి
వేషభాష లుడుగ । వెలయు వేమ. 2607

వేషభాషలులేక వెలయమన్నాడు.

ఆ. దోషరాసిఁ బుట్టి । దోషంబుఁ దెలియక
దూషణములు సేయు । దుష్టజనులు
నరక కూపమందు । నాటియుండెద రయా! ॥వి॥ 2608

దూషణ పరులు, నరకకూపములో దూగుదురు.

ఆ. దోషకారి యైన । దూసరికాఁడైన
బగతుఁడైన వేద । బాహ్యుఁడైన
వట్టిలేని పేద । వానికీదగు నీవి
ధనికునకు నొసంగఁ । దగదు వేమ. 2609

లేనివానికిచ్చే దానమే నెఱదాత.

ఆ. దోస ముల్లు వంటి । తుర్యమందాత్మను
జూచి యూసల నటు । స్రుక్కఁజేసి
వాసనను దెలిసిన । వాఁడెపో! బ్రహ్మంబు ॥వి॥ 2610

కనీకనుపించని పరబ్రహ్మను పట్టుము.

ఆ. ద్రోహబుద్ధి నింక । దొంగతికమునను
సటలనైన సాహ । సమునన్నైన
సంప దధికు వలన । సాధించి ధనమును
బడుగునకు నొసంగ । బాగువేమ. 2611

దొంగిలించైనా ధనము బీదవారలకు పంచుట దొడ్డతనమే!

ఆ. ద్రోహి యైనవాఁడు । సాహసంబున నెట్టి
స్నేహితునికినైనఁ । జెఱుపుఁ జేయు
నూహ గలిగియుండు । నోగు బాగు లనక ॥వి॥ 2612

ద్రోహికి సర్వవిధముల దూరముండమని సూచించాడు సుజ్ఞాని.

## ధ

క. ధన, దారా, పుత్రీషణ
మనెడిది ఘన లోకవాంఛ । యగుఁ దలపంగం
దను దాఁ దెలిసిన పుణ్యుఁడు
మనుజులతోఁ జేరఁడెపుడు । మహిలో వేమా! 2613

యీషణత్రయమును యీసడించి తన్ను తాను తెలుసుకో మన్నాడు.

క. ధనపతి చెలికాడయ్యును
ఎనయంగా శివుఁడు భిక్ష । మెత్తగవలసెన్
తనవార లెందఱున్నను
తనభాగ్యమెకాని లేదు । తథ్యము వేమా! 2614

ధనపతి = కుబేరుడు; ధనపతి యీశ్వరు మిత్రుఁడయినా యీశ్వరునకు
భిక్షాటన తప్పలేదు (పూర్వగాథ)

ఆ. ధన మందంబుచేత । దైవంబు నెఱుఁగక
కుటిల భావమొంది । క్రూరజనులు
మదము మించినంత । మన్నింపఁ బోరయా! ॥వి॥ 2615

ధన మదాంధులు ఎచ్చటా పూజింప బడరు.

ఆ. ధనముఁ గూడఁబెట్టి । ధర్మంబు సేయక
యూరకుండు పాపు । లూహలేక
ధనము వెంటరాదు । ధర్మంబు సేయరో! ॥వి॥ 2616
పోయేటప్పుడు పుచ్చువక్కయైనా వెంటరాదు.

ఆ. ధనము చాలఁగూర్చి । ఘన దానధర్మమ్ము
కానరుపకయ యిచ్చుఁ । దనయులకును
దేనెఁ గూర్చి యీఁగ । తెరువరులకు నీదె ॥వి॥ 2617
వేమన సహజోక్తులు నీటుగా హృదయమునకత్తి అబాల గోపాలానికి ఆనందముగానుండును.

ఆ. ధనము లేకయున్న । ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవదేని । ధన మొనరదు
ధనము, ధైర్య మరయఁ । దగు భూమిపతులకు ॥వి॥ 2618
వేమననాటికి సామ్రాజ్య వాదులకే ధైర్య స్థైర్య ధన మదాంధత ఉండేది. కాని ఇప్పుడు రాజులు బూజుపట్టి ప్రజాప్రభుత్వముగా సామ్రాజ్యవాదులను సమయించారు.

ఆ. ధనములేని పేద । తండ్రి గర్భంబున
భాగ్యపురుషుఁ డొకఁడు । పరగఁ బుట్టి
బహుళధనముఁ గూర్చి । భద్రమార్గంబునఁ
బరుల కుపకరించి । ప్రబలు వేమ. 2619
పండితపుత్రుఁడు శుంఠగావచ్చును. పరమశుంఠని కుమారుడు పండితుఁడు గావచ్చు.

ఆ. ధనము లేమి కులముఁ । దక్కువ పడవచ్చు
ధనములేమి కీర్తిఁ । దొలగి పోవు
ధనములేమి శుచినిఁ । దగఁబట్టనియ్యదు
ధనములేమి ఘనత । తప్పు వేమ. 2620
"ధనమూల మిదంజగత్తు" యీజగత్తునకు ధనము ప్రధానము.

ఆ. ధనములేమి గుణము । తక్కువ పడవచ్చు
ధనములేమిఁ గీర్తి । తలఁగి పోవు

ధనము లేమి శుచిని । దగఁ బట్టనియ్యదు
ధనములేమి ఘనత । తప్పు వేమ. 2621
"ధనవాన్ సర్వత్ర పూజయేత్" భాగ్యవంతుఁడు ప్రతిచోట
పూజ్యుడే.

ఆ. ధనములేమి యనెడు । దావానలంబది
తన్నుఁ జెఱుచు మీఁటి । దాపుఁజెఱచు
ధనములేమి మదిని । దలపనె పాపంబు ॥వి॥ 2622
బీదరికమును దావానలముగా చెప్పెను దావానలము = అరని అగ్ని.

ఆ. ధనములేమి సుతులు । తప్పుల నిడుదురు
ధనము లేమిఁ బత్ని । తాకరాదు
ధనములే మెవనికిఁ । దాళియే యుండదు ॥వి॥ 2623
తాళి = మంగళసూత్రము, నిశ్చలత; ధనములేమి తన్నెవరూ
చూడరు.

కం. ధన మెచ్చిన మద మెచ్చును
మదమెచ్చిన దుర్గుణమును । మానక హెచ్చుం
ధన ముడిగిన మద ముడిగియు
మద ముడుగును దుర్గుణమును । మానును వేమా! 2624
ధనము తోడిదే మదమూ దానిని తప్పిస్తే ఏమియూలేదు.

కం. ధనమూ మూలము జగమున
ధనమూ మూలంబు సకల । ధర్మంబులకుం
గొనమూ మూలము సిరులకు
మనమూ మూలంబు ముక్తి । మహిమకు వేమా! 2625
ముక్తికి ధర్మమునకు సమస్త గుణగణములకు ధనము మూలము.

కం. ధనలక్ష్మినిఁ జేపట్టిన
ధన మార్జింపంగవచ్చు । ధర్మము గానే
ధనహీనులకు నొసంగెడు
ధనమే మూలంబు ముక్తి । దారికి వేమా! 2626
బీదవాళ్ళకిచ్చిన దానమే తనముక్తికి నిదానము.

సీ. ధరణిలో జదువెల్లఁ । బరమాత్మలో నాత్మ
నైక్యపడని బ్రహ్మ । కైన సొద్దు
పంచభూత ఘటిత । ప్రకృతిని దలపోసి
నిరు కెఱుంగని వాని । నెత్తి సొద్దు
పంచవింశతి తత్వ । పద్ధతి యెఱుఁగక
వేదాంతి ననువాని । మీఁది సొద్దు
అంతరంగము లోని । యానుకూల్యము లేక
యోగి నేననువాని । కొక్క సొద్దు
తాను దానైన తత్వంబు । తగులుగలిగి
వెలిని లోన నదొకటని । తెలివి దెలిసి
బ్రహ్మవేదంబుఁ గనలేని । పామరునకు
వెనుక నొకసొద్దు గల దిల । వినుము వేమ. 2632

బ్రహ్మ అరువది నాలుగు విద్యలను వేదవిద్యలుగా జేయకపోవుటచే తప్పు; మానవుఁడు మానవత్వ శూన్యుఁడయి పంచభూతములచే వంచింపబడి యుండుటతప్పు; వేదాంతి యిరువదియైదు తత్వముల దెలుసుకొనకుండుట తప్పు; యోగి హృదయస్థితుడు గామితప్పు; పామరుఁడు బాహ్యాంతర భావముల జీవేశ్వరుల సంబంధ మెరుంగక పోవుట తప్పు; మనయోగి వీటినన్నిటిని తెలిసినవాడు

చ. ధర నతి కీర్తిమంతుఁడును । దైవసముం డతిగొప్పవాఁడు మీ
ఱ రహిని గొండవీటి యభి । రాముయ నా గురువర్యుఁడాతఁడు
స్మృతియుఁ బ్రభుండవీవు నను । మానము లేదిక మీదునామముల్
స్థిరముగ నుండుఁగాకయిది । సిద్ధముసుమ్ము జగాన వేమనా! 2633

"మ. గురువున్ సర్వకళాభిరాము సుగుణున్ సూరీంద్ర భూషున్ మనో
స్థిరునిన్ వేమన నమ్మి సర్వరస సుశ్రీయోగ భాగ్యానుప్రా
ధురతత్వంబు గ్రహించి మించి, జనులన్ తోషంబుగావించుచున్
పరతత్వంబును తేటగీతులలరన్ పాడెన్ స్థిరంబొప్ప గాన్"

తే. ధరను జాత్తాన వైష్ణవుననంబు
లనెడి నామంబు లుండంగ । నవని జనులు

వేషమని యందు రే యిట । వెఱ్ఱితనము
తలఁచిచూడంగ వలె నయ్య । ధాత్రి వేమ ! 2634

వైష్ణవ సంప్రదాయములో శ్రీవైష్ణవులు, సాతానులు, నిత్యవైష్ణవులు అని యుందురు.

చ. ధరను దలారి పొందునను । దప్పక హానియె పొందునంచుఁ దా
మరయఁగఁ జెప్ప రే బుధుల । టంగన సల్పెడు చేష్ట లట్టులే
పొరలును హానియాఁజెలిమి । బొంకులు గావివి ముందుమీఁకురా
నెఱుఁగుదు రేమి చెప్పనిక । నెప్పుడుఁ బ్రాంతములోను వేమనా !

తలయారివలె వెలయాలి గూడా మాన, ధన, ప్రాణములు హరింపజేయును.

ఆ. ధరను దేవళముల । తగులు వీడిననాఁడు
తనువు గుడిగఁ । జేసి తన్ను నిలిపి
లోకబుద్ధి విడిచి । లోచూపుఁ జూడ రా ! ॥వి॥ 2636

దేహాన్ని దేవాలయంగా జేసుకోమన్నాడు దివ్యుఁడు.

క. ధరఁ బుట్టి భోగి నయితిని
బరమందిచ్చు నటుమాని । పడఁతులకై నేఁ
దిరిగి యలసితిని ద్రవ్యము
మఱి యార్జించితిని గడకు । మరణమె వేమా ! 2637

తన స్వీయచరిత్ర. వీరేశలింగంవంటి వారి కాదర్శమైనది.

ఆ. ధర విరక్తి యనెడు । దానివి విడువమిఁ
దనకుఁ దగులునెట్లు । తత్త్వ మరయఁ ?
దత్త్వ మరయఁ దాను । దానగు బ్రహ్మంబు ॥వి॥ 2638

విరక్తిలేనిదే తత్త్వము కుదురదు ; తత్త్వము కుదురక ధన్యత్వమురాదు.

ఆ. ధర్మ కంటకుండు । ధనముచే గర్వించి
సకల సంపదలను । జాలఁ దనిసి
కడకు దాను మేలుఁ । గానక చెడిపోవు ॥వి॥ 2639

ధర్మకంటకుఁడు = ధర్మవినాశకారి ; ధర్మమును పాడుచేసినవాడు తాను భ్రష్టుడౌతాడు.

తే. ధర్మపరుఁడైన పరిపూర్ణ । దాతగురుఁడు
దాన మొనరించు నంతటఁ । దత్త్వ మమరుఁ
దాను దానగు మననంబుఁ । దాకఁగ నగు
దాన సార్థక్య మప్పుడటు । తనరు వేమ! 2640

గురుదానము విద్య; విద్యచే విభూణుఁడు కాగలడు.

ఆ. ధర్మబుద్ధిచేత । దైవంబుఁ దెలిసినఁ
గాలుఁడేమి సేయఁ । గలఁడు? ప్రజల
ధర్మమంటి వెంట । దైవంబు నుండును ॥వి॥ 2641

కాలుఁడు = యముఁడు; ధర్మమే దేవుఁడు, దేవుడే ధర్మము;

ఆ. ధర్మమన్న వినరు । తనువునమ్మిన నరు
ల్యముని వారువచ్చి । యడలఁ జేసి
చొచ్చికట్టి తమరు । చోరఁబారఁ గలరొకో! ॥వి॥ 2642

ధర్మానికి మించినది ధాత్రిలో లేదు.

ఆ. ధర్మ మరసి పూని । ధర్మరాజాదులు
నిర్మలంపుఁ బ్రౌఢి । నిల్చిరొనిరి
ధర్మమే నృపులకుఁ । దారక యోగంబు ॥వి॥ 2643

ధర్మస్వరూపాన్ని వేమన్న సర్వస్వము తెలిసి జనులకు చెవులు
గింగురించ చెప్పెను.

ఆ. ధర్మమార్గములనుఁ । దప్పుగాఁ జూచునుఁ
గర్మజీవి మేలుఁ । గానఁలేఁడు
నిర్మల హృదయుండు । నీరూపమున నుండు ॥వి॥ 2644

నిర్మలహృదయుఁడు శర్మద మిచ్చిన శివుని వశౌ నుండును,

ఆ. ధర్మమునకుఁ గీడుఁ । దలఁచినవాఁడు తా
దుష్టమార్గుఁ డగును । ద్రోవనె చెడు
గురువుపత్నిఁ గవయఁ । గోరెడు హీనుండు
మొదలు సెడఁడె ముప్పు । మూఁడి వేమ. 2645

గురుసతీ సంగమము గోరుట కుంకటి వేరుతో నశించుటకే!

ఆ. ధర్మ సత్యములను । దప్పఁగా చెడఁబుచ్చి
కర్మజీవి మేలుఁ । గానలేఁడు
నిర్మల హృదయుండు । నీరూపమున నుండు ॥వి॥ 2646

చక్రాని హృదయము సాక్షాత్తు శంకరుఁడే ?

క. ధర్మార్థ కామ మోక్షము
లర్మిలి మదిఁ దెలిసినంత । నామోదంబా !
నిర్మలగతిఁ దాఁ గనవలెఁ
గర్ములకును లేదు ముక్తి । గదరా ! వేమా ! 2647

నిర్మలము లేని కర్ములకు శర్మద మెట్లు గలుగును ?

క. ధ్వనిపుట్టిన నాలించుచు
ధ్వని మధ్యమునందుఁ జేరి । ధ్వని తానై తాఁ
గనుపించు నంతఁ దన హృ
ద్వనజంబునఁ జూడ ముక్తి । వశమగు వేమా ! 2648

హృద్వనజము = మనఃపద్మము : ఓంకారమైన ప్రణవనాదాన్నా
లించుటే పరమార్థము.

ఆ. ధాత్రిజనుల కెల్లఁ । దగనెఱింగించెద
నొనర హారు నెఱుంగు । నుపమ యొకటి
మనసు చెదరనీక । మహిమతోఁ జూచుటే ? ॥వి॥ 2649

వేమన అష్టసిద్ధుల కధిపతియగు ఆదిశంకరుని వశపరచుకొను
తత్త్వమును గ్రంథమంతటా వాడెను.

ఆ. ధారదత్తమైన । తామ్రపు పలకలు
లావుయుంగరమున । లంకఁ జేసి
యడియమీఁద ముద్ర । యమరియుండంగను
నదిగో శాసనంబు । యవని వేమా ! 2650

ధారాదత్తము = నీటితో చేసిన దానము. వైష్ణవమతచిహ్నములు
వర్ణించెను.

ఆ. ధార్మికునకు గాని । ధర్మంబు గనరాదు
కష్టజీవి కెట్లు । కానఁబడును ?
నీరుచోరమి లోతు । నిజముగాఁ దెలియదు ॥వి॥ 2651

సహజోక్తిని ప్రజారంజకముగా ఉల్లేఖించెను.

ఆ. ధ్యానివలెనె యుండు । మౌనివలెనె యుండు
భోగివలెనెయుండు । రోగివలెనె
సకలమునుదెలిసిన । సర్వజ్ఞుఁడై యుండుఁ
బరమయోగి యిలను । బరగ వేమ ! 2652

"గీ. చూపులోనన యొకవింతచూపుజూచు
నడకలోననె యొకవింత నడక నడచు
నవ్వులోననె యొకవింత నవ్వునవ్వు
యాతడబాసనాధ్యుండు అరయవేమ" (ఆచారి)

క. ధూమాదుల నావృత్తమై
వ్యోమంబునకెగసి కలియు । నుపమను దనలోఁ
శ్రమించు శివునిఁజేరును
కామాదులఁ గలియఁ డతడు । ఘనముగ వేమా! 2653

ధూమము — పొగ ; వ్యోమము = ఆకాశము ; మాయను భస్మము
జేయను మాధవులో గలియుము.

ఆ. ధైర్యయుతున కితర । ధనమైన నదురేమి
దాన మిచ్చినపుడె । తనకుదక్క
నెలమి మించు పనికి । నెవరేమిసేయుదు ?
రడుగు దప్పఁ దప్పుఁ । బిడుగు వేమ ! 2754

యేవిధినైనా దానము చేయుట ధర్మము.

## న

క. నందన సంవత్సరమునఁ
బొందుగ గార్తికమునందుఁ । బూర్ణిమనాఁడీ
వింధ్యాద్రి సేతువులకును
సందున నొకవీరుఁ డేలు । జాటర వేమా ! 2655

వేమనే నందన సంవత్సర కార్తీకశుద్ధపూర్ణిమనాడు జన్మించినట్లు
యీపద్య మొప్పు చున్నది.

క. నందఁనుడు పెఱిఁగి పెద్దల
కందఱికి విధేయుఁడైన । నానందమగుం

బొందికఁ జెడి సత్పురుషుల
నిందనుఁ బడఁ జింతగలుగు । నిక్కము వేమా ! 2656

పుత్రోత్సాహము పుత్రునిజన్మవలన గాక వానిగుణగణముల వలన గలుగును.

తే. నందిదుర్గముపై నుండు । నాతిఁ గూడి
ముందు వెనుకకుఁ దొలఁగక । ముచ్చటాడి
పొందుఁగోరినవాఁడెపో । పూర్ణుఁ డరయ
మందునికిసెట్టులిదిగల్గు । మహినివేమ ! 2657

వేరు శిఖరమునుజూచి మేల్మిని గనమన్నాడు.

ఆ. నందుఁడైన యాతఁ । డిందు నందనకుండు
నన్ని తావులందు । హరునివలెను
తెలియువారికెల్ల । దేవుఁడై కాన్పించు ॥వి॥ 2658

“ఆనందో బ్రహ్మ” సదానందమే బ్రహ్మత్వసిద్ధిసాక్షి.

ఆ. నక్కనోటి కండ । నదిలోనిమీనుకై
తిక్కపట్టి విడిచి । మ్రొక్కు చెడఁగ
మక్కువపడి గ్రద్ద । మాంసమెత్తుకపోవు ॥వి॥ 2659

నక్క మాంసపుముక్క కథ అక్కజముగా వర్ణించాడు (కేయూర బాహు చరిత్ర)

ఆ. నక్కపోతెఱుఁగునె । నతగురులింగనిఁ
గుక్కపోతెఱుఁగునె । యొక్కప్రొద్దు
ముక్కిడిది యెఱుఁగునె । మోక్షంబుత్రోవయు ॥వి॥ 2660

నత = నమస్కరింపఁబడిన ; లింగ = ఈశ్వరుని; దేబెలు దివ్యలను గనుటెట్లు ?

ఆ. నక్క బొక్కను తోఁక । నాడించికొని విడిచి
*నెండ్రకాయనుఁ బట్టి । నమలి తినును
కుక్క నక్కనుబట్టి । ఘనకాట్టమునఁ బెట్టు ॥వి॥ 2661

* యతిపోయినా గతితప్పకుండా జానపదుల తెలివిని పండితుల కందించాడు.

ఆ. నక్కవినయంబులు । నయముగాఁ జేసెటి
*నీతిదప్పిన నరుల । నమ్మరాదు
కాదని నమ్మినా । కడ కష్టమొచ్చురా! ॥వి॥ 2662
యతిపోయినది; నక్కవినయము = పై మెరుగు లోపల పురుగు;

ఆ. నక్కవినయములును । నైగారములు పల్కి
కుడువకెల్ల ధనముఁ । గూడఁబెట్టుఁ
కొక్కు బోనువాతఁ । గూడు చల్లినరీతి ॥వి॥ 2663
నయగారము = ముఖప్రీతి వచనములు; లుబ్ధుని పందికొక్కుతో పోల్చాడు.

క. నగజాతకుఁ దన దేహము
నగపాలుగ నిచ్చువాని । జపమూనుమయా!
పగఁదీఱ్ప నేర్పకున్నను
మగవాఁడా మగువఁగాక । మహిలో వేమా! 2664
నగ = పర్వతము; జాత = పుట్టిన పార్వతి : ఆలీ మగల పాలయల్కలు తీర్చలేకున్న ఆడారివాడు.

తే. నచ్చుపడు బుద్ధిలోపల । నడవఁబోదు
చొచ్చి నిర్భయవృత్తిలో । సూక్ష్మమెఱిఁగి
ముచ్చువలె రిచ్చ మైకొన । ముఱియుచుండు
దచ్చనలుగావు యోగి సా । ధనము వేమ. 2665
దచ్చన = దక్షిణ; (జాను తెనుఁగు) వేమన అచ్చతెనుగు నుడులు వాడుటలో కూచిమంచిని కూడాడు.

ఆ. నచ్చుసేయరాదు । నమ్మి నైక్యమునకు
ముచ్చెఱుఁకను ముంగి । ముదము గాంచి
చొచ్చి బయలుచేరి । సొమ్మసిల్లును యోగి ॥వి॥ 2666
ముక్తి కాంతాలోలుఁడ రక్తితో సంగమించి రక్తిని గోలుపోతాడు.

క. నడజీవులు, స్థావరములు
వడిఁ జనిపోవంగ నెఱిఁగి । భావములోను

న్విడువక బ్రహ్మముఁ దలఁపరు
వడి చనిపోకుందు రేమొ । వసుధను వేమా ! 2667

జంగమ స్థావరములకు చావులేకుండు నా !

క. నతిఁజేసి పతిని వేడెదు
సతి మర్మము గానవచ్చు । సర సోక్తులనే !
మతి పోక లడఁచిపట్టిన
సతి దుర్గతి వీడినదగు । సత్యము వేమా ! 2668

నతి = వేడుట ; మతిచాంచల్యములేని సతి మానవతి.

క. నది నుదకంబులు చనుక్రియ
మదిఁ బొడమెడు తత్వవిధుల । మహిమాన్వితులై
పృథివిని గల నరులాదవఁగ
బదపడి సద్గతులు పొంద । బాగగు వేమా ! 2669

వాహినివలె మానసప్రవాహముపొందిన సద్గతులు పొందుదురు. యిది సర్వలఘు కందము.

క. నది యుదకంబును బ్రియమగు
మది నొదవెడు తత్వబుద్ధి । మగ్నత లెన్నం
దుదపదవి గలియ ఘనమగు
నుదధిఁ బ్రవేశించు గంగ । యొప్పగు వేమా ! 2670

క. కడలిపడు కడలి పడతుక నడకల వడిదుడుకు లిడుచు నడవడి కడిమిన్
వెడవెడ పడకను నిడు తనకడిది హృదయ మపరపడతికడ నిడు ఘనుడా.

ఆ. నదుల నామమువేఱె । నదులెల్ల నొక్కటే
మత్స్య నామమువేఱె । మత్స్యమొకటె
కప్పనామమువేఱె । కప్పెల్ల నొక్కటే ॥వి॥ 2671

నామభేదములే గాని జగన్నాథుడొకడే.

తే. ననయుచుండెడి జ్ఞప్తి నం । టునదికాక
ధ్యానమమరంగఁ బెర జ్ఞప్తిఁ । దాకినంత

స్వానుభవ పూర్ణమై యొప్పు । సజ్జనులకుఁ
గనఁ గలారలు మాత్రమే । కాంత్రు వేమా ! 2672

సజ్జనులే సత్యధాన్ని గాంచగలరు.

కం. నభమైన నందవచ్చును
నిభమును బట్టంగ వచ్చు । నిమిడికలోనే
వ్యభిచారి మనసు నిలుపఁగఁ
బ్రభువులకును సాధ్యపడదు । పై కొను వేమా ! 2673

వ్యభిచారినిపట్ట వ్యభిచారి గావలయును. నభము = ఆకాశము ;
ఇభము = యేనుగు.

ఆ. "నమనమో" యనవచ్చు । "నారాయణ" నవచ్చు
మేలువారిఁ జూచి । మెచ్చవచ్చుఁ
గొంగు కాసు నడుగ । గొబ్బున నీలేఁడు ॥వి॥ 2674

లోభివాడు కబురులు చెప్పుతే కానీయీాడు.

ఆ. "నమ శివ" యనవచ్చు । "నారాయణ"నవచ్చు
మేలువారి నమ్మి । మెచ్చవచ్చు
కొంగు కాసు విడిచి । గొబ్బున నీరాదు ॥వి॥ 2675

శివపంచాక్షరి, నారాయణబుసాక్షి అవలీలగా పలుకును గాని లోభి
కానీ యీాయలేడు.

ఆ. నమ్మినట్టి యుండి । నౌక భూతమనంగఁ
జాపఁ బొరల వేసి । చక్కఁబోవు
నీతగాఁడయిన న । టులఁ బోనిచ్చురా ! ॥వి॥ 2676

నౌక = పడవ ; పడవను దాటించుట యీాతగానికే సాధ్యము

ఆ. నయన దృష్టిమీాఱ । నడవడి గుత్తించి
భయములేక నొక్కి । బయలు వడక
స్వయము జ్యోతినంటి । సౌభాగ్యమందురా ! ॥వి॥ 2677

నయన = కన్ను ; కంటిచూపుచేత మింటిని జూస్తూ ముక్తి వాల్కంటి
నంటి మురియ మన్నాడు.

ఆ. నయముగాను దృక్కు । నాళంబులో నొంచి
భయముమాని పట్టి । భ్రమలఁ ద్రొక్కి
న్యాయముగాను బుద్ధి । సాధించి చూడరా! ॥వి॥ 2678
నేత్ర నాళములో నీలోనీవ చూడుము నారాయణుడు నిల్చియున్నాడు.

ఆ. *నరక మెక్కడిదని । నీతిఁదప్పిన జనులు
*మాయ సంసారమున । మునిగి నారు
మనసు నిర్మలమైతె । మాయనుంచే మాను ॥వి॥ 267
* రెండుయతులు తప్పి నిండుభావం మెండు కొని యున్నది యీపద్యములో.

కం. నరకులమునఁ దాఁబుట్టియు
నరకులమునఁ దానుఁ బెఱిఁగి । నరుఁడయ్యెను దా
నరకులమున ఛీ ఛీ యన
హరకులమునఁ బెరుగునేని । హరుఁడౌ వేమా! 268(
హరుని నిరంతరము చింతించినవాడు హరుఁడే ?

కం. నరజన్మముఁ దానెత్తియుఁ
బరమాత్మనెఱుంగలేక । పాపాత్ముండై
కొఱగాని పను లొనర్చిన
దిరిగి యధోగతికి నేగుఁ । దిరముర వేమా! 26
కొరగాని = చెడ్డ ; జన్మసాఫల్యమునకై జాడలెరిగినవాడే జనుఁడు.

ఆ. నరుఁడటఁ బరమాత్మ । గురినిఁ జేరినపుడ
హస్తమందు మోక్ష । మపుడె చూపు
విరివి సిరిసంపదలను । విఱ్ఱవీఁగిన జీవి
పరమెఱుఁగడు యముని । పాలె వేమ. 2682
గురువును జేరినవాడు పరమును జేరును.

ఆ. నరుఁడయినను లేక । నారాయణుండైన
దత్వబద్ధుఁడైన । ధరణి నరయ
మరణ మున్నదనుచు । మది నమ్మవలె సుమ్మి ; ॥వి॥ 2683
యెట్టివారైన గిట్టుట తప్పదు.

ఆ. నరుఁడు జాగరమున । నటియించుచుండును
నరుని కీలను జాగ్ర । తరుదు సుమ్మొ
నరుఁడు జాగ్రతనుట । ధరణిలోఁ బరమాత్మ ॥వి॥ 2684

" జాగ్రతాభయంనాస్తి " మెలుకువ గలిగియుండుట మేలుగలుగును.

ఆ. నరుఁడు నిల్కడగుంటె । నారాయణుం డాయె
నారాయుఁడే గదా । నరుఁడు ఆయె
నారాయణుని సిగ్గు । నరుఁడు పోగొట్టఁడా ॥వి॥ 2685

నరుఁడు జాగ్రత్తగా యున్న నారాయణుడు గాడా ?

ఆ. నరునికి నాయుస్సు । నూరుయేండ్లని బ్రహ్మ
నొష్ట చట్టముఁ వ్రాసి । సృష్టికంపె
నిద్ర మోహము వల్ల । నర్ధాయు వాయెరా ! ॥వి॥ 2686

పదముల పొందిక కుంటువడినను భావము మాత్రము బాగుగానే యున్నది.

ఆ. నరుని బిందువునను । నాతి గర్భముఁగట్టు
రాతియుప్పుచేత । రసముఁగట్టు
బుద్ధి తెలివి యున్న । భువనంబుఁగట్టదా ॥వి॥ 2687

మానవోత్పత్తి క్రమము, పాదరస బంధన ప్రక్రియ, వేదాంతము తిశాస్త్ర సంపుటీకరణము.

ఆ. నరుని సద్గురునంపు । నమ్మనియ్యదు మాయ
సమయ భేదముఁజూచి । మమతనుంచు
బ్రహ్మదేవుఁడుఁ జేయు । భ్రష్టత్వ మిదిగదా ! ॥వి॥ 2688

ఆ. మాయచేత నరుఁడు మరి నమ్మగాలేడు
గురిని వెదకు తెలివి కుంటుఁబడ "

ఆ. నరులు నీపుడమిలో । నిందఁజేసితె నేమి
మంచివాఁడని లెస్స । నెంచితేమి
గురునికి ఒప్పించి । గురితప్పకుండురా! ॥వి॥ 2689

* యతి తప్పు ; మానవ నిందాస్తుతులతో పనిలేదు.

క. నల్లని సతి నొల్లని పతి
పుల్లాంబుజనేత్రఁ గోరు । బుద్ధిని గుదురై
యల్లది యొప్పినమేలే ?
కల్లరి యైనంత నొల్ల । గలఁడా! వేమా ! 2690

రూప, నామములజూడక గుణములుగల్గిన సతిని గ్రహించిన వాడే గణనీయుడు.

ఆ. నల్లబోడితలలు । తెల్లని గోంగళ్ళు
నోడలఁ బూదిపూఁత । యొంటిరోఁత
యిట్టివేషములవి । పొట్ట నింపనె సుమీ ॥వి॥ 2691

పొట్టను పోషించుకొరకే బూటకపు వేషాలు :

క. నలుగురి దొంగలఁ బట్టుక
తలఁగొట్టఁగ వలయు కొకనిఁ । దగఁమన్నింప
న్వలెరా ముచ్వురిఁదీరిచి
యిల లోపల నెఱుఁకఫలమె । యిదియగు వేమా ! 2692

యీషణత్రయాన్ని యీసడించి మనస్సును మన్నింప మన్నాఁడు.

క. నలుగురి దొంగలఁ బట్టుక
తలఁ ద్రుంపకయున్నయట్టి । తామసికేలా
కలుగును జ్ఞానము ధర ని
శ్చలపాలన మాత్మసుఖము । సత్యము వేమా ! 2693

ధర, అర్థ, కామ, మోక్షముల నాల్గిటిలో ఆఖరుది పట్టి మొదటి మూడు విడువ మన్నాడు.

ఆ. నలుగురు ఒకతైతె । నమ్మనిత్తురు గురుని
నలుగు రొకటనకుంటె । నమ్మనియరు
నలుగురుని నలగొట్టి । నావు నీవై నావు ॥వి॥ 2694

చతుర్విధ పురుషార్థములు చేపట్టి నీలో నీవు జూచుకొనుము.

క. నలుగురు గలచోటను దాఁ
దలచూపుచు మెలగుఁచుండి । ధన్యతఁ గనఁగాఁ

దలఁచెడి యాతఁడు నిచ్చలుఁ
గల మాటలె పలుకుచుండఁ । గాఁ దగు వేమా ! 2695

నలుగురు నడచునది బాట నలుగురన్నదే మాట.

ఆ. నలుఁ డల దమయంతి । నలరుఁగఁ బెండ్లాడి
పుష్కరునకు నోడి । భూమి విడిచి
భార్యతోడఁ దానుఁ । బటు పేదఁదనమున
నడవిఁ దిరుగలేదె ? । యపుడు వేమ. 2696

" కాలకర్మవశము కాకపో " దనునట్లు నలచరిత్రచెప్పెను (భారతము)

కం. నవ్వును, జదువును బాడును
నొవ్వక తానిట్టె, చెప్పు । నుడువునె మఱచు
న్నివ్వటిలి యుండు ముదిమిని
నివ్విధమునఁ జూడఁ జూడ । నెవ్వఁడు వేమా ! 2697

హావ, భావ. శృంగార వాక్చాతుర్య కార్యములు ముదిమినిగూడ
మోహిను జూపును

ఆ. నాకు నెవరు దిక్కు । నడి నాళములలోను
వేగుచుక్క వంటి । వెలుఁగె దిక్కు
వెలుగుకంటె దిక్కు । వెదకంగ లేదయా ! ॥వి॥ 2698

బ్రహ్మనాళమందున్న పరంజ్యోతి దిక్కు.

ఆ. నాగుఁబాము గన్న । నంబి బ్రాహ్మణుఁ గన్న
జెవుల పిల్లి గన్నఁ । జేటువచ్చు
గురుఁడినిఁ గనుఁగొన్నఁ । గల కోర్కె లీడేరు! ॥వి॥ 2699

* యతి పోయినది. శకున శాస్త్రమును సాకల్యముగ జదివి
యుంటాడు వేమన.

తే. నాటి వినవచ్చు బ్రణవంబు । నాకమందు
నూటిఁ దప్పక మదియందు । సూత్రపఱచి

కోట దాటిన నిశ్శబ్ద । కూటమగును
వాట మగుదీనిఁ దెలియంగ । వలయు వేమ. 2700
తొలిపలుకులు చిలుకుపలుకు జిలిబిలి మధురసము లొలయించి
దాంతుల మనము లుబ్బూత లూగించు వేమన కవిత.

కం. నాటుము గురువర మంత్రము
దీటుగ మదియందుఁ జేర్చి । ధీరుఁడవగుచు
న్దాటుము నినుఁ గనుచోటికిఁ
గోటికిఁ బడగె త్త నేమి ? । కుదురుర వేమా ! 2701
కోటికి పడగెత్తే భ్రాంతివదలి నీచోటు సూటిగా తెలుసుకో !

కం. నాడీ చక్రముఁ జూడఁగ
నాడులు పది ముఖ్య మల్ల । నాడుల లోనం
గూడలి నాసిక కుడియెడ
మూడును నిడపింగళాఖ్య । ములఁ దగువేమా ! 2702
నాడీ దశకములో యిడ, పింగళ నాడులు గొప్పవన్నాడు.

ఆ. నాడెమైన చెడిప । నయ మెఱింగి విరుగు
విటుని కు స్తరించు । వివర మెఱుఁగు
బానిసైన తొత్తుఁ । బాటింప రాదయా ! ॥వి॥ 2703
మంచిలంజ విటుని మమకారమే గాక మంచిగా జూచును.
కుస్తరించు = సంతోషపెట్టుట.

ఆ. నాణ్యమెఱుఁగు లంజ । నలుపు మేలెఱుఁగును
విటుని కుస్తరించు । విధ మెఱుంగు
దాసితోటి చెలిమి । ధరకొఱఁ గాదయా ! 2704
దాసీదాని దాంపత్యాన్ని తగదన్నాడు.

ఆ. నాణెమైన లంజె । నగవు మేలు నెఱుంగు
విటునిఁ గు స్తరించు । వివర మెఱుఁగు
బానిసైన దాని । పాటిఁ గోరఁగ రాదు ! ॥వి॥ 2705
మూడుపద్యముల పోడిమిఒక్కటే ? భావము పద మార్పులున్నాయి.

ఆ. నాతి కడుపు నిలుచు । నౌర ! బిందువుచేత
జాతిపువ్వు చేత । రసముఁ గట్టు
భూతలమున మనసు । బుద్ధి నీఁగట్టురా ! ॥వి॥ 2706
ఉత్పత్తిక్రమములు యోగి బాగుగా యెరిగినవాడు

ఆ. నాతిపైని ప్రేమ । నానాఁటికిని రోఁత
జ్యోతిపైని ప్రేమఁ । జూడఁగాను
మాతపైని ప్రేమ । మర్యాద యానెప్డు ॥వి॥ 2707
ఆటవెలదికి యతులను గలపి ప్రాసగు ప్రాసనియముల గలపి
భాసుర ప్రకాశము జూపేడు మహాకవి.

తే. నాదంబె బ్రహ్మంబు । నాదంబె విష్ణువు
నాదంబె శివమూర్తి । నౌతరించె
నాదంబె ప్రణవంబు । నమ్మిఁమనసున జూడ ॥వి॥ 2708
త్రిమూర్తులు గూడా నాదాంతర్గతులే; నాదము =ధ్వని.

క. నాదంబెఱిఁగిన యోగి య
భేదము పంచాక్షరముల । బీజము నెఱుఁగు
న్నాదము ముక్తికి మదిలో
సాధకమని జనులకెల్ల । సాటర వేమా ! 2709
ప్రణవ నాదము తెలిసిన బ్రహ్మము పట్టుబడును.

ఆ. నాద బిందు కళల । నయమొంది యాత్మయం
దంటి చపలచిత్త । మమర నిల్పి
బ్రహ్మరంధ్రముననుఁ । బ్రబలిన యోగియా ॥వి॥ 2710
బ్రహ్మరంధ్రము జూచినవాడే యోగి.

నాదములు:—

1. జల, 2. భేరీ, 3. మృదంగ, 4. ఘంటా, 5. శంఖా. 6. వీణా, 7. వేణు, 8. తాళ, 9. చిణి, 10. చిణిచిణీ (ఓంకారము)

1. హకారము, 2. బింపువు, 3. సకారము. ఇవియే నాదు, బిందు, కళలు ; ఇవే తమ్ము నమ్మిన వారిని సంసార బంధమున హరించునవి గావున "హంస" యనఁబడును.

1. నాదము :— "అ" కారము, "త్వం" పదము, జాగ్రత్బ్రహ్మ.
2. బిందువు :— "ఉ" కారము, తత్పదము, స్వప్నము, విష్ణువు
3. కళ :— "మ" కారము, అసిపదము. సుషుప్తి, శివుడు.

క. నాదము నెఱిఁగిన యోగియు
మోదంబున జీవునెఱిగి । ముక్తియు దానౌ!
నాద ముక్తిపద మని
సాదరమున జనులకెల్ల । సాటర వేమా! 2711

నాదజ్ఞానము గ్రహించినవాడే వేదాంతవేది.

క. నాదము బిందువు బిందువు
నాదంబుగఁ జేసి కళను । నాదును బిందు
న్నాదుగఁ జేసియు నీయొక
నాదంబునెచూడ యోగి । నాథుఁడు వేమా! 2712

నాదు, బిందు కళాతీతుడే యోగిఅనబడు.

ఆ. నాద మలరఁ జేసి । నాదము బొంగించి
భేద మింతలేక । పెనఁగి నప్పుడు
పాఱు కాల్వవలెను । బాఱురా! యీనాదు ॥వి॥ 2713

నాదజ్ఞానము తెలసి ప్రోద్బలమున సాగించినవాడే పూర్ణుఁడు

క. నాదముఁ దెలిసిన యోగియె
వేదాంతములోన నున్న । విధిఁ దెలుపు మది
న్నాదంబె ముక్తిపద మని
యాదరమున జనులతోడ । ననరా వేమా! 2714

నాదమును అంతటా చెలిపినవాడే నరుఁడు

క. నాదమును బిందుకళలను
గాదనకయె వినియుఁ గనియుఁ । గడుజిత్రముగా
మోదించి దాటకున్నను
భేదము నొందించు నెఱుక । పెంపై వేమా! 2715

"హంస హంసేతి యోద్బ్రూయాత్ హంసో నామ హరిశ్శివః
గురువక్త్రాత్ లభ్యతే ప్రత్యక్షసర్వతోముఖమ్ (బ్రహ్మవిద్యోప
నిషత్తు) హంస సంఖ్యలను గురుముఖముగా దెలియును.

క. నాదము బ్రహ్మం బనుచును
వేదములను జదువవచ్చు । విని కనినంత
న్నాదంబు లేని బయలున
నాదాంతమె పూర్ణపదవి । నయముగ వేమా! 2716

వేదములలోని నాదమును వెదకి తెలిసికొనుము.

క. నాదము ముక్తికిఁ దెరువగు
బాదును దెలియంగ నగును । బరిపక్వముతో
భేదంబు మాని మదిలో
వేదికపైఁ జేరి వినుము । విడువక వేమా! 2717

నాదమును పరిపూర్ణముగా దెలిసిన ముక్తిఁగల్గును.

ఆ. నాద మెక్కడఁబుట్టె? । భేద మెక్కడఁబుట్టె?
వాద మెక్కడఁబుట్టె? । వసుధలోన
యోగిజనులకు రాజ । యోగంబు నిదిచూడ ॥వి॥ 2718

నాద, భేద, వాదముల కన్న రాజయోగమే మిన్నయని వేమన్న కన్నది చెప్పెను.

ఆ. నాది నీదటంచు । ననువుగాఁ బల్కినఁ
గాదు కా దటంచుఁ । గాలఁద్రొక్కి
పాదుకొనెడి యుక్తిఁ । బడయనివారికిఁ
జేదుపుట్టి ముక్తి । చెడును వేమ. 2719

భేద భావంగలవారు భేదముల బాలగుదురు.

ఆ. నాదు నాదుఁ గూడి । నామరూపం బైన
నాదులోన నాదు । నాటి యుండు
నాదుఁ జేయువారు । మోదింప లేరయా! ॥వి॥ 2720

నాదులోనుంచి నాదమును నాటించినవాడే నయమగు యోగి.

ఆ. నాదు నాదుఁజూడ । నాతుల యందుండు
నిందు లేక లోక । నరులె లేరు
భేద ముడిగి దీనిఁ । బ్రియపడి కనుఁడయ్య ॥వి॥ 2721

స్త్రీల యందుండు భ్రాంతులను, సాదరముగ సమయింపుము

ఆ. నాదు బిందు కళల । నయమొంది యాత్మయం
దంటి చపలచిత్త । మమర నిల్పి
బ్రహ్మరంధ్రమునను । ప్రబలిన యోగిరా ! ॥వి॥ 2722

కళాతీతుఁడే అకళంకమూర్తి.

ఆ. నాదుబిందు కళలు ।నానా విధాలుగా
నమ్మఁ జూచినవారి । నెమ్మనంటి
కనుల పండువుగాను । కనుపడును క్షణమందు ॥వి॥ 2723

నాదబిందు కళల నమ్మిన నాశనములేదు.

ఆ. నాదు బిందుగ జేసి । బిందు నాదుగఁజేసి
నాదు బిందు కళయు । నాదుఁజేసి
నాదునాదుఁ జూడ । నా నాదు యోగిరా ! ॥వి॥ 2724

"సోహం, హంసో" అనునట్లు అక్షరముల అనులోమ విలోమ
ములుగా జేసినవాడే భాసురమగుయోగి

ఆ. నాథుఁ డున్నయట్టి । నవబోడి యాతని
దేవుఁడనుచు నెంచి । సేవచేయఁ
దగును గాని యొరునిఁ । దానంటవచ్చునా ? ॥వి॥ 2725

పడతికి పతియే దైవము ?

కం. నా మన సనుకొని మనుజులు
కామినులనుఁ గూడి పూర్వ । కర్మంబునఁ దా
మేమేమి పనులఁ బూనినఁ
బాముల కిరవగుచు నుండు । భద్రము వేమా ! 2726

గొప్పవాళ్ళమనే భావంతో తిప్పలు బడుదురు

ఆ. నారాయ ణనవచ్చు । నమశ్శివ యనవచ్చు
మేలువారి నమ్మి । మెచ్చవచ్చుఁ
గొంగు కాసు విడిచి । గొబ్బున నీరాదు ॥వి॥ 2727

మాటలు తేటగా జెప్పవచ్చు సాటివారికి సాయం జేయలేదు.

ఆ. నాల్గు నాలుగింట । ననువుగాఁ దగుఁగాని
నాలవ యిలువాని । నయ మెఱుఁగరు
అట్టివాని నరయు । నాతఁడే శివయోగి ॥వి॥ 2728

చతుర్విధ పురుషార్థముల సక్రమముగానుంచి చతుర్థగృహమయిన మణిపూరకాధిపతి యగు మహేశుని గాంచవలయును.

కం. నాలుగు వీథుల మధ్యను
మేలుగ బ్రహ్మంబు నుండు । మెలఁకువతోడం
జాలగ గురు మూలంబున
వీలుగ బొందంగ నగును । వినరా వేమా! 2729

ఆశ్రమ చతుష్టయమునందుండి అభవుని అర్చించమన్నాడు.

సీ. నా వదినెయు నాఁడు । నవరత్న భూషణ
ములు ధరించిన యంద । మలరఁజూచి
యా భూషణములు నా । రాంగనకేఁ బెట్ట
వలెనని తోఁచి నా । వదినె కడకుఁ
జనియు నీకున్న భూ । షణము లిమ్మని యన
నడ్డబాసయె । తక్క నన్ని యొసఁగె
ముక్కుభూషణ మది । ముఖ్యమైనది దాని
నీకున్న బ్రాణమ్ముఁ । లేగు నంటి
నట్టులైనను గొనిపొమ్మి । యనుచు నిచ్చి
యల్ల వెలయాలి కీ భూష । ణాదు లిడియుఁ
జీఁర, అవికయు, విడిపింపఁ । జేసి చూడు
మనియె నటు చేయ రోసె నా । మనసు వేమ. 2730

సిగ్గువీడి ఎగ్గులు పడగల యెవ్వారికైన నిగ్గగు నీతివాక్యమును స్వీయ చరిత్రతో చిత్రించి చెప్పాడు వేమన.

ఆ. నాసికందు దృష్టి । నయనించు యోగికి
వాసి వెన్నె లేల? । వసుధలోనఁ
గాశినాథు డతఁడ । గణుతింపలేరయా! ॥వి॥ 2731

ముక్కుతుదను వీక్షించుచునే ముక్కంటిని జూచుట.

ఆ. నాసికంబున దృష్టి । నాల్గు జాములు నిల్పిఁ
గాశీశ్వరునిఁ గోరి । కదలకుండె
అట్టియోగిని చూచి । చుట్టి (మ్రొక్కఁగవలయు ॥వి॥ 2732

నాసికాగ్రము జూస్తున్న నానాటికి కాశీనాథునిలో గలియును.

ఆ. నాసికంబు నడుమ నసుఁ । జూచు యోగికి
వాసివన్నె లేదు । వసుధలోనఁ
గాశినాథుఁడైనఁ । గనఁగలండా ! యోగి ॥వి॥ 2733

"భూచరీ" యోగంతో నాసికాగ్రము చూచును.

తే. నాసికాగ్రపుఁ జూపున । నట్టుపడఁగ
బుద్ధి నొక్కుచు గురుశక్తి । పూనినప్పుడు
ముద్దు గుల్కెడు తనయాత్మ । మూలమగును
దానఁ బరిపూర్ణతకుఁ దగు । దారి వేమ. ·734

బుద్ధినొక్కి పరిపూర్ణమును జూడుము.

ఆ. నాసికాగ్రమందు । నయముగా గుఱి నిల్పి
వాసిగాను జూడ । వశ్యమగును
గాశికంచులఁ గనఁ । గడగండ్లు పడనేల ? ॥వి॥ 2735

"ఆ. కాశికేగ నేల ? కడగండ్లు పడనేల ?
ముక్కుతుదను జూడు ముక్తిగలదు ?"

ఆ. నాశికాగ్రమందు । నయమునఁ జేర్పక
మూసి మూయక కను । మూల మందుఁ
జూచి చూడ నతఁడె । శుకయోగి యగుఁ దన్నుఁ
బాయకున్న నాఁడె । పరము వేమ. 2736*

నిమీలిత నేత్రములతో నిటలతటమును జూడుము.

ఆ. న్యాయశాస్త్ర మరయ । నన్యాయము నడించు
ధర్మశాస్త్ర మొసఁగు । దుర్మతంబు
జ్యోతిషము జనముల । నీతులతప్పించు ॥వి॥ 2737

దీనిలో న్యాయశాస్త్రానికి ప్రాధాన్యత ఇచ్చినాడు.

ఆ. నింగి నెగయువాఁడు । నెఱి లోకమున లేఁడు
బంగిఁ ద్రాగువాఁడు । బలియఁబోఁడు
కొంగ యోగములను । గోర్క లడంగునా ! ॥వి॥ 2738

నింగి = ఆకాశము ; బంగి = సారాయంటి మత్తుపదార్థము :
యదార్థమును మోమోటము లేకుండా విమర్శించెను.

కం. నిండినమతమున వెదకిన
నుండెడి నేవస్తువైన । నుపముఁ దలిర్ప
న్దండిగ నిండిన పిమ్మట
ఖండించిన వెల్తిఁగాదు । గదరా ! వేమా ! 2739

పరిపూర్ణుడయిన వెనుక తరుగు లేదు.

ఆ. నిండునదులు పాఱు । నిలిచి గంభీరమై
వెఱ్ఱివాగు పాఱు । విఱిగి పొర్లి
యల్పుఁ డాడు రీతి । నధికుఁ డాడఁడు సుమీ ! ॥వి॥ 2740

వాగు = నది, లేక యేరు ; గొప్పవార్లకు కొద్దివారికి ఉపమాన
ములుగా వాడబడినవి

ఆ. నిండుసూర్యునిఁ జూస్తె । నేత్రముల్ చెడిపోను
నేత్రముల్ చెడిపోతె । పాత్ర చెడును
పాత్ర లేకను కాశి । యాత్రఁ బొయ్యేదెట్లు ? ॥వి॥ 2741

ముక్తపదగ్రస్తములో తేజోవంతమయిన సూర్యునిజూచిన నేత్ర
ములకు దోషము గలుగును.

తే. నిక్కమగు జ్ఞాననిష్ఠలో । నేర్పుమీఱ
సొక్కి, సోలియు భ్రమయక । సూక్ష్మమంది
చిక్కు పడకుండువాఁడెపో । చిన్మయుండు
దక్కువగ వానిఁ గన లేరు? । ధరను వేమ. 2742

చిన్మయుని సూక్ష్మబుద్ధితో జూడమన్నాడు.

ఆ. నిక్కమైన మంచి । నీల మొక్కటి చాలుఁ
దలుకు బెలుకు రాలు । తట్టెడేలఁ ?
జదువఁ బద్యమరయ । జాలదా! యొక్కటి ॥వి॥ 2743

వేమన కవితా ప్రాభవ మిందు వెల్లి విరుస్తుంది.

కం. నిఖిలాకారుఁ డనంతుఁడు
నిఖిలమునకు సర్వసాక్షి । నిజముగఁ దానై
నిఖిలంబునందు వెలుఁగును
నిఖిలంబై యుండు నతఁడు । నిజముగ వేమా! 2744

స్వయంజ్యోతి స్వరూపుఁడు సర్వేసర్వత్రా నిండియున్న సచ్చిదానందుని వర్ణించాడు.

ఆ. నిగురు గప్పినట్లు । నిశ్చల భక్తిలోఁ
దగిలియుండు ముక్తి । తానె వచ్చు
జగతి నొప్పఁ జెప్ప । జాణుండు లేఁడయా! ॥వి॥ 2745

నివురు గప్పిన నిప్పువలె నిశ్చలంగా నిరీక్షించ మన్నాడు.

కం. నిజగురు లక్ష్యం బుంచక
యజ పాదిక్రియల మీఱి । యలమట పడకే
నిజ విమలాంతం బందిన
సుజనుని నెన్నంగఁ దరమె ? । సూటిగ వేమా! 2746

అజప గాయత్రీ మంత్రమువలన నిజమార్గము గోచరించును.

ఆ. నిజ గురూపదేశ । నిశ్చయాత్మ విద్య
రక్షకం బటంచు । రాజవీధి
మధ్యదేశమందు । మార్గాని చూడనా ॥వి॥ 2747

గురూపదేశమే రాజవీధికి మార్గము.

ఆ. నిజము, కల్ల రెండు । నీలకంఠు డెఱుంగు
నిజములాడ కున్న । నీతిదప్పు
నిజములాడు నపుడు । నీరూప మెనవచ్చు ॥వి॥ 2748

సత్య స్వరూపుడే పరమాత్మ స్వరూపుడు.

ఆ. నిజము కళల మీఱి । నిత్యుండు కావలె
పలుకులోని పలుకు । పదిల పఱచి
వేడుకలర ముక్తి । వెన్నంటి చూడరా ! ॥వి॥ 2749
ప్రాణాయామము చేసిన ప్రాణవాయువు వెన్న సహస్రారము చేరి వికసింపఁజేయును.

ఆ. నిజముఁ గల్లనెరిగి । నిత్యుండు గాఢాయె
పలుకులోన బిందు । పదిలపరచి
వేడ్కనైన బిందు । వెదబెట్టకుండదు ? ॥వి॥ 2750
బిందువు దాటిన పొందైన మార్గ మేర్పడును.

ఆ. నిజముఁ దెలియనైన । సుజనుఁడా నిజమునె
పలుక వలయుఁ గాని । పరుర కొఱకు
దాపఁ గూడదింక । నోప దన్యముఁ బల్క ॥వి॥ 2751
మోమోటము కోసము మోసము చేయరాదు.

ఆ. నిజముఁ దెలిసి యేల । నిత్యుండుఁ గాడాయె ?
పలుకులోని పదము । పలికి పలికి
మనసు నిల్పనేని । మరి యోగియౌనురా ! ॥వి॥ 2752
ప్రణవములోని నాదమును జపించి యోగి కమ్మన్నాడు.

ఆ. నిజము నాడువాని । నిందించు జగమెల్ల
నిజము నాడరాదు । నీచుతోడ
నిజము నాడవలెను । నిజ మహాత్మునిఁగూడి ॥వి॥ 2754
నీచులదగ్గర నిజము దాచినను తప్పులేదు.

ఆ. నిజము నేల నెఱిఁగి । నిత్యుఁడు గాఁడాయె ?
పలుకులోని బిందుఁ । బదిలపఱచి
వేడ్కనైన బిందు । వెదఁ బెట్టకుండియు ॥వి॥ 2755
నాదమే పలుకు దానిలోనిదే కళ. కళ నతిక్రమించినదే పరిపూర్ణము.

క. నిజముం "బలికెడు నరులకు
విజయము గలదెందు వారి । విభవముఁ జూడం

గుజనాళి కోర్వశక్యమె ?
సుజనుల సుహిమెన్నఁ దరమె । సూటిగ వేమా! 2755

సత్యవాక్పాలన సర్వత్ర పూజనీయము అగును

ఆ. నిజము లాడునతఁడు । నిర్మలుండై యుండు
నిజములాఁడు నతఁడు । నీతిపరుఁడు
నిజముఁ బల్కకున్న । నీచ చండాలుండు ॥వి॥ 2756

అబద్ధాలాడు వానిని అంత్యజు డందురు.

ఆ. నిజము వరుస నెఱిఁగి । నిర్గుణ మందెడి
పలుకులోని శబ్ద । పరుడుగాను
పలుకకుండు వాఁడె । పరమాత్ముఁ డందురు ॥వి॥ 2757

" నాద బిందు కళాతీత నమో నమో నమః " నాదు, బిందు, కళాతీతునకు నాల్గుమార్లు నమస్కరించు చున్నాను.

ఆ. నిజము వరుస నెఱిఁగి । నిత్యుండ వగుటకుఁ
బలుకులోని పలుకుఁ । బదిలముగను
బలుకువాని నీవు । పరికించి చూడరా ! ॥వి॥ 2758

సద్గురుని తెలిసికొన్న సార మబ్బును.

ఆ. నిజము వరుస నెఱింగి । నిర్గుణత్వంబందఁ
బలుకులోని శబ్ద । మలరఁ దెలియఁ
బలుకకుండు వాఁడె । పరమాత్ముఁ డందురు ॥వి॥ 2759

అజ్ఞానాంధకారము దాటినవాడే అసలు గురువు. .

ఆ. నిజము వేళలెఁగి । నిత్యుండు గావలె
పలుకులోని బిందు । పదిలపఱచి
నేడుకైన పొందు । వెతఁ బెట్టుకొందురే ? ॥వి॥ 2760

మంచిమార్గాన్ని వంచించుకొనరాదు.

తే. నిటల దుర్గములో నున్న । నిజ మెఱింగి
పటు తరంబుగ మదినిల్పి । ప్రబలుయోగి ;

యంటి ముట్టును నిర్గుణం । బట్టె మదిని
గెంటు వడఁదెప్పుము తెలియునీ । కిటుకు వేమ. 2761

కిటుకు = రహస్యము ; సహస్రార చక్ర మే నిటలదుర్గము.

ఆ. నిటల దుర్గ మెక్కి । నిక్కి చూడంగనె
కుటిల రూప కళలఁ । గూల్చునెఱుక
పటుతరంబుగాను । బట్టి సాధింపుడీ ! ॥వి॥ 2762

ఎఱుక = తెలిసికొనుట ; కుటిలత = చెడుగు ; సహస్రారమును సాధించినవాడు మాయాతీతుడగును.

ఆ. నిట్టిదాని పొందు । విడువఁజాలకఁ దుల్వ
చచ్చుదాక మోసు । చాప గుడిసె
భాగవతుల పట్టు । పట్టంగ నోపఁడు ॥వి॥ 2763

తులువలు దొడ్డవారిని చేరరు.

కం. నిత్యంబు కాని యొడలికి
నిత్యము దుఃఖంబుఁ బడును । నిరతిని ధరలో
నిత్యా నందపుఁ బదవి క
నిత్యపు దుఃఖంబు పడఁగ । నేరరు ? వేమా ! ॥వి॥ 2764

శాశ్వతముగాని శరీరముకొరకు శ్రమలు బడువా రవివేకి.

తే. నిత్య సత్య నిరామయ । నిర్గుణంబు
మృత్యు సమదృష్టిలో నెంచి । మిన్నకుండి
భృత్య భృత్యానురాగుఁడై । భృకుటి నంటి
నృత్య మాడుచు నుండుటే । నియతి వేమ. 2765

సత్యమును గురించి వత్యాసములేని ప్రాస యతులతో తత్వాన్ని బోధించేను.

తే. నిత్య సత్యవ్రతాచార । నిపుణుఁడ వయి
పరమ ధర్మార్థముల నెల్లఁ । బట్టి చూచి
సిద్ధిఁ బొందేను పరిపూర్ణ । చింతఁ బూను
మప్పు డానంద మమితమా । నయ్యె ? వేమ. 2766

శాశ్వతానందపదవిని సాధించుటకు సత్యమే ఆధారము.

కం. నిత్యానంద వివేకము
సత్యంబుగఁ దెలియకున్న । శక్యంబగునా!
ముత్యము సరి గురు మర్మము
భృత్యుఁడవై మది నెఱుంగఁ । బెంపగు వేమా! 2767
ఆణిముత్యము వంటిది అసలు గురు రహస్యము.

ఆ. నిద్రజాగరముల । నెలవులఁ దానుండె
గప్పుకొన్న మాయఁ । గానలేక
దబ్బర నిజములను । దా బాగుగఁ గనక
గొబ్బునఁ జెడిపోవు । గుణము వేమ! 2768
సత్యాఽసత్యముల దెలియక జాగ్రద స్వప్నావస్థల చిక్కుకొన్నాడు.

ఆ. నిద్ర మఱచినపుడె । నిష్ఠుండు తానాయె
నిద్రలో పడినపుడె । నిష్టపోయె
నిద్రలో ఖేచరీ । ముద్ర చూడగవలయు ॥వి॥ 2769
ఖేచరీముద్ర ఆకాశమును జూచేవిధానము.

ఆ. నిద్ర మేలుఁదెలిసి । నిలుపుఁడీ మీలోనఁ
బ్రాణి మేలు తెలిసి । పాయకుండుఁ
బ్రాణి నిదుర సందుఁ । బరమాత్ముఁడెఱుఁగురా! ॥వి॥ 2770
సుషుప్తిలో సుషుప్తిని గాంచినవాడే సుజ్ఞాని.

ఆ. నిద్రలేనివాఁడు । నెరయోగి యెందైన
భద్రమైన పదవి । పడయులయము
ముద్రవిడువ నతఁడు । ముఖ్యుఁడౌ సంసార
సక్తిలేనివాఁడు । సముఁడు వేమ! ॥వి॥ 2771
నిద్రా భద్ర ముద్రాసక్తి లేనివాడే నెరయోగి.

ఆ. నిద్రలోన మనసు । నిగురొత్తి లోకముల్
భద్రముగను జూపి । భ్రమయఁ జేసి
పొత్తు విడువకుండుఁ । బొగడుచు నీలోన॥వి॥ 2772
ముక్తికాంతను నీలో శక్తితో నుంచుకొమ్మన్నాడు.

ఆ. నిద్రలోని నిద్ర । నిర్జర సంఘంబు
తామసంబు నిద్ర । తలగి పోవు
సతిప తేకమైన । సమయంబు నిద్దుర ॥వి॥ 2773

"యోజాగర్తి సుషుప్తస్థు యశ్య జాగ్ర న్నవిద్యతే యశ్య నిర్వాసనా బోధ సజీవ న్ముక్త యుచ్యతే"
మాయను లోనుగానివాడు బ్రహ్మవిద్యావేత్త.

ఆ. నిద్రలోని నిద్ర । నిర్జర సంఘంబు
తామసంపు । నిద్ర తలగద్రోచు
నిద్రలోని నిద్ర । నిర్భీతి నుదయించు ॥వి॥ 2774

నిద్రలో నిద్ర జూచినవాడు నిర్జరులతో సమానము.

ఆ. నిద్రలోని నిద్ర । నిజముగాఁ దెలిసిన
భద్రమగును మిగుల । బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు । నిర్మలయోగిరా! ॥వి॥ 2775

"స్థానత్రయ యతీతశ్య పునర్జన్మ నవిధ్యతే"
నిద్దరను జయించిన జన్మరాహిత్య మగును.

ఆ. నిద్రలోని నిద్ర । నిర్జరతాప్తికా
తామసంపు నిద్ర । తలఁగఁద్రోయు
నిద్రలోని నిద్ర । నిర్భీతి నుదయించు ॥వి॥ 2776

నిద్రలోనున్న భావానికి నిగిడిచూడ మన్నాడు.

ఆ. నిద్రలోని నిద్ర । నిర్జర విదితంబు
తామసంపునిద్ర । తలగి పోవ
సతిపతు లాగిఁ గూడ । సమయంబు నిద్దురా! ॥వి॥ 2777

సతియు పతియూ గలసి నిద్రించిన నిద చక్కని నిద్రగా చిత్రించాడు.

ఆ. నిద్రలోని నిద్ర । నిర్భేద్య మనఁదగుఁ
దామసంపు నిద్రఁ । దలఁగఁద్రోచి
సతత మదియె పూన । సర్వదా! యోగియా ॥వి॥ 2778

నిర్భేద్యము = భేధింపరానిది ; మను కారపు నిద్ర పామరులను జేయును.

ఆ. నిద్రలోని మనసు । నిలుపుచు లోకము
ల్ఛిద్రముగను జూపి । భ్రమయఁజేసి
పొత్తు విడువకుండుఁ । బొసగఁగ నీలోన ॥వి॥ 2779

అన్యోన్యత విడువకుండా అపరబ్రహ్మను ఆరాధించమన్నాడు.

తే. నిద్రలో వచ్చుసంపద । నిజముగాదు
భద్రమైనది పరిపూర్ణ । భావపరము
ముద్రలో భద్రమైనది । మూలవిద్య
చిద్రహస్యము తెలుఁగఁగఁ । జెల్లువేమ. 2780

పంచముద్రా భావము పట్టిచూడమన్నాడు.

క. నిను నీవెఱుఁగఁగ నెంచిన
మనమున సంకల్పములను । మానఁగవలెరా!
యనుమాన రహితమగు గుఱి
వినయంబున గుఱినిబట్టి । వెదకుము వేమా! 2781

అనుమానము లేకుండా వినయవివేకుడవై గురుని సేవించుము.

ఆ. నిన్నుఁ జూచుచుండ । నిండును దత్వంబు
తన్నుఁ జూచుచుండ । తగులు మాయ
నిన్ను నెఱిఁగి నపుడె । తన్నుఁ దా నెఱుఁగును ॥వి॥ 2782

మాయను గడచి మనోస్థితముగా మహేశ్వరుని గాంచుము.

ఆ. నిన్నుఁ జూచెనేనిఁ । దన్నుఁ దా మఱచును
దన్నుఁ జూచెనేని । నిన్ను మఱచు
నేవిధమున మనుజుఁ । డెఱుఁగు నిన్నును దన్ను ॥వి॥ 2783

జీవుని జీవేశ్వరుని గూడు జూచు సూక్ష్మదములు సూటి నెరుగ మన్నాడు.

ఆ. నిబిడమైన తమము । నిక్కి దాటఁగలేక
గుబురు బట్ట బయలు । కూడుటెట్లు?
ప్రబలుచున్న మదిని । బాలించి చూడరా! ॥వి॥ 2784

నిబిడమైన తమము = చిట్టచీకటి. (అజ్ఞానము);
బట్టబయలుగుబురు = పరిపూర్ణమందిన ముక్తి.

ఆ. నిమ్మఁబండు పుట్టె । నిజమైన రసముండె
హేమమునకు నేడు । రేలఁ బ్రజలు ?
సత్తు పొత్తుఁ జేసి । సాధింప లేరకో ! ॥వి॥ 2785

నిమ్మపండు రసముతో పాదరసమును గుళికచేసి ఆగుళిక సహాయమున ఖండసత్తును బంగారముగా జేయుదురు.

తే. నిమిషమైనను మదినిల్పి । నిర్మలముగ
లింగ జీవేశులను గాంచి । భంగపడక
పూజ మదియందుఁ జేయుట । పూర్ణపదవి
పరముఁ గోరిన నిదిచేయు । బాగు వేమ. 2786

మానసిక పూజ మహత్తరమని మహాకవి వాక్యము.

ఆ. నియతి వృత్తిమీఱి । నిటలదుర్గముఁ జేరి
భయములేక యుండు । బ్రహ్మవేత్త
జయము గల్గ ముక్తిఁ । జవిఁజూచు చుండురా ! ॥వి॥ 2787

సహస్రారమును జ్ఞానవేత్త జూచి సంతోషించును.

సీ. నియమాది సంగుఁడై । నిలిచినఁ దత్వంబు
తామసంబగు నిద్రఁ । దలఁగఁ జేయు ;
నిద్ర తాఁ దలఁగిన । నిర్భీతి నొందించు
శమమున నానంద । సమితి పుట్టు ;
నానందమున విశ్వ । మంతయుఁ దానగుఁ
దాను విశ్వంబైనఁ । దత్వమగును ;
దత్వ మింద్రియ పంచ । కత్వంబునను నిల్పు
దత్వంబు నిలచినఁ దాన యగును ;
రాజయోగీంద్రుఁ డాతఁడై । తేజరిల్లు
వెలయ జగముల విహరించు । విశ్రుతముగ
బాలు విధమున వృద్ధుని । పగిది సోకు
కరణి వెంగలిక్రియఁ జూడ । ఘనత వేమ. 2788

మనసు, వాయువు, దృష్టి, ముమ్మూలనకోనలో ముప్పుడి యుగుటచేత శబ్దము పుట్టుచున్నది. దానిని తెలిసికొనిన వాడే రాజయోగి.

ఆ. నియమితాసనమున । నిలిచిన చిత్తంబు
తామసంపు నిద్ర తలఁగఁ । ద్రోయు
నిద్ర తొలఁగినంత । నిర్భీతి యుదయించు ॥వి॥ 2789

నియమితాసనము = తనకు తగిన యాసనము ; తామసపు నిద్ర తగద న్నాడు.

కం. నిరతం బెడ తెగకుండం
బరిపూర్ణ బ్రహ్మ మాత్మ । పదమున నుండు
న్నిరవద్యమైన నడవిని
జరియించును జగమెఱుంగ । సత్యము వేమా ! 2790

సుజ్ఞానము వలన చొరరాని అడవినిగూడ చొరవచ్చును.

ఆ. నిరతమాత్మ చిదానంద । నిలయమందు
సరవితోడుత పరిపూర్ణ । సౌఖ్యమంది
యరనియగు బయల్ఁ జేరుట । యనుభవంబు
విమలగుణరాజ ! యోగీంద్ర । వేమనార్య ! 2791

అసాధ్యమగు పరిపూర్ణమును అవలీలగా అందుటకు అచంచల హృదయ మాధారం.

తే. నిరతమాత్మ చిదానంద । నిలయమందు
సరవితోడుతఁ బరిపూర్ణ । సౌఖ్యమెఱిఁగి
యరిదియగు బయలేర్పడుట । యనుభవంబు
గురుని ప్రాపున్నఁ గూడెడి । గుఱుతు వేమ. 2792

గురుకీలకము చేత అరిదియగు బ్రహ్మానంద మందవచ్చునని అనుభవ వేద్యుని వచనము.

తే. నిరతమాజ్ఞాన పరిపూర్ణ । నిష్ఠయందు
కర్మసన్యాస యోగియై । కసి మసంగి
మర్మ మెఱుఁగుచు నుండుటే । మానవయ్య !
ధర్మ మింతియె బోధించు । ధరణివేమ. 2793

కర్మసన్యాసయోగ క్రమమును వివరించాడు వేమన మహాకవి.

కం. నిర్మల సమాధిఁ బూనియు
కర్మలఁ దొలగించి ఖ్రించి । కాంక్షించి కొన
నిర్మోహమైన గుణమగు
ధర్మము పరిపూర్ణమగుచు । దాకుము వేమా ! 2794

సమతతో సమాధిలో నుండుటయే సచ్చిదానందుని సందర్శనకు మూలము.

ఆ. నిర్మలాత్మ విద్య । నిత్య సత్య జ్ఞాన
నిరతుఁ డైనవాఁడు । నేర్పుమీఱ
ననుభవింపఁ గోర । నలసట బొందునా ? ।వి॥ 2795

ఆత్మ విద్యావేత్త కలసట లేదు

క. నిర్వాతకళిక సామ్యపు
సర్వాత్ముని మదిని జూడ । సారముగాన
న్నిర్వేదన మగు దుర్గతి
గర్వముచెడి పరముగల్గుఁ । గదరా ! వేమా ! 2796

నిర్వాతకళిక = గాలిలేని దీపము (కదలికలేని) సాణుడైన పరమాత్మను జూపమన్నాడు వేమన.

క. నిఱుపేదల రక్షించెడి
సరసుఁడు నెఱదాత గాక । సంపన్నులఁ దా
భరియించువాఁడు దాతయె ?
మెఱమెచ్చుల దాత యతఁడు । మేదిని వేమా ! 2797

భద్రభూపాలుని పద్యము యిందులో భద్రముగా పేర్చారు యే క్షుద్ర రచయితలో తెలియదు.

ఆ. నివురు గప్పినట్లు । నిశ్చల భక్తితో
దగిలియుండు ముక్తిఁ । దానె వచ్చు
జగతి గొప్పఁజెప్ప । జాణుఁడు లేఁడయా ! ॥వి॥ 2798

ప్రకృతి మర్మమును తెలిసికొన్నవాడే పరమహంస.

తే. నిర్గుణాంశము మదినెన్ని । నేర్పు మీఱ
స్వర్గమని యెంచుచుండిన । శాశ్వతంబు

భర్గుడే వచ్చి భ్రమలను । బాపునయ్య
దుర్గుణ భ్రమలను బాయు । దోసఁగు వేమ. 2799

తేటగీతిలో ద్విప్రాసపెట్టి వేదాంతాన్ని తేట తెల్లముగా తెలియ జేశాడు తెలుగు కవిరాజు.

తే. నిష్ఠయందును దృఢమైన । దృష్టిఁ బూని
కష్టయోగంబులను మించి । కాంక్షదీఱ
వ్యష్టి పరిపూర్ణ మంకుట । వదలకున్న
స్పష్ట మపుడౌను సంతోష । సరణివేమ. 2800

నిష్ఠ = దీక్ష; వ్యష్టి = ఏకాంతము; ఏకాంత సేవయే యోకేశ్వరో పాసనము.

ఆ. నిష్ఠ మఱచిన నిద్ర । నిద్రనే కాదురా!
భజనచేసే భక్తి । భక్తిగాదు
పూజచేసే పూజ । పూజనే కాదురా! ॥వి॥ 2801

నియమము తప్పకుండా నిర్గుణబ్రహ్మమును స్వయముగా చూడ మన్నాడు.

కే వ. వాక్యము :- నిసలంబు లింగముఁ జేసి, భువనమెల్లను లింగ దేహ మరసి, అతనిఁగూర్చి ధ్యాన్య మానందముగ నిలిపి, తను మరచి, తత్ప్రథము మరచి, సమస్తమైన భూత, భువనాంతరము మరచి, ప్రణవముతో గూర్చి ప్రాణితోఁగూడి పలుకుచును నందు వుండును.

బోధాత్మ తత్త్వంబునుఁ, దీని మర్మము తెలియవలయు, కొండ మేఘంబువలెనే నుండు మేఘకాంతిలోనే వెలుంగుచుండును. అందు మెరుపులు బుట్టును. ఆ మెరుపులోనే భూరి, భేరీ నాదమౌను. అందు ప్రణవంబు పలుకుచుండును. గాలి గిర గిరాలుఁగా భేరినాదము తోడ చల్లని గాలి విసరును. గడగడా యని, బడబడా యని, పర పరా యని ప్రళయ రభసము గానపడును, సూర్య చంద్రుల ఛాయ చూడచూడ మెరుపు తళుకు బయలు, బరగుచుండు. పొంజువలె రవము లు, పంచదారలవంటి పంచరత్నముల వెలుగుగానబడును. పరమదివ

జ్ఞాన నిధులైన అందులో గాన బడుదురు. కారుణ్యశాంతి కారుగల్గిన రీతి, ధూపంబు పొగలు నురుముచుండు. అగ్ని మంటలు రవలు. ఆనందముగ రాలు. అందులో వెలిపొంజు వలెనే వెలుంగుచుండును. ఆ పొంజు దధిచేత పదికోట్ల దీపంబులు వెలుంగుచుండు. మెరుపుచేత జరుపుచుండు. దేహంబు దహించు. దాహంబు గొనుచు దప్పి దీప్తి జఠరాగ్ని లేచు అగ్నిమంటలు, రవలు, ఆనందముగ రాలు. అగ్ని లోపలనుండు అతిసూక్ష్మమైనది. అతని ఛాయచేతనే జనియించుచుండు. కారుణ్యరస ముక్తికాంతర మూర్తికారుఁడు విశ్వదాభిరామ వినుర వేమ॥ 2802

విశ్వాకారుని విశ్వరూప దర్శనమునను వేదాంతులుచేయు విశ్వ ప్రయత్నములు వీక్షణము దోచు విశ్వచింతలు విశ్వవిజ్ఞానవేత్త వేమన యీవాక్యములో విశదీకరించాడు.

ఆ. నిహతి పుట్టువులకు । నెలనిహామందురు
కుహర లోకమందు । గుతుక మేది ?
దహరమందు జూడఁ । దలఁగును దత్త్వంబు ॥వి॥ 2803

నిహతి = చావు, మరణము ; కుహరలోకము = పాతాళలోకము, దహరమందు జూచిన తత్త్వము బోధపడును.

క. నీచ కులీనుని వ్యాసునిఁ
జూచిరె నారాయణాంశ । శోభిల్లె ? భువి ?
న్గోచులకెల్లను మేటిగ
వాచాలత నొందెనొర ! । వసుధను వేమా ! 2804

“ వ్యాసో నారాయణో హరీ ”
గోచులు = సన్యాసులు ;
జాలారి పడుచు కొడుకు వ్యాసుడు గొప్పవాడని వేమన వాదెను.

ఆ. నీచగుణములెల్ల । నిర్మూలమై పోవు
కొదవలేదు సుజన । గోష్ఠి వలన
గంధ మలద మేని । కంపడఁగిన యట్లు ॥వి॥ 2805

కులమున కాక గుణమున సర్వమును గలదన్నాడు మనయోగి.

కం. నీచుల వినుతులు సేయుచు
యాచకమునఁ దిరిగి తిరిగి, । యలయుట కంటె
న్నేచిన యింద్రియ పశువులఁ
గా చెడి వా డింద నందు । ఘనుఁడగు వేమా ! 2806

ఏచిన = విజృంభించిన ; నీచులను స్తుతించుట కన్న నీలో నింద్రియముల నరికట్టుము.

ఆ. నీటిలోని వ్రాత । నిలువక యున్నట్లు
పాటి జగతిలేదు । పరము లేదు
మాట మాటకెల్ల । మనసు గోరుచు నుండు ॥వి॥ 2807

బూటకపు మనసుల మాట నీటిలోని వ్రాతకుసాటి

ఆ. నీతి జ్యోతిలేక । నిర్మలంబగు నేది ?
యెట్లుకల్లుగు బరమ । దెంతయైన
ధనము గలిగియున్న । దైవంబు రాదయా ! ॥వి॥ 2808

ధనమున్న మాత్రమున దైవమును చూడలేడు.

ఆ. నీతిఁ దెలియజెప్ప । నిజముగ వేమన
పాతకముల నెల్లఁ । బాఱఁబట్టి
లోతు తత్త్వమరసి । లోకులకును జెప్పె ॥వి॥ 2809

పాపహరణమునకు పరమార్థమును చేకొమ్మన్నాడు.

కం. నీతియు, భక్తియు, జ్ఞానము
రీతుల వర్తించు మదిని । రేవెలుఁగగుచున్
జ్యోతిగఁ దగునా బ్రహ్మము
భూతాత్ముఁడు, నిన్నుఁబొందుఁ । బొడఁగను వేమా ! 2810

రేవెలుఁగు = చంద్రుఁడు ; పూచంద్రునివలె ప్రకాశించు జ్యోతిని గనుగొమ్మన్నాడు.

తే. నీతి వైరాగ్య సద్భక్త్య । పేతులకును
ఘాతకులుగాని సుజ్ఞాన । కలితులకును

ద్రాలకందని పద్య । ల్వేలసంఖ్య
లుగను జెప్పంగనయ్యారా । జగతి వేమ. 2811

వేమన దేశసంచారము చేస్తూ అందఱు అడిగిన ప్రశ్నలకు జవాబులుగా వేలాది పద్యములు చెప్పేవాడు అని చాటువులు.

ఆ. నీతిలేనివాఁడు । కోతి కంటెను బాడు
నీతి దెలిసినవాఁడు । నిర్మలాత్మ
నీతి ప్రఖ్యాతిగా । నిండియుండగవలయు ॥వి॥ 2812

నీతి గలిగినవాడు ఖ్యాతినార్జించును.

ఆ. నీతివైరాగ్య భక్తి పు। నీతులకును
ఘాతకులుగాని జ్ఞానసం । కలితులకును
వ్రాలకందని పద్యముల్ । వేలసంఖ్య
చేతనంబుగ వేమన । జెప్పె భువిని ॥వి॥ 2813

భక్తి, జ్ఞాన, వైరాగ్యములుట్టిపడు భావముతో వేలాది పద్యములు చెప్పినట్లు రుజువుగానున్న దీపద్యము.

కం. నీమము పెట్టుక ద్రవ్యము
కామంబునఁ గొనుచు భువిని । గల్లరికూత
ల్నేమముగ బలుకుచుండినఁ
గోమటులొక కొందుఱుండ్రు । కుంభిని వేమా ! 2814

కుంభిని = భూమి; ధనాపేక్షులగు వర్తకులకు అబద్ధము లాడుట అలవాటు.

ఆ. నీరు కారమాయెఁ । గారంబు నీరాయె
వారి నిర్వికార । వస్తువాయె
నీటిలోన నుండు । నిఖిల బ్రహ్మాండంబు ॥వి॥ 2815

యీపద్యములో రసవాదము, వేదాంతార్థము ఉన్నదని కొందరూహిస్తున్నారు.

ఆ. నీరు కారమాను । నిరుకొని కారంబు
వానివద్ద నిద్ర । బోవ వచ్చు
నీటిలోనె నుండు । నిఖిల బ్రహ్మాండముల్ ॥వి॥ 2816

కూటవేదాంతమునుఁ గూర్చి గూర్చి చెప్పేడు.

ఆ. నీరు కారమాయె । కారంబు నీరాయె
కారమయిన నీరు । కారమాయె
కారమందు నీరు । కడు రమ్యమై యుండు ॥వి॥ 2817

గోప్యార్థములను గూర్చి వేదాంతకోవిదులచే వెతికించుట వేమన కలవాటు.

క. నీరునఁ బుట్టిన యుప్పే
క్షారము నీరాయె నీరు । క్షారము నొకటే
యీరీతి శివుని జీవుని
నారక మది నెఱుఁగనౌను । వసుధను వేమా! 2818

నీరూ ఉప్పూ అభేదమువలే జీవేశ్వరులకు అభేదాధ్యవసాయమున్నదని చెప్పెను.

ఆ. నీరు పయినఁబడ్డ । నిప్పులు బొగ్గులౌ
నిప్పుమీఁద కుండ । నీరుపెట్టఁ
గళపెళనుచుఁ గాఁగు ? గడుఁజోద్య మిదికదా! ॥వి॥ 2819

నీరు నిప్పు, కుండసామ్యముల గురు, శిష్య దేవులకు గల్పించాడు.

ఆ. నీరు పెదవిఁగొట్టి । నీమంబుతోడుత
నాచమాన మనుచు । నతఁడు చేసె
నాచమాన మౌనో ? । యల్పాచమానమో ! ॥వి॥ 2820

మంత్రోపదేశమనే తాంత్రికులకు హేళనగా యీపద్యము వ్రాశాడు.

ఆ. నీరు మొదలఁబెట్టు । నీరమే మొలకయ్యె
మొలక విశ్వమగుచు । మొనయుచుండు
నీరు విశ్వమగుట । నేర్పుతోఁ దెలియరో ! ॥వి॥ 2821

నీరును విశ్వములో జూచినవాడే నేర్పరి.

క. నీలియుఁ ? దగరము జిల్లేడు
ఫాలాక్షుని రసముచేత । భస్మంబులుగా
నేలం గలిమికి వగవగఁ
గాళాసుర హారునియాజ్ఞ । కావలె వేమా! 2822

బంగారు చేయు విధము.

క. నీలోని యొఱుక యనునది
నీలోననె పెఱిగి పెఱిగి । నీలో నడగు
న్నీలోని చిత్ర మడఁచిన
నాలోచన బ్రహ్మ బయలు । నందగు వేమా! 2823
నీలోని బ్రహ్మమును జూడుము.

ఆ. నీళ్ళమీఁదఁ జూడు । నెరయ నోడల పర్వు
బయలుమీఁదఁ జూడు । పక్షి పర్వు
ఆడువారి గమన । మాలాగె యుండురా! ॥వి॥ 2824
స్త్రీలు స్వేచ్ఛావిహారులని చిత్రించాడీ యుపమానములతో.

ఆ. నీళ్ళమీఁదఁ జూడు । నెరయ నోడల బల్మి
బట్టబయలఁ జూడు । బండి బలిమి
ఆడుదాని బలిమి । యాడనే చూడరా! ॥వి॥ 2825
తనకు సరియైన దారి లభించిన పెరవారి సాయమక్కరలేదు.

ఆ. నీళ్ళమీఁద నోడ । నిగిడి తిన్నగఁ బ్రాకు
బైట మూరెడైనఁ । బ్రాకలేదు
నెలవు దప్పుచోట । నేర్పరి కొఱగాఁడు ॥వి॥ 2826
స్థానమును బట్టి మానవుని స్థితిగతులు మారును.

ఆ. నీళ్ళమీఁద బుగ్గ । నిలిచినయప్పుడు
తళ్ళు వేగవచ్చి । తాకుఁగాదె
విడెడు కుండకింత । విభ్రాంతి పడుదురు! ॥వి॥ 2827
శరీరము నీటిబుడగ వంటిదని నేర్చుకో.

ఆ. నీళ్ళమీఁద వ్రాత । నిలువక యున్నట్లు
పాటి జగతిలేదు । పరము లేదు
మాట మాటకెల్ల । మనసు గోరుచునుండు ॥వి॥ 2828
మానవులకున్న మతిచాంచల్యమును మనకవి చెప్పెను.

ఆ. నీళ్ళ మునుగనేల? । నిధుల మెట్టఁగనేల?
మొనసి వేల్పులకును । మ్రొక్కనేల?
కపట కల్మషములు । కడుపులో నుండగా! ॥వి॥ 2829
కపటాత్ములు కాశికి వెళ్ళుట గూడ లోకవంచనకేనా?

ఆ. నీళ్ళ మునుగువాఁడు । నిర్మలాత్ముఁడు గాఁడు
పూర్ణమైన ముక్తిఁ । బొందలేఁడు
నీరుకోడి యెపుడు । నీళ్లను మునుఁగదా ? ॥వి॥ 2830

కుటిలాత్ముఁడు ఎన్ని తీర్థయాత్రలకెళ్ళిన యేమీలాభంలేదు.
"ఎక్కడకువెళ్ళినా తెడ్డేగాడే" (సామెత)

ఆ. నీళ్ళలోన మొసలి । నిగిడి యేనుఁగుఁబట్టు
బైటఁ గుక్కచేత । భంగపడును
స్థానబలిమి కాని । తనబల్మి కాదయా ! ॥వి॥ 2831

లోకనీతులు వాకొని అభ్యుదయ కవులకు ఆధార భూతుడయ్యాడు వేమన.

ఆ. నీళ్లలోని చేప । నెఱిమాంస మాశకు
గాలమందుఁ జిక్కి । కూలినట్లు
ఆశపుట్టు మనుజుఁ । డారీతి జెడిపోవు ॥వి॥ 2832

ఎఱ = మట్టిపాము. అత్యాశచేత మనుజుడంతమగును.

ఆ. నీళ్ళలోని మీను । నిగిడి దూరము పాఱు
బయట మూరెడైనఁ । బాఱలేదు
స్థాన బలిమి కాని । తన బలిమి కాదయా ॥వి॥ 2833

చక్కని చిక్కని ఉపమానములు మిక్కటముగా గ్రుక్కిస్తాడు తన రచనలలో వేమన.

ఆ. నీళ్ళ త్రాగేటపుడు । నవ్వితే పొరయెక్కి
నాసికంబువంక । దూసిపోను
దూసి పోయిననీరు । కాశి గంగలోఁ గలుసు ॥వి॥ ·834

* యతిపోయినది ; అసలు భావము గొప్పదే అతికినవారు మతిలేనివారుగా నున్నారు.

ఆ. నీళ్ళుబోసి కడిగి । నిత్యంబు శోధించి
కూడుఁబెట్టి పైన । కోకఁ గట్టి
యేమి పాటు పడుదు । రీ దేహ్యగంధికి ॥వి॥ 2835

కోక = బట్ట ; మలమూత్రముల కొంపకు మహాసొంపు లెందుకు ?

ఆ. నీళ్ళుపోసి కడిగి । నిత్యంబు శోధించి
కూడువెట్టి మీఁద । గోకఁగట్టి
యేమి పాట్లొ పడుదు । రీ దేహమున కిల! ॥వి॥ 2836

అస్థిరమైన శరీరమునకు అందచందాలకోసం కుందడమెందుకూ ?

కం. నీలోని యెఱుక జాలము
నీలోన పెరిగి పెరిగి । నీలో నణఁగున్
నీలోని చిత్ర మణచిన
నీలోచన బ్రహ్మ బయలు । నీవగు వేమా ! 2837

నీలో నీవు చూచి సక్షిలేశుని దర్శింపుము.

కం. నీ వనినను నే ననినను
భావమ్మున నెఱుక యొక్క । పద్ధతి యగునా !
భావంబుదెలిసి మది ని
ర్భావముగా నిన్నుఁగనుట । పరమగు వేమా ! ॥వి॥ 2838

భావ మభావ మగుటయే పరమాత్మ దర్శనము.

కం. నీ వాడిన నే నాడుదు
నీవుండిన నేనుందు । నిర్విణ్ణుఁడనై
నీవుఁ దలంచినఁ దలఁపుదు
నీవు నగిన నేననగుదు । నిజముగ వేమా ! 2839

"సమస్తమైన కర్మలకు సర్వేశ్వరుడే కర్త" అనే సూత్రము ముందు పొందుపరచాడు.

ఆ. నీవు గలుగునట్టి । నెలవు దెలియు వాఁడు
వసుధయందుఁ ద్రోవ । వదలఁడెందుఁ
గాలు గదలనీక । గ్రక్కునఁ జేరురా ! ॥వి॥ 2840

బ్రహ్మమున్న చోటును తెలిసినవాడు బ్రహ్మమును బంధించును.

ఆ. నీవు నిలిచియుండు । నిఖిలంబు నిలువదు
నిలిచియుండు । నెండ నీరు వలెను
నీవు నిశ్చయంబు । నిఖిలంబు మాయమా ॥వి॥ 2841

లోకాలోకము లలోకములైనను లోకేశ్వరుడు యేకాగ్రతతో నే యుండును.

తే. నీవు నెఱిఁగిన లోకంబు । నీకుఁ దోచు
నీవు మఱిగిన తోడ్తోడ । నెందుఁ బోయె
ననెడి యెఱుకను విడనాడు । నయ్యయోగి
దానఁ బరమార్థ మెఱుఁగంగ నౌను । వేమ ! 2842

యోగి యెరుక మర్మమును యుక్తముగా నెరుగును.

ఆ. నీవు పలుకుచున్న । నిత్యపూజితుఁడౌను
నీవు పలుకకున్న । నిదురవోవు
నీవు పలుకు పలుకు । నిర్మలుం డెఱుఁగురా ! ॥వి॥ 2843

ఆత్మప్రబోధాన్ననుసరించి అందరు వర్తించెదరు.

ఆ. నీవు వినఁగనొకటి । నిలిచియుండఁగ లేదు
నిలువ నెండమావు । లలరు నట్టె
నీవు నన్నెఱుఁగుట । నిశ్చయం బాయెరా ! ॥వి॥ 2844

భ్రాంతులుడిన బ్రహ్మమే గాన్పించును.

ఉ. నీవె సమస్తలోకములు । నిండుచుఁ బృథ్వి నిటోల లాడుచు
న్నీవె చరించుచున్నదుల । నీటను, నగ్గినిఁ దేజమొప్పచో
నీవె చరించు నెల్లెడల । నిండిన గాలి, నభంబు నందును
న్నీవె కదా! చెలంగునది । నీ వెవరందురె ? వెఱ్ఱి వేమనా! 2845

మ. కలశాంబోధిఁ గలంచు గాలిఁ గలఁడా కాశంబునన్ గుంభిని
నలఁడగ్ని న్దిశలన్ ... ... ...

భాగవత పద్యమును బోలియున్నది.

ఆ. నూటెనిమిది గళ్ల । నోము పుణ్యము లెల్లఁ
గలవె? జీవులకును । గన్న యపుడె
చెడిన నీళ్లు నదిని । జేతి మీఁదైనట్లు ॥వి॥ 2846

అష్టోత్తర శతగాయత్రీ జపము వలననూ తదితర వ్రతములవలననూ లాభము లేదు. మానవుడెప్పటికైనా మానవుఁడే.

ఆ. నూరు పలుకవచ్చు । నుడి వ్రాయఁగా రాచు
వ్రాతకన్న సాక్షి । వలవ దెన్నఁ

బరగ వ్రాతలేని । పక్షమున నపుడు
బలిమి సాక్ష్యముననె । ఫలము వేమ. 2847

వా॥తా॥:— పరగ లేని వ్రాత భంగ పాటును దెచ్చు
సరియైన సాక్ష్య మాధారము.

క. న్యూనముగల తనభార్యను
గాననమునఁ జంపవచ్చుఁ । గడుఁజిత్రముగా !
దానెఱుక గ్రిందు రీతిని
మానము గాపాడు కొనెడి । మహాతుఁడు వేమా! 2848

న్యూనము = తప్పు; కాననము = అడవి; మాయను అమాం తంగా మాయము జేసినవాడే మానవుఁడు.

ఆ. నెత్తి బ్రహ్మజ్ఞాని । నేమంబు నోనకూడు
షోడశోపచార । ముడుఁగ కిలనుఁ
జేసి శివుని నెపుడు । సేవించు వాఁడయా! ॥వి॥ 2849

షోడశోపచారములు చేసినవాడు బ్రహ్మజ్ఞాని యగును.

షోడశోపచారములు = 16 విధముల పూజలు :

1. అవాహనము, 2, ఆసనము, 3. పాద్యము, 4. అర్ఘ్యము, 5. ఆచమనీయము, 6. స్నానము, 7. వస్త్రము, 8. యజ్ఞోపవీతము, 9. గంధము, 10. పుష్పము, 11. దేవతార్చనము, 12 ధూపము, 13. దీపము, 14. నైవేద్యము. 15. తాంబూలము, 16. నమస్కారము. ఇవి షోడశోపచారములు దేవతార్చనలో యీక్రమమును పాటింతురు.

షోడశకర్మలు = 16 పనులు :

1. గర్భాదానము, 2. పుంసవనము, 3. సీమంతము, 4, జాత కర్మము, 5. నామకరణము, 6 అన్నప్రాసనము, 7. చౌలము, 8. ఉప నయనము, 9. ప్రజాపత్యము, 10. సౌమ్యము, 11. అగ్నేయము, 12. వైశ్వదేవము, 13. గోదానము, 14. సమావర్తనము, 15. వివాహము, 16. అంత్యకర్మము. ఇవి పిండోత్పతి మొదలు నిర్యాణమువరకు మనిషికి తగు కర్మలు సక్రమముగా వివరింపబడెను.

షోడశ మహాదానములు = 16. దానములు :

1. గోవు, 2. గజము, 3. హయము, 4. చాగము, 5. మహిషము, 6. రథము, 7. గృహము, 8. శయ్య, 9. భూమి, 10. విద్య, 11. కన్య,

12. దాసి, 13. సువర్ణము, 14. తిలలు, 15 అగ్రహారము, 16. రత్నములు. యీదానములు పాత్రత గల్గిన వారికిచ్చిన బడయనగును పరము.

షోడశహేయ గుణములు = 16 చెడుగులు:

1. కామము, 2. క్రోధము, 3. లోభము 4. మోహము, 5. మదము, 6. మత్సరము, 7. దంభము, 8. మానము, 9. అతిమానము, 10. పారుష్యము, 11. అజ్ఞానము, 12. అహంకారము, 13. మమకారము, 14. ప్రమాదము, 15. ఈర్ష్య, 16. అసూయ యీపదునారు చెడుగుణములలో యేఒక్కటొక్కటున్న మానవునికి ప్రమాదము కల్పించును.

మానశిక షోడష పూజా పుష్పములు

1. మనస్సు, 2. బుద్ధి, 3. వాక్కు. 4. శమము, 5. అక్రోధము, 6. మౌనము, 7. నిరాహారము, 8. నిద్రాత్యాగము, 9. భూతదయ, 10. అభినివేశము, 11, నైర్మల్యము, 12. అచాంచల్యము, 13. వేదాంత విచారము, 14. బ్రహ్మజ్ఞానము, 15. దమము, 16. ఆనందము. యివి మానసిక పూజలు.

షోడశ కామ కళా స్థానములు.

1. బొటనవ్రేలుకొన, 2. అరికాలుమడమ, 3. మోకాటిచిప్ప, 4. భగము, 5. బొడ్డు, 6. రొమ్ము, 7. చన్ను, 8. చంక, 9. కంఠము, 10. చెక్కు, 11. పెదవి, 12. రెప్ప, 13. నుదురు, 14. తల, 15. పిక్క, 16. తొడ. ఈకళాస్థానములలో ఒక్కొక్క తిథినాడు ఒకొక్క స్థానానికి కామమువస్తుందని స్త్రీకి వాత్స్యాయన కామశాస్త్రములలో చెప్పబడినది.

ఆ. నెత్తి వేదవేత్త । నేమంబు నొనగూడు
షోడశోపచార । సూక్తి లిలను
జేసి శివుని నెపుడు । సేవించు వాఁడయా
బ్రాహ్మణుం డతఁ డని । పలుకు వేమ. 2850

షోడశోపచారములు జేసినవాడే బ్రాహ్మణుఁడు.

ఆ. నెనరు గలుగ గురుఁడు । నిటల దుర్గముఁ జూపుఁ
గనుల చూడ్కి మఱుఁగు । గవయుఁ జూపు
జెనకి యాత్మరూపుఁ । జేఁ జేతఁ జూపురా! ॥వి॥ 2851

బ్రహ్మవేత్తయగు గురువు పరమును అరచేత జూపించును.

ఆ. నెయ్యిలేని కూడు నీయాన । కసువది
కూరలేని తిండి । కుక్క తిండి
ప్రియములేని కూడు । పిండపుకూడు రా ! ॥వి॥ 2852
కసువు = గడ్డి; అది మధ్యాంతములులేని తిండి కుక్క తిండి.

ఆ. నెలకు నొక్కసారి । నెత్తురుఁ గారును
ఉష్ణమెత్తినపుడు । నుబుకు చీము
ఉత్తకాలమందు । నుచ్చఁ గారుచునుండు ॥వి॥ 2853
స్త్రీల శరీర పరిణామమును చిత్రించాడు.

క. నేఁ జచ్చినతోడనె మఱి
తాఁ జచ్చును నపుడె పంచ । తత్త్వము లొకఁటా;
రాజత్త్వరూప మందును
దా జితుడై నిలిచియుండుఁ । దథ్యము వేమా! 2854
తనలోనున్న పంచభూతములు తను మరణించిన ఎక్కడి వక్కడకు జేరును.

తే. నేత్రముల చూపు కవ్వలి । నేర్పుఁబూని
సూత్ర గమనము చెదరని । చూడ్కినంటి
గాత్ర మలయక పొందుటే । గగనవిద్య ॥వి॥ 2855
గగన విద్యను సగుణంగా గనమన్నాడు.

తే. నేత్రముల చూపు దాటెడి । నేర్పుఁబూని
సూత్రగమనము చెదరని । చూడ్కినంటి
గాత్ర సంసర్గమొందుటే । గగనవిద్య
పాత్రత గలానికది యబ్బుఁ । బరగు వేమ ! 2856
పాత్రత గల్గినవాడు గగన విద్యను బడయ గలఁడు.

క. నే ననఁగ మేను గాదని
మానసమున నెఱుఁగకున్న । మనుజులకెల్లన్
స్వానుభవసిద్ధి దొరకదు
తానగు పరమాత్మ నెఱుఁగఁ । దరమా! వేమా ! 2857
నేను మేనుల ద్వయముల దెలసినవాడే నిపుణుఁడు

ఆ. నేనను వచనంబు । నీ వనఁగావచ్చు
నీవు నే ననఁబడు । నిష్టఁదెలియ
నేను నీవె నీవె । నే ననవచ్చురా! ॥వి॥ 2858

అసలువిషయము ఆకళించుకొన్నవానికి ఆత్మా పరమాత్మ ఒక్కటియే.

ఆ. నేను నీ వనియెడి । నెత్తంపు మాటలు
మానియుండు వాఁడె । మానవిధుఁడు
. తాను నే ననియెడి । తమకంబు మానరో! ॥వి॥ 2859

నెత్తంపుమాటలు = జిత్తులమారిమాటలు; నేను నీవను భేదము విడచి నిర్ణయానికి రండి.

తే. నేను నీవను భావంబు । నిగ్రహించి
నిర్వికల్ప సమాధిలో । నేర్పుగాను
నిబిడమౌ పూర్ణమందుట । నిత్యసుఖము ॥వి॥ 2860

చంచలములేని మనసుతో నుండుటే నిత్యానందము.

తే. నేను నీవను భావంబు । నిగ్రహించి
నిర్వికల్ప సమాధిలో । నేర్పుగాను
నిబిడమౌ పూర్ణమందుట । నిత్యసుఖము
నిర్గుణబ్రహ్మ మెఱిఁగి తా । నెగడు వేమ. 2861

నిర్గుణ బ్రహ్మను దెలియాలంటే నిత్యసుఖము గావాలి

క. నే నెవఁడను? దలపెట్టిన
మానసమునఁ దలపకుండ । మనుజున కకటా!
కానఁబడునెడ జనుండును
మానుగఁ గనుఁగొనఁగ వలయు । మహిలో వేమా. 2862

"నే నెవఁడ" నని తనలో తాను తర్కించుకొన్న తత్వము బోధపడును.

కం. నే నెవ్వఁడ నని తలఁపడు
మానసమునఁ బుడమిలోని । మనుజుం డకటా!

కానఁడు తా సకలంబును
మానుగఁ గనుఁగొనుట యెట్లు ? । మహిలో వేమా ! 2863

తానెవఁడో బోధపడనప్పుఁడు తత్వమెట్లు బోధపడును ?

సీ. నేమమునను యుండ। నిల్చును జిత్తంబు
తామసమున నుండ । తలఁగిపోవు
నెలవున్న చిత్తంబు । నిర్భృతి నొందించు
నిర్భృతి సౌఖ్యంబు । నీరసించు
సౌఖ్యదూరగుణంబు । శమమును బొందించు
శమగుణమును జూడ । శమత పుట్టు
నట్టిశమత విశ్వ । మంతయుఁ దానగుఁ
దానె విశ్వంబగు । తత్వమగును

దత్వ మింద్రియముల । దరిఁజూచి గెలుచును
దత్వవేత్త యయినఁ । దానె మిగిలి
రాజయోగి యగుచు । తేజంబు చేతను
వేలసి యుండు జగతి । వినర వేమ. 2864

మానవుఁడు రాజయోగి యగుటకు పై విషయములు బాగుగా వివరించాడు.

ఆ. నేయి వెన్న కాచి । నీడనే యుంచినఁ
బేరు గట్టి పడును । బెరుగు రీతిఁ
పోరి పోరి మదిని । పోసీక పట్టుము ॥వి॥ 2865

మనోచాంచల్యాన్ని కుదురుపరుచుట మేలన్నాడు వేమనయోగి.

ఆ. నేరనన్నవాఁడు । నెరజాణ మదిలోన
నేర్తు నన్నవాఁడు । నార్తకాడు
నూరకున్నవాఁడె । యుత్తమ యోగిరా ! ॥వి॥ 2866

కార్యార్థి కబురులు చెప్పక కార్యములను సాధించును.
నార్తకాడు = మాటలుప్రోగు.

ఆ. నేర నన్నవాఁడు । నెరజాణ మహిలోన
నేర్తునన్నవాఁడు । వార్త కాఁడు
ఊరకున్నవాఁడె । యుత్తమోత్తముఁడెందు ॥వి॥ 2867

మౌనము ఉత్తమయోగి లక్షణము.

ఆ. నేరని జనులకును । నేర్పు నేరములెల్లఁ
జక్కఁ జేయుదు రల । సాధు జనము
ఒప్పుదుర్జనములు । తప్పుగ నెంతురు ॥వి॥ 2868

సాధుబోధ సజ్జనులే గ్రహింతురు.

కం. నేరము లెంచెడు ప్రభువును
జేరఁగ రాదయ నెపముఁ । జెచ్చెరఁ దెచ్చు
న్వారాశి దాటి నను శని
మారకుఁడై పట్టి చంపు । మహిలో వేమా ! 2869

వారాశి = సముద్రము ; మారకుఁడు = చంపేవాడు ; గ్రహ-
చార ఫలితము ప్రస్తావించాడు.

ఆ. నేర్చి నడతునన్న । నేరమి తా వచ్చు
నోర్చి నడతునన్న । నోర్పు రాదు
కూర్చి నడతునన్నఁ । గూడంగ నీయదు ॥వి॥ 2870

మాయ మనుజుని తికమకలు పెట్టును.

ఆ. నేర్పు గలుగువారు । నెఱితనము గలవారు
విద్యచేత విఱ్ఱ । వీఁగువారు
పసిడి గలుగు వారి । బానిస కొడుకులు ॥వి॥ 2871

విద్య గలిగి విఱ్ఱవీగినవారు భాగ్యవంతుల బానిసలే గారా !

ఆ. నేర్పు గలుగువారు । నెఱయోధు లగువారు
విద్యచేత విఱ్ఱ । వీఁగువారు
పసిడి గల్గువాని । బానిస కొడుకులు ॥వి॥ 2872

యోధాన యోధులుకూడా డబ్బున్నవారికి దాసులే ?

ఆ. నొసటవ్రాయుఁ వాని । నొసట కొంచెము చేయ
నొసటికంటె వాని । నొసలు వ్రాత
నొసటిమీఁది వ్రాత । నులిమినఁ బోవునా ? ॥వి॥ 2873
బ్రహ్మవ్రాత తప్పించుటకు బ్రహ్మకుగూడా శక్యము గాదు.

ఆ. నొసలు భక్తుఁడయ్యె । నోరు తోడేలయ్యె
మనసు భూతము వలె । మలయఁగాను
శివునిఁ గనియెనన్న । సిగ్గెట్లు గాదకో ! ॥వి॥ 2874
నక్క వినయములు లంగగొంకులకే యుండును.

ఆ. నోటి పుప్పికెల్ల । నొప్పి లేకుండఁగా
నాకు పోక సున్న । మౌషధముగఁ
బెట్టకుండె నేనిఁ । బెనురోఁత వేయురా ! ॥వి॥ 2875
తాంబూలము నోటికి ఆరోగ్యము నిచ్చును.

కం. నోరెత్తఁగ తాప మేమియు
నేరని జంతువులఁ జంపి । నెమ్మదిఁ దిను నా
క్రూరపు సంకర జాతుల
మారణ మేమందు ? నింక । మహిలో వేమా ! 2876
జీవహింస చేయకూడదన్నాడు.

ప

ఆ. పంకజాక్షిఁగన్న । బంగరు పొడఁ గన్న
దిమ్ముఁ బట్టియుండు । తెలివి యొప్పు
మనుజులకును దప్ప । మహిమెట్లు కల్గురా ? ॥వి॥ 2877
పసిడి మీద పడతి మీద భ్రాంతి లేనివా డెవడు ?

ఆ. పంకజాక్షులఁ గన । బంగారు పొడఁగన
రిమ్ముఁ బట్టుయోగి । నమ్మరాదు
మనసు నిలుపువాడె । మహిమొప్పు యోగిరా ! ॥వి॥ 2878
వివక్షత లేని విజ్ఞానియే విరాగి

ఆ. పంచ ఋషులు భువిని । బరమ పవిత్రులు
మించిలోకమునకు । మేలుకొఱకు
సంచితార్థములను । సమసింపఁ జేయరే? ॥వి॥ 2889

సప్తఋషులు = కశ్యప, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్ర, గౌతమ, వశిష్ఠ, వాలఖిల్యులు ; వీరిలో ఎవ్వరినో వేమన యద్దరని దిగ్భ్రమింగాడు.

క. పంచగు నక్షయ బిందువుఁ
బంచాక్షరి నాద మంత్రము । పరమ మునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచిగనన్ మ్రొక్కునతఁడు । మహిలో! వేమా! 2880

"ఓం నమశ్శివాయ" అను పంచాక్షరిని తెలియుట ప్రాజ్ఞతకొఱకు.

ఆ. పంచతత్వఫలముఁ । భావించి కడమించి
కొంచెమైన మదిని । గోలుపోక
యెంచి మించు వాఁడు । యేర్పడ్డ యోగిరా! ॥వి॥ 2881

పంచేంద్రియ ప్రాభవాన్ని వంచించినవాడే పరమయోగి.

ఆ. పంచ తత్వములకు । బ్రహ్మాలకొక సొడ్డు
వారితండ్రి నెత్తి । వైతు సొడ్డు
నంతరంగ మెల్ల । నాదిశక్తి యెఱుంగు ॥వి॥ 2882

ఆదిశక్తియే అధికమన్నాడు.

తే. పంచతత్వాది నిర్ణయ । ఫక్కిమాని
మించి రేచక, పూరక । మిత మెఱింగి
యంచితంబుగఁ గుంభించి । యందుమయ్యె
మంచి దనఁదగు యోగిక । మహిమ వేమ. 2883

కుంభక విధానాన్ని తెలియుటయే కోవిదుని లక్షణము.

ఆ. పంచభూతములను । నెంచుచు మదిలోన
మించి యందవలెను । మిత్తిగొంగ
నంచుఁ దెలియువాఁడే । యఖిలజ్ఞుఁ డగుయోగి ॥వి॥ 2884

మిత్తిగొంగ = మృత్యువును జయించినవాడు (శివుఁడు), అఖిలజ్ఞుడు = అన్నియు దెలిసిన వాడు;

ఆ. పంచభూతములను । బరగి యుండినవాఁడు
పంచలింగములను । బ్రబలి యుండు
బంచబీజమునను । భావింప దానయా ! ॥వి॥ 2885

పంచ జ్యోతిర్లింగములు = భీమేశలింగము, విశ్వేశలింగము విరూపాక్షలింగము, మల్లికార్జున లింగము, రామేశ్వరలింగము.

ఆ. పంచభూతములను । బరగ వలను బట్టి
సంచరింప కుండు । శక్తిఁ దెలిసి
వేటలాడు బెస్త । చాటంబు నెఱుఁగరా ! ॥వి॥ 2886

పంచభూతోన్మాదమును పరిమార్చు మన్నాడు.

ఆ. పంచభూతములను । బరగ నింద్రియముల
సంచరించినపుడు । జగము కలుఁగు
సంచరింపకున్నఁ । జగమెట్లు ? కలుగురా ! ॥వి॥ 2887

పంచభూతములు పంచేంద్రియములు నడిపించిన ప్రపంచము గలదు.

ఆ. పంచ మతములకును । బ్రాహ్మణులకు సొడ్డు
వారితండ్రి నెత్తి । వైతు సొడ్డు
నంతరంగమెల్ల । నాదిశక్తి యొఱుంగు ॥వి॥ 2888

పంచమతములను బ్రాహ్మణత్వమును పాటించలేదు వేమన

ఆ. పంచమ నిగమంబు । భారతం బగునని
పొగడిరేల జనులు ? । బుద్ధిమాలి
హింసకార్యము తను । కిష్ట మెట్లాయెరా ! ॥వి॥ 2889

హింసచేసిన గ్రంథము ఆగమ మెట్లగును ?

క. పంచ మహాభూతములై
పంచ శరీరములుఁ గలిగి । బ్రహ్మాండమై
పంచావస్థలు దాటిన
టెంచుట్టుఁ బరిపూర్తిఁ జెందుఁ । టెంకిని వేమా ! 2890

టెంకి = ముక్తిపొందుట
పంచావస్థలకు చిక్కనివాడే పరిపూర్ణుఁడు.

ఆ. పంచ ముఖములందుఁ । బంచాక్షరి జనించెఁ
బంచ వర్ణములను । బ్రబలె జగము
పంచ ముఖుని మీఁరు । ప్రస్తుతిఁ జేయుఁడే ॥వి॥ 2891

పంచముఖుఁడు = ఈశ్వరుఁడు

పంచముఖములనుండి పంచాక్షరములు పుట్టుట వలన వాటికి తండ్రి శివుడు వానిని భజించి మోక్షమందుము.

ఆ. పంచవర్ణ మెఱుఁగఁ । బరము నెఱుంగును
బరము నెఱుగ నిచ్ఛ । ప్రజ్వరిల్లుఁ
బ్రజ్వరిల్లువాఁడు । పరము తానౌనయా ! వి॥ 2892

ముక్తపదగ్రస్తము పంచాక్షరీ మంత్రము లో తత్వ మెరిగినవాడే పరముడు.

ఆ. పంచశత్రుల నెఱిఁగి । పంచబాణుని గెల్చి
పంచవర్ణములను । పఠనఁజేసి
పంచముఖముఁ గల్గు । భవసంజ్ఞఁ గలవాని
పంచ జేరువాఁడు । బ్రహ్మ వేమ ! 2893

పంచశత్రువులు = పంచేంద్రియములు;
పంచబాణుఁడు = మన్మథుఁడు;పంచవర్ణములు = నమశ్శివాయ;
పంచముఖుడు = యీశ్వరుడు

ఆ. పంచశత్రువులను । బంచబాణునిఁ గెల్చి
పంచవర్ణములను । బఠనఁ జేసి
పంచముఖములందుఁ । బ్రతిఫలించెడు వాని
పంచఁ జేరువాఁడు । పరుఁడు వేమ. 2894

పంచేంద్రియములను జయించి పంచాక్షరీపఠన జేయువాడు పరముడు

క. పంచాక్షరి జప మందిన
సంచిత కర్మములు వాయు । సాకల్యముఁగా
మించును బరమజ్ఞానముఁ
ద్రుంచును దుర్భ్రమముల మదిని । రూఢిగ వేమా ! 2895

సాకల్యముగా = పూర్తిగా, సంచితకర్మము = పూర్వపుపని;
దుర్భ్రమలు = చెడ్డభ్రాంతులు.

క. పంచాక్షరి బీజంబుల
నంచితముగ నెఱుఁగునాతఁ । డఖిలజ్ఞుండై
వంచన యెఱుఁగక కువలయ
సంచారము సేయు నతఁడె । శంభుఁడు వేమా! 2896

కువలయము = భూమి, కలువ;
పంచాక్షరి నెరిగి ప్రపంచానుభవము పొందుము.

ఆ. పండుకొందామన్న । పండుకో నియ్యదు
నిదురఁ బోదామన్న । నిదురరాదు
లేచిపోదామన్న । లేచిపోనియ్యదు ॥వి॥ 2897

ఆశ మానవుని గాసిపెట్టును

ఆ. పండుకొఱికితె గదా । పొచ్చు చక్కిలిగిలై
చెలియనిపై మెచ్చి । చేరవచ్చు
చేతగానివార్లు । చేరునా ఆచెలియ ? ॥వి॥ 2898

మోక్షము గురించి ముక్తసరిగా చెప్పెను

ఆ. పండువలనఁ బుట్టెఁ । బరగు ప్రపంచంబు
పండునలనఁ బుట్టెఁ । బర మిహాములు
పండు కానపడిరి । బ్రహ్మాది సురలెల్ల ॥వి॥ 2899

మోక్షఫలమున కాశించి ముల్లోకములు తపించుచున్నవి,

ఆ. పండువలనఁ బుట్టెఁ । బరగు ప్రపంచంబు
పండువలనఁ బుట్టెఁ । బరము, నిహము
పండు మేలెఱింగెఁ । బ్రహ్మాదు డిలలోన ॥వి॥ 2900

బ్రహ్మాదులు గూడా మోక్షఫలమునకే పరిభ్రమింతురు.

ఆ. పండ్లు విత్తుఁ బోయి । పరము దెలిసినవాఁడె
పురుగు చేరిన రీతి । పుణ్యమూర్తి
కొంచెమాత్రులకెల్ల । కలుగునా యాపదలు ॥వి॥ 2901

పద్యమెల్లా పరిభ్రమిం పవాని మనసువలె నున్నది.

క. పంతము విడక యె నెమ్మది
చింతనమున గుఱ్ఱుఁదెలిసి । చిన్మయుమంద

న్వింత లడంగును మానస
మింతింతని చెప్పరాది । దెఱుఁగుము వేమా ! 2903

పంతము = పట్టుదల; మానవుని పట్టుదల బ్రహ్మమును సాధించుటకే.

ఆ. పంద నధిపుఁ జేసి । బవరంబునకుఁ బంపఁ
బాఱిపోవు గార్య । భంగ మవును
బాఱువాఁడు బంటు । పనికిఁగాఁడెందును ॥వి॥ 2904

బవరము = యుద్ధము ; పనికిమాలినవాడు బంటు కాడు ; (నీతిపద్యము)

ఆ. పందనధిపుఁ జేసి । బవరానికంపిన
వాఁడువాఱు మూాకె । వలెను దెలియఁ
బాఱునట్టి బంటు । పనికిరాఁడెన్నడు ॥వి॥ 2904

భీరుని వీరునిగా చేయుట బెట్టుకొట్టి గొట్టమీద వేసుకొన్నట్టు.

ఆ. పందిపిల్ల లీను । బదియు నైదింటిని
గుంజరం బదీనుఁ । గొదవ నొకటి
నుత్తమ పురుషుఁడ । టొక్కఁడు చాలఁడా ! ॥వి॥ 2905

కుంజరము = ఏనుఁగు ; చెత్త నూటికన్న ఉత్తమ మొక్కటి చాలదా ?

ఆ. పంది యేమెఱుంగు । పన్నీరు వాసన
గాడ్డె యేమెఱుంగు । గురుని బోధ
మదగజం బేమెఱుగు । మంచిది కానిది ॥వి॥ 2906

“ విరజాజి పూదండ విధవకేల ? ” (నృసింహ శతకము)

ఆ. పక్షిజాతిఁ బట్టి । పరగ హింసలఁబెట్టి
గూళ్ళగట్టి యందుఁ । గుదురఁ బెట్టి
యుంచు వారికట్టి । వంచన రాదొకో ! ॥వి॥ 2907

లోకువ వారిని లొంగదీయుట మనము లొంగుటకే.

ఆ. పక్షిజాతిఁ బట్టి । పరగ హింసలఁబెట్టి
కుక్షి నిండ కూడు । కూరుటకునె
వండి తినెడువాఁడు । వసుధ జండాలుండు ॥వి॥ 2908

చండాలుడు పక్షులను వండుకు తిన్నవాడే.

క. పగ యుడుగఁ గోప ముడుగును
పగ తెగ కోపంబు లడఁగుఁ । బదలును కోర్కె
లెగఁ గోర్కె భేద ముడుగును
త్రిగుణము లుడుగంగ ముక్తి । స్థిరమగు వేమా! 2909

వేమన ఒడుదొడుకులు లేని తడబడని శబ్దములతో చక్కని భావము జూపించా డిచ్చట.

క. పగ యుడుగఁ గోప ముడుగును
బగ యుడుగం గోర్కె లుడుగుఁ । బరజన్మంబు
ల్తగు లుడుగు భేద ముడిగినఁ
త్రిగుణంబులు నుడుగు ముక్తి । స్థిరమగు వేమా! 2910

పగ యుడిగిన ప్రపంచాతీతు డగును.

కం. పగ లుడుగఁ గోప ముడుగును
బగ తెగి కోపంబు లుడుగ । వదలును కోర్కె
ల్పగ కోర్కెలుడిగి భేదము
తెగఁ త్రిగుణము లుడుగు ముక్తి । తెరువుగ వేమా! 2911

పగచేత కోపము దానిచేత కోర్కెలు దానిచేత భేదము దీన త్రిగుణములు చెగి ముక్తి వచ్చును.

కం. పగ లుడుగ నాశ లుడుగును
వగ పుడుగం గోర్కె లుడుగు । వడి జన్మంబు
ల్తగు లుడుగు భోగ ముడిగిన
త్రిగుణంబులు నుడుగు ముక్తి । తెరువుగ వేమా! 2912

పగను విడువుమని పలుమారు మనభవ్యుడు చెప్పుతున్నాడు.

ఆ. పగలు రేయు మఱచి । భావంబు మఱచియు
తాను నే ననియెడి । తలఁపు మఱచి
యుండువాని నెంచ । నుత్తమ యోగిరా! ॥వి॥ 2913

మయమరచిన వాడు మహాయోగి.

ఆ. పచ్చఁ జూచువారు । పచ్చ మెచ్చెడు వారు
పచ్చమీఁద వాంఛ । పడిన వారు
పచ్చ విడుచువానిఁ । బ్రభువుగాఁ జూతురు ॥వి॥ 2914

పచ్చ = ధనము ; ధనవాంఛ విడచినవాడు ధన్యుడు.

ఆ. పచ్చదనముఁ జూచి । యిచ్చను గాముకు
లిచ్చలోఁ బడుదురు । క్షితితలమున
నిచ్చ గలుగఁజేయు హెచ్చుగా । మోహంబు ॥వి॥ 2915

స్త్రీల అందమును జూచి చిత్తభ్రాంతులు అమేవారు చిచ్చులో బడుదురు.

ఆ. పచ్చవిల్తుచేతఁ । గ్రచ్చఱ జనులెల్ల
దచ్చనాడనైరి । ధరణిలోనఁ
గులజుఁ డెవ్వఁడిందు । కులహీనుఁ డెవ్వఁడు? ॥వి॥ 2916

మారవికారములకు కాలములేదు స్థలములేదు.

ఆ. పచ్చి పాలును నిమ్మ । పులుసు విడిచియుఁ గాచ
తేటగా నై పోయి । తీపు విడుచు
మనసు చపలంబై తే । మార్గంబు చెడునురా ! ॥వి॥ 2917

* యతిపోయినది ; వస్తుగుణ తత్వము అవ్వారిగా తెలుసు వేమనకు.

ఆ. పచ్చిబియ్యము పప్పు । పరమందు నుండంగ
కూడు వండుక తినెడు । కష్టమేల
కడుపు నిండే కొఱకు । కష్టపడకుంటెట్లు? ॥వి॥ 2918

ఈపద్యము అయోమయ భావంతో అర్థం గాలేదు.

ఆ. పచ్చిమలముఁ దినుచు । బండుటాకు నమలి
యుచ్చ దప్పిదీర్చి । యుడుకు కోర్చి
కచ్చను బిగియింపఁ । గలుగునా తత్వంబు? ॥వి॥ 2919

అడవిలోనున్న బడుగులు చేయు విధానములివి.

ఆ. పట్టకుండి యధిక । భాగ్యంబు పట్టెనా !
దొడ్డవారిఁ దిట్టి । త్రుళ్ళి పడును
అల్పజాతి కుక్క । యధికుల నెఱుఁగునా ? ॥వి॥ 2920

అల్పునికి అధికారము వచ్చిన అందరనూ కాదంటాడు.

ఆ. పట్టనేర్పు పాము । పడగ యోరఁగఁ జేయ
జెఱుపఁ జూచువాఁడు । చెలిమిఁ జేయుఁ
జంపఁదలఁచు రాజు । చనువిచ్చు చుండురా ! ॥వి॥ 2921

ప్రపంచ సాంఘికాలలో గల భవ్య విజ్ఞానాన్ని వివరించాడు వేమన.

ఆ. పట్టరాని పట్టు । పట్టి యుండిన వాఁడు
పుడమిలోనఁ గీర్తిఁ । బొందలేఁడు
సుగుణలక్షణమున । సుజ్ఞాని యౌనయా ! ॥వి॥ 2922

పట్టరానిపట్టు = తగని పట్టుదల ; మంచిలక్షణాలున్న వాని అగును.

ఆ. పట్ను మేలే రాజు । ప్రజల రక్షించును
నీతి మఱచిన ప్రభువు । నేరఁబోతు
దొంగగురువులఁ జేరు । దోసుల గతి యింతె ॥వి॥ 2923

వివిధ విషయాలను వివరించాడు

ఆ. పట్టిన గురుభక్తి । పట్టు విడువకయుంటె
శారదాంబగ పల్కు । సాంబశివుండు
యెచ్చోటఁ జూచిన । నచ్చోట కనఁబడు ॥వి॥ 2924

దీక్షాయుక్తుడై యున్నవానికి దివ్యదర్శన మగును.

ఆ. పటిమ మీఱ మనసుఁ । బాటించి చూడక
కిటుకుఁ దెలియరాదు । కెరలుటకును
జటిల వేషమేల । జైత్రుఁడై సాధింప ॥వి॥ 2925

విజృంభించి విషయాలను సాధించమన్నాడు.

ఆ. పట్టి విడువరాదు । పదిలక్షలకునైనఁ
బెట్టి చెప్పరాదు । పేదకైన
వెట్టి గొలువరాదు । విభుఁ డెట్టిఘనుఁడైన ॥వి॥ 2926

ప్రవక్తవలె ధర్మశాస్త్రాలను భాషించుట మన వేమనకు పరిపాటి.

క. పటు కవిముఖ్యుల సొమ్ములు
దటుకునఁ దానపహరించి । దండనఁ జేసే

మటుమాయ వాని చేష్టలు
పటు రయమునఁ । గుక్క వంటి । ప్రాణము వేమా ! 2927
విద్వాంసులసొమ్ము అపహరించుట కుక్క బుద్ధి.

తే. పటుతరంబుగఁ దనయాత్మ । భావమంది
నిటల దుర్గమ్ముపైనున్న । నియతి మీఱి
ఘటము మఱచినవాఁడెపో । ఘనుఁడు సుమ్మి
కుటిల కర్ముల కిది యెట్టి । కూడు వేమ ! 2928
కుటిలకర్ములకు గోప్యము తెలియదు.

ఆ. పటువుగాను బుద్ధి । పలికించి నొక్కుచుఁ
గుటిలగుణము లన్ని । కూలద్రొక్కి
పటుతరంపు మోహ । పటలంబు వీడరా ! ॥వి॥ 2929
పటలము — తెర ; మోహభ్రాంతిలేక మోక్షాన్ని సాధించమన్నాడు.

ఆ. పట్టుఁగొమ్మ లేక । బలు పాట్లు పడువారు
పెట్టి పొయ్యలేక । తిట్టువారు
ముట్టి శివునిపూజ । మొదలె చేయఁగలేరు ! ॥వి॥ 2930
మూర్ఖులు శివపూజ యేమీ చేయలేరని వేమనభాష్యం.

ఆ. పట్టుఁగొమ్మ వదిలి । పలవింప నేటికి ?
నిట్టె గురుని వేడి । గుట్టు నెఱిఁగి
నిట్టనిలువుఁ గాంచి । నిర్గుణమందరా ! ॥వి॥ 2931
ఆధారము విడచిన నీ దారేమవుతుంది ?

ఆ. పట్టుచీరఁ గట్టి । పట్టెనామము లిడు
సృష్టివైష్ణవంబు । శిఖలు మించు
చిన్నెలెన్ని చేసి। చేయ వైష్ణవమిట్లు ! ॥వి॥ 2932
వీరవైష్ణవ వేషాన్ని విపులీకరించాడు మనమహాకవి.

ఆ. పట్టు పట్టబోఁడు । పట్టిన విడబోఁడు
నెట్టి గుణవికార । నియతి నడచి
మిట్టిపడక లోన । మిన్నంది విజ్ఞుఁడు ! ॥వి॥ 2933
విజ్ఞుడు. విశ్వాన్ని తెలుసుకొనేవరకు విడువడని మననొడయని
నుడువు.

ఆ. పట్టు పట్టరాదు । పట్టిన విడరాదు
నెట్టి గుణవికార । నిహతి నణఁచి
మిట్టిపడక లోని । మిన్నంది యుండరా ! ॥వి॥ 2934

పొగరుబోతువు గాక పూర్ణాన్ని పొందుము.

ఆ. పట్టు పట్టరాదు । పట్టి విడువరాదు
పట్టనేని బిగియఁ । బట్టవలయుఁ
బట్టు విడుటకన్నఁ । బడిచచ్చుటయె మేలు ! ॥వి॥ 2935

తెలిసి పట్టుము, పట్టివిడువకుమని కవిశేఖరుల సూక్తి.

ఆ. పట్టు పట్టిన తఱిఁ । బరవాదము లవేల
నెట్టుకొన్న తలఁపు । నిలుపవలయు
నట్టి పలుకులు విడ । నవనిలో నగుదురు ! ॥వి॥ 2936

నీవు దీక్షాదక్షుడవైన దివ్యత్వము పొందుదువు. విడచిన వెకిలి వగుదువు.

ఆ. పట్టుపొగఁ జుట్టి । పట్టుదోవతిఁ గట్టి
మిట్టదైవతంబు । మిట్టిపడును
చిన్నె లింతె కాని । శ్రీవైష్ణవ మతంబు ॥వి॥ 2937

మధ్యవైష్ణవుల మటుమాయలు వివరించెను విశ్వకవిచంద్రుఁడు.

ఆ. పట్టుబట్ట గట్టి । పట్టెనామముఁ బెట్టి
వట్టిభ్రాంతిఁ జెంది । వైష్ణవుఁ డయి
లొట్టి దాగినతఁడు । లోకుల చెఱచురా ! ॥వి॥ 2938

పెరుమాళ్ళు తీర్థమను పేరుతో కల్లు ముద్రాగి గొల్లపెట్టు మధ్యమ వైష్ణవుల మమకారమిట సూచించెను.

ఆ. పట్టువస్త్రములను । బరగు భూషణములు
కుదువలిడుట లెల్ల । గొదవ పద్దు
లనుభవింపఁ గూడ । దతఁ డెంతవాఁడైన
ననుభవింపఁ గొంత । హానివేమ. 2939

తాకట్టువస్తువుల తానను భవించిన తనకే ముప్పు.

ఆ. పట్టువిడక రేయి । పగలు ఒక్కటిగాను
పట్టు పట్టినవాఁడు । పరమశివుఁడు
ప్రణవ మెఱుఁగకపోతె । పట్టెట్టు చిక్కురా! ॥వి॥ 2940

ప్రణవాన్ని సాధించుటకే పట్టుబట్టుము.

ఆ. పట్టు విడక లోని । గుట్టును గమనించి
ముట్టుటదియె యెఱుక । మూలమగును
బట్టబయలు నందు । పాటింప నెఱుకేది? ॥వి॥ 2941

లోనున్న పరమాత్మని దెలియుట యెఱుక.

ఆ. పట్టు విడుపు లధిక । భాగ్యంబుఁ గూర్చిన
దొడ్డవారినైనఁ । దూలనాడు
నల్పజాతి దుష్టుఁ । డధికుల నెఱుఁగునా? ॥వి॥ 2942

అధము డధికుల నదలించును.

ఆ. పట్టుశాల్వఁ జుట్టి । పట్టుదోవతిఁ గట్టి
జగతి వైష్ణవంబు । శాశ్వతంబె?
చిన్నెలిన్ని నేఁటి । శ్రీవైష్ణవంబులో ॥వి॥ 2943

నేటి శ్రీవైష్ణవుల నిష్టలను నియతిగా చెప్పెను.

ఆ. పట్టెనామ మొప్పఁ । బరమవైష్ణవు' డని
వట్టిమాయ చేయుఁ । బొట్టకొఱకుఁ
బలుగురాల మణులు । పాటింపవచ్చునా! ॥వి॥ 2944

పలుగురాళ్ళు = బండలు: రాళ్ళు రత్నాలు కావు; తిరుమణిధరించిన శ్రీవైష్ణవుడు కాఁడు.

ఆ. పడకనేర్చు లంజె । బంగార మాసించు
మాటలకు నలుచుట । మహిమగాదె?
కొఱక నేర్చినదియు । గోకితే చెప్పునా? ॥వి॥ 2945

బంగార మాసించి మానత్యాగముచేయు మానినుల దూషించాడు.

ఆ. పడఁతిఁ జూచునపుడె । పాలిండ్లపై యాస
నుడగలేక మనుజుఁ । డుపచరించి
యిడుమ లంది పొంది । యిలఁ బట్టి చచ్చురా! ॥వి॥ 2946

స్త్రీభ్రాంతి క్రమేణా క్షీణింప జేయును.

ఆ. పడఁతిముఖము సొగసు । పాటించి చూచినఁ
గోటిపూజలెల్లఁ । గొల్లపోవు
సెగకు చెంతనున్నఁ । జెడునటే తాపంబు ? ॥వి॥ 2947

ఆపదాన్ని అగ్నితో పోల్చెను.

ఆ. పడఁతి మోసె నొకఁడు । పడఁతి మేసె నొకఁడు
పడఁతి నురముజేర్చ । బ్రతికె నొకఁడు
పడతికొఱకె పెక్కు । పాట్లనుఁ బడిరయా ! ॥వి॥ 2948

ఈశ్వరుఁడు సామేన పార్వతిని, విష్ణువు వక్షమున లక్ష్మిని, బ్రహ్మ నోటిలో సరస్వతిని ఉంచుకున్నారు. గాని అహల్యకై యింద్రుడు బహు పాట్లుపడెను.

ఆ. పడఁతియోని పసుపు । పాటించి చూచిన
కోటి పూజలెల్ల । కొల్ల పోవు
సెగకు చెంతనున్న । చెడనట్టి తాపంబు ॥వి॥ 2949

స్త్రీయోని కాసించి చిత్తములు తత్తరపడును.

కం. పడయఁగ రానిది పూర్ణము
తడబడకల మననమందు । దలపడినంతం
జిడిముడి లేకటు నిల్చిన
విడనాడఁగ బట్టబయలె । వెలయును వేమా ! 2950

తడబడకుండా పరిపూర్ణాన్ని తడుముకొమ్మనెను వేమన.

కం. పడి పడి మ్రొక్కఁగ నేటికి
గుడిలోపల కఠినశిలల । గుణములు చెడునా !
గుడి దేహ మాత్మ దేవుఁడు
చెడురాళ్ళకు వట్టిపూజ । సేయకు వేమా ! 2951

విగ్రహారాధనను విమర్శించెను.

ఆ. పడుచు నిచ్చునతని । పద్య మిచ్చినవానిఁ
గడుపు చల్లఁజేసి । ఘనత నిడఁగ
నడవ నేర నతఁడు । నాలిముచ్చేగదా ! ॥వి॥ 2952

నాలిముచ్చు = పిల్లి; మామగారిని కవిని మన్నించనివాడు పిల్లితో సమానము.

ఆ. పడుచు నూరకేల । బారఁ జూచెదరొక్కొ
యెంత వారలైన । భ్రాంతిఁ జెంది
లోన మీఱు కామ । లొంగఁజేయఁగలేక ॥వి॥ 2953

మన్మధుని కట్టినవానికి మానినిపై మమకార ముండదు.

ఆ. పడుచు నొసఁగువాని । పద్య మొసఁగువాని
గడుపు చల్లఁజేసి । గౌరవమున
నడపలేనివాఁడు । నాలంజె కొడుకురా ! ॥వి॥ 2954

లంజకొడుకు మామగారిని కవిని ఆదరించనివాడు గాడా.

ఆ. పడుచు పక్వమెన్నఁ । బసివాఁడెఱుఁగునా?
సరవి దివ్యయోగి । యెఱుఁగుగాక
మోహగుణ మెఱింగి । మోహంబు విడనాడు ॥వి॥ 2955

ప్రౌఢ కాంతాదరాయత్తము నుత్తమయోగి చిత్తమెరుఁగును.

ఆ. పడుచు పక్వమెన్న । పసివాఁ డెఱుంగునా?
యెఱుక దివ్య యోగి । యెరుఁగుగాక
లోక గుణ మెఱింగి । మోహంబు విడనాడు ॥వి॥ 2956

పసివానికి పస తెలియదు.

ఆ. పడుచుమాట లాడి । పరితపింపఁగనేల
వెడఁగు చర్య లడఁచి । వేడి గురుని
యడుగులంటి మ్రొక్కి । యాసను విడఁద్రొక్కు ॥వి॥ 2957

పడుచుమాటలు = బింకపు మాటలు; బింకాలు పలికి లంకెలు పడకుము.

ఆ. పడుపు మరుగు లంజె । పై నాసపడుఁగాక
యుత్తమాటల కది । యొప్పదెపుడు
కుడితి మరుగు బఱ్ఱె । విడినీరు ద్రాగునా? ॥వి॥ 2958

తెలయాలు పలుకులకు కులుకుతుందా ?

ఆ. పతకమందు నొప్పు । బలురత్నముల సొంపు
బంగరందుఁ గూర్చ । బరువు గనును
గాని యితరలోహ । మైన హీనము గాదె ? ॥వి॥ 2959

దేనికి తగిన స్థానము దానికే న్యాయమలయును.

ఆ. పతగ మితరజంతు । వితతి యంతకు మేటి
యగునె ? రెక్కలుండి । యెగయఁ గలుగ ;
వట్టియోగి యిట్టి । వైఖరి వాఁ డయా ! ॥వి॥ 2960
రెక్కలున్న లెక్కకురాదు ; యోగి వేషమున యోగత్వమందడు.

ఆ. పతన మందునట్టి । పక్వఫలంబును
బట్టి తినఁగలాఁడు । పచ్చికాయ
కాసపడఁడు యోగి । కైహికమిట్టిదే ॥వి॥ 2961
పతనమందు = పడిపోవు ; యోగి యిహసౌఖ్యముల నొల్లఁడు.

ఆ. పత్తనమునఁ గలరు । ప్రౌఢాంగనలు వారు
పల్లెలందు నిలిచి । బ్రదుకఁగలరె ?
సుఖులు పరము బారి । శోభింప లేరయా ! ॥వి॥ 2962
పట్టణవాసులు పల్లెజీవనము పట్టలేరు.

ఆ. పత్తనమ్ములందుఁ । బతులకు సతులకు
మోహమెచ్చు దాని । యూహ లెచ్చు
ముక్తిమార్గమునకు । యుక్తియే తెలియదు ॥వి॥ 2963
పట్టణపు పడతులకు వేషభాషలమీద మోజు.

ఆ. పతికు నాదుబల్కు । పడతియే శునకంబు
మీరు సతిని గవయు । మిగుల పతియు
పంది పందికూడి । పడదొక్కో రొంపిలో ॥వి॥ 2964
వ్యభిచరించిన వారిని బురదలోని పందులుగా పోల్చాడు.

ఆ. పతికి మాఱువల్కు । పడతి శునక మగు
మీఱిన సతితోడ । మెలఁగ రోఁత
పందిఁ బందిఁగూడి । పడుఁ గదా రొంపిలో ॥వి॥ 2965
రొంపి = బురద ; భర్తకు ప్రతిమాట లాడరాదు.

ఆ. పతిని దిట్టరాదు । పదివేలకైనను
బెట్టి చెప్పరాదు । పెద్దతోను
బతిని మీఱనగునె ? । సతి మానవతి యైన ॥వి॥ 2966
మానవతియైన సతి పతిని మీరదు.

ఆ. పతిని నిందఁజేసి । పాటించి యెంచని
సతులకెల్ల ముక్తి । సాధకంబు
ఎట్లుగల్గు? నియతి । యెంచంగలేరయా ! ॥వి॥ 2967

పతిని దూషించిన సతికి సద్గతులెట్లు కల్గును ?

ఆ. పతిని భావమందుఁ । బరమాత్మగా నెంచు
పడఁతి కమరు గతిని । బరమటంద్రు;
పతిని దూఱునట్టి । పడఁతికి దుర్గతి
విడని బాధకలుగు । వినర వేమ. 2968

పతివాక్యానుసారిణికే పరముగల్గు.

ఆ. పతిని విడువరాదు । పదివేలకైనను
బెట్టి చెప్పరాదు । పెద్దకైనఁ
బతిని దిట్టరాదు । సతి రూపవతియైన ॥వి॥ 2969

అందచందాలు గలిగిన ఆడదైనా ఆత్మేశు ననాదరణ చేయరాదు.

క. పతియొప్పిన సతియొప్పును
బతిసతు లొకటైనఁ బరమ । పావనమగురా !
సతిపతి విధమదె మోక్షం
బతులిత పరమాత్మ నైక్య । మగురా ! వేమా! 2970

చతురస్రానుకూలముగా చక్కని చిక్కని మిక్కుటమగు భావోద్రేకంతో రచించాడు.

క. పతి సుతు లిద్దరుఁ గూడియు
సతి కిరుగడ పవ్వళింప । సంతత దృష్టిన్
బతిఁజూచు మాంసపిండము
సుతు లందలి పాల ప్రేమఁ । జూతురు వేమా! 2971

భర్తృ, పుత్రుల భావము చిత్రించాడు.

క. పతిసుతు లిద్దఱు గూడుక
సతియొద్దనె పవ్వళింత్రు । స్తనయుగళంబున్

సుతుడంటినఁ బాలుబ్బును
బతియంటిన నల్లతావు । పదనగు వేమా! 2972
మనోభావములను బట్టి మానసిక పరిణామమగును.

ఆ. పద్మాసనముగల । ప్రణవనాదము లేపి
దశవిధ వాద్యముల్ । దెలియవలయు
అష్టాంగ యోగముల్ । అది వేరుగాద యూ! ॥వి॥ 2973
యతి చెడినది: పద్మాసనాద్యాసనములు శాంభవ్యాది ముద్రలు తెలుసుకొనుటకే!

ఆ. పదవి గలుగ లంజె । పైఁ దానె పడుఁగాక
పేదవాని మాట । ప్రియము లేదు
కుడితి మరుగు బఱ్ఱె । కూసినఁ జేప్పునా! ॥వి॥ 2974
పెద్దలంజ పేదవానికెట్లు దొరకును?

ఆ. పదవినున్న లంజె । పై దానె పడుఁగాక
పేదవానిమాట । ప్రియముగొనదు
ముద్దరాలి మగఁడు । ముసలి మెచ్చునా! ॥వి॥ 2975
పడుచుదానిని బడుగుమగడు భళిభళీ యనునా!

ఆ. పది యసంగతములు । పదిసార్లు చేసినఁ
దప్పుదారి ద్రొక్క । దార్ఢ్య మొదవుఁ
గూడ దేలనట్టి । కుదిరిక మంచికి ॥వి॥ 2976
తప్పులు చేసినట్టు ఒప్పులెందుకు చేయవు?

ఆ. పదిమంది యొకటయి । పడుచు బిడ్డను గూర్చి
మేళ తాళములతో । మెరయఁజేసి
పెండ్లంటు చేతురు । పేరేళవు యిదియేమొ? ॥వి॥ 2977
వీరణము = పెండ్లిబాజా; వివాహాన్ని వివరించాడు.

ఆ. పదిల పడఁగ మనసు । పట్ట నేరనివాఁడు
కదియబోఁడు పూర్ణ । కలితుఁ డగును
గుదురుకొనెడి వాఁడు కోవిదుఁ డగునయా! ॥వి॥ 2978
మనసు కుదిరిన మర్మము కుదురును.

ఆ. పదుగురాడు మాట । పాటియై ధరజెల్లు
నొక్కడాడు మాట । యెక్కదెందు
నూరకుండు వాని । నూరెల్ల నోపదు ॥వి॥ 2979

పదిమందన్నదే మాట! పదిమంది నడచినదే బాట!

ఆ. పదును గలుగు భూమి । పచ్చనై యుండును
ఈవిగలుగు లంజె । యింట నుండు
దలపు గలుగ హరియు । దనయొద్దనే యుండు ॥వి॥ 2980

మనసు గలిగిన వారికి మహేశుడు మరిగియే యుండును.

ఆ. పనస తొనలకన్న । బంచదారలకన్న
జుంటి తేనె కన్న । జున్ను కన్న
జెఱుకు రసము కన్న । జెలిమాట తీపిరా! ॥వి॥ 2981

ఇదిఅతిశయమైన అందరికి తెలిసిన అవసరమైన ఆనందమిచ్చిన భావము. ఇటువంటి పద్యములే వేమనను మహాకవిగా జేశాయి.

ఆ. పసి తొడవులు వేఱు । బంగార మొక్కటి
పలు ఘటములు వేఱు । ప్రాణ మొకటి
యరయ దిండ్లు వేఱు । టాకలి యొక్కటి ॥వి॥ 2982

తొడవులు = నగలు, ఘటము = కుండ; అసలువస్తువు అన్నిటికీ ఒక్కటే.

కం. పసుపడి నిర్గుణ మనునది
తనకెద్దియు దోపబోదు । తత్త్వ మెఱుగకే
మన నాంతరంగ మందును
వినయంబగు బయలు చేరి । వెలయుము వేమా! 2983

మనస్సు మననము చేసిన మహేశుని దర్శనమగును.

ఆ. పప్పు, పరమాన్నంబు । పాయసంబు, వడలు
పోళీలు మెత్తని । పూర్ణకుడుము
నాలుక విలాసించు । నెయ్యితోడను యిన్ని ॥వి॥ 2984

యతితప్పు; జిహ్వా పలురుచుల నాసించును.

ఆ. పప్పులేనికూడు । పరుల కసహ్యమౌ
నప్పులేనివాఁడె । యధికబలుఁడు
ముప్పులేనివాఁడు మొనటిసుజ్ఞానిరా! ॥వి॥ 2985

శా. "లోకోల్లాసవిలాసచారి మహాశ్లోకుండు మావేమనా సాకల్యంబగు
భావముఙ్గానిపి ప్రోత్సాహంబుగా వ్రాయుటన్ ॥

ఆ. పయిరు నిడినవాని । ఫలమేమి చెప్పుదుఁ!
బయిరు నిడనివాని । ఫలముపాడు
పయిరు నిడినవాఁడు । పరలోకధాముఁడౌ ॥వి॥ 2986

రైతు రాచరికాన్ని రమ్యముగా పోల్చాడు "నావిష్ణుః పృథివీపతిః."

క. పరకాంతకు సోదరుఁడై
పరుధనముల కాసపడక । పరులకు హితుఁడై
పరు లలిగినఁ దా నలుగక
పరులెన్నగ బ్రతుకునతఁడె । ప్రాజ్ఞుడుఁ వేమా! 2987

సుమతీశతకపద్యమును సూటిగా చోరకవి మార్చి చేర్చా డెవడో.

క. పరకాంతలందు భ్రాంతియు
నరకంబని తెలిసిమైన । నమ్మోట బహు దు
స్తరమగు నెంతటివారికి
గురుకృప గలుగంగఁగాని । కుదురదు వేమా! 2988

పరకాంతా సంగమము పాపము.

క. పరకాంతా సోదరుఁడై
పరధనములపైన భ్రాంతి । పడకుండి తనుం
బొరిగొను కోపముతోడను
బరులలిగిన నవ్వువాఁడె । బ్రహ్మము వేమా! 2989

భద్ర భూపాలుని భావా న్ననుకరించినట్లు తోస్తుం దీపద్యము.

ఆ. పరగ గడ్డిదినెడు । పశువుల విశసించి
మనుజులు దిని భువిని । మాలలైరి

యందరి పియ దినెడు । పందుల కోళ్ళను
దినిన కుల మదేటి । దిలను వేమ ? 2990

పందులను, కోళ్ళను దిను వారు పరమ చండాలురు.

ఆ. పరగఁ జెట్టఁబట్టి । పాలింపలేకున్న
వెలుగుదాటి వీసు । వెళ్ళఁబాఱు
నాడు వారిచిత్త । మటువలె నుండురా ! ॥వి॥ 2991

ఆడవారి చిత్తప్రవృత్తులు అడుగడుగున కట్టుసవాలే ?

ఆ. పరగ జలకమాడి । పట్టెనామము దీర్చి
నీరుకావి పంచె । నెరయఁ గట్టి
వారకాంతఁ జూడ । వ్రతమెల్ల మఱచురా ! ॥వి॥ 2992

నీరుకావి ధోవతులు వారకాంతల వలపులకే !

ఆ. పరగఁ దా నొసగఁడు । పరులు చెప్పినదైన
నియ్యఁజాలక విధి । నెసఁగువాఁడు
పొట్టు దినెడి లంజ । బువ్వాలు పెట్టునా? ॥వి॥ 2993

" పెద్దపులి పేరంటము బెట్టునా ! "

ఆ. పరగఁ దా నొసగక । పరులు చెప్పినదైన
నియ్య జాలక విధి । నెంచువాఁడు
పొట్టు దినెడు కాకి । బువ్వోట్లు పెట్టురా ॥వి॥ 2994

నూటిదైన మాటలతో సూక్ష్మాంశాన్ని నీటుగా చెబుతాడు.

ఆ. పరగ నింతదనుక । పడినపా టెరుగఁడో !
ఘనత నొప్పు మనుజుఁ । డనఁగఁ బుట్టి
కీడు మె లెఱుఁగక । క్రిందగు జిత్రము ॥వి॥ 2995

మానవత్వముగల మనుజుఁడు మమ కారములోఁబడుట మహాచిత్రమే !

ఆ. పరగఁ దేవుఁజేసి । ప్రజలను మ్రొక్కించి
త్రొక్కు భూమికెల్ల । దొరను జేసి
మనుజవరుల కొగిని । మాంగల్యమును జేసి
యాజ్ఞ చేసి యేలె । నతఁడు వేమ. 2996

వేమన తన గురువగు అభిరామయ్యనో ! లంబికాశివయోగినో అతి మాత్ర తేజోమూర్తిగా అభినందించుకొన్నాడు.

తే. పరగ నట్టిల్లువిడక నా । భాగ్య మనిన
దైవమెట్లులు గొని తెచ్చు । తనకు నిచ్చుఁ
జేయదఁగిన ప్రయత్నము । ల్చేయఁ జేయ
వలయు నటమీఁద దన భాగ్య । వశము వేమ. 2997

"ప్రయత్నేన సాధ్యతే సర్వమ్" ప్రయత్నము చేస్తే కార్యసాధన మగును.

ఆ. పరగ నింతవరకు । బడిన పాటెఱుఁగఁడే
ఘనత నొప్పు మనుజుఁ । డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక । క్రిందాయెఁ జూడరా! ॥వి॥ 29:8

మనుజుఁడు తన ఘనత మానకుండా తెలుకొనవలెను.

ఆ. పరగ ప్రతిమలకును । ప్రాణప్రతిష్ఠలో
ప్రాణ మొసఁగ ప్రతిమ । పలుకఁ గలదె?
మొదటివాని సృష్టి । మూర్తివంతంబై ॥వి॥ 2999

బ్రహ్మ ముడిపదార్థము చేసిన విశ్వబ్రహ్మ విగ్రహము చేశాడు.

ఆ. పరగ నిలను ముందు । బ్రతుకు రీ తెఱుఁగక
సకల సంపదలును । సతము లనుచు
దూరదృష్టి లేక । మీఱుచు వర్తించు
హీనుఁ డందకున్నె । యెగ్గు వేమ. 3000

దూరదృష్టిలేని వారికి దుఃఖమే. మూలపదార్థమంతా ఒక్కటే ఆకారములు వేరువేరు.

ఆ. పరగ బొందులు పది । ప్రాణం బదొక్కటి
పుష్పజాతులు పది । పూజ యొకటి
పసుల వన్నెలు పది । పాలన్ని యొక్కటి ॥వి॥ 3001

ఉత్పత్తి స్వరూపాలు వేరుగాని వస్తువొక్కటే.

ఆ. పరగ బొమ్మ గుడ్డుఁ । బరికించి చూచినఁ
'గులములన్ని యందె । కూడి పుట్టె
నంద అొకటఁ గలియు । నన్నదమ్ములె కదా! ॥వి॥ 3002

ప్రపంచాతీతుడయి బయలనునిల్చి వేమన చెప్పిన మహోత్కృష్ట భావమిది.

ఆ. పరగ భూమియందు । బ్రౌణ ప్రతిష్ఠా మె
బ్రౌణ మొసఁగఁ బ్రతిను । పలుకవలదె ?
మొదటివాని దృష్టి । మూర్తివంతంబైన ॥వి॥ 3003

విగ్రహాలకు ప్రాణపతిష్ఠ జేసిన పలుకునా !

ఆ. పరగ ముందఱ తమ । బ్రతుకు తెర్వెఱుఁగక
సకల సంపదలును । సతము లనుచు
జలముఁబాయు చేప । చంద మేర్పడి తుద
గతియు వేరె లేక । గలుగు వేమ! 3004

ఆగతానాగతములు స్థితుల నెరుగనివాడు పతితుడే ?

ఆ. పరగ రాజకులులు । పాతిన ధనమెల్ల
భటుల పాలొ, కవుల । పాలొ తలఁప
నొనర హీనజనుని । ధనము దాయాదుల
పాలొ జారకాంత । పాలొ వేమ. 3005

దాచిన ధనము ధర్మానికో కర్మానికో.

ఆ. పరగ రాతిగుండు । పగులఁగొట్టఁగవచ్చుఁ
గొండలన్ని పిండి । కొట్టవచ్చుఁ
గఠినచిత్తు మనసుఁ । గఱిగింపఁగారాదు ॥వి॥ 3006

పాషాణహృదయుని పరమమార్గానికి తీసుకురాలేము.

ఆ. పరగ రాయనమంత్రి । బాచన్న ధనమెల్ల
భట, కవి, యాచక । పరులు పాలు
సరగ శ్రీనాథుడు । సంతరించిన ధనము
వార జార స్త్రీల । పాలు వేమ. 3007

శ్రీనాధకవి స్త్రీలను; 'మంత్రిభాస్కరుడు కవి, నట. భట, యాచకులను ఆనందపరచారు.

ఆ. పరగ రాయని కుల । బాచని ధనమెల్ల
భటులపాలు కవుల । పాలు తలఁప

ఒనర హీనజనుని । ధనము దాయాదుల
పాలు జారకాంత । పాలు వేమ. 3008

" క. చేకొని రాయనిబానడు కాకాలు గుణించు పిన్నకాలమునాడే
లాకేత్వమీయ నేరడు దాకను కొమ్మిమ్మ్యా డిట్టి దాతలు గలరే "

ఆ. పరగఋషులు భువిని । పరమ పవిత్రులై
మించి లోకమునకు । మేలుఁ జేయ
సంచితార్థములను । సమయింప జేయరే! ॥వి॥ 3009

పూర్వజన్మపాపములే సంచితార్థములు. ఋషిప్రోక్తములు వీటిని పోగొట్టును.

ఆ. పరగ లేమిచేత । బంధువు ల్పగ వారు
పరగ లేమిచేత । బరము తప్పుఁ
బరగ లేమిచేతఁ । బరపతియును దప్పు ॥వి॥ 3010

ధనము లేమిని ధరణిపై పనికిరాడు.

ఆ. పరగాలి యోగికి । పక్కతోడై యుండు
పరగాలిపై నాశ । పట్ట బోఁడు
కప్ప మంటిని నమ్మి । యప్పును విడుచునా! ॥వి॥ 3011

అప్పు = నీరు ; యోగి యిరుగుపొరుగులు వీక్షింపక తదేకధ్యాన ముతో యుండును.

క. పరగిన గాలి నభంబున
నెరయంగా భూమియందు । నీరుండుఁ గదా
దరిదాపుల వేఱొక్కటి
యిరవుకొనుం దేజమిట్టె । యెల్లెడ వేమా! 3012

మిన్నునున్న మేఘం మన్నుపై నీరు.

ఆ. పరదళములఁ జూచి । ప్రాణంపుఁ బ్రీతిచే
నురుకుఁ బిఱికివాఁడ । టూరిదాక
యముఁడు వచ్చినప్పు । డడ్డంబికెవ్వఁడో! ॥వి॥ 3013

పిరికితనము చేలను జేయును.

తే. పరదేశియై వెనుక । ప్రజలు యేమంటేమి ?
వారినోటికి చేటు । వచ్చుఁగాక
కొండచంద్రునిఁ జూచి । కుక్క మొరిగిన రీతి ॥వి॥ 3014
పరమ పావనులను పరిహసించుట పాట్లుఁబడుటకే !

ఆ. పర ధనంబునకును । బారుగా జేఁజాచి
సత్యమింత లేని । చట్టు ద్విజులు
ద్విజులమంచు నెంత్రు । తేజమించుక లేదు ॥వి॥ 3015
చేజాచి = యాచించి (నుడి కారము) యాచన బ్రాహ్మణాధీనము.

ఆ. పరధనములకుఁ జేయి । పట్టెను మిక్కిలి
సత్యమింత లేక । జారుఁడయ్యె
ద్విజుఁ డనుకొను తాను । దేజమింతయు లేక ॥వి॥ 3016
చంద్రుఁడు తారనాసించి తరుగు పెరుగులు గల వాడాయెను.
(తారాశశాంకము)

కం. పరినారీ దూరగుఁడై
పరధనముల కాసపడని । పరమోత్తముఁడై
పరు లులికినఁ దా నులుకక
పరులెన్నఁగ బ్రతుకువాఁడు । ప్రాజ్ఞుఁడు వేమా ! 3017
కావ్య కమలాసనుని కందపద్యమును కాపీగొట్టెడెవడో !

ఆ. పరపురుషునిమీఁదఁ । బ్రాణంబుఁ బెట్టుక
మగువ సేయుఁ దనదు । మంచి తనము
అట్టిభంగి యోగి । యాత్మ భావించును ॥వి॥ 3018
లలనామణుల చిత్తము లు లతల వంటివి.

ఆ. పరబలంబుఁ జూచి । ప్రాణరక్షణమున
కుటికి పాటిపోవుఁ । బిటికి నరుఁడు
యముఁడు కుపితుఁడైన । నడ్డమెవ్వఁడో ॥వి॥ 3019
మరణాన్ని పిరికితనము మాన్పుతుందా !

ఆ. పరభృతమ్ము కాక । పాలిత మైనట్టు
దారిఁ జూపవలయు । దజ్ఞుఁడొకఁడు
తొంటి జన్మఫలము । తుదకెట్టు ప్రొప్పిన ॥వి॥ 3020

పరభృతము = పరుల చేత బ్రతికినది (కోకిల)

తే. పరమగురుఁ డభిరాముఁడు । పాదములకుఁ
జేతులను జాచి మ్రొక్కితి । శిరముఁ జేర్చి
తప్పువినియును క్షమియించె । నొప్పిదముగఁ
దలపఁడేనందఁ దనపాటు । ఫలము వేమ. 3021

స్వీయచరిత్రను సిగ్గువిడిచి చెప్పుకొన్నాడు వేమన నేము షీదురంధరుడే!

ధృవకోకిల. పరమగురువను మంత్రసిద్ధిని । బట్టి నీలో నుంచరా
యురములో గురు బయలుఁ దాకెడి । నూని నొక్కినతోడనే
కరతలామలకంబు బ్రహ్మము । గాలుచుండెడిఁ బజ్జలోఁ
దిరము వేమనచేరు పదవిని । దెంపుగా మదినుంచరా! 3022

అసలైన కోకిలారవములో తన కవితాకన్యారామములో అందంగా ఆలాపించాడు వేమన.

ఆ. పరమ నిర్గుణంబుఁ । బట్టి జూపఁగలేరు
గురుతరంబుగాను । గోప్య మెఱిఁగి
చెలగుచుండు యోగి । చిట్టాడిచుట్టురా! ॥వి॥ 3023

పరిపూర్ణాన్ని పరమయోగిపట్టి పరమానంద మందగలడు.

తే. పరమ నిర్గుణ విద్యలో । భావముంచి
మానసజ్ఞాన పరిపూర్ణ । మననమందు
నేకరూపము మదినెంచు । నిచ్చఁగనుము
శాశ్వతానంద సంసిద్ధి । జరుగు వేమ. 3024

నిర్గుణబ్రహ్మమును నిటలతటమున పటుతరముగ వీక్షించదన్నాడు.

ఆ. పరమపదవిఁ గోరు । భక్తుండు నిత్యము
రాజు గోరుచుండు । రణ జయంబు
మూర్ఖుఁ డెపుడుఁ గోరు । ముదితలతోఁ బొందె ॥వి॥ 3025

ఎవరికి తగినకోరికలు వారు కోరుచుండుట సహజము.

ఆ. పరమ పావనతను । బ్రాహ్మణోత్తరుఁ డగు
విశ్వకర్మ వంశ । విదిత యశుడు
మానఘనుఁడు గురుఁడు । తా నభిరామయ
నన్ను గురునిఁ జేర్చి । నాఁడు వేమ. 3026

వేమన తన గురుభక్తిని వివరించుకొన్నాడు.

ఆ. పరమ భాగవతులు । ప్రజలు సంతోషించు
నాటపాట నేర్చి । నీటుగాను
గోట్లకొలదిఁ దెచ్చి । కూటికి లేకుంద్రు ॥వి॥ 3027

నటీ నటకుల కంత్యములో బొటాబొటి భోజనము.

ఆ. పరమయోగుల మని । పరముఁ జేరగలేని
మాయజనుల కెట్లు ? మంచికల్గు
వేసములను విడిచి । విహరించు టే ముక్తి ॥వి॥ 3028

వేష భాషలు విశ్వేశునికి దూరములే.

ఆ. పరమసిద్ధాంత మగునట్టి । బయలుజేరి
పట్టు విడుపులు వదలి తాఁ । బ్రాకి నిలిచి
వట్టిదని లోకపాశంబు । వదల నగును
పిదపఁ గననగు నానంద । పదవి వేమ. 3029

లోక పాశం విడచి బయలకు ప్రాకి పరము నందినవాడే పరముడు.

ఆ. పరమ సిద్ధిగోఱకు । బాపల నిగుడించి
శ్రవణ, మనన, వృత్తి । సంగ్రహించి
యెఱుక మఱచువాఁడె । యేకాగ్రచిత్తుఁడౌ ॥వి॥ 3030

నిమీలితనయ నారవిందుఁడై నిలచినవాడే నిశ్చలుఁడు.

ఆ. పరమహంస యనుచుఁ । బరువుచేయుఁగ భూమిఁ
బరధనముల కాస । పడెడువాఁడు
పరమహంస కాఁడు । పరహింసకుం డంద్రు ॥వి॥ 3031

పరమహంస = తాను తరించి యితరుల తరింపజేయువాడు ; బూటకపు పరమహంసలకు బుద్ధిచెప్పెను.

ఆ. పరమాత్మ యనగను । ప్రణవ స్వరూపంబు
జీవాత్మ యనగను । జ్యోతిమయము
నంతరాత్మనగను । ఆకాశ స్థలమురా ! ॥వి॥ 3032

* యతికష్టు ; ప్రణవ, జ్యోతి, ఆకాశస్థలముల నంటినవాడే సూటి నెఱిగిన మేటి.

తే. పరమాత్మలో వుండి । పల్కు పల్కెడివాఁడు ?
జీవాత్మ యనుటేమి । జీరుటేమి ?
నంతరాత్మనుటేమి ? । ఆడుటదేమిరా ? ॥వి॥ 3033

జీరుట = పిలచుట ; పరమాత్మ = బ్రహ్మము; జీవాత్మ = జీవుఁడు;
అంతరాత్మ = మానసాంతరము :

క. పరమాత్ముని చింతనలోఁ
దఱచుగ నుండుటయె తగును । ధర నాకటికిం
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహ వేదికందు । దొంగుము వేమా! 3034

తిరిపము = బిక్షము; గృహ మేద = గృహస్థు ; వేదిక = అరుగు, తిన్నె ;

క. పరమాత్ముని వివరింపఁగ
నరుఁ డా యణు రేణువందు । నతిసూక్ష్మ గతిం
బరికింప నన్ని రూపుల
గురుఁడై తా వెలుగుచుండు । గుఱుతుగ వేమా! 3035

పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రకాశించిన పరమును ప్రసంసించెను.

ఆ. పరముఁ గోరినట్టి । పామర జనులకు
స్థిరముగాదు బుద్ధి । చిక్కఁబోదు
తరముగాని పరముఁ । దలపోతయగు రోఁత ॥వి॥ 3036

తరముగాని = అసాధ్యమగు ; చంచలహృదయులకు బ్రహ్మానంద మంటదు.

ఆ. ఇహమున సుఖియింప । హేమతారకవిద్య
పరమున సుఖయింప । బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్లఁ । గల్ల మూఢులకేరా ! ॥వి॥ 3037

యిహమునకు బంగారము, పరమునకు భక్తి ప్రధానములు.

ఆ. పరము పర మటంచు । బలుకుదు రందఱుఁ
బరమునందు నేమి । ప్రబలముండుఁ ?
బరమునందు నిండుఁ । బరిపూర్ణుఁడే కదా ! ॥వి॥ 3038

యిహ పరములరెంట యిందుకిరణములు పొందుగా ఉన్నవి.

ఆ. పరయువ తితరంబు । పాటించి కోరిన
కోటి పూజలెల్లఁ । గొల్లబోవు
సెగకుఁ జెంతవెన్న । చెడదె తాపముచేత ? ॥వి॥ 3039

స్త్రీ మోహాగ్నికి పురుషచిత్తనవనీతములు కరుగకుండునా ?

ఆ. పరసతీ గమనంబు । ప్రత్యక్ష నరకంబ
దరయ నిందల కిల । నాలయంబు
పురుషుఁడు దిన జంపు । భూపతి నొప్పించు ॥వి॥ 3040

మానము ధన, ప్రాణ, హరణ కారణము.

ఆ. పరుస మినుము సోక । బంగార మైనట్లు
కప్పురంబు జ్యోతిఁ । గలిసినట్లు
పుష్పమందుఁ దావి । పొసఁగినట్లుగు ముక్తి ।వి॥ 3041

పరుసవేది = యినుమును బంగారముగా మార్చునది; యిది వ్యాస భారతములో దుర్యోధనునొద్దను, పెదకోమటి వేమారెడ్డి దగ్గరను (చరిత్ర) యున్నదందురు.

కం. పరిపక్వ మొప్ప శిష్యుని
యురమందలి బయలుచూపి । యుద్ఘాటముగాఁ
బరిపూర్ణ మందఁజేసెడు
గురుఁడు పరబ్రహ్మమైన । గుణనిధి వేమా ! 3042

హృదయమందున్న సదమలబ్రహ్మమును శిష్యునకు జూపినవాడేగురువు.

కం. పరిశీలించిన జ్ఞప్తిని
గుఱినిల్పెడు భక్తిచేత । గోర్కెలడగెడిన్
స్థిరరూపమంది పొందెడు
పరిపూర్ణ సమాగమంబు । బడయుము వేమా ! 3043

గురిని నిల్పిన పరిపూర్ణ సమాగమము ప్రాప్తించును.

ఆ. పరుల కుపకరించి । పరుసొమ్ము పరునకుఁ
బరగ నిచ్చునేనిఁ । బరము కల్గు
బరముకన్న నేమి ? । పావన మా సొమ్ము ॥వి॥ 3044

కాకులను గొట్టి గ్రద్దలకు వేయుటను వాడెను.

ఆ. పరుల కుపకరింపఁ । బాప క్షయంబగుఁ
బరుల కుపకరింపఁ । బట్టుఁగొమ్మ
పరుల కుపకరింప । పరలోక సాధన
పరుల కుపకరింప । బలిమి వేమ. 3045

అంతరముల నెరిగి అవసరముల కడ్డుపడినవాడే అమోఘమైనవాడు.

ఆ. పరుల దత్తమొప్పి । పాలనఁ జేసిన
నిల స్వదత్తమునకు । నినుమడి యగు
నవని పరుల దత్త । మపహరించిన స్వద
త్తంబు నిష్ఫలంబు । ధరణి వేమ. 3046

దత్తము = యిచ్చుట ; యినుమడించుట = రెట్టింపగుట ; ధర్మ సూత్రము తత్వప్రసక్తికి గట్టెను

ఆ. పరుల దిట్టినంతఁ । బాప కర్మంబబ్బు
విడువ దెన్నఁటికిని । విశ్వమందుఁ
బరుఁడు పరుఁడు గాఁడు । పరమాత్మ యౌనయా ॥వి॥ 3047

సర్వమానవ సౌభ్రాతృత్వమును చాటిచెప్పెడు పునపరసుఁడు.

పరుల నిందఁజేయఁ । బరులు నాచారన
స్థిరము, నస్థిరమును । దెలియ కుంటె
పరగ మిన్ను చేతఁ । బట్టుక పెట్టినఁ
బెట్టుగాదు కట్టి । పెట్టు వేమ. 3048

మిన్ను = ఆకాశము ; తాజేసిన మంచి తాను చెప్పుకొనుట తన భ్రష్టత్వమునకే.

కం. పరులను నీవని తలఁచెడు
పరమబుద్ధిని మీఱకీవు । పదరక యున్నన్

స్థిరవేతృతందుఁ దోఁచెడు
పరిపూర్ణమె బట్టబయలు । బాగుగ వేమా! 3049
పదరుట = వదరుబోతుతనము ; వేతృత్వము = సరసోక్తులు ; పరులను తనవలె జూచుకొనిన తానే బ్రహ్మము.

ఆ. పరుల మేలుఁజూచి । పలుగాకివలె నెప్డు
వట్టి మాట లాడు । వాఁ డధముఁడు
అట్టివాఁడు బ్రదుకు । టదియేల ? మంటికి ॥వి॥ 3050
ఓర్వలేనితనము తనఉన్నతికి భంగపాటు.

ఆ. పరుల మోసపుచ్చి । పరధన మార్జించి
కడుపు నించుకొనుట । కాని పద్దు
ఋణము సేయు మనుజుఁ । డెక్కువ కెక్కునా! ॥వి॥ 3051
అప్పుచేయుట హానికరము.

ఆ. పరుల విత్తమందు । భ్రాంతి మానినయట్టి
పురుషుఁ డవనిలోనఁ । బుణ్యమూర్తి
పరుల విత్త మరయఁ । బాప సంచితమౌను ॥వి॥ 3052
విత్తము = డబ్బు ; పాపసంచితము = పాపపుమూట ; పరధనము విషప్రాయముగా భావించినవాడు పరముడు.

ఆ. పరులు చదువఁజూచి । నిరసనబుద్ధితో
వట్టి మాటలాడు । వాఁడు గండు
అట్టివాని బ్రతుకు । టదియేల మంటికి? ॥వి॥ 3053
గండు = చెడ్డవాడు ; (వేమనసొంతమాట) చదివినవారిని జూచి చక్కట్లాడినవాడు చవట.

ఆ. పలుగ నీపరుకును । పడిన పాటెఱుఁగక
నరుఁడుగాక మనుజుఁ । డనగఁబుట్టి
కీడు మేలెరుగక । క్రిందాయె చూడరా! ॥వి॥ 3054
యీపద్యము అయోమయముగా అష్టమశ్శనివలె వ్రాసి యిందులో చేర్చాడే యనామధేయుడో.

ఆ. పల్లటిల్లు మదిని । బట్టి బంధింపమి
నుల్ల మంచును శివుఁ । డుండబోఁడు
జల్లిమాట విడిచి । పొల్లు మఱవ ముక్తి ॥వి॥ 3055
పనికిమాలినదాన్ని విడచి పరమును పట్టమన్నాడు.

ఆ. పలికి బొంకనేల । భళ్ళాణరాజపుడు
పడఁతిఁ గూర్చి యిచ్చె । బరునకరయఁ
బాళిమీఱఁ దుదకు । బాలుఁడై యుండెరా ! ॥వి॥ 3056
భార్యను శివునకిచ్చిన భళ్ళాణుని చరిత్ర వాకొన్నాడు.

ఆ. పలుక నేర్చినపుడు । బంగారమాసించు
మాటలకు వలచుట । మహిమఁగాదె ?
కొఱక నేర్చినదియు । గోకినఁ జెప్పునా! ॥వి॥ 3057
కొరకడాని కలవాటుపడినది గోకితే చెపునా !

క. పలుకాంత లెందరైనను
కులకాంతకు సాటియౌనె ? । కుంభిని లోనన్
పలువిద్య లెన్ని నేర్చిన
కులవిద్యకు సాటిరాదు । కుదురుగ వేమా ! 3058
గువ్వలచెన్నని కుదించి గూళ్ళువిరచి యేమహానుభావుఁడో యిందు చేర్చాడు.

తే. పలుకుచుండెడి ప్రణవంబు । పట్టువిడక
వినికి నిశ్శబ్దమై యుండు । విధముఁ బూనఁ
దలఁపు సర్వత్ర బ్రహ్మమై । తనరవలెను
జెలఁగు నప్పుడు తత్వ సం । సిద్ధి వేమ. 3059
ప్రణవాన్ని పట్టి విడువకున్నవాడే ప్రజ్ఞానిధి.

ఆ. పలుకుమన్న నేల । పలుకకయున్నావు ?
పలుకు నన్నుఁజూచి । ప్రబలముగను
బలుకుమయ్య నీదు । పలుకు నేనెఱిఁగెద ! ॥వి॥ 3060
వేమనలోగల స్థాణు నుద్దేసించి చెప్పినదీపద్యము.

ఆ. పలుకులోని పలుకుఁ । బరగంగఁ జూచినఁ
బలుకులందు బ్రహ్మ । పదము గలుగుఁ
బలుకుఁ గానలేక । పరువుఁ దప్పిరి జనుల్ ॥వి॥ 3061

ప్రణవ నాదానాలకించలేక పాడయ్యారు భూప్రజలు.

ఆ. పలుకులోని బిందు । వలరంగఁ గావలెఁ
బలుకులోని దానిఁ । బదిలపఱచి
వేమ్కైన నద్ది । వెతఁ బెట్టకుందురు ॥వి॥ 3062

"సమాధి స్సమతావస్థ జీవాత్మా పరమాత్మనోః"; జీవాత్మ పరమాత్మల సంధానము చేసిన యోగంబువచ్చును.

ఆ. పలుగురాళ్ళఁ దెచ్చి । పరగ గుడులు గట్టి
చెలఁగి శిలలసేవఁ । జేయనేల ?
శిలల సేవఁజేయ । ఫలమేమిగల్గురా ? ॥వి॥ 3063

మానవ నిర్మితములు మాయాజాలములు గావా !

ఆ. పలుగువానికేటి । పద సమృద్ధి తలంప ?
బల్గువరుసవాని । బలువు దప్పఁ
చలమువానికేటి । సాత్వీక ధర్మంబు ॥వి॥ 3064

పలుఁగు =. నోటికివచ్చినట్లు మాట్లాడువాడు : భవ్యమార్గములు పామరుల కెందుకు ?

ఆ. పలుగువానికేటి ? । పదసమృద్ధి తలంప
పలుగువరుస వాని । బలువు దప్ప
చలమువాని చేతి । సాత్వీక ధర్మంబు
యేమియొకటి ఘనము । యిలను వేమ. 3065

పదములపొందిక పలుగాకికేల ?

ఆ. పలుగువానికేల ? । పరసమృద్ధి తలంపఁ
బలుగువానికేల । భక్తిపథము
పలుగువానికేల । పరమార్థ తత్వంబు? ॥వి॥ 3066

పాపికి పరమార్థచింతన యనావశ్యకము కాదా ?

ఆ. పలు తెఱంగులఁ బగ । వెలయుచుండెడి చోటఁ
జిటుకుమననె ప్రియముఁ । జెప్పవలయుఁ
గాల్పఁదగిన కట్టె । కడకతో మ్రోగదా! వి॥ 3067

పలువిధ పగ లుద్భవిల్లిన ఒకేసూత్రము చెప్పి దాని నాపినవాడే ధన్యుఁడు.

ఆ. పలుమఱుఁ బిలిచినను । పలుకకయున్నావు
పలుకరాదె నాదు । భ్రమల దీఱఁ
బలుకకున్న నిన్నుఁ । బరులు దూషింతురు ॥వి॥ 3068

భక్త్యావేశ పూరితుఁడై భవ్యహృదయముతో భగవంతునిపైగల స్వాతంత్ర్యేచ్ఛను వేమన ప్రకటించెను.

క. పలుమాట లేల నీ కిఁకఁ
గలవంటరి మాయజగముఁ । గనవలె సుమ్మీ!
చలనంబు నందుఁ జేరక
పులి బోనునఁ జిక్కినట్టు । పూనుము వేమా! 3069

క్రూరజంతువు బోనులో నుండి క్రుంగినట్లు నీ మానస విరోధులను కృశింపజేయుము.

ఆ. పవలు రేయుఁ జూడ । భావంబులోపలఁ
దాను నే నటనెడు । తలఁపు మఱచి
యున్నయట్టి యతఁడె । యుత్తమ యోగిరా! వి॥ 3070

దివానక్తముల దీక్షతో దివ్యు నారాధింపుము.

ఆ. పశువు దూడను యీని । పాలుపిండే టపుడు
కసవు చక్కఁగ వేసు । కాపువాఁడు
పొదుగు తడుకై నెనుక । పక్షంబు విడుచురా! ॥వి॥ 3071

పశువులకు పాలుకోసమే గడ్డివేయుదురు. అంతేగాని పరమార్థంకోసము గాదు

ఆ. పసరంబుతో సమము । ప్రజలెన్నటికిఁ గాదు
పసర మాసించేది । కసవు నోకటె
ప్రజలు యాసించేది । పలువిధ తిండ్లురా! వి॥ 3072

ప్రజలు పశువులకన్న పదిరెట్లు తక్కువ.

క. పసరపునంజుఁడు మెక్కియు
మసలక సురఁద్రాగ ముసలి । మానులఁ గూర్చెం
గుసుమాంగి కధర మాంసము
గుసుమాస్త్రునిఁ బెట్టి చెఱిచెఁ । గుజనుల వేమా ! 3073

నియమము లేని నీచులు చేయుచున్న చిత్రాలను సూటిగా చెప్పెను.

క. పసరపు నంజుఁడు మెక్కియు
మసలక సురఁద్రాగు మహిమ । మఖవంతులకు
ద్రసికత రంభాభోగముఁ
గుసుమాస్త్రునిఁ బెట్టి చెఱిచెఁ । గుంభిని వేమా ! 3074

యజ్ఞయాగాదులను చేసే సోమయాజులు రంభారంభోరు సంభోగము నాసించి యుందు రన్నాడు.

క. పసరపు మాంసముఁ బెట్టియు
మసలక సులతాను ముసలి । మానులఁ జేసెన్
శశిముఖుల యధరమాంసము
కుసుమాస్త్రుఁడు పెట్టి చెఱిచె । కులములు వేమా ! 3075

పూర్వము మహమ్మదీయులు మతాభివృద్ధికి హైందవ సుందరీమణులను ముస్లిము కాంతలగా చేసిన విధాన 'మిది.

ఆ. పసిడి సొగసుబొమ్మఁ । బరగఁ జూచెడివాఁడు
చిన్న చనులమోముఁ । జేర్చువాఁడు
నతివ లనదఁజేయు । నపుడె పో ముక్తుండు ॥వి॥ 3076

బంగారమువంటి ఆడవాళ్ళ అందచందాల నాకర్షించి విడచిన వాడే విజ్ఞాని.

ఆ. పసిబిడ్డయే జ్ఞాని । పకపక వోంకార
నాదంబులో నిల్చి । నవ్వుచుండు
నరుఁడు యుర్విని నవ్వ । పరమందు నవ్వునా? ॥వి॥ 3078

పసిబిడ్డల పలుకులు పరమార్థాన్ని సూచిస్తాయి.

ఆ. పసుల వన్నె వేఱు । పాలెల్ల నొక్కటి
పుష్పజాతి వేఱు । పూజ యొకటి
దర్శనంబు వేఱు । దైవంబ దొక్కటి ॥వి॥ 3078

దైవమును దర్శించే దారులు పలుమార్లు తడువుతున్నాడు వేమనయోగి.

ఆ. ప్రజ యొనర్చు చెడుగు । ప్రభునకు వచ్చును
ప్రభువు మంచి యందు । ప్రజకు సగము
ప్రభు వొనర్చు చెడుగు । ప్రజలకు రాదురా ! ॥వి॥ 3079

"రాజారాష్ట్రం కృతం పాపం" రాజుజేసినపాపము రాజ్యానిదే.

ఆ. ప్రజలెఱుంగ బ్రదుకు । బట్టభద్రుఁడు గాఁడు
పైఁ గిరీట ముంచు । బ్రహ్మగాఁడు
నోగుఁ దెలిసి పలుకు । యోగీశ్వరుఁడు గాఁడు
అట్టివానిఁ దెలియ । నగును వేమ. 3080

విచిత్ర విడికథగా విజ్ఞానభాస్కరుని వివరించాడు మనయోగి.

ఆ. ప్రజ్ఞలేని వాఁడు । బ్రతికి యుండిననేమి ?
పోయె నేమి వాని । పొందదేల ?
జీవితంబు నీకు । సిద్ధంబు యోగాన ॥వి॥ 3081

యోగమువలన జీవితము సార్థక మగును.

ఆ. ప్రణవంబె జగమెల్లఁ । బ్రజ్వరిల్లుచు నుండి
ప్రణవంబె జీవిగా । బల్కుచుండి
ప్రణవ మహిమనుఁ దెలియ । ప్రజల కేమెరుకరా ! ॥వి॥ 3082

"ఏవం ప్రకారేణ వ్యాససూత్రే కథితం
తస్మాద్బ్రహ్మ విచారః కర్తవ్యః"
వ్యాససూత్రముల వలన బ్రహ్మము గనుము.

ఆ. ప్రణవమంత్ర మహిమ । భావింప లింగంబె
మూడుమూర్తులందు । మొనసి* యుండు
న్యాన తెలిసి కొలువ । నన్యుల శక్యమా ? ॥వి॥ 3083

* నుతి పోయినది. త్రిమూర్తులందు దీపించే దివ్యజ్యోతే ప్రణవము.

ఆ. ప్రణవమంత్ర మొకటె । భావింప నవు నగ్ని
వక్రకర్మ సేయ । వంతఁ గూర్చ
వెలుగుచుండు యోగి । విజ్ఞాన దీప్తమై ॥వి॥ 3084

అగ్నివలె ప్రణవాక్షర మహిమ అంతటా నిండి యున్నది.

ఆ. ప్రణవ మరయలేడు । భక్తుఁడుఁ గాలేడు
జ్యోతి నరయలేక । చూడబోడు
నిత్యమరయలేక । నిర్వాణి గాఁడయా ! ॥వి॥ 3085

ప్రణవాన్నీ, జ్యోతినీఁ చూచినవాడే ప్రజ్ఞాశాలి.

ఆ. ప్రణవ మిట్టిగఁ జేసి । రణరంగమున నిల్చి
పోటు పొడిచినవాఁడె । పుణ్యయోగి
పోటు పొడవని వాఁడు । పిరికిబంటుతో సమము ॥వి॥ 3086

* యతులుపోయినా గతిమాత్రము సద్గతులకు మార్గముగానే యున్నది.

ఆ. ప్రణవ మెఱుఁగ నతఁడు । భక్తుండు తాఁ గాఁడు
జ్యోతిఁ జూడనతఁడు । జోగిగాఁడు
నిత్య మెఱుఁగనతఁడు । నిర్వాణికాఁడయా! ॥వి॥ 3087

" సాకారంచ నిరాకారం నిర్గుణంచ గుణాత్మకం
తత్వం తత్పరం బ్రహ్మ మితి వేదాంతడిండిమః "

బ్రహ్మము ఆకార నిరాకారము కలవాడు."

ఆ. ప్రణవ మెఱుఁగలేమి । భక్తుఁ డెప్పుడు గాఁడు
జ్యోతి నెఱుఁగలేమిఁ । జూడఁబోఁడు
నిత్యమెఱుఁగలేమి । నిర్వాణి గాఁడయా ! ॥వి॥ 3088

నిర్వాణి = మోక్షము పొందినవాడు ; ప్రణవాన్ని జ్యోతిని పట్టి విడువవద్దన్నాడు;

కం. ప్రత్యక్షమగు మిశివమని
నిత్యము మదిలోనఁ దలఁచి । నిలిచిన యపుడే
సత్యముగ జ్యోతి కనఁబడు
నిత్యములోఁ దృష్టిఁజెంది । నెరయుము వేమా ! 3089

శాశ్వతమగు శివము ను నిత్యము నీలో నిల్పుకొనుము.

కం. ప్రత్యక్షము భూదేవిఁకఁ
ప్రత్యక్షము వాయు, నగ్ని, । ప్రాణేంద్రియముల్
ప్రత్యక్షము రవి, చంద్రులు
ప్రత్యక్షమెకాన వేరె । పదరా వేమా ! 3090

పంచభూతములు, సూర్య, చంద్రులు మనకు ప్రత్యక్షముగానే యున్నవి.

కం. ప్రత్యక్షము రవి చంద్రులు
ప్రత్యక్షము వాయు వగ్ని । పానీయంబుల్
ప్రత్యక్షము భూదేవత
ప్రత్యక్షము విశ్వమెల్లఁ । బరగెడి వేమా ! 3091

మానవుల కివి సాక్షీభూతములు.

కం. ప్రతిదినమున నుదయమ్మున
మితకాలము లెక్కఁగొనక । మీఱి పనికిరాఁ
గతమేమి యనుచు రామయ
వ్రత మరయఁగఁ గంటి నిట్టి । వాసిని వేమా ! 3092

వేమన తనగురువుగారిని నిత్యము పూజించే భావ మిట పొందుపరచాడు.

క. ప్రథమమున మాత దేవత
పదపడి జనకుం డటగును । బరికింప నికం
గుదిరిన పదముల గురుఁడే
తుదిదైవము పెరలు లేరు । దొరలెట వేమా! 3093

తల్లిదండ్రులు పిదప గురుఁడు ప్రత్యక్షదైవములు.

ఆ. ప్రభున కిచ్చినట్లు । రహిఁ బేదలకు నీరు
వనిత కిచ్చినట్లు । వటున కీరు
సురకు నిచ్చినట్లు । సుమతుల కియ్యరు
మనసు పదిలపడమి । మహిని వేమ. 3094

వటుఁడు = బ్రహ్మచారి; విశ్వమానవ హృదయ వింతలు వివరించాడు విశ్వకవి.

ఆ. ప్రభుల కిచ్చునట్లు । పండితులకునీరు
వనిత కిచ్చినట్లు । పరులకీరు
సురకు నిచ్చునట్లు । సుధకును నీయరే ? ॥వి॥ 3095

ఉపమానములు నాడి ఆబాల గోపాలమున కందిచ్చు భాషలో చెప్ప నేర్పు వేమనకే గలదు

ఆ. ప్రభువు కోటియైనఁ । బ్రగడలు పందులు
సైనికుండు పక్కి । సేన పశులు
నేన్గు నశ్వచయము । లెలుకలుఁ బిల్లులు ॥వి॥ 3096

దుష్ట రాచరికపు దుండగుల సమూహములను పందికగా పోల్చాడు.

ఆ. ప్రళయకాలమందుఁ । బ్రమథుల చేతనే
నష్టమైరి గాదె ? । నాఁటిజనులు
తెలియ నేరరైరి । దేవుని ద్విజులేమొ ॥వి॥ 3097

ప్రళయ కాల రుద్రనృత్యాన్ని బాగుగా చిత్రించెను. (పౌరాణిక విజ్ఞానము)

ఆ. ప్రవర యున్నఁ బేరు । పరిఢవిల్లిన దేమి ?
దానియందు నేపు । తగిలె మీకు
నిజముఁ దెలియ మీరు । నిత్యపూజితులరై
యుండఁ గంద్రు జగతి । నొనర వేమ. 3098

ప్రవర = కులము, పేరు ; కులతత్త్వవాదుల కుతకబుద్ధులను కూర్చి చెప్పెను.

ఆ. ప్రస్తుతంపు వేళఁ । బద్యంబుఁ జదువుచోఁ
దప్పు గలిగియున్న । నొప్పియుండు
వెలఁది సురత వేళ । బిత్తరై యుండదా ! ॥వి॥ 3099

సురతంలోనున్న స్త్రీవలె స్తోత్రపద్యాలు వినే కూరుని పోల్చాడు.

ఆ. పాకనాటి రెడ్డి । పరగ మూటా రెడ్డి
మొసఁగు తోట పెద్ద । మొట్టరెడ్డి

మొఱకు లందరు భువి । హారువొప్ప మిన్నంటి
ప్రతిభ కెక్కి రిట్టె । పరగ వేమ. 3100

వడ్లలోని తెగలు రెడ్లలోని తెగలు వర్ణింప వీలులేదు. (చరిత్రానుభవం) అనాటిరెడ్లను సూచించేదు

ఆ. పాగ, పచ్చడంబు, । పైకంబు, సొమ్ములు,
పోగు, లుంగరాలు । బొజ్జకడుపు
చూచి గారవింత్రు; । చూడరు లోగుట్టు ॥వి॥ 3101

వేమన నాటి గ్రామ పెద్దల వేషాలను విశదీకరించాడు.

ఆ. పాగ పచ్చడంబు । పైకిఁ గూసంబును
బోగు లుంగరములు । బొజ్జ కడుపుఁ
గలిగి నట్టివాని । గందురు చుట్టాలు ॥వి॥ 3102

ఆ. పాడిగాదు జగతిఁ । బంచాంగములు చెప్పి
కొంచమైన బుద్ధి । నెంచలేక
బ్రహ్మ మెఱుఁగ కిట్లు । పౌరోహితము చేసి
యవని బ్రాహ్మణుల । మటంద్రు వేమ ! 3103

ఆ. పాడు బావిలో నీళ్ళు । పాప త్రాగఁగఁబోయి
జరిగి జవ్వని నడుము । విరిగి పడెను
విరిగిపడినది మొదలు । పరుషమిడనే లేదు ॥వి॥ 3104

క. పాతక సంసారార్ణవ
మే తెఱఁగున దాటెదీవు ? । హెచ్చరిక మెయిం
జేతనమూర్తిని మదిలో
ఖ్యాతిగ నెన్నంగఁదగును । ఘనమతి వేమా ! 3105

"ఆత్మాతీతం కేవలాత్మా దేహో నాస్తి కథాచన ।
అస్తినాస్తి తికో వేదా నిర్ణయో నాస్తి సర్వదా !"
ఆత్మాతీతు డగువాడే గొప్పవాడు.

ఆ. పాతబెల్లములోను । పసిడి బెల్లము గూర్చి
కోమటోఁడు అమ్ము । కోర్కెఁదీఱ
అజ్ఞానులను గూడి । సుజ్ఞానులను చేయు ॥వి॥ 3106

వర్తకుల కర్తవ్యాలను వాసిమీర వర్ణించాడు

కం. పాదమున నడుచు నరుఁడట
వేదనగా భూమిఁ దిరుగు । లెస్సగఁ దనకే
యేదైన హాని వచ్చిన
సాధనమగు పదము నడవ । జరుగదు వేమా ! 3107

మానవమాత్రు డేమియూ చేయలేఁడు.

వాక్యము :- పాదాంగుష్ట రేఖలు మొదలుకొని హృదయ కమల- షట్చక్రంబులమీదను, సహస్రాంతర- కులిమితిత్తులు రెండును గలవు. యెనిమిది ఉత్తరజానెలు, ఆరుకంకణాల యిల్లు, అందొకటి మధ్యనాడి, ముక్కంటి అందులకు దశ, షోడశసహస్రంబుల యొక్క- అక్కడ ఆ నాడి వుండును. ఆనాశికంబు వినయముతో- భ్రూమధ్య మందు యీడా, పింగళనాడులు రెండును భేదించి - సుషుమ్నరసము నం గ్రోలి- మహానాడి నడుమ దూరి, సహస్రారమున కెగసి అందు వుండును. ఆకాశంబు గనును. చంద్రసూర్యుల గనును. నక్షత్రంబుల గనును. దేవీభూత పరశివలింగంబులం గనుపించును. దిక్కులు జంతు జాలంబులాదిగా గనును. అందు కారుణ్యాగురు డుండును. అందు పిత పితా యచి ప్రణవభేరి ఓంకార, ఝుంకార నాదంబులువినును. అందు "ఓంనమశ్శివాయ, యని మంత్రదృశ్యంబు చుక్కల జ్యోతివలెనే కనుపించును. అందు నవరత్న మండపంబు వుండును. ఆ మండ పంబు మీాద ముక్తికాంత వుండును. ఆ ముక్తికాంతను జూచి నపుడె కరుగును. యింద్రియంబులు జరుగును విహారణంబులు అగ్ని మంటలచేత మనంబు దహించును. అందు వెలి జ్యోతివలెనే వెలుంగు చుండును. ఆపో జ్యోతి చేత పదికోట్ల దీపంబులు వెలుం గుచుండును. అక్కడ తన మరణ ధారణమెల్ల దెలిసి, అది పరం జ్యోతి శివుడు తానౌను. యీరీతి జీవాత్మ పరమాత్మ యందు నణగి పెనగి నిద్ర సమాధి యనిపించుకొనును. విశ్వదాభి రామ వినుర వేమ ! 3108

శరీర యావద్వ్యాపారయాలను సాకల్యంగా విజానదృష్టితో వివరించాడు.

ఆ. పాదపాయువులను । బరగ దేహము మోయు
దేహి జీవములను । దెలియ మోయు
ధరణి వీనిరెంటిఁ । దానేల మోయునో ? వి॥ 3109

ఇది ప్రకృతి ధర్మముగా చెప్పెను.

* ఆ. పాదరసముఁ దెచ్చి । పెంకులోపల నుంచి
వేచి వేచియు దాని । విరగ గొట్టి
వెండిగరిగించితే । వన్నెగల్గు నటంచు ॥వి॥ 3110

* యతిపోయినది ; రసవాదమనే భ్రాంతితో తెలియనివాడు వ్రాసిన పద్యములివి. పాదరసము నిప్పుమీద నుండదు.

క. పాదుకొన గురు రహస్యము
రేదొార వెలుగంది గుఱిగ । రేచించుడు నా
సాధన పూరక, కుంభక
వేదికయం దాత్మ బయలు । వెలుగుర వేమా ! 3111

ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా హృదయములోనున్న పరమును పాటింపుమా.

క. పాదుకొని హృదయ మందును
సాధారణ వృత్తు లడఁచి । సన్నుతిఁగను " జీ
వాధారచక్ర మందును "
మోదంబున విఘ్నపతిని । మ్రొక్కుము వేమా ! 3112

గుదస్థానమందున్న గణపతి గురుతును తెలిసిన కోవిదు డగును.

ఆ. పాపజాతి నరుఁడు । పరసతిఁ గోరుట
చేప జిహ్వారుచికిఁ । జిక్కుపడుటె ?
తీపునంటి యీఁగ । తెగువతో నీల్గుటఁ
జూచి విడువ రిట్టి । జోలి వేమ. 3113

ఉపమానద్వయముతో యుర్వివారు తెలిసికోదగ్గ ఉపమేయాన్ని చెప్పాడు ఉత్తముడు.

ఆ. పాపపుణ్యములను । పసిగా పెఱుంగునా !
ధరను బరమ యోగి । యెఱుఁగు గాక
లోని పొందికఁ గని । లోహములూక్కల్వరా ! వి॥ 3114

వాదశాస్త్రముయొక్క వాటాలు తెలుసుకొమ్మన్నాఁడు.

ఆ. పాపమనఁగ వేఱె । పర దేశమున లేదు
తనదుకర్మములనుఁ । దగిలియుండుఁ
గర్మతంత్రిగాక । కనుఁగొనియుంటొప్పు ॥వి॥ 3115

"క॥ కర్మ కారణభూతము
మర్మంబుల కెల్లజూడ మహిలో వేమా."

ఆ. పాపమనఁగ వేఱె । పర దేశమున లేదు
తానుజేయుపనులఁ । దగిలియుండుఁ
గర్మజనుఁడు గాక । కనుగలిగినయెడఁ
చావు భయములేదు । జగతివేమ. 3116

కనుగలిగిన = తెలిసిచూచుట; (నుడికారము) తెలిసికొని కర్మ జేసిన పాప మేల కలుఁగును ?

ఆ. పాప మెక్కడఁబుట్టె ? । పుణ్య మెక్కడఁబుట్టె ?
* కోప మెక్కడఁబుట్టె ? । తనువునందు
ప్రణవ మెక్కడఁబుట్టె ? । పరికించిచూడరా ? ॥వి॥ 3117

* యతి తప్పు; సర్వమునకు శరీరమే యాధారము.

ఆ. పాపరాశిఁ బుట్టి । పాపంబుఁ దెలియక
పాపశుద్ధిచేతఁ । బరగి యుండు
భక్తి గలిగియున్నఁ । బాపంబులేదయా ! ॥వి॥ 3118

భక్తియున్న పాపము పటాపంచలగును.

ఆ. పాముకన్న లేదు । పాపిష్టిదగు జీవి
యట్టిపాముఁ జెప్పి । నట్టు వినును.
ఇలను మోహిఁదెల్ప । నెవ్వరివశమయా ! ॥వి॥ 3119

స్త్రీలోలుని చిత్తము నతీతుకు లొంగునా !

ఆ. పాముచేపలోను । బరగు కప్పను జూచి
వరుసదీసి యగ్ని । వండి దించి
రాగి కఱగివేయ । రమణ హేమంబౌను ॥వి॥ 3120
యిది బంగారముచేయు వాదము. యిది తెలిసినచో మనమిట్లుందుమా !

కం. పాయవె బ్రహ్మకృతిలో
మాయలు బ్రహ్మాదిసురల । మనుగడజాడన్
జ్ఞేయంబన మదిదోఁచెడు
న్యాయంబునఁ దోఁప బోవు । నట నిట ! వేమా ! 3121
ఎక్కడ కక్కడ మహేశుడు గలడని మహాకవి చాటిచెప్పుచున్నాడు.

కం. పాయువనంగ నపానము
మాయగ నా దారియందు । మలవర్జ్యముఁ దాఁ
జేయకయుండెడి నెప్పుడు
నేయముతోఁ జూడుమయ్య । నేర్పుఁగ వేమా ! 3122
ఆధార చక్రాన్ననుసరించినవారికే దారి.

ఆ. పాలఁగలియు నీరు । పాలెయై రాజిల్లు
నదియు సాంబయోగ్య । మైన యట్లు
సాధుసజ్జనముల । సాంగత్యములచేత
మూఢజనుఁడు ముక్తి । మొనయు వేమ. 3123
"సాధుసంగంబు సకలార్థసాధనంబు"

ఆ. పాల నీడిగింటఁ । గ్రోలుచు నుండిన
మనుజులెల్లఁ జూచి । మద్యమండ్రు
నిలువఁదగనిచోట । నిలువ నిందలు వచ్చు ॥వి॥ 3124
క్రోలుట = త్రాగుట ; మద్యము = కల్లు ; మానావమానములు స్థానాన్ని బట్టి యుండును.

ఆ. పాలనీరు కలిమి । పరగ హంస యెఱుంగు
నీరుపాలక్రమము । నెమలి కేల ?
అజ్ఞుఁడైన హీనుఁ । డల శివు నెఱుఁగునా ? ॥వి॥ 3125
ఒక్కొక్కరికి ఒక్కొక్క విజ్ఞాన ముండుట సహజము.

ఆ. పాలపక్షి శకున । ఫలమిచ్చు నందురు
పాలపక్షి కేమి? । ఫలముఁ దెలియు
దనదు మేలు కీళ్ళు । తనతోడ నుండంగ ॥వి॥ 3126

శకునశాస్త్రమును సతమతము చేశాడు.

ఆ. పాల ప్రియము చేత । బరగ నేడ్చెడి బిడ్డ
క్షుత్తు దప్పుల కిల । శోక పడఁగఁ
దల్లి పనులు దీర్చి । తనయుని ముద్దాడు ॥వి॥ 3127

పుత్రవాంఛ మాతకు సహజము.

ఆ. పాలరాళ్ళఁ దెచ్చి । పరగంగ గుడిఁగట్టి
చెలఁగి శిలల పూజ । సేయనేల?
శిలల సేవ చేయ । ఫల మేమి కద్దురా! ॥వి॥ 3128

శిలల పూజించిన శిష్టాచారులకు శ్రేష్ఠత్వము లేదన్నాడు.

ఆ. పాలలోనఁ బులుసు । లీలతోఁ గలిసిన
విఱిగి తునక లగును । విరివిగాను
దెలివి, మనము లోన । దివ్యతత్వము తేట ॥వి॥ 3129

ఉపమాన మనుపమానంగానే యున్నది. ఉపమేయం బొప్పలేదు.

ఆ. పాలసాగరమునఁ । బవ్వళించిన హరి
గొల్ల పల్లె పాలుఁ । గోరనేల?
నెదుటి వారిద్రవ్య । మెల్ల వారికిఁ దీపి ॥వి॥ 3130

పర ద్రవ్యాపేక్ష ప్రతివాని కున్నదే!

ఆ. పాలు దాగిన బిడ్డ । పారాఁడు నడువఁడు
నిలువనేర్చిన బిడ్డ । నేల బడఁడు
యేడ్వనేర్చిన బిడ్డ । యేడ్వకుం డుండునా! ॥వి॥ 3131

పసిపాపల పద్ధతులే యివి.

ఆ. పాలు ద్రాగినపుడు । ప్రాణంబు రక్షించు
పాలు ద్రాగ కున్న । బడలి కౌను

బాల వలన ముక్తి । ఫల మందఁగా లేక
చాల రోగపడును । జగతి వేమ. 3132
పాలు దేహదారుఢ్యమునకే. నిర్మల బుద్ధిని నిలుపనీయవు.

ఆ. పాలుఁ బంచదార । పాపర పండ్లలో
జాలఁబోసి వండఁ । జవికి రావు
కుటిల మానవులకు । గుణమేల కలుగురా ! ॥వి॥ 3133
కుటిలులకు నిటల దృష్టి ఎటు నిల్చును ?

ఆ. పాలు పెరుగు నేయి । పరగు నన్నముఁ దిని
స్త్రీలఁ గనని వాఁడు । శీలవంతుఁ
డొక్కఁడైన వాఁడె । యుత్తమ శివుఁడయా ! ॥వి॥ 3134
రుచ్య భక్ష్యములు లోలాక్షుల దన్నుటకే !

ఆ. పాలు, పెరుగు, నేయి । పాయసంబును జల్ల
పాలలోనె కల్లుఁ । బ్రబలముగను
బాలు పాళ్లు గలిసి । పంచామృతం బాయె ! ॥వి॥ 3135
పంచామృతములు = పాలు, పెరుగు, నేయి, తేనె నీరు.

ఆ. పాలుపెరుగు వెన్న । పాయసాన్నము నేయి
జున్ను లెన్నియైనఁ । జూడ పాలె
పాలవంటి కులము । బ్రహ్మంబుఁ గానరో ! ॥వి॥ 3135
కల్మషరాహిత్యముపైన కళాస్థానమే బ్రహ్మము.

ఆ. పాలుపోసి వండ । బరగెడి తగరంబు
వేళయెరిగి దింప । వెండి యగును
గల్లగాదు నిజమె । కళంకంఠ ! నీయాన ॥వి॥ 3136
తగరమును వెండిచేయు విధానము.

ఆ. పాళబంధుచేత । బంధువర్గములెల్లఁ
జిక్కు జూతు రరయ । జీవము చన
నొక్కఁడైన నేగఁ । దుసురు మాత్రమె కాని ॥వి॥ 3137
శా॥ మాయామేయ జగంబె నిత్యమని సంభావించి మోహామనన్
'నాయిల్లా'లని 'నాకుమారు'డని ప్రాణంబుండు నందాక యెం

తో యల్లాడిన యీశరీర మిట నిందున్ కట్టెలం గాలుచో
నాయిల్లాలును రాదు పుత్రుడును తోడైరాడు రక్షింపగాన్ !
(హరిశ్చంద్ర.)

ఆ. పాశమునను జూడఁ । బరగ దేహమునకు
హానివచ్చుఁగాన । నదియుఁ జూచి
జ్ఞాన దీపకళికఁ । గడకొత్త వలెనయా ! ॥వి॥ 3138
జ్ఞాన భాస్కరుని ఉద్దీపింపజేసుకో.

ఆ. పాశమైన యాశ । పడఁద్రోయునట్టి సం
సారమనెడి యంధ । కార మందు
జ్ఞాన దీపముననె । కానఁగావలె ముక్తి ॥వి॥ 3139
సంసారపు చీకటికి జ్ఞానదీప మవసరము.

ఆ. పాషాణములు దిబ్బ । పరగంగ గుడికట్టి
వేరె శిలలనుఁ జెక్కి । విగ్రహమని
పూజ సేయగానె । పుణ్యంబుఁ గల్గునా ? ॥వి॥ 3140
పాషాణము = రాయి; రాళ్ళకు మొక్కుట మోక్షరాజ్యానికి మార్గముగాదు.

ఆ. ప్రాకటముగ నింత । లోకమందును గంటిఁ
బల్లె ముత్తఁ డెన్నఁ । బరమ గుణుఁడు
అన్నదానమునను, । హరిపూజ చేతను
హరుని లోనఁ గలిమి । కతఁడె వేమ. 3142
గుంటుపల్లి ముత్తయ్య వేమన కాలమునాటివాడు. ఈయన మహాదాతయు భక్తుడునని వేమన చెప్పుచున్నాడు.

ఆ. ప్రాకు పెట్టిన వర్తన । ల్పదటఁ గలిపి
క్రొత్త వర్తన మొనరింత్రు । కోడెకాండ్రు
కన్నతల్లిని విడనాడి । కష్టపెట్టి
యన్యకాంతల పోషించు । నట్లువేమ. 3143
"పెళ్ళమంటే బెల్లం, తల్లంటే విషం" అనే అరోక్తున్నదేగా !

ఆ. ప్రాణ ప్రతిష్ఠన । ప్రపంచమే గాని
వేరులేదు భువిని । వెదకిచూడ
ప్రాణప్రతిషచే । ప్రతిమలుఁ బల్కు-నా? ॥వి॥ 3144

విగ్రహాలకు ప్రాణప్రతిష్ఠ చేయుట పరిహసించాడు వేమన.

ఆ. ప్రాణబంధములను । బంటకా పెఱుగునా!
యెఱుఁగఁ గలుగు జ్ఞాని । యెఱుఁగుఁ గాని
మోస పాటెఱుఁగక । మోహమున ఘటింత్రు ॥వి॥ 3145

ప్రాణబంధము = ప్రాణాయామము; ప్రాణాయామము పరమ యోగులకే సాధ్యము.

ఆ. ప్రాణమగును గాలి । బ్రహ్మాండ మగు మేను
మిత్ర, చంద్ర, శిఖలు । నేత్ర చయము
మఱియు దేవు నెఱుఁగ । మహి మీఁద నెవరయా? ॥వి॥ 3146

దేవుని విశ్వరూపాన్ని క్లుప్తంగా జెప్పేడు

ఆ ప్రాణమందు శివుని । భావించి నేఱక
ముద్ర లనుచుఁ బడెదు । మూఢు లార
ముద్రలందు లేదు । మూల మందే కాక! ॥వి॥ 3147

పంచ ముద్రలని భ్రమయక ఆదిలోనున్న యభవుని గుర్తించ మన్నాడు.

ఆ. ప్రాణ మాత్మ మున్న । ప్రాణి జీవిత మెన్న
జీవి ప్రాణ మాత్మ । చేరి యొకటె
కర్మబంధనమునఁ । గట్టఁబడినవంచు
దేహ గంధి కిపుడు । తెలుపు వేమ. 3148

కర్మచేత దేహములో ప్రాణము, ఆత్మ బంధింపబడి యున్నవి.

ఆ ప్రాణమిలను లేక । పరమందఁగా రాదు
ప్రాణ ముండఁ గానె । పరముఁ గద్దు
ప్రాణి పరముఁ గనుటె । భావింప నేరరే? ॥వి॥ 3149

బ్రతికున్నప్పుడే భక్తిభావము.

ఆ. ప్రాణ రక్షణ కిలఁ । బరమ శివుని మీఁద
ధ్యాన మొనర లేమఁ । దగిలి నరుఁడు
పుట్టి చచ్చుచుండుఁ । బుడమిలోపలఁ బుట్టు
చెదలు గాను వాఁడు । చెడును వేమ. 3150

జన్మసార్థకత సాధించమని మన సాధువాదము.

ఆ. ప్రాణలింగ మంచుఁ । బ్రార్థించి కీర్తింత్రు
కట్టి వేయ నేమి । చట్టఁ జేసె
నఖిల జనుల కెల్ల । నానంద మే సాక్షి ॥వి॥ 3151

ప్రాణ లింగ మే ఆనందము.

ఆ. ప్రాణవాయువు గాలి । పటముగా మెరిగించి
బుట్టను గూనేటి । బిట్టు యొక్క
వేడ్క చూచినవాఁడె । విస్తార హఠయోగి ॥వి॥ 3152

హఠయోగ సంప్రదాయాన్ని హత్తించా డింటులో.

ఆ. ప్రాణి చేరు నాఁడు । పరగ దేహమునకు
హాని లేక యుండు । నరయ నంట
ప్రాణి పోయినపుడు । పనికిరా దీ దేహ
మనుచుఁ బలుకుదు రిల । జనులు వేమ. 3153

బొందిలో చిలు కున్నంత సేపే బొందియొక్క పొలుపు.

ఆ. ప్రాణి పోయిన ఘటము । పాతి పెట్టితె నేమి ?
కుక్కనక్కలు యీడ్చి । కొరికి తేమి
మేల నొకరిని కొట్ట । మెదిరంచి కొట్టరా ! ॥వి॥ 3154

వేమన పద్యాలను కంఠస్థముజేసి కలగాపులగా చేయుటచేత కవి హృదయము తెలియదు.

ఆ. ప్రాణులందు శివుని । భావింప నేరక
యోగమందు రేల ? । నోగులార
యోగమందుఁ గలదె ? । భోగమందున్నట్లు ॥వి॥ 3155

భోగ లాలసులను పొగిడెను మన పూజ్యుఁడు.

ఆ. ప్రాప్తి గల్గుచోట । ఫలమిచ్చు దైవంబు
ప్రాప్తి లేనిచోట । ఫలము లేదు
ప్రాప్తిలేదు తనకుఁ । బరమాత్ముఁ డెట్లిచ్చు ॥వి॥ 3156

అదృష్టమున్న అన్ని యూగలవు.

కం. పిండంబై యుదరంబున
నుండును గొన్నాళ్లు । పిదప నుర్వీ స్థలిపై
బిండంబై జనియించును
బిండంబోఁ బ్రాణరక్ష । పృధివిని వేమా! 3157

పిండమే మిండడై మేలందు తున్నాడు.

ఆ. పిండ మగుచుఁ దల్లి । పెనుగర్భమున నుండి
పూర్వ కర్మమెంచి । పొరలి యేడ్చు
ధరణిఁ బుట్టి యద్ది । మఱచి వర్తించురా! ॥వి॥ 3158

పిండములో నున్న దివ్యజ్ఞానము భూపతనమయిన మాయచే అది పోగొట్టుకుంటాడు.

ఆ. పిండ మండమందుఁ । బెనగుచు నున్నట్టి
తండ్రి బిందు నాదుఁ । దనరఁ గూడి
యండమై నిలిచిన । యప్పుడు గర్భ మటందు
రవని జనము లప్పు । డరయ వేమ. 3159

శుక్ల శోణిత కలయికయే పిండము.

ఆ. పిండ మండము నడి । బిందు వాత్మ జ్యోతి
యర్క జ్యోతి సరసి । జాండ మందు
నాదు బిందువులకు । నడుమ నద్భుత జ్యోతి ॥వి॥ 3160

౧. అండ పిండ బ్రహ్మాండములు

1. అండాండము = భూచక్రము
2. పిండాండము = పర్వతములు, నదులు, జీవజంతువులు
3. బ్రహ్మాండము = ఆకాశము.

### ౨. అంతర అండ పిండ బ్రహ్మాండములు

1. అండాండము = కనుగుడ్డు
2. పిండాండము = బిందువు (పాప)
3. బ్రహ్మాండము = పాప నడుమ వెలుఁగు కళ.

### ౩. త్రివేణులు

1. నల్ల గుడ్డు = గంగ
2. నీల మనెడి కుండలి = యమున
3. పాప నడుమ వెలుగు కళ = సరస్వతి. ఇదే విద్యుల్లేఖ, ఇదే నీవార శూకము, ఇదే ఆపోజ్యోతి, ఇదే విరాడ్రూపము, ఇదే స్వరూపాద్రూపము, ఇదే ముక్తి కాంత, ఇదే గురుస్వరూపము, ఇదే తానైన పరబ్రహ్మ స్వరూపము.

### ౪. త్రిమూర్త్యాదులు

1. ఎఱుపు = బ్రహ్మ, "అ" కారము
2. తెలుపు = విష్ణువు "ఉ" కారము
3. నలుపు = రుద్రుఁడు "మ" కారము. నలుపులోని సునీలమే ఓంకార సునాదము. ఆ ఓంకారమునకుపరమైన నిశ్శబ్ద నిష్కళయే తానైన పరబ్రహ్మము. ఇదే హృదయకమలము. ఆ ఓంకారమునకు యిచ్చటనే నిద్రాసంగమము కలుగును.

ఆ. పిండ మనఁగ జనుఁడు । పృథివి లోపలఁ జూడ
నండ మనఁగ బ్రహ్మ । మలరు లోన
నవ్విధంబె మనుజు । లందఱు దెలియుఁడీ ! వి॥ 3161
అండ పిండాంతర్గతమే మనుజ జన్మ.

క. పిండము పృథివిని బడగా
నండనె తగు మంత్రసాని । యది దెల్పునుగా
మెండుగ మగవాఁ డంచును
దండిగ నీజనము లెఱుఁగ । ధరలో వేమా ! 3162
లోక సహజమే.

ఆ. పిండములను జేసి । పితరులఁ దలపోసి
కాకులకును బెట్టు । గాడ్దెలార
పియ్య దినెడు కాకి । పితరుఁ డెట్లాయెరా ! ॥వి॥ 3164
పిండప్రదానాన్ని పేలవంగా జూసి పెట్టవద్దన్నాడు.

ఆ. పిండివంటలు పప్పు । వండి తినుటకు నీరు
పెద్దవాఁ డాసించ । రాదు గాని
కాసు దుడ్డూ లేక । దొరకునె యెట్లయిన ? ॥వి॥ 3165

గాసరబీరమువలె యీపద్యము యితరులు కలపినది.

ఆ. పికము వనములోన । విలసిల్ల బలికిన
భంగి ప్రాజ్ఞ జనుల । పలుకు లలరుఁ
గాకి కూతఁ బోలు । కర్మబంధుల కూత ॥వి॥ 3165

కర్మబంధుల కూత కఠిన మగును.

ఆ. పిచ్చి బలిసిన వెనుక । పిత్తంబు బలుసును
పిత్తంబు బలిసితే । వెరవు తెలుసు
వెరవు దెలిసిన వెనుక । గురుశిష్యుఁ డొకఁడాయె ॥వి॥ 3166

పిచ్చి = మనోవికారము; పిత్తను = పైత్యము; వెరవు = నేర్పరితనము.

ఆ. పిచ్చివానికైన । పేదవానికైనఁ
గుష్టురోగికైనఁ । గుంటికైన
భామ కానుపింప । బాములఁ బెట్టురా ! ॥వి॥ 3167

యెంత నికృష్టుడైనా యింతిని జూచిన గంతులు వేయును.

ఆ. పిడుగును నరచేత । బిగఁబట్టి యందులో
గల్మషంబు లెల్లఁ । గడకుఁ దీసి
కడమ కరము చేతఁ । గలి జనములఁ బ్రోచు
కర్మ కర్త నెఱుఁగ । గదర వేమ. 3168

కాలజ్ఞానాన్ని మేళవించి చెప్పేడు.

ఆ. పిడుగు బడిన తావు । దడ దడగా నుండు
పిడుగు బడిన కొంప । నడికిఁ గూలు
పిడుగు పడిన వాని । ప్రీతి మేమనవచ్చు ? ॥వి॥ 3169

పిడుగు పడిన సర్వ ముడుగును.

ఆ. పితృపతికిని జిక్కి । పెనుత్రోవఁ గానక
వెతలఁ జెందు వాఁడు । వెఱ్ఱివాఁడు
సతుల వలల జిక్కి । సంతాప పడనేల ? ॥వి॥ 3170
నాయనమ్మను యెక్కేవాడు దిక్కులు తెలియనివాడు.

ఆ. పిన్న వాండ్ర స్వేచ్ఛ । మన్ననఁ జెఱచును
ఆడవాండ్ర స్వేచ్ఛ । గో ష్ఠానర్చుఁ
బురుషవరుని స్వేచ్ఛ । భూతిని గూర్చురా ! ॥వి॥ 3171
స్వేచ్ఛాంతర్యాలను శ్రేష్ఠంగా విశదీకరించాడు వేమన

క. పిఱిగొను హంసను మదిలో
బిఱ బిఱఁ గుంభించి పట్టి । బిత్తఱ వోకా
స్థిరభావ సిద్ధిఁ గై కొని
పరిపూర్ణ సమాగమమును । బడయుము వేమా ! 3172
హంసను చెదరనీయక అనువగు మార్గమున నడిపించినవాడే అభి
నందనీయుడు.

చ. పిలిచినఁ బల్కకుండు మఱి । పెచ్చన నేమన కూరకుండెడిం
దలచిన నెవ్వరేమనినఁ । దన్నును గాదని నవ్వుచుండు నా
త్మలరఁగ నెంచుచుండుఁ బర । తత్త్వము నిత్యము దానయై సదా
తెలిసిన యోగి వేమన గ । తిన్నివరూపుడి కెల్లతావులన్ 3173
మంచియోగి తానమేతప్ప అన్య మెరుఁగనివాఁడు.

కం. పిలిచినఁ బలుకును దేవుఁడు
పలుకుననే నిండియున్న । ప్రభువై యుండు
న్వెలుఁగున వెలుఁగై మించెడు
వెలుఁగే పరమాత్మ బయలు । విడకది వేమా ! 3174
అంతటా నిండియుండిన బ్రహ్మ "ఓ" అనిపిలచిన "ఆ" అని
పలుకును భక్తులకు.

ఆ. పిల్లి నెలుకఁ బట్టు । ప్రియమున నుండఁగ
నదియె కోడిఁ బట్టు । ననుగమించు
మమత విడువకున్న । మానునా మోహంబు ? ॥వి॥ 3175
"ఘన విషయాన్ని గోరెడి జగంబిది"

ఆ. పిసిని వాని యింటఁ । బీనుగు వెడలిన
గట్టె కోలలకును । గాసు లిచ్చి
వెచ్చమాయె నంచు । వెక్కి వెక్కి యేడ్చు ॥వి॥ 3176

లోభి ప్రాణిపోయిననూ లోపము గుర్తించక కర్చగు కట్టెలకే ఏడ్చును.

ఆ. ప్రియములేని విందు । పిండివంటల చేటు
భక్తిలేని పూజ । పత్రిచేటు
పాత్రమెఱుఁగ నీవి । బంగరు చేటురా! ॥వి॥ 3177

సహజ విజ్ఞానాన్ని సమత్వముతో మేళవించి చక్కగా దెల్పెను వేమన.

ఆ. ప్రియములేని విందు । పిండివంటల చేటు
బత్తిమాలు పూజ । పత్రిచేటు
ఓజమాలు నాలి । ఓలి నాళ్ళకుఁ జేటుఁ ॥వి॥ 3178

ఓలిమాడలు = పూర్వులు పెండ్లికొడుకువారలు పెండ్లికూతురు వారికి యిచ్చే కన్యాశుల్కము.

ఆ. పీతిలోపల కాసు । పడియుండఁ జూచితే
కడిగియెత్తక విడఁడు । కష్టజీవి
కాసు లాసల వల్ల । కడ తేరు టరుదురా! ॥వి॥ 3179

రోతను గూడ రోయనివాడు లోభివాడు.

ఆ. పుక్కిటి సతివాని । బూషింప దోషంబు
ఉరవు సుదతి వాని । యూహలెన్న
నెత్తి యువిదవాని । బత్తియే పరమిచ్చు ॥వి॥ 3180

పుక్కిటసతి = బ్రహ్మవదనమున నున్న సరస్వతి; ఉరవుసుదతి = విష్ణు యురమున నున్న లక్ష్మి; నెత్తియువిద = శివుని సిరస్సున నున్న గంగ.

ఆ. పుట్టమీఁది మన్నుఁ । జెట్టు నందలి కాయ
పుట్టలోని దానఁ । బుట్టుతోడుగు
గట్టి యీవచనము । కాంచనంబగునయా! ॥వి॥ 3181

బంగారు యోగమును బాగుగా వర్ణిస్తున్నాడు.

ఆ. పుట్టలోను దేనె । పుట్టిన రీతిని
గట్టుమీఁద మణియుఁ । బుట్టు నట్లు
కట్టెలోన నగ్ని । పుట్టిన విధమునఁ
బుట్టి మెట్టవలెను । భువిని వేమ. 3182

విజ్ఞాన విశేషాలను విశదీకరించెను వేమనార్యుఁడు.

ఆ. పుట్టి చచ్చు నరుఁడు । పూర్వ మే మెఱుఁగక
బట్టబయలు నుండి । భ్రమసి యయినఁ
దెలివి విడిచి భూమిఁ । దిరుగంగ నేటికి ॥వి॥ 3183

బ్రహ్మని తెలియక తిరుగుట నిరర్థకము.

ఆ. పుట్టిన జనులెల్ల । భూమిని మనియున్న
బట్టునే జగములు । పట్ట వెపుడు
యముని లెక్క రీతి । నరిగి తగ్గుచు నుండు ॥వి॥ 3184

పౌరాణిక విజ్ఞానాన్ని భాషించేడు.

ఆ. పుట్టినదియు మొదలు । పురుషుఁ డేకాలంబుఁ
బాపమెఱిఁగి శుద్ధ । పశువు గాక
ముదిసి యోగి కరణి । ముద మొప్పఁ గావలె ॥వి॥ 3185

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసములు మనుజున కవసర మన్నాడు.

ఆ. పుట్టినదియు మొదలు । పురుషుఁ డేర్పడు దాఁక
మంత్రసాని గూడు । మరిగి యంత
పోయిరావె యనుచు । పుత్తురు సెలవిచ్చి ॥వి॥ 3186

అవసర మున్నంత వర కాదరించి అటుపైని అంటనీయరు.

ఆ. పుట్టినపుడు లేదు । పురిటింటిలో లేదు
తల్లి మెడకు లేదు । తనకు నేల ?
తల్లి శూద్రురాలు । తాను బ్రాహ్మణుఁడట ॥వి॥ 3187

యజ్ఞోపవీతము ప్రజ్ఞాశాలి కేల ?

ఆ. పుట్టినపుడె బొడ్డు । పట్టి కోయుచు నుండ
నప్పుడు గురు ముద్ర । లానతి పడె
ముద్రలేని వారు । ముజ్జగంబుల లేరు ॥వి॥ 3188

బొడ్డు కోయగానే జిడ్డగు మాయలో చిక్కును ప్రాణి.

గీ. పుట్టినప్పుడు తెచ్చెనే । పుడమి విడిచి
గిట్టు నప్పుడుఁ గొనునొకో । యట్టి ధనము
నడుమ నీయాజ్ఞ వచ్చెఁ ద్రి । నాధ యనుచు
నర్థికిని నీయఁ డేమందు । వ్యర్థి వేమ. 3189

పుట్టినప్పుడు గిట్టినప్పుడు లేదు మధ్యనొచ్చిన మాయ ద్రవ్యానికి మమకారం మడడం దేనికి ?

ఆ. పుట్టి పుట్ట లేదె ? । పుడమిని జనులెల్ల
పుట్టి గిట్టలేదె ? । పూర్వు లెవరుఁ
బుట్టి గిట్టు టెల్ల । వట్టి భ్రాంతులు సుమ్మి ॥వి॥ 3190

దేహానికే గాని దేహికి పుట్టుటా చచ్చుటా లేదు.

ఆ. పుట్టి పెరిగి చచ్చి । భూమిలో పడనేల ?
పుట్టు చావులు లేని । పూజ్యు గొల్చి
గట్టిగా కైవల్య । కాంతను చేరరా ! వి॥ 3191

కైవల్య కాంతను చేరాలంటే కలకాల మున్నవానిని గాంచుము.

ఆ. పుట్టుటకును ముదము । గిట్టుటకును వెత
యంద రెఱిఁగి నట్టి । దైన విద్దె
చచ్చువాఁడె పుట్టెఁ । జప్పున నేద్వారే ॥వి॥ 3192

చావుపుట్టుకలు చక్రాకారముగా తిరుగును.

ఆ. పుట్టుదుఃఖముననను । బొరలు దుఃఖముననను
గిట్టు దుఃఖముననను । గ్రిందఁ బడును
మనుజ దుఃఖమువలె । మఱిలేదు దుఃఖంబు ॥వి॥ 3193

మనుజు డానందమందుట మహాకష్టంగానే యున్నది.

ఆ. పుట్టు ఫలములేని । పురుషార్థములు భువి
పుట్ట నేమి లేక । గిట్ట నేమి?
పుట్టలోన చెదలు । పుట్టదా! గిట్టదా! ॥వి॥ 3194

జన్మమును సార్థకము చేయలేనివాని జన్మ నిరర్థకము.

ఆ. పుట్టు బ్రహ్మలైదు । పుడమిని నడపఁగా
జేత బ్రహ్మలేల? । శ్లేష్మమగును
ఏల విగ్రహములు । మూల విరాటెచ్చు ॥వి॥ 3195

పుట్టు బ్రహ్మలు = పంచభూతములు. మూల విరాట్టున్న ముక్తికి కొదవగునా!

ఆ. పుట్టు బిత్తలివలెఁ । బోవు బిత్తలివలెఁ
దిరుగు బిత్తలివలె । దేహి ధరణి
నున్న నాఁటికైన । నుపకారి గాలేఁడు ॥వి॥ 3196

బిత్తలి = ఎగిరి నడచేవారు; అహంభావముతో అన్యులను ఆదరించ లేరు.

ఆ. పుట్టు ముగ్ధ తిరిగి । పోయెడి యా ముగ్ధ
తేర ముగ్ధ తాను । దెలియలేఁడు
ఉన్న నాఁటికయిన । నుపకారి కాలేఁడు ॥వి॥ 3197

ముగ్ధ = స్త్రీ; తేరముగ్ధ = ముక్తికాంత; ఉన్నప్పుడు ఉపకారి గానివాడు ఓగే?

ఆ. పుట్టువార లెవరు? । పుట్టకుందు రెవరు?
పుట్టి పుట్టనట్టి । పురుషు లెవరు?
పుట్టి పుట్ట నట్టు । బోధించి చూడరా! ॥వి॥ 3198

జన్మరాహిత్యముకోసం సాధన అవసరము.

ఆ పుట్టు వెఱుఁగి గనని । పురుషార్థములు భూమిఁ
బుట్టనేమి వారు । గిట్టనేమి?
పుట్టలోనిఁ జెదలు । పుట్టదా! గిట్టదా! ॥వి॥ 3199

దానములు చేయని వాని జన్మ దండుగలకే!

ఆ. పుట్టుశక్తు లైదు । పుడమి నటింపంగ
విప్రులెల్ల వేద । వేత్త లండ్రు
శక్తి పుత్త్ర కులము । జగతిలో నెఱుఁగరో ! ॥వి॥ 3200
పంచభూతాలు ప్రాణి కాధారము.

ఆ. పుట్టెడు చెరగంగ । బుక్కెడైనను చిక్క-
పొల్లు విత్తు లందు । భూమి లోన
నాడి తప్పు మాట । యంతకు స్వల్పమా ॥వి॥ 3201
చెరిగినపొల్లులో నైన గింజ కాన్పించునుగాని అబద్ధమాడువాని మాటలో అంతా లోపమే.

ఆ. పుట్టెడు చెరిగిన । బుక్కెడు చిక్కదు
పొల్లు విత్తులండ్రు । భూమి యందు
నాడి తప్పుమాట । యంత కన్నను గీడు ॥వి॥ 3202
ఆడితప్పినవాడిని అసహ్యంగా దూషించేడు.

ఆ. పుట్టెడు తావునే । మోహము నాసించి
దుడుకు తనమున మనసు । దుముక సాగు
దుముక సాగుట యెఱిఁగి । యముఁడు బ్రహ్మకు దెల్పు ॥వి॥ 3203
ఉద్భవించిన తావుకే ఉఱ్ఱూత లూగనేల ? అని వేమన మాట. ఇది సాధ్యమగునా !

కం. పుడకను బెజ్జము పుచ్చుక
పుడకను తరుగంగ నగ్ని । పుట్టిన భంగిన్
విడువక పడతుల కూరిమి
తొడరిన విరహాగ్ని బుట్టు । తోడనె వేమా ! 3204
పుడక = కట్టపుల్ల; బలుసుగర్ర, నిల్లుగర్ర ; కంది, ప్రత్తి కర్రలు; రావి జువ్వి; కర్రలు, వీటి అన్యోన్య రాపిడికి అగ్ని పుట్టును.

కం. పుడకను బీజము పుచ్చుక
పుడకను దరుగంగ నగ్ని । పొడమిన భంగిన్
విడువక పడతుల కూటమి
మడపంగా వలయునండ్రు । మహిలో వేమా ! 3205
విరహాగ్ని ఉద్భవించే విధానమునకు ఉపమాన మిచ్చేడు.

ఆ. పుడమి గర్మ వశత । బురుకుత్సుఁడను మేటి
ధర్మ మనుసరించి । ధాత్రినేలి
తనకు గానివేళ । దాఁ బడెఁ గష్టముల్ ॥వి॥ 3206

షట్చక్రవర్తులలో నొకడైన బురుకుత్సుఁడు మహానుభావుఁడై నా మహాకష్టముల నంతెను. నియమమున్న నెగడును కష్టములు.

ఆ. పుడమిఁ దిరుగఁ బడయుఁ । బుణ్యంబు లెల్లను
గలుగు సాధుజనులఁ । గన్న యపుడే
వడినిసీరు నదిని । గడుఁ దేటయై యుండు ॥వి॥ 3207

ముమ్మారు భూప్రదక్షిణచేయు ఫలము మునిపుంగవు దర్శన మాత్రన లభించును.

కం. పుడమినిగల నడజీవులు
బడబాగ్నియు దీవులకును । భానుని యెడల
న్జడమును గూడిన యప్పుడె
వెడలని ప్రళయంబునకును । విధమది వేమా ! 3208

ప్రాణుల యందలి ప్రాణతేజము, సూర్యుని యందలి వేడిజలము నందలి జడము, బడబాగ్నియు ఇవి యేకమయినచో ప్రళయముఁ గలుగును.

ఆ. పుడమి యుప్పరంబుఁ । బురికొనె జగముల
రక్ష సేయఁగల్గు । రాజులెవరు ?
మహిపతి యను పేరు । మనుజున కేడదో ! ॥వి॥ 3209

భూపాలుడు లోకపాలుడెట్లగును ?

ఆ. పుడమిలోన నరులు । పుత్రులఁ గనఁగోరి
యడలుచుందు రనుప । మాళచేతఁ
గొడుకు గలిగినంతఁ । గుల ముద్ధరించునా ! ॥వి॥ 3210

“ అపుత్రశ్య గతిర్నాస్తి ” అను సూత్ర మబద్ధముగా వేమన తెపుచున్నాడు.

ఆ. పుణ్యపురుషు పీపు । పుండైన సంతలో
వసుధలోన చాల । వార్త కెక్కు
పేదవారి యింట । పెండ్లైన నెరుగరు ॥వి॥ 3211

"భాగ్యవంతుని కావడి భగవానుఁడు మోస్తాడు" అను ఆర్యోక్తికి యిది సాటి.

ఆ. పుణ్యమంత కూడి । పురుషుఁడై జన్మించెఁ
బాపమంతగూడి । పరగునె సతి !
కష్టపు సతియన్నుఁ । గనువారు లేరయా ! ॥వి॥ 3212

"పుణ్యము పురుషుడైతే
పాపము పడతి అవుతుందా!"

ఆ. పుత్తడి గలవాని । పుండు గాధయు కూడ
వసుధలోన జాల । వార్త కెక్కు
పేదవానియింటఁ । బెండ్లైన నెఱుఁగరు ॥వి॥ 3213

పుత్తడి = బంగారము (ధనము) ధనమున్నవాడు చెడ్డవాడైనా ధరణిలో పేరున్నవాడే.

ఆ. పుత్రసంతు లేక । పుత్రుండు జగతిలోఁ
పుణ్యలోక మెట్లు ? । పొందఁగలఁడు
పుత్రహీనునకును । బుణ్యంబు గలదెట్లు ? ॥వి॥ 3214

వేమనను దేశాటనలో అక్కడక్క డడిగిన ప్రశ్నలకు జవాబులివి,

ఆ. పునుగుఁ బిల్లి యేలఁ ? । బుట్టించువాసన
దాని మహిమ లేమి ? । ధరణి లోన
బ్రహ్మ చేతలెల్లఁ । బలుగాకి చేతలో ! ॥వి॥ 3215

కస్తూరి పిల్లియొక్క ఘనతను వర్ణించాడు (జంతుశాస్త్ర విజ్ఞానము)

క. పురములు నాజేఁటిపై నొక
పురమందును మూల శక్తి । పూనికఁ గనుఁగా !
యురమున గుఱిఁగని నంతటఁ
బరిపూర్ణ సమాగమంబు । బయలగు వేమా! 3216

షట్చక్రముల సంచారభావములను చెప్పుతూ సహస్రాన్ని ప్రశంసించాడు.

ఆ. పురహరునకు నేత । పురువు తా నేసిన
స్థిరము కల్గు జ్ఞాన । జీవమయ్యె ?
నేత కేమివచ్చె ? । నిజభక్తి హేతువు ॥వి॥ 3217

కాళహస్తిలో ఈశ్వరునకు వస్త్రము నేయుటచేత సాలెపురువునకు సహస్రారస్థానాధిష్టత వచ్చెను.

ఆ. పురుగు చేరిన చెట్టు । పురడించగాబోదు
నడుము విరిగిన కుక్క । నడచి రాదు
కీర్తి కేడ్చిన యోగి । మూర్తిని గనలేడు ॥వి॥ 3218

చిద్రముబట్టిన వారు క్షుద్రులే.

ఆ. పురుష చిహ్నఁ జూడఁ । బుట్టె స్త్రీలకు భ్రమ
పురుషుఁ డేహ్య మనుచుఁ । బుట్టరాదె ?
శివుఁడు పురుషుఁడైన । స్త్రీలకుఁ జిక్కునా? ॥వి॥ 3219

లింగాన్ని జూచి పులకరించే అంగనలు అంగజధంగుని లింగాన్ని జూచి ఆహ్లాదుకు కారు ?

ఆ. పురుషుఁ డెన్నిగతులఁ । బుట్టువు మొదలుగఁ
బాప చింతఁ జేయుఁ । బామరతను
మహినిఁ గుంటి కుక్క । మాంసముఁ దిన్నట్లు ॥వి॥ 3220

స్వతస్సిద్ధమగు గుణములు యేసమయములోను పోవు.

ఆ. పురుషు డెఱుఁగఁ జంపు । భూపతి వినఁజేటు
అఖిల నిందలకును । నాలయంబు
పర పురుష గమనము । ప్రత్యక్ష నరకంబు ॥వి॥ 3221

అన్యపురుషవాంఛ అవస్థాకరము గాదా !

ఆ. పురుషుభాగ్యముననె । పుణ్యావతి లభించు
బుణ్యావతికి నట్లె । పురుషు డబ్బు
నిరువు రనుభవింప । హితులును, బుత్రులు
నష్టభోగములును । నమరు వేమ ! 3222

అదృష్టం గల దంపతులకు అన్యోన్యానందము గలుగును.

ఆ. పురుషులరసి కొన్ని । పుణ్య భూము లటంద్రు
బుద్ధిలేదొ ? యదియు । భూమిగాదొ ?
పుణ్యతీర్థమునకు । బోయి వచ్చితి మందు
రేమనందు నయ్య । యింకను వేమ ! 3323

ప్రకృతిలో పవిత్రము గలదేది !

ఆ. పులియదెట్టి దన్న । భూలోక మృగరాజు ;
కలియదెట్టి దన్న । గానరాదు,
పులిక బులివి యెంత । భువిని నాకవి యెచ్చు ॥వి॥ 3224

భావము అగాధంగానే యున్నది.

ఆ. పులుపు మామిడి కాయ । బలుపక్వ గతియ
పండు తీపౌనని । ప్రజల కెఱుకు
జ్ఞాన పురుషు గొల్వ । జ్ఞానంబు తీపెరుక ॥వి॥ 3225

పరిపక్వదశలో అన్నియు ఫలవంతములే !

ఆ. పువ్వు చనుగలిగిన । భూమెల్ల వెలసేయు
గొదమ చన్నులు గన । గోటి సేయు
దడక చన్నులు గన । దయ్యాలు నొల్లవు ॥వి॥ 3226

శిలకాంత కులుకు మువ్విధములుగా విభజించి వెలకట్టాడు వేమన.

కం. పుష్పములలోన నుత్తమ
పుష్పము విరజాజిపూవు । పురుషుల లోనన్
నిష్పక్షపాతి శ్రేష్ఠుఁడు
నిష్ప్రపంచికుఁడె యోగి । నిజముగ వేమా ! 3227

అసాధారణోపజ్ఞాధురీణుఁడగు వేమన విజ్ఞానాన్ని విశ్వవీధుల జాటుతుం దీపద్యము.

ఆ. పుస్తకములు, జడలుఁ, బులితోలు, బెత్తంబు
గక్షపాలలు, బది । లక్షలైన
మోతచేటె కాని । మోక్షంబు లేదయా ! ॥వి॥ 3228

యోగులమని భోగపువేషములు వేయు జోగులను సూత్రీకరించెను.

ఆ. పూజకన్న నెంచ । బుద్ధి నిదానంబు
మాటకన్న నెంచ । మనసె దృఢము
కులము కన్న మిగుల । గుణమె ప్రధానంబు ॥వి॥ 3229
మానవావశ్యకములగు హితసూక్తులు చెప్పెను.

ఆ. పూజ చక్కఁజేసి । పుణ్య మార్జించిన
పూజ్యుఁడైన గురువు । భూమిలోన
తేజ మెల్లను గాంచి । తిరుగుచుండును సదా! ॥వి॥ 3230
"విద్వాన్ సర్వత్ర పూజయేత్"

ఆ. పూజ విడక చేసి । పుణ్యంబు నార్జించు
పూజ్యమతియె తనదు । పూజవలనఁ;
దేజమంతుఁ దెలిసి । తిరుగు నెన్నిటికైన ॥వి॥ 3231
నిత్యపూజ నిర్మలత్వము నాపాదించును.

ఆ. పూజ సేయఁ జేయఁ । బూజారి తానాయె
పూజ్యవస్తువెన్న । భునిని దానె
యేడఁ బూజసేయ । నెల్లదిక్కులఁ దానె
తాను నేను, నేను । దానె వేమ. 3232
అంతటా నిండియున్న వాని నడుగ నేల?

ఆ. పూతగడ్డికేలఁ । బుట్టించె వాసన
కనకము తనకేమి । కల్లఁజేసె
బ్రహ్మ చేతలెల్ల । బాడైన చేతలు ॥వి॥ 3233
చమత్కారభావముతో సృష్టికర్తను దిట్టెను.

తే. పూని సుఖదుఃఖములు మీఱి । లోనఁ జేరి
తాను దానగు తత్వంబుఁ । దాకి తాకి
పోరి పరిపూర్తి పొందుటే । పుణ్యమయ్య
యిట్టుకాకున్నఁ గడతేఱు । టెట్టు వేమ? 3234
పరతత్వాన్ని పరిపరివిధముల సాధించి పట్టమన్నాడు యోగి.

ఆ. పూపఁజనుల నాఁడు । భూమెల్లఁ జేయును
గొదమచనుల నాఁడు । కోటిచేయుఁ
దటుకుచనుల నాఁడు । దారంబుసేయదు ॥వి॥ 3235

కాముకుల దృష్టికి కాంతలు పలువిధ ఖరీదులు చేయుదురు.

క. పూరకమున యోగీంద్ర వి
హారునిఁ గుంభించి పట్టి । హాటము దలిర్పం
గా! రేచక, పూరకముల
పోరున గుంభించి యందఁ । బురికొను వేమా! 3236

యోగీంద్ర మానస విహారుని యొప్పుగా పట్టుటకు త్రిపుటిని దివ్య క్రమములో నడిపించుచున్నాడు.

క. పూర్ణమగు యుక్తి, యోగికిఁ
బూర్ణము! సాధనము సపరి । పూర్ణము సంసా
రార్ణవ తారకగోచర
పూర్ణము! పరిపూర్తిచెందఁ । బూనుము వేమా! 3237

సంసార సాగరము దాటుటకు పూర్ణమును సాధించే ముక్తి అను నావ అవసరము.

ఆ. పూర్ణమైన తనదు । భుజబల్మిఁ జూడక
భువిని జెడుగుతోడఁ । బోరరాదు
పాలకుండరాయి । పగిలించుఁదగిలిన ॥వి॥ 3238

అంతర్యమెరుగక అదుకోరాదు.

ఆ. పూర్ణంబుగా గురుని । పూజ్యపాదంబులు
నిర్మలంబైన లో । నేత్రములను
గురునిగా పరికించి । సరసుఁడె యోగిరా! ॥వి॥ 3239

మనస్సులో గురుని మహిమ మననము చేయుము.

వాక్యము :- పూర్ణసమాధిలో రేచించి, కుంభించి, పూరించి, పెద్ద గాలివలెనే బరగుచుండు. యేడుకోట్ల వెట్టివాదంబులు గాన బడును. మేను చల్లనిగాలి విసరును, గాలిలోపలనుండు గంధర్వ

నాదంబు, గానపదు వినువాటిలో నుండు, ఎంత్తైన నడువీధి. నాడు చుండు, నాభికినడుమ వెలుఁగు. నాభి చక్కగా నడియింట భయలౌను, బయటనుండు బ్రహ్మ బయలౌను. వేదాంత వేద్యులు వెరగుపడి మరుగుచుందురు. దానికెగువనె యుండు రాజస, కళ్యాణమూర్తి, దాని కెగువనెయుండు తామస కళ్యాణమూర్తి. దానికెగువనెయుండు నడి యింట త్రోవ, ఆడ వుండును దశేంద్రియాల అవతార రూపు ఒకటి, దానికెగువనెయుండు చుక్కలవలెనె కొంత చంద్రసూర్యుల ప్రభా కరము వెలుగు, దానికెగువనెయుండు నవరత్నపు దేహి, దాని కెగునెయుండు తటాకంబు, దానికెగువనెయుండు పున్నమ బయలు, దాని కెగువనెయుండు నవరంధ్రముల త్రోవ, తొమ్మిది చాయ లతో యేకాంత మెఱుపు, దానికెగువనె యుండు సప్త ద్వీపం బులు, దివ్యమణి తేజంబు, తేజంబులో నుండి తేజ వర్ణ చ్ఛాయ వెలుగుచుండు, దానికెగువనె యుండు దివ్యకాంతి రత్నభూరి మంట పంబు, దానికెగువనెయుండు పగడంపుఛాయ. దానికెగువనె యుండు దీపకళికా దీపంబు వెలుగు, ఆణిముత్యపు సరులు ఆడనుండి గురిసె. అమృతంపుసోన అపుడెగురిసె, మంచుధారలువంటి సరులు దిగును, చుట్టు బట్టబయలు, నట్టి నడుమ కపాలపురె ఆడ వుండును పంచ వంటి మేను కడువ కడుపులో కారణతనూజ విశ్వదాభి రామ వినురవేమ ॥ 3240

పూర్ణసమాధిలోనున్న యోగి పూర్తిగా గమనించు విశేషములివి.

ఆ. పూర్వ జన్మమందుఁ। బుణ్యంబుఁ జేయని
పాపి తాఁ ధనాశఁ। బడుట యెల్ల
విత్తు మఱచికోయ। వెదకిన చందంబె ॥వి॥ 3241

"కందిగుడ్డిలో మరచి పప్పుబానలో దేవేడట"

ఆ. పూర్వవాసనగల। పుణ్యాత్మునికలిమి
యూటచెలమ రీతి। నూరునెపుడు
నెందటికి నొసఁగిన। నెప్పటి యట్లుండు ॥వి॥ 3242

ఉచితజ్ఞుని దాతృత్వము ఊరించేది?

ఆ. పూసపోగు, బసిడి । పుట్టంబు, విద్యయుఁ
గాయపుష్టి చాలఁ గలిగెనేని,
గాని కులజుఁడైన । ఘనుఁడంచు రమ్మంద్రు ॥వి॥ 3243

విగ్రహాపుష్టిఉంటేచాలు, నైవేద్యం నష్టి అయినా పంవాలేదు.

ఆ. పూసపోగులైన । పుట్టంబు విడియంబు
కాయపుష్టి మిగుల । గలిగియున్న
హీనజాతినైన । నిందు రమ్మందురు ॥వి॥ 3244

అందచందాలజూచి ఆదరిస్తారు.

ఆ. పూసపోగు పసిడి । పుష్పంబు మొదలైన
సంపదఁగలవాఁడు । జగతిలోన
హీనకులజుఁడైన । నెట్టివాఁడైనను
రండు రండటంద్రు । రహిని వేమ. 3245

నిండైన దండి వేషాలు జూచి "రండీ రండీ" అని పిలుచుట ప్రజల కలవాటు.

ఆ. పూసపోగుఁబెట్టి । పురుషుని భుజమెక్కి
కన్నులార్ప వార । కాంత చేరి
తనకు లొంగువానిఁ । దడయక చంపురా ! 3246

వారకాంతకు లొంగినవాడు పతితభ్రష్టుఁడు

ఆ. పృథివి కుదకమేగె । పృథివిపై మొలకెత్తె
మొలక పృథివికేగె । మొగఁడె సుతుఁడు
ధరణి జనులకెల్ల । తల్లియ పెండ్లాము ॥వి॥ 3247

విజ్ఞానవేత్తలను విమర్శించమని యీ విలువగలపద్యాన్ని చెలయించాడు వేమన.

ఆ. పృథివిఁ బుట్టె మొలక । పృథివిలోఁ గలిసెను
మరల నదియె పుట్టు । మగడెఁ సుతుఁడు
ధరణి జనులకెల్లఁ । దల్లియే పెండ్లాము ॥వి॥ 3248

వేమనకు కొంటె కోణంగులు వేయు ప్రశ్నలకు జవాబుగా యిలాంటి పద్యములు చెప్పుట పరిపాటి.

ఆ. పృథివి మీఁదఁ బుట్టి । పెరిఁగిన హంసల
విహారణం బెఱింగి । విడువక మదిఁ
దిరుగ నేర్చువాఁడు । ధీరుఁడై యుండురా ! ॥వి॥ 3249
ఆధారచక్రమున పుట్టినహంసలను పెంపొందించినవాఁడే బ్రహ్మవేత్త.

ఆ. పృథివి యప్పునందు । పుట్టెను గాసుడీ
అప్పు బుట్టె నగ్ని । నమరిజూడ
నగ్ని వాయువందు । వాయు వాకసమున
గల్గి వెలసెఁగాదె ? । క్రమము వేమ ! 3250
పంచభూతోత్పత్తి అనగా భూమియందు నీరు, నీటియం దగ్ని, దానియందు గాలి. దానియం దాకాశము వెలసినదని వేమనవాక్కు.

ఆ. పృథివి యప్పు వహ్ని । పునరుద్భవంబున
వాయువాకసంబు । వనరగూడి
పంచభూతములటు । పరగి లోకములాయె ॥వి॥ 3251
పంచభూతములు ప్రభావమున బ్రహ్మాండం బుద్భవిల్లినదని యోగిసూక్తి.

ఆ. పృథివివారికెల్లఁ । బెట్టును నొక గిన్నె
పోతు కుడిచి కులముఁ । బొలయఁ జేయఁ
దలను జేయిపెట్టి । తగనమ్మఁ జెప్పఁదా
వారకాంత నమ్మ । వలదు వేమ. 3252
జగమునందలి జనులందరు ఒకటిగా భావించి ఏకము చేసినవాడు మహాత్ముఁడు.

ఆ. పెంటిమేళమునకుఁ । బెద్దలై వత్తురు
పోతుమేళమునకుఁ । బోరె యెవరుఁ
బుండున ముసరెడిది । పూవుపై వ్రాలునా? ॥వి॥ 3253
పెంటి = స్త్రీ; చెడుగువారు చెడుగునకే చేరుదురు.

ఆ. పెక్కు చదువు లేలఁ ? । జిక్కు వాదము లేల ?
నొక్క మనసు తోడ । నూరకున్న
సర్వసిద్ధుఁ డగును । సర్వంబుఁ దానగు ॥వి॥ 3254
వాద భేదములులేనివాఁడే వాసిగల యోగి.

ఆ. పెక్కు జనులఁ గొట్టి । పేదల వధియించి
డొక్క కొఱకు నూళ్ళు । దొంగిలించి
మెక్కుడీ కరిగినను । నెఱిఁగి యముఁడు చంపు ॥వి॥ 3255

అన్యాయములు చేసినవారిని అలసట పెట్టును యముడు.

క. పెట్టగవలె బీదలకును
నెట్టగవలె దుర్మతముల । నెనరున నెపుడున్
పట్టగవలె పరమ పదము
దిట్టముగా నీవిధమున । దివురును వేమా ! 3256

ఉన్నతికి మార్గముల నొప్పుగా చెప్పెను.

ఆ. పెట్ట పుంజుఁ గూడి । పెనఁగిన యప్పుడు
గ్రుడ్డు వెట్టి తాను । గులముఁ జేయుఁ
బుంజు లేని పెట్ట । పుడమిఁ గుప్పల నుండి
తోలుగుడ్డు వెట్టుఁ । దొడరి వేమ. 3257

జనబాహుళ్యముగల శాస్త్రాన్ని చెప్పెడు వేమన

ఆ. పెట్టి నంత ఫలము । పెక్కండ్ర కుహాపతిఁ
జేయకున్నఁ దాను । జెఱుపకున్నఁ
బెండ్లి సేయు నట్టి । పెద్ద ఫలంబురా ! ॥వి॥ 3258

తాను పెట్టక పోయిన పెట్టేవారిని చూపించుట పెద్దతనము.

ఆ. పెట్టి పోయ నొక్క । పెర్గుడు సౌఖ్యంబు
యాలు చచ్చిన గతి । యదియుఁ గాక
నుండు నా శివుండు । యోగివాని యందున ॥వి॥ 3259

పెట్టుపోతలు గలిగిన పుణ్యుల హృదయములో సాంబుడు అంబను వీడి ఉంటాడు.

ఆ. పెట్టి పోయలేని । వట్టి దేబెలు భూమిఁ
బుట్టనేమి వారు । గిట్టరేమి?
పుట్టలోనఁ జెదలు । పుట్టదే గిట్టదే ॥ వి॥ 3260

దానధర్మము లేనివాడు తరలిపోయిననూ దండుగు లేదు.

ఆ. పెట్టి పోయువాఁడు । కట్టడి గల దాత
తిట్టిపోయువాఁడు । తుట్టె పురువు
రట్టు సేయువాఁడు । రాణింపునకు రాఁడు ॥వి॥ 3261

రట్టుచేయక. తిట్టక పెట్టేవాడే దిట్ట.

ఆ. పెట్టువార లెవరు? । పెట్టకుండు రెవ్వరు?
పెట్టి పెట్ట నట్టి । దిట్ట లెవరు?
పట్టుఁ దప్పకుండ । భావించి చూడరా! ॥వి॥ 3262

విజ్ఞానాన్ని పాతకమని హితోపదేశం జేశాడు వేమన.

ఆ. పెట్టువారి తల్లి । ముట్టుకోకలు మోసె
వారి తండ్రి కూలి । వడ్లు మోసె
గాడిదెల కొడుకుల । ఘనమేటి ఘనమురా? ॥వి॥ 3263

వేమన వినిన. కనిన, విషయములు వివరిస్తుంటాడు పద్యాలలో.

ఆ. పెట్టెడు పతియింటఁ । బెట్టని లోభున్నఁ
దిట్టి తిట్టి తిరుగఁ । గొట్టుఁ దెలియ
బండినట్టి చేనఁ । బల్లేరు గతినొప్పు ॥వి॥ 3264

దాతదగ్గర కాదనే దూతలు ఉంటారు.

ఆ. పెతరు లన్నమనుచుఁ । బ్రీతితోఁ బిలిపించి
కాకులకును బెట్టు । కర్మలార!
కాకులందు నేమి? । ఘనులకు బెట్టుఁడీ ॥వి॥ 3265

పితృకర్మను విడువమని వేమన హితోక్తి.

ఆ. పెదవిఁ గొఱుకుదు రిల । నధరామృతం బంచుఁ
జొంగ కడుపు లోనఁ । జొచ్చునటుల
మలము తిత్తిమీఁద । మనసెట్లు పుట్టురా! ॥వి॥ 3266

మ. మలభూయిష్టపు తోలుబొమ్మకయి మీమర్యాదలన్విడినా
తులకున్జిక్కుటు న్యాయమేన?

ఆ. పెద్దల నటనములు । ప్రేమతో వినియుఁ దా
నటుల నడవఁ గనఁగ । ననువు పడదు
పులినిఁజూచి నక్క పూతఁ । బూసిన యట్లు ॥వి॥ 3267

"పులిని జూచి నక్క వాతవేసుకొనునట్లు" అనుసామెత ననుసరించిం దీపద్యము.

ఆ. పెద్దలమని కాళ్ళ । బడిపించికొని నరుల
* కుపదేశములఁ జేసి । కాసు లడిగి
పరమయోగుల రీతి పరమందు వుందురు ॥వి॥ 3268

* యతులు పోయినవి. పాదపూజలని పైసాలులాగే పగుల పరిహాసిఁ చేడు వేమన.

ఆ. పెద్దల వచనములు । ప్రేమతో జూచి తా
నటుల నడువబోవ । ననువు పడదు
వ్యాఘ్రముఁగని నక్క । వాతనుఁ బడ్డట్లు ॥వి॥ 3269

పెద్దవారి వేషాలు పిన్నవారికి తగవు.

ఆ. పెద్దలు గడియించి । పెట్టిపూడ్చిన ధనము
ఎచ్చోట నున్నదో । యెవ్వ డెరుగు?
భూతాంజనము లేక । భూదేవి చెప్పునా? వి॥ 3270

* గణభంగము; అంజనాద్యక్ష సిద్ధులలో వేమన కనుభవమున్న దేమో!

ఆ. పెరటిఁ జెట్టు వెట్టి । పరికింప కుండిన
వెలుఁగు దాటి తీఁగ । వెడలఁ బారు
నాడుదాని గుణము । నటవలె నుండురా! వి॥ 3271

లతలూ, లలనలూ అచంచలముగానే యుందురు.

ఆ. పేడు ముట్టె వాని । వినయంబు లధికంబు
చెడ్డముండ ముసుఁగు । చెలఁగి పెట్టుఁ
జెడిపె కొడుకు మిగులఁ । జేయునా భాగ్యంబు ॥వి॥ 3272

పేడిమూతివాడు మోసగాడు.

ఆ. పేడ ముదుక కాయ పెనుబాము కుబుసంబుఁ
జోడుగూర్చి రసము । సోకఁ జేసి
యొక్కయేడు తినఁగ । నుర్విఁ హేమము తానె! ॥వి॥ 3273
ఇది కాయకల్ప చికిత్సను గూర్చివేమన శాస్త్రజ్ఞానాన్ని వివరించాడు.

క. పేదకుఁ గన్యాదానము
బూదిఁ దలిర్పంగఁ జేయు పురుషుఁడు తుదిఁ దా
సాధించుఁ బుణ్య లోకము
వేదాంతరహస్యమద్ది । వినురా వేమా! 3274
బీదవారి నాదరించిన వాడే పెద్దవాడు.

క. పేదఱికమంత దోషం
బేదో యీజగతి లోన । నీశ్వరుఁ డెఱుగుం
బేదను బొడఁగను వాఁ డది
కాదను శవ మనుచుఁ జూచుఁ । గదరా వేమా! 3275
యిది లోకాన్నాకళ్ళింపు చేసుకొని తెలుసుకొన్న విజ్ఞానము.

ఆ. పేదవాడని నిన్ను । ఆదరించెద నంటె
నీయదృష్టంబున । నిల్తు ననవు
ఒద్దిదుగొ చూడరా । వద్దనే యుందిరా! ॥వి॥ 3276
అదృష్టహీనున కైశ్వర్య మెట్లబ్బును?

ఆ. పేదవానిబాధ । పెనుభూతమై యుండుఁ
జూడలేని బాధఁ । జూడ వశమే?
కలుగువాని బాధఁ । గనులఁ జూడగ లేమి
కేమి చెప్పవచ్చు । నింక వేమ. 3277
లేనివాడు లేదని, ఉన్నవా డాశతోను బాధలు పడుతారు.

ఆ. పేరి పోయిన పెరుగు । పా లెన్నటికి గాదు
*పాలు పక్వముఁ జేయ । పెరుగు అవును
నలుపు తెలుపును సేయ । అల్పుఁ డేమెఱుఁగురా? ॥వి॥ 3278
* యతిపోయెను; తగరాన్ని వెండిచేయు విధానము యిందులో చెప్పేడేమో!

ఆ. పేరు సోమయాజి । పెనుసింహ బలుఁడాయె
మేకపోతుఁ బట్టి । మెడను విఱువఁ
గాక క్రతువు వలన । గలుగునా మోక్షంబు ? ॥వి॥ 3279

సోమయాజి = యజ్ఞము చేసినవాడు. మేక మెడలు విరచుటకే గాని యజ్ఞయాగాదులు మోక్షము నివ్వవు.

ఆ. ప్రేత యన్న మనుచుఁ । బ్రీతితోఁ బిలిపించి
కాకులకును బెట్టు । కర్మలార !
కాకులు పితరులయి । కలిగించె మోక్షంబు ? ॥వి॥ 3280

బ్రతికున్నప్పుడు అన్నములు పెట్టి చచ్చినవెనుక శ్రాద్ధాలు చేస్తారు.

ఆ. ప్రేమలేని వాని । వినయంబు లధికంబు
చెడ్డ ముండ ముసుఁగు । చెలఁగి పెట్టుఁ
జెడిపె కొడుకు మిగులఁ । జెప్పు నిచ్చకములు ॥వి॥ 3281

చెడిపె కొడుకు చెప్పేమాటలు భూమ్యాకాశాలు పట్టవు.

తే. పైగుడ్లు క్రిందికి । కీగుడ్లు మీదికి
పొయ్యేలాగునఁ జేసి । పొట్ట నుంచి
జనులు కాశికి పోయి । జ్యోతేలకానరో ! ॥వి॥ 3282

కళ్ళు తేలవేసి కాళ్ళుసాచి కాశికి పోవనేల ?

ఆ. పైరు నిడినవాని । ఫలమే సఫలమగు
పైరు నిడని వాఁడు । ఫలముఁ గనునె ?
పైరు నిడిన వాఁడు । బహు సౌఖ్యవంతుఁడౌ ॥వి॥ 3283

రైతు ప్రజాకోటికి బహువిధ భక్ష్యములనిచ్చి ప్రాణాలను నిలబెట్టిన మహాదాత.

ఆ. పొంకముగను మనసుఁ । బోనీక సర్వేశు
వంక నిలుపు వాఁడు । వంశ పరుఁడు
వంక నిల్పకున్న । వచ్చునా పదవులు ? ॥వి॥ 3284

సర్వేశ్వరు నారాధించక పోయిన వంశప్రతిష్ఠ లేదు.

ఆ. పొందుగ ధరలోన । మును బురూరవరాజు
ధర్మమే జయమని । తనరి యుండి
తనదు కాలగతిని । దా నెఱుంగఁగ లేక
మదనుచేతఁ జిక్కి । మరిగె వేమ. 3285

షట్చక్రవర్తులలో పురూరవుఁడు కడుపూజ్యుడు. కామాన్నించి కడగండ్లు బడ్డాడు.

కం. పొందుము హృది గుఱిఁ దగునా
నందము సదసద్వివేక । నాదము పైగా
నిందించు భ్రమల నెల్లను
సందియ్యని బయలు చేరు । సాక్షిగ వేమా ! 3286

సందులేని బయలును గనుటే సర్వేశ్వరుని గనుట.

ఆ. పొల్లకాయ రాయి । పొదిగి త్రాఁటను గట్ట
లీలతోడ వంక । లేక పెరుగుఁ
గుక్కతోకఁ గట్ట । గుదురునా చక్కగా ? ॥వి॥ 3287

మాలిన్యముకల వానికి మహా నీతు లేం చేస్తాయి.

ఆ. పొట్టివాఁడు కీడు । పొడల పురుగు కీడు
వట్టి యాశ కీడు । పఱుఁడు కీడు
పొట్టి చేయి కాలుఁ । బొసఁగుట కీడురా ! ॥వి॥ 3288

అంగసాముద్రిక శాస్త్రమును అవలీలగా తెలిసికొన్నవాడు వేమన.

ఆ. పొడుగుఁ గల్లు జడలు । పులితోలు, భూతియు
కక్ష పాలలు పది । లక్షలైన
మోత చేటెఁ గాని । మోక్షంబు లేదయా ! ॥వి॥ 3289

కపట యోగుల వేషములను కండ్లారజూచి కసిదీర చెప్పుచుంటాడు

ఆ. పొత్తుఁ గుడువవచ్చు । పుత్రుఁడే నయమైన
దొత్తు కొడుకు నెంగి । లెత్తు కొండ్రే
కానివానిజోలిఁ । గానరీ రీతిగా ! ॥వి॥ 3290

కానివాని జోలి మానుటే మానవ ధర్మము.

ఆ. పొద్దు పొద్దున లేచి । సద్దు చేయక శివుని
*పట్టలేక పోయిరి । పెద్దలెల్ల
పిరికి జీవుల కెల్ల । దొరుకునా యీ శివుఁడు ? ॥వి॥ 3291

* యతిభంగము ; శివ సాయుజ్యము పొందాలంటే చిత్తస్థైర్యము కావలయును.

ఆ. ప్రొద్దు పొడుచు చోటుఁ । బ్రొద్దు నిలుచు చోటుఁ
బ్రొద్దు గ్రుంకు చోటుఁ । బొసఁగఁ జూచి
ప్రొద్దెఱిగిన వాఁడు । పొలుపైన యోగిరా ! ॥వి॥ 3292

కాలజ్ఞానతత్వాన్ని కూలంకషముగా తెలిసికొని చెప్పినవాక్యము లివి.

ఆ. ప్రొద్దు పొడుచుటెఱిగి । ప్రొద్దు నడయెఱింగి
ప్రొద్దు గ్రుంకునట్టి । పోలికెఱిఁగి
ప్రొద్దుఁ దెలియు నతఁడె । పొలుపొందు బ్రహ్మంబు ॥వి॥ 3293

"యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే"
బ్రహ్మము సర్వసమ్మతమున కుదురును. (శంకరభాష్యం)

ఆ. పోక లింగములను । బొరలించి పూజింపఁ
గట్టివేయు వారి । కర్మమేమొ ?
కడిగి త్రాగు వారి । కడుపేమి నిండురా ! ॥వి॥ 3294

శైవమత సంప్రదాయము.

ఆ. పోనిక్కఁజూచి తెలివి । పూర్వాపరంబుల
దడుపు గుడుపు పడుపు । తత్త్వమెఱిఁగి
నడవ నేర్చినట్టి । నరుఁడె గృహస్థుండు ॥వి॥ 3295

గృహస్థాశ్రమ ధర్మాన్ని కూలంకషముగా చెప్పెను.

ఆ. పోవనీయకుండ్రు । పొరలింత్రు లింగంబు
గట్టివేసి యేమి । కల్లఁ జేసె ?
నఖిల కర్మములకు । నాకారమే సాక్షి ॥వి॥ 3296

లింగమును బంధించిన వెంగలుల వెఱ్ఱిని వివరించాడు.

## ఫ

ఆ. ఫక్కిఁ దెలిసి పలుకు । నొక్క వాక్యమె చాలు
పెక్కులేల ? పట్టి । ప్రేలుటకద
దిక్కు కలుగ మ్రొక్క । దేవుఁడొక్కఁడె చాలు ॥వి॥ 3297

పద్ధతి తెలిసిన మాటయు వరమిచ్చే దేవుడు ఫలప్రదములు.

ఆ. ఫణికిఁ గోరలుండ । భయమొందునట్టులె
వెరతురయ్య దుష్ట । విభవమునకుఁ
గోఱ లూడఁ ద్రాచు । మీఱదు దుష్టుఁడు
విభుత పోను బెట్టు । వెతలు వేమ. 3298

దుష్టులు ఎట్టిపరిస్థితులలో నైనా దూరముగా నుండవలసినవారే !

ఆ. ఫణితి దెలిసి మాఱు । పల్కులే యుక్తము
గణనకెక్కునట్టి । ఘనుఁడె యెపుడు
గుణములేకయున్నఁ । గుదురునే యూహలు ? ॥వి॥ 3299

యుక్తాయుక్తములు తెలిసి ముక్తసరిగా మాట్లాడుము.

ఆ. ఫలక మెడముచేతఁ । బట్టి ఖడ్గంబూన
బంటు తనము రాదు । ప్రతిభ లేమి
వీధిలోను దిరుగ । వెలఁది పురుషుండౌనె ॥వి॥ 3300

డాలు ఖడ్గము బట్టు వీలుదెలిసిన మాత్రమున వీరుఁడు గానేరడు.

ఫలకము = డాలు ;

తే. ఫలము నిహమందు బరమందుఁ । బడయఁ గనని
యట్టి భూభారమగు వార । లెట్లు సృష్టి
చేయఁబడి రయ్య ? బ్రహ్మచేఁ । జెన్నుమీఱ
పరిపాలంబునఁ గసవుండు । వరుస వేమ. 3301

నిరర్థక జీవులు సృష్టిలో బరువుచేటు.

ఆ. ఫలములేని కార్య । ములు సేయనొల్లరు
కలజనంబులెల్ల । నిల నిజంబు
ఫలము మంచిదైన । బరువందు ముదమందు ॥వి॥ 3302

ఫలప్రదములైన కార్యములు పనిబూని ఆచరింపవలయును.

ఆ. ఫాలనేత్రుఁడైన । భావింప లేఁడయా
ఆలిమీఁదఁ బెట్టి । యాది మరవ
గోల యనుచు నమ్మఁ । గూడదు వెఱ్ఱియై ॥వి॥ 3303
అసలువిషయాన్ని ఆడదాని భ్రమచేత అందరూ మరచారు

ఆ. ఫాలభాగము నందు । పారాడుచున్నట్టి
ముక్తికాంతనుఁ బట్టి । మూలచేర్చి
నిండు పౌర్ణిమ నాడు । నెలకొని చూడరా! ॥వి॥ 3304
ఫాలభాగమునందున్న పరంజ్యోతిని పరికించ మన్నాడు

ఆ. ఫాలమునకుఁ బొట్టు । పడతికిఁ జుట్టును
కాపురమున గుట్టు । కలిసి కట్టు
ఉన్నఁ జూడులేక । యున్నను బాడురా! ॥వి॥ 3305
అందచందాలు పొందుగా చెప్పుటలో అందెవేసిన చేయి.

బ

ఆ. బంగరు పొడఁ గన్న । భామలఁ బొడఁగన్నఁ
జిత్తమునను । చింత సేయఁ డేని
వాఁడె పరమ యోగి । వర్ణింప జగమందు ॥వి॥ 3306
కాంతా కనకముల కాతరు లేనివాడే ఘనమైన యోగి.

ఆ. బంగి త్రాగి తిరిగి । బకము చాడ్పున నుండ
సంగ్రహింపరాదు । చంద్ర కళలు
*బ్రుంగు మదిని బోరి । మిన్నంది యుండరా! ॥వి॥ 3307
* యతిలేదు; మత్తువలన సత్తును సాధించలేడు.

ఆ. బంగి త్రాగువాఁడు । భావము నందఁడు
నింగి కెగయు కైపు । నిల్పనీఁడు
లింగ మమర బంగి । లీలను జెందురా! ॥వి॥ 3308
మనసు భంగపడని సంగతితో లింగైక్యమును పొందుము.

ఆ. బంటుతనము కాదు । బలముతోఁ గట్టఁగా
వెంటనుండి మనసు । వెతలఁబఱచు
నింటఁ గెల్చి రచ్చ । నిలఁ గెల్వవలె నయా! వి॥ 3309

సూక్తులను సరసోక్తులచే గలపి పద్యముగా ప్రజల కందించుటలో అందెవేసినచేయి వేమనార్యునిది.

ఆ. బంటువలెనె లేచుఁ । బండితమ్మన్యుఁడు
సాధు పండితుండు । శాంతముగను
కుక్క కూయ నేమి । గుఱ్ఱమునకు లెక్క? ॥వి॥ 3310

పండితమ్మన్యుఁడు = పాండిత్యము లేక పండితుడనిపించుకొన్నవాడు.

ఆ. బండకుక్క కేల? । బంగారు సంకెళ్లు
విధవరాలికేల? । వెండిగొలుసు
ముచ్చుముండ కేల? । ముంజేతి కడియాలు వి॥ 3311

జాను తెనుగు చవిని తేనెసోన లూరినట్లు రచిస్తాడు వేమన.

ఆ. బండదానికేల? బంగారు మొలత్రాడు
విధవరాలికేల? । వెండిగొలుసు
ముచ్చుముండ కేల । ముంజేతి కడియాలు ॥వి॥ 3312

అయోగ్యులకు యోగ్యవస్తువులేల! అని యోగి వాక్కు.

ఆ. బండబూతులాడు । పరమ నీచుండెన్న
దండివారి మేల్మిఁ । దానెఱుగునె?
చందనంపు ఘనత । పంది యేమెఱుఁగును? ॥వి॥ 3313

నీతులు పూతలతో నేతులలో యుంచి ఖ్యాతిగల కవనము చెప్పే పరిపాటు వేమనకే గలదు.

ఆ. బండమీఁద చెలమ । పాటించి త్రవ్వినఁ
నలవి కెక్కడో జ । లాశ లేదు
గుంటపట్టి చెలమ । గుణ ముద్ధరించురా ॥వి॥ 3314

నిరర్థకమైన పనులవలన నీకొచ్చినదేమి?

ఆ. బండమీఁద నున్న । దొంగబంటును చూచి
* పాము తిందామని । పారివచ్చె
పారివచ్చిన పాము । పండు జూచియు నిలచె ॥వి॥ 3315

* యతిపోయెను : వెన్నుపాములో నున్న మజ్జయే జ్ఞానము.

ఆ. బందెత్రాళ్ళు తెచ్చి । బంధించి కట్టంగ
లింగఁడేమి దొంగి । లించి నాఁడో ?
ఆత్మలింగమునకు । నర్పింప నేరరో ॥వి॥ 3316

వీరశైవుల లింగధారణను వెక్కిరించెను.

ఆ. బంధ ముక్తుల రెంటిని । బదిలముగను
గోరరాకయ మదియందుఁ । గోర్కె లడఁచి
చేయు పనులెల్ల బయటను । జెనకి మించు
వలయునది కూడు నీకె యా । వలను వేమ. 3317

ఫలిత మాశించకుండా పనులు చేయుట పరమధర్మం.

ఆ. బంధుకోటిఁ బాసి । బయఁలును దెలియక
సింధుపుత్రి మాయఁ । జిక్కెఁ గాదె !
శార్ఙ్గి యంతవాఁడె । జనులకు శక్యమా ! ॥వి॥ 3318

సింధుపుత్రి = లక్ష్మి ; శార్ఙ్గి = విష్ణువు. విష్ణువే లక్ష్మిలోఁబడయిన యితరుల నడగనేల ?

ఆ. బట్టత్రాళ్ళతోను । బంధించి కట్టఁగా
లింగ మెవరిసొమ్ము । దొంగిలింప
నాత్మలోని లింగ । మటువలె నుండు నే ? ॥వి॥ 3319

ఆత్మలింగా న్నర్చించమన్నాడు.

క. బట్టబయలందు శ్వాసను
ముట్టుచు నెగరోజి పట్టి । మూలమునందే
నెట్టుచు విడుచుచు నించిన
గుట్టు పరబ్రహ్మమంచు । గూడుము వేమా! 3320

ఉఛ్వాస నిశ్వాసములు ఉన్నతస్థాయిలో నడిపి యుత్తముఁడ వగుము.

ఆ. బట్టబయలు చేసి । భావము వెలిజేసి
గుట్టు తెలియఁజేసి । క్రూర మడఁచి
పట్టపగలు చేయ । భావంబు తానయా! ॥వి॥ 3321
తేటతెల్లముగా దివ్యతత్త్వమును నూటిగా జూడమన్నాడు కవి.

ఆ. బట్టబయలైన తత్త్వమే । బ్రహ్మమనఁగ
నిట్టనిలువున మదిఁజేర్చి । నెగడవలెను
దట్టిఁ గట్టిన జయమున్న । జెట్టివలెను
గుట్టులో గుట్టు పరమంబుఁ । గూడు వేమ. 3322
దప్పాలు గొట్టిన జెట్టీలు గుట్టు తెలియక మట్టిపాలౌతారు.

క. బట్ట బయలైన బ్రహ్మము
గుట్టును మదినెంచి లోన । గుణము పడిన చో
దిట్టముగ జగము గిట్టును
దిట్టరివై యెఱుక మఱచి । తిరుగుము వేమా! 3323
ప్రపంచాన్ని మరచి బ్రహ్మమును పట్టుకొనుటకు ప్రయత్నించుము.

ఆ. బట్టిపెట్టి నాల్గు । బానల చమురుతో
వండి శుద్ధిఁజేయ । దండియగునె?
పుట్టువందె కలుగుఁ । బూర్వపుణ్యంబున్న ॥వి॥ 3324
ఆయాసం పడినా ఆనందము చిక్కదు.

ఆ. బటువుగాను బుద్ధి । పరికించి నొక్కుచు
కుటిల గుణము లన్ని । కూలఁద్రొక్కి
పటుతరంబుగాను । బలపడఁ జూడరా! ॥వి॥ 3325
కుటిలగుణముల విడచి మోక్షకొమ్మకు విటుఁడవుగమ్ము.

ఆ. బడుగు నెఱుగలేని । ప్రాభవం బదియేల?
ప్రోది యిడని బంధు । భూతియేల?
వ్యాధిఁ దెలియలేని । వైద్యుఁ డేరికినేల? ॥వి॥ 3326
పనికిమాలిన ప్రజ్ఞలు ప్రాణహాని.

ఆ. బడుగు బాపనయ్య । వడి నేర్పె మంత్రంబు
లెచ్చు మే మె యంద్రు । హీన జనులు
కడుగుఁ ద్రాగు కాకి । కల్గుని కూయదా ! ॥వి॥ 3327

మంత్రము చెప్పినమాత్రమున మహాత్ముఁ డెట్లగును ?

ఆ. బత్తిలేక లంజె । పలుమారు పిలిచిన
బత్తిగాదు లయపు । మిత్తిగాని
మిత్తి చొరగనిల్లు । మింగక పోవునా ! ॥వి॥ 3328

లంజతోటి పొత్తు గింజుకు చావడానికే !

ఆ. బన్న పడక గుటిని । బట్టులోఁ బట్టుగాఁ
జిన్న బలముఁ జేర్చి । చింత విడిచి
యున్న వాఁడె ముక్తిఁ । గన్నవాడౌ సుమ్ము ॥వి॥ 3329

బన్నము = బాధలు; ఆయాసపడక ఆత్మారాము నర్చింపుము.

క. బయలందె పుట్టు సర్వము
బయలందే లీనములగు । బ్రహ్మాండంబుల్
బయలని మదిలోఁ దెలిసిన
బయలందే ముక్తి బట్ట । బయలగు వేమా! 3330

బట్టబయలున బ్రహ్మాండ మంతయూ నెట్టుకొనియున్నది.

ఆ. బయల నిల్లుగట్టి । పరికింప నేరక
భ్రమసి తిరుగువాఁడె । పామరుండు
బయలుపడిన యతఁడు । బ్రహ్మంబు తానగు ॥వి॥ 3333

బట్టబయలుయొక్క ప్రాభవాన్ని పలువిధముల వర్ణిస్తున్నాడు.

క. బయ లనుచు బయలుపొడ గన
బయలునఁ దన మనసు నిలచి । బాగుగఁ దనరున్
బయలని తలఁచెడు భ్రాంతియె
బయలై తనుఁ దానె కాంచు । బ్రహ్మము వేమా! 3332

బయలును పొలుపుగా తెలుసుకొని నీవు బ్రహ్మము గమ్మన్నాడు.

ఆ. బయలుకాని బయలు । బయలని తెలియక
బైటపడిరి బట్ట । బైటివారు
బయలులోని బయలు । పరికింపఁ దత్త్వమౌ ॥వి॥ 3333
మాయా ప్రపంచాన్ని మరచినవారే మహాయోగులు.

క. బయలున బంధము కప్పును
బయలునఁ బరమాత్మునకును । బంధము తొలఁగున్
బయలున బంధము లుండిన
నయవర్తన ముక్తిఁగాంచు । నరుఁడటు వేమా! 3334
బంధవిముక్తికి బయలే పరమ సోపానము.

క. బయలున బంధము బుట్టును
కెయలునఁ బరమాత్మునకును । బంధము గలుగున్
బయలున బంధము తుది పెను
బయలున బయలయ్యెడి నిదె । పరముర వేమా! 3335
బయలు దెలిసిన బ్రహ్మము దెలియును.

క. బయలునఁ బుట్టిన బంధము
బయలునఁ గలుపంగవలయుఁ । బరమాత్మునకున్
బయలునఁ బుట్టెడి సంపద
బయలునఁ గలుపంగ ముక్తి । బయలగు వేమా! 3336
మాయాప్రపంచమున బుట్టిన మాయను మడియింపజేయమన్నాడు.

ఆ. బయలు నరసిచూచి । భావించి యాబెళ్కు
బెళుకువోఁక జూడు । బీరువోక
బీరువోకఁ జూడ । ధీరుఁడై నిలుచురా! ॥వి॥ 3337
ధీరుఁడు ధైర్య స్థైర్యములతో బయలును పరికిస్తాడు.

క. బయలున సర్వముఁ బుట్టును
బయలందే లీనమగును । బ్రహ్మాంబనఁగా
బయలని మదిలోఁ దెలిసిన
బయలందే ముక్తి బట్ట । బయలగు వేమా! 3338
ముముక్షాపేక్షులు మూలాన్ని గుర్తిస్తారు.

ఆ. బయలు బయలుగాను । పరికింపఁజాలక
బయలులోనివారు । బయటఁబడిరి
బయలులోని జాలఁ । బరికింపఁ దత్త్వమా ॥వి॥ 3339
తత్త్వజ్ఞానులు బయలుయొక్క తత్త్వాన్ని తెలిసికొందురు.

ఆ. బయలు బయలుగాను । బలపడినప్పుడే
నయముతోడ నైక్య । మగును మదిని
జ్ఞప్తియందు నెఱుకఁ । గనుటయే లేదురా ! ॥వి॥ 3340
తెలిసికొని బ్రహ్మైక్య సంధానుడవు గమ్ము.

ఆ. బయలు బ్రహ్మ మనుచుఁ । బరికింపుచుందురు
బయలదేల ? దాను । బ్రహ్మ మవును
బ్రహ్మమైన బయలు । పరికింపఁ దత్త్వమా ! ॥వి॥ 3341
బ్రహ్మమైన బయలును జూచినవాడే తత్త్వజ్ఞాని.

ఆ. బయలు బ్రహ్మ మనుచు । భాషింపుచుందురు
బయ లదేమిఁటికిని । బ్రహ్మమగును ?
బ్రహ్మమైన బయలు । భావమందుంచుమీ ! ॥వి॥ 3342
భావములో బ్రహ్మమును పదిలపరచుటయే బయలును గుర్తించుట.

ఆ. బయలు రూపు తనకు । బయలుగా జేసి యా
బయలురూపు నంటి । భ్రమయకుండి
బయలులోని బయలె । భావింపఁ బరమాత్మ ॥వి॥ 3343
మాయాతత్త్వాన్ని మరుగుపరచవద్దన్నాడు.

ఆ. బయలు రూపు రూపు । బయలుగాఁ జేసియు
నింటి రూపు బయట । నేరుపఱచి
బయలుకాని బయలు । పరికింపఁ దత్త్వంబు ॥వి॥ 3344
తాను బ్రహ్మం కావాలంటే బయలునే తెలిసికోవాలి.

ఆ. బయలు రూపు రూపు । బయలుగాఁ దెలిసియు
బయలు రూపు బట్టి । బయలు చేయ
బయలులోని బయలు । పరమాత్మ తత్త్వమా ॥వి॥ 3345
బయలుని బట్టబయలుజేస్తే పరబ్రహ్మ చటుక్కున కనపడుతాడు.

ఆ. బయలురూపు రూపు । బయలునుఁగాఁ జేసి
బయలు రూపు బట్ట । బయలుఁజేసి
బయలులోని దాని । భావింపఁ దత్వంబు ॥వి॥ 3346

బ్రహ్మవేత్తలు బట్టబయలును జూస్తారు.

ఆ. బయలు రూపు లేని । భావంబులో నెంచి
బయలు రూపు బట్ట । బయలు చేసి
బయలు బ్రహ్మమనుచు । భావింపఁదత్వమా ॥వి॥ 3347

నామ, రూప, క్రియా రహితుఁడే బట్టబయలు బ్రహ్మ.

ఆ. బయలులోని బయలు । పరికింపఁగాలేక
బయలురూపుఁ జూచి । భ్రమయనేల ?
బయలురూపు లెల్ల । బరికింప వలదయో ! ॥వి॥ 3348

బయలురూపములు పరికించుటయే బ్రహ్మత్వము.

ఆ. బయలులోని బయలు । పరికింపఁ జూడక
బయలురూపుఁ జూచి । వలచు నౌర !
మురికి దేహమందు । మోహంబు విడదయో ! ॥వి॥ 3349

దేహము మురికిదైనా మోహము విడువలేడు మూర్ఖుఁడు.

ఆ. బయలులోని బయలు । పరికింప నేరక
బయటఁబడిరి పట్ట । పగలుగాను
బయలులోని బయలు । భావింపఁగా ముక్తి ॥వి॥ 3350

లోనిబయలు చూచినవాఁడే లోకజ్ఞుఁడు.

ఆ. బయలులోనఁ బుట్టి । బయలులోనె పెరిగి
బయలుఁ దెలియకయుండె । నయము గాదు
వినుము నాకొడుకంచు । వినులఁ జెప్పరా ! ॥వి॥ 3351

" మోక్ష కారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వ స్వరూపాను సంధానం భక్తిరిత్యభి ధీయతే "
మోక్షమును సాధించుటకు బయలే ముఖ్యము.

ఆ. బయలులోనె పెనఁగి । బయలులో మునిఁగియు
బయలుఁ దెలియలేఁడె? । బంధకుండు
బయలు బ్రహ్మమనుచు । భావించి చూడరా । ॥వి॥ 3352

ప్రపంచమంతయూ బయలునం దున్నదని తెలిసినవాడు పరమఁదును.

కం. బయలే చూడఁగ సర్వము
బయలున లీనమయి చూడ । బ్రహ్మాండంబుల్
బయలని తోఁచెడి మదిలో
బయలందిన ముక్తి బట్ట । బయలగు వేమా । 3353

"ఆకాశోహ్యవకాశశ్చ ఆకాశ వ్యాపితం చయత్
ఆకాశశ్చ గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే"
శూన్యవస్తునే బ్రహ్మమని తెలియుము.

క. బయ లయినది యెంతెంతయొ
బయలున బ్రహ్మాండమునకుఁ । బట్టది యెంతో
రయమున రవి తా నెంతో
భయపడుదురు దానిఁ జూడ । బయలని వేమా! 3354

"శూన్యభావిత భావాత్మా! పుణ్యపాపై ప్రముచ్యతే"
శూన్యమునందే మోక్షము సిద్ధించును.

ఆ. బట్టె లట్టు లరవ । ఫలమేమి? కద్దురా!
అందు సార్థకంబుఁ । జెందకున్న
విన్నవారు వారి । వెట్టులుగా నెంత్రు ॥వి॥ 3355

వేదఘోషచేసి పెరుకలేదు బ్రహ్మన్ని.

ఆ బలముకొనఁగ గాలిఁ । బట్టి రేచించుచుఁ
గలియఁ బూరకంబు । కడలు కొనఁగ
విలయ కుంభకంబు । విధ మంది చూడరా! 3356

రేచక, పూరక, కుంభకములను క్రమముతో నడిపించినవాడే ఘనుఁడు.

ఆ. బలము జూపులేల ? । బలవంతముగ గాదు
కులము జూచి మెచ్చఁ! గుదురఁ బోదు
తలముఁ ద్రొక్కి యట్లు । తలకొని విడరాదు ॥వి॥ 3357
బలముతో గాక చలముతో సాధించ మన్నాడు మన కవి

ఆ. బల్లిపలుకులు విని । ప్రజ తమపను లెల్ల
సఫలములగు ననుచు । సంతసించి
కానిపనులకుఁ దమ । కర్మ మటందురు ॥వి॥ 3358
బల్లి శాస్త్రము ఫలవంతమని భ్రాంతి పడవద్దని కవి హెచ్చరిక

ఆ. బహుళ కావ్యములను । బరికింపఁగా వచ్చు
బహుళ శబ్ద చయము । పలుక వచ్చు
సహన మొక్కటబ్బఁ । జాల కష్టంబురా ! ॥వి॥ 3359
ఎన్ని చదివి ఎన్ని చేసినను సహన మబ్బుట చాలాకష్టము.

ఆ. బహుళ పాపియైన । బ్రహ్మఘ్నుఁ డైనను
నిర్దయాత్ముఁడైన । నీచుఁడైన
మరణకాలమందు । మమత లన్నియు మాని
హరుని దలప ముక్తుఁ । డౌను వేమ. 3360
అంతవరకూ తెలియకపోయినా అఖరున దెలిసినవాడు అనందము
పొందగలడు.

క. బహువిధ వస్తువులందును
మహిఁగలిగెడు నెల్లజాతి । మనుజుల యందున్
రహిమించు బ్రహ్మమని మది
గ్రహియింపఁగ బాహ్యశబ్ద । కధితము వేమా ! 3361
నానారూపములతో నున్న నారాయణుని నమ్మమన్నాడు.

ఆ. ప్రణవ మరయలేక । పరుఁడును గాలేడు
జ్యోతి నరయలేక । చొప్ప లేఁడు
నిత్య మరయలేక । నిర్వాణి గాఁడయా ! ॥వి॥ 3362
ఓంకార నాదమే శంకరు సాన్నిధ్యమును చేర్చగలదు.

ఆ. బ్రతుకుఁ దెరువులేని । బడుగు లందఱు పెద్ద
యోగివరుల మనుచు । సాగిరాఁగ
బండవాండ్రు ముందు । దండంబు లిడుదురు ॥వి॥ 3363

పొట్టకోసము కట్టడి వేషాలు వేయు యోగులు బండవాళ్ళ కాళ్ళ బడుదురు.

ఆ. బ్రతుకులన్ని మాయ । భవబంధములు మాయ
తెలివి మాయ తన్ను । దెలియ మాయ
మాయఁ దెలియు నతఁడు । మర్మజ్ఞుఁ డగు యోగి ॥వి॥ 3364

అన్నీ మాయ యని తెలిసి భ్రమయనివాడే బ్రహ్మజ్ఞాని.

ఆ. బ్రతుకు నిత్యమనుచుఁ । బొగడుచు వగమీఱ
విఱ్ఱ వీగువాడు । వెఱ్ఱివాఁడు
ప్రాణులెల్ల యముని । బాటికి గొఱ్ఱెలే ॥వి॥ 3365

"క్షణం చిత్తం క్షణంవిత్తం క్షణంజీవితమాయయో
యమశ్య కరుణా నాస్తి ధర్మశ్య త్వరితగతిః"
జీవితము, విత్తము క్షణికములు.

ఆ. బ్రతుకు లస్థిరమని । భావింపఁగా లేక
విఱ్ఱ వీగుచుండు । వెఱ్ఱివాఁడు
ప్రాణులెల్ల యముని । బారి గొఱ్ఱెలు సుమీ ! ॥వి॥ 3366

దేహకాంక్షకు దేవులాడువాడు యమునిబారి గొఱ్ఱెగాడా !

ఆ. బ్రదుకు వార లెవరు ? । బ్రదుక కుందు రెవ్వరు ?
బ్రతికి బ్రతుకలేని । ప్రాణులెవరు ?
క్షితిని శోధఁజేసి । స్థిరముగఁ జూడరా ! ॥వి॥ 3367

బ్రతుకును దెలిసి బ్రతికినవాడే బ్రహ్మజ్ఞాని.

ఆ. బ్రహ్మంబు ప్రబలమై । బయలుగా నుండంగ
చూచిఁ జూడఁగ లేరు । జార నరులు
నరక ప్రాప్తులనెల్ల । నమ్మనియ్యఁడు బ్రహ్మ ॥వి॥ 3368

"కాయ మనిత్యము న్దెలివి గానక మంత లయాది యోగసో
పాయములైన సిద్ధులను బాయకయే దలపోసి మూఢులై

మాయల నందువారు నడుమంత్రపు యోగులు గాని ముక్తికిన్
డాయగ లేరు వీరలకు నెంథమె మోక్షమ దెంచి చూడగన్ ”

(శ్రీరామ స్తవరాజము)

తే. బ్రహ్మకర్త నోసట । వ్రాసె ను కోరకుండు
పరగగ దనశిరము । భవునిపాణి
నంట వ్రాసికొనెనా? । యీ కమల భవుండు ॥వి॥ 3369

బ్రహ్మ ప్రాణులకు కర్తయే యైన తన శిరము శివుడు ద్రుంచునని వ్రాసుకొన్నాడా!

తే. బ్రహ్మకులజుఁడవా నభి । రామ యార్య!
మోస మొనరించి మీ కైతి । దాసుఁడ నటు
తప్పు సైరించి బ్రోవఁగఁ । దలపవలయు
నభయ మొందక విడనంటి । నంఘ్రి వేమ! 3370

యోగి తత్త్వోపదేశానంతరము వేమన తన గురువగు అభిరామయార్యని పదములబడి ప్రార్థించిన విషయ మిందు ద్యోతకము.

ఆ. బ్రహ్మ గుడ్డు మేను । ప్రాణ మనఁగ గాలి
కనులు చంద్రసూర్య । కళలె తెలియ
*కంతకంటె బ్రహ్మ । మెక్కడ నున్నది ॥వి॥ 3371

* యతి తప్పు; పృథివ్యాప్తేజో వాయు రాకాశములే ప్రపంచ కారణములు.

ఆ. బ్రహ్మ గుడ్డు యనెడు । పట్టణంబు లోపల
బ్రహ్మ మెఱుఁగ లేని । బాపఁ డేల ?
తన మనంబుఁ దెలియఁ । దానెపో బ్రహ్మంబు ॥వి॥ 3372

తన మనము దెలిసికొన్నవాడే తత్వజ్ఞాని.

ఆ. బ్రహ్మ గుడ్డుమాయె । భవుఁడు పల్లం బాయె
నాది విష్ణు వెన్న । నంక మాయె
నందు మీఁద నుండు । నాడుదో? మగవాఁడో? ॥వి॥ 3373

బ్రహ్మ గుడ్డుమాయెను, శివుడా గుడ్డునకు పల్లమయ్యెను. విష్ణువు ఆ పల్లమునకు అంక మాయెను. ఆపై నెక్కినది స్త్రీయో పురుషుడో (ప్రకృతి) గుర్తించు.

ఆ. బ్రహ్మ ఘటము మేను । ప్రాణంబు దగగాలి
మిత్ర చంద్ర శిఖలు । నేత్ర చయము
మఱియు బ్రహ్మ మనఁగ । మహిమీఁద లేదయా! ॥వి॥ 3374
మనుష్యుఁడే బ్రహ్మ యయియుండగా మరి వెదుక నేల ?

తే. బ్రహ్మ చర్య మహింస నాఁ । బరగు పరమ
ధర్మములు రెండు సువ్వే యు । త్తమ తపములు
వానిఁ గలవాఁడు నిర్మల । జ్ఞాన యోగ
వంతుఁడై చూడనేర్చు స । ర్వంబు వేమ! 3375
బ్రహ్మచర్య తపోనుష్ఠానములు తాను తరించుట కాధారములు.

ఆ. బ్రహ్మచే శివుఁడాయె । భావంబులోఁ జూడ
శివుఁడె బ్రహ్మం బాయె । యవని లోన
బ్రహ్మ శివుఁడైనది । జిహ్వకేఁ దెలుసురా! వి॥ 3376
రజోగుణము బ్రహ్మ. సత్వగుణము విష్ణువు, తమోగుణము శివుఁడు,
త్రిగుణరహితుడే యోగి.

ఆ. బ్రహ్మఁ జంపి విష్ణు । భాగంబున గలిపి
విష్ణు జంపి శివుని । వీటఁ గలిపి
శివుని జంపి తాను । శివయోగి కావలె ॥వి॥ 3377
త్రిగుణముల కలిపేగుణమును దెలిసికొమ్మన్నాడు.

తే. బ్రహ్మ తన్మయ చింత న । భవహరంబు
బ్రహ్మ మాత్మావలోకన । ప్రముదితంబు
బ్రహ్మ మందైక్యమగు నాత్మ । పరవశంబు
విమల మతినెంచు నపుడిదే । విధము వేమ! 3378
బ్రహ్మచింతను జేసిన బ్రహ్మజ్ఞాని కాగలఁడు.

ఆ. బ్రహ్మ తలనుఁ జిదుమ । బ్రహ్మ హత్య యటంద్రు
బ్రహ్మ వైశ్యుఁ డెన్న । బాపఁ డగునె?
బ్రహ్మఁ జచ్చిన కద । బ్రహ్మఘ్నుఁ డగు శూలి ॥వి॥ 3379
బ్రహ్మహత్యాదోష పరిహారము కొరకు శివుఁడు భిక్ష మెత్తుతున్నాడు.

ఆ. బ్రహ్మతలను గొట్టి । పారవేసిన చోట
నడ్డ మెవ్వరైరి । యఖిల సురులు
శివుని కరుణలేని । చెనటి కెవ్వరు దిక్కు? ॥వి॥ 3380
శివుని మహిమయే సృష్టి కాధారము.

ఆ. బ్రహ్మను దలఁగొట్టి । పారవైచిన యప్పు
డడ్డపడఁగ నోప । రయిరి సురలు
శివుని కరుణ లేమిఁ । జెడిపోదు మందురు ॥వి॥ 3381
దక్షయజ్ఞము ధ్వంస మొనరించినప్పుడు వీరభద్రుఁడు ఎదిరించినవారిని చిదుకగొట్టెను. (వీరభద్ర విజయము)

ఆ. బ్రహ్మ దూరము లేదు । జిహ్వయందునఁ జూడ
కుమ్మరి పురుగు వలె । కలిసి మెలిసి
బొమ్మరింటనుఁ జేరిఁ । బడి పొర్లుచున్నాఁడు ॥వి॥ 3382
* యతులుపోయినను యతిశ్రేష్ఠులవలె హితమునే బోధిస్తుంది.

ఆ. బ్రహ్మ, నృపతి, వైశ్య పతులును, శూద్రులు
బ్రహ్మ, విష్ణు, హరుఁడు । పశువు లెన్న
బ్రహ్మము దెలియక । బహు రూపు లెరిట్లు ॥వి॥ 3383
బ్రహ్మను దెలియక బ్రహ్మాదులు తికమక పడ్డారు.

ఆ. బ్రహ్మ పరువు చెడును । బ్రాహ్మణులా దొడ్డ
బ్రహ్మవలనఁ బుట్టి । పరగి రనఁగ ;
బ్రహ్మవేత్త యగును । బ్రాహ్మణుండేమైన ? ॥వి॥ 3384
బ్రహ్మవేత్త కానివారలు బ్రాహ్మణులమని చెప్పుకొన్న బ్రహ్మదేవునికే తలవంపు.

ఆ. బ్రహ్మ బ్రహ్మ యంద్రు । బ్రహ్మం బదెట్టిదో !
వలసి తెలిసి చూడ । వద్దనుండు
ముద్రలోన నుండు । ముద్రికే కానరే ! ॥వి॥ 3385
బ్రహ్మ మనుచు పరితపించుటకంటె ముద్రలోనున్న చిద్రూపుని దెలియుటయే మేలు.

ఆ. బ్రహ్మ మనఁగ నెటనో । పరదేశమున లేదు
బ్రహ్మ మనఁగఁ దానె । బట్ట బయలు
తన్నుఁ దా నెఱిఁగినఁ । దానెపో బ్రహ్మంబు ॥వి॥ 3386

తన్ను తాను తెలిసికొన్నవాడే బ్రహ్మ.

తే. బ్రహ్మ మయమగు విశ్వంబు । ప్రబలగాంచి
లయము నొందఁగ మదినెంచు । లక్ష్యమూని
చింత విడనాడి యుండుటే । చిన్మయంబు
నిత్య సంతోష నిలయంబు । నిజము వేమ ! 3387

చిన్మయ బ్రహ్మమును చిత్తమునందు హత్తించుటే శ్రేష్ఠము.

ఆ. బ్రహ్మమవల నున్నఁ । బ్రళయ కాలంబైన
నదియుఁబ్రహ్మ చేత । నందవచ్చు
బ్రహ్మ మమరు జ్ఞప్తి । పట్టులో పట్టుగా! ॥వి॥ 3388

ప్రళయ కాలాంతమైన బ్రహ్మమును హృదయ పీఠమున పదిల
పరుప మన్నాడు వేమన

ఆ. బ్రహ్మముఁ దెలియు నగు । భావ మందును నిల్పి
తనువు గుడిని జేసి । తన్ను నిలిపి
లోకమందు నిలిచి । లోఁజూపుఁ జూడరా ! ॥వి॥ 3389

శరీరమును దేవళముజేసి ఆత్మలింగాన్ని అర్చించమన్నాడు.

ఆ. బ్రహ్మమున్నచోటు । పరగంగ దెలియక
యెందొ వదక బ్రహ్మ । మేలఁ గలుగు ?
నంజనంబులేక । యాసొమ్ము దొరకదు ॥వి॥ 3390

భావమందున్న బ్రహ్మను కోసము పరితపించనేల ?

ఆ. బ్రహ్మమును గనుగొను । భావమందెడు యోగి
తనువు గురిగఁ జేసి । తనువు నిలిపి
లోకబుద్ధి విడిచి । లోఁ జూపు జూచురా ! ॥వి॥ 3391

లోజూపు జూచినవాడే లోకాతీతుఁడు.

తే. బ్రహ్మమెఱుఁగని వారెట్లు । పారులైరొ ?
జిహ్వారుచులకు దోఁపదె । జీవులార !

గహ్వరంబైన మదియందు । గనుఁడి మీరు
బ్రహ్మకులమైన బయలులోఁ । బరగు వేమ ! 3392
బ్రహ్మమును దెలియక బ్రాహ్మణు లెట్లయిరి.

ఆ. బ్రహ్మమెఱుఁగు జ్ఞప్తి । పదిలంబు గావించి
తనువు మఱచి వేగఁ । దన్నుఁ దలఁచి
లోక బుద్ధి మఱచి । లోచూపుఁ జూడరా ! ॥వి॥ 3393
తనువును తన్మయపరచిన వాడే తత్వజ్ఞుడు

ఆ. బ్రహ్మమేడ ననుచుఁ । బలుమారు నాడేరు
వెఱ్ఱి మూర్ఖ జనుల । విధము చూడ
బ్రహ్మమన్నిట దగుఁ । బరిపూర్ణమై యొప్పు ॥వి॥ 3394
అందూ యిందూ సందులేక యున్న బ్రహ్మమును వెదుకనేల ?

ఆ. బ్రహ్మమేడననుచు । పలుమారు పల్కినా
దేవతలకు నైన । తెలుప వశమె ?
బ్రహ్మమన్ని యెడల । పరిపూర్ణమై యుండు ॥వి॥ 3395
దేవతలైనా దీక్షలేక బ్రహ్మన్ని తెలియంగలేరు.

ఆ. బ్రహ్మ యండమనెడి । పట్టణమందున
బ్రహ్మ మెఱుఁగలేని । బాపఁడేల ?
తన మనంబు తెలియ । దానెపో బ్రహ్మంబు ॥వి॥ 3396
తన శరీరమే బ్రహ్మపురము. శరీరమును తెలియని జ్ఞానమేల ?

ఆ. బ్రహ్మ యెవనికొడుకు ? । పరికింపఁగా భువి
విష్ణువెవని కొడుకు ? । వెలయఁ జూడ
శివుఁడెవరికి కొడుకు ? । సిగ్గెఱుగరు జనుల్ ॥వి॥ 3397
త్రిమూర్తుల తల్లి ఆదిశక్తి (శక్తి పురాణము)

ఆ. బ్రహ్మ, రాజ, వైశ్య । పటు శూద్రులును మఱి
బ్రహ్మ, విష్ణు, నృపతి । పశువులన్ని
బ్రహ్మమును దెలియక । బహుమాపులెట్లైరి ॥వి॥ 3398
బ్రహ్మను దెలియక బ్రాహ్మణాది జాతు లెట్లయిరి ?

ఆ. బ్రహ్మవంశ భవులు । ప్రబలులై యుండఁగా
నితర జాతులకును । గతులు గలవె?
వనములోని కోతి । వసుమతి నడుపునా? ॥వి॥ 3399

కోతి రాజ్యము చేయలేదు. అట్లే నీతిలేనివారు గూడా ఖ్యాతికెక్కలేరు.

ఆ. బ్రహ్మవాదు లెల్ల । బ్రహ్మం బనంగను
వలసిఁ దెలిసి చూడ । వద్ద నుండు
ముందునున్న యట్టి । ముద్రిక గానరో ॥వి॥ 3400

బ్రహ్మవేత్తలు ముద్రికను దెలసి ముక్తి పొందుదు రని మన ముముక్షువు వాక్కు.

ఆ. బ్రహ్మవ్రాత కెదురు । పల్కిన వాఁడును
ఆదివిష్ణు సూత్ర । మడఁచు వాఁడు
మూఁడు కనుల వాని । మొనసి నిల్చినవాఁడు
కానబడరు నీవు । కాని వేమ. 3401

త్రిమూర్తులను ధిక్కరించిన వాడు త్రిలోకములో లేడు.

ఆ. బ్రహ్మ, విష్ణువులకు । బరగంగ రుద్రుండు
సిగయ యటనెఱిఁగి । సృష్టి జనులు
రుద్ర నిందఁ జేసి । రూఢి తప్పిరిగాదె? ॥వి॥ 3402

బ్రహ్మ విష్ణువులకు శివుఁడు సిగవంటివాడు. అట్టి శివదూషణ జేసిన భ్రష్టపతితు లగుదురని హెచ్చరించాడు.

ఆ. బ్రహ్మ విష్ణువు శివుల । భాగంబులను నిల్పి
పరమ యోగి యైన । బ్రహ్మమౌను
బ్రహ్మమైన వాని । భావింప శక్యమా! ॥వి॥ 3403

సత్వ రజ స్తమో గుణాలను సమన్వయ పరచినవాడే జ్ఞాని.

ఆ. బ్రహ్మ వేత్తలమని । పౌరుష మాడేరు
బ్రహ్మ మనఁగ దాని । భావ మేమి?
తెలుపొ, నలుపొ, యెరుపొ । తెలిసినఁ బలుకుఁడీ ॥వి॥ 3404

బ్రహ్మస్వరూపము తెలియక బ్రహ్మవేత్తలనువారిని పరిహసించెను.

ఆ. బ్రహ్మ సంతతియన । భక్తులై వెలసిరి
ఋషుల జాతులెన్నొ ? । రీతులెన్నొ ?
రోత కెక్కువారి । రోయక పిలుతురా ! ॥వి॥ 3405

నీచులను నీచంగానే చూస్తారు. యిది లోకపరిపాటి.

తే. బ్రహ్మ సుఖతత్త్వ విజ్ఞాన । పరముఁ గోరి
గురుకళాజాల నిలయమా । గుప్తమందు
యోగ నిర్ముక్త రూపుఁడై । యుండ నయిన
పరమ శివుఁడన భాసిల్లు । ధరణివేమ. 3406

హృదయకోశమున సదమల బ్రహ్మమును పదిలపరచువాడే జ్ఞాని.

ఆ. బ్రహ్మహత్య సేయ । బహురోగములు గల్గు
బ్రహ్మహత్యచేత । పదవి చెడును
బ్రహ్మహత్య వలన । పాపమ్ము సమకూఱు ॥వి॥ 3407

"బ్రహ్మహత్యా మహాదోషః"
బ్రహ్మహత్య చేయువాడు మహాపాపి.

సీ. బ్రహ్మాండ మందున । భాసిల్లు చుండెడి
కొండ వీడాఖ్యచేఁ । గొమరు మిగిలి
దేవ ఘాతంబుల । దేవాలయంబుల
దేవతల్ తపసులు । దేజ రిల్లఁ
జిన్మయ లంబికా । శివయోగ వరునకు
సచ్ఛిష్యుఁడగు రామ । భాత్ర వరుఁడు
అరుణోదయ స్నాన । మైన పిమ్మటఁ దాను
పుష్పముల్గొని చని । పూజ కిచ్చు
సతత మిటు చేయ సిద్ధుఁడు । సంత సించు
నిట్లు గురు సేవ చిరకాల । మొనసి చేయ
ఫలము లభియించు కాలంబు । ప్రాప్తమయ్యెఁ
దప్పెఁ బూర్వకృతంబేమి । చెప్ప వేమ. 3408

తను మంత్రోపదేశము పొందిన చరిత్ర యిది.

ఆ. బాగుగాను ముక్తిఁ । బడయంగ ముందుగా,
యోగిగాక గురుని । కేగి మ్రొక్కి
వేగబుద్ధి నొక్కి । విలయ మందుటతగు ॥వి॥ 3409

బుద్ధిని నొక్కి విలయమందుటే విజ్ఞాన మార్గము.

ఆ. బాట చక్కఁగఁజేసి । భక్తి నేయక నరుఁడు
ముండ్లదారిని బోయి । ముందు గనని
ఆడవెధవల కెల్ల । యబ్బునా యాదారి ? ॥వి॥ 3410

వివేకములేక విఱ్ఱవీగినవాడే వెధవ.

ఆ. బాటఁ దెలియకున్న । బహుదూరమై తోఁచు
చోటుఁ దెలియకున్నఁ । జూపొసరదు
కోట కొమ్మ మీఁదఁ । గుదురుగఁ జూడుమీ ! ॥వి॥ 3411

ముక్తి మార్గమును శక్తికొలది సాధించమన్నాడు.

ఆ. బాపఁడనఁగనేమి ? । భక్తుఁ డనఁగనేమి ?
జోగి యనఁగ నేమి ? । సొంపు లేక
ఇన్ని పేరు లేల ? । ఇనజుఁడు పనిదీర్చు ॥వి॥ 3412

ఇనజుఁడు = సూర్యకుమారుఁడైన యముఁడు ; ఈ పద్యములో
జ్ఞానము లేదు.

ఆ. బాపఁ డారగింప । బరగె నేకాహంబు
వేదపనుల నొదవఁ । బెండ్లిముగిసె
గులము మొదలె చెడ్డఁ । గూలిపో మానంబు ॥వి॥ 3413

పద్యచరణములు స్పష్టంగా లేక భావ మగోచరముగా యుంది.
మహాకవిచంద్రుని పోకడిందులో లేదు.

ఆ. బాపఁడెముక కూడు । భక్షింప సాగెను.
పోవుఁ బేరటంబు । బొచ్చు ముండ
కులము మానము డగఁ । గోర్కులు మెండాయె ॥వి॥ 3414

దేశసంచారములో వేమన కచ్చటచ్చట కనుపించిన వింతలను
నిర్మొగమాటంగా చెప్పాడు.

ఆ. బాపలన్న దొడ్డ । పరువునఁ జూతురు
కానిపనులు సేయ । హీను లండ్రు
కులము లెక్కయేమి ? । గుణమే ప్రధానంబు ॥వి॥ 3415
గుణాన్ని బట్టే గొప్పవాడౌతాడు.

ఆ. బారడేసి జడలు । భస్మంబు పూతలు
మరుని బోడ నూరు । మలయ గలరు
ముంజకోర్కె లెల్ల । లంజకోర్కల కాదె ॥వి॥ 3416
కచ్ఛడాలు బిగించి కాంతలను జూచి విప్పేవారే లంజకోర్కల
జ్యా యోగులని మనయోగి పుంగవుని నూటివాక్కు.

ఆ. బారెడేసి జడలు । భస్మంబు పూతలు
వనితలకును బోధ । వరుస కుదుర
గంజి గోచులమరె । లంజె వేషము మీాఱె ॥వి॥ 3417
జడధారులమనే చానలకు లోబడే చచ్చు వారినిగూర్చి వేమన
వ్యంచాడు

ఆ. బారెడేసి జడలు । భస్మాంగ లేపనల్
మదన ముదముతోడ । మాఱు మలయు
క్రోర్క లుడిగి యంగ । రేకులు బలిసెరా ! ॥వి॥ 3418
మదన జ్వరమున సుదతీ సంగమము గోరే శుష్కవేదాంతులను
-పటుముగా నిందించాడు యోగి.

క. బాలను నెత్తుకొనినయప్పుడు
చాలంగా జలకమార్చు । సహజము గాగన్
బాళిని మంత్రపు సానియు
నీలోకులు మెచ్చగాను । నిలపై వేమా ! 3419
యతి తప్పు ; పుట్టిన యప్పుడే పసిబిడ్డకు మంత్రసాని జేయు ఉప
మేమో !

. కాలకు నెత్తుచు నప్పుడె
చాలంగా జలకమార్చి । సంతోషముతోఁ

బాళిని మంతర సానియె
జోలలు వాడెడిని గదర । సొంపుగ వేమా ॥ 3420

బాలలకు మంత్రసానే మొదట తలికంటే-ముందుగా బాడును.

ఆ. బాల చనుల పూల । బంతులు వోల్తురు
పాలు మాలినట్టి । భ్రాంతు లవని
మాంస ఖండమందు । మఱియేమి యున్నది ? ॥వి॥ 3421

స్తనములు మాంసఖండములు. వాటిని చిత్రముగా వర్ణింతురు కవులు.

క. బాలెత తనకున్నప్పుడు
బాలురతోఁ గూడి నటుల । భాషింపంగా
నేలకో ? శివునకు నప్పుడు
మాలిమిగల జాలితగులు । మహిలో వేమా ! 3422

బాలెత=బాలింతరాలు ; పసిబిడ్డతో గూడిన బాలెంతరాలంటే పరమ శివునకు ప్రేమ.

గీ. బాల ప్రాయంబునను । ముక్తిఁ బడయరాదు
వయసునందును గామంబు । వదలబోదు
ముదిమి యందును జింతలో । ముక్తి లేదు
చచ్చిసాధింపనో నేమొ ? । జగతి వేమ. 3423

మానవావస్థలు నాలుగున్ను అనగా బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములలో ప్రతిబంధకములు కలవు భవుని తెలియుటయెట్లు ?

ఆ. బాల పాయమందె । భ్రమల నడంపక
మేలు పొంద రెపుడు । మేది నందు
కీలుఁ దెలిసి మదిని । గీడ్పడ కుండుమీ ! ॥వి॥ 3424

"మొక్కైపు డొంగనిది మ్రానపు డొంగునా", అను ఆర్యోక్తి నిట ప్రస్తావించెను.

ఆ. బాల ప్రాయమునను । బహువిధములఁ బట్టి
చప్పరించి నట్టి । స్తనములకు నె
మోహ మింతయేల ? । మూఢాత్మ తెలియరా ! ॥వి॥ 3425

స్తనము లందు పాలుత్రావి పెరిగి తిరిగి అట్టి స్తనములకే భ్రాంతి పడుట భ్రష్టత్వమన్నాడు మన భాష్య కారుఁడు.

ఆ. బాలప్రాయము నాడు । బహువిధంబులఁబట్టి
చప్పరించిన స్తన్య । మిప్పు నేల ?
యిపుడు గల్గిన మో । మపుడేల ? లేదురా ! ॥వి॥ 3426
ఈపద్యము తాలూకు భావం ప్రకృతికే విరుద్ధం.

తే. బాల్యచేష్టల పాల్పడి । భ్రమను దగిలి
తిరిగి మదిలోన దేవునిఁ । దెలియలేక
యిహ సుఖంబుల విడలేక । యీల్గు నరుఁడు
నరక బాధకు నడలుచు । నెఱుఁగు వేమ. 3427
బాల్యపు చేష్టలు బంధింప చేస్తాయి.

ఆ. బాల్యమందు నెపుడు । పాలపై ప్రేమచేఁ
దల్లి నెఱిగి చూచి । తనయుఁ డేడ్చు
తల్లి పనులు దీర్చి । తనయుని ముద్దాడు ॥వి॥ 3428
శిశువులకు మాతృదేవిని పసిగట్టుట ప్రకృతి సిద్ధము.

ఆ. బాల్యమందు శివునిఁ । బరికింపఁగాలేరు
యౌవనంబు నందు । నరయలేరు
ముదిమి యందుఁ గూడ । మోసమే కందురో ! ॥వి॥ 3429
మానవావస్థలలో నుండే మమకారము మహేశుని జూడనీయదు.

ఆ. బాల్యమందు స్వామి । భక్తి లేకుండును
యౌవనమున హరుని । సేవఁ గనరు
వార్ధకంబునందు । వర్ణింప లేరటే ॥వి॥ 3430
నాల్గవస్థలలో నరుఁడు నానాయాతనలను పడతాడు.

క. బాల్యము తనకున్నప్పుడు
బాలురతోఁ గూడినటుల । భాషింపంగా
నేలకొ శివునకు నప్పుడు
మాలిమితో నుసురు తగులు । మహిలో వేమా ! 3431
పసివారలు అన్నెము పున్నెము ఎరుగక పరమాత్ముని వంటి వారుగా నుందురు.

క. బాలుఁడవై యున్నప్పుడు
చాలవు యౌవనము నందు । సంపద రూపుల్
మేళనమా ముదిమియె యే
వేళను గడ తేర్పు శివుని । వెదకర వేమా ! 3432

యెప్పుడో ఒకప్పుడు చావు తప్పదు. ఇప్పుడే ఈశుని భజింపుము.

క. బాలుఁడు గానీ భోగ
స్త్రీలోలుఁడుగాని విషయ । శీలుఁడు గానీ
మేలైన బోధ గలిగిన
చాలును ముక్తియునుఁ గల్గు । సన్నుత వేమా ! 3433

మంచిబోధ ఎటువంటివారికైనా మార్చివేయును.

ఆ. బ్రాహ్మణునకు మొక్క । బహుదీవన లొసంగు
నాత్మ శుద్ధి గల్గు । నాతఁడైన
గలుగునన్ని; కామిఁ । గంతశోషయె సుమీ ! ॥వి॥ 3434

జ్ఞాని దీవన ఫలప్రదము.

ఆ. బ్రాహ్మణులకుఁ బెట్ట । ఫలము కద్దందురు
కుక్కలకును బెట్ట । గొడవ యేమి ?
ఇందునందుఁ శివుఁడె । యేకమై యుండురా ! ॥వి॥ 3435

సర్వే సర్వత్రా సర్వేశ్వరుడుండిన హెచ్చుతగ్గు లేల ?

ఆ. బ్రాహ్మణులకు సకల । భాగ్యంబు లీవచ్చు
గౌర వింపవచ్చుఁ । గోర వారు
జ్ఞానమొసఁగి జనుల । కడ తేర్పఁ గలిగిన ॥వి॥ 3436

జనులను చక్కబరచినవాడే బ్రాహ్మణుఁడు.

ఆ. బ్రాహ్మణ మనుచును । బ్రహ్మత్వమది లేని
బ్రాహ్మణమది యేల ? । బ్రాహ్మణుఁడటె ?
బొమ్మ వలెను దాను । దిమ్మపై గూర్చుండ ॥వి॥ 3437

గద్దెపై నున్న పెద్దగునా !

ఆ బిందు నాదుఁ జేసి । ప్రియమొప్పఁ గానల్ల
నాదు బిందుఁ జేసి । నయముగాను
బిందు, నాదు, సందు । భేదించి చూడరా! ॥వి॥ 3438

నాదు, బిందు కళలను నయముగా చూడమన్నాడు.

ఆ. బిందు నాదు నాదు । బిందునుగాఁ జేసి
నాదు బిందులాది । నాదుఁ జేసి
బిందులోని నాదు । భేదించి చూడరా! ॥వి॥ 3439

అనులోమ విలోమముగా నాదుబిందు కళలను నడిపించమన్నాడు

తే. బిందు బీజముల నడుమ । భేద పడక
నంది నిర్గుణ తాండవ । నటనుఁ డగుచు
పొంది పరిపూర్తిఁ జెందును । బూరితముగ
నందలంబగు బయలెక్కి । యందు వేమ! 3440

నాదు బిందు, కళలలో తబ్బిబ్బులు పడక నిబ్బరముగా వీక్షించమన్నాడు.

ఆ. బిందు మీఁద నిలిచి । ప్రియముగా నాదంబు
గళను గూర్చుకున్న । ఘనుఁడు గాఁడు;
ఎన్ని పాట్లు పడిన । నెట్లబ్బు? మోక్షంబు ॥వి॥ 3441

మోక్షం గావాలన్న బిందు తత్వాన్ని పొందుగా దెలుసుకోవాలి

ఆ. బిందు రక్తము, చీము, । బొందెలో నుండంగ
నాదంబు చేయను । నరుఁడు వెరచు
వూరు, వూరదిరిగి । వూడి తా చచ్చురా! ॥వి॥ 3442

జాగ్రద, స్వప్నము, సుషుప్తులను తెలియనివాడు మట్టిపాలగును.

ఆ. బిందు రక్తముఁ గలిసి । బిడ్డ పుట్టగ గదా
బిడ్డ నెత్తుక ముద్దు । బెట్టనాయె
బిందు బిందుగ నుంటె । బిడ్డెట్లు పుట్టురా? ॥వి॥ 3443

శుక్ల, శోణితముల సమ్మేళనమే బిడ్డ.

ఆ. బిందు రక్తములను । బెరసిన దేహము
చంద మెఱుఁగక ద్విజ । శబ్ద మిడుక
నడచినను విడుచునొ । నరకంబు మృత్యువు ॥వి॥ 3444

శరీర తత్వము దెలియనివాడు బ్రాహ్మణుడు గాడు.

ఆ. బిందు రసముగఁ జేసి । బిగువనే పసరుతో
మాపు రేపును విడక । మర్దించివుంచి
పాత్ర పిడకలు జేర్చి । పుటముంచి చూడరా! ॥వి॥ 3445

బిందువు=శివుని వీర్యము. అనగా పాదరసము. పద్యము తప్పు ;
ంగార యోగము గాబట్టి బంగారము గానే యున్నది.

ఆ. బిందు వందుఁ బుట్టెఁ । బెంపైన నాదంబు
నాదమందుఁ బుట్టె । నాది శివుఁడు
శివుని మధ్యమందుఁ । జెలగును సూక్ష్మంబు ॥వి॥ 3446

సూక్ష్మ బ్రహ్మ యొక్క సృష్టిని పుష్టిగా వివరించాడు

ఆ. బిందువనఁగ మాయె । బీజంబు శివుఁ డాయె
నందుఁ గనక మాయె । నప్పు లాయె
సంధివెలయు జగము । సర్వము నాత్మాయె ॥వి॥ 3447

అంతామాయ ; ఆత్మ నిత్యము.

ఆ. బిందు విడిచిన వెనుకబొంది । బలహీనమై పోవు
యెఱుక లేక నరుఁడు । పరుగు లాడు
గుణ హీనునకు సూత్ర । గణితంబు దెలుసునా! ॥వి॥ 3448

గణితములలో, అంకగణితము, క్షేత్ర గణితము, సూక్ష్మగణితము అను
పేరులుగలవు. మవేన గణితమున గణనకెక్కను గాబోలు.

ఆ. బిందు వెక్కడఁ బుట్టె । బీజ మెక్కడఁబుట్టె
మోహ మెక్కడఁ బుట్టె । మనసు నందె
శక్తి యెక్కడఁ బుట్టె । శకునంబుఁ జూడరా! ॥వి॥ 3449

మనసే అన్నిటికి ఆధారము
"మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"

ఆ. బిందు సేవకుండు । బీజంబె యైయుండు
తీర్థసేవకుండు । దేవుఁ డగును
నాదు సేవకుండు । తాదొడ్డ శివుఁడయా! ॥వి॥ 3450
మోక్షనాదు నారాధింపుము.

ఆ. బిందు సేవకుండు । బీజమై యుండును
సాధు సేవకుండు । సర్వ హితుఁడు
తీర్థ సేవకుండు । తిరుగు చుండెడిఁగదా! ॥వి॥ 3451
తీర్థయాత్రలు కాళ్ళ దిట్టతనముకే.

ఆ. బింబ ఫలములుండ । బిగువైన రసముండ
బసిడి కొఱకుఁ దిరిగి । పాట్లు వడిరె
సత్తు వెచ్చ చేసి । సాధింప లేరొకో ॥వి॥ 3452
బంగారము చేయు విధానము ; బింబఫలము = దొండపండు : కృష్ణ దొండ దీని కుపయోగమట.

ఆ. బిగియు దృష్టి యెపుడు । బింబ మందుంచిన
మనన మందు నెఱుక । మగ్నమగును
లగ్న చిత్తమమర । రక్షించు చుండురా! ॥వి॥ 3453
లగ్నచిత్తము గలవాడే లక్ష్యమును సాధించినవాడు.

ఆ. బిడ్డ లందు ప్రేమ । ప్రియమైన చుట్టాల
సంపదయును గలిగి । సఖియఁ గూడి
ముందు చే టెఱుఁగక । మురియుటఁ జూచిన
భంగురంబు మాయ । బలిమి వేమ. 3454
సంసార తాపత్రయ మంతా క్షణభంగురమే గదా!

ఆ. బిడ్డలను, సతులను । పేరెక్కు చుట్టాల
సంపదలఁ, దనువులఁ । జాల నమ్మి
సంతసిల్లు చుంద్రు । క్షణభంగురములని
తెలియలే రదేమి? । తెల్ప వేమ. 3455
"క్షణం విత్తం క్షణంచిత్తం క్షణం జీవితమావయోః
యమశ్య కరుణానాస్తి ధర్మస్య త్వరితాగతిః"
ధర్మమార్జించినచో యముడు దరికి రాడు.

ళ్ళ । బడి సాగి మ్రొక్కితే
లుకు బిడ్డఁ । గలుగఁ బోదు ?
త్ర హీనుని వద్ద । ధనముండి నట్లురా ! ॥వి॥ 3456
పల్లంబు లేరని గుళ్ళలోకి వెళితే పిల్లలు గలుగుతారా !

ఆ. బిడియ మింతలేక । పెద్దను నేనంచు
పొంకములను బలుకు । సంకరునికి
ఎచ్చు కలుగ దీడఁ । జచ్చిన రాదాడ ॥వి॥ 3457
జాతి సంకరులకు ఖ్యాతి వచ్చుటెట్లు ?

ఆ. బిసుగును యరచేత । బిగఁబట్టి యందులో
కల్మషంబు నెల్ల । కడను దీసి
కడమ కరముచేత । కలియుగమును బ్రోచు
కర్మ కర్త నెఱుఁగు । గదర ! వేమ ! 3458
“ మత్స్య, కూర్మ, వరాహశ్చ, నారసింహశ్చ, వామనః
రామోరాము రామశ్చ బౌద్ధ రే కల్కి రేవచ ”
కడపటి కల్క్యవతారము.

ఆ. బీరువోవు కులము । బిసను మ్రింగుకులము
ఎల్లజీవు లనుభ । వించు కులము
ఇట్టికులము వార । లిహపరంబుల యందు
బట్టు గలుగు వారు । పరగ వేమ. 3459
వంశ ప్రతిష్ఠను నిల్పినవాడే వరపుత్రుఁడు

ఆ. బుద్ధి యుతునికేల ? బొసఁగని సఖ్యంబు
కార్యవాదికేలఁ ? । గడు చలంబు
కుతితునకు నేల ? । గురుదేవ తాభక్తి ॥వి॥ 3460
కుతితుఁడు = చెడ్డవాడు; పనికిరానివాళ్ళకు ప్రతిజ్ఞ లెందుకు ?

ఆ. బూటకంబుఁ జేసి । బొందిన దిక చాలు
బొంకు బొంకుట కన్నఁ । బొడవఁ బోయి
వ్యాఘ్రంబు చేఁజిక్కి । వణకి చచ్చిన భటుఁడు ॥వి॥ 3461
పూర్వము జరిగిన గాథేమో !

క౦. బూటకపుఁ బూర్వ కథలకు
వాటము గాదయ్య పరము । వరియించెదునా
కూటముఁ జేరక పూర్ణము
సాటింపగ నెవరి వశము । సత్యము వేమా! 346
కట్టు కథలు తెలిసి మిట్టిపడక గట్టిమార్గము చేపట్టుము.

ఆ. బూటకంబు చేత । పుడమిలో నొక కొన్ని
నాటకంబులాడి । నయముఁ జూపి
దీటు లేక తాము । తిరుగుచు నుందురు ॥వి॥ 346
బూటకపు నాటకాలాడే వాళ్ళకు బుద్ధి చెప్పేడు.

క౦. బూటకమీ బ్రదుకును గన
నాటకమగు లోకమునను । నైజముఁజూడన్
వాటపడు గురుముఖంబున
దీటుగఁ బరిపూర్ణమందుఁ । దెగఁబడు వేమా! 3464
గురుముఖముగా గుర్తు తెలిసికొని గుణవంతుఁడవు గమ్మన్నాడు.

తే. బూటకము పుట్టి చచ్చుట । భూమి యందు
నాటకంబగు బ్రదుకుల । నాణెములును
చోటు గుర్తింప గుటిఁజేరి । చూడవలెను
మాటువిడరా పర తత్వ । మందు వేమ. 3465
జనన మరణాలు సహజములు.

ఆ. బూతి దేహమందు । పూసితే నాయెనా
నిష్ఠ శివుని యందె । నిలుప వలయు
భస్మమందు గాడ్ది । బడి పొర్లదా జూడ ॥వి॥ 3466
విశ్వేశు నర్చించని విభూతి పూత లేల ?

ఆ. బూతులేని లంజ । భూతంబు కూతురు
ప్రీతిలేని పాటు । చేత చేటు
దాత లేనియూరు । దయ్యాల పేటరా! ॥వి॥ 3467
చదివేవారిని వినేవారిని సరసోక్తులచే ఆనంద సాగరములో తేల
జేయగల శక్తి వేమనకే గలదు.

త లెన్న । భుజముల పొంకాలు
లింగములును । వరుస మతము
డ దగుగాక । యక్కడఁ దగునెట్లు ॥వి॥ 3468

బూటకపు వేషాలు భూప్రజలకే.

తే. బెదరించి సంతలో । చెదరిన కళలతో
ఆధారమున నిల్పి । ఆడుచుంది
మహిని దానిపేరు । మాముక్తి కాంతరా! ॥వి॥ 3469

ముక్తి కాంత కళావిరాజ మానమైనది

ఆ. బేసికంటి వానిఁ । బెంపార మదిఁజేర్చి
పూజ చేయవలెను । బుద్ధి నిలిపి
ఆత్మపూజకంటె । నదనంబు లేదయా ॥వి॥ 3470

బేసికంటి = ఈశ్వరుఁడు; ఈశ్వరుని పూజచేయలేని యీ తనువేల?

క. బైలందె పుట్టు సర్వము
బైలందే లీనమయ్యె । బ్రహ్మాండంబుల్
బైలున బంధము వుడిపిన
కైలాసముఁ బాసి ముక్తిఁ । గలుగుర వేమా! 3471

బంధ విముక్తునకు బయలే ఆధారము

క. బైలున బంధము కలుగక
ప్రాలెను పరమాత్మునకును । వాంఛిత మొప్పన్
బైలున బంధము గలిపినఁ
గైలాసము ఁజేరి ముక్తిఁ । గాంచుర వేమా! 3472

బంధ విముక్తునికే కైవల్య ప్రాప్తి

క. బైలున బంధము పుట్టెను
బైలున బంధమ్ము గలిసెఁ । బరికింపంగా
బైలున బంధము గలిసినఁ
గైలాసముఁ బాసి ముక్తిఁ । గాంతుర వేమా! 3473

బయలు నందే పరమాత్మ గోచరమగును.

బైలున బంధము పుట్టెను
బైలున బంధంబుఁ గలిసెఁ । బరికింపంగా
బైలున బంధముఁ గలిసిన
బైలందే ముక్తి బట్ట బయలురా వేమా! 3474

బయలులోనే బంధము లీనమగును.

బైలు బ్రహ్మమనుచు । భాషింపు చుందురు
బైలుఁ జూడ తాను । బ్రహ్మ మగును
బ్రహ్మమైన బయలు ! భావమందుంచురా! ॥వి॥ 3475

బ్రహ్మమైన బయలు లోనే భావాన్ని చూడమన్నాడు.

బైలు బైలు గాను । పరికింపఁ జాలక
బైలులోని వారు । బయటఁ బడిరి
బైలులోని చాలఁ । బరికింప తత్త్వమా ॥వి॥ 3476

బయలును పరికించిన వానికి పరమాత్మ సాక్షాత్కరించును.

బైలురూపు రూపు । బైలునుగాఁ జేసి
బైలు రూపు బట్ట । బయలుఁ జేసి
బైలులోని బయలు । భావింపఁ దత్త్వంబు ॥వి॥ 3477

తానే బ్రహ్మ మయిన బయలుతో ప్రయోజన మేమి ?

బైలు రూపుతనకు । బయలుగాఁ జేసియు
బైలురూపు నంటి । భ్రమయ కుండి
బైలులోని బయలు । భావింపఁ బరమాత్మ ॥వి॥ 3478

బ్రహ్మ స్వరూపమగు బయలును తెలియుట తత్త్వము.

బైలులోని బయలు । భావింప నేరక
బైలు రూపుఁ జూచి । భ్రమయనేల ?
మురికియందు మదిని । మోహంబు విడడాయె ॥వి॥ 3479

మోహముతో చచ్చిన వానికి ముక్తినిచ్చు బయ లెందుకు ?

బొంది నమ్మి మిగులఁ । బోషించి పలుమాఱు
ప్రాణివిడుచు వెల్ల । పాతకంబె
తనదు లోన భక్తి । తనరుటే మోక్షంబు ॥వి॥ 3480

మానసికమైన భక్తి మానవున కావశ్యకమే.

ఆ. బొంది యెవరి సొమ్ము? । పోషింపఁ బలుమాఱు
ప్రాణ మెవరిసొమ్ము? । భక్తి సేయ
ధనమ దెవరి సొమ్ము? । ధర్మంబు చేయగా ॥వి॥ 3481

"అన్నీ నావని" అనుకొనుట అవివేకము.

ఆ. బొంది వేఱుకాని । భువి ప్రాణ మొక్కటి
అన్నము లిల వేఱె । యాఁక లొకటి
పుష్పము లిక వేఱు । పూజ యొక్కటిసుమ్ము ॥వి॥ 3482

స్వరూపములు వేరైననూ జాడలన్ని యొక్కటే

ఆ. బొందివేఱు నిజము । భువి ప్రాణమొక్కటే
అన్నములును వేఱె । యాఁక లొకటె
దర్శనంబు వేఱు । దైవంబదొక్కటే ॥వి॥ 3483

"దహ్యా దేహః శీర్యతే శరీరః
కాల్చ బడునది దేహము, నశించిపోవునది శరీరము.

ఆ. బొచ్చునగ్నియు గాల్వ । బొగ్గులు కాఁబోదు
ఎన్నినీళ్ళ దరువ । వెన్న రాదు
ఉప్పు కలపిన పప్పు । ఉడకనే రాదురా! ॥వి॥ 3484

లోకజ్ఞానం ఆకళింపు జేసుకొన్నవాడే వేమన

ఆ. బొట్టు గట్టిన మగఁడు । కొట్టి నంతలోనె
దిట్టసాగెను పాడ । గట్ట యనుచు
జార పురుషుఁడుఁ గొట్ట । యూరక యుండురా! ॥వి॥ 3485

"ఇంటిమొగనికి ఈతకల్లు రంకు మగనికి తాటికల్లు
మధ్య మధ్యను తిరుగువానికి లంకలో కొయిదాడికల్లూ॥ ధూళి ధూళి॥"

ఆ. బొమల నడుమ గుఱ్ఱు । పొందింపఁ జాలక
విమల దృష్టి మదిని । వెలుగఁ బోదు
తమము దీఱినంతఁ । దత్త్వంబు తానగు ॥వి॥ 3486

బొమల మధ్యను విమలంగా జూడ మన్నాడు

ఆ. బొమ్మ లాట వాఁడు । బొమ్మల నాడించు
భువిని జనులు సూడఁ । బొలుపు మీఱ
తా నుఱిగియుండి । దైవ మాట్లాడించు ॥వి॥ 3487
సోధించిఁ జూచిన వేధయే అన్నిట కర్త.

ఆ. బొల్లిమాట లాడు వాఁడు । భోగము సానితో
డొల్లి దుల్ల నిల్లు । గుల్లఁజేసి
యెల్లి రమ్మటంచు । నీడ్చురా బయటికి ॥వి॥ 3488
సాని సంపర్కమును గోరే చవటలకు చక్కని హెచ్చరిక జేశాడు.

ఆ. బోటి యొకతె బ్రహ్మ । నోఁటిమీఁదనె తన్నె
బొమ్మ యొకతె విష్ణు । రొమ్ముఁ దన్నె
సఖియ యొకతె శివుని । సగముగా జేసెను ॥వి॥ 3489
ఆడవారి మహిమలు అంతాయింతని చెప్పక త్రిదేవులను తీర్చిదిద్దాడు

ఆ. బోడితలల జడల । బూడిదె పూతల
భాషణాసనముల । వేషములను
యోగు లైరె? లోన । బాగు గాకుండిన! ॥వి॥ 3490
"పైనపటారం లోన లొటారము"

ఆ. బోడితలల మీఁద । బూడిదె పూతలు
నాసనముల వేష । మమరఁ దాల్చ
జోగి జంగమగుట । బాగుగా దదిచూడ ॥వి॥ 3491
దొంగ వేషాలు వేయు జోగి జంగమెట్లగును?

ఆ. బోడితలల వెల్ల । బూడిద పూతలు
నాసనముల మారు । తాసనముల
యోగిగాఁడు లోను । బాగు గాకుండిన ॥వి॥ 3492
ఆసనాలు, వేషాలు అనవసరములు.

ఆ. బోనులోని యెలుక । పోఁజూచు నట్టులు
జ్ఞానమంద నెలుక । చనును మీఁదఁ
గాన మేను మఱచి । ఘన తత్వమందరా ॥వి॥ 349[illegible]
శరీరాన్ని మరచి సద్గతులు సాధించమన్నాడు.

ఏ పాప బొమ్మ । బొంకుల కుంచము
ఏరెలేని లంజె । చిక్కుబంతి
చేరి దీని మహిమ । చెప్పనేరి వశంబు ॥వి॥ 3494
విచిత్ర విడికథ, అంతరార్థము వేదాంతమే.

ఆ. బౌద్ధమతము వారు । బుద్ధి దైవంబని
యెచ్చు దక్కువాడఁ । దుచ్చ మతిని
గాడిదెల గుమియటు । గ్రక్కునఁ బడుదురు ॥వి॥ 3495
బౌద్ధుల సుద్దులను నిబద్ధంగా జెప్పేడు.

క. భక్తికి మూలము జ్ఞానము
రక్తిగ గురు చెంతఁజేరి । రక్కొని నంతన్
యుక్తిగ నెఱుకై తోచునా
ముక్తికి నిలయమగు దారి । మునుకొని వేమా ! 3496
భక్తికి జ్ఞానమే మూలము.

ఆ. భక్తిగలుగు లంజె । పలుమారు పిలిచిన
బత్తిగాదు లయపు । మిత్తి గాని
మిత్తి చొరఁగ నిల్లు । మ్రింగక పోవునా ? ॥వి॥ 3497
మోహినీ గృహములో చొచ్చుట మృత్యుగేహమున జొచ్చుటే.

ఆ. భక్తిఁదగుల ముక్తిఁ । బడయుట సులభంబు
యుక్తి చెదరె నేని । నూహఁ జెరుచు
శక్తి కొలది భక్తి । సాధింపఁ బరమబ్బు ॥వి॥ 3498
భక్తి, యుక్తి, శక్తులను బూనుటయే పరమ పదము.

ఆ. భక్తినామము వేఱె । భక్తెల్ల ఒక్కటే
శైవనామము వేఱె । శైవమొకటే
వేద శాస్త్రము వేఱె । వేదంబులొక్కటే ॥వి॥ 3499
మానవ కల్పితముల వల్ల మార్పులేగాని సముని దృష్టి సమానమే.

ఆ. భక్తి ముక్తి గలుగు । భాగ్యంబుఁ గలుగును
చిత్తమెఱుఁగు పడఁతి । చెంతఁ బతికిఁ
జిత్త మెరుఁగని సతిఁ । జేరంగ రాదయా ! ॥వి॥ 3500
భర్త యొక్క చిత్తా న్ననుసరించి భార్య వర్తించాలి. ఆమెయే పతివ్రత.

ఆ. భక్తి యున్న చోటఁ । బరమేశ్వరుం డుండు
భక్తిలేని చోటఁ । బాపముండు
భక్తిగలుగు వాఁడు । పరమాత్మ తానయా ! ॥వి॥ 3501
భక్తి గలుగువాడే బ్రహ్మవేత్త.

ఆ. భగము గోరువారె । పలువురు గాన్పింత్రు
భగముఁ గోరకున్కి । జగతి లేదు
భగము గల్గువాఁడు । పరమాత్మ తానయా ! ॥వి॥ 3502
భగము = సృష్టికి హేతుభూతమైనది.

కం. భగవంతుఁడైన దేవుఁడు
జగములఁ దనలోనఁ బెంచి । జాలము జూపుం
దగురీతిని దా నన్నిఁట
నగణితుఁడై వెలయుచుండు । ననువుగ వేమా ! 3503
భగవంతుఁడు ప్రకృతిని పుట్టించి పెంచి లయింపజేసేవాడు.

కం. భగవంతుని ప్రతి బింబం
బగు నీశుండొరసి మాఱు । నగు లోకమునం
దగ భోజ్యము నగు జీవుం
డాగి భోక్తయు విద్యఁ గూడి । యొప్పుఁగ వేమా ! 3504
ఆదిశక్తికి ప్రతినిధిగా శివుఁడు సకలబలమునకు కర్తయ్యాడు.

ఆ. భద్రమైన మనసు । బలపడి నంతట
వద్దఁదగును పరము । వశము గాను
నిద్రలోని నిద్ర । నిలుపు కొనుచుఁ జూడు ॥వి॥ 3505
నిద్రలోని నిద్ర జూచినవాడే నిపుణుడు.

కం. భయ, కామాదులు, సిగ్గును
జయ మారకు భూతమందు । జను భూతములై
నయమున నాభియుఁ । గంఠ హృ
దయ మూర్ధములుండఁ । దవిలి తథ్యము వేమా ! 3506

నానాగుణము నానా అంగములలో నుండును.

కం. భయమంతయు దేహమునకె
భయ ముడిగిన నిశ్చయంబు । పరమాత్మునిదే !
లయమంతయు జీవికిఁగద
జయ మగునని లోకమందుఁ । జాటర వేమ. 3507

నిర్భయమున నిర్భయానందుఁడ వగుదువు.

కం. భయము సుమీ యజ్ఞానము
భయముడిగిన నిశ్చయంబు । పరమార్థంబౌ
లయము సుమీ యీ దేహము
జయము సుమీ జీవుఁడనుచు । జాటర వేమా ! 3508

భయము అజ్ఞానము; నిర్భయమే పరమార్థము.

కం. భయమెంతటి యజ్ఞానమొ
భయముడిగిన యట్టి తెలివి । పరమార్థమౌ
లయమగును సుమ్మి దేహము
జయమగు జీవంబున కని । చాటర వేమా ! 3509

భయ ముడిగినవాడు ప్రాజ్ఞుఁడు.

కం. భయమేమి లేదు మదిలో
జయపథమగు పూర్ణమందుఁ । జంద్రిక వెలియౌ
బయలంది పొంది నిండిన
నయనంబగు నాత్మపదవి । యందును వేమా ! 3510

పూర్ణమునంది పొందుటయే బ్రహ్మానందం.

కం. భల్లుకములట్లు ప్రాజ్ఞులె
యిల్లోకములందు గురుని । నెఱుఁగరు ; తమలో

ముల్లోకము లెఱిఁగినటుల
గొల్లునఁ బొగడుకొను చుండ్రు । గొనకొని వేమా! 3511

భల్లూకము = ఎలుఁగుఁగొడ్డు; ప్రాజ్ఞులగువారుఁ గూడా ఆత్మస్తుతి పరనిందలకుఁ బాల్పడుదురు.

కం. భవదూరుఁడు శరభాంకుఁడు
శివశీలుఁడు వేయుఁగోటి । సిద్ధేశ్వరుఁడున్
శివ భృత్యుఁడు వట మూలుఁడు
శివమయ చిన్మయుఁడు సోమ । శేఖరగురుఁడున్ ॥వి॥ 3512

సోమశేఖరుఁడు బమ్మెరపోతరాజుగారికి మన వేమనకు పేరుఁజెప్పిన గురువు.

ఆ. భవము సాగరంబు । భార్యయా మకరము
చేపఁ జెలగలగును । శిశువు లెల్ల
భవహరుని దలపక । పారమందఁ లేఁడు ॥వి॥ 3513

సంసార సంద్రముగురించి చక్కగా చెప్పెడు.

ఆ. భవము పూర్వకర్మ । ఫలము లనుభవింపఁ
గలిగెననుచు మదిని । గట్టి పఱచి
కష్టసుఖములేవి । కలిగినఁ దలఁపకు ॥వి॥ 3514

కష్టసుఖములకు కారణము పుట్టుకయే.

ఆ. భవుఁడు గుఱ్ఱమాయె । బ్రహ్మ పల్లంబాయె
కల్ల దేహమాయెఁ । గ్రమము తోడ
నందుమీఁది దెఱుగ । నాడుదో మగవాఁడో ॥వి॥ 3515

విచిత్ర విడికథగా ఆదిశక్తిని గూర్చి చెప్పెను.

ఆ. భవుఁడు చిత్రముగను । భార్యాల మోయును
అట్టు మోయఁగలుగు । దిట్ట యైన
అతని వలెనె బూది । యలఁదిన మేఱుఁగది ॥వి॥ 3516

అర్ధనారీశ్వరుని సిద్ధాంతాన్ని జెప్పెడు.

గీ. భస్మధారిఁ జూడ । పాపమందురు జనుల్
నామధారిఁ జూడ । నయ మటంౘ్రడు
భస్మ నామములకు । పరమాత్మ యెవ్వఁడు ॥వి॥ 3517

వైష్ణవులు శైవులను నిందిస్తారు. అది కూడదు.

ఆ. భస్మదూషకులట । భస్మంబు పాలైరి
మంటి దూషకులును । మంటి పాలు
దూషణ ఫలమెల్లఁ । దోడనే చూపెరా ॥వి॥ 3518

మంటి = నామము; భస్మ దూషకులు మంటి దూషకులు అనగా శైవులు, వైష్ణవులు పరస్పర దూషణములు చేసికొందురు.

ఆ. భాగవతుల మనుచుఁ । బరగంగ నెవ్వరు
వారి నెరుగలేక । వరుస తోడ
ఆడి పాడు వార । లరయ భాగవతుల ॥వి॥ 3519

భగవధ్యానము చేసినవారే భాగవతులు.

ఆ. భాగ్యవంతురాలు । పరుల యాకలి దప్పిఁ
దెలిసి పెట్ట నేర్చుఁ । దీర్ప నేర్చుఁ
దనదు దుష్ట భార్య । తన యాకలినె కాని
పరుల యాకలెఱుగ । దరయ వేమ. 3520

ఉత్తమ స్త్రీ లక్షణాలను చిత్తమునకు హత్తేలాగు చెప్పెడు.

ఆ. భాగ్యహీనునకును । బరసువేది దొరక
నదియు నిల్వదపుడె । వదలుఁ గాక
వానతోడ వచ్చు । వడగండ్లు నిల్చునా ॥వి॥ ? 3521

పరుసవేది = ఇనుమును బంగారు చేయు ద్రవ్యము; అమూల్యమైన ఉపమానము వాడేడు మనయోగి.

ఆ. భాను, సోమ, వహ్ని । భవ్యలోచను మదిఁ
దలఁపకున్న ఫలము । గలుగఁ బోదు
ఇహ పరములకును మ । హేశ్వరుఁ డతఁడొట ॥వి॥ 3522

భాను = సూర్యుడు; సోమ = చంద్రుఁడు; వహ్ని = అగ్ని; మూడు నేత్రములవాడీశుడు.

ఆ. భారతమునఁ బలుకు । పలుధర్మముల యందు
సత్య నిష్ట మేటి । సత్యమె కద
వసుధ దాన గలుగు । వన్నియ మిన్నరా ॥వి॥ 3523

"సత్యాలాపి యొకండె నిత్యుఁడు ప్రపంచస్థాయి సత్యంబగున్"
(హరిశ్చంద్ర)

ఆ. భారతమునఁ బలుకు । పలుజాతి విప్రులు
కొత్త కురియలేని । కూడ జాతి
గోరి పబాఁడోనె ? । గోసంగి యల్లుడు ॥వి॥ 3524

గోసంగి = మాతంగీ కులస్థుల యాచించేవాడు. మతంగ మహర్షి కూతు రరుంధతిని వశిష్ఠుఁడు వివాహమాడెను. భారతము పంచమవేదము.

తే. భార్యయె తనయొడలి । పాలిటి సంకిళ్లు
చిన్న బిడ్డలెల్ల । చీలలగును
సంసృతి యనెడి చెఱసాల । కొట్టము సుమ్మి ॥వి॥ 3525

సంసారము చెరసాల.

ఆ. భార్య తనదుపాలి । భారపు సంకెళ్లు
చిన్నచిన్న శిశువులు । జింజిరీలు
అరయగఁ జెరసాల । యగును సంసారము ॥వి॥ 3526

సంసారమును కారాగారముగా వర్ణించెను.

ఆ. భార్య మీఁదనాశ । పరగుఁ బురుషునకు
మగని మీఁద నాశ । మగువ కుండు
శివుని మీఁద నాశ । సిద్ధున కుండురా ! ॥వి॥ 3527

భార్యాభర్తల అన్యోన్యప్రేమ వాకొన్నాడు.

తే. భావనముఁ దలంప । బ్రహ్మరంధ్రము లోన
కర్తయగుచు నిలుచు । కర్తయొకఁడు
సేవసేయ నిచ్చు । శివుఁడు ముక్తియు భుక్తి ॥వి॥ 3528

భావములో శివుని నమ్మిన భుక్తి ముక్తియు గలుఁగును.

తే. భావ మమరెడు పూర్ణమా । ప్రజ్ఞఁబూని
నిర్వికారుఁడవై యుండు । నిత్య ముగను

బడయు మెప్పుడు భావము । పట్టు విడక
సుకర పదవికి మార్గద । ర్శకము వేమ. 3529
భావాల్ని ప్రశంసించాడు

ఆ. భావమనగ వేరె । పర దేశమున లేదు
వారుఁ జేయు పనుల । వరలి యుండు
భావమందు శివుని । భావించి యుండుము ॥వి॥ 3530
శివుని బంధించుటకు భావమే ప్రధానము.

ఆ. భావ మరయ వేఱె । పర దేశమున లేదు
తానుఁజేయు పనులఁ । దగిలియుండు
భావమందు శివునిఁ । బరికింపు చుండిన
పాప భయములేక । పరగు వేమ. 3531
పాప భయములు పరమేశ్వరు సేవవలన పోవును.

ఆ. భావ మరసి తన్ను । భార్య సేవించిన
నింటికైన నగును । నీశ్వరుండు
అదియులేక బ్రదుకు । టధమము భువిలోన ॥వి॥ 3532
భార్యమీద ప్రేమ గలుగుట భర్తకు ప్రధానము.

కం. భావాభావములంటక
సేవించెడు బట్టబయలు । స్థిరమతి లోనం
గేవలము శివధ్యానము
తావరమును గన్న వాఁడె । ధన్యుఁడు వేమా ! 3533
శివధ్యానమే ఫలము శ్రేష్ఠమగును.

కం. భావించి చూచు చుండిన
నీవంతట నిండియున్న । నిలుకడలోనే
యావింత జగముఁదోచును
రావంబు గణించి మించి । రాజిలు వేమా ! 3534
బ్రహ్మజ్ఞానముతో నీవు పరికించిన బ్రహ్మ వవుతావు.

క. భావింప లింగముండఁగ
భావింపఁగ లోకమందు । బ్రహ్మంబునుగాఁ

గావించు విధముఁ దెలియక
యీవిధమున నరులుచెడుదు । రిలలో వేమా! 3535

భావ నిర్మలతో శివుని పూజింపనిచో భ్రష్టులగుదురు

ఆ. భాషలాడకున్నఁ । బరులు మెచ్చరు గాన
భాషలాడవలయు । పరువుఁ జూచి
భాష పరువు తెరగు । పరమాత్ముఁ డెఱుఁగురా! ॥వి॥ 3536

భాష = మాట్లాడుట; సమయానుకూల వచన రచన చేసినవాడే చతురుడు.

ఆ. భాషలాడ నేర్చి । పరగ ప్రియముఁబల్కి
గ్రాస వాసములకు । గడనఁ జేసి
వాసనఁ దెలిసినను వాఁడెపో ముక్తుండు ॥వి॥ 3537

దేహవాసన దెలిసినవాడే దివ్యుడు

ఆ. భాషలాడ నేర్చి । పలుమోసములు చేసి
గ్రాసమునకు వేష । గాఁడ నయితి
దోసకారుల కిల । దొరకునా మోక్షంబు ॥వి॥ 3538

దోసకారులు తన్నుకు చచ్చినా మోక్షము లేదు.

తే. భాషలెన్నఁటిలోనైన । భావమొకటె
వేషములలోనఁ జిక్కని । విధ మెఱుంగు
పోషకుండని తలఁచుట । పొందుగాదు
దోషమున్న నెఱుంగుము । తొలుత వేమ. 3539

పోషించినవానికైనా తప్పును కప్పగూడదు.

తే. భాసురంబైన ప్రజ్ఞాన । భావమందు
మరిగియుండుము నిత్యమా । మార్గమదియె
సత్యమానంద పరిపూర్ణ । ప్రత్యగాత్మ
నిర్గుణ బ్రహ్మ వేత్తవై । నెగడు వేమ. 3540

బ్రహ్మవేత్తవు గావాలంటే నిర్గుణు నారాధింపుము.

ఆ. భ్రాంతి చేతను మర్త్యులు । భక్తి విడువ
భయదమౌ పుట్టు చావులు । ప్రాప్తమయ్యె

నిట్టి పరులకు కష్టంబు । లెట్లు తీరు
గురుని సన్నిధి తీర్చునా । కొఱతవేమ ! 3541
అజ్ఞాన సందేహాన్ని అసలు గురువు గూడా తీర్చలేడు.

ఆ. భిక్షమెత్తగ వచ్చి । భిక్షుకానిని పిలిచి
భిక్ష పెట్టినవాఁడె । మోక్ష వరుఁడు
వాఁడి పొట్టకు తింటె । వాఁడెల్ల భక్తుండు ॥వి॥ 3542
భిక్ష = అన్నము పెట్టుట; ఆకొన్న వారి కన్నమిడినవాడు అభివంద నీయుఁడు.

కం. భుక్తికి మిక్కిలి విషయా
సక్తత తాఁ దిరుగుచుండు । సత్రములందున్
భుక్తిని ముక్తి లభింపదు
భక్తినె జీవునకు ముక్తి । భద్రము వేమా ! 3543
భుక్తి వలన గాక భక్త్యాసక్తులవలన ముక్తి లభించును.

కం. భువనాకారుని మదిలోఁ
బ్రవిమల శుభమూర్తిగాను । బరికించినచో
భవనాశమగును బూర్ణుఁడు
శివదేవుఁడు చిన్మయుండు । స్థిరుడగు వేమా ! 3544
చిన్మయబ్రహ్మమే స్థిరమైనవాడు.

తే. భువికి సూత్రమందు । పరగలింగము గట్టి
భవిని గాల్చి భూతిఁ । బరగఁబెట్టి
భవుని శివునిగాను । భావింప నెరుగుఁడీ ॥వి॥ 3545
* యతి తప్పు; భవుని రూపము తెలిసి శివుని చిత్తమందు నిల్పుము.

కం. భువి నరకులమునఁ బుట్టియు
భువి నరకులముననుఁ బెరిగి । భువి నరకులమున్
సవిరళము ఛీ ఛీ యని
శివకులమునఁ దిరుగునతఁడె । సిద్ధుఁడు వేమా ! 3546
శైవాన్ని ఘనము గా చెప్పెను.

క. భువి నొకకులమునఁ బుట్టియు
భువి సురకులముననుఁ జెరిగి । భువి సురకులమం-
ద విరళముగ ఛీఛీయని
శివకులమున దిరుగువాఁడు । సిద్ధుఁడు వేమా ! 3547

దేవతలకన్నా శైవులు శ్రేష్ఠులన్నాడు.

క. భువి రాజతారకంబులు
ప్రవిమలతర హంసయోగ । భావంబులకున్
వివరంబులు గావించెద
శివయోగ మహత్వ మిదియె । సిద్ధము వేమా ! 3548

శివయోగము రాజ సాంఖ్య యోగములు తెలిసినవారికే తెలియు.

క. భువి రాజయోగ ముఖ్య
ప్రవిమలతర సాంఖ్యయోగ । భావజ్ఞులకున్
వివరంబులుగా దెలియును
శివయోగ మహత్త్వ మెల్ల । సిద్ధము వేమా ! 3549

రాజ సాంఖ్యయోగములు తెలిసినవారే శివయోగులు.

క. భూ గగనంబుల లోపల
దాగిన చందంబుగాను । తగులుకొని తగు
న్యోగమె మదిలోఁ గాంచిన
నీగక తా నిండియుండు । నెన్నిక వేమా ! 3550

బ్రహ్మాండ మంతయు నిండిన బ్రహ్మమును జూడుము

క. భూతలంబున నైదిఁట ని
ర్ణీతంబగు సురలయందు । రీ వెల్గినులం
దాతతమగు లోకంబుల
నూతంబగు ప్రకృతిబ్రహ్మ । నూచ్యము వేమా ! 3551

పంచభూతముల, సూర్య, చంద్రాగ్నులలో పరబ్రహ్మ ప్రకాశించు చున్నాడు.

క. భూతలమున పైఁగనుమిఁక
ఖ్యాతిగ నొక మూలశక్తి । కంధరమందున్

జ్యోతికి లో వెలి తానై
సూత్రించును జగములెల్ల । సూటిగ వేమా ! 3552

పరంజ్యోతి ప్రపంచమందంతటను వ్యాపించి యున్నది.

క. భూతము లైదుండగనే
ఖ్యాతిగఁ దానొక్క దేహి । కలిగిన భువిలో
లోపైన తత్త్వమెఱుఁగక
నూతను బడుచుందురపుడు । నోమక వేమా ! 3553

అంతరార్థమును తెలియక అంధకారకూపములలో అణగియుందురు.

ఆ. భూతి దేహమందు । బూసిన నయ్యేనే ?
నిష్ట శివునియందు । నిలుప వలయుఁ
గాక భస్మమందు । గాడిదె పొర్లదా ? ॥వి॥ 3554

శివనిష్ఠలేని భస్మధారులు ఖరములతో సమానము.

ఆ. భూతి పూజలెన్న । భుజముల పోకలు
వ్రాలు లింగములును । వరుస మతము
లెక్కడిఁ దగుఁగాక । యెక్కడఁ దగదెట్లు ? ॥వి 3555

వీర శైవవేషములు యీసడించెను.

ఆ. భూతి పూసి నీవు । ప్రాత భూతంబుల
వెడల గొట్టఁ బోవ । వెఱ్ఱి వనుచు
నిన్నె కాంచి భీతి । నిలువక పారదో ! ॥వి॥ 3556

దయ్యాల దేవరలను తన్నెను.

ఆ. భూతిలేని లంజె । భూతంబు కూతురు
రీతి లేనిపోటు । రాతి చేటు
దాతలేనియూరు । దయ్యాల కొంపరా ! ॥వి॥ 3557

కవన చాతురి కమ్మగానే యుంది.

క. భూదేవి యనఁగ మృత్తిక
భూదేవత పుట్టువిధము । భూజన మెఱుఁగున్
భూదేవి భారమందిన
నాదేవత కాదరువెవ । రందురు వేమా ! 3558

ప్రాణికోట్లకు భూదేవి ఆధారము. ఆమెకు ఆదిశక్తి ఆధారము.

క. భూదేవి యనఁగ మృత్తే
భూదేవతలైన వరుసఁ । బుట్టిన వెన్నో
యీదేవతలకె తెలిసెడి
నాదిని నే నరుల నెఱుఁగ । రందురు వేమా! 3559

భూమి యుత్పత్తి ఎట్లు జరిగినదో ఎవరికి తెలుసు?

ఆ. భూపతి కృపనమ్మి । భూమిఁ జెఱుచువాఁడు
ప్రజల యుసురు దాకి । పడును బిదప
నెగురవేయు బంతి । యెందాక నిల్చురా! ॥వి॥ 3560

చక్కని నీతులతో జాలువారుతుందీ పద్యము.

ఆ. భూమి నాదియన్న । భూమి పకున నవ్వు
దానహీనుఁ జూచి । ధనము నవ్వు
కదనభీతుఁ జూచి । కాలుండు నవ్వురా! ॥వి॥ 3561

ఎత్తు కెత్తు రత్నాల విలువజేసే పద్యమిది.

ఆ. భూమిపేరు వల్ల । పుణ్యస్థలంబాయె
వెలయ రాళ్ళవల్ల । వేల్పులాయె
నీళ్ళపేరువల్ల । నిఖిల తీర్థము లాయె ॥వి॥ 3562

పుణ్యక్షేత్ర, విగ్రహారాధన, నిధి మహాత్వ్యములు మంటిలో గలిపా
డీపద్యములో వేమన.

ఆఁ భూమి మీఁదఁ బుణ్య । పురుషులు లేకున్న
జగము లేల వెలుఁగు? । బగలు రాత్రి
అంత బయలు గాదె । యాడకాడకుఁ జూడ ॥వి॥ 3563

పుణ్యపురుషుల వలననే భూమి ప్రసిద్ధికెక్కెను.

ఆ. భూమియనగ నేమి? । పుడమి యనఁగ నేమి?
ధరణి యనఁగ నేమి? । పురుషు లార
యిన్ని ఒకటై యుండ । యికమీఁద మతమేల? ॥వి॥ 3564

పర్యాయ పదములతో భావమొక్కటిగా చిత్రించాడు.

ఆ. భూమిలోనఁ బుణ్య । పురుషులు లేకున్న
జగము లేల నిల్చుఁ? । బొగులుఁ గాక
అంత తఱచు దొరక । విడనాడను గాని ॥వి॥ 3565

పొగులు = చెడిపోవు: "నూటికొక పురుషుడు, కోటికొక ఇల్లాలు".

ఆ. భూమిలోనఁ బుట్టు । భూసార మెల్లను
తనువులోనఁ బుట్టుఁ । దత్వమెల్ల
స్వయముగానె పుట్టు । సర్వంబు తనయందు ॥వి॥ 3566

అందమగు పద్యాలకు పొందికైన భావము పొదుగుటలో మొనటి వాడు వేమన.

తే. భూరి నిగమార్థ సారంబు । బొంది పరమ
యోగ పరిపూర్ణ నిష్ఠలో । నుండఁ గోరు
నతని కరచేతి దైయుండు । నాత్మవిద్య
కాక వాదంబు లాడినఁ । గలదె? వేమ. 3567

వాదములాడిన భేదమే గాని వేదవిద్య పొదుకొనదు.

ఆ. భూలోక మాయను । బుద్ధిచే కనిపెట్టి
పరలోకమునఁ జేరు । పరమ యోగి
వాంఛ లుడుగక పోతె । వాఁడెట్లు జేరురా? ॥వి॥ 3568

భ్రమనొను మమకారమును మట్టుపెట్టనిదే బ్రహ్మమును పట్టుట సాధ్యముగాదు.

కం. భృకుటి స్థల మధ్యస్థ
ప్రకట ద్విదళాబ్జ శిఖర । భ్రమ దుద్విద్యు
న్నికట సుదేహ జగత్త్రియ
వికసిత రూప ప్రతాప । వీరుడు వేమా! 3669

గీ॥ నిటల తటమును జూచిన నేర్పుతోడ
భూ నభోంతరాళముల ప్రపూర్ణ మగుచు
వెల్గు నాతని ధ్యానింప వేడ్కఁగలుఁగు"

కం. భ్రూమధ్య దేశమందును
నేమరకయ చూడ నిర్గుణేకమ్మగు నా

నేమము మదిలో నెంచఁగ
సామీప్యానంద మొదవు। సరగున వేమా! 3570
కనుబొమల మధ్య గనుగొనగలిగిన సామీప్యమబ్బును.

ఆ. భేదమైన దానిఁ? నాదిని విడనాడ
మూలవస్తు వెట్టు। కేల బట్టు?
దాని నూన గలుగు। దార్ఢ్యము లేకున్న ॥వి॥ 3571
కేల = చేయి; దార్ఢ్యము = దృఢత్వము; ఆదిశక్తిని హృదయమున పదిల పరుప లేనిచో ఆనందము లేదన్నాడు.

కం. భేదా భేదంబులకును
వాదంబై జగము చూడ। వర్తించెడి నా
భేదా భేదము లుడిగిన
వేదాంత ధ్యాని యగుచు। వెలుగుర వేమా! 3572
భేదములేని ధ్యానపరుఁడే తత్వవేత్త.

తే. భోగ పరవశమా జ్ఞప్తి। పూరితముగ
నిరత మాత్మ చిదానంద। నిలయ మూని
మౌన నిజకేళి గూడుటే। మన్మ యంబు ॥వి॥ 3573
భోగములను త్యాగము చేసిన విరాగియే పూర్ణుఁడు.

తే. భోగ పరవశమా జ్ఞప్తి। పూరితముగ
నిరత మాత్మ చిదానంద। నిలయ మూని
మౌని నిజకేళి గూడుటే। మన్మయంబు
సాధకంబున సమకూఱు। జగతి వేమ. 3574
సాధకము చేత బాధకాలన్నీ పోతాయి

కం. భోగంబుల కాశింపక
రాగద్వేషంబు లుడిగి। రంగుగఁ దనలో
వేగమె మోక్ష పదమ్ము ను
రాఁగను నాతండు యోగి। రాయఁడు వేమా! 3575
రాగద్వేషరహితుఁడే యోగిరాయఁడు.

తే. భోగ భాగ్యాది సుఖముల । బొందవచ్చు
రాగద్వేషమ్యముల నెల్లఁ । దీగెఁ దెంచి
వేగ మదియందు గురుభక్తి । సాగనిమ్ము
యోగి వరులకు దీటుగా । నుండు వేమ. 3576
రాగ ద్వేషాది లతావితానమును ప్రతాళించినవాడే ప్రజ్ఞాశాలి.

ఆ. భోగవాంఛ చేతఁ । బొలుపేదో యెఱుఁగక
ద్రోహ బుద్ధి నొరుల । దూఱుచుండు
సాహసి యగువాఁడు । సర్వదా చెఱుఁగదా !॥వి॥ 3577
నిరంకుశత్వం నిర్మలమును నీరుగా జేయును.

ఆ. భోగి యెన్నటికైన । యోగి కానేరఁడు
యోగి యెన్నటికైన । భోగికాఁడు
మూఢుఁడెన్నటికైన । మోక్షుండు కాఁడయా ! ॥వి॥ 3578
భోగ లాలసుడు యోగీశ్వరు డెట్లగును ?

## మ

ఆ. మంచి గంధము గన । మనసు రంజిల్లును
ఎంతో వాసననుచు । నెన్ను చంద్రు
తామెఱుంగ లేరు । తమ పూర్వవాసన ॥వి॥ 3579
గంధపు వాసన జూచి కుతూహలముపడతారు గాని పూర్వవాసన బుద్ధికి రానివ్వరు.

ఆ. మంచినీరు వోయ । మల్లె పూచునుగాని
ఫలిత మొనరుచెట్టు ? । పనిఁ జొరమిని
వంట చేయకెట్లు ? వంటక మమరురా ? ॥వి॥ 3580
యీపద్యములో రెండవ పాదము వేమనగారిది కాదు. కుకవు లెవరో కూర్చారు.

ఆ. మంచినీళ్ళ బావి । మనసులో నుండంగ
ఉప్పు నీళ్ళనుఁ ద్రాగు । దెప్పరీడు
కసవున్న చోటెఱిఁగి । పసరంబు మేసురా ! ॥వి॥ 3581
దెప్పరీడు = ఓగు, చెడ్డవాడు ; ఆత్మామృతమును విడచి అన్యత్రా ప్రయత్నము చేయువారు అసమర్థులు.

ఆ. మంచి మాట చేత । మనసు రంజిల్లును
గొంచె మనుచు నెనరుఁ । గోరఁ బోరు
వంచనోక్తుల నన । వైభవం బందునా! ॥వి॥ 3582
జనరంజక వాక్చాతుర్యము సర్వత్రా పూజనీయము.

ఆ. మంచి రుచులఁ గోరు । మంచిస్త్రీలనుఁ గోరు
మనుజుఁ డెంత చెడ్డ । మనసొఁ జూడ
ఇంచు కంతయైన । నేలని విడువఁడు ॥వి॥ 3583
కూళలకు కోరికలీరిక లెత్తుతుంటాయి.

ఆ. మంచివారు లేరు । మహిమీఁద వెదకినఁ
గష్టులెందరైనఁ । గలరు భువిని
పసిడి లేదు కాని । పద డెంతలేదయా! ॥వి॥ 3584
పదడు=బూడిద, భస్మము; గొప్పవస్తువులు కొద్దిగనే ఉంటాయి.

ఆ. మంచి శకునములనె । యెంచి పెండిలిసేయ
వారలాకరు లేరు । వసుధ లోన
జనుల కర్మములను । శకునముల్ నిల్పునా! ॥వి॥ 3585
"బుద్ధిః కర్మానుసారిణీ" మతివలనే గతి.

ఆ. మంటఁబుట్టు సొమ్ము । మంటిలోపల దాచి
మంటికుండ లోన । మరల వండ
మంటికుండ కింత । మరుగేల వచ్చెరా! ॥వి॥ 3586
శరీరమును కుండతో పోల్చి నిండైన వేదాంత భావాన్ని విశదీకరించాడు,

ఆ. మంట మింటనంది । యున్నవా రందరి
నెన్నగాను దరమె? । యేరికైన
నున్నవారు చావ । నున్నవారేసుమీ! ॥వి॥ 3587
చావు ఎప్పటికైనా తప్పదు.

ఆ. మంట లోహమందు । మ్రాకుల, శిలలందుఁ
బటము గోడలందుఁ । బ్రతిమలందుఁ
దన్నుఁ దెలియు కొఱకుఁ । దగులదా పరమాత్మ? ॥వి॥ 3589
రెండు చరణములు పొడుపుడు కథగా నున్నవి.

ఆ. మంట లోహములను । మ్రాను చీలలయందుఁ
బటము గోడలందుఁ । బరగ నిసుక
బెట్ట నంటునట్లు । పెనగు దేహము జీవి ॥వి॥ 3589

దేహమునకు దేహధారణకు సంబంధము లేదని ఉపమానములు చెప్పెను.

ఆ. మంటికుండ వంటి । మాయ శరీరంబు
చచ్చు నెన్నఁడైనఁ । జావ దాత్మ
ఘటము లెన్నియైన । గగనంబ దేకమే ॥వి॥ 3590

నిర్మలాకసమే నిశ్చలమైనది.

ఆ. మంటితోడ గొన్ని । మ్రానితోడను గొన్ని
రాతితోడఁ గొన్ని । రాగిఁ గొన్ని
ప్రతిమలెన్నొ చేసి । భగవంతుఁ డని మ్రొక్క
ముక్తి యెట్టు లిచ్చు ? । మొనసి వేమ ! 3591

విగ్రహములను చేయు నుడిపదార్థములు ముక్తసరిగా వర్ణించెను.

ఆ. మంటి, మింటి, సంధి । మన్నవా రెందఱో
ఎన్నగాను దరమె ? । యేరికైన
నున్నవారు చావ । నున్నవారే సుమీ ! ॥వి॥ 3592

భూమ్యాకాశములనడుమ నున్న ప్రాణి చావక తప్పదు.

ఆ. మంటిలెల్ల కల్ల । మనసెల్ల దొంగకే !
నేటి ప్రాణమింక ? । నేటి బ్రతుకు ?
మాట సత్యమైతె । మరి శతాయుష్యంబు ॥వి॥ 3593

సత్యం లేనిదే గత్యంతరము లేదు.

ఆ. మంటిలోనఁ బుట్టి । మంటిలోనఁ బెరిగి
మన్నుఁ జూచి నరులు । మగ్నులైరి
మన్ను, మన్నుఁ జేర । మదినిల్పలేరయా ! ॥వి॥ 3594

మానవ శరీరము మన్నే ? దాని నాశించినవాడు మిన్నెట్లగును ?

ఆ. మంటిలోనఁ బుట్టి । మంటిలోనె పెరిగి
మంటిలోనె తిరిగి । మనుజుఁ డాయె
మన్ను మంటిఁ గలుప । మనుజుఁడే తత్వంబు ॥వి॥ 3595
మానవ శరీరము మంటిలోఁగలియునాడు తర్వాత మిగిలేది తత్వమే!

ఆ. మంటిలోనె పుట్టి । మంటిలోనే పెరిగి
మంటి మింటి సందు । మరుగుఁ దెలిసి
మింటిలోన సుఖమె । మితిమీఱఁ గనవలె ॥వి॥ 3596
ఎక్కడ పుట్టి ఎన్ని చేసినా ఆకాశ తత్వాన్ని అదుకొనుటే ఆధిక్యము.

ఆ. మంటిలోనె పుట్టి । మంటిలోనె పెరిగి
మంటివెడలి నతఁడు । మింటి కెగసె
మింటిలోని సుఖము । మంటను లేదురా! ॥వి॥
భూలోక సౌఖ్యముకన్న పరలోక సౌఖ్యమే భక్తులను కోరమన్నాడు.

ఆ. మంటిలో బుట్టిన । మాయ శరీరాన్ని
చక్కదనమున పెంచి । చచ్చి నెనుకవచ్చి
కట్టి బెట్టే వేళ । కాటి కంపుదు రయా! ॥వి॥ 3600
మురికి కొంపకు ముచ్చటెందుకు ?

ఆ. మండలంబుఁ దిన్న । మహిమీఁద జరమూరు
మండలంబు దిన్న । మహిను వెలయు
మండల నవకంబు । మరితిన్న సిద్ధుఁడా ॥వి॥ 3601
మండలము = నలువది రోజులు (వైద్య పరిభాష) మండల నవకమనే మందు సేవించినవారు సిద్ధులు (ఇది వైద్యశాస్త్ర విజ్ఞానము)

ఆ. మండలములు మూడు । మతి చూడఁజూడఁగా
చంద్ర, సూర్య, వహ్నిఁ । జెంది పిదప
దండి వెలుగుగాను । ధరణికి దైవంబు
గానునుండు మిగుల । ఘనత వేమ ! 3602
మండల త్రయములో కుండలిని సాధించమన్నాడు.

తే. మంత్ర తంత్రాది యుక్తులు । మరిగి రావు
వేద విద్యాదిఘనయోగ । విధము గాదు
పాదుఁగని లోన పూర్ణుఁడై । పరిణమించు
సాధువైననె పరమందు । జగతివేమ. 3603

మంత్ర, తంత్ర, యంత్రాది విద్యలు మాయావులకే. పరమును సాధించలేవు.

క. మంత్రము సద్గురు చింతన
మంత్రార్థంబతఁడు సూపు । మన్మయ మగునా
మంత్రాధిక మగు సద్గురు
మంత్రముచేఁ గన్న బయలు । మఱవకు వేమా ! 3603

గురు మంత్రము పరమును దరిజూపును.

ఆ. మంత్రమెల్ల మఱచి । మధురాధరముఁ గోర
నేవిధమున భక్తుఁ । డెఱుగు నిన్ను ?
ఉవిదఁ జూచి పరమ । యోగంబు మఱచురా ! ॥వి॥ 3605

అతివల అధరసుధాపేక్షుడు ఆధికు నెరుఁగఁడు.

ఆ. మంత్ర మొకటిచెప్పి । మఱి దేవతార్చనఁ
జేసి కరుణ తమకుఁ । జెందిన దని
వేదపఠనఁ జేసి । వెఱ్ఱులై చెడుదురు ॥వి॥ 3606

మానశిక శక్తి లేని మంత్రములు మాసిపోవుటకే !

ఆ. మంత్రయోగుల కెల్ల । మనసు దూరము నుండు
రాజయోగుల కెల్ల । రమ్య మగును
తారక యోగుల । తలపదే యుండురా ! ॥వి॥ 3607

తారక యోగులు తత్త్వముతో తన్మయులగుదురు.

ఆ. మంత్ర విద్య లెల్ల । మాయల కొఱకిల
సృష్టియందు బ్రహ్మ । సృష్టిఁ జేసె
మత్తుఁడైన వాఁడు । మది నిల్పలేఁడయా । ॥వి॥ 3608

మదోన్మత్తులకు చిత్తము పరమునందు హత్తుకోనదు.

ఆ. మందబుద్ధియు వల్ల । మనుజ సంఘము లందు
తర్కవాదము లాడి । దారి తప్పి
మాటలాడుట కంటె । మౌనంబు బహుమేలు ॥వి॥ 3609
తర్కవాదము తన్ను భ్రష్టునిజేయును.

క. మందుఁదినఁ బోటు మానును
మందుఁ దినఁగ జేయఁ బొలఁతి । మహిలో వలచున్
మందుఁ దిన గుదురు రోగము
మందుఁదినం గలదు పుష్టి । మహిలో వేమా ! 3610
మందులలో అనేకరకములు గలవు.

క. మందు దినువఱకు పథ్యము
పొందుగఁ జేయంగ వలయు । పుడమి తలమునన్
మందుఁదిని పథ్యముడిగిన
నెందున నావ్యాధి కుదర । దిలపై వేమా ! 3611
పథ్యములేని మందు పనిచేయదని వైద్యానుభవముతో చెప్పెను.

ఆ. మందుఁబెట్టి మగని । మఱపించి విటుఁజేరు
సుందరాంగి పాడు । సుదతిసుమ్ము
పంది బురద మెచ్చుఁ । బన్నీరుమెచ్చునా ! ॥వి॥ 3612
మూడవపాదము "ఓగునోగు" పద్యములోనిది. అల్పజ్ఞాని
అక్కడ దానిని యిక్కడతికించాడు.

ఆ. మకరంబు అడవిలో । మేయుచుండగ రెండు
కాళ్ళులేనియు । కాప ముసలివాఁడు
రెట్ట తుపాకితో । కొట్టి కాల్చేసెరా ॥వి॥ 3613
యిది కూటవేదాంతము.

ఆ. మక్కకేగనేల ? । మఱితిరుగఁగనేల ?
ఏకమైన కర్త । యొందులేఁడు ?
అన్నిఁట బరిపూర్ణుఁ । డల్లా మహాత్ముండు ॥వి॥ 3614
మహమ్మదీయ ప్రవక్త మక్కాను పుణ్యక్షేత్రముగా మార్చాడు;
'అల్లా' అంటే వారి దేవుఁడు.

ఆ. మగఁడు తప్పులేక । మనసిచ్చి యున్నను
సహజగుణము విడదు । జారకాంత
పిండిఁదిన్న కుక్క । పీతి కాసింపదా? ॥వి॥ 3615
దుర్మార్గులు దుర్గుణములు విడువలేరు.

ఆ. మగఁడు మదనుఁడైన । మంచి కాపురమైన
సహజమేల మాను? । జారకాంత
పాలు ద్రావు కుక్క । బఱివిడి పోవదా! ॥వి॥ 3616
జారకాంత సహజ స్వభావాన్ని స్వానుభవముగా చెప్పెను.

ఆ. మగని కాలమందు । మగువ కష్టించిన
సుతుల కాలమందు । సుఖముఁ బొందు
కలిమి లేమి రెండుఁ । గల వెంతవారికి
బలిమి పుత్రబలిమె । బలిమి వేమ! 3617
సత్తువ గలనాడు శ్రమపడి సంపాదించుకోమ్మన్నాడు.

ఆ. మగని బలిమి కలిమి । మగువకును బలము
బలములేని మగఁడు । పనికిరాఁడు
పనికిరాని మగని । పాటించి చూడరు ॥వి॥ 3618
గడనలేని మగడు నడపీనుగని నాతులంటారు.

తే. మగని మాటకు మించని । మగువఁ జూడ
జగములోపల నెన్నంగఁ । జాల రెవరు?
ముగితి యరచేతిపై యుండు । ముదిత కెపుడు
భర్తృ విశ్వాస మొక్కటి । పరగ వేమ! 3619
భర్తృ విశ్వాసమును పొందు పడతికి అరచేతిలో వైకుంఠము.

ఆ. మగని మీఁదభక్తి । మానకుండిన కాంత
మూడు లోకములను । ముక్తిఁ గనును
మగువ లందఱికిని । మగలె దేవతలయా ॥వి॥ 3620
పతివ్రతల ధర్మాన్ని ప్రకటించాడు.

క. మగవాఁడై యాడుదియై
వగఁదెగి పోరానివాని । వరుసల వాఁడై

యుగయుగముల నటియించును
సుగుణి నిటువంటి వస్తు । చూడర వేమా ! 3621
బ్రహ్మమునకు లింగభేదము లేదు. దాన్ని తెలుసుకొన్నవాడే తత్వజ్ఞుఁడు.

ఆ. మఘువుఁడైన నేమి ? । మర్యాద యెఱుఁగని
వారలేలఁ ? దెలిసి । గార వింత్రు
ఊరిమి మొరుగు కుక్క । యోగినేమెఱుఁగురా ? ॥వి॥ 3622
అల్పబుద్ధులు అధికులను గమనించలేరు.

ఆ. మట్టి కుండఁజేసి । మహిమీఁదఁ బ్రతికెడి
భ్రష్ట కుమ్మరియును । బ్రహ్మ మనఁగ
నెట్టుగా నిలుచునె । నీతియే ధరణిలో ॥వి॥ 3623
కుండలను జేసే కుమ్మరి, మానవుల జేసే బ్రహ్మ యిద్దరూసమానులే!

ఆ. మట్టు వెట్టి కోర్కె । మదినిల్పి చూచిన
గుట్టు మిగుల దాని । గుణము దొరకు
నట్టునిట్టు చెదర । నమరదు తత్వంబు ॥వి॥ 3624
నిలుకడ లేని వానికి నిశ్చల తత్వములేదు.

ఆ. మఠము లోన నున్న । మతములన్నియు గోసి
దిటవుచేసి మనసు । తేట పఱచి
ఘనము నిల్పువాఁడు । ఘన తత్వయోగిరా ! ॥వి॥ 3625
గొప్పతనము నిల్పినవాడే కోవిదుడు.

ఆ. మఠములోని యోగి । మాయలన్నియుఁ గోసి
ఘటములోన నున్న । ఘనుని దెలిసి
మాటమాటకు గురు । మరువక తెలుపురా ! ॥వి॥ 3626
సద్గురువు సదానందుని జూపును.

ఆ. మఠములోని వాని । మహిమ లన్నియుఁదెలిసె
కుటిల మతిని బట్టి । కూల వేసి
ఘటము నిల్పువాఁడు । ఘనతర యోగిరా ! ॥వి॥ 3627
సమాధిని సాధించిన యోగి శిష్యులకు దారిజూపును.

ఆ. మడియువాఁ డెవండు ? । మడియని దెవ్వండు ?
పాటుఁజేసి చూడ । బట్టబైలు
సొరది జలఘటమున । సూర్యుని చందంబు ॥వి॥ 3628
నీటి కుండలో సూర్యుని నీడవలె నీలో నున్న నిశ్చలుని జూడుము.

ఆ. మణియు పూరచక్ర । మహిమంబు గనుఁగొని
వ్యాస వాయువునను । వనరుచున్న
మనసు చెడకయున్న । మర్మంబు తెలియదు ॥వి॥ 3629
మణి, పూరక చక్రమహత్తును దెలిసినవాడే మహాత్ముఁడు

ఆ. మతపు వేషధార్లు । మహిలోనఁ బదివేలు
మూఢజనులుఁ గలుప । మూగు చుంద్రు
కొంగలు గుమికూడి । కొఱకవా బోదెలు ॥వి॥ 3630
దొంగ గురువులందరూ కొంగవంటి వారని మన కోవిదుని వాక్కు

ఆ. మతము దారిమఱచు । మధురాధరముఁ జూచి
మగువ రూపుఁజూచి । మనసు మఱచు
ఉరముఁ జూచిసర్వ । యోగంబు మఱచురా ! ॥వి॥ 3631
స్త్రీ సర్వావయవములు పురుషులకు మతి భ్రాంతులను గల్గించినవే !

ఆ. మతము భేదముగల । మాయ సంసారియై
దారిఁ దెలియలేఁడు । తమక మంది
దారిఁ దెలియఁనతఁడు । ధన్యుండు గాఁడయా ! ॥వి॥ 3632
దారిదెలిసిన వాడేఁ ధన్యుఁడు.

ఆ. మతము మనుతఁ జిక్కి । మఱి దేహమున్నది
పంచభూతములును । ప్రజల బొందె
బొందికిఁ బరమైన । భూతేశుఁ డెఱుఁగురా ! ॥వి॥ 3633
భువనకర్తకే బొందుల యొక్క తత్త్వము పొందికగా దెలియును.

ఆ. మతము లెన్నియైన । సతముగా నుండదు
సతముగానె యుండు । జగతి యొకటి
అన్ని మతములు విడ । నరయ నొక్కఁడులేఁడు ॥ వి॥ 3634
మతమంటే కట్టు బాటుగా భావించి మనకవి చెప్పి యుంటాడు.

ఆ. మత్త చిత్తులు కల। మర్మంబుఁ దెలియక
చిత్తచలన మంది। చెడిరి భువినిఁ
జిద్రా మచటలేక। చిక్కునా పరమాత్మ ॥వి॥ 3635

లక్ష్యములేని చిత్తం లాభము చేకూర్చుకోదు.

ఆ. మత్సరంబు మదము। మమకార మనివొడి
వ్యసనములను దగిలి। మసలఁబోక
పరుల కుపకరించి। పరము నమ్మికనుండి
యొనరుచుండు రాజ। యోగి వేమ. 3636

యోగములలో రాజయోగము పూజనీయ మగును. యీపద్యములో రాజయోగ ప్రాస్తులను నిరూపించాడు.

ఆ. మత్త పుపొగఁ దగిలి। మూతి వాపై పోయె
బాణాగ్ని తాఁదాకి। ప్రాణి పోయె
ప్రాణవాయువుతోడ। ప్రాణవాయువు గలిసె ॥వి॥ 3637

ఇది నీసపద్య పోకడలో నున్నది.

ఆ. మతిని గానలేరు। మతి బ్రహ్మమూర్తి ని
మదిని గన్నవారు। మహిని లేరు
వెదకి తనువులోన। వేడ్కతో నెఱిఁగిన
యతఁడె యోగి వర్యుఁ। డంద్రు వేమ. 3638

మనస్సుంచి ఘనమును దెలిసి కొన్నవాడే యోగి

తే. మతిహితంబున నిర్గుణ। మర్మ మెఱిఁగి
సతత మభ్యాస యుక్తిలో। సంచరించి
యతులి తానంద సంపూర్ణ। మమర నుండు
పరశివుండని భావింతు। రెఱిఁగి వేమ. 3639

అనవరత మభ్యాసము చేయువారికి ఆనంద మబ్బుతుంది.

ఆ. మత్తు చిత్తులు కల। మర్మంబుఁ దెలియక
చిత్తచలన మంది। చెడిరి భువిని
బత్తిలేని వాఁడు। పరమాత్ము నెఱుఁగునా! ॥వి॥ 3640

"ఆత్మానాత్మ వివేకేన పునస్సంసార నివృత్తిః
తద్వినా జన్మ కోట్యాపి బంధచ్ఛేదో నసిద్యతి"
ఆత్మానాత్మ వివేకమున్న అంతా తెగుతుంది.

ఆ. మదముచేత లోక । మాయలుఁ దెలియఁడు
మదముచేతఁ దన్ను । మఱచునెపుడు
బుద్ధిలేని పసుల । పోలికఁ జెలుదురు ॥వి॥ 3641

మదము తన్ను మట్టిపాలు చేయును.

ఆ. మదము వలనఁగలుగు । మాటలఁబలె పల్కి
ముచ్చు సుద్దుల నొగి । మోసపుచ్చి
కాసు రాఁబెనఁగెడు । కష్టుండు గురుఁడౌనె ? ॥వి॥ 3642

గురు దక్షిణలను గొనే కుమతులు గురువర్యు లగుదురా !

ఆ. మదము విఱిఁగేకొఱకు । మందు వేఱొకటుంది
మనసు నంపితె లోన । మేసి వచ్చు
మేసి వచ్చిన వెనుక । మెడబట్టి యీడ్చేను ॥వి॥ 3643

యతితప్పు ; సుజ్ఞానము మేక, అజ్ఞానము వనమాలిక.

ఆ. మధ్య మాంస రుచిని । మాదిగదై వాల
యెంగిలిఁ దినఁగానె । నింగిగలదె ?
భక్తి హారునిఁ గొల్చి భవ్యులు గండయా ! ॥వి॥ 3644

ఆ. మధ్య మాంసరుచిని । మాదిగదై వాల
యెంగిలిదినువారి । దెట్టి కులము ?
భక్తిని హారుగొల్చి । భవ్యులుగండయా ! ॥వి॥ 3644 A

మధ్య మాంసాలను దినే నీచదైవములు నిన్ను రక్షించలేవు. పరమే
శ్వరుని సేవించి పవిత్రుడవు కమ్ము.

ఆ. మదిగలిగిన పూజ । మదనారి మెచ్చును
మనసు నిల్పినంత । మహితుఁ డగును
మనసు లేనిపూజ । మట్టి సమానము ॥వి॥ 3645

మదనారి = ఈశ్వరుఁడు ; మనోసుద్ధితో జేసిన పూజలకు మహే
శుఁడు మక్కువ పడతాడు.

ఆ. మదిని గానలేరు । మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్నవారు । మహిని లేరు

వెదకి తనువులోన । వేడ్కతో నెరిగిన
యతఁడె యోగివరుఁడు । యంౘ్రు వేమ. 3646

శరీరములో సదాబ్రహ్మమును నిదానముగా జూచినవాడు నిర్మలుఁడు.

ఆ. మదిని గానవచ్చు । మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్న యపుడె । మహితుఁ డగును
వెదకి తనువులోన । వేడ్కతో నరసిన
యతఁడె యోగి వరుఁడ । టంౘ్రు వేమ. 3647

తనువులో వెదకి తత్వాన్ని తెలిసినవాడే యోగి

ఆ. మదిని నొక్క చోట । నూనక నిల్పియు
బోధలుడిగియున్న । పొందుఁగల్గు
నిశ్చలంబు గాను । నెఱినిల్చుట సమాధి ॥వి॥ 3648

చలనము లేకుండా యుండుటయే సమాధి యోగము.

ఆ. మదినెఱిఁగిన వాని । మహిమ గానమెందును
మదినెఱుంగు నరుఁడె । మహి మనుజుఁడు
వెదకి తనువులోన । వేడ్కతో నినుజూచు ॥వి॥ 3649

కుదురుగా మదిలో నున్న గోప్యము

ఆ. మధురసంబుఁ గోలి । మక్షికంబులు చేరి
చొచ్చి వెడల లేక । చొక్కినట్లు
మునిఁగి విడువ లేఁడు । మోహంబు రాశిలో ॥వి॥ 3650

మధురము = తేనె; మక్షికము = ఈగ రుచుల కాసించి లోలత్వములో చిక్కుతారు.

ఆ. మధుర సారమొప్పు । మహిత ఫలంబుల
కంటె రుచ్యమగును । గలికి పలుకు
అట్టి దెదుటనున్న । నన్ని యోగము లూడు ॥వి॥ 3651

పలురసములకన్న పడతి పలుకులుమిన

ఘనవృత్తి బూని । మౌన సమాధిలో
దనదు జ్ఞప్తి మఱచి । తాళ్మితోడఁ
బెంపుఁజెందువాఁడు । ప్రియ భక్తుఁడగుయోగి ॥వి॥ 3652

అవిరళమైన భక్తిభావనతో నున్నవాడు అసలైన యోగి

ఆ. మననవృత్తి లోన । మహిమ నెఱుంగుచు
మనసు నందెపూజ । మహితముగను
మౌనకుండు వాఁడె । మర్మజ్ఞుఁడగు యోగి ॥వి॥ 3653

"నిమిషం నిమిషార్ధవా ప్రాణి నా విష్ణు చింతనం
క్రతుకోటి సహస్రాణాం ధ్యాన మేకం విశిష్యతే"
తృటికాలమైనా విష్ణువు నారాధించిన జిష్ణుకు (పాండవగీత)

ఆ. మనముఁ జూచి గెల్చి । మనములో సుఖియింప
గడకు మోక్షపదముఁ । గను నచటనె
చెట్టుఁబెట్ట ఫలము । చేకూఱదేదాన ॥వి॥ 3654

"ప్రయత్నేన సాధ్యతే సర్వము" ప్రయత్నము చేత అన్నియూ గును

ఉ. మనమునఁ జేసిన । మైనపు జిడ్డి
ప్రణతమునై దగు । రావుల దొడ్డి
యనువుగఁ జేసెను । నందఱ నొడ్డి
వితతము గాఁగను । వేమన రెడ్డి. 3655

వాదాభిలాషులకు బోధార్థయోగ మిది.

తే. మనముమెచ్చిన బావి । మంచినీళ్ళను ముంచి
మనము తాగితేఁగదా । మమత బుట్టు
తేరకాళ్ళకు నెల్ల । తమకంబుఁ బుట్టునా ! ॥వి॥ 3656

"అనుభూతిం వినామూఢో వృథా బ్రాహ్మణి మోదతే
ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్"
ఛాయను తినినట్టుగ శాస్త్రజ్ఞానము వచ్చుననుట (శృతి)

ఆ. మనములోనఁ బుట్టు । మది కోర్కులన్నియుఁ
గోర్కులందు ముక్తి । కుదురు పడదు
మనము బ్రహ్మమనుచు । మది నెఱుంగఁగలేరు ॥వి॥ 3657
మనస్సు అన్నిటికి మూలము.

క. మనసన్న బాలపాయము
మనసే యావరణమందు । మలయుచుఁదిరుగ
న్మనసునకు మనసె సాక్షియు
మనసునకును మునము లేదు । మహిలో వేమా 3658
మానసానందము చెందినవాడే మంచి యోగి.

ఆ. మనస రక్షణముతో । మక్కా, మధీనా శ్రా
కంచి, తిరుపతి, మధుర । కాశిపురము
చెప్పున్న స్థలములు । చెప్పెచ్చు నిద్రలు ॥వి॥ 3659
సర్వ మతసుల పుణ్యక్షేత్రాలనూ పుణికిలగా జేశాడు.

ఆ. మనసు కోర్కెలంటి । మఱి చిక్కు పడియుండు
కోర్కె లడఁచు యుక్తి । గుఱ్త్తెఱింగి
గుఱుతు నంటిచూడ । గుణమగు దత్వంబు ॥వి॥ 3660
గుఱిగా మనస్సును గుర్తెరిఁగిఁ జూడమన్నాడు యోగి.

ఆ. మనసుగలుగు వాఁడు । మహనీయ తేజుండు
అజునకైన వాని । నరయఁ గాదు
బైలుఁగానఁ బడునె? । పాషాణములఁ గన్న ॥వి॥ 3661
బండలలో బ్రహ్మమున్నదన్న వాండ్రు పాషండులే !

ఆ. మనసు గుప్తపఱచి । మరిగిన శివయోగి
తఱచు పలుకకున్న । ధర్మమంద్రు
తఱచు మాటచేతఁ । దత్వంబు చెడిపోవు ॥వి॥ 3662
వదరుబోతుకు బ్రహ్మపదములు దొరకవు.

ఆ. మనసుగుజ్జముఁ జేసి । మాయను యెక్కించి
మోసపుచ్చును బ్రహ్మ । మూర్ఖ జనుల
బ్రహ్మనడతలుఁ దెలియ । బ్రహ్మజ్ఞానికిఁ దెలుసు ॥వి॥ 3663
బ్రహ్మనడతలు తెలియాలంటే బ్రహ్మజ్ఞానిఁ గావాలి.

ఆ. మనసుగెలిచి పూని । మన్న సుజ్ఞానులు
కడక మోక్షపథముఁ । గనుచు నుండ్రు
చెట్టుఁబెట్ట ఫలము । చేకూర కుండునా ! ॥వి॥ 3664
చేసినపని ఫలము సిద్ధించుటకే !

ఆ. మనసు చారవీడి । మనసుఁదా మగుడించి
మనసులోనఁ గలుగు । మర్మమెఱిఁగి
మనసుఁ దానునిల్ప । మరియుఁదా బ్రహ్మంబు ॥వి॥ 3665
ఏకాగ్రచిత్తులగువారే లోకాతీతులలో లెక్క.

ఆ. మనసుఁదెలిసి యొకని । మాటకుఁ బ్రతిచెప్ప
సంతసించు నతఁడు । చాలమెచ్చు
మనసుఁదెలియ కాడ । గనియుచు ననునేదొ ॥వి॥ 3666
మంచిదెచ్చినా! చెడ్డతెచ్చినా మాటేగా !

ఆ. మనసున గృపలేని । మాలల కొడుకుల
వద్దఁ జేరినట్టి । వారలెల్ల
పనస కొడుకుచెంచు । పడుచుల చందమా ॥వి॥ 3667
మనసులోని కృపలేనివాడే మాల. వాని దాపుజేరినవాడు పెను
మాల.

ఆ. మనసు నంటి గెలిచి । మనసున సుఖయింప
గడకు మోక్షపథముఁ । గనక పోఁడు
చెట్టుఁ బెట్ట ఫలము । చేకూర కుండునా ? ॥వి॥ 3668
సాధకునకు సత్ఫలము సత్వరముగా లభించును.

ఆ. మనసున దయలేని । మాలకొడుకు నొద్దఁ
జేరియున్న ప్రజకు । జేటు నిజము
పెద్దతనము లెంచఁ । జెంకెల చందమా ॥వి॥ 3669
కఠిన చిత్తులదగ్గరకు చేరినవారు ఘనము బొందుదురా !

ఆ. మనసునందు ముక్తి । మఱి యెఱుంగఁగలేక
మనసుచేతఁ దగిలి । మాయమైరి
మనసు తాను యయిన । సర్వజ్ఞుఁడే యోగి ॥వి॥ 3670
మనసులోనున్న ముక్తిమర్మము దెలిసినవాడే మహాత్ముఁడగు యోగి

ఆ. మనసునందు ముక్తి । మలయుచు నుండంగ
మనసు నెఱుఁగ లేని । మనుజులెల్ల
మనసు నంటలేక । మాయమై పోదురు ॥వి॥ 3671
మనసుతత్త్వము తెలియనివారు మానవులేగారు.

క. మనసున నెఱుకను మఱపును
గనివిని చూడంగలేరు । కదిసిన పిదపం
బెనఁగొని పట్టెదమన్నను
మనచోటనుమాయ మాయె । మహిలో వేమా ! 3672
మానసిక జ్ఞానమే మహానందము.

క. మనసున బుద్ధియు దోచును
మనసు నహంకారమౌను । మనసున చిత్తం
బెనయఁగ నాలుగు విధముల
గని మని తన తనువు తెలియ । గానరు వేమా ! 3673
మనోబుద్ధి వాక్కాయ కర్మలు మానవుని వున్నతి బెంచును.

ఆ. మనసు నిర్మలుఁడై తె । మంచి నీతులు దెలిసి
భయము లెల్లనుదీర్చి । భద్ర మగును
తావు జేర్చినవాఁడె । తారకబ్రహ్మంబు ॥వి॥ 3674
నిర్మలమైన మనస్సుగల్గిన నీతికోవిదుఁడే !

ఆ. మనసు నిల్కడఁజేసి । మగువనుసాధింప
మాయఁజేతికిఁ జిక్కి । మర్ది యించ
పెక్కుమాటల వల్ల । జిక్కునా యా మాయ ? ॥వి॥ 3675
మాయను మటుమాయము చేయుటకు మనస్సును చిక్కబటుము.

ఆ. మనసు నిల్పలేని । మాయ విరక్తులు
మనసు పడుదురొక్క । మగువమీఁద
ఇంత వ్యర్థ జన్మ । మీ బ్రతుకేఁటికి ? ॥వి॥ 3676
మాయ విరక్తులకు మనసు కుదుటపడదు.

ఆ. మనసు నిల్పినట్టి । మర్మజ్ఞు లగువారె
గరిమ మోక్ష పథము । గన్న వారు
చెట్టు (బెట్ట ఫలము । చేకొనరా తాము ॥వి॥ 3677

ప్రయత్నము చేత ఫలము పొందవచ్చు ననే సందర్భములో "చెట్టు బెట్టు" అను వాక్యమే వాడుతున్నాడు వేమన.

ఆ. బుద్ధినిల్పిన । వెనుక మోక్ష చింతనయేల?
మనసుఁ దెలిసిన వెనుక । బంధమేల
గతియులేని వాళ్ల । బతిమాలనేలరా? ॥వి॥ 3678

అతీగతీ లేనివాళ్ళను బ్రతిమాలడము మతిలేనితనమని అన్నాడు.

సీ. మనసు నిల్పినతండు । మఱి సర్వ సమమందు
ననుభవంబును గోరి । యచలుఁ డగును
నిగమాంత వేద్యమై । నిత్యప్రకాశమౌ
పరమ పూర్ణముఁగోరు । పట్టు విడఁడు
అరయంగ రానిది । యల పరబ్రహ్మంబు
తానని తెలిసియుఁ । దలపు విడఁడు
నిరత మాత్మ నుతించి । నిర్గుణంబును జెంది
నిశ్చల బ్రహ్మమౌ । నియతి విడఁడు
సగుణ మెప్పుడు తాఁ గాక । సత్యమనెడు
నిర్గుణ బ్రహ్మమే యని । నిశ్చయించి
తాను దనలోనఁ బూర్ణుఁడై । తలఁగ కుండు
నవతరించిన శివుఁడందు । రతని వేమ! 3679

"శా॥ వేదాంతాధిక విద్య నేర్చి బుధసంప్రీతైక చేతస్కుఁడై
భేదాఽభేదము నెంచి సర్వమత ప్రావీణ్యంబు దళ్కొత్తగా
మోదానంద కళా రహస్యచణుడై పూర్ణంబు సాధించి మా
శ్రీమండై తగు వేమనార్యుఁడు ధరన్ సృష్టించె మాధుర్యమున్."

కం. మనసును, ననలము రెంటను
ఘనమును గొంచెంబుఁ దెలియఁ । గావలె సుమ్మీ

కనుమూసి తెరచు నంతనె
ఘనమై విహరించు మనసు | గానరు వేమా ! 3680

అనలము = అగ్ని ; వివక్షత తెలిసినవారికె క్షణములో విజ్ఞానము గోచరిస్తుంది.

క. మనసును బుద్ధియు మఱియును
ఘనమగు నహమును గనంగఁ | గడు వడిగానే
తన రెడు నంతఃకరణం
బనఁగా ముఖ్యంబు దీని | నరయుము వేమా ! 3681

అంతఃకరణముల ఆకళింపు చేసుకొనినవాడే అమరజీవి.

ఆ. మనసు పాఱవిడిచి | మనసుఁ దా మగుడించి
మనసులోనఁ గలుగు | మనసు నాని
మనసు తానె నిల్వ | మఱియుఁ దా బ్రహ్మంబు ||వి|| 3682

మనసులోన మనసు నిల్పినవాడే మాననీయుఁడు

ఆ. మనసుఁ బూని గెలిచి | మనసులో సుఖియించి
కడకు మోక్షపథముఁ | గనును వాఁడు
చెట్టుఁ బెట్టిఫలము | చేకొన కుండునా ! ||వి|| 3683

మనో సాధనమే మహనీయత నిచ్చును.

ఆ. మనసు మాయనంటి | మఱిరూపులై తోచు
తరముగాదు నిలుపఁ | దలఁపు లపుడు
స్థిరము గాను నిలిపి | చిన్మయు మందరా ! ||వి|| 3684

చిన్మయు బ్రహ్మమును చింతించుటయే శివయోగికి లక్షణము.

ఆ. మనసు ముక్తియనుచు | మది నెఱుంగఁగలేరు
మనసుచేతఁ దగిలి | మాయమైరి
మనసు తానయైన | మర్మజ్ఞుఁడగు యోగి ||వి|| 3685

మనోతత్వము దెలిసినవాడే మర్మజ్ఞుఁడు.

ఆ. మనసులేని తావు | మరిగిన శూన్యము
శూన్యమనఁగ రాదు | సూటిగాను
బయలు లోన రవము | ప్రకటన గాలేదు ||వి|| 3686

బట్ట బయలను దట్టమైన వెన్నెలను గాంచినవాడు దిట్ట.

ఆ. మనసులో పుట్టు గనిపట్టి । మాన్యుఁ డరయ
తనివి తీరఁగఁ బరిపూర్ణ । తత్త్వమంది
తన్నెరుఁగక తనలోనె । తలపు నిలుపు ॥వి॥ 3687

తనివి తీరని తత్త్వవేత్త తనలో ఆనంద మనుభవిస్తాడు.

ఆ. మనసులోన దెలిసి । మనసులోనే కలిసి
మనసులోని వాని । మరల దిగిచి
మనసు నిల్పువాఁడు । మర్మజ్ఞుఁడగు యోగి ॥వి॥ 3688

మనసులోనివాని మర్మము దెలిసినవాడే సిద్ధుడైన యోగి.

ఆ. మనసులోన నున్న । మతము లోకకోటియైన
మనసులోన నున్న । మహిమ నెఱుఁగు
మహిమ నెఱుఁగు । నతఁడు మరణంబునెంచునా! ॥వి॥ 3689

మతము = ఉద్దేశ్యము; సదుద్దేశ్యముఁ గలవానికి చావేది?

ఆ. మనసులో నున్న । మమతలన్నియుఁ గోసి
దృఢముచేసి మనసుఁ । దేట పఱచి
ఘటము నిల్పువాఁడు । ఘనతర యోగిరా! ॥వి॥ 3690

ఉద్దేశములను ఉద్దీపింపఁ జేసి యొప్పారినవాడే యోగి.

ఆ. మనసులోన నున్న । మర్మమంత యెఱింగి
స్థిరముఁజేసి యాత్మ । తేట పఱచి
ఘటము నిల్పవలయు । ఘనమైన నేఁటికి ॥వి॥ 3691

దివ్యకళలను తేటపరచుటకే దేహపోషణ.

ఆ. మనసులోన బుట్టు । మరికోర్కె లన్నియుఁ
గోర్కెలందు ముక్తి । కుదురు పడదు
మనసు బ్రహ్మమనుచు ।మది నెఱుంగలేరు ॥వి॥ 3692

కోర్కెలతోడ మనసును కుదించక బ్రహ్మముపైపు పారించ మన్నాడు.

ఆ. మనసులోన శివుని । మానక నిలిపిన
యోగి యగునతండ । యుర్వి లోన
శివునిఁ దలఁపలేని । చిత్తంబదేలనో! ॥వి॥ 3693

శివచింతన లేని చిత్తము చిత్తమే గాదు.

ఆ. మనసులోని ముక్తి । మఱియొక్కచోటను
వెదక బోవువాఁడు । వెఱ్ఱివాఁడు
గొఱ్ఱె జంకఁబెట్టి । గొల్లవెదకురీతి ॥వి॥ 3694

"క॥ వేమన కవితారీతులు కోమల మయి వెలయుచుండు భూవలయమందున్
సోముడు, భానుఁడు తారలు భూమిని విలసిల్లు వరకుపొలుపొందు గదా!"

ఆ. మనసులోని వాని । మనసులోనె కలిసి
మనసులోని వాని । మగ్న మంది
మనసుఁ దెలియువాఁడు । మర్మజ్ఞుఁడై యుండు ॥వి॥ 3695

మనసులో మగ్నమైన మహత్తత్వాన్ని మరవ వద్దన్నాడు.

ఆ. మనసులోని వాని । మానుగాఁ దెలిసిన
నుర్వి జనులువాని । యోగి యంద్రు
నీవు నిన్నెఱుంగ । నీవెపో శివుఁడవు ॥వి॥ 3696

తనను తానెరిగిన వాఁడే తత్వజ్ఞుఁడు.

ఆ. మనసులోనె పుట్టె । మాయ సంసారంబు
మనసు విఱిగెనేని । మాయ తొలఁగు
మనసు నిల్పలేని । మహిఁ దానె బ్రహ్మంబు ॥వి॥ 3697

మమకారమును మాయింపఁజేసిన మాకుమారుఁడు గాఁడా!

ఆ. మనసు, వాక్కు, కర్మ । మఱియేమి లేక యే
రాక పోకలేని । రాజవీధి
పరగ హాని కలదె? । పరతత్వ యోగికి ॥వి॥ 3698

పరతత్వ యోగికి వాక్కాయి కర్మలు పరములు గావా?

ఆ. మనసు, వాక్కు, కర్మ । మార్గంబు లంటక
రాకపోక లణచి । రాజవీధి
మఱిగి యున్నవాఁడు । మఱితత్వ వేదిరా! ॥వి॥ 3699

త్రికరణములు దివ్యముగా నేర్పుగలిగినవాడే ఒప్పైనయోగి

ఆ. మనసు శివుని మీఁద । మఱితాళి తాళియాఁ
గుక్క, పంది శివునిఁ । గొలువఁ జేయ
కుక్కవంటి పాప । గుణమబ్బుఁ దెలియరో! ॥వి॥ 3700

నీచులు నిలకడగా నుండక నిశ్చయాన్ని తెలియలేరు.

ఆ. మనసుసూచి గెలిచి । మనసులో సుఖయించి
కడకు మోక్ష పదము । గనును వాఁడు
చెట్టుఁ బెట్ట ఫలము । చేకూరకుండునా! ॥వి॥ 3701

మనస్సును క్రమములో ఉంచగలిగినవాడు మహితఫలము బొందును.

వ. మనసునకు విజ్ఞానమును విజ్ఞానమునకు ప్రకృతియును కారణములై ఆప్రకృతియందు పరబ్రహ్మము లీనమై తాండవమాడుచుండును ॥వి॥ 3702

విజ్ఞానము పరబ్రహ్మమును వెదుకుటకు సాధనము.

క. మనసే మాయామృగమా
మనసేమిటి పైకఁగాని । మఱి పోనీకా
మనసున మనసును జంపిన
మనసందే ముక్తిఁగలదు మహిలో వేమ 3703

మనోధైర్యము వలన మాయను మడిగించి ముక్తిని సాధించుట యుక్తమన్నాడు వేమన.

క. మనసే యెలప్రాయము దా
మనసే మఱి జీవనంబు । మనుజులకెల్లన్
మనసునకు మనసె సాక్షియు
మనసునకును ముదిమిలేదు । మహిలో వేమా! 3704

మహనీయుఁడగు వేమన మనస్సుయొక్క మహిమను మహత్తరముగా వర్ణించెను.

క. మనసే లోకాలోకము
మనసే చూపించి మెచ్చు । మాయలసుమ్మా!
మనసగు ముక్తికి భుక్తికి
మనసును విడనాడమేలు । మరుగును వేమా 3705

మానవుని ఒపఁజేయునది మనస్సే.

క. మనియుండెడు జగమెల్లను
జనిపోయిన వారిపుణ్య । సత్కథలెలమి
న్వినవలె, గనవలె, మనవలె
ననిమిషులకునైన దెలియ । దంత్యము వేమా! 3706

పూర్వుల చరిత్రలు పుణికిపుచ్చుకొని చదువుట పుణ్యప్రదము

ఆ. మనుజులందఱి నిల । మంగలిచే గిన్నె
పొత్తుఁగుడిపి కులము । బోడిఁజేయఁ
దలను జేయిపెట్టి । తగనమ్మఁ జెప్పఁడా! ॥వి॥ 3707

సమస్త జనములు సమానముగా ఉండాలనే భావానికి యీ యుపమానము చెప్పెను.

ఆ. మనుజులెంతటి వారు । మాయను కసిపెట్ట
మాయకు నడ్డంబు । మనుజు లెంత?
వెఱ్ఱి నక్కను కుక్క । వెరపించి నట్లురా! ॥వి॥ 3708

మనస్సును మాయ యేవిధమైన కీడునుఁ గల్గించలేదు.

ఆ. మనుట లెల్ల కల్ల । మనసెల్ల దొంగ యిం
కేఁటి ప్రాణమింక । నేఁటి బ్రదుకు
మాట సత్యమైన । మఱి శతాయుష్యంబు ॥వి॥ 3709

"సత్యమేవ జయతే" సత్యమే జయము.

ఆ. మన్ను కుప్పఁజేసి । మంటిలో గోరాడి
మంటి నంటకుండ । మరిగి తిరిగి
మన్ను మింటఁగలియ । మఱి యెందుఁబోవునో! ॥వి॥ 3710

దేహాన్ని మంటి స్వరూపముతో జూస్తే అద్యంతము లదే.

ఆ. మన్ను దినుమటన్న । మండిరే జనులార
మంటిలోని మేలు । మఱవనేల?
నీళ్ళలోని మేలు । నిఖిలమై యుండురా! ॥వి॥ 3711

ఈ భావము అందీపొందక అందరాని పండువలె నున్నది.

ఆ. మన్ను, నీరు, నగ్ని । మనసందుఁ దెలిసితె
వాయువుల్ క్షణమందు । వంచవచ్చు
ధన మదాంధులకెల్లఁ । తట్టునా! యీ క్రమము? ॥వి॥ 3712

భూతత్వాల మూటిని నూటిగా మనసులో నాటిన వాయువును వంచవచ్చును. అప్పుడాకాశ తత్వము తానే!

ఆ. మన్ను, నీరు, నగ్ని । మఱి గాలితోఁగూడి
మిన్నుతోడఁ గలిసి । మెలఁగి చేరి
కన్నుగానకుండఁ । గలిగిన దేహంబు ॥వి॥ 3713

పంచభూతములతో బరఁగిన దే యీ దేహము.

ఆ. మన్ను పాయిలేని । మహిమీఁద నొకకోట
కొమ్ముఁ గలిగియుండు । కొనలు సాగి
దివ్వెలేని వెలుగు । దీపించి యుండురా! వి॥ 3714

కూట వేదాంతాన్ని వాటుగు బోటితో నూటిగా జెప్పాడు మహాయోగి.

ఆ. మన్ను పాఱఁ బెట్ట । మన కేమి లాభము?
ధాన్య మట్టు చేయఁ । దలగుఁ దూలు
ఘనుని లోప మెన్నఁ । గనువిందు మేలౌను ॥వి॥ 3715

ఏరు మేకై నట్టుగా మానవుని లోపాలు పోయిన మరిలాంగుతా డా!

ఆ. మన్ను మన్ను నఁ గలుసు । మత భేదములు యేల?
నీరు నీరునఁ గలుసు । నిష్ఠ యేల?
అగ్ని నగ్నినిఁ గలుసు । నానందపడ నేల? వి॥ 3716

పంచభూతముల పంచీకరణ ప్రాజ్ఞులకే వివరించాడు.

ఆ మన్ను మిన్ను నంటి । మహిమీఁద నొకకోట
కొమ్ము లమరియుండుఁ । గొనలు సాగి
దివ్వెలేని వెలుఁగు । దేజరిల్లుచు నుండ ॥వి॥ 3717

వేదాంత వీధులలో విజ్ఞానవేత్తలను విహరించమని చెప్పేడు

౧. మన్ను మెత్తి కడిగి । మఱి రూపు గావించి
గుంటనిండఁ బూడ్చి । గుఱుతు నిల్పి
మనుజులెల్లఁ గూడి । మఱిదేవుఁడందురు ॥వి॥ 3718
మట్టి బొమ్మను చేపట్టి పూజించేవారికి వట్టిదన్నాడు.

౨. మన్నురాయి లేదు । మహిమీఁద నొకకోట
కొమ్మగలిగి యుండి । కొనలు సాగు
దివ్వెలేని యిల్లు । దీపించియుండునా! ॥వి॥ 3719
అతీతానాగత మార్గాన్నాలోచించి ఆ పరంజ్యోతిని తెలుసు
కున్నాడు.

౩. మమత లుడిగె కొఱకు । మహి ముద్రలను నేర్చి
ముక్కు, కండ్లు, చెవులు । మూసినోరు
యేక చిత్తముతోడ । యెవరేమి కన్నారు ॥వి॥ 3720
పంచ ముద్రల వలన భావము చేడుటేగాని ఫలముశూన్యము

౪. మయినమొత్తి లిఖువు । మఱిరూపు గావించి
తామ్రము కరగించి । దానఁబోసి
మనుజులెల్లఁ గూడి । మన దేవుఁ డందురు ॥వి॥ 3721
మూసలుగట్టి విగ్రహములను నిర్మించుకొని ముక్తి బొందుదు మను
మూర్ఖులుగారా!

౫. మయిల కోకతోడ । మాసిన తలతోడ
నోడలి ముఱికి తోడ । నుండెనేని
అధిక కులజునైన । నట్టిట్టు పిలువరు ॥వి॥ 3722
శరీర శుభ్రత, శుభ్రమగు బట్టలులేనిదే యెవరాదరించరు.

౬. మరణ కాలముననను । మదినిల్పు సుజ్ఞాని
పరముఁగోరి తాను । బట్టు విడక
వెనుకఁ గోర్కెలకును । విలపించు నజ్ఞాని ॥వి॥ 3723
మరణకాలమందైనా మమతలు విడువనివాడు పరమ మూర్ఖుడు.

ఆ. మరణమన్న వెఱచి । మదిఁ గలఁగఁగ నేల ?
నిరుడు, ముందరేఁడు । నిన్న, మొన్న
తనువు విడిచినతఁడు । తనకన్నఁ దక్కువా? ॥వి॥ 3724

"క॥ మరణమునకు వెరవకుమీ
ధరబుట్టిన ప్రాణి తథ్యమె చచ్చున్
స్థిరమై నిల్చును యశమది
నిరుపేదల కరుణఁ బ్రోచి నెరవందుము సుమా!"

కం. మరణము దాపగుచున్నది
స్థిరబుద్ధిని బరముఁగన్నఁ । జిక్కును మోక్షం
బరయుచు గుఱిలో మించిన
బరమార్థమె బట్టబయలు । ప్రాకును వేమా! 3725
స్థిరబుద్ధి గలవానికి పరమార్థము బట్టబయలుగా నుండును.

ఆ. మఱతు నేమొ యనుచు । మదిఁ నెప్పుడు దలచుచు
నెవరొ నరుఁడు యేల । దెంతదైన
మ్రాఱు మేలుఁ జేసి । మర్యాద నిల్పికో! ॥వి॥ 3726
ఆపదలో ఆదుకొన్న వారిని అహరహము ఆత్మలో ధ్యానించుము

ఆ. మఱపు తెరపి చేత । మానవదేహంబు
నెత్తవలసెఁ గాని । యిహమునందు
మఱపు లేక యున్న । మరణ మెక్కడిదన్న ॥వి॥ 3727
మహత్తర సందేశముల చేత మనీషులను మహదాశ్చర్యము పొందించు మహత్తు వేమనకే గలదు.

కం. మఱపులు సెప్పిన విధములు
మఱవక మనసందె యున్న । మతముల వారా
అరుదయిన వస్తు వప్పుడ
యెఱుగంగా వలయుఁ దాని । యిచ్చును వేమా! 3728
మంచి మతగురువులను మనసార నమ్మితే మార్గములు జూపింతురు.

కం. మఱవవలెఁ బాప సంగతి
మఱవంగా వలెను దురము । మఱి విశ్వములో

మఱవవలెఁ బరుల నేరమి
మఱవంగా వలదు మేలు । మహిలో వేమా ! 3729

బద్దె భూపాలుని సద్గమును ఒద్దికగా ఉంచి మకుటము మాత్రం మార్చేడు యీమహానీయుఁడో !

ఆ. మర్మ మంతఁగొనక । మర్మమైక్యమందక
పరమ గూఢమింత । బయలు పడదు
పడిన మాత్రమెన్న । బయలుపడిన యంతె ॥వి॥ 3730

అందిపొందని చందముగల యిందుముఖిం గా నుందిపద్యము.

ఆ. మర్మ మెఱుఁగలేక । మతములు గల్పించి
యుర్వి దుఃఖులగుదు । రొకరి కొకరు
గాదె యింటఁగుక్క । కళవళ పడురీతి ॥వి॥ 3731

మతములు కల్పించి కలవరములతో కలహము లాడువారిని కుక్కలతో లెక్కించాడు.

ఆ. మర్మ మెఱుఁగలేని । మనుజు లెల్లరు నిట్లు
మాల దాసరులకు । మడుపులిచ్చి
మహిని గాచునట్టి ! మనుకులంబెఱుఁగరు 3732

మనుకులం తెలియాలంటే యినవంశజుల చరిత్ర చదవాలి
(రఘువంశము)

క. మర్త్యమున నర్పకులమని
మర్త్యులుతము దెలియలేక । మనమున దిరుగన్
మూర్త్యంత మెరుగు । తెలివి యో
గూర్త్యుత్తమ పదము । నిజము గోరిక వేమా ! 3733

ఆ. మరిగి తిరిగి నరుఁడు । మరలుకొన్నను గాక
యందువల్ల నేమి । యాశఁ గలుగు ?
నంత రాత్మ నిలుప । నతఁడెపో తానగు ॥వి॥ 3734

అంతరాత్మను నిల్పిన వాడే అసలైన యోగి.

ఆ. మర్మవిదుఁడు గాని । మర్మంబుఁదెలియఁడు
కర్మజీవి మేలు । కానలేఁడు
నీరుచొరక లోతు । నీయూనతెలియదు ॥వి॥ 3735

పసిడితునకలవంటి పదములు తేనె సోనలూరు తీయని నుడికారము వేమన కవితలో కానవచ్చును.

ఆ. మఱియు దధిని ఘృతము । ప్రమానులం దనలము
సౌమ్య సుమములందు । సౌరభంబు
తిలలఁ దైలమట్లు । తేజరిల్లుఁ జిదాత్మ ॥వి॥ 3736

వివిధ విజ్ఞాన వేత్త వేమననుటకు యీపద్యమే సాక్షి

ఆ. మరుగుఁజేరి గురుని । మర్మంబుఁదెలియక
యెఱుక మించరాద । దేరికైన
నెఱుకమఱపు సందు । నెంచుటే తత్వంబు ॥వి॥ 3737

శుశ్రూషఁజేసి గురుకరుణ పొందిన వారికే పరము గోచరించును.

ఆ. మరుగు పడ్డవాఁడు । పరగ దాసావళి
యూడిగంపుఁ బనుల । కొప్పుచుండు;
బిరుదు బంటుజ్ఞాని । పరమాత్మఁ జొరబాఱు ॥వి॥ 3638

అజ్ఞాని అందరికీ దాసత్వముజేస్తాడు. ప్రజ్ఞాశాలి పరములనే సేవించును.

క. మరువ వలెన్ పాపమునకు
వెరువ వలెన్ ; మరణమునకు । విశ్వము లోనన్
వెరువ వలె నసంగమముల
మరి మరువగవలదు మేలు । మహిలో వేమా ! 3739

చెడ్డచింతనములు చెందగ నాడి ఉపకారము చేయుట కుపక్రమించుటయే ఉత్తమధర్మము

ఆ. మలచమెంత భువిని । గలిగిన నేఁకనేమి ?
వితరణమ్ము లేక । వెలయదెందు
ఆరగింపులోన । నాజ్యంబు లేనట్లు ॥వి॥ 37 10

ఆజ్యము = నెయి ; నేయిలేని భోజనము నీచము

ఆ. మలము జారవిడుచు । మఱిపాయు పథమున
మలము విడువ బలము । మనుజునకును
మలము బిగిసెనేని । మఱి ప్రాణహానియౌ ॥వి॥ 3741
"మలజారీ రోగ హారీ"
మలముపోయిన రోగములెట్లుగల్గు ?

ఆ. మలము మూత్రములకు । మధ్యమునను బుట్టి
మలమురోయ వాఁడు । మనునె జగతి
మలము మూత్రములను । మానుట మూలంబు ॥వి॥ 3742
ప్రాణులకు మలమూత్ర విసర్జన ప్రతినిత్యము జరుగవలసినదే

ఆ. మలము మూత్ర రక్త । ములు మాంసమునుగల
ముట్టుకుండ నీళ్ళ । ముంచ నేల ?
పై ముఱికియె పోవు । లోముఱికియె పోదు ॥వి॥ 3743
జ్ఞానులు దేహాన్ని మురికి భాండముగా పోల్చెదరు. దీనికి ముచ్చటెందుకో !

కం. మల మూత్రాదుల నిలిపియు,
దలపెంచుచు యోగులమని । ధారుణి దిరుగన్
ఫలమేమి ? కలుగు భృకుటీ
స్థలమందుం దన్నుగనుటె । ధర్మము వేమా ! 3744
గడ్డము మీసములు పెంచుట అడ్డాదిడ్డపు జీవితమునకే !

కం. మశకము ఝుమ్మని కూయుచు
పసగల దేహమున వ్రాలి । బలుతీక్ష్ణమ్మౌ
కొసగల ముక్కునఁ బొడుచుచు
వెసగ్రోలును నెత్తురిలను । వినరా వేమా ! 3745
ఈగలు చేయువిధానములే యిచ్చుట చెప్పెను.

ఆ. మసిగుడ్డ లోపల । మాణిక్యమును ముడిచి
బురదలోపల గుచ్చి । పూడ్చనేమి ?
కాంతికి భేదంబుఁ । గలుగునా భువియందు ? ॥వి॥ 3746
పరమజ్ఞానిని బంధించిననూ వాని ప్రాభవ మెట్లుపోవును ?

ఆ. మహిని నింతిబొక్క । మందుల బుట్టిరో
పాడఁ జదువ నేర్చుఁ । జూడఁజూడ
ఇంతకంటెఁ జేటె । దిఁక నేమి జ్ఞానమో ॥వి॥ 3747

"విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశ నా స్తేతి స్త్రీముఖ పంకజం సులలితం దృష్ట్వైవమోహం గతాః శాల్యాన్నం సఘృతం పయోదధియుతం యేభుంజతే మానవా స్తేషా నింద్రియ నిగ్రహో యదిభవే ద్వింధ్యస్తరే త్సాగరః"

ఆ. మహిమఁ దెలియలేక । మాయచేతను జిక్కి
జొచ్చి చూడలేని । సూక్ష్మరూపు
మహిమఁ దెలిసి నంత । మర్మంబు లేదయా! ॥వి॥ 3748

సూక్ష్మమైన బ్రహ్మమును తెలిసికొన్నచో ఆమీద తెలియదగిన దేదియు లేదు.

సీ. మహిలోన నొకయొంగ । మఱి కేకలిడుచును
మంచఁబు ద్రిమ్మఁగిన । మహిమ యేమి ?
మానుషవంతుఁడై । మహిమీఁద బాలుండు
ద్రమాను నమలినట్టి । మఱప దేమి ?
తొడరి దోమలు గిరి । నొడిసి పట్టియుఁ దాము
పరగ గతించిన । బలమ దేమి ?
పంచవన్నెల చిల్క । పరగ నైదును గూడి
పర్వతంబును దిన్న । బలము దేమి ?
గొట్టె దొడ్డిని బడి చెట్టు । బిట్టుఁ జూచి
విరులుపూచిన యట్టి యా । విధము దేమి ?
అరయ నేర్చిన సర్వజ్ఞు । లైనవారు
వివరముగఁ బల్కినట్లయిన । వినర వేమ. 3749

వేద వేదాంగములు కూలంకషముగా తెలిసి తద్వ్యాధునములు జీర్ణించుకొని శిష్యోపశిష్యులకు సూటిగా గురు కీలకము దెలియజెప్పిన విద్యాపారంగతులకు యీపద్యభావము విప్పుకొని గొప్పవారు గమ్మని మన వేమనయోగి సవాలుజేసెను.

ఆ. మాంస మన్నమునకు । మాటుఁ జేసికొనియు
మాంసము దినునట్టి । మాయజీవి
మాంసము చెడిపోవ । మాటెట్టులాడురా ! ॥వి॥ 3750

మాటు = పొదుగుట; మాంసముదినువారు నోటిరుచికి అన్నముతో కలిపి తిందురు.

ఆ. మాంసము దనలోన । మాటొనర్చక యుండి
మాంసము దిని యింద్రు । మాటలెల్ల
మాంసము విడువపైన । మాటెట్లు పోవురా ! 3751

"మత్స్య మాంసం మతిభ్రష్టః" మాంసము తినిన మత్తుగలుగును.

క. మాకున ననలముఁ బుట్టును
మాకెఱుఁగునె నవల మునికి ? । మనుజుల లోనన్
మాకున ననలంబు క్రియన్
లోకులలో యోగి వెలయు । లోలత వేమా ! 3752

మాకు = కఱ్ఱ; అనలము=అగ్ని; దారువునం దగ్ని, తనువునందు తత్వము ఉద్భవిల్లుట సహజము.

ఆ. మాచకమ్మని ఁదెలక । మగవాఁడు చేరితే
భుజములు చూపించు । బోర్లఁబడును
బోర్లఁబడి నంతట । బవిశాంపో నమా ॥వి॥ 3753

మాచకమ్మ = రజస్వల కానిది, వయసు పెద్దదయ్యును రజస్వల కానిదే మాచకమ్మ.

ఆ. మాటకేడ్చు నాలు । మగనికి యమదూత
తలచి చూడ విటునిఁ । దలచియేడ్చు
అట్టియాలి విడిచి । యడిది నుండుటె మేలు ॥వి॥ 3754

"నామృతం నవిషం కించి దేకాం ముక్త్వా నితంబినీం సైవామృత లతారక్తా విరక్తా విషవల్లరీ"
స్త్రీనివిడచిన అమృతములేదు విషంలేదు (భర్తృహరి)

ఆ. మాటచెరుపు మాట । మర్మమే కర్మము
ఆశలు కడగండు । లప్పు ముప్పు

పాపకారణములు । పలుకులు ములుకులు
లేశమైన తెలియ । లేరు వేమ. 3755

యమక నియమ చక్రవర్తియైన పోతనగారి సహాధ్యాయిత్వ మచ్చు టచ్చుట జూపించి తానుగూడ ధ్వనింప జేసుకొన్నాడు.

ఆ. మాట జెప్ప వినని । మనుజుండు మూర్ఖుఁడు
మాటవిన్న నరుఁడు । మాన్యుఁడౌను
మాటవినఁగ జెప్ప । మానుట కూడదు ॥వి॥ 3756

ఎవరు విన్నా వినకపోయినా మంచిని చెప్పుట మానవ ధర్మము

ఆ. మాట దిద్దవచ్చు । మఱి యెగ్గులేకుండ
దిద్దవచ్చురాయి । తిన్నసగను
మనసు దిద్దరాదు । మహి నెంతవారికి ॥వి॥ 3757

మనసుని దిదుటకు మరణమే గావలయును.

ఆ. మాట నిలుప లేని । మనుజుండు చండాలుఁ
డాజ్ఞలేని నాథుఁ । డాడు ముండ
మహిమలేని వేల్పు । మంటఁజేసిన పులి ॥వి॥ 3758

లోకానుభవమును ప్రాకటముగా చెప్పెడు వేమన.

ఆ. మాట మరుగు సిగ్గు । మనుజ లోకం బెల్ల
చీరె మరుగు సిగ్గు । చెప్ప నేల ?
బైట నింటి సిగ్గు । బండసంసారంబు ॥వి॥ 3759

తెలిసినట్లున్నదిగాని తెలియజెప్పుట క్షేమీ లేదు.

ఆ. మాటమిగులు నాలు । మగనికి యమదూత
యోర పడగ పాము । నుద్ది యగును
తనకుఁ గాని యాలు । దానవురాలురా ! ॥వి॥ 3760

యీ పద్యములో కవి శిల్ప యనే శాస్త్రానికి వేమన లక్ష్యము జూపించాడు.

కం. మాటల మాటలు వచ్చును
మాటలనే కలుగుచుండు । మణి మంతంబుల్

మాటల పొందికఁ దెలిసిన
మాటలనే ముక్తికలుగు । మహిలో వేమా! 3761

మాటలే మానవుని మంచి చెడుగులకు బాటలు.

ఆ. మాటలాడఁ గలుగు । మర్మము లెఱిఁగిన
పిన్న పెద్దతనము । లెన్నవలదు
పిన్నచేతి దివ్వె । పెద్దగా వెలుఁగదా! ॥వి॥ 3762

వయసునగాక ప్రాజ్ఞతగలవాడే పెద్ద.

ఆ. మాటలాడగఁవచ్చు । పాటపాడఁగ వచ్చు
పామునుఁ బట్టితా । వంచవచ్చు
మాయ లంజనుఁ బట్టి । మర్దించు టరుదురా! ॥వి॥ 3763

మాయ స్త్రీని బట్టి మర్దించుట. మనుజులకు సాధ్యము గాదు

ఆ. మాటలాడ నేర్చి । మనసు కరఁగకున్న
పరగు ప్రియముఁజెప్పి । పడయ కుండ
నొకరిచేతి సొమ్ము । దూరకవచ్చునా! ॥వి॥ 3764

తమాషాల వల్ల ధనాన్ని గుంజుకొనే డాంబికుల తంత్రములను వాడెను.

ఆ. మాటలాడ నేర్చి । మనసుఁ గరఁగఁజేసి
పరగ ప్రియము పుట్టిఁ । బలుకకున్న
నొకరి చేతి సొమ్ము । లూరక వచ్చునా? ॥వి॥ 3765

ఏమాటా చెప్పనిదే ఎవరూ యేమీ ఇయ్యరు.

ఆ. మాట లాడవచ్చు । మనసు నిల్పఁగలేఁడు
తెలుపవచ్చుఁ దన్నుఁ । దెలియలేఁడు
సురియఁ బట్టవచ్చు । శూరుఁడు గాలేఁడు ॥వి॥ 3766

సురియ = ఖడ్గము; ఖడ్గమును ధరించిన మాత్రాన గండడు గాలేడు.

ఆ. మాటలాడ వేఱె । మనసు కోలఁదివేఱె
యొడలి గుణము వేఱె । యోజ వేఱె
యెట్లు కల్గుముక్తి । యేలాగు తనలాగు ॥వి॥ 3767

తలొకదారిపోయిన తత్వము కుదరదు.

ఆ. మాట లాడుటొకటి । మనసులో నొక్కటి
యొడలి గుణమదొకటి । నడత యొకటి
యెట్లు కలుగు ము క్తి । యీలాగు తానుండ ॥వి॥ 3768

చెప్పినదొకటి, చేసినదొకటి యయితే గ్ధించేదేమి?

ఆ. మాట లుడుగకున్న । మంత్రంబు దొరకదు
మంత్ర ముడుగకున్న । మది కుదురదు
మనసు నిలుపకున్న । మఱి ముక్తిలేదయా ! ॥వి॥ 3769

ముక్తపదగ్రస్తములో ముక్తికాంత సౌధమునకు సోపానములు జూపించేడు.

ఆ. మాటలెల్లఁ గల్ల । మనసెల్ల దొంగయా
నేఁటి ప్రాణమింక । నేటి బ్రతుకు ?
మాట సత్యమైన । మఱి శతాయుష్యంబు ॥వి॥ 3770

సత్యవాక్యపాలనే సర్వోత్కృష్టమని చాటాడు.

ఆ. మాటలోని వాని । మహిమ తాఁదెలియక
మాటఁ దెలియలేక । మమత జిక్కె
మాటఁ దెలిసెనేని । మహితాత్మ యోగిరా ! ॥వి॥ 3771

మాటల మర్మము తెలిసిన వాడే వాటమగు యోగి.

ఆ. మాటవినని యాలు । మగనికి బందాలు
దానిఁ జేరఁ బ్రాణ । మానహాని
అట్టి యాలి విడిచి । యడవి నుండుటమేలు ॥వి॥ 3772

అనుకూలవతియైన ఆలు చతుర్విధ పురుషార్థ సాధనసోపానము ;

ఆ. మాట వినని యాలు । మగనికి మృత్యువు
నోర పడగ సర్ప । మొంటిగ్రహము
తనకుఁ గాని యాలు । దానవు రాలయా ! ॥వి॥ 3773

రాశిచక్రములో ఒంటిగ్రహముంటే మానవునికింటా వంటా తంటాలే !                (జ్యోతిష శాస్త్రము)

కం. మాటికి సైగలు చూపెడి
బూటకులను నమ్మరాదు । పూర్తిగ మదిలోఁ

జోకెఱిఁగి పూజ చేసినఁ
గోటీశ్వరతేజ మదియె । గుఱిఁగను వేమా ! 3774

గోటీశ్వర తేజము బాహాటముగా భావమును గుర్తించినవాడే పరముడు.

ఆ. మాటి కేవు లెల్ల । మనసులో బెట్టుక
మాదిగలను దెగడు । మాదిగెపుడు
మంచిగుణము లేక । మర్యాదయెట్లబ్బు ? ॥వి॥ 3775

“ గుణవాన్ సర్వత్ర పూజయేత్ ” సద్గుణములు గలవా డంతటా పూజ్యుఁడే !

క. మాతంగమునికి మనుమలు
భూతలమున బ్రాహ్మణులుగఁ । బొలుపగు నానా
జాతులఁ బుట్టిరి వీరలె
ఖ్యాతిగ నీధరణిఁ జెడియ । కదరా వేమా ! 3776

మతంగముని అల్లుడు వశిష్ఠుఁడు. అతని వంశమువారెవరు ?

ఆ. మాదిగ చెయువులను । మనసులో బెట్టుక
మాదిగలను దెగడు । మాదిగెపుడు
మంచిగుణము లేక । మఱి ద్విజుఁడెట్లగు ? ॥వి॥ 3777

మాదిగ చేష్టలు మనసులో బెట్టి మాదిగలను దూషిస్తుంటాడు.

ఆ. మాదిగ యనవద్దు । మఱి గుణమొనరిన
మాదిగని వసిష్ఠు । మగువఁ దేఁడె ?
మాదిగ గుణమున్న । మహి ద్విజుఁ డగునటే ? ॥వి॥ 3778

గుణము ప్రధానముగాని కులము కాదు.

ఆ. మాదిగ యనవలదు । మఱి వసిష్ఠునకును
మాదిగ చెలియెట్లు । మగువ యయ్యె ?
మాదిగ గుణమున్న । మహి ద్విజుండెట్లౌను ? ॥వి॥ 3779

వశిష్ఠుని భార్య అరుంధతి పతివ్రతాశిరోమణి ఆధర్మముతోనే అంతరిక్షములో నుండి పూజింపబడుతుంది.

మాదిగ యనఁగానె । మఱి తక్కువందురు
మాదిగ యిల సురల । మామగాదె
మాదిగకును బిడ్డ । మన యరుంధతిగదా ! ॥వి॥ 3780

మతంగ మహర్షి మహాజ్ఞాని దేవతలందరికీ మామ.

ఆ. మానధనము విడుచు । మఱి పుణ్యవతియైన
బూని పతికి భక్తి । పొసఁగఁ జేయు
లోన మెచ్చుచుండు । లోగుట్టుఁ గనవలె ॥వి॥ 3781

పతివ్రతయైన భామ భర్తను సదా ఆత్మలో పూజిస్తుంటుంది.

ఆ. మానసంబు మంచి । మరి పువ్వుచవికె
బాళితోడఁ జేసి । పట్టుగాను
భోగి నయ్యెద నన । బోయె పోకాలంబు ॥వి॥ 3782

పువ్వుచవికె = పూలపాన్పు ; పూలపాన్పుమీద శయనించు భోగి పవిత్రకాలమును పాడుచేసుకొంటాడు.

ఆ. మానసపు విరక్తి । మసలక యాత్మలో
బోడితలల సొంపు । పొల్పుమీఱ
కడుపు కొఱకు దిరుగు । కష్టంపు మదితోడ ॥వి॥ 3783

పొట్టకూటికి బోడితలలతో బూడిదలు రాసుకొని తిరిగే బూటకపు సన్యాసుల వేషాలను వర్ణించాడు.

ఆ. మానసమున మంచి । మల్లిపూల చవికె
బావితోటఁ జేసి । బాలఁ గూడి
భోగి నయ్యెద ననఁ । బోయెఁ బోకాలంబు ॥వి॥ 3784

మానస పూ పాన్పుపై ముక్తికాంతతో విహరించెద నని కాలము వృథాపుచ్చిన వానిజీవితము వృథాకదా !

ఆ. మానిని మనోజ । మందిరా నందైక
లోలుఁడొల్లఁడూర్ధ్వ । లోకసుఖము
మాలవాడ కుక్క । మఱి యన్న మెఱుఁగునా ! ॥వి॥ 3785

కాంతా భ్రాంతులతో కట్టుబడినవాడు కావలసిన పుణ్యానికి పూనుకుంటాడా !

వాక్యము :- మాను వొక్కటి, దానిపరి బీజ మొక్కటి, దాని మహిమలు శాఖలింతని చెప్పగూడదు. వేట్క విశద, మనోజ్ఞాన, విస్ఫుట, విపరీత మెంతని జెప్పవచ్చు ? తప్పక తనదృష్టి, తారక లక్ష్యముమీద తగుల వేసి, పటుతర జప, ము క్తి మార్గముల దెలసి, మూడుయేరులసందు మూలంబుదెలసి గంగ, యమునా నడుమను, భంగశిరమువంటి యొక్క బాలిక వున్నది. దాని శృంగార మహిమలు జెప్పను శ్రీహరికైన, అజునికైన వొప్పదది వొప్పించును. తప్పులు బట్టదు. యెవరికైన నొప్పును, మాయ లకు మొదలై యుగయుగములు నడిపించుటకు సగుణము తానై వాని వర్తన నడిపించుటకు, ఆయత తనయందు ఆయతముగను అది తల్లియో పెండ్లాము కూతురో చెల్లెలో ఆవల మేనత్తనో, తన చెలికత్తెనో, యేవిధమున జెప్పవచ్చు ? రామాకృతి సామాన్యము గాదు, దాని సరసోక్తులకు బ్రహ్మజ్ఞానులకు విటులకు పది పదునాల్గు భువన, మష్ట దిక్పాల కామర గంధర్వ సిద్ధ సాధ్యవ్యాస పరాశరులకు, నారద దత్తాత్రేయ నమర పుంగవాదులకు, దీని మూల కుతారంబు నే నెరుంగుదు. యీవేళ యీలీల వెట్టివేముడనగా యెఱుగరా త్రిమూర్తులవారి అంతరంబందు, అతి రహస్యమొకటున్నది. యింత జెప్పగనేల ! విన్నవారికి తెలివి, అనుకూలమాయెనా ! యనుభవము సిద్ధించు, వేమన్నకు అగ్రజుండు, అతని తమ్ముడు తారతమ్యముల తెలగెఱుంగును. మూడు మూరలవలెను ముప్పిరి గొన్నట్లు, అది రాజ్యము చేయ నాదినాథుడండ్రు. అదిరాజ్యము కాదు, మోక్ష రాజ్యంబున మాననినవారము మోస మెన్నడులేదు. మావంక యమునికైన గరిమ కింకరులకైన భావంబు విష్ణుమాయ, శివుని తేజంబు బ్రహ్మకుతారంబు, ప్రపంచమంతయు నేనెఱుంగుదు, కమ్మవిల్తుని రూపు ఘనమంతయు నేనెఱుంగుదు. యేమనిచెప్పుదు దీనివేట, ఆది మూలమందు అంబికా శివయోగి మూలగురుడు మాకు ముక్తిజూపె, అతని శిష్యుడైన వేమన్న అనుకొందురు. వెట్టివేముడనగ వెలుగించె నాగురువు. వుపదేశమున నొక్క వుపముచేత, తపశాంతకుండైన తమతండ్రి రెడ్డన్న, అతని కోడలెన్న మహి కీర్తివెలయు మల్లమ్మ,

మాతల్లి. తల్లి గాదది, మాకు తగిన వదినె. యిదిగో మల్లిఖార్జున వరము మాయింట వెలసెను, యిదిగో పట్టపగలు, మబ్బుగాదు, తెరలుబుట్టదు, యెఱుక చెడదు, మెరుపుదెగదు. నిగ్రహించిన ఫలము. నిజగురు శ్రీదయా వెట్టివేముఁడనగ యెఱుగరా యా నరులు విశ్వదాభిరామ వినురవేమా ! 3786

యీ వాక్యములో ముక్తికాంతను ఆమూలాగ్రముగా తెలియగోరు వారికి వివిధ విషయములను కూలంకషముగా వివరించినాడు వేమన.

ఆ. మామ కూతురితోడ । మెత్తగా మాటాడి
కన్నుసైగలుఁ జేసి । కలయ దలచి
యేకచిత్తముతోడ నెరుకిచ్చి చూడరా ! ॥వి॥ 3787

ముక్తికాంతను వశవర్తినిగా చేసుకొమ్మను వాక్యమిది.

కం. మాయకులోనై జీవుఁడు
కాయములను బొంది తన్నుఁ । గనెడి యుపాయం
బేయెడఁ దెలియక బహువిధ
మాయలె తానగుచుఁ దానె । మరుగును వేమ. 3788

మాయలోబడి మత్తుఁడగుచున్నాఁడు మానవుఁడు.

ఆ. మాయజగ మటంచు । మనుజుఁడెఱుఁగలేక
మాయలోనఁ దాను । మగ్నుఁ డయ్యె
మాయ దెలియు నరుని । మర్మజ్ఞుఁడందురు ॥వి॥ 3789

మాయ దెలిసికొన్నవాడే మర్మజ్ఞుఁడు.

ఆ. మాయజగ మటంచు । మఱి పల్కుచుందురు
మాయగాదు బ్రహ్మ । మయముఁగాని
మాయమైన జగము । మఱియెద నున్నదో ! ॥వి॥ 3790

మాయ జగమంటారు గాని మనలోనే యున్నది.

ఆ. మాయ జగములందు । మరి పల్కుచుందురు
మాయ గాదు బ్రహ్మ । మయము గాని
మాయమైన బరము । మఱి యెందు నున్నదో ! ॥వి॥ 3791

“ ఇంద్రోమాయాభిః పురురూపయీయతే ”
పరబ్రహ్మ అనేక మాయలు గలవాడు.

ఆ. మాయజగములోని । మమకార వృత్తిచే
మాయఁ దగిలి మంకు । మనసు విడక
మదముచేత గురుని । మహినెట్లుకంచురు ? ॥వి॥ 3792

మదముచేత గురు మహిమ మానవులు కనలేరు.

సీ. మాయ ద్రొక్కెడు దారి । మర్మంబులివి యని
తెలియఁజెప్ప వినరు । తేటగాను
జనులందఱును బుద్ధి । చాంచల్యమును మాని
జాగులేక వినరు । జగతిలోను
విన్నమాత్రము లోనె । విజ్ఞాన మమరును
బాపాత్ములు వినరు । పట్టుగాను
కామ్య కర్మంబులుఁ । గడుఁ జేయుదురు కాని
కరుణించి వినరుగా । కలియుగమున

గాన నీగోప్య మెఱుఁగని । కలుష మతులు
బ్రహ్మమేనని భావింపఁ । బ్రాలుమాలి
నరకకూపము గందురు । నయముగాను
బోధ విన్ననె యమరెడి । బుద్ధివేమ. 3793

"ఇదంప్రపంచం నాన్యద్వానోత్పన్నం నోస్థితం తథామాయా కార్యాదికం నాస్తి మాయానాస్తి భయంనహి వంధ్యాకుమార వచనే భీతిశ్చేత్ అస్తిదం జగత్ (తేజోబిందోపనిషత్తు)

గొడ్రాలి బిడ్డ ఎలా చంపలేడో అలాగే మాయా జగత్తు నిత్యము గాదు.

"ఆది మధ్యావసానేషు మా - యా - సా = మాయా" (శృతి)
ఆది మధ్యాంతములు లేనిదే మాయ.

ఆ. మాయ నరకమనుచు । మాయ రోయక సాటి
సమముఁ గనరు దేవ । సభల యందు
నందఱు ఘనులైన । హరునకుఁ దావేది ? ॥వి॥ 3794

యింతమంది ఘనులదగ్గర ఈశ్వరునకు తావెక్కడ.

యను చెఱసాల । మనసను గొలుసును
ననెడు బొండ । బెరసి యుండ
ఇట్టి బద్ధజీవి । కెన్నడు మోక్షంబు ॥వి॥ 3795

"మాయ" నే చెరసాలలో మ్రగ్గినవానికి మోక్షానికి మార్గమేది ?

ఆ. మాయ నెఱుగఁక నరుఁడు । జ్ఞానంబు తెలియక
మాటలందున నెట్లు । మర్మమెఱుఁగు ?
మర్మంబుఁ దెలియక । కర్మంబు విడుచునా ? ॥వి॥ 3796

మర్మము తెలియకపోతే కర్మము తెలియదు.

ఆ. మాయ నేనుగుఁ జేసి । మనసుచే పట్టించి
దిగువ దింపక దాన్ని । బిగువుతోడ
పదుగుర నెక్కించి । కుదురుగా దోలరా ! ॥వి॥ 3797

దశేంద్రియములతో మాయా మత్తగజాన్ని నీవశము చేసుకో !

ఆ. మాయపోవు విధము । మనుజుండు దలచిన
మంచి మార్గ మబ్బు । మానవులకు
మాయ దాటలేని । మనుజుండు వ్యర్థుండు ॥వి॥ 3798

మాయను దాటుటకు మనుష్యుఁడు ప్రయత్నము చేయవలయును
అదే మానుషధర్మము.

ఆ. మాయ భయము లేని । మనుజుండె మనుజుఁడు
మాయలో మునుంగ । మనుజుఁడగునె ?
కాయ ముడుగునపుడె । మాయయు నుడుగును ॥వి॥ 3799

కాయముతోనే పోవును మాయ.

తే. మాయమగు లోకభ్రమ లెల్ల । మట్టుపరచి
సర్వదృష్టిలో నెంచి । సాక్షిగాను
నిర్వహించుట ముక్తికి । నిజ పథంబు ॥వి॥ 3800

సమదృష్టి గలిగినవాడే మాయను సమయజేస్తాడు.

తే. మాయమగు జగద్భ్రమ లెల్ల । మట్టు పఱచి
సర్వసమ దృష్టిలో నెంచి । సాక్షి గాను

నిర్వహించుట ముక్తికి । నిజ పథంబు
గర్వము వహింపనేదైన । గలదె? వేమ. 3801

గర్వము సర్వము జెరచును.

ఆ. మాయ మనసెయయ్య । మనసు మాయయెగదా
మాయ దెలిసినతఁడు । మహిమ గనును
మాయలోని మాయ । మఱి పరంజ్యోతియా! ॥వి॥ 3802

"ఓంకారధ్వని నాదేన వాయుసంహార నాత్మకం
నిరాలంబ సముద్దిస్య తత్రనాదో లయం గతః (శృతి)
మానము వహింపక ప్రణవముసిద్ధింపదు.

గీ. మాయ మమకారమును ద్రుంచి । మరిగి నంత
గర్మ కడగండ్లఁ జెప్పను । గాలుఁ డెటుఁగు
దీనిఁగని మెలఁగెఁడువాఁడె । ధీ జితుండు
మాయఁ గనకున్న గతులెల్ల । మాయ వేమ. 3803

మాయను మడియించిన కాలుఁడు కడగా యుండవలసినవాడే ?

గీ. మాయ మమకారమును ద్రుంచి । మరిగినంత
గర్మ కడగండ్లు చెప్పను । కాలుఁడెటుఁగు
దీనిగని మెలఁగెడువాఁడు । ధీజితుండు
నాయతుల్ లేనిచో గతుల్ । మాయ వేమ. 3804

యమదర్శనము కాకుండా ఉండాలంటే మాయను సమయించుటే మారము.

ఆ. మాయ మాయు నపుడు । మదినిల్చి జ్ఞప్తిలోఁ
గాయమనెడు దానిఁ । గానఁబోడు
న్యాయముగను జ్ఞప్తి । నంటునుదత్వంబు ॥వి॥ 3805

"మాయాంతు ప్రకృతిం విద్యా మాయినంతు మహేశ్వరం
తశ్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్"
మృత్యుంజయుడగు శివుఁడే మాయాతీతుఁడు

ఆ. మాయ యని రోసి । మమతల మాసిన
జేయు క్రియలెల్ల బయలున । జెందగోరి
స్వస్వరూపము గనువాఁడె । సజ్జనుండు ॥వి॥ 3806

సకల మాయలకు చిక్కనివాడే సజ్జనుడు

ఆ. మాయయె చెరసాల । మనసె యోజింపఁగ
బెద్ద శృంఖలంబు । భేద మిలను
ఇట్టి బద్ధపదవి । కెన్నఁడు మోక్షంబు ? ।వి॥ 3807

బంధిఖానలో ఖైదీవలె మాయావరణములో బడి మసలువాడు మనుజుఁడు.

ఆ. మాయరూపు రూపు । మాయగాఁ జేసియు
మాయరూపును బెను । మాయఁ జేయ
మాయలోని మాయ । మఱి పరంజ్యోతియా ॥వి॥ 3808

పరంజ్యోతిని పట్టుకోవాలన్న మహామ్మారియైన మాయను గిట్ట చేయుము.

క. మాయలకిరవై కొందఱు
మాయలు చూపించి మదిని । మరలింతురు గా
మాయకు వెలియగు చిత్తముఁ
బాయక గురునిష్ఠ బూన । బలపడు వేమా ! 3809

మాయాతీతుఁడైన గురుమంత్రమే కైవల్యాన్ని చేకూర్చే మహా సాధనము.

క. మాయల సంసారముకై
మాయలనే తిరుగుచుండు । మనుజుఁడులోనై
మాయలఁ దెలిసిన యంతట
మాయలనే ముక్తి కలుగు । మహిలో వేమా ! 3810

మాయలలో మసలి మాయను తెలిసినవాడే మహాత్ముఁడు. మనమహా కవి యట్టివాడే !

ఆ. మాయ లోకమన్న । మర్మంబుఁ దెలియక
మాయఁజిక్కి యెంతొ । మాయఁ బడిరి
మాయఁ దెలియ దివ్య । మాయ తా జన్మంబె ॥వి॥ 3811

మాయను జించి మనసును పెంచి మించిన వాడే ఎంచదగినవాడు

ఆ. మాయలోనఁ బుట్టి । మాయచేఁ జిక్కియు
మాయచేతఁ బూర్వ । మతిని మఱచి

మాయలోన నరుఁడు । మఱి యాకలికిగాను
ఏడ్చునపుడు పరుల । కెఱుక వేమ ! 3812

మాయాపంక మగ్నుడగు నరుఁడు జేయగల దానిని చేయలేడు.

ఆ. మాయలోనఁ బుట్టి । మాయలోనఁ బెరిగి
మాయఁ దెలియలేని । మనుజుఁడేల ?
మాయ దెలియువాఁడె । మహిమీఁద ధన్యుండు ॥వి॥ 3813

ధన్యత్వం పొందాలంటే మాయను తగులబెట్టుటయే దారి

ఆ. మాయలోని మాయ । మర్మంబుఁ దెలియరా !
మనసులో తీఁగె । మలయు చుండు
తీఁగెలోని వ్రేళ్లు । త్రిపురతాండవ మాడ ॥వి॥ 3814

మనోఫలకంమీద మాయాతీతమైన శక్తిని పరికించ మన్నాడు.

ఆ. మాయ లోను బుట్టి । మాయలోను బెరిగి
మాయ విడువలేక । మగ్నులైరి
తొల్లి చేయు కర్మ । తొలఁగి పోవఁగనీదు ॥వి॥ 3815

పూర్వకర్మ పోవాలంటే మాయను మాపుజేయాలి

క. మాయా విద్యల ఁజూడకె
మాయల కిరవైన యెఱుక । మర్మముఁ గనకే
మాయా విద్యల జాలము
బాయమె జీవేశ్వరులకు । జాతము వేమా. 3816

"తీర్త్వా మోహార్ణవంహత్వా రాగద్వేషాది రాక్షసాన్
యోగీ శాంత సమాయుక్తో హ్యాత్మారామో విరాజతే"
ఆత్మ సాక్షాత్కారముపొందేయోగి మోహమును మరచును (ఆత్మబోధ)

క. మాయావిద్యలె తోడగు
న్యాయములో గుఱుతుఁదెలిసి । నాకముఁగనినన్
మాయా విద్య లడంగియుఁ
బాయక బ్రహ్మైక్యమగును । బనుపడి వేమా. 3817

అజకర్ణ, గోకర్ణ, గజకర్ణ, టక్కు, టమారవిద్యలే మాయావిద్యలు,

ఁ యిల్లని మా పొలమని
కాయము తన సొమ్మటంచుఁ । గామాతురుఁడై
మాయని పదవినిఁగోరక
దాయాదుల పాలుచేయఁ । దగదుర వేమా. 3818

" నాది, నాది " యనే దేదీలేదు.

ఆ. మాల కన్నియలకు । మంచి రూపంబున్న
ముట్టెనే త్రిశంకు । పట్టి నాఁడు
కానిపనులు సేయ । ఘను లాస పడుదురా ! ॥వి॥ 3819

నీచమయినది ఎంతనేర్పుగా కానబడిన మనీషులు చేరనీయఁరు (హరిశ్చంద్ర).

ఆ. మాలదాని యింట । మంచి నీళ్లనుబోవు
తురకదాని యింటి । త్రుళ్లిపోవు
ముచ్చువాని యింట । చచ్చినపోవునా ! ॥వి॥ 3820

పరిశుభ్రతను గురించి బాగుగా చెప్పేడు.

ఆ. మాల ద్రిప్పుచుండి । మంత్రంబు సనుగుచు
మది నిఁకేమొ తలప । మహిమ మున్నె ?
బుద్ధి నిలుకడున్నఁ । బున్నెంబు సేకూరు ॥వి॥ 3821

జపమాల త్రిప్పి జాగరము చేసిన సన్యాసులకు జ్ఞాన మబ్బుతుందా !

ఆ. మాల మాంసము దిను । మహిమీఁద జనులెల్ల
కొవ్వుతిండరొక్క । కులము గాదె
కులములెల్లఁ బాసి । కులముగాఁ జూడుఁడీ ॥వి॥ 3822

అందరూ మాంసపు భక్షులే ! పాలు పశువులలోనుంచి వచ్చినవే !

ఆ. మాల మారిదిగాఁడు । మహిమీఁద నే ప్రొద్దు
మాట తిరుగువాఁడె । మాల గాక
వాని మాలయన్న । వాఁడె పో పెనుమాల ॥వి॥ 3823

మాట తప్పిననే మాలతనము వస్తుంది.

ఆ. మాలమేలు గుణము । మంచిది కలిగిన
మాలకూడు గుడుచు । మనుజు కంటె
గుణమె మేలుకాని । కులమేమి మేలురా ! ॥వి॥ 3824

గుణమె ప్రధానముగాని కులముగాదు.

ఆ. మాల యంటనుచును । మఱి నీళ్లమునిగిరి
మాల కర్మచేత । మాలఁ డాయె
ఏల దెలియలేరొ ? । యీ నరపశువులు ॥వి॥ 3825

తన పనిచేత కులము వచ్చింది.

ఆ. మాలవా డంటితే । నీలలో మునుగును
కాటి కేగిన వెనుక । కాల్చు మాల
అప్పుడంటిన అంటు । యిప్పుడెందేగెనో ! 3826

అస్పృశ్యతాభావము అణచమని చెప్పేడు.

ఆ. మాల వాఁడయినను । మఱి యాత్మమీఁదను
మనసు నిల్పెనేని । మాలగాఁడు
మనసు నిల్పకున్న । మహిమీఁద మాలఁడే ॥వి॥ 3827

మమకారములో మణిగినవాడే మాల.

ఆ. మాలవానిఁ జూచి । యేల నిందింపంగ
పాటిలేని మాట । పలుకుటె గద
వానిలోన బలుకు । వాని కులంబేది ॥వి॥ 3828

మహాత్మగాంధీ యిందుకే వీళ్ళను హరిజను లన్నాడు.

ఆ. మాలవానిఁ జూచి । యేల నిందింతురు
తూలు మాట పలుక । దొమ్మయేమొ
ఆకుఁజూచి పలుకు । నతని కులంబేమి ? ॥వి॥ 3829

ఆకు = బ్రహ్మవ్రాత; దేవు డందరినీ ఒక్కలాగే పుట్టించాడు. ఇందు తారతమ్యమేదీ ?

ఆ. మాలవాని నంటి । మఱి నీళ్లమునిఁగెరే ?
మనుజ కర్మచేత । మాలఁడయిన
నేలఁ దెలియలేరొ । యీ నరపశువులు ॥వి॥ 3830

ముట్టుకొని అంటనుకొని మురికినీళ్ళలో మునిగిన మీ ముట్టు పోవునా?

ఆ. మాలవాని నేల । మరి మరి నిందింప ?
తోలు మాంసములను । తుదకు తినక
క్రొవ్వుతినెడి వారిఁ । గులముగా జూడండి ॥వి॥ 3831
పశువుల క్రొవ్వుతో సిసరైన నెయ్యిచేసి తింటున్నారు కాదా !
వ మాంససారమే !

ఆ. మాల వాని నేల ? । మహిమీఁద నిందింప
నొడల రక్తమాంస । మొకటి కాదె
వానిలోన మెలఁగు । వాని కులంబేది ॥వి॥ 3832
సర్వత్రా వ్యాపించిన సర్వేశునికి కులమేదీ ?

ఆ. మాలవాని నైన । మరి యాత్మమీదను
మనసు నిలిపెనేని । మాలగాఁడు
మనసు నిలుపకున్న । మహిమీద మాలఁడే ॥వి॥ 3833
మహేశుని పూజింపని మంకువాడే మాలఁడు.

ఆ. మాలవాని యంటు । మంచినీళ్ళనుఁ బోవు
తురకవాని యంటు । త్రుళ్ళిపోవు
ముచ్చురాలి యంటు । చచ్చినఁ బోదురా ! ॥వి॥ 3834
కులమత దోషాన్ని కూల ద్రోసి దుర్గుణాలను దూరంగా జేయ
మన్నాడు మన విజ్ఞాన సాగరుఁడు.

ఆ. మాళ్ళు వెంటరావు । మణులు వెంటనురావు
ఆలు, బిడ్డలు హితు । లరయ రారు
తాను నిచ్చు నీవి । తనవెంట వచ్చురా ! ॥వి॥ 3835
తనుజేసిన ధర్మము తక్క తదితరమేదియూ తనవెంటరాదు.

ఆ. మ్రాఁకు కాలవేసి । మహి మీఁద నొకజాణ
పూని తిరుగుచుండె । బొందుగాను
కాల్చినట్టి మ్రాను । కడురమ్యమై యుండె ॥వి॥ 3836
విచిత్రవిడికథ వేదాంత విజ్ఞానము యీపద్యములో నిమిడ్చి వేమన
చెప్పాడు.

కం. మ్రాఁకున ననలంబుండును
మ్రాఁకున నా యనలమువలె । మనుజుల లోనన్
డీకొని తా రంజిల్లును
నేకంబగు బ్రహ్మముండు । నేర్పడ వేమా! 3837

దారువు నందగ్నివలె, మానవులలో మహేశు డిమిడి ఉన్నాడు.

కం. మ్రాఁకున ననలము పుట్టును
మ్రాఁకెఱుఁగునె? యనలమునికి । మనుజుల లోనన్
మ్రాఁకున ననలము క్రియఁ-జీ
కాకుడిగిన యోగి నెవరుఁ । గానరు వేమా! 3838

శరీరములోనున్న సర్వేశ్వరుని తెలియుటకు జ్ఞానవేత్త కర్త

ఆ. మ్రాఁకులోన నగ్ని । మఱి యుండఁగావచ్చు
నగ్నిలోన మ్రాని । కలవి గాదు
మ్రానులోన నగ్ని । మర్యాద సంసారి ॥వి॥ 3839

సంసారిలో మర్యాద చక్కగా యిమిడియుండును.

ఆ. మ్రాను తగినదైన । మహిఁతమా వస్తువు
గా నొనర్తునట్లు । కాక యున్న
కాల్తురట్లె కాదె । కాపురుషుల పాట్లు ॥వి॥ 3840

కాపురుషులు = నీచులు ; పనికిరాని మ్రానువంటి వారే నీచులు

ఆ. మ్రాను దిద్దవచ్చు । మఱి వంకలేకుండ
దిద్ద వచ్చు రాయి । తిన్నగాను
మనసు దిద్దరాదు । మహిమీఁద నెవరికి ॥వి॥ 3841

మానవ భావములు పూనికగా వెతికి వెలికి తీసి విజ్ఞానుల కందించు నేర్పు వేమనకే గలదు.

ఆ. మింటనంటి యున్న । మినుకు చూడఁగఁ బూని
అంటలేక కొంద । అవిసి పడిరి
కంటి నంటు జ్యోతి । కానంగ లేరయా! వి॥ 3842

అవిసి = నిరుత్సాహపడి ; కంటి నంటియున్న జ్యోతిని కానలేక కొందరు కళవళముపడుదురు.

క. మితములు చెల్లిన నాఁటికి
మృతిబొందిన నిలువరాదు । మేటులకైనన్

వేఁటికి భయపడుదురు
తనూజీవంబుఁ జూడఁ । జయ్యన వేమా! 3843
యుద్ధాయము నిర్ణయించుట యెవ్వరికీ అలవిగాదు

క. మితములు సద్భాషణములు
హితములుగాఁ బలుకు వాని । నెల్లరుఁ గడు స
న్నుతు లొనరించుచు (మొక్క దు
రితరాలాపములు వినఁగ । నేవగు వేమా! 3844
సరసోక్తులు చిలికే వాని ముఖము దిద్దని అలంకారము.

ఆ. మిరపగింజఁ జూడ । మీఁదనల్లగ నుండు
కొరికి చూడ లోనఁ । జురుకు మనును
సజ్జనులగు వారి । సార మిట్టుల నుండు ॥వి॥ 3845
సజ్జనుల సామర్థ్యము విజ్ఞానుల కొజ్జబంతి.

సీ. మీకు మారుఁగఁ బోవఁ । జేకొని పుష్పముల్
గుహలోన నున్నట్టి । గురునిఁ గాంచి
అయ్య వచ్చితి నని । చయ్యనఁ బూలిచ్చి
సాష్టాంగ పడఁగ నా । సద్గురుండు
నా మోముఁ జూచుచు । నేమి వచ్చితి వన
నభిరామ శిష్యుండ । నంపి రంటి
అంతటఁ దలయూచి । "యహహా" యనుచువారు
కానిమ్ము రమ్మని । కరుణతోడఁ
జేసె నుపదేశమయ్యది । చెందె నాకు
సూక్ష్మకాలంబులో సిద్ధ । సూరినైతి
గురువు, వదినెయె కాక నా । గురుఁడ వీవు
నాత్మగురుఁడయ్యె శివయోగి । యంటి వేమ. 3847
సూరి = పండితుఁడు ; ఆత్మగురువు = ఉపదేశమువారు; గురువు = మార్గదర్శకుఁడు; మహాకవి తన స్వీయచరిత్రలోని మంత్రోపసిద్ధి ఘట్టమును పట్టుగా చెప్పికొని లంబికా శివయోగిని, అభిరామయ్యనూ, వదినెగారిని తరతమ భేదగురువులుగా తలచుకొని గురుభక్తిని వెలయించుకొన్నాడు.

ఆ. మీాటరక్క సందు । బైట నగ్గి నడుమ
మేటి రాగిఁ దెచ్చి । మెఱయ కరగి
కూటమెఱుఁగు వాఁడు । కోటికిఁబడగెత్తు ॥వి॥ 3848

రాగిని బంగారముగా చేయు యోగమిందున్నది. విధానము తెలిస్తే మన మీావిధముగా ఉంటామా!

ఆ. మీాఁది యాకెఁదీసి । మిగులఁ బెద్దలమని
కానరాక తిరుగు । కర్మజనులు
బైలుఁ గోరి నట్లు । భావంబుఁ గోరరు ॥వి॥ 3849

తల గొరిగించుకొనుటయే ముండనము అని బౌద్ధమత పరిభాష. తలలు బోడులైన తలపులు బోడులా?

ఆ. మీాసముండి నంత । మేటి మగండని
మోహంబు లంజెల । మోహ పడుచు
మాంసంబు దిను పెద్ద । గాడిద చందాన ॥వి॥ 3750

యీాపద్యము అతుకుల బొంతగా అయోమయ కవులతికి వేమన కంటగట్టారు.

ఆ. ముండగోష్ఠి చేత । మునుగుచు తేలుచు
నుండ వలయు మోహ । ముండు దాక
అండ బాసి నపుడు । ఆసింప బనిలేదు ॥వి॥ 3851

ఆదారము లేకున్న నిరాధారమే.

ఆ. ముండఁజూచి నంత । మొగమోటమిని గంద్రు
ముండ కూడుఁదినక । ముక్తిలేదు
ముండకూటి కెల్ల । మూలంబె కాదయా! ॥వి॥ 3852

ముండ = చాముండేశ్వరి; యీాయమయే ధాన్యాధిపతి. యీామెను (గూర్చియే "కేదారేశ్వర" వ్రతము చేయుదురు. (సంప్రదాయ కవిజ్ఞానము).

ఆ. ముండను బొడఁగన్న । మోహంబు పడుదురు
ముండకూడు దినక । ముక్తిలేదు
ముండమోపి వల్ల । మూలంబుగాధకు ॥వి॥ 3853

ముండ = భార్య కాక ఉంపుడుకత్తె; "ఉండతిన్న వాడు ముండను మరగినవాడు" సాధారణంగా విడువడు.

ముండ ముసుఁగుఁబెట్టు । మూఁడు ముడులువేసె
ముండ జూడ కున్న ముక్తి లేదె?
కాంతకు ఁగళవచ్చెఁ । గ్రమమున నెట్లకో! ॥వి॥ 3854

భర్త చనిన ముండకు ఎలా పుకల్లు గునని మన నారి నమ్మకము. ముక్తి ఖండను బట్టినవాడు తేజోమండను డవుతాడు.

ఆ. ముండ మోపి కేల? । ముత్యాల సాపట
వన్నె లెల్ల ఁబుణ్య । వతికిఁగాక
కుక్క యేపి కేలఁ? । గుచ్చుల పల్లంబు ॥వి॥ 3855

పల్లంబు = పల్లకీ: ముండమోపి = మొగుడు చనిన కాంత; జన సముదాయములో నున్న మాటలూ అనుభవాలు, పొదిగి హృదయాలలో హత్తినట్లు చెప్పే నేర్పు వేమనకే గలదు.

ఆ. ముండ మోపితోడ । మునుఁగుచు ఁదేలుచు
నుండగానె మోహ । ముండేఁగాక
అండఁబాయు వెనుక । నాయాశ లేలేవు ॥వి॥ 3856

కలిమీ బలిమీ యున్నంత సేపే ముండమోజు

ఆ. ముండ మోపివల్ల । ముగ్గురు జన్మింప
బండజగము లోన । భ్రమయ నేల?
ముండమోపిఁ జంపి । మొదటి ముగ్గురిఁజంపి
నిండుమగనిఁ దెలిసి । నిలువువేమ. 3857

ముండమోపి = ఆదిశక్తి; త్రిమూర్తుల జన్మకు కారణమైన దివ్య శక్తిని వర్ణించాడు

(శక్తి పురాణం)

ఆ. ముండల దగుగోష్టి । మునుఁగుచుఁ దేలుచు
విడువలేరు సుమ్మి । వెఱ్ఱి నరులు.
అండఁబాయు వెనుక । నవిసియు బోవురా! ॥వి॥ 3858

మోహాంధులు ముండల వలపులలో జిక్కి మురియుటయే గాని ముందువచ్చిన గతి తెలియలేరు.

క. ముందరి పోటులు మాన్పను
మందెందైనను గలుగుగాని । మహిలోపల నా

నిందల మాటలు మాన్పెడు
మందెందైన నను గలుగునొక్కో । మహిలో వేమా ! 3859

పోట్ల గొడ్డు పోట్లు మార్చుటకు నూటియున్నదిగాని దుష్టప్రచారకుల నరికట్టుటకు త్రోవలేదు.

ఆ. ముందు కోపిని జూడ । మొదట నమ్మఁగవచ్చు
మర్మ గోపిని నమ్మ । కర్మ మెచ్చు
అధిక కోపిని నమ్మ । ఆత్మకే మెచ్చురా ! ॥వి॥ 3860

ప్రథమకోపి ఉపకారియే!?

ఆ. ముందు జ్ఞాన మెల్ల । మోసమై శిశువులు
కర్మ బంధనమునఁ । గానలేక
జనన మరణములకు । సాదృశమైవచ్చి
యిహము నందుఁబుట్టు । లెఱుఁగు ! వేమ. 3861

జనన మరణములు చక్రమువలె పరిభ్రమిస్తుంటాయి. వాటి నరికట్టినవాడే అధ్యుడు

ఆ. ముక్తిఁగాన లేని । మూర్ఖ జనుల కెల్ల
బట్టబయలు చేసి । పరను పదము
దారిఁ జూపి నతఁడు । దైవంబుతానయా ! ॥వి॥ 3862

మూర్ఖులకు ముక్తిఁజూపిన వాడే ముఖ్యమైన దేవుడు.

ఆ. ముక్తి మార్గ మునకు । మూలమై తగునట్టి
గ్రంథమంత జనులు । వ్రాసి చదువ
విన్న వారి కెల్ల । విభవంబు కలదయా ! ॥వి॥ 3863

వేమనపద్యములు విన్ననూ, వ్రాసిననూ, చదివిననూ భోగభాగ్యములు పూర్తిగా కలుగునని మా పూజ్యుని ఉఫశ్రుతి.

ఆ. ముక్తి యెవరి సొమ్ము ? । ముక్కు మీఁదుగఁజూడ
భక్తి యెవరి సొమ్ము ? । భజనసేయ
శక్తియెవరి సొమ్ము । యుక్తిచే సాధింప ॥వి॥ 3864

ముక్తి, భక్తి, శక్తి మాటను పంచ ప్రాసములు చేర్చి ఆటవెలదిని గూర్చి అమృతోపమానమైన మాటలచే రసికుల కాసక్తి జూపించాడు మీరసి కావతంసుఁడు

తే. ముక్కు, కన్నులు, చెవులంటి । మూయనేల?
తెలివి తెరగంటి లోపలఁ । దేటపఱచి
తిరుగ నేర్చిన వాఁడెపో । ధీజితుండు
ఊరకయ మూయ డంబంబు । లౌర వేమ. 3865

మూర్ఖత్వముగా ముద్రలు వేయుట కంటే లోనూక్తిని అంటిన బ్రహ్మమును విలోకించుటయే విజ్ఞాన విశేషము.

ఆ. ముక్కుఁ గోపములును । మోహాలోభంబులు
నక్కజంపు గ్రూర । మధికమయ్యెఁ
గక్కసంబుచేతఁ । గాలుని వలనను
మొక్కవోదురుతుది । మొనసి వేమ. 3866

"క॥ కాలుని దండన పడుచును వాలాయము ధర్మకర్మ
వర్గము విడిచే వేళలదలచుచు మూర్ఖులు
జాలింబడి దూలి యేడ్వజరిఁగాఁడిదేమో"

తే. ముక్కు, గోరును, సద్గంధ । ములను నల్లై
చెవులు, జర్మంబుఁ, గన్నులు । జిహ్వామొదలు
ఇన్నియును గోరునటువంటి । యిల్లురోసి
తన్నుఁగనుఁగొని సుఖయింపఁ । దగును వేమ. 3867

శారీరకాంగములు అభిలషించే అభిరుచులు విడచి మానశికాభిరుచి రోత్తమమగు సత్తును హత్తియుండమన్నాడు.

ఆ. ముక్కుఁజేయు పుణ్య । ములను చేయఁగలేరు
ముక్కు యెన్నటికిని । ముందునిలిచి
మోక్షసాధనకొఱకు । మూలమైయున్నది ॥వి॥ 3868

ముక్కు తుద దృక్కు నిల్పుటయే ముముక్షాపేక్షులకు ముఖ్యము

ఆ. ముక్కుత్రాళ్ళ గ్రుచ్చి । ముఱికి పోవఁగఁదోమి
కచ్చు నీరునించి । కడిగి కడిగి
డొక్కతోమినంత । దొరుకునా మోక్షంబు ॥వి॥ 3869

దేహశుద్ధివలన దివ్యత్వము రాదు.

ఆ. ముక్కు తుదను దృష్టి । ముదముతోడుత నిల్పి
హృదయమందుఁజూడ । నెసఁగుముక్తి
పదవి మెఱుఁగుఁగన్నఁ । బరమాత్మ యోగియా ॥వి॥ 3870
భూచరీయోగమున ముక్కుతుదను దృక్కునిల్పుదురు.

ఆ. ముక్కు తుదను దృష్టి । మురువుగా నిల్పి తా
నరసి నరుఁడుఁజూడ । పరముఁగల్గు
పరముఁ దెలియువాఁడు । బంధంబు దెగఁగోయు ॥వి॥ 3871
రెండు చూపులను ఏక చూపుగా జేసిన పరము గల్గును.

ఆ. ముక్కుపట్టి యీడ్చు । ముండను జేపట్టి
తిక్కయెత్తి నరుఁడు । తిరుగుఁగాక
యెక్కడి తలిదండ్రు । లేమియు దనకేల ! ॥వి॥ 3872
భర్తను లాంగ తీసే భార్యతో కాపురము పలు పాట్లకు ఆస్థానము.

ఆ. ముక్కుమీఁద దృష్టి । మురువుగా నిల్పిన
నురము మీఁదఁ జూడ । నుండుఁ బరము
పరము దెసకు నుండుఁ । బరమాత్ముఁడా యోగి ॥వి॥ 3873
హృదయ పీఠములో నున్న జ్యోతిని సదమలగతితో జూచుటయే సుగతికి మూలము.

ఆ. ముక్కుశ్వాసమునను । మ్రోయుచుండును గాలి
ముక్కు వాసనలకు । మొనయుచుండు
తిక్కవిడిచి చూడఁ । దీఱును భ్రమలెల్ల ॥వి॥ 3874
స్వరమును సక్రమ మార్గములో నడుపుటయే మహితుని లక్షణం.

తే. ముక్కులకు నేలఁ బెట్టడు । మూఢజనుఁడు
దూదిమూటఁ బోలిన తన । దొడ్డ కడుపు
నించుచుండును సతమని । నిత్యముగను
కడుపు తన్నుద్ధరించునె ? । కడకు వేమ. 3875
కడుపు కక్కుర్తి వారు కానిపనులు చేయుదురు గాని ఘనులను జూడలేరు.

ముక్కోణ శిఖరమున గుఱిఁ
దక్కఁగఁ బరిపూర్తిఁజెంది । ధైర్యము విడకే
సొక్కియు, సోలక, యుండిన
నిక్కపుఁగైవల్య మదియె । నిజముగ వేమా! 3876

భ్రూమటిని ఏకబుద్ధితో నిల్పిన కైవల్యప్రాప్తి కరతలామలకము.

ఆ. ముఖముఁ జూచినంత । మోహంబు ఘనమాను
దిస మొలను గనంగ । దీఱునద్ది
కూడిన నలుపెల్ల । గుస్తరింపఁగ రాదె ॥వి॥ 3877

నలుపు = కుమము; చూపుల, చేష్టలమాత్రముచే కామాతురులు సంతుష్టి చెందుదురు.

ఆ. ముగురిలోననెచ్చు । ముందుగానఁగ లేక
నరకమునకుఁబోవు । నరులు గలరు
ముగురి కందనట్టి । మూలమూర్తి యొకండు ॥వి॥ 3878

త్రిమూర్తులకు అందరాని దివ్యఫలమే పరంజ్యోతి.

ఆ. ముగురు మూర్తులున్న । మూలభావ మెఱిఁగి
మూలవానితోడ । ముచ్చటాడి
సత్తు చిత్తులోని । సారంబుఁ దెలియరా ! ॥వి॥ 3879

త్రిమూర్త్యాత్మకమైన "సత్తుచిత్తుల" మధ్యగునుచిత్తమును హత్తించుము.

ఆ. ముగ్గు రధికులనుచు । ముందు గానఁగ లేరు
కానలేరు నరులు । కానలేరు
ముగురుఁగూడి యొప్పు । మూల మొక్కటి సుమీ ! ॥వి॥ 3880

ముగ్గుర మూలము మోహిని యగు ఆదిశక్తి

ఆ. ముగురి నెఱుఁగునట్టి । మూలంబు నెఱిఁగియు
ముగురిమీఁద నొకటి । మునుపు తెలిసి
పరఁగ జిహ్వచేత । బ్రస్తుతి చేయరా ! ॥వి॥ 3881

ఆదిశక్తిని యథాశక్తిగా ఆరాధించమన్నాడు మన అధికుఁడు.

ఆ. ముగురి లోన హెచ్చు । ముందు గానఁగలేక
నరకమునకుఁ బోవు । నరులు గలరు
ముగురి కందని । మూలమూర్తి నొకండు ॥వి॥ 3882

తర్కవాదులు త్రిమూర్తుల హెచ్చుతగ్గులకై తికమకలు పడుటజూచి వీళ్లకంటె అతీతముగలదని చెప్పెను.

ఆ. ముగురుండునట్టి । మూల మెఱింగియు
ముగురిని నొకటిగ । మొదటఁ దెలిసి
పరగు జిహ్వతోడఁ । బ్రస్తుతిఁ జేయరా ! ॥వి॥ 3883

ముగ్గురియొక్క మూల మాది శక్తి. ముగ్గురిని భావించి మూలశక్తిని పట్టుమన్నాడు.

ఆ. ముగు రెఱుఁగనట్టి । మూల మెఱింగియు
ముగురిమీఁద నొకటి । ముందె తెలిసి
పరగ జిహ్వతోడఁ । బ్రస్తుతి చేయరా ! ॥వి॥ 3884

జిహ్వను శ్రీపరంజ్యోతిని ప్రస్తుతించి సార్థకము జేసుకో

ఆ. ముజ్జగంబులఁ జూచి । మూడు గుణంబుల
మూల వస్తువులను ముట్టఁజేసి
మూటిలోన నున్న । ముక్తినిఁ గనవచ్చు ॥వి॥ 3885

త్రిమూర్తుల మూలమే ముక్తి

ఆ ముజ్జగముల దశలు । మూడయ్యె శోధింప
మూఁటనొకటె కలుగ । మూటరోసి
మూటిలోన నుండు । ముక్తిని గంటిరా ? ॥వి॥ 3886

సృష్టి, స్థితి, లయములలోనున్న సూత్రాన్ని గుర్తించుటయే మోక్షము.

ఆ. ముజ్జగములు వెదక । మూడువస్తువు లన్న
మూఁటిలోన నున్న । ముక్తిఁ దెలిసి
ముక్తిలోని ముక్తి । ముందుగాఁ బొడగను ॥వి॥ 3887

" సముక్తో సర్వలోకేషు వేదవేదాంత నిశ్చితం
మహాత్మా సర్వశాస్త్రాణి పార్వత్యాచ ప్రతిష్ఠితం "

బ్రహ్మాండ మంతెయూ పార్వతిచే సృష్టింపబడినది.

ఆ. ముట్టి మనసు గుట్టు । మూలమంచుట భక్తి
పట్టుపడని ముక్తి । పరమునాక
నిట్టనిలువుగాను । నిలఁద్రొక్కిచూడరా ! ॥వి॥ 3888

"చిదాత్మా సర్వదేహేషు వ్యాప్తతే జ్యోతిరూపకం
తజ్జ్యోతి చక్షురగ్రేచ గురునేత్రేచ పశ్యతి."

గురు విచ్చు నేత్రముతో జగజ్జ్యోతిని పరికింపుము.

ఆ. ముట్టు చాకలికిని । మును మంగలికి నంటు
కురులుమోపి దేవి । గుడికిఁ జేరు
మ్రొక్కులన్ని చేరు । మొగి విశ్వకర్మకు ॥వి॥ 3889

ఒక్కొక్క మూఢనమ్మకానికి ఒక్కొక్క మ్రొక్కు చెల్లిస్తారుమూర్ఖులు.

ఆ. ముట్టు ముట్టుటన్న । మూలదాగుదురేల ?
ముట్టులోనె పుట్టె । మూఢజనుఁడు
ముట్ట గుట్టుఁ దెలిసి । ముని మానమును దాల్చె ॥వి॥ 3890

యోని సంభవులు యోచన తెలియక అంటు ముట్టులని అంతటా వాదిస్తారు.

ఆ. ముట్టు ముట్టనుచును । ముట్ట రావందురు
ముట్టున కుదరేమి ? । మూలమేమి ?
నవ బిలముల ముఱికి । నరులకందఱకును
పుట్టగానె పుట్టు । ముట్టువేమ ! 3891

నవద్వారములనుండి నానారకముల ద్రవము స్రవించినదానికి మర్మస్థాన మలముగురించి యింత పంపపట్టెమి ? యని కవి వాక్కు.

ఆ. ముట్టులోనె పుట్ట । ముగ్గురు మూర్తులు
ముట్టు రక్తమాయె । మొదట ప్రకృతి
ముట్టులోని గుట్టు । మొనసి గురుండెఱుగు ॥వి॥ 3892

త్రిమూర్తులు గూడా ప్రకృతియోనిసంభవులే !

ఆ. ముట్టులోనె పుట్టె । ముట్టంటునకు రోసి
వట్టి తీర్థమాడు । వారుగాక
ముట్టుకుండ నీళ్ళ । ముంచిన శుచియౌనె ? ॥వి॥ 3893

శరీరమే ముట్టుకుండ. దీనిని మూర్ఖులు ముట్టంటూ రెందుకూ ?

ఆ. ముట్టులోనె పుట్టి । ముట్టులోనె పెఱిగి
వట్టి తీర్థమాడు । వారలెల్ల
ముట్టునీళ్ళలోన । ముంచినఁ బోవునా? ॥వి॥ 3894
పుట్టి పెరుగుటకు ముట్టే మూలము.

ఆ. ముట్టు సాకిచేరు । మోదు కుమ్మరి చేరు
నెంగిలెల్లఁజూడ । మంగలికిని
ప్రొక్కులెల్లఁ జేరు । మును విశ్వకర్మకు ॥వి॥ 3895
సాకి = చాకలి; ఎవరికి చేరవలసిన ముడుపులు వారివే!

ఆ. మునిగి బ్రాహ్మణుండు । ముందు గానకపోయె
తిరిగి తిరిగి జోగి । ద్రిమ్మరాయె
కూసి కూసి వాది । కుక్కయైపోయెరా! ॥వి॥ 3896
బ్రాహ్మణుఁడు, జోగి, అతివాదులు అసలు తెలియక అయోమయంలో నుంటారని మన అనుభవవేద్యునువాచ.

ఆ. ముద్ర చేతఁబట్టి । మొదటఁ దెలియలేక
విశ్వకర్మఁబట్టి । విడువలేక
విశ్వకర్మఁదిట్టు । వెఱ్ఱులు వడుదురో! ॥వి॥ 3897
ముద్రా భావముల లోని మూలముల వీక్షించి ముక్తిని పొందమన్నాఁడు.

ఆ. ముద్రలన్న నేమొ? । మురిసెద రయ్యయో!
భద్రముగను మనసు । పరగకున్న
వెఱ్ఱి చేష్టలగును । వివరింప ముద్రలు ॥వి॥ 3898
ముద్రాభావముల మూలము భద్రముగా తెలియలేకపోయిన వెఱ్ఱి చేష్టలు గావా!

క. ముద్రాభ్యాసత నగు గుఱి
భద్రమతిం జూడఁగానె । భ్రమ లడిగించున్
సద్రూప కళల మించిన
చిద్రూపమె నిర్గుణపుఁ । జింతన వేమా! 3899
“యథోక్తా ద్విదళాకారం చతుర్నామేతి కథ్యతే
తన్మధ్యే సర్వసారంచ దర్శయిత్వా ముద్రభావనః”
యథోక్తముగా ముద్రాభావముల చిద్రూపుని పట్టుము.

ఆ. ముదిత నడవి నుంచి । మును లేడి వెన్నంటె
రామచంద్రు కన్న । రసికుఁడేడి !
పొలుపు తొలఁగు । వేళ బుద్ధులట్లుండురా ! ॥వి॥ 3900

“ వినాశకాలే విపరీతబుద్ధిః ” (రామాయణం) చెడు కాలములో
తపు బుద్ధులు పుట్టును.

ఆః ముదితవలపుఁజూడ । మోహింత్రు వారల
చెంతఁ జేరఁగానె । చెడును మనసు
వింతభ్రమ గుణంబు । కాంతఁ జూచినఁజాలు ॥వి॥ 3901

కాంతలను జూచి యినుప కచ్చడాలే కదులుతా యన్నారు
మహాత్ములు.

ఆ. ముద్దుగుమ్మ కేల ? । ముసలి మగఁడు మది
వశముగాక విటుని । వలను జిక్కి
వెఱ్ఱి ముద్దుసకును । వేదశాస్త్రములేల ! ॥వి॥ 3902

వియ్యముగాని, కయ్యముగాని, నెయ్యముగాని సమానమయితేనే రాణింపు,

ఆ. ముద్దులాడనిచ్చు । మూతి కొరకఁగ నిచ్చు
చల్ల బొక్కనుఁ బెట్టి । బొడవనిచ్చు
మునులకు రుచిదెలక । వనగుహాల నుందురు ॥వి॥ 3903

యిహ కాంతల నొల్లక పర కాంతల స్పర్శకొరకే పరమ మునుల
తపస్సేమో !

ఆ. మునిఁగి బ్రాహ్మణుండు । ముందు గానకపోయె
తిరిగి తిరిగి జోగి । దిమ్మరాయె
కూసి కూసి మాల । కుక్కయైపోయెరా ! ॥వి॥ 3904

మాలము తెలియక చేలలగువారి లీలలు వర్ణించాడు.

ఆ. మునిఁగి, మునిఁగి, మునిఁగి । ముద్దయై, ముద్దయై
వనరి, వనరి, వనరి, । వక్కి, వక్కి
తిరిగి, తిరిగి, తిరిగి, । దిమ్మరై యుండురా ! ॥వి॥ 3905

“ అతి సర్వత్ర వర్జయేత్ ”
అతిగా వర్తి సుతారాము అంటదు.

ఆ. ముని జనములు కలుగ । మునిఁగి వెళ్ళినబావి
బ్రహ్మకుఁ దలలెత్త । రానిబావి
మొలల బంటిగాను । ముంచు నెవ్వరినైన ॥వి॥ 3906

అందరికీ తెలిసేవిషయాన్నే సుందరమైన భావసూక్తులతో మంద మతులనుగూడా ఆనందపరచే శక్తి వేమనదే!

క. మును దావలచినఁ జిక్కును
దన వలపదిలేక తన్నుఁ । దాఁ గానఁ డిలం
దనదు పటాటోపంబులు
దనమాయలు బనికిరావు । ధరలో వేమా! 3907

జారిణి తనంతటతానే వలచి రావాలిగాని తాను వలచుట తన్నులుదినుటకే.

ఆ. మును దెలిసినవారు । మొగి నష్టమైరిల
తిరిగి చెప్పితనుచుఁ । దిట్టవలదు
తెలియఁజెప్పిన నీకుఁ । దెలిసికో లేరయా! ॥వి॥ 3908

"యదార్థవాదీ లోకవిరోధీ"

ఆ. మున్ను నిన్నుగన్న । ముఖ్యులెవరో? వారి
సన్నుతింపుమయ్య । సంతతమును
జ్ఞాన దాన మొసఁగు । ఘనుఁడు నంతటివాఁడె ॥వి॥ 3909

తల్లిదండ్రులు, గురువును దైవములగా భావించమని ంచాడు.

క. ముప్పదిరెండక్షరముల
ముప్పిరి గొన్నట్టి మూల । ముం దెలిసినచో
దెప్పునఁ గడ తేరఁగ నగుఁ
జెప్పితికద మహిమ నీకుఁ । జెల్లును వేమా! 3910

"రాజరాజరాజేశ్వరీయోగం శేషమార్గం ప్రశశ్యతే
యఃపఠేత్సతతం భక్త్యాః సముక్తో నాత్ర సంశయః"
రాజ రాజేశ్వరీయోగం సతతము పఠించినవారికి ముక్తిగలుగును.

ఆ. ముమ్మారు దినువాఁడు । భువిని గార్దభజీవి
యిరుమారు దినువాఁడు । యింటి జీవి
ఒకమారు దినువాఁడు । వరయోగ జీవిరా! ॥వి॥ 3911

"యిగుప్రొద్దు గుడుచుచు యెడనెడ గుడువక నుండు నాతండు సదోపవాసి" (భారతము) యిదే శ్రేష్ఠమగునది.

ఆ. ముఱికి కొంపలోన । నిఱికించి జీవునిఁ
గర్మపాశములను । గట్టివేసె
నిట్టి కర్మజీవి । కెట్లకో ? మోక్షంబు ॥వి॥ 3912

మలమూత్రముల కొంపలో కళపెళలాడే కర్మజీవికి కైవల్య మెట్లబ్బును ?

ఆ. ముఱికితోలు కంత । మూలంబె మది చింత
నరక మబ్బఁజెంత । నలుగు డెంత
పరముఁగోరినంత । బయలగు వింతరా ! ॥వి॥ 3913

అంత్యనియమాలంకారముతో ఆదర్శము జూపిన సహజ కవి సార్వభౌముని సహాధ్యాయు డనిపించుకొన్నాడు.

ఆ. ముఱికి నవబిలముల । మొనసి కారంగాను
బరమపావన మని । పలుకు టెట్లు ?
తోలుబొమ్మలాట । కీలుఁ దెలియలేరు ! వి॥ 3914

నవరంధ్రములు గల నానావికార తోలుతిత్తిని కాదనుట నాయ నమ్మమాటలు గావా !

ఆ. ముఱికిలోనె పుట్టి । ముఱికిలోనే పెరిగి
ముఱికి తనువునకునె । మురిపెమేల ?
ముఱి కెరిగినవాఁడు । ముఱికిలోఁ బుట్టునా ! ॥వి॥ 3915

పుట్టి పెరిగే గుట్టు తెలిసినవా డిక పుట్టడు.

ఆ. ముఱిగి తిరిగి నరుఁడు । మరలుకొన్నను గాక
అందువలన నేమి । యాశలేదు !
అంతరాత్మ నిలుప । నతఁడె పోతానాట ॥వి॥ 3916

అంతరాత్మ నిల్పినవాడే అసలుయోగి.

ఆ. మురియువా డెవండో ! । మురియని దెవ్వఁడో ?
వాటుఁజేసి చూడ । బట్టబయలు
సొరిది జలఘటమున । సూర్యుని చందంబు ॥వి॥ 3917

ఛాయాపురుష లక్షణములు చర్చించాడు.

ఆ. ముష్టి వేపచెట్టు । మొదలుగాఁ బ్రజలకుఁ
బరగ మూలికలకుఁ । బనికివచ్చు
నిర్దయాత్మకుండు । నీచుఁ డెందులకును
బనికిరాఁడు గదర । పరగవేమ. 3918

నిర్దయాత్ముఁడు స్పర్ధలు పెంచుటకే

ఆ. మొసలి కంటి నుండి । ముదుసలి నీళ్ళాడె
భూతవరులు చేరి । పురుడుఁ బుచ్చ
భూతవరులు వచ్చి । పురుడేమి పుచ్చిరో ? వి॥ 3919

మెట్టవేదాంతులకు యిట్టి పట్టులు గుట్టులుగా ఉండును

ఆ. ముసలిముండను బట్టి । ముక్కు మొదటికిగోచె
కండ్లు రెంటికి రెండు । ముండ్లు బొడిచి
పాడుబావిని ద్రోసి । పైని బండెయ్యరా ! ॥వి॥ 3920

దురాశను పరాకు లేకుండా నాశము చేయమన్నాడు.

ఆ. ముచ్చుగుడికిఁబోయి । ముడి విప్పనేకాని
పొసఁగస్వామిఁ జూడఁ । బోఁడతండు
కుక్కయిల్లుసొచ్చి । కుండలువెతకదా ! ॥వి॥ 3921

ముచ్చు = దొంగ ; ధీరులు సహితులు తెలుసుకొని నూరులగుటకు
వేమన సూక్తులు యుక్తముగా నుంటాయి

ఆ. ముచ్చుయాత్రకేగి । ముల్లె విడుచు గాని
మొక్కుబ్రొద్దు లేదు । మొనసియెపుడు
కుక్క యిల్లు సొచ్చి । కుండలు మోయునా ! ॥వి॥ 3822

వ్యర్థముగా వ్యయము చేయుట గాని సిద్ధించే దేదీ ?

ఆ. మూఁటను విడిపించి । మూఁటను గ్రహించియు
మూఁట, మూఁట, మూఁట । మొనలఁ గోసి
మూఁట, మూఁట, మూఁట । మొనసిన దత్వంబు ॥వి॥ 3923

త్రివేణులు, మండలత్రయము, సచ్చితానందాదులు, దానాదులు,
నాడులు త్రిమూర్తులను తెలియుటయే తత్వము.

క. మూఁటికి మూలంబై నది
ధాటిగ గుర్తించి మించు । ధావళ్యమునకున్
సూటిగ మించిన తత్త్వముఁ
జాటింతురె? యచల మనుచు । సరసత వేమా! 3924

మూటికి మూలమయినదే ముక్తి కాంత

ఆ. మూఁటి నాగ్రహించి । మూఁటి విసర్జించి
మూఁట మూఁట మూఁట । మొదల రోసి
మూఁట మూఁట మూఁట । మొనయగాఁ దత్త్వంబు ॥వి॥

"అకార, ఉకార, మకారములను దెలిసి కళబిందు, నిష్కళల నెరిగి ఇడా పింగళ సుషుమ్నల గుర్తించి అగ్ని, చంద్ర, సూర్యమండలములను తరచి తత్ప దత్వంపద అసిపదములందుటయే తత్త్వము.

ఆ. మూఁటి నీషణముల । మొదటికిఁ జెరపక
చిత్త మేల నిలుచు । స్థిరముగాను
చిత్తశుద్ధి లేక । శివుఁడు కాన్పించునా? ॥వి॥ 3926

చిత్తశుద్ధిగలవానికే శివసాయుజ్యము గల్గును.

ఆ. మూఁటి నీషణముల । పోడిమిఁ జెడుపక
చిత్త మేల? నిలుచు । మొత్తముగను
చిత్తత్రయము గాక । ముక్తి యెట్లుగలుగు? ॥వి॥ 3937

యీషణత్రయములు నీసడించి చిత్తభ్రాంతులనడచి ఉత్తమయోగివికమ్ము.

ఆ. మూఁడు గుణములంటి । మూలంబుఁ గనవలె
వీలుగాను త్రిపుటి । వెలయనొక్కి
త్రాడు ద్రొక్కి పాముఁ । దలచిన చందమౌ ॥వి॥ 3928

"సర్పరజ్జుభ్రాంతి పడుట సమయులకే! సర్పరజ్జు భ్రాంతి = త్రాడును జూచి పామను భ్రాంతితో భయపడుట.

ఆ. మూఁడుగుణములందు । ముఖ్య గుణంబును
దెలియలేనివాఁడు । దెలయు నెట్టు?
భ్రమల బడినవాఁడు । బలువెఱ్ఱి యగుధర ॥వి॥ 3929

వెఱ్ఱిభ్రమల జెందక విజ్ఞానవేత్తవు కమ్ము

ఆ. మూఁడు గుణములన్ని । మొనసి యొక్కటిచేసి
యారుచక్రముల న । టంటఁ గూర్చి
స్థిరముగాఁగ నుండ । శివతత్వ మందును ॥వి॥ 3930

గుణముల నడచి షడాధారములతో శంభు నర్చింపుము

ఆ. మూఁడు గుణము లరయ । ముఖ్యమై యుండును
మూఁడుగుణములకును । మూల మొకటి
మూఁడుగుణములెపుడో । ముంచు నెవ్వరినైన ॥వి॥ 3931

త్రిగుణా లెప్పుడైనా తెంపరితనముతో ముంపక మానవు

ఆ. మూఁడుగుణములొకట । మొదలనే యుండఁగాఁ
గలిపి మూలఁబెట్టి । తెలియలేక
భ్రమల బడ్డవాఁడు । బలు వెఱ్ఱివాఁడకో! వి॥ 3992

గుణత్రయములకు గ్రుంగినవాడే కర్మసంగుడు.

తే. మూఁడుమూలల కందని । మొదట నిలిచి
వేడి యష్టాక్షరంబుల । జాడలెఱిఁగి
యాడికూడెడి కైవల్య । మందవలెను
గూడ నానంద మమితమై । కుదురు వేమ. 3933

అష్టాక్షరీ మహామంత్రము నానందముతో జపించినవాడే ఆ మోక్షమైనవాడు

ఆ. మూఁడు లోకములను । మొనసి యొక్కటిచేసి
యారు తావరముల । నంటఁగూర్చి
స్థిరముగానె యుండు । శివమూర్తి గురుఁడయా! ॥వి॥ 3934

ఆ. మూఁడు విడిచిపెట్టి । మూడు గ్రిశముఁజేసి
మూఁటి మూఁటి మూఁటి । మునుఁగఁ జేయ
మూఁట మూఁట మూఁట । మొనయును దత్వంబు ॥వి॥ 3935

గుణములను విడచి నాడులను నయమార్గమున నడిపించి ఆత్మ పర
మాత్మ ఆనందము ననుభవింపుము.

ఆ. మూఁడువేళలందు । ముదముతో శివునాత్మ
పూజసేయువాఁడు । పుణ్యమూర్తి
పూజలేక మోక్ష । భోగంబు దొరకునా! వి॥ 3936

ముప్పొద్దులూ ముకుందుని పూజించి మోక్షము పొందుము.

ఆ. మూఢ జనులకెల్ల । మూలమై తగుయోగి
తారకంబుగాను । దైవరూపు
బట్టబైలుచేసి । పరమాత్మఁ జూపఁడో ! వి॥ 3937

తారకమునకు దారి తెలుసుకొని ధన్యుఁడవు గమ్మని మన వేదాంతి విజ్ఞాపన.

ఆ. మూఢభక్తిచేత । ముక్కంటిఁ బూజించి
మొన్నబోయి నరుండు । ముక్తుఁడాయె ?
పూజకేమివచ్చు । బుద్ధి ప్రధానంబు ॥వి॥ 3938

సరియైన బుద్ధితో సలిపిన భక్తి సత్ఫలమే యిస్తుంది. తిన్నడు గాథ విన్నారుగా !

కం. మూఢాత్ములైన మనుజులు
గూఢంబును దెలియలేక । గుఱిఁగనలేరా !
గాఢాంధకార దూరుని
రూఢిగ జేరంగఁగలుగు । రూఢము వేమా ! 3939

ప్రౌఢ పదములను రూఢముగా నిగూఢమైన భక్తి ప్రబోధము గాఢంగా చెప్పాడు మన సుకవి.

ఆ. మూలచక్రమట్టి । మొనసిఁ గట్టిగఁబట్టి
శోధచేసి శక్తి । చొరవఁ దెలిసి
భేదపఱచి మనసు । భేదింప ముక్తుఁడౌ
సాధకుఁడగుయోగి । సరణివేమ. 3940

మూలాధార చక్రమును కీలుఁదెలసి బంధించిన లీలావిలాసుడు లో ఓలలాడుచుండును.

ఆ. మూల చేరితే గఁదా । ముక్తి చండ్లనుచేత
ముద్దులాడుచు బట్టి । మొత్తవచ్చు
మూల చేరగఁబోతే । ముద్దు లాడేదెట్లు ? ॥వి॥ 3941

ముక్తికాంతను రక్తి చేపట్టి ఆసక్తితో అనుభవించిన ఆనందమునకు మేరలేదు.

తే.మూలబ్రహ్మమునకు । ముగ్గురు మూర్తులు
బుట్టికాలమెల్లఁ । బ్రోదిగడిపి
చచ్చిపుట్టుచుంద్రు । జగములోమాయచే ! ॥వి॥ 3942

విశ్వస్వరూపునందు విష్ణు యీశ్వర బ్రహ్మలు తెలసి విశ్వాతీతులయిరి.

క. మూలముఁ దెలియక కొందఱు
చాలగ యోగంబులెల్ల । సాధింత్రుగదా !
జాలమునక యీ విద్యల
మూలము నూహింపఁగలుగు । మోక్షము వేమా ! 3943

మూలబ్రహ్మను తాలూకు మొదటి పట్టుతెలిసి గుట్టుగా ముని ముఖ్యుఁడవు కమ్మి

ఆ. మూలమెవ్వరనుచు । ముగ్గురిలోఁగల
మూలమెఱుఁగలేరు । మూఢ జనులు
మూలము ముగురికిని । ముఖ్యమైయుండఁగా ॥వి॥ 3944

ఆదిశక్తి స్వరూపమే ఆధారభూతమయినది.

ఆ. మూలవిద్యయందు । ముఖ్య తేజములోన
మెలఁగు జిత్వరుండు । మిహిరు పగిది
గాలకర్మములకు । గాలుఁడే సాక్షిరా ! ॥వి॥ 3945

మిహిరుఁడు = సూర్యుఁడు: మోహాంధకారమును మొత్తాలన్న బాలసూర్య కాంతులే ప్రబలాలి.

కం మూలాధారములోపల
జాలగ బంధించి గాలి । సాధనఁగనరా !
యేలనో ధారణ సేయుట
మూలము మదిఁ దెలియుటెల్ల । ముఖ్యము వేమా ! 3946

స్వరసంపత్తి ఉత్తమ దాంపత్యమువలె హత్తించి సంచారము జేస్తే చిత్తానికి ఉత్తలపాటుండదు.

ఆ. మృగ మదమ్ము చూడ । మీఁదనల్లగనుండు
బరిఢవిల్లు దాని । పరిమళంబు
గురువులైనవారి । గుణము లీలాగురా ! ॥వి॥ 3947

మృగమదము = కస్తూరి; ప్రజ్ఞావంతులు బాహ్యములో నిరాడంబరులుగా నుంటారు.

ఆ. మృగము మృగములనుచు । మృగముల దూషింత్రు
మృగముకన్నఁజెడుగు । మూర్ఖుఁడౌను
మృగమునకగు గుణము । మూర్ఖునకును లేదు ॥వి॥ 3948

మృగము = ఆవు; పశువునకున్న గుణములు పాపిష్టివానికుండవు.

ఆ. మృగములకు నరులకు । మేలుగాఁ బశువులు
తినగ దున్నఁబాలు । కొనఁగఁబుట్టి
కష్టపడునువాని । కర్మమీాఁడేర దే ॥వి॥ 3949

పశువులకు గూడ కర్మ యేర్పడి బాధించుచున్నది.

క. మృగములు మృగముల నడుగవు
తగనడుగవు పక్షిజాతి । తనసరివానిన్
మగ వాఁడడిగిన నియమి
మగవాఁడా! మగువగాక । మహిలో వేమా! 3950

ఒరులపై యాధారపడినవాడొక మానవుడా?

క. మృత్తికయే తన తనువట
మృత్తిక దళమెత్తి నిలుప । మేటివసతియా
మృత్తికయున్నది మూఁటికి
నెత్తెరువుల ధరణిమహిమ । నెఱుఁగరు వేమా! 3951

మృత్తిక = మన్ను; నెత్తుట = ప్రాయుట; వసతి = నివాసస్థలము.

క. మృదుమధుర వాక్యములతో
విదితంబుగఁ దెలుపఁగోర । వివరించెద నేఁ
దుదిమొదలు గుఱుతులేనిది
మదిఁదోచెడి బయలె యనుచు । మరుగుము వేమా! 3952

తీయనిమాటలు తేటతెల్ల భావములు వాటనుగు రసములో గలపి
మానవాళికి కందములద్వారా జీవనము లందించాడు వేమన.
కందము = మేఘము, పద్యము; జీవనము = నీరు, ప్రాణము.

తే. మెక్కఁజేసేడువాఁడును । మేయిమరప
నిద్రఁబోఁజేయువాఁడును । నిఖిలగతులఁ
జూపి యిల బద్ధులనుజేయు । సూక్ష్మరూపుఁ
డా మహాదేవుఁడేకదా! । యనని వేమ. 3953

సర్వమునకు సర్వేశ్వరుఁడే కర్త.

ఆ. మెఱపు మెఱయగాను । మేఘమునకుబల్మి
కదిసివానగలుగు । గణుతిగాను
మెఱపుమెఱయకున్న । మఱివానలౌసున్న ॥వి॥ 3954

అన్ని శాస్త్రాలతోపాటు ఖగోళ శాస్త్ర విజ్ఞానం గూడ కంఠస్థము జేసి తన కవిత్వములో అచ్చటచ్చట కలిపేడు వేమన.

ఆ. మెఱుగుముద్ర జూడ । మేలౌను కీడౌను
మెఱుగుముద్రలోని । మేలిమరసి
మేలి మనుభవించి । మేటియై దనరుము ! ॥వి॥ 3955

మేటివి కావాలంటే మెరుగు ముద్రనే జూడుము.

ఆ. మెలగి జ్ఞానమయుఁడు । మితి మీఱుచుండడు
ఉనికి విడఁడు తాను । నుపము నొందు
తనువు మఱచి మించి । తత్వజ్ఞుడుండును ॥వి॥ 3956

జ్ఞానమయ తత్వజ్ఞుల తారతమ్యాన్ని పారము ముట్టినట్లు జెప్పేడు.

ఆ. మెలగి మన్మయుండు । మితిమీఱుచుండెడి
యునికి విడక తాను । నుపమునందు
తనువు మఱచి మించి । తత్వజ్ఞుఁ డగునయా ! ॥వి॥ 3957

మన్మయుడు=మనస్సులో బ్రహ్మమును జూచి తన్నుమరచేవాడు.

ఆ. మెలఁత నడవినుంచి । మృగము వెంటనెపోమె
రామచంద్రుకన్న । రసికుఁడేడి ?
చేటు కాలమునకు । చెడుబుద్ధి పుట్టును ॥వి॥ 3958

గతుల ననుసరించి మతులు పోవుననుటకు యీపద్యమే సాక్షి
(రామాయణము)

తే. మెలఁతుకల మిన్న పతిభక్తి । మీఱదెపుడు
పతిని మదిలోనఁ బూజించు । బరముగోరి
యుతముసద్గతిఁ గోరుటే । యువిదకగును
వన్యమృగమట్టు పోరుఁ గన । వలయువేమా ! 3959

భర్తయందు భక్తి, పరపురుషుల యందు విరక్తి, గురుసేవలయందు ఆసక్తి, ఉత్తమోత్తమ గుణసాధనములందు యుక్తి, సంసార నిర్వాహణ యందు శక్తి పతివ్రతకుండును.

ఆ. మేక గుదియ గట్టి । మెడచన్ను గుడిపిన
నాకలేల మాను । నాశగాక
లోభివాని నడుగ । లాభంబు కలుగునా ! ॥వి॥ 3956

లోభివాని నాసించుట మేక మెడ చంటిపాలు పితుకుట వంటిది.

ఆ. మేక చంకఁబెట్టి । మెలగుచు మందలో
భ్రమసి తిరుగు గొల్ల । పగిదిగాను
దేవు నెఱుఁగక పెర । దేవతలఁ దలంచు ॥వి॥ 3961

తెలివి తక్కువ దద్దమ్మల తిరుగుళ్లను తెలియజేసాడు.

కం. మేకలు మూకలు సనినను
బ్రాకటముగ నొక్క కోతి । పర్ణంబెక్కెన్
ఆ కపులు నూఱుచనినను
కోకోయని కొంకనక్క । కూసెర వేమా ! 3962

మేక = అజ = బ్రహ్మ ; కోతి=హరి = విష్ణువు ; కొంకనక్క = శుభకరమైనది = శివుఁడు ; యుగప్రళయములో ముగ్గురు మూర్తులు చేయు ముఖ్యమగు విషయములు చెప్పెడు.

(వేదవేదాంగముల సారము)

ఆ. మేఘ మడ్డమైన । మిహిరుని జెఱచును
చిత్త మడ్డమైన । శిరము జెఱచు
మరపులడ్డమైన । మహిమను జెరుచురా ! ॥వి॥ 3963

ప్రజ్ఞా విజ్ఞానము లార్జించిన భవ్యులకైనా మందత కలిగించు మాయ తెర యొకటికద్దు.

ఆ. మేఘమడ్డమైన । మిహిరుని జెఱుచును
జిత్త మడ్డమైన । స్థిరతఁ జెఱచు
మఱపు లడ్డమైన । మఱి ముక్తిఁ జెరుచురా ! ॥వి॥ 3964

ఎంతటి ఆధిక్యతకైనా అడ్డుండుట సహజము.

కం. మేఘుని యాడంబరమును
న్మేఘములో నుఱుము మెఱుము । మెఱవడి పిడుగున్

మేఘుని నానెడి భావము
మేఘాడంబరముఁ దెలియు । మేదిని వేమా ! 3965

"ఘ" కారప్రాసము కవులకు కకవికలు చేయును. యిట్టి దుష్కర ప్రాసలవాడే దొడ్డకవి యయ్యాడు. మేఘమాల, పర్ణపణి, అను రెండు గ్రంథాంతరభావము చెప్పెను.

కం. మేఘోద్భవ వివరంబును
మేఘములో నుఱుము మెఱుము । మెండుగ బిడుగుల్
మేఘం బనియెడి భావము
మేఘాంధము బైలుఁ దెలియ । మెప్పగు వేమా ! 3966

హృదాయాకాశంలో నుద్భవించిన మేఘనాదాన్ని మిన్నగా తెలుసుకొనమన్నాడు.

ఆ. మేడిపండుఁ జూడ । మేలిమై యుండును
బొట్ట విచ్చిచూడ । బురుగు లుండు
బెరుకువాని మదిని । బింక మీలాగురా ! ॥వి॥ 3967

తొలిపలుకుల సారాన్ని తెలుగు నుడికారములతో గుదిగూర్చి భావాన్ని పేర్చి ప్రఖ్యాతిగాంచిన వాడు వేమన.

ఉ. మేదినిలేని వాదములు । మిక్కుటమైన బలంబులేదులే
నాదుగ గాలి లేనియెడ । నవ్యము మేఘము గప్పదంతగా
బోధయు లేక సద్గురుని । పుత్రుఁడవౌదని దానకృత్యమా
వాదులఁబోక యుండుమిఁక । వచ్చునదెల్ల నెఱుంగు వేమనా ?

వాదోపవాదములు ప్రజ్ఞావంతులకైనా ఖేదము నిచ్చును.

ఆ. మేషముఖుని దక్షు । మిగులు వారలఁ గన్న
శివుని దూషకులకు । సిగ్గులేదె ?
రంకుబడవఁ గనియు । రంకాడ నేర్తురే ? ॥వి॥ 3969

దక్షాధ్వర ధ్వంసపు కథ యిచ్చుట ద్యోతకము జేశాడు.

ఆ. మైథునమునఁ బుట్టు । మానవు లందరు
తిరుగుచుండు రంతె । తెరువు లేక
యెందుఁ బుట్టువారి । కందేగతి గదర ! ॥వి॥ 3970

బుద్ధిహీనులు పుట్టినచోటునకే నానాపరాకులు పడతారు.

ఆ. మైన మొత్తి లిఖువు । మరి రూపుఁగాఁ జేసి
తామ్రమము గరిగించి । దానఁబోసి
మనుజులెల్లఁ గూడి । మఱి దేవుఁడందురు ॥వి॥ 3971

రాగి ప్రతిమలు, రాళ్లబొమ్మలు రాముఁడని భీముఁడని సోమా అమ్మని రాట్టడిబడి నెట్టుకొని పూజించే నిర్భాగ్యుల నియమాల వర్ణించాఁడు.

ఆ. మైల కోక తోడ । మాసిన తలతోడ
ఒడలు బడలి జడలు । నుండె నేని
అధిక కులజుఁ డైన । నట్టట్టు పొమ్మండ్రు ॥వి॥ 3972

శరీర శుభ్రత లేనివారిని చేరనిచ్చ్య రెవరున్నూ.

ఆ. మైల మై లటంచు । మఱి నీట మునఁగి రే?
మైలలోనె తనువు । మహిని బుట్టె
మైల నిలుచుచోటె । మనుజుని పుట్టుక ॥వి॥ 3973

మానవులు పుట్టుచోటు మాటిమాటికి ప్రస్తావిస్తున్నాడు మహాత్త్వమిగలదో!

ఆ. మొండిమాట లాడి । మొనసియుండు విరక్తి
యముని గెల్వ నచట । నలవిగాదు
కలియుగపు విరక్తి । కలు ద్రాగు చందము ॥వి॥ 3974

తప్ప త్రాగినవాడు తప్పుడు పనులు చేసి తెప్పరిల్లి దండాలు పెడతాడు.

ఆ. మొండివాని కేల? । ముంజేతి కడియాలు
తొఱ్ఱివాని కేల? । గఱ్ఱపండ్లు
గాడిదెలకు నేల? । గడ్డముల్ ॥వి॥ 3975

అనాదిలో మనవారు పండ్లుపోయినవారికి మృగదంతములు అనగా దుప్పికొమ్ములు మొదలగునవి పండ్లుగా తయారుచెసి అతికేవారు. అందుకే గఱ్ఱపండ్లని వాకొన్నాడు.

ఆ. మొగముఁ జూడఁగానే । మోహంబు ఘనమౌను
ధనముఁ జూచినపుడె । తగులు మనసు
కూలి నష్టమైనఁ । గోరునే కొఱగామి ॥వి॥ 3976

కరచరణములు తెగిన కరామొండికి కల్పితములు అంటించినట్లున్న దీపద్యం.

క. మొదట తనమతము వదలక
తుద నెవ్వరిమతమునైన । దూషింపకయున్
పదిలుఁడయి కోర్కెఁ గోరక
ముదమునఁ జరియించువాఁడె । ముఖ్యుఁడు వేమా ! 3977

సర్వసమ్మత మతసారాన్ని చక్కగా మనసాధు చెప్పేడు.

ఆ. మొదట నతఁడు జ్ఞాన । ముద్రాంకితుఁడు గాక
యాదివిధము దెలియ । నజ్ఞుఁ డగును
నడుమ జ్ఞానమొదవ । నగుబాలె కాదయా ! ॥వి॥ 3978

ఆదిమధ్యాంతములు అవలోకించుట అందరూ అలవర్చుకోవాలి.

ఆ. మొదలు నాసఁబెట్టి । తుది లేదుపొమ్మను
పరమలోభులైన । పాపులకును
వారి యుసురుదాకి । వగచెడి పోవరా ॥వి॥ 3979

యిచ్చెదమని యూరించి యీయకపోవుట గొప్పతప్పు

ఆ. మొదటఁ బడ్డ నీరు । మొదటిదనుక నెక్కి
మొదటికుఱికి వేగ । మొలకలెత్తి
మొగి పృధివిని బడ । మగకొడు కందురు ॥వి॥ 3980

వీర్యము స్త్రీగర్భగోళములోపడి పిండరూపమయి భూపతనమగుట చెప్పెను.

ఆ. మొదటబోయు నీరు । మొగి బీజములకెక్కి
మొదటికుఱుక వేగ । మొలకలెత్తు
మొలక పృథివి 'బెరిగి । మొలయును వృక్షంబు ॥వి॥ 3981

ఉత్పత్తి విధాన మిట ఊహిస్తే అన్నివిధాల తెలియును.

ఆ. మొదట బోయు నీరు । మొగిలిదనుక నెక్కి
వృక్షమెల్ల నిండి । విస్తరించు
ఆవిధమున జీవ । మంతట నిలుచును ॥వి॥ 3982

జ్ఞానము సర్వాంగముల వ్యాపించి సజీవమై యుండును.

ఆ. మొదట బ్రహ్మ, మనువు । మొనయ రెండు మయుండు
మూఁట త్వష్ట శిల్పి । మొనయ నాల్గు
విశ్వకర్మ నెగడె । విశ్వజ్ఞుఁ డైదింట ॥వి॥ 3983

“మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వ లే బంచభూతములవలె ప్రపంచ
మున అధికు లయ్యారు (నాగరఖండము)

ఆ. మొదట మంచికులము । పిదప నానాజాతి
యట్టి జాతికన్న । నెచ్చులేదు
కంసలికిని మించు । ఘనజాతి లేదయా ! ॥వి॥ 3984

వేమన సర్వమత సమ్మతుఁడు అటువంటివాడు ఒక జాతిగురించి
అందు ముఖ్య గురువంశము గురించి చెబుతాడా !

ఆ. మొదట స్వమతమును । వదలక
తుది నెవ్వరిమతమునైన । దూషింపకయుం
బదపడి కోర్కెలుఁ గోరక
ముదమున నటియించువాఁడె । ముఖ్యుఁడు వేమా ! ॥వి॥ 3985

సర్వమత సహనమే యుత్తమ జనులకెల్ల నుండాలని యుద్బోధించాడు

ఆ. మొదటి తరువునందు । మూఁడుకొమ్మలు పుట్టె
అనలు కొనలు తీగ । లాకు లమరె
పువ్వు పిందె పండ్లు । భువనములన్నిండెరా ! ॥వి॥ 3986

ఆదిశక్తియందు త్రిమూర్తులు, వారియందు జంగమ, స్థావర, భువనంబు
లన్నియు గలిగెను.

ఆ. మొదలక్రియను దప్పి । మోసంబుఁ జేసియు
పొట్టకొఱకు మనసుఁ । బొందుపఱచి
బీదకుక్కరీతి బెరుగును మనుజుండు ॥వి॥ 3987

బక్కచిక్కిన మనుజుఁడు బహుఫలాపేక్షను పొందాలనికుండుట
జెప్పాడిందులో.

ఆ. మొదల ప్రమానె యగును । దుదఁ బక్షియును గాదు
నోరులేదు పండు । లాఱు గలవు
జీవమొకటిలేదు । జీవులఁ జంపురా ! ॥వి॥ 3988

పొడుపుడుకథ వేదాంతవిజ్ఞానములో కలపి వివరించాడు వేమన.

కం. మొదలి తన మతము వదలక
తుద నెవ్వరిమతమ్మునైన । దూషింపకయుం
బదిలుఁడయి । కోర్కిఁ గోరక
ముదమునఁ జరియించువాఁడె । ముఖ్యుఁడె వేమా ! 3989

చక్కని భావములో చక్కిలిగింతలు పెట్టి నెక్కొనిన ప్రేమ భావము మిక్కుటముగా స్త్రీ బలెపద్యాలను సృష్టిస్తాడు వేమన.

ఆ. మొదలు చూచి చూచి । తుదఁ జూడకుండినఁ
జావు తప్పినపుడె । జరుగ వలెను
పొరగకున్న వాని । జులకగాఁ జూతురు ॥వి॥ 3990

బ్రహ్మన్ని పట్టి ప్రాణావసాన కాలమందుగూడా విడువవద్దన్నాడు.

ఆ. మొదలు మగఁడు చూడ । మొనసి యీశ్వరుఁ డగు
వెనుక నాలు చూడ । విష్ణు వగును
ఆలు మగఁడు నెవరో । యాదిని దెలియుఁడీ ॥వి॥ 3991

ప్రకృతి యోని, విష్ణువు బీజము, శివుడు వీరిద్దర సంయోగమే బ్రహ్మండము.

సీ. మొదలు మీఁదికిగాను । దుద మొదలుగ నున్న
వృక్షంబు మొలచిన । వింతయేమి ?
మహి మింటి మీఁదను । మద గజం బొక్కటి
విహరించు చున్నట్టి । వివరమేమి ?
చిదిమిఁ పెట్టిన బంటు । విధమున నేనుంగు
జీమ మ్రింగిన యా వి । చిత్రమేమి ?
పులిచింత మీఁదను । దలమీఁద నొక చింత
ప్రమానుగట్టిన యట్టి । మరు గదేమి ?
చింతవృక్షము మీఁద జే । మంతి పూలు
చెలఁగి పూచిన యట్టి వి । చిత్రమేమి ?
అరయ నేర్చిన సర్వజ్ఞు । లైనవారు
వివరముగఁ బల్కినట్లైన । వినర వేమ ! 3992

వేదాంత విజ్ఞానాన్ని ఛెతకమని కూటవేదాంత గురువులకు పోటీగా యీపద్యాన్ని మాటుమాటలతో నూటిగా జెప్పేడు.

సీ. మొదలు మూలాధార । మొదవ విఘ్నేశ్వరుం
డచ్చోట దేవాళి । యధిపుఁ డుండు
అందుమీఁదటను రెం । డంగుళములు మేర
స్వాధిష్ఠ చక్రంబు । వరలు బ్రహ్మ
దీనికి నెనిమిది । దేహాంగుళములందు
మణిపూర్వచక్రంబు । మలయును హరి
అంత దశాంగుళ । మవల ననాహత
మొప్పు రుద్రుండట । నొనరియుండు
పదియు రెండంగుళములకుఁ । బై విశుద్ధ
మందు జీవుండు పొందుగా । నలరుచుండు
వెలయఁ బరమాత్ముఁ డగ్నియై । వెలుగుచుండు
నిట్టి జాడలు తెలియుట । యెఱుక వేమ. 3993

యెఱుక నెఱుగదగినవారు యిట్టి ఘట్టములు పసికట్టి గుట్టు తెలియవలెను.

ఆ. మొదలు సౌఖ్య దుఃఖ । మూలము వివరింపఁ
బుణ్య పాప కలిత । పూర్వకర్మ
పరగఁ గాలువోయి పడగను బడ్డట్టు ॥వి॥ 3994

దశదినాలు లేనప్పుడు పశమైనదైన పసిగా యుండవు.

ఆ. మొనయ సత్యమునను । మును హరిశ్చంద్రుండు
నిత్యమైన కీర్తి । నిలుపుకొనెను
సత్యము నృపులకు । సర్వదా యోగ్యంబు ॥వి॥ 3995

శా॥ సత్యంబే సకలార్థ సాధక మగున్ సత్యస్థిరుం డొందు నా
న్నత్యం బెల్లెడలందు సత్యమునకన్న న్మిన్నయౌ ధర్మముల్
స్తుత్యంబుల్ మరిలేవు సత్యమె ఫలించున్నాటికిన్ నేటికిన్
సత్యాలాపి యొకండె నిత్యుడు ప్రపంచస్థాయి సత్యంబగున్
(సత్యహరిశ్చంద్రీయము).

ఆ. మొనసి యింద్రియముల । మొదట నిల్పఁగలేక
సమసిపోవు వేళ । సన్యసింత్రు
ఆత్మశుద్ధిలేక । యంటునా మోక్షంబు ? ॥వి॥ 3996

మనసిద్ధి లేనిచో మహత్వము సిద్ధించదు.

ఆ. మొలక చనులుఁగనఁగ । మోహంబుఁ బుట్టును
గుబ్బచనులుఁగన । కోర్కెదీరు
తడకచనులుగన । దయ్యాలు నొల్లవు ॥వి॥ 3997

కామాతుఁతను కోమలమగు కాంతా కచకుచములను కొనియాడే భావమిది.

ఆ. మొలక చనులనాఁడు । మూఁడు కోటులుచేయు
కులుకు చనులనాఁడు । కోటిసేయు
తటుకు చనులనాఁడు । దమ్మిడిసేయదో ! ॥వి॥ 3998

విటులు కుటిల కాంతలకు వక్షోరుహములను వీక్షించి వెలగట్టే విధానమేమో !

ఆ. మొలమీఁదఁ గొట్టితే । మోహంబుఁదనరును
గుండెపైఁ గొట్టితే । పిండమడుకు
తలమీఁద గొట్టితే । తారకంబడురురా! ॥వి॥ 3999

కళాశాస్త్ర విజ్ఞానకళలను ప్రజ్ఞాశాలి గాబట్టి కంటతాఁబట్టేను.

ఆ. మోదమునను గురుని । ముఖ్య కరుణచేత
దొమ్మిది స్థలముల । దొడ్డుచాయ
సర్వజీవుఁడాయె । సర్వంబు తానాయె ॥వి॥ 4000

నవద్వారముల కొంప నాణ్యమెరిగినవాడే ముక్తికి నాథుఁడు.

క. మోసము సేయుచు భువిలో
దాసులమని భూతిఁబూసి । ధరణిఁదిరుగు నా
మోసపు శివవంచకులను
దూషించెద రవని జనులు । దురితము వేమా ! 4001

వంచకుల కొంచపు బుద్ధులను మోమాటముంచక ఎంచాడు వేమన

ఆ. మోసమునను దనకు । మొదటిముఖ్యత హాని
మోసమునను దనదు । ముర్ధువుఁదప్పు
మోసమునను దనదు । మోక్షము దప్పురా ! ॥వి॥ 4002

మోసమువలన మూఁడువిధములు ముక్కలై పోవునని నిక్కచ్చిగా చెప్పెను.

ఆ. మోహజలధిలోన । మునిఁగిచచ్చుటెకాని
హరిపరాయణత్వ । మమరఁబోదు
ముట్టి గురునిధ్యాన । మూలమందుట ముక్తి ॥వి॥ 4003
ముక్తి గావలసినవారు గురుకరుణబడయవలెను.

తే. మోహ భవబంధముల నెల్ల । మూలఁద్రొక్కి
సాహసంబున గురుభక్తి । సలిపిలోన
జపము చేయుట ముక్తికి । సక్తియగును
నిబ్బరముఁబట్టి ఫలమొప్పు । నిజము వేమ ! 4004
మానసిక శక్తితో జ్ఞానాన్ని సాధించుట ముముక్షుల లక్షణం.

ఆ. మోహమనెడు బుద్ధి । మూలంబు నెఱిఁగి తా
మోహరించి గురుని । మోముఁజూచి
మోహమందు ముక్తి । ముక్తిఁ-నుఫలగామి ॥వి॥ 4005
ముముక్షాపేక్షులు మోహములో నుండి తీసి మోక్షసామ్రాజ్యాన్ని ఏలుదురు.

కం. మోహము దీఱక యుండిన
దాహంబె దేహమెల్ల । దల్లడపడును
గేహములోఁ బోరాడక
దేహము నందున్న శివుని । దెలియర వేమా ! 4006
మోహాంధకారమున మునగక ముక్తికిరణమైన సుజ్ఞాన సూర్యుని
జూడమని వేమన సూచన.

ఆ. మోహిని తనయందు । ముక్తికాంతై పైన
వాలలాడుచు నున్న । వీలు దెలక
ముక్తితో భాషిస్తె । మోస బుచ్చెదనరులు ॥వి॥ 4007
పద్యభావము సద్యోజాతముగా లేదు.

తే. మోక్షమార్గ మెఱుంగక । మూర్ఖజనులు
కుక్షినింపెడు వేషముల్ । గోరివేసి
నిర్గుణాత్ములమని చెప్ప । నీతిగాదు ;
వారి కిహ పరములు సున్న । వీర ! వేమ. 4008
మోక్షసామ్రాజ్యాపేక్షులు కుక్షింభరులై తిరుఁగరాదు.

ఆ. మౌనముద్రఁ బూని । మతి తత్త్వమందుట
స్వానుభవము సిద్ధి । సాధ్య పదును
తాను తత్త్వమందు । దనరుటే యోగంబు ॥వి॥ 4009
తన తత్త్వము తానెరిఁగి మౌనముద్ర వహించినవాడే మౌని.

ఆ. మౌనవృత్తి నరుఁడు । మసలుచు నుండెనా!
మమత విడిచిపోవు । మానవులకు
'మౌనం కలహంనాస్తి' । మంచి మార్గముదోచు ॥వి॥ 40.0
"ఊరకున్నవాడు యుత్తమయోగియే".

ఆ. మౌని నిజకేళిలోపల । మమతఁద్రొక్కి
పూనినంతటఁ బరిపూర్తి । పొందుగలుగు
వానిభక్తికి సాటిది । వసుధఁగలదె
డాంబికములైన నడుమ న । డంగువేమ. 4011
మునిని మించిన ఘనుఁడు కనుగొనగా జనములలో కానరాడు.

ఆ. మౌని నిద్రఁబూని । మతితత్త్వమందుట
స్వానుభవము సిద్ధి । సాధ్యమగును
దాను తత్త్వమందుఁ । దనరుటే యోగంబు ॥వి॥ 4012
"తత్త్వదర్శనం యోగపూర్ణం"

## య

తే. యంత్ర తంత్రపు విద్యల । యాచకులను
మంత్రవిద్యలు మరిగిరా । మహిమయేది?
పండువెన్నల బయలున । ప్రాకనగును
నిండుమదిఁ గానగలిగిన । నియతివేమ. 4013
యంత్ర తంత్ర విద్యలు తంత్రగొట్టులకే! గురుమంత్రం దెలిసిన కోవిదులకేల?

తే. యజ్ఞకర్తలకేర్పడు । నధికతేమొ
సంజ్ఞ మదియందుఁ బూనుట । సాధువృత్తి
మనసు మగ్నమునొందుట । మనన వృత్తి
తుదకు గురుసేవయెనను । దొడ్డవేమ. 4014
ఒక్కొక్కవర్గానికి ఒక్కొక్క పరిభాష; పరిభాషాకోవిదుఁడు వేమన.

ఆ. యజ్ఞక్రతువులను । యెన్నిఁ జేసినఁగాని
బ్రహ్మమెచ్చఁడు హీన । బండ జనుల
ప్రజ్ఞచేతనుచేయు । ప్రజ నడతలు గదా ! 4015
ప్రజ్ఞయే బ్రహ్మను సాధించేది.

క. యజ్ఞములు చేయుచుండిన
సుజ్ఞానులు రంభరతులఁ । జొక్కుదు రనుటే
యజ్ఞాన మనుచుఁ దెలిసిన
సుజ్ఞానియెవండు చేయఁ । జూచుర ? వేమా ! 4016
సోమయాజుల సూక్తులను తూర్పార గాబట్టేసు మన నేర్పర వేమన.

ఆ. యజ్ఞయాగము లని । యెన్ని చేసినఁ గాని
ఆత్మయజ్ఞమగునె ? యంటిచూడ
క్రతువు చేయువారు । కానంగ లేరయా ! ॥వి॥ 4017
యజ్ఞ యాగాదులు యాగపశు వధలకే.

తే. యజ్ఞసూత్రముఁ గట్టిన । విజ్ఞు యగునె
మగ్నచిత్తములోనైన । మహిమఁగాంచు
బ్రహ్మమయుఁడైనవాఁడె పో । బ్రాహ్మణుండు
నామమాత్రలుమేటులే । తాము వేమ. 4018
పేరుపెట్టుకొనిన మాత్రాన పెద్దవాడౌతాడా ?

ఆ. యతియుతానై వెనుక । యేతీరు నుంటేమి ?
మూర్ఖులెల్లను తలలు । మొట్టితేమి ?
వార్లచేతికి నొప్పి । వాడికేముండిరా ! ॥వి॥ 4019
" క॥ కదలక, మెదలక సదమల
హృదయంబున నున్నవాడు యిహపర సౌఖ్యాల్
పదిలముగ జూరగొను ఆ
పదలను తాబొందకుండ పరగుర గురుడై "

ఆ. యదుకులమునఁ బుట్టి । యా పసులను గాయఁ
గృష్ణునకును గొప్ప । కీర్తి రాదె ?
గుణము లెక్కగాని । కులమేమి లెక్కరా ? ॥వి॥ 4020
భాగవతభావ ప్రకటనమును భావజ్ఞుల కందించాడు. (భాగవతము)

క. యమ నియమ యోగవృత్తుల
క్రమమున గమనించి మించి । కడుచిత్రముగా
శ్రమలెల్లఁ దీఱు సుమనః
ప్రముదిత పరిపూర్ణమందు । బరగును వేమా ! 4021

యమము పదివిధములు :- 1 సత్యము, 2 దయ, 3 క్షమ, 4 ధృతి, 5 మితాహారము, 6 ఆర్జవము, 7 బ్రహ్మచర్యము, 8 అస్తేయము, 9 అహింస, 10 శౌచము.

క. యమలక్షణములు పదియగు
క్రమముగ సత్యంబు దయయు । క్షమయున్ ధృతియున్
విమల మితభోజనము శుచి
సమతయు నస్తేయ మిలను । సత్కృతి వేమా ! 4022

పై పదింటికి, 1 సత్యము = అబద్ధమాడకుండుట, 2 దయ = పరుల యార్తి కోర్వకుండుట, 3 క్షమ = ఇతరుల తప్పు సైరించుట, 4 ధృతి = ధన, బంధువియోగాదులకు చిత్తము చెదరకుండుట, 5 మితాహారము = సన్యాసికి 8 కబళములు, వనవాసికి పదునారు కబళములూ, గృహస్థునకు ముప్పది రెండు కబళములు, ఇతరులకు మితభోజనము గైకొనుట; 6 ఆర్జవము = విహిత కర్మలొనర్పునపుడునూ, నిషిద్ధకర్మలు మానునపుడును చేయు వాఙ్మనః కాయ కర్మ ప్రవర్తనము; 7 బ్రహ్మచర్యము = సన్యాసికిని బ్రహ్మచారికిని నైష్ఠికుం తప వనస్థునకును స్త్రీ సంగము త్రికరణములందును కూడదు. అట్లు చేయకుండుట వారలకు బ్రహ్మచర్యమనియూ, గృహస్థునకు ఋతు కాలమున స్వభార్యా సంగమమును, అన్య స్త్రీతో విహరింపకుండుటయూ గృహస్థ బ్రహ్మచర్య మనబడును; 8 అస్తేయము = ఎందునూ చోరకృత్య మొనరగకుండుట; 9 అహింస = ఎప్పుడూ ఏ జంతువునకూ ఎగ్గొనర్పకుండుట; 10 శౌచము, రెండువిధములు (ఎ) బాహ్య శౌచము, (బి) మృత్తువలననూ జలము వలననూ నాచరింపఁబడు శరీర శుచి భూతమగు కార్యము. రెండవది అంతఃశౌచము. ధర్మముతో ఆధ్యాత్మ విద్యచేత చేయబడు శుద్ధి.

సీ. యమునాజ్ఞచేతను । నధికుఁ డనబడియుఁ
జంద్రకాంతముఁ జేరి । సరగమరలి
మేఘంబుతో వచ్చి । యోగంబుతో వృష్టి
బిందువుచేతను । బృధివి గురియు

సస్యాదులకు వచ్చి । సారంబు తిని సోకి
యింద్రియంబుల చేత । నెచ్చి మిగుల
నెలఋతువై యన్న । నెలంత యోనిం జేరి
ముద్దగట్టుచు మాంస । మునకును గూడి
ప్రాణి యీరీతి నెలనెలఁ । ప్రబలుఁ డగుచు
మూత్రమలములఁ గొన్నాళ్లు । మునిఁగి యుండి
వెడలి సంసారమునఁగల । వెతలఁ బొందు
జననమరణములెంచంగఁ । జనునె ? వేమ. 4023

శిశులక్షణము :— స్త్రీరక్తము హెచ్చిన ఎరుపు, పురుషశుక్లము హెచ్చిన నలుపువర్ణము కలుగును. స్త్రీరక్తము ముందుగా గూడిన పుట్టుపాపి యగును రెండూ సమమైన శ్యామల వర్ణమగును. ఋతుమతియైన దినములలో ప్రథమ దినమున కూటమున నిల్చిన అల్పాయువగును. రెండవదినమున నిల్చిన మధ్యములతో మునిఁగి తేలును. మూఁట దొంగ, నాల్గిట పాపి, ఐదిట దయాపరుఁడు, ఎనిమిదిట దరిద్రుఁడు, తొమ్మిది ధనాఢ్యుఁడు, పదిట కామాంధ కారుఁడు, పదకొండు వంచనాపరుఁడు. పన్నెండు బలాఢ్యుఁడు, పదమూడు పండితుఁడు, పదునాలుగు కార్య వేది, పదునైదిట మహాత్ముఁడగును.

ఆరు సామాన్యపుత్రుఁడు; ఏడు సంతాన వంతుఁడు ; పదునారు సర్వవిద్యాసంపన్నుఁడు.

ఋతుమతియైన తరువాత సరిసంఖ్యదినములు పురుషులు, బేసి సంఖ్య ఆడపిల్లలు గలుగుదురు.

*ఆ. యమునికి రశీదు । యోగియొద్దనె యుంది
యోగివద్దకు నెపుడు । యముఁడు రాడు
యోగికి భయపడి యముఁడు । చెప్పకపోవు ॥వి॥ 4024

యతి తప్పు ; పద్యము తారుమా రవుటవల్ల అసలు భావము అందడంలేదు.

ఆ. యముని బాధ తీఱి । నప్పుడే వెడలియుఁ
బరగు చంద్రకళను । సరగజీవి
క్రమముగానుఁ జేరి । కాలమేఘము నుండి
చినుకుగాను వ్రాలు । క్షితిని వేమ. 4025

ప్రాణి తన కర్మక్షయ మయినవెనుక తిరిగి పునర్జన్మ ఎత్తును.

క. యవ్వనమనగా నేమియొ ?
యవ్వన కౌమార మనఁగ । నదియును నెట్లో ?
దవ్వగు వార్ధక్యములో
చివ్వగ నీమదిని జింత । చేయుర ! వేమా ! 4026

బాల్యయౌవనకౌమార వార్ధక్య పరిణామ చతుష్టయములు ప్రస్తావించాడు.

క. యాగముచేసిన విప్రుఁడు
భోగించును రంభతోడఁ । బుత్రుఁడు మరలన్
యాగంబు చేయఁ దల్లిని
భోగించుటెగాదె ? యజ్ఞ । పుణ్యము వేమా ! 4027

"సీ॥ జనకుండు సుతుడును జన్నంబుఁజేసిన
వనిత ! వారేమిగావలయు నీకు ?
అన్నదమ్ములు సోమయాజులై వెలసిన
వనిత ! వారేమిగావలయు నీకు ?
భావయు మరఁదియు బవరానఁ గూలిన
వనిత ! వారేమిగావలయు నీకు !
నల్లుఁడు మామయు నని ద్రెళ్ళివచ్చిన
వనిత ! వారేమిగావలయు నీకు ?
వావి వరుసలు గణియింప వచ్చితేని
వనిత ' మాతోడ మాటాడ వశమె ? నీకు
బాలునిక నేలరమ్మని కేలువట్టి
బాలఁ గొనిపోయి చెంగల్వపొన్నుఁజేరి" (కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము ఆ. 4–216 ప.)

పురాణేతిహాస విజ్ఞానాన్ని, ధర్మశాస్త్ర సారాన్ని తరచి వేమన యిందందించాడు. చూడండీ పద్యము. ధర్మశాస్త్రరీత్యా యుద్ధమున చనినవాడు, యాగము చేసినవాడు, కలసి సర్వమున రంభా రంభోరు సంభోగము చేయుదురని యున్నది. కాని, తండ్రీ కొడుకులు, అన్నదమ్ములు, బావమరదులు, అల్లుడు మామలు యీజంటలు సోమయాజులయి, బవరమున గూలి రంభనుగూడిన వావివరుస లెట్లుండును ? యీ విజ్ఞానము సువిమర్శనా ప్రజ్ఞాచక్షులకుఁగాని, ధర్మ తత్వజ్ఞులకుగాని బోధపడును. తదితరులకు అగమ్యమే ? మనయోగిచంద్రుఁడు యీ యుభయవర్గ సంపుటీకరణమే.

తే. యాత్రలందలి ఫలమొంది । యాగములను
సూత్ర సమముగఁజేసియు । సూక్ష్మమొంది
పరమ హంసను గెలిచిఁ । బ్రబలుచుండు
పరముఁగోరెడు ప్రాజ్ఞుఁడి । ద్ధరను వేమ. 4028

మూర్ఖులు యాత్రలని యజ్ఞములని తిరిగి, చేసి అలజడిపడుటే గాని యానందమనుభవింపలేరు.

ఆ. యాత్రవోయి నాతఁ । డెన్నాళ్ళు తిరిగియుఁ
బాదమైన ముక్తి । పదవిఁ గనడు
మనసు నిలిపినతఁడు । మహనీయమూర్తిరా ! ॥వి॥ 4029

"అయోధ్యా, మథురా, మాయా, కాశీ, కాంచీ, యవం
తికాపురీ ద్వారావతీశ్చైవ సప్తైతే మోక్షదాయః"
పై యేడును మోక్షదాయకములు (బ్రహ్మపురాణం)

తే. యాత్రలందున ఫలమేది । యాగములను
సూత్రసమముగఁ జేసిన । సూక్ష్మమేది ?
పరమ హంసను గెలిచి । ప్రబలవలెను
పరమ్ముఁగోరెడు మనుజుండు ధరణి వేమ ! 4030

యాగ యాత్రాదిపుణ్య తీర్థముల యాధిక్యతేమని సమంజసమైన ప్రశ్న వేశాడు ?

ఆ. యించుకైన యోని । కేగెడు జనములు
కంచముకడ పిల్లి । గాచినట్లు
పంచబాణు నింట । బానిస కొడుకులు ॥వి॥ 4031

స్త్రీయొక్క యోని కాసించిన అయోమయవర్తనుల పిల్లితో బోల్చెను.

ఆ. యింతి దనదు పేరు । నెల్లకాలంబును
ప్రజలు దలచునట్టి । ప్రతిభ గాంచె ?
నింతిపతికి భవికి । నెంతనవచ్చును ? ॥వి॥ 4032

యింతులు మతిమంతనులు వింతలు గానుంటూ యని స్వామంతులకు చెప్పుతాడు.

ఆ. యిట్టిఁజాడగానె । నెందరైనను నేమి ?
పట్టుగాల శివుని । పట్టగలర ?
పొట్ట నీవుబాసి । పోయి దా నుబ్బునా ! ॥వి॥ 4033
పొట్టను కట్టిపెట్టి దిట్టను పట్టుకోవడమే గట్టిమాట

ఆ. యిరుగు పొరుగువారి । కైనయ సంపదఁ జూచి
తనకు లేదటన్న । ధర్మమేమి ?
ధర్మమున్న తొల్లి । దన్నుక జచ్చిరి ॥వి॥ 4034
ధర్మము కోసము మనవారు సుకర్మల నాచరించిరి.

ఆ. యిహమునందు బాధ । లెన్నైనఁ బడవచ్చు
యముని బాధలేక । నమరవలెను
పరుల బాధలేక । బ్రతుకుఁడీ నరులార ! ॥వి॥ 4035
పరులను బాధించకుండా బ్రతుకుటయే పరమార్థము

ఆ. యిహమునందు నేమి । యిడుముల బడినను
పరమసాధు నార్హ । పదవిగాదు
పరులగారు మెట్టి । వెరవునఁజూచిన ॥వి॥ 4036
ఇహపర సౌఖ్యముల నందిననాడే యెన్నికైన యోగి

తే. యీనూటి గురుకృపను । యీదనేర్చినవాఁడు
యీషణత్రయములను । యెగరవిడుచు
యెగర విడిచిన యప్పుడె । యోగీశ్వరుండాయె ॥వి॥ 4037
యీషణత్రయముల యీసడించి భాసురజ్యోతిని పట్టమన్నాడు.

తే. యుక్తమైనది బయలని । యూహజేసి
రక్తిఁ దన్మయమనియెడి । ముక్తినెఱిఁగి
భుక్తిశక్తులు మఱచుట । పూర్ణపదవి
సక్తి పరమాత్మయందుంచ । జఁగతి వేమ. 4038
దత్తపదిగా తేటగీతికను ప్రకృతి ఆమనిలో పం మస్వరముగా
వేమన కేకి కేక వేశాడు.

తే. యుగములన్నియు నీ కలి । యుగమునందె
తిరిగి వచ్చుచున్నట్టి । తెఱఁగెఱుంగు

కృతముఁ ద్రేతము జరుగఁగా । గీడొదవదు
ద్వాపరము కొద్ది కలినెచ్చు । ధరకు వేమ. 4039

"కృతయుగే బలిర్దాతా త్రేతాయాం రఘునందనః
ద్వాపరే సూర్య పుత్రస్చ కలే రాయని భాస్కరః
కృతయుగమున బలి, త్రేతాయుగమున రాముడు, ద్వాపరమున కర్ణుఁడు, కలియుగమున రాయనభాస్కరమంత్రి దాతలు

కం. యుగములు నల్లగఁజూచుచు
తగులక యుగయుగములందుఁ । దపసులకైనన్
వగవగసేనక యుండిన
నిగనిగ మను కాంతి మదిని । నిలుచుర వేమా! 4040

యుగములకొలది తపస్సుజేసి వేదవిజ్ఞానాన్ని చూరగొనుట తపసుల కలవాటు

కం. యూరులు, పల్లెలు, మానుక
వారక యడవిం జరించు । వాఁ డరుదెంచున్
పెరుగులు, కూరలు, మెసవెడు
పీరట కసిమోక్షపదవి । వినరా వేమా! 4041

మెసవెడు = తినెడు : కసి = పసిగాని; నోటిరుచి కాసించే వారికి ముక్తిబోటి ఎట్లబ్బు ?

ఆ. యెండ వేళ జీవ । లేకమై యున్నట్లు
నిండుకుండ నీరు నిలిచినట్లు
దండిగ బరమాత్మ । తత్వంబుఁ దెలియరో! ॥వి॥ 4042

చిత్తైకాగ్రతతో పరమసతి పొత్తును హత్తించుకొన్నవాడే పరమ పూజ్యుఁడు.

కం. యెండిన మానొకటడివిని
యుండిన నందగ్ని పుట్టి । యూష్పును చెట్లన్
దండిగల వంశ మెల్లను
చండాలుండొకఁడు పుట్టి । చెఱుపును వేమా! 4043

ఆబాలగోపాలానికి అందిన భావములతో అసలైన లోకనీతులు పొదిగించుటలో అసమాన ప్రజ్ఞాధురీణుఁడు వేమన

ఆ. యెంత చదువు చదివి । యెన్నివిన్నను గాని
హీనుఁ డవగుణంబు । మానలేఁడు
బొగ్గు పాలఁగడుఁగఁ । బోవునా! మలినంబు? ॥వి॥ 4044

"క. తెలియని మనుజుని సుఖముగ
దెలుపందగు. సుఖతరముగ దెలుపుగవచ్చున్
దెలిసిన మనుజుని, దెలిసీ
దెలియని నరుదెల్పఁ బ్రహ్మఁదేవునివశమే? (భర్తృహరి)

ఆ. యెంతకష్టముండు । నంత పాపపు చింత
చింతచేత మిగులఁ । జివుకు మనసు
చింతలేకయున్న । చెడని సంపదఁ జూచు ॥వి॥ 4045

"చింత విడిచినవాడు సిసలైన యోగి. సంతోషంతో స్వలాభం విడచి వర్తించినవాడే భోగి

ఆ. యెట్టిరూపు జూడ । నీ రూపు గనిపించు
నీదు రూపు జూడ । నెచ్చుదెలివి
యెచ్చుతెలివియున్న । నీశ్వరుండై తోచు ॥వి॥ 4046

తెలివి గలిగినవాడే ధీరుఁడు. చలఁముఁ బలము గలిగినవాడే శూరుడు

ఆ. యెట్టిస్త్రీల గనిన । నింతంత యనరాదు
కాలవహ్ని లక్క । గరగినట్లు
యిట్టి గాఢమోహ । మెంతైనఁ జేయురా! ॥వి॥ 4047

సీ. అణుమధ్య! నీమధ్య "మణిమంబు" వహియించు
మహికటి! నీకటి "మహిమ" గాంచు
గిరికుచ! నీకుచ గిరులొందు "గరిమంబు"
నలినాక్షి! నీకొప్ప లలఘు "లఘిమ"
ఘనవేణి! నీవేణి మనుఘన శ్రీ "ప్రాప్తి"
నతివ! నీమెయి "ప్రకామ్యత"కు నెక్క
నంగన! నీభర్త "యఖిలేశ" తకుఁ దగు
జెలి నీకు "వశ" జెరకువిల్తు
డిన్ని వైభవములు గల్గి యిగురుబోడి!
శేలతనమున నీతంటేల? చేయఁ

గొదవ యొదవినదిది యంచు మృదులఫణితి
జెవుఁలకీయడ బండువుఁ జేయుమనిన"

(కం. పా. ఉత్తరరామాయణం. తృతీ. 107 ప.)

కాముకులు కన్ను లగుంపించనిమోహాంధకారములో మునిగియుండ కామిని తటిల్లతవలె కన్నులకు గనుపడగా అష్టసిద్ధులను అంగాలగా బోల్చి ఆసతీర్చుకొనిన సాదృశమే యీపద్యము.

ఆ. యొడమ శుద్ధిగఁజేసి । యిల్లుకట్టితేఁ గదా
యొండ తగలక మునుపె । యుండవచ్చు
జన్మము స్థిరమని । జలధి నిల్ గట్టురా! ॥వి॥ 4048

నీటి బుడగవంటి శరీరానికి నీంు లెందుకు ?

ఆ. యెదటి తనబలంబు । నెంచుకో నేరక
డీకొని చలమున । నెదిర్చినేని
యెలుగు పందిసేత । కేర్పడు చందంబు ॥వి॥ 4049

మూరపు పట్టుదల మొదటికే చేటు

ఆ. యెద్దుఁదెలుపవచ్చు । నేడాదికైనను
మాని దెలుపవచ్చు । మాసమందు
మొప్పె దెలుపరాదు । ముప్పదేండ్లకునైన ॥వి॥ 4050

"గీ. తివిరి యిసుమమున దైలంబుఁదీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరుఁ ద్రావవచ్చు
తిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చు
చేరి మూర్ఖుల మనసు రజింపరాదు" (భర్తృహరి)

క. యెన్నాళ్ళకు దానుండను
యెన్నాళ్ళను దాననేర్చి । యెన్నిట వెలయున్
కొన్నాళ్ళకు దా జన్నను
"మన్నా" యను విద్యలెల్ల । మహిలో వేమా! 4051

ఎన్నాళ్లు బ్రతికినా యిన్ని విద్యలు సున్నే !

తే. యెన్నాళ్ళు బ్రతికినా । యేమి కొంచుకపోను
యనుచు నీతినిబల్కు । జనులకెఱుక
బంధజాలము విడిచి । బ్రహ్మంబు గనలేరు ॥వి॥ 4052

బ్రహ్మ పట్టుటకు బంధాన్నిఁ ద్రెంచాలి

ఆ. యెన్ని తనువులైన । మృతికి యడముగావు
మృతిని గొలువలేని ? । యెఱుకలేక
దొంగరీతిఁగాక । దొరకునో! మోక్షంబు ॥వి॥ 4053
మృతిని గెలుచుటకు అమృతమయుడు గావాలి.

ఆ. యెన్ని మతములైన । నేమంత్రమైనను
సత్యమింత లేకఁ । జూడఁ దగదు
సత్యము గలిగిన । జగతిలో ద్విజుఁడయ్యె ॥వి॥ 4054
సత్యనిష్టఁగలవారే సద్బ్రాహ్మణులు

ఆ. యెన్ని యెన్ని పూజ । లెన్నిఁ జేసిననేమి ?
భక్తిలేనిపూజ । ఫలము లేదు ?
భక్తిగల్గు పూజ । బహుకాలముండు రా ! ॥వి॥ 4055
"భక్తిలేని పూజ పత్రి చేటు" (ఆర్యోక్తి)

ఆ. యెట్టి నాఁడుదాన్ని । నేపారఁ జూచిన
వేకి మట్టి చాల । వెఱ్ఱిఁబుట్టు
పల్లుఁదెరచి నవ్వ । తృళ్ళింత విడునురా ! 4056
అందమగు ఆడదాన్ని జూచి చిందులు ద్రొక్కిన వాడు మందబుద్ధి కాడా !

ఆ. యెరిగిన శివపూజ । యెన్నడు చెడిపోదు
మొదల పట్టు పట్టు । వదలరాదు
మొదల విడిచి గోడ । తుదిబెట్ట నిల్చునా ! ॥వి॥ 4057
ఆదిని తెలియక ఆరాధించుట హాస్యాల పాలుకేగా !

ఆ. యెరుక నెరుగలేని । కెరుక యేదియు నడుచు ?
యెరుకలేనివాఁడు । బెరుగలేఁడు;
యెరుకలోని యెరుక । నెరుగుట తత్త్వంబు ॥వి॥ 4058
యెరుకలోని యెరుక తెలుసుకొన్నవాడే వేదాంతవేది.

ఆ. యెరుకగు బ్రహ్మంబు । యేకమై జనులెల్ల
నిండి నిర్మలముగ । నిలిచియుండు
నిండియున్న క్రమము । నీతిమంతుల కెరుక ॥వి॥ 4059
బ్రహ్మాండమంతా నిండియున్న బ్రహ్మమును తెలిసికొన్నవారే నీతిమంతులు.

క. యెరుగక కఁ బుట్టును తనువులు
మురికిని మునిగెన్ని తనువు । మోసుటగాదా !
యెరుకగల తనువునొందిన
మరియును జన్మించుటెట్లు ? మహిలో వేమా ! 4060

ఎరుక తెలిసిన వాడిహమునందు జన్మించుటెట్లు ?

ఆ. యెరుకమాలిన జీవి । యెందు నుండిననేమి ?
యెరుక మరచినజీవి । యెగిరిపడును;
పట్టు చిక్కిన వెనుక । పరమాత్ముఁ డతఁడురా ! ॥వి॥ 4061

ముక్తి మూలస్థానాన్ని పట్టినవాడే బ్రహ్మవేత్త.

ఆ. యెరుక మాలు జీవి । యెంతకాలంబుండి
చచ్చి పుట్టుచుండు । సహజముగను
యెరుక మరుచుచోట । నెరుగుట బ్రహ్మంబు ॥వి॥ 4062

బ్రహ్మన్ను యెరుఁగుటకు యెరుక తెలిసికొనుటయే మార్గము.

ఆ. యెరుకలేక దొరల । నెన్నాళ్ళు కొలిచిన
బ్రతుకు లేదు వట్టి । భ్రాంతిగాని
గొడ్డుటావుపాలు । గోరితే చేపునా ! ॥వి॥ 4063

లేనిదానికై పూనిన యత్నములు నిరర్థకములే !

ఆ. యెరుపు వర్ణములోన । యేకాక్షరిని గూడి
తెలుపు వర్ణము లోన । తేజరిల్లు
నలుపు వర్ణము వలన । నటియించి చూడరా ! ॥వి॥ 4064

"అ" కారము ఎరుపు, "ఉ" కారము తెలుపు, "మ" కారము నలుపు; యివి వరుసగా బ్రహ్మ విష్ణు, మహేశ్వరులకు వర్తింమును. నలుపులోని సుశీలమే "ఓం" కార సునాదం. ఆనాదమునకు పరమైన నిశ్శబ్ద నిష్కళయే తానైన పరబ్రహ్మము. ఇదే హృదయ కమలము. యిచ్చటనే నిద్రాసంగమము మొదలగునవి జరుగుచున్నవి.

తే. యెవరికెవరి కెట్లెట్లు । యేర్పరచెనో బ్రహ్మ
అట్లనై నడచును । యవనిలోన
బ్రహ్మవ్రాతకు బములు । పలికెడు వారెవరు ? ॥వి॥ 4065

" విధి విధానము తప్పింప వేధవశమె ? "

ఆ. యెల్లికల పసుకొని । వ్యసనపడితే నేమి ?
శిరసువంచుక నేడ్వ । సాగితేమి
చేతికందని ఫలము । జెందదు సిద్ధంబు ॥వి॥ 4066
హారము వేసి శరులగుటకన్న చిత్తమును శుద్ధిజేసుకొని శ్రీశుని భజింపుము.

ఆ. యెల్లి, రేపు నేడ । నేలాగునైనను
మనసు నిల్పువాఁడు । మంచివాఁడు
శివుఁడు భర్త కర్త చింతింపనేలరా ! ॥వి॥ 4067
" పుట్టించినవాడు పూరి మేపునా ! "

ఆ. యెలుకతోలు దెచ్చి । యెందాక నుతికిన
నలుపుగాక నేల । తెలుపు గలుగు ?
కొయ్యబొమ్మ తెచ్చి । కొట్టితే గుణియౌనె ॥వి॥ 4068
సహజ స్వరూపమును మార్చుటకు శక్యముగాదేరికిని.

ఆ. యెవరే మెరుంగును । మేలైన వస్తువు
దేహమే మెరుంగు । దివ్యబోధ
విధముఁదెలిసి మీరు । వేదాంత మెరుగుఁడీ ! ॥వి॥ 4069
దేహమునూ దివ్యపదమునూ తెలిసికొమ్మని మనదివ్యుని ఉపదేశము

ఆ. యేకాక్షరే బ్రహ్మ । యేకాక్షరే విష్ణు
యేకాక్షరే శివుఁడు । యెంచిచూడ
యేకాక్షరికి మించి । యెక్కుడేమియులేదు ॥వి॥ 4070
ఏకాక్షరి అనగా ఒక్కే అక్షరము "ఓం" కారము.

ఆ. యేమి గొంచువచ్చె । యేమిఁ దాఁ గొనిపోవు ?
బుట్టువేళ నరుఁడు । గిట్టువేళ ;
ధనము లెచటి కేగు ? । దానేగు నెచటికి? ॥వి॥ 4071
పుట్టినప్పుడు తెచ్చేదీలేదు? చచ్చినప్పుఁడు గొనిపోయేదీలేదు? దీనికి మిట్టిసాకేల ?

ఆ. యేరుదాటి మిట్ట । కేగిన పురుషుండు
పుట్టి సరకుఁగొనక । పోయినట్లు
యోగపురుషుఁడేల ? యొడలుఁ బాటించురా !॥వి॥ 4072
పుటి = పడవ; అవసరము తీరినవెనుక ఆధారమెందుకూ ?

ఆ. యెసగువేత్త యనుచు । యెరుగరు యీ నరు
లే్యయు మార్గములను । వేలుపజాడు
యవని సృష్టి కర్త । యంతయు గురుఁడెన్న
నతనికి తలయేది । యరయ వేమ. 4073

సృష్టికర్తకు శిరస్సూ లేదు, సిరికి పాదాలూ లేవు.

తే. యోగమమరిన చిత్తంబు । బాగు పఱచి
రోగ వైరాములను బట్టి । రంగరించి
భోగమందిన వాఁడెపో । పుణ్యుఁ డగు మ
రే గతినిగాని తరియింపఁ । డిట్టివేమ. 4074

విరాగియై సరాగముతో యోగము సాధించినవాడు యున్నతుఁడు.

క. యోగము కష్టంబైనను
రాగద్వేషముల మించి । రంగుగ మది నా
భోగముపందఁగ నొప్పును
రోగపు సంసార మెప్పుడు । రోయును వేమా! 4075

రాగద్వేషముల పారద్రోలి రాజయోగము సాధింపవున్నాడు.

క. యోగము ముద్రలు లక్ష్యము
లాగతమునఁ దెలివి లక్ష్య । మయి తా బయలౌ
రాగద్వేషక బంధము
వేగమె పొలియించి మించు । విడకయ వేమా! 4076

రాగద్వేషాలను విడచి యోగాన్ని సాధించుము.

## పంచముద్రల భావన

1. ఖేచరీ ముద్ర :—కన్నులు మూసిగాని మూయకగాని చూపును త్రిప్పి కనుబొమలమధ్య నిలిపి పైదిక్కునందుండు చిదాకాశముఁ జూచుటయే ఖేచరీ ముద్ర.

2. షణ్ముఖీ ముద్ర :— చెవులూ, కన్నులూ, ముక్కులూ మూసి బహిర్ముఖమైన దృష్టిని మనస్సును అంతర్ముఖము చేసి కనుబొమల నడుమ నిల్పి నాదు బిందుకళలమఁ జూచుట షణ్ముఖీ ముద్ర.

3. శాంభవీ ముద్ర :— ప్రాణాది దశవాయువులునూ, మనస్సు మొదలు పదునాలుగు యింద్రియములను జయించి కన్నులుతెరచికొని చూపును చిదాకాశమందుంచిఁ జూచుట శాంభవీ ముద్ర యనబడును.

4. భూచరీ ముద్ర :— కన్నులు గదలింపక తన ముక్కుకొనను చక్కగా జూచుటయే భూచరీ ముద్ర.

5. మధ్య ముద్ర :— కన్నులు సగము మూసి ముక్కు నడుమను జూపునిలిపి పైగా నుంచు నొసలును జూచుట మధ్య ముద్ర.

గీ. యోగసిద్ధికి ముఖ్యము । రోగములకు
దూరమైన సుఖమొందు శ । రరమునకు
రేచకాదులు నేర్పుతో । సూచకముగ
తెలియువాఁడే మహాత్ముండు । తెలియు వేమా ! 4077

స్వరవిజ్ఞానము చేత సత్తు చిత్తును సాధించమన్నాడు.

## యోగములు

1. సాంఖ్యయోగము :— పంచవింశతి తత్వముల (25) లక్షణముల చక్కగా తెలిసికొని ప్రధాన తత్వమున పరబ్రహ్మను సదా ధ్యానము చేయుటయే సాంఖ్యయోగము.

2. అమనస్కము :— శుచిర్భూతుఁడై ఏకాంతమున గూర్చుండి మనస్సును చలింపనీయక తనకునూ పరమాత్మకునూ అభేదమని భావించి నదే అమనస్కము.

3. తారకయోగము :— మనస్సును పరిశుద్ధముగా చేయునట్టి దియూ, తరింపజేయునట్టిదియూ అగుటచే దీనిని తారకయోగమంటారు.

4. రాజయోగము:—దీనిని జ్ఞానయోగమందురు. సదా పరమాత్మను ధ్యానించుటయే దీని నియమము. సాంఖ్య, అమనస్క, తారక యోగములు యిందులో అంతర్భాగములే !

5. లయ యోగము :— అనాహత చక్రమునందు మోగు దశవిధ ప్రణవ నాదముల నెరిగి దశమనాద మెచ్చట లీనమగుచున్నదో అచ్చట చిత్కళాదర్శనము చేసి యానందించుటయే లయయోగము.

6. హఠయోగము :— పుణ్యస్థలమునందు తనకు బాధఁకలుగనిచోట మఠము గట్టుకొని సద్గురువు సమీపము నందుంచుకొని భోజన మజ్జనాదుల నియతిని జేయుచు దేహమునందలి కల్మషములను జలము చేతను ఔషధము చేతను బోగొట్టుకొనుచూ మితాహారియై అన్ని విషయములందునూ పరిశుద్ధుఁడై ప్రాణాయామమును చేయుచూ, అణిమాద్యష్ట సిద్ధులను పొందుటకు తగినట్టు ప్రవర్తించుకొనుటయే హఠయోగము.

*ఆ. యోగికి కాదంటె యోపుణ్యశాలైన
శివుని యాజ్ఞవల్ల । సకలమునకు
ముల్లోకములనున్న । ముందుగా నడిపించు ॥వే॥ 4078

యతులు పోయినవి; శివునియాజ్ఞవుంటే ముల్లోకములుమా కావల
సినవి సిద్ధించును.

ఆ. యోగిజనులకు బుద్ధి । యేకోభమైయుండు
భోగిజనులకు బుద్ధి । బడలుచుండు
మూగిజనులకు బుద్ధి । మనసందె యుండురా! ॥వి॥ 4079

లక్షణ విరుద్ధంగా నున్నా ఒకపక్షంలో భావము బాగుంది.

ఆ. యోగిననుచుఁ గొంత । యోగముఁ గూర్చుక
జగములోనివానిఁ । జంపి తినుచు
ధనముకొఱకు మిగులఁ । దగవాఁడుచుండిన
యోగిగాఁడు వాఁడె? । యోగువేమా! 4080

ఓగు = పనికిమాలినవాడు; జీవహింసజేసి పరుల నపేక్షించినవాడు
పనికిమాలినవాడు.

ఆ. యోగిని యెవ్వరైన । యూసించినట్లయితె
యోగి యా మనుజున । కాస తోడ
తనకు గలిగినయట్టి । తత్వంబు నేర్పించు ॥వి॥ 4081

ఆశ్రితుల అభిలాషలు నెరవేర్చుటయే యోగుల లక్షణం.

ఆ. యోగి యోగియనఁగ । యోగమేమి యొనర్చు?
త్యాగబుద్ధి యున్న । నమరుఁడౌను
దన్నుఁ దాఁ దెలిసిన । దైవంబు తానాయె ॥వి॥ 4082

దైవత్వము బొందుటకు తనతత్త్వము తాను దెలిసికొనుట కావలయును.

ఆ. యోగుల నడచినా । యోగమార్గము లెల్ల
*వేదంబు గాపాడి । వేసినారు
దానిగట్టుక నేడ్వ । దొరుకునా మోక్షంబు? ॥వి॥ 4083

యతి పోయినది; వేదాంత తత్త్వపు పాటలు గుమిగూడి పాడిన
మాత్రన కోవిదు డౌతాడా?

క. యోగులమనుచును గొందఱు
వాగుట యది లెస్సయగునె? । వాగ్వాదమగున్
బాగుగ మదిలో మర్మము
తాఁ గననీఁకఁ దమకపడఁడు । తజ్జ్ఞుఁడు వేమా! 4084
యోగులమనే వాగినవారు యోగాన్ని గనలేరు

ఆ. యోగ్గైన తరువాత । వోగ్గైన మాటేల?
మూగ్గైన గుఱిఁ దెలిసి । ముక్తిఁ జేరి
బాగ్గైన యమృతంబు । భక్షించి చూడరా! ॥వి॥ 4085
మౌనవ్రతుని ఆశ్రయించినయోగి ముక్తిపొందగలడు.

ఆ. యోనికడిగి నేయి । యుపముతోఁ ద్రాగుచు
నిలను శ్రేష్ఠులమని । పలుకనేల?
సిగ్గులేదుగాక । సీనులో ద్విజులకు ॥వి॥ 4086
సీమ = నాడు: కాముకులు చేసే కంగాళీ పనులను గట్టిగా తిట్టెను.

ఆ. యోని గలుగు నీటి । నొనరంగఁ ద్రాగిన
బ్రహ్మమత మటంచు । బలుకు టెట్లు?
బ్రహ్మ నిష్ఠవలన । బ్రాహ్మణు ల్గావలె ॥వి॥ 4087
బ్రహ్మ నిష్ఠాగరిష్ఠులు పరమసహ్యపు పనులు చేస్తారేమో!

ఆ. యోనిబంధుఁ డనుచు । నొనరజన్మము నొంది
హానివృద్ధిచేత । నలసుఁడౌను
కాని దానిమాయ । కడమొద ల్తెలిసిన
పూని బ్రహ్మమందుఁ । బొందు వేమ. 4088
స్త్రీమోహమే పరమార్థమని కాలము పాడుచేయక ముక్తికోసము ఆసక్తి జూపుము.

ఆ. యోని బోను జేసి । యొడలు డుంబుగఁ జేసి
నాల్క నిడుపుగట్టి । నమలు నంచు
వివరమెఱుఁగ కేడ్చు । విటుడే ద్విపాదుండు ॥వి॥ 4089
అరువదినాల్గు బంధనములలో యిదియొక బంధనమేమో!

ఆ. యోనియందె పుట్టి । యోనికి రుచిఁజేయు
చన్నుఁగుడిచి పెరిగి । చన్నుఁబట్టు
సృష్టిలోని ప్రాణి । సిగ్గేల నెఱుఁగదో ! ॥వి॥ 4090

విజ్ఞానముతో మసలుమన్నాడు.

ఆ. యోని లింగమందు । నుద్భవమైనట్టి
వాదమేలఁ? దనకు । భేదమేల ?
అది హరియె తల్లి । యా రుద్రుఁడే తండ్రి ॥వి॥ 4091

హరి హరులు ప్రపంచానికి తల్లిదండ్రులు అదే యీపద్యములో జెప్పాడు.

ఆ. యోని లింగములకు । నుద్భవించినవాఁడు
వాదమేల ? దైవ । భేదమేల ?
తల్లి విష్ణువగును । దండ్రి యీశ్వరుఁడురా ! వి॥ 4092

బ్రహ్మాండ భారమునకు హరిహరులే యాధారము

ఆ. యోనిలోనఁ బుట్టు । యుత్తమకులజులై
బ్రహ్మకులమునందు । బ్రతుకువారు
బ్రహ్మనెఱుఁగ లేక । పడి చత్తురిదె వింత ? వి॥ 4093

బ్రహ్మ నెరుఁగని బ్రాహ్మణత్వమెందుకు ?

ఆ. యోనిలోనిఁ బుట్టి । యోనిలోనె పెరిగి
యోనిలోని తెరువుఁ । గానలేమి
యోనిఁజూచి పరమ । యోగంబు మఱచురా ! ॥వి॥ 4094

స్త్రీయొక్క మహత్వము అఁదు యిందు ఎందుజూచినా వింతగా చెప్పుచున్నాడు.

క. యౌవనంబునందు । నాలిఁ గౌమారము
నందు బిడ్డల తతి । నాదరింతు
ముదిమి వచ్చినంత । మూల్గుచు నుందువో ! ॥వి॥ 4095

ఏకాల మప్పుడాకాలపు పనిజేసి అందే లీనమగుట జన్మసార్థకము గాదు.

ఆ. యౌవనమునఁ జూడ । నదియెఱుకే లేదు
యౌవనంబు నెంతు । రధికతనుచు
యౌవనంబు తనకు । నందకముంచును ॥వి॥ 4096

యౌవనములో తన వాంఛా పరిపూర్తికై పని చేయునుగాని పర మార్థచింతనుండదు.

ఆ. యౌవనమున నీశు । ధ్యానమునను మది
నిలుప నపుడు ముందు । నెగ్గఁ గర్మ
చేయకున్న తనికి । క్షితిసౌఖ్యమేద యా ! ॥వి॥ 4097

యౌవనము లో అన్నియు సాధించిన వాడే ధన్యుఁడు.

ర.

తే. రక్కసులఁ బట్టి చంపెడు । రాజుగాను
దశరథా ధీశు పట్టియై । ధరణినేల
జగతి బొగడఁగ శ్రీరామ । జనవిభుండు
జానకీదేవి జీవితే । శ్వరుఁడు వేమ 4098

శ్రీరామచంద్రుని సీతాసమేతంగా చెప్పెడు.

ఉ. రక్తిగనున్న పాటయని । రమ్యముతోడుత వ్రాసినన్ వినన్
శక్తి కొలంది నీప్రజలు । సర్వద శ్రద్ధగగూడి పాడినన్
ముక్తియనంగ జెల్వొనరు । మోక్షము దారియు నీకు జేకురున్
భక్తిగ చిన్మయఁబునను । పాదు గనుంగొనుచుండు వేమనా! 4099

చిన్మయబ్రహ్మాన్ని జూస్తూ ఆయన శక్తిని ఆసక్తితో ప్రస్తుతించు టయే భవ్యునకు మార్గము.

ఆ. రక్తి నెఱుఁగువాఁడు । రమణుల వాంఛను
దగిలి దిరుగుచుండు । ధరణి లోనఁ
దగరువెంట నక్క । దగిలిన చందమౌ ॥వి॥ 4100

దగరు = గొఱ్ఱె ; ఎరకాసించి వెనుకబడుట సహజము.

తే. రక్తి మించిన భక్తిలో । రంగుఁ దెలిసి
యందు చుండెడి పరిపూర్ణ । మచల వృత్తి

చిందఁగానీక నొందుచే । చిన్మయంబు
ఎవని కిది యబ్బు నాతండె । శివుఁడు వేమ. 4101

భక్తియందు తన్మయుఁడై భజించేవాడు భవసమానుఁడు.

ఆ. రక్తిలేని పనులు । రమ్యమైయుండునా!
రక్తిగలిగె నేని । రాజు మెచ్చు
రాజు రక్తిసందు । రమణులు మెత్తురు ॥వి॥ 4102

"రాజును చూచిన కళ్ళతో మొగుణ్ణిజూచి మొత్తా" లన్నది సామెతకు యీ పద్యము.

కం. రచ్చకు నిచ్చకమాడెదు
కుచ్చితచూ లోకనింద । కోవిదునకు నీ
తుచ్ఛపు గుణమును నీచపు
మచ్చరమును నున్నఁ జెఱచు । మహిలో వేమా! 4103

సభలో పక్షపాతముగా నుండుట తుచ్ఛముగాదా!

ఆ. రజ్జులాడరాదు । రణభూమి లోపల
బుజ్జగింప రాదు । బొంకువాని
నొజ్జతోడ వాదు । లొనరంగ మానరా! ॥వి॥ 4104

రజ్జు = ప్రేలుట; అబద్ధములాడిన వాడిని ఆదరించగూడదు.

తే. రజ్జు నహిగాను దోచు వి । రక్తి కలుగ
స్థాణువు నరుఁడగాఁ దోచు । సంగ తెరిఁగి
లోని యెఱుకను జయమందఁ । బూనవలెను
భ్రాంతిమాయదె పరికించి । నంత వేమ. 4105

భ్రాంతిగలుగువానికి ప్రపంచమంతా భ్రాంతియే.

ఆ. రజ్జు సర్పంబుగా దోచు । రక్తిగాను
స్థాణుపురుషుఁడుగాదోచు । సందునెరిగి
లోననెరుకను జయమందఁ । బూనవలెను ॥వి॥ 4106

స్థాణువు = మొద్దు; పైత్యరోగికి ప్రపంచమంతా పచ్చగా గనపడును. (ఆర్యోక్తి)

కం. రజ్జువు శుక్తులు గని భ్రమ
ముజ్జగముల లోని జనులు । మూఢులు గారే?
సజ్జనులు రజితమందురె?
గజ్జెలకును రజితమగును । ఘనముగ వేమా! 4107

గజ్జెలు = పనికిమాలువారు; డంభము మెచ్చువారు డాంభికులే.

ఆ. రటనమైన ప్రణవ । రావము వినిసాక్షి
నటన మాడువాఁడు । నైష్ఠికుండు
చటుల చిత్కళలంది । చర్చించి మీఁఱులే
కటికి బ్రహ్మమయము । గదర వేమ. 4108

ఆటవెలఁదికి రటన, నటన, చటుల మను చమత్కార పదముల పొదిగి పొలుపారజేశాడు వేమన.

ఆ. రతియొనర్పఁబూని । సతిని వేడినయట్టి
మతిని వేడి పరము । మరుగుఁదెలిసి
గతిని గోరుచుండ్రు । ఘనయోగు లిలలోన ॥వి॥ 4109

ముక్తికాంతా సంగమాసక్తులై భక్తి ప్రపత్తులతో నుందురు

క. రతి లేక ముదియు నంగన
రతి కలిగిన ముదియు నర్వ । రత్నము ధరలో
సతతము భ్రాంతిని జెందెడు
తతరతిచే ముదియు నరుఁడు । తథ్యము వేమా! 4110

విజ్ఞానవేత్త వేమన యీవిషయము చెప్పాడు.

ఆ. రద్దిమాని మనసు । రాపాడి ధ్వనిఁ జూపి
ముద్దుగులుకు నాత్మ । మూలమంది
సద్దు సేయకున్న । సంసారి యోగియే? ॥వి॥ 4111

రద్ది = ఎక్కువ; గృహస్థధర్మాన్ని కోవిదభావంగా సరిపుచ్చిన సంసారియే యోగి

ఆ. రద్దిలేక మదిని । రాజిల్లఁ జేసిన
నొద్దిదగును పరము । యుతముగాను
ముద్దుగుల్కునాత్మ । మూలమె పరమాత్మ ॥వి॥ 4112

ముద్దులు గుల్కిన మూలస్వరూపమే ముముక్షాపేక్షులకు ముకురము.

క. రథమునకు నైదు చీలలు
నధికుం డమరించినప్పుడె । యగుఁగు రథమిమ్మా
రథతనువు చీల లయిదే
విదితంబుగ నడుపువాని । వెదకర వేమా ! 4113

పంచభూాత వినిర్మాణమైన శరీరమును రథముతోఁ బోల్చెదు.

ఆ. రమణి నగుచునుండు । రమణుండు నేడ్చును
రమణిసేయుచుండు । అంకు మీాఁటి
అంకు చూడఁగాను । రమ్యమౌ తత్త్వంబె ॥వి॥ 4114

ముక్తికాంతా పేతులు చేయు ముఖ్య ఘట్టము వర్ణించెను.

ఆ. రమ్యమైన మనసు । రాజని యెంచుచు
గమ్యముగను దానిఁ । గట్టిపెట్టేఁగి
మరిగి పూర్ణపదవి । మహిలోను గానరా ! ॥వి॥ 4115

రాజితమగు మనసును గట్టి రాజయోగివిగమ్ము.

క. రవి కననిది కవియెఱుగును
కవి యెఱుఁగనిచోటు రవియుఁ । గానఁడు ధరలో
రవికన్న మిగుల నెక్కుడు
కవివై విలసిల్లు నీవు । గానవె వేమా ! 4116

క. "రవి, దివి, భువి గాననిచో
కవిగాంచును జ్ఞానదృష్టిగా నిరతంబున్
కవియనగ కవి యె ధరసుర
గవియై మనవలయు సకలకర్మలచేతన్"

క. రవిచంద్ర గతులు మాఱెడి
యవగతమును మీాటి మదిని । నలకువ లేకా
వివరమెఱిఁగిన పిమ్మట
భవహారమై తోఁచుచుండు । బాగుగ వేమా ! 4117

సిద్ధాంత శాస్త్రములో వేమన సిద్ధహస్తుడే !

క. రవి చంద్రగతులు మీాఱిన
భవహారమగు నాత్మతేజ । భాగ్యము కలుగున్

శివ సాయుజ్యము బ్రహ్మము
గవయుట పరిపూర్ణ పదవి । గలుగును వేమా! 4118
స్వరగతులను సమతతోడ తెలిసి దీటుగా నడిపినవాడు దివ్యుడు.

తే. రవి, శశాంకులు, దారలు । రమ్యముగను
వెలుగునంతకు సత్కీర్తి । వెలయఁ గోర
ధర్మవర్తనఁ దానొప్పి । ధరణి జనుల
కుపకరించినట్లగు । చుండు వేమ. 4119
రవి = సూర్యుఁడు; శశాంకుడు = చంద్రుఁడు; తారలు = చుక్కలు, ఆ చంద్రతారార్కము పరుల కుపకరించిన పనులు చేయువాడే పరమ పావనుఁడు.

ఆ. రాకపోకలడఁచు । రాజమార్గము బూని
నాకమనెడు గుర్తు । నీఁక నెఱిఁగి
పోకి మించ బయలు । సూత్రంబు గాదొకో! ॥వి॥ 4120
రేచక పూరక కుంభక గతులు తెలిసి నడిపించినవాడే ముక్తినాథుఁడు.

ఆ. రాకపోకలేని । రాజమార్గము లోన
నేకరూపుఁ దలచి । యెన్నుటరుదు
పోకిపోకిమాయ । పొక్కించి యడఁచురా! ॥వి॥ 4121
ఉచ్ఛ్వాస నిశ్వాసములు బిగించి పూర్ణసమాధిష్ఠుఁడు మాయను జయించును.

ఆ. రాక్షస హరణంబు । రామాయణము జూడ
బంధునాశము గద । భారతంబు
పాప హరణమయ్యె । బసవ పురాణంబు ॥వి॥ 4122
"రామాయణము రంకు; భారతము బొంకు" అను నానుడి పరిపాటు

క. రాగము గల్గినవేళ వి
రాగము సమకూడదెపుడు । రయమున మదిలో
రాగము విడిచిన యపుడే
యోగము సిద్ధించు మోక్ష । యుక్తిగ వేమా! 4123
కోరిక లూరుచుండిన వారు సార బ్రహ్మన్ని తెలియగలరా!

ఆ. రాగికాసుల వల్ల । రాజత్వమున్నది
రాజత్వముండగా । రాజ్యమంది
రాజ్యముండగ జీవ । రాసులున్నారయా ! వి॥ 4124

ధనమున్న అన్ని ఘనములు కలుగును గదా !

ఆ. రాజయోగమునను । రాజత్వమును బొంది
రాజరాజు దొడ్డ । రాజనంగ
రాజయోగముననె । రాజశేఖరుఁడాయె ! ॥వి॥ 4125

ఈశ్వర కుబేరు లిద్దరు రాజయోగము తెలిసిన వారే !

ఆ. రాజయోగ మూని । తేజమందుట ముక్తి
తేజ మందకున్న । దేబెలరయ
మర్మరహిత గురుని । మహిఁ జేరవలెనయా ! వి॥ 4126

"సమధిస్థమతా౽వస్థ జీవాత్మ పరమాత్మనోః
రాజయోగికి సమాధియే యవసరము.

ఆ. రాజయోగి మహిమ । రాజయోగికిఁ గాక
యితర జనులకెల్ల । నేమి తెలియుఁ
దాను దేవుఁడైన । దైవమే కొలుచురా ! వి॥ 4127

"క. శ్రీరాజయోగవిద్యా
పారీణున కబ్బుఁగాక పరమసుకంబీ
ధారుణి హరలయ మంత్రవి
చారులకది దొరుకదన్న సంపగిమన్నా !

ఆ. రాజయోగీంద్రుఁ డాత్ముఁడై । తేజరిల్లు
వెలయు జగముల విహరించు । విశ్రుతముగ
బాలువిధమున వృద్ధుని । పగిది సోకు
కరణివెంగలి క్రియజూడ । ఘనత వేమ. 4128

"తారకం మనస్సుద్ధికారకం" తారకమే రాజయోగం, రాజ
యోగమే రమ్యమగునది.

ఆ. రాజవరులకెపుడు । రణరంగముల చింత
పరమ మునులకెల్ల । బరము చింత
అల్పనరులకెల్ల । నతివలపై చింత ॥వి॥ 4129

మూడు రకాల చింతలు పోడిమిగా జెప్పెడు.

ఆ. రాజసంబుఁగోరి । రాజ్యభారంబందు
నోర్పు లేని యాతఁ । డుభయతఁ జెడు
పీటిపైన గుండు । నిలుచునా మునుగక? ॥వి॥ 4130

శాంతము లేనివాడు స్వాంతము నెట్లు చక్కబరచుకుంటాడు?

ఆ. రాజసంబు జెంది । రమణుల పొందాస
పడెడువాఁడు గురుని । బ్రాపెరుగునె ?
విటుల మరుగు యువతి । విభుభక్తి యెఱుగునా ! ॥వి॥ 4131

విటులతో తటపట పడే కుటిలకుంతలి నిటలములో దృష్టినిలిపి నిఖిలేశుని గనలేదు.

తే. రాజసంబును మదినుంచి । రక్తి మీఱఁ
దామసంబును గుర్తించి । తగులఁ బెట్టి
సాత్వికాంశము బూనుచే । సమ్మతంబు
అప్పుడే గుణము కుదిరిన । దనుట వేమ. 4132

త్రిగుణాలను క్రమ పద్ధతిని కట్టివేసి కైవల్యమును పొందమన్నాడు.

ఆ. రాజసంబు నెగడు । రాజుమాటలరీతి
తిన్నఁదనము గుదుర । దివ్యమాను
అట్టి తిన్నఁదనము । నఁదగా జనులకుఁ
బెట్టి పుట్టవలయు । బృథివి వేమ. 4133

సత్ప్రవర్తన జన్మాంతరపుణ్యము వలననే గలుగును.

ఆ. రాజుమాటఁ బట్టి । రాజిలు ననురీతి
తిన్నఁదనము కనఁగ । దివ్యమాను
అట్టి తిన్నఁదనము । నందగా జనులకుఁ
బెట్టిపుట్టవలయు । బృథివి వేమ. 4134

పుట్టు బుద్ధులే పూజనీయములు. పెట్టుబుద్ధులు రట్టుకేగా !

ఆ. రాజు మాటవలెను । రసికుఁ డాడఁగవలె
నెంతపనికి యుబికి । యొగరరాదు

కదిసి యెగిరెనేని । గ్రహసమానము కాదె
దొడ్డకొంచెమేల ? । దొరకు వేమ. 4135
గుట్టు తెలసి పట్టుపట్టి ప్రాజ్ఞుడవు గమ్మి.

ఆ. రాతిప్రతిమ దెచ్చి । రాజసంబుగ నుంచి
పూజసేయు నరుఁడు । బుద్ధిమాలి
భావమందుఁ బరముఁ । భావింపనేరఁడో ॥వి॥ 4136
రాతిప్రతిమలను పూజించుట రండా మొండితనముగాదా !

ఆ. రాతిబసవనిఁ గని । రంగుగా మ్రొక్కుచు
రూఢిబసవనిఁ గని । గ్రుద్దుచుండ్రు
బసవ భక్తులెల్లఁ । బాపులు తలపోయ ॥వి॥ 4137
విగ్రహారాధకులు విశేషము తెలుసుకోలేరని విశ్వకవి వినతి.

ఆ. రాతిబొమ్మకేల ? । రంగైన వలువలు
గుళ్లు గోపురములుఁ । గుంభములును
కూడు గుడ్డ తాను । గోరునా ! దేవుఁడు ॥వి॥ 4138
కూడూగుడ్డ కోరేవారు మానవులు. వారికీయక గుళ్లలోను గోపురములలోను మ్రొక్కులు చెల్లిస్తారు.

ఆ. రాతిలింగమునకు । రాజులు మొదలుగా
పూజసేయుదుఁ రిల । బూలతోడ
ఆత్మలింగమునను । నానందపడలేక ॥వి॥ 4139
ఆత్మలింగాన్నరయక రాతి లింగముపై రాగముంచేవారు విరాగులా ! సరాగులా !

ఆ. రాతిలోని కప్ప । రమ్యమై యుండునే ?
నీరు నన్న మచట । నేరిడిరయ !
పుట్టఁజేసి స్వామి । పూరియే మేపునా ! ॥వి॥ 4140
ప్రకృతి ప్రపంచజీవులకెల్ల నాధారము

క. రానిది కోరినరాదది
రానున్నది కోరకున్న । రానే వచ్చుం

దానెంత చింతపడినను
గానున్నది గాకపోదు । గదరా! వేమా! 4142

రావలసినది రాకపోదు పోవలసినది పోకపోదు. అయితే జ్యోతిష మెందుకో!

ఆ. రామ నామపఠన । చే మహిఁ వాల్మీకి
పాపి బోయఁడయ్యెఁ । బాపఁడయ్యెఁ
గులము ఘనముగాదు । గుణమే ఘనంబురా! ॥వి॥ 4143

"రా" ద్వారము; "మ" తలుపు యీ రెండు కలసి పాతకముల రానీక బంధించును.

ఆ. రామ భక్తులమని రాతి । బొమ్మకు మ్రొక్క-
భజనసేయనేల? । భక్తిలేక
భక్తి నిల్పునతఁడు । భజనము సేయునా! ॥వి॥ 4144

భక్తిలేని భజనలు చేశేవారు పనికిమాలినవారే!

ఆ. రామమంత్ర మెఱుఁగ । రహియని తెలిసిన
భావముఁ దలపోయుఁ । బ్రబలుడైన
నామ రూప రహిత । మేమహిఁ వెలసిన
రామ యనఁగ నొప్పు । రమణ వేమ. 4145

క॥ సత్యజ్ఞానానందః
ప్రత్యగభిన్నాత్మనందు బ్రహ్మాది మునుల్
నిత్యము రమించుచుండఁగ
కాత్యాయ నిరామపదము గలిగించుగదా!"

ఆ. రామరామ యనుచు । రంజిల మదివేడి
రహిత పడఁకమదినె । రవళి వినుచు
మనసు నంటియున్న । మహానీయుఁ డపుడగు ॥వి॥ 4146

"రామ" అను రెండక్షరములలో, "రా" అనగా తత్పదము, "మా" అనగా త్వంపదము; తత్పదమనగా పరమాత్మ; త్వంపదమనగా ప్రత్యగాత్మ; యీరెండైక్యము "తత్వమసి" లేక "రామ" అను గూఢార్థము.

మ విభుఁడుపుట్టి । రఘుకులం బలరించె
ఁరు విభుండు పుట్టి । కులముఁ జెఱిచె
నెవరి మంచిచెడ్డలెంచి । చూచినఁదీటె ॥వి॥ 4147
రామాయణ, భారతకథానాయకులను విమర్శించెను.

ఆ. రామ సచ్చరిత్ర । రాక్షస హరణంబు
బంధు నాశనంబు । భారతంబు
అగు బసవపురాణ । మది ముక్తికిఁ గుదురు ॥వి॥ 4148
బసవ పురాణము పవిత్రమని మన ప్రాజ్ఞు ని నమ్మకము.

ఆ. రాముఁ డొకఁడు పుట్టి । రవికులం బీడేర్చె
కురుపతియును బుట్టి । కులముఁ జెఱిచె
నిల నధర్మ ధర్మ । ములరీతి యిట్టిది ॥వి॥ 4149
ధర్మాత్ములు వంశాన్నుద్ధరిస్తారు, అధర్మపరులు వంశాన్ని అధఃపతనము చేస్తారు.

ఆ. ఱాతి ప్రతిమఁ జేసి । రాజసంబునఁ బెట్టి
పూజ సేతురిలను । బుద్ధిమాలి
ప్రాణియందె శివుఁడు । పాటించియున్నాఁడు ॥వి॥ 4150
శివ స్వరూపము ప్రతి ప్రాణియందుండగా శిలల నేలపూజించుట?

ఆ. ఱాయి ఱాయిఁగూర్చి । రాయఁగా రాయంగ
నున్ననైన యట్టు । లన్ని పనులు
పాటుచేసినంత । పరిపాటి యగునయా! ॥వి॥ 4151
అలవాటుచేత అన్నియూ సాధింపవచ్చును

ఆ. ఱాయి రూపుఁజేసి । రాజుల మ్రొక్కింప
వన్నెకెక్కువాని । వైభవంబు
కర్తయెవ్వఁడగునో? । కానరు వసుధలో ॥వి॥ 4152
జగత్కర్తను తెలియక జడములను పూజించి జడులగుచున్నారు.

ఆ. ఱాలుదెచ్చి జనులు । రమణతో గుడికట్టు
తివిరి మరొకరాయి । దేవుఁడనుచు
శిలకు సేవచేయ । ఫలమేమి? కద్దయా? ॥వి॥ 4153
మూఢనమ్మకములను వీడి భువనాకారుని పూజించుటయే పుణ్యుల విధి.

ఆ. తాలు దెచ్చి జనులు । రమ్యమౌ గుడిఁగట్టి
రాతి ప్రతిమఁజేసి । ఖ్యాతిమీర
దేవుడనుచు మ్రొక్కు । దేబెలనేమందు ? ॥వి॥ 4154

పుడమి సర్వస్వమూ నిండిన పురాణపురుషునకు గుడులూ గోపురములేల ?

ఆ. రాయి యగు నహల్య । రాముపాదము సోకి
యాడుదయ్యె ననెద । రవని జనులు
శిల్పి పదము సోక । శిలలెట్లు దేవతల్ ॥వి॥ 4155

శిల్పి పాదమునఁద్రొక్కి చిత్రించిన రాయి శివలింగ మెట్లగును ?

ఆ. రాయి యాయె దైవ । రాయఁడు భువిలోన
భక్తిమ్రొక్కువారు । బండలె కద
దేవు నంతవారు । భావింప భక్తులు ॥వి॥ 4156

శ్రీవిష్ణువు బృందశాపముచలన గండకీనదిలో బండరాయి అయ్యాడని పురాణ ప్రసిద్ధి.

ఆ. రారపోర యంద్రు । రమణులు కాంతలఁ
బొందు గూడునట్టి । సందడులను
అట్టు లనుట ప్రేమ । నగుట దోసముకాదు ॥వి॥ 4157

వలచిన స్త్రీ వలపు తీర్చుట వన్నె కాని చిన్నె లేమో !

ఆ. రాళ్ళుదెచ్చి జనులు । రమ్యమౌ గుడిఁగట్టి
రాతిప్రతిమఁజేసి । ఖ్యాతిమీఱ
దేవుఁడనుచు మ్రొక్కు । దీవించి పల్కునా ! ॥వి॥ 4158

రాతి బొమ్మలు బూతులు తీర్చడానికేగాని ఖ్యాతినిస్తాయా !

ఆ. రాళ్ళు నమ్మియున్న । రాజాధిరాజులు
కూంటి కెడలి భువిని । కూలి చనిరి
రాళ్ళు పగులఁగొట్టి । రాక్షస పుత్రులు
మళ్ళు నూళ్లు గలిగి । మనిరి వేమ. 4159

సుల్తానులు పూర్వము గుళ్లూ గోపురాలు బద్దలుకొట్టి గొప్ప రాజ్యాలు సాధించారు.

ఆ. రాళ్లపూజచేసి । రాజ్యమెల్లఁదిరిగి
కానలేరు ముక్తి । కాంతనెపుడు
తానయుండు చోటు । దైవంబు నుండదా! ॥వి॥ 4160
తిరుగుట దిమ్మరితనమునకేగాని పరము పట్టుపడదు.

ఆ. రుద్రరూపుఁ దాల్చి । రుద్రుని నిందించి
భ్రష్టుత్రోవఁ దిరుగు । భ్రష్టజనులు
అంకునకు దిరిగెడు । రమణులవలె నుండు ॥వి॥ 4161
మదపిచ్చచే మానినులట్లు మతోన్మాదులు మైమరసి తిరుగుదురని.
మాన మనీషి వాక్కు—

ఆ. రూఢిగాను భక్తి । రూపించి చెప్పిన
వాఁడె పరమగురుఁడు । వసుధలోన
వేడి పరముఁ గనుటె । వేదాంత వేద్యమా ॥వి॥ 4162
విమలమైన విద్యాబోధ సాకల్యంగా నేర్పినవాడే వేదాంతగురుఁడు

ఆ. రూఢి సుదిని మించి । రొద వినఁజాలక
కాఁటిఁజేగనేల ? । ఘనమటంచు
వీఁటిలోని రవము । విన్నంత వినుచుండు ॥వి॥ 4163
దశవిధ నాదముల ధ్వనిని తనలో మననము చేసిన వాడేఘనుఁడు.

ఆ. రూపమడఁగ జీవ । రూపంబు గనరాదు
అట్టిరూప మడప । నలవిగాదు
బ్రహ్మ మడఁగకున్న । బ్రహ్మంబు గనరాదు ॥వి॥ 4164
చిణిచిణినాదము. ఘంటా, శంఖా, వీణా, తాళ, వేణు భేరీ.
మృదంగ, మేఘనాదములు.

ఆ. రూపవంతులల్లె । రూపులు ముగ్గురు
వారివారి నెఱిఁగి । గౌరవింప
మొదలె తానెయున్న । మోక్షంబు గల్గురా! ॥వి॥ 4165
త్రిమూర్తులు స్వరూపము నెరిగి పూజించిన వారికే పూర్ణమబ్బును.

ఆ. రూపవంతులు గురు । రూపవంతులఁ జూడ
వారి వారినేల ? । గారవింప
మొదలెఱుంగకున్న । మోక్షంబు గల్గునా ! ॥వి॥ 4166

మూలశక్తిని వీలుఁదెలసి వేడుకొనుటయే మోక్షమార్గము.

ఆ. రూపికిఁదగు జీవ । రూపంబు గనరాదు
అట్టి రూప మడంగ । ననువు గాదు
బ్రహ్మ మడఁగకున్న । బ్రహ్మంబు గనరాదు ॥వి॥ 4167

రజోగుణాన్ని త్యజించక పోయిన బ్రహ్మత్వము సిద్ధించదు.

ఆ. రూపు జూచి మెచ్చి । రూపింప నేరక
వేదశాస్త్రములను । వెదకు టేల ?
దాపుగానె యున్న । దర్పణ మట్టుల
శివుఁడు భావమందు । జెలఁగు వేమ. 4168

దర్పణములోని రూపమువలె హృదయములో నున్న సదమలుఁని సమీక్షించు కొమ్ము.

ఆ. రూపు నడఁకజూడఁ । దాపంబు బుట్టిన
భ్రాంతు లంకురించు । నంతలోనె
బుద్ధి మరలకున్న । బద్దికి నెక్కరా ! 4169

ఒద్దికతో బుద్ధిని నిల్పకున్న పెద్ద యేలాగగును ?

గీ. రూపుపేరు రెండు । రూఢితో గలిగిన
పేరురూపు క్రియను । పెనఁగియుండు
నామరూపములను । నాశ మొందుట మేలు ॥వి॥ 4170

నామ రూప. క్రియారహితుని కోమలమగు మనసుతో వేడుకొనుట విధి.

ఆ. రూపు మాపు చూపు । రూఢియై వెలుగొందు
కాపులేనితనువు । కల్పతరువు
చూపుఁ గ్రుంగఁద్రోసి । చూచుటే సుఖమురా ! ॥వి॥ 4171

చూపులోనున్న శుద్ధబ్రహ్మమును చూపు చెదరకుండ జూచుటే సుజ్ఞాని లక్షణం

ఆ. రూపు మాయ చూచు । రూఢిగాయె వెలుగొందు
కాపులేని మ్రాను । కల్పతరువు
రూపు దృఢముచేసి । రూఢిగఁ జూడరా! ॥వి॥ 4172

కల్పతరువు = కోరిన కోరిక లిచ్చే చెట్టు; మనోభీష్టమును దీర్చునది మహాతత్త్వమేగదా!

ఆ. రూపులేని వనిత । రూఢి పతివ్రత
నీటులేనివాఁడు । పోటుబంటు
తెవులుబడిన యతేఁడు । దేవర బంటురా! ॥వి॥ 4173

వేమన సహజముగా మహనీయుఁడనుట కిటువంటి పద్యములే సాక్షి.

ఆ. రూపువంక పేరు । రూఢిగా నిలుచును
పేరువంక క్రియలు । పెనయు నుండు
నాశమౌను దుదకు । నామరూపక్రియల్ ॥వి॥ 4174

సాధకుఁడు తాను లక్ష్యము సాధించుటకు సోపానములు సూక్ష్మముగా జెప్పెను.

ఆ. రూపు వివర మొకట । రూఢిగాఁ దాఁగన్న
దలఁచు నప్పుడెల్ల । మెలఁగు మదిని
అట్లుమెలగి కోర । యా గురురూపమే ॥వి॥ 4175

మనసులో నెంచిన రూపమును మరల మరల మననముచేయుట భక్తుని లక్షణం

ఆ. రూపు పేరు రెండు । రూఢితో కలిగిన
వేరు రూపు క్రియను । బెనఁగియుండు
నామరూపమ్ములు । నాశమొందుట మేలు ॥వి॥ 4176

రూప, నామ, క్రియలను ముందుపయోగించి పిదప వదలుటయే వైరాగ్యుల లక్షణము

ఆ. రెండు దినములు వుండి । డిందు పోయ్యే మాయ
రోతకాలమునకు । రోష మేల?
రోషంబు రోగి వి । రోధంబటనుఁ దెలియు ॥వి॥ 4177

విడిచిపెట్టేమాయ విధాయక మెట్లగును?

ఆ. రెండు రెండుగానె । యుండిన విధముల
దండి దనుసరింప । నుండు సుఖము
కండ కావరమునఁ । గడమదిఁ బూనిన
జెండుఁగాలుఁ దట్టి । చెట్టవేమ. 4378

జ్ఞానా జానములు తర్కించి అజ్ఞానాన్ని అంతరింపజేసిన యముని భయమేలా!

ఆ. రెండు రెండు రెండు । రెండును రెండును
రెంటి మీఁద లెక్క । కంటియున్న
కొండమీఁద నెక్క । గుఱుతెఱుంగ వశంబె ॥వి॥ 4179

దశేంద్రియ తత్వార్థమును తెలిసిన వాడే తత్వాజ్ఞాని

ఆ. రెండు రెండు రెండు । రెండు రెండునుపీడి
రెంటిమీఁద నున్న । యొంటిలెక్క
కుండలోనఁ జూచి । గుణి సుఖంబున నుండు ॥వి॥ 4180

దశవిధ నాదములను తత్వజ్ఞానముతో తెలిసికొన్న వాడే విజ్ఞాని.

క. రెప్పలు మూసియు మూయక
తప్పక తనమనమునందుఁ । దత్వమొనరఁగా
నెప్పుడుఁ జూచెడువానికి
చొప్పడు నచ్చటనె ముక్తి । సులభము వేమా! 4181

నిమీలిత నయనారవిందునకు నిశ్చలతత్వ మబ్బుతుంది.

ఆ. రేగుపుచ్చకాయ । రేయెల్లఁ దన్నిన
ముఱగదంత కంతఁ । బెరుగుఁగాక
ఒరులు ఛీయనంగ । నోగు సిగ్గెఱుఁగునా! ॥వి॥ 4182

కాలికి తగిలితే పెరిగేది పుచ్చకాయ, మురిగేది గుమ్మడికాయ ''
(రైతు వాక్యానుభవము)

క. రేచక పూరక కుంభక
సూచకముల రాజయోగ । సుస్థిర మతివై
లోచూపుఁ జూడనొల్లక
వాచా బ్రహ్మంబు పలుక । వలదుర! వేమా! 4183

వాచాబ్రహ్మమును జూచుటకు స్వరవిజ్ఞానాన్ని సాధించమన్నాడు.

తే. రేచకములోన సూక్ష్మంబుఁ । జూచి మిగిలి
పూరకంబున గమనించి । పుడమి సొచ్చి
కుంభకంబున శివునంటి । కూడుకొనర
సుస్థిరత బ్రహ్మమును । గాంతు సారిది వేమ. 4184

రేచక పూరకాత్మకమగు హంస మంత్రమును రాత్రింబవళ్ళు ధ్యానింప బుద్ధి అంతర్బాహ్యములను కదలకయుండును.

ఆ. రేయుఁ బగలుఁజేసి । రేచకంబున మించి
దేహమందిరమున । దేవుఁడుండు
దేవుఁడొకఁడె కాని । దేహంబు లేదయా ! ॥వి॥ 4185

"ఓం" కార నాద మాలించి ఘంటాధ్వనిని విన్న స్వయం ప్రకాశము కననగును.

ఆ. రోగి నరసినట్టి । లోకోపకారులు
భోగభాగ్యములను । బొంది తుదను
పూర్వవాసన తెగ । బురహరుతావున
ద్రోగుచుందు రట్టె । మొనసి వేమ. 4186

పురహరుఁడు = శివుఁడు ప్రవిమల జ్ఞానము చేత శివసాయుజ్యము సిద్ధించును.

ఆ. రోగియైనవాఁడె । రోగి నెఱుంగును
రోగి నరసి చూచి । రూఢిగాను
రోగికిడిన వాని । రాగి బంగారౌను ॥వి॥ 4187

పాత్రత పరికించి పరులకుపకారము చేస్తే బహుఫలము గలుగును.

తే. రోతపుట్టెను మగువపై । బ్రీతిఁదొలఁగె
నాఁటినుండియు నాకేమి । పాటులేమి
కాలమును బుచ్చునా కర్మ । శాలయందు
గూరుచుండఁగ గూడె నీ । గురుఁడు వేమ. 4188

వదినెగారి ఉపదేశము చేత వారకాంత పడువు జూచి వైరాగ్యము పొంది తన చరిత్ర తాను చెప్పేడు.

ఆ. రోయవచ్చు బరము । రూఢిగాఁ దెలిసిన
గననె వచ్చు గ్రుడ్లు । కదలకున్న
రెప్పలార్పకున్న । రెంటిసందున నుండు ॥వి॥ 4189

జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు జయించి పంచ వాయువుల స్వాధీన పరచుకొని శరీర వికారముల నణచి మానమాని కామక్రోధాలు నశింప జేసి శాంతియుతుడై గురూపదేశమును లక్ష్యముగా బెట్టుకొనిన నిష్ఠ గలుగుటయే యోగాభ్యాసము.

ల

ఆ. లంకపోవు నాడు । లంకాధిపతి రాజ్య
మంతకీశసేన । లాక్రమించె
చేటుకాలమైన । జెఱుపనల్పుడె చాలు ॥వి॥ 4190

కీశ = కోతి; దశదినములు సరిగాలేనప్పుడు పసివాఁడైనా భంగపుచ్చుతారు

ఆ. లంజకాని చూచి । లజ్జించి తిట్టేరు
లంజముండకొడుకు । లైనవారు
అంజనంబువంటి । యాత్మను దెలియక ॥వి॥ 4191

ముండలు ముండకొడుకులను రండా మొండిగా తిడుతుంట్రారు గాని జ్ఞానమువలన ఆత్మను దెలియలేరు.

ఆ. లంజకొరకు మేక । నంజుడు తిన సాగి
యజ్ఞమేలాగాను । యజ్ఞమాయె?
మొదట సోమయాజి । తుదికామయాజిరా! ॥వి॥ 4192

నంజుఁడు = మాంసము; యజ్ఞాలను చేస్తామని అజపోతులను చంపి భుజించే కామయాజులు గురించి వ్రాశాడు.

ఆ. లంజదానియక్క । లాలించి ముద్దాడు
ముండఁడరయ లంజె । మీద నెపుడు
నాడుదానివంక నందఱు చుట్టాలె ॥వి॥ 4193

ఆడుదాని ప్రక్కవచ్చిన చుట్టాలను ఆదరింస్తారు.

ఆ. లంజ లంజకాని । లాగెల్ల గొనియాడు
లంజతల్లి వాని । లజ్జగడుగు
తల్లి గలుగులంజ । దగులుట చీకాకె ॥వి॥ 4194

తల్లిగలిగిన లంజస్నేహము నల్లుల మంచము వలెనుండును.

ఆ. లంజలంజలెల్ల । లౌకిక ధర్మాన
లంజగానిదెవతె? । రాజ్యమందు
లంజకొడుకు బ్రహ్మ । వ్రాలెట్లు వ్రాసెరా! ॥వి॥ 4195

లంజకొడుకు = బ్రహ్మ; లం=నీరు; జ=పుట్టినది (తామర పద్మము) లక్ష్మి; కొడుకే బ్రహ్మ;

ఆ. లంజలంజయంద్రు । లౌకికమందును
లంజగానిదెవతె? । లాగరయఁగ
మగని లంజకాని । మగువయు భువినున్నె? ॥వి॥ 4196

ఆలోచించి జూస్తే అందరూ లంజలే!

ఆ. లంజ విటుని గుణము । లాలించి పొగడంగ
దానితల్లియెపుడు । వానిఁదిట్టు
తల్లిగలుగులంజ । తరముఁగానిది సుమా! ॥వి॥ 4197

విటులను వెలయాలులు లాలిస్తే వాళ్లతల్లులు బ్రహ్మరాక్షసులు వలె పైబడి పైకము దెమ్మని పీక్కు తింటారు.

తే. లగ్నచిత్తములోనైన । లఘువుఁ దెలిసి
నిలయమగు నిచ్ఛలోపలి । విధముఁబూని
యున్నవాఁడగు ముక్తుఁడీ । యుర్విలోన
పాటు పడలేమి? నెట్లబ్బు । ఫలము వేమ. 4198

మనస్సు లగ్నముచేసి లోనున్న బ్రహ్మమును పరికించమన్నాడు.

తే. లగువు బిగువును మదిలోన । లలితములుగ
జగతిఁ బవనునిఁబట్టెడు । జాణఁడగుచు
విగత జీవునివలెనుండు । విడకమదిని
సుగతి యంతంత నొడఁగూడు । సుమ్మి వేమ ॥ 4199

పూరక, రేచక, కుంభకములను బంధించినవాడు బాహ్యాన్ని మరచి స్థాణువుపోలి యుండును.

ఆ. లజ్జ లజ్జయనుచు । లలనల మీఁదికి
లజ్జవిడిచి తిరుగు । లావరియయి
లజ్జఁ దెలిసెనేని । లలనలఁ రాకునా ! ॥వి॥ 4200
సిగ్గు స్త్రీలకు దూరము

తే. లయము నొందెడు శివజీవ । లఘువుదెలిసి
ప్రియముఁ తోడను మదిలోన । పిరిఁగొనంగ
భయదపటు పాపనాశంబు । ప్రతిఘటించు
నయము లభియించుఁ బరమందు । నడకు వేమ. 4201
శివుని యందు చిత్తమైక్యము చేయుటయే సిద్ధిల లక్షణం

క. లలిత శివతత్త్వ పథమున
గలిసిన శివయోగియేలఁ । గలియును జనులన్ ?
జలబిందువు ముత్తియమై
కలియునె తొల్లింటినీటఁ । గనరా వేమా ! 4202
శివతత్త్వఁసార మెరిగిన సిద్ధుఁడు మానవ గణములలోనికి చేరఁడు.

ఆ. లలినెనుబదినాల్గు । లక్షల జీవులు
బ్రహ్మకొడుకు లనుచుఁ । బ్రకటితమగు
జ్ఞానము కలిగినను । గలుగును మోక్షంబు ॥వి॥ 4203
ప్రాణులన్నియూ దేవునిబిడ్డలే !

ఆ. లవణమెంత ? దాని । లాభము గనెంత ?
కొద్దిదనుచు నెన్నఁ । గూడునయ్య
భోగమేఁటికి నుప । యోగంబె లెక్కగు ॥వి॥ 4204
ఉన్నతి కన్న ఉపయోగమే మిన్న !

ఆ. లక్ష్మిపోవునాడు । లంకేశురాజ్యమం
దంతట కపిసేన । లాక్రమించెఁ
జేటుకాలమైనఁ । జెఱుప నెవ్వరోయేల ? ॥వి॥ 4205
చేటుకాలానికి అల్పులచే అధిపులు లొంగుదురు.

ఆ. లక్ష్మి(?) యేలినట్టి । లంకాధిపతిపురి
పిల్లకోతిపౌజు । కొల్లఁబెట్టె
కలిసివచ్చువేళ । ఘనులౌదురల్పులే ? ॥వి॥ 4206
పౌజు=దండు ; కాల మనుకూలించి నపుడు కానివారే ఘనులౌతారు.

ఆ. లాగివిడిచిగాలి । లక్షింపించి మదిలోన
వేగనిలిపి నిలిపి । వెలయనొక్క-
సాగఁదోలి గుటిని । సాధించి చూడరా ! ॥వి॥ 4207
* స్వరశాస్త్ర విజ్ఞానము స్వరచింతామణిలో గలదు. విస్తరభీతి వివరించలేదు.

ఆ. లాఘవంబుగాను । లాగివిడచినగాలి
బాగుగాను నిలుపు । పరవశతను
యోగముఁగనినంత । భోగమబ్బుచునుండు ॥వి॥ 4208
యోగాభ్యాసము బాగుగా తెలిసిన భోగాలకు వెతుకనేల ?

క. లాలన సేయక మనసును
జాలములోఁ దగులరాదు । చపలముతోడై
కాలుని తోడ్కొని తెచ్చును
వీలుగ మనంబునందు । వెలయును వేమా ! 4209
రాగద్వేషాధికముల జిక్కిన యముని బారి బడును.

ఆ. లింగజీవులకును । లీలలు పదివేలు
భంగ మమరఁజూచి । పట్టువిడక
నింగికెగయువాఁడు । నిర్మలయోగిరా ! ॥వి॥ 4210
వాయుస్తంభన విద్య తెలసిన ఆకాశమార్గమున కవలీలగా పోవచ్చును.

ఆ. లింగజీవుల రెంటిని । భంగపెట్టి
యంగమందును లింగంబు । ననువు పఱచి
సంగమేర్పడఁజూచుటే । సత్యమగును
లింగధారణమిదె వేత్త । లేదు వేమ ॥ 4211
ఆత్మలింగాన్ని హత్తించి ఆనందించుటయే బ్రహ్మానందము.

ఆ. లింగమంగముననుం । లీలఁదెలియు వెన్క
మనసు లింగమందు । మరలు కొనును
మనసునిల్పు నంద । మఱి లింగముండురా ! ॥వి॥ 4212

ఆత్మలో పరమాత్మను హత్తించినవాడే అసలు లింగధారి.

ఆ. లింగమందుఁ జూడ । లీయమై యుండును
అంగమందుఁ జూడ । నమరియుండు
అంగలింగభంగ । మననేకమైయుండు ! వే॥ 4213

అంగలింగ భంగాల తెరంగులు తరంగములు గల సంద్రమువంటి గంభీరత గలిగినవాడే ఘనుఁడు.

ఆ. లింగమందుఁ జూడ । లీనమై యుండిన
నంగమందుఁ జూడ । నమరియుండు
లింగభావమెఱింగి । లీయమై యుండరు ॥వే॥ 4214

లీలాబ్రహ్మము అంగలింగాలలో లీనమై యుంటాడు.

ఆ. లింగ మతములోన । దొంగలుగాఁ బుట్టి
యొకరినొకరు నింద । నొనరఁజేసి
తురక జాతిచేత । ధూళియై పోదురు ॥వి॥ 4215

బుద్ధిలేని వీరశైవులు ముస్లిముల చేతిలో ముక్కలయ్యారు (నాటి దేశచరిత్ర)

ఆ. లింగమున్కఁగాన । లేకయె వెలువడి
పర్వతముల కరుగుఁ । బామరుండు
ముక్తిలేకతుదను । మూర్ఖుఁడై చెడిపోవు ॥వి॥ 4216

అసలు లింగ మాత్మలోనుండగా అడవులవెంబడి దిరుగువాడు బడుగువాడు.

ఆ. లింగము పరమశివుఁడు । లీలతో జూచిన
నంగమందెయూతఁ । డమరియుండు
పరగు మనుజులెల్ల । నరయ లింగములేక
పుట్టనేర రయ్య । భువిని వేమ. 4217

దేహములో ప్రతివానికీ దివ్యలింగము తేజరిల్లుచునే యున్నది.

ఆ. లింగమె భవుఁడైన । సంగంబు జీవుండు
జీవి స్వచ్ఛమైనఁ । జేరు శివుని
గురుని దెలిఁగుల నుండు । గురుతగు బ్రహ్మంబె ॥వి॥ 4218
గురువు, గురుతబ్రహ్మము ఒకేస్వరూపములు.

క. లీలానంద వినోదము
జాలింబడరాదు బుద్ధి । జాఢ్యముచేతం
గాలాకాలము నందును
మేలుగ శివునంట ముక్తి । మెలఁగుర వేమా! 4219
శివునంటియున్న వానికి లీలావినోదము వాలాయముగా వచ్చును.

ఆ. లెక్కలేనియాశ । లీయమై యుండఁగాఁ
దిక్కుమెత్తినరుఁడు । తిరుఁగుఁ గాక
కుక్కవంటి మనసు । కూర్చుండనిచ్చునా ! ॥వి॥ 4220
నీచమగు బుద్ధికి నిలుకడ యుండునా !

ఆ. లేఁడు లేఁడనినను । లేఁడులేనే లేడు
కాఁడు కాఁడటన్నఁ । గానెకాఁడు
తోఁడు తోఁడనినను । దోడనే తోడౌను ॥వి॥ 4221
యేవిధంగా భావించితే ఆవిధంగానే భగవంతు డుంటాడు.

ఆ. లేదు జగతినంచు । వాదుసేయగవచ్చు
సోదిచెప్పరాదు । సూక్ష్మమెఱిఁగి
వాదుకొల్పిబుద్ధి । పరికించి చూడరా ? ॥వి॥ 4222
బుద్ధిని పాదుకొల్పిచూస్తే బరబ్రహ్మము బట్టబయలే !

ఆ. లేదు జగమటంచు । వాదుచేయగఁవచ్చు
సోది చెప్పరాదు । సూక్ష్మమెఱిఁగి
పాదు క్రొవ్విబుద్ధిఁ । బరికించి చూడరా! ॥వి॥ 4223
సోది=సమయోచితాన్ని బట్టి క్రమాన్ని అక్రమబాటగా చెప్పుట.

ఆ. లేదు లేదటన్న । లేదు లేనేలేదు
కాదు కాదటన్నఁ । గానెకాదు
తోదు తోడటన్నఁ । దోడనే తోడౌను ॥వి॥ 4224

యే భావన గలిగిన వారికి ఆభావనగానే బ్రహ్మ యుంటాడు.

ఆ. లేనికాలమునకు । లేని మనమునొందు
ఈనిన పులిరీతి । నెఱుఁగకుండు
కలినబుద్ధికిట్లు । కలిమేమి కల్గురా ! వి॥ 4225

యీనిన పులి శరీరము మరచి అతిచిత్త చాంచల్యముతో మత్ప్రేమ మూర్తీభవించి యుండును.

ఆ. లేమికాలమప్పు । డేమేమి చేసినఁ
గలిసి రాదు ఫలము । కాసుకూడ
కలిమి వేళ నన్ని । తులఁదూఁగు చుండును ॥వి॥ 4226

ఉన్నప్పుడే అన్నీకలసి వస్తాయి. "దరిద్రుడు తల గడిగిన వెంటనే వడగండ్లువాన"

ఆ. లేవు సర్వమునను । లీయమై యున్నాఁడ
వున్న నీయునికి యే । యొదవఁదు దిన
ఇటులఁగాని నీవి । కెటు పరబ్రహ్మంబొ? ॥వి॥ 4227

లేవు=నీవు; నిన్ను నీవు తెలియలేవు. మిన్ను నెట్లు తెలసికుంటావు

తే. లోకభావంబులో జూడ । లోకమగును
ఏకరూపుని మదినెంచ । నేకమగును
తాకనేర్చిన మదినిల్వ । తత్వమగును
వీఁకనెది భావమద్దియే । వెలయువేమ. 4228

"ప్రయత్నేన సాధ్యతే సర్వం
నీవేమిచేసిన అదియే యగును

ఆ. లోకమందు నరులు । లోవెలిఁ దెలియక
ఆశచేత కాసు । లరసిచేర్చి
పెట్టి గిట్టుచుంద్రు । పెనుభూతములవలె ॥వి॥ 4229

బ్రహ్మమును పరామర్శింపక పైసాకొరకు చస్తారు.

ఆ. లోకమందుఁ బుట్టి । లోకమందే పెరిగి
లోక విభవమోర్వ । లేక జనుఁడు
లోకమందుఁ జవికి । లోఁబడి చెడిపోవు ॥వి॥ 4230

నోటిరుచులను జూచి లోకవాసనలో చిక్కి లోచన బ్రహ్మమును తెలియక నిర్దయ జీవియయ్యాడు.

ఆ. లోకమాత లక్ష్మి । లోలుఁడు కృష్ణుఁడు
మోకరించి దుమికి । మొనసెననికి
పాకవైరిపట్టిఁ । లాలించు వేమక ॥వి॥ 4231

కృష్ణుఁడు ప్రతినబట్టి యుద్ధములో ప్రవర్తించాడు (భారత యుద్ధగాథ)

క. లోకము తను ఛీయననా
యాకీడు లొనర్పు చుండు । నధముఁడు ధర్మం
బేకొలదియొ తానెఱుఁగునె ?
కాకులు మడివస్తు వెఱుఁగ । గలవా వేమా ! 4232

లోకులు "ఛీ" యనిననూ ప్రాకృతుఁడు తనపనిని మానఁడు.

క. లోకము మాయని మదిలో
లోకంబునఁ గలియకుండు । లోనను వెలియం
దాకుమ్మరి పురుగట్టుల
లోకంబునఁ గలియ డోగ । లోలుఁడు వేమా ! 4233

కుమ్మరపురుగు బురదలో తిరిగినా బురదయంటనీయను అట్లే విజ్ఞాని సంసారములో తగిలీ తగల నట్టుంటాడు

ఆ. లోకములకు గురువు । లోకులకు గురు
వదియుఁ దెలిసి మోక్ష । మందఁగోరి
గురినిఁ గనక నరక । కూపముఁ బొందిరే ! వి॥ 4234

గురువును తెలియలేక కుంభినిలో కూలేరు కొందరు.

ఆ. లోకములకు గురువు । లోహాదుల గురువు
ఆది విశ్వకర్మ । యతఁడు గురువు
గురువుఁ గానలేక । కూపమునఁ బడిరి ॥వి॥ 4235

అసలు గురువు విశ్వకర్మ

తే. లోకములయందు వెలియై । లోతుఁదెలియ
బూని వర్తించి పరిపూర్తిఁ । బొందువాఁడు
ఉన్నవాఁడౌను ముక్తుఁడై । యుర్విలోనఁ 4236
బరమ సంతోష నిలయుఁడై । పరగు వేమ.

లోకవిజ్ఞాని ఆకళింపుకొన్న అసలు రాహస్యము గల్గినవాడు

మ ధు ర తి ర గ డ

లోకాలోకము లేకానున్నది । నాకము శబ్దము లేకానున్నది
రాకపోకలు నేకానున్నది । డాకను జిక్కను దక్కఁగనున్నది
ఏకమనేకములేసే యన్నది । సోకిన మదినేఁ దాకేదన్నది
పాకముఁదప్పక పట్టుమటన్నది । వేకువజామున విశదమటన్నది
సాకులేలనిఁక సత్యమటన్నది । పోకలొల్లకయ పూనుమటన్నది
ఆకారములకు నాదియటన్నది । సాకారమునకు సాక్షియటన్నది
నిత్యానందము నిర్మలమన్నది । సత్యముబయలని సంధిలు
మన్నది
సాహసి వేమనసరస నెయున్నది । సోహంభావముసొక్కుమటన్నది
నిత్యము సత్యము నిరుపమానము । స్తుత్యము బ్రహ్మము
సూక్తి కలాపము 4237

వేద వేదాంత సారమును విజ్ఞానులకు వివరముగా విశ్వ విపంచి వలె వీనులకు విందయి డెందములకు పొంగై మంచులకు మంచై అందరికీ అందుబాటుగా ఉన్న దీపద్యము.

కం. లోకోపకార ఫలముగ
నేకారకు మహిమలెల్ల । నెవరో విశదమా
నాకారములను దెలిపిరి
యాకాశము లోని దద్ద । నంతము వేమా ! 4238

అనంతము, అప్రమేయ మగు ఆకాశస్థానమును దెలిసినవాడే అనుభవజ్ఞుఁడు.

ఆ. లోతుఁజూడ నూతి । లోపలఁ గూడదు
లోతుఁ జూడఁబోవ । లోని కడఁగు
లోతదీతకెన్న । లోకువగా నుండు ॥వి॥ 4239

" ఈతగాడికి లో తెంత ? "

ఆ. లోతు నెఱుఁగవలదు । లోకవార్ధుల లోన
జాతి విడఁగవలదు । జగము లోన
రోతయైన మనసు । రోయదే మోహంబు ॥వి॥ 4240

రోతలను రోయునదే ఖ్యాతిగల మోహము.

ఆ. లోతు నెఱుఁగవచ్చు । లోక వార్ధులలోన
జాతి విడఁగవచ్చు । జగములోన
రోతయైన మనసు । రోయదు మోహంబు ॥వి॥ 4241

మోహానికి ముంగాళ్ళు లేవు.

ఆ. లోనఁ బదిలఁ పఱచి । లో వికారంబెల్లఁ
దరుగ కున్న వాఁడు । తపసి గాఁడు
వెలి వికారమెల్ల । విధిపాలి కోర్కెలే ॥వి॥ 4242

బాహ్యకోరికలు పనికిరానివే !

ఆ. లోనఁబయలు జేసి । లోకంబుఁ దెగటార్చి
కులము గాలఁబెట్టి । గుణము వదలి
చింతలోని చింతఁ । జేరినయోగిరా ! ॥వి॥ 4243

చింతలోని అనంతమైన సంతోషమును మంతన మందుంచినవాడే మహనీయుఁడు.

ఆ. లోనఁ బదిలపఱచి । లోని వికారముల
తలచి మెట్టువారు । తెలియువారు
ఆకసము వేడ్క । నరయంగ నుందురు ॥వి॥ 4244

పై అంతస్థువారు క్రిందికి వస్తారా !

ఆ. లోను జూచినతఁడు । లోకంబులెఱుఁగును
బయలు చూచి నతఁడు । పరమయోగి
తన్నుఁజూచినతఁడు । తానౌను సర్వంబు ॥వి॥ 4245

తనను తత్వములో జూచినవాడే తత్వజ్ఞాని.

ఆ. లోను జూడఁ జూడ । లోకాభి రామంబు
బయలు చూడఁ జూడ । బంధనంబు
తన్నుఁజూడఁ జూడ । దారకబ్రహ్మంబు ॥వి॥ 4246

తారకబ్రహ్మవేత్త తనువులో తత్వాన్ని అనువుగా చూస్తాడు.

ఆ. లోభ మోహములను । బ్రాభవములఁ దప్పు
తలఁచిన బనులెల్లఁ । దప్పిచనును
తా మొకటి దలఁచిన । దైవ మొండు దలంచు ॥వి॥ 4247
షడ్వికారముల వలన సత్ఫలము సమకూడదు.

ఆ. లోభి దాతయైన । లోకంబు లోపలఁ
బరుల నడుగఁబోఁడు । పాలుమాలి
ఒకని కీనివాఁడె । యాచింపఁ బెను లోభి ॥వి॥ 4248
యెంతవున్నా సుంతైనా పంతానికైనా ఒరులకీయని వాడు పరమలోభి

ఆ. లోభివాని కర్మ । లోలత నాసించి
బడుగువాఁడు । తిరుగుఁ బరిణమించు
తగదు వెంట నక్క । దగిలిన చందాన ॥వి॥ 4249
లోభివానిని యాచించినవాడు పరమదేశే ;

ఆ. లోభివానిఁ జంప । లోకంబు లోపల
మందువలదు వేఱు । మతము గలదు
పైకమడుగఁజాల । భగ్గునఁ బడిచచ్చు ॥వి॥ 4250
డబ్బుకూ ప్రాణానికీ లంకె లోభి వానికి.

## వ

క. వంచన చేసెడి యెఱుకను
మించిన పరతత్త్వ మమరు । మేలిమిగా నా
సందున గన్గొని యుండిన
సంచారము లేని బయలె । సతమ్మురవేమా ! 4251
మాయను వంచించినదే పరతత్త్వము. పరతత్త్వము బయలులో ప్రకాశించును.

క. వంచన మదిఁగల వారికి
సంచిత కర్మములు విడని । సందేహులకుం
బంచేంద్రియ లోలురకును
బ్రాంచితముగ నాత్మ విద్య । యందదు వేమా ! 4252
పూర్వకర్మమును సంచితమంటారు.

ఆ. వంట దప్పి నప్పుడు । వంటకము విషంబు
కంటఁ జూడఁ గాని । కంటగించు
కంటకమును దిన్నఁ । గడుగండమై వచ్చు ॥వి॥ 4253

ఆయిష్టమైన ఆహారము హానికరము.

ఆ. వంట వచ్చునప్పుడు । వంటక మమృతంబు
కంటి కింపుగాను । గానుపించు
మెడలఁదిన్న తిండి । వడిమించి కడతేరు ॥వి॥ 4254

ఆకలి యైనప్పుడు అమృతము. కడుపునిండిన కంటగింపు గలుగును.

ఆ. వంటవారియింట । వండు వంటకమును
యంటి దినిన యపుడె । యొకటి వచ్చు
వచ్చునట్లు గాదు । వరుస నుభయులకు
గంటకమగు వంట । కమును వేమ. 4255

పూటకూటి యింటిదగ్గిర తినుట పుష్టిజేయదు.

ఆ. వండితెచ్చునపుడు । వంటక మమృతంబు
కంటి కింపుగాను । గానుపించు
వడలఁదినిన తిండి । వడిమించగను దోఁచు ॥వి॥ 4256

తిన్న తిండి దేహమునకు పుష్టే

కం. వంతుకు లింగముఁ గట్టుక
సంతతమును బూతిఁ బూని । శంభునిఁగననే
సంతకుఁ బుట్టిన బిడ్డలొ
యెంతయుఁ దమతండ్రి గుఱుతు । లెఱుఁగరె వేమా! 4257

పంతముకోసము లింగం గట్టుకోవడము పనికిమాలుతనము.

ఆ. వంతు లింగముగను । వరుస బూడిదఁబూసె
అంతరంగ మెఱుఁగ । నంత్య జాతి
సంత బసివి కొడుకు । జంగము దేవరా! ॥వి॥ 4258

విభూతి పూతలు లింగధారణము వెలికిగా పూయుట వెకిలిచేష్టలే!

ఆ. వంపు కఱ్ఱఁగాచి । వంపు దీర్పఁగ వచ్చుఁ
గొండలన్ని పిండి । గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు । కరగింపఁగా రాదు ॥వి॥ 4259

చెడ్డవానియొక్క మనసు కరిగించుట కష్టము.
మనకవి జానపద విజ్ఞానము గలవాడు.

ఆ. వక్షమందు గురుని । వర్ణించి చూడరా !
రక్షకత్వమునకు । రాచబాట
అక్షమాల జపమె । యవని దొంగలరీతి ॥వి॥ 4260

డాంబికములు మాని హృదయములోనున్న గురునిసమీక్షించుకో మన్నాడు.

కం. వచ్చునది పోవునది మఱి
వచ్చెడిదియుఁ గానలేరు । వరుసయె యనుచున్
విచ్చల విడిగాఁ దిరుగుచుఁ
జిచ్చునఁబడు మిడుతవలెనె । క్షితిలో వేమా ! 4261

భవిష్యత్తులో వచ్చు పాట్లు తెలియక ప్రాజ్ఞులమని మురుస్తారు.

ఆ. వట్టి మమతఁజిక్కి । వావివరుస లంచు
దిక్కుపట్టి నరుఁడు । తిరుగుఁగాని
యెక్కడి తలిదండ్రు । లేమియుఁ దనకేల 4262

నావారని మమకారము తప్పు. ఎవరికెవ్వరూ లేరు.

ఆ. వడ్డికిచ్చు వాని । వాకిటఁ బడుదురు
బడ్డుచిక్కి వెనుక । బాధపడిన
దుడ్డు కాసె కాని । దొడ్డ యీవియ్యరు ॥వి॥ 4263

" వడ్డీకాసపడి అప్పులిస్తారు. మొదలుపోతే మొత్తుకుంటారు.

ఆ. వడుగు ద్విజులకెల్ల । గడు ముఖ్యమందురు
వడుగుఁ జేసెదమని । వదరు కొనుచుఁ
గడుగుఁ ద్రావి కాకి । కట్టు కట్టిన్నట్లు ॥వి॥ 4264

వడుగు చేసుకొన్నవాడు కడుగుదాగి కాకి అరచినట్టుగే.

కం. వడుగులు సేసిన ద్విజవరు
లడుగడుగున వడుగుమంత్ర । మలవడి చదువం

గడు ప్రారబ్ధములను విడి
దడబెడఁ గడ తేరలేఁడు । దనరఁగ వేమా! 4265
"మంత్రాలకు చింత కాయలు రాలునా"

ఆ. వదరి, వదరి, వదరి, । వాఁడు రండాయెను
తిరిగి, తిరిగి, తిరిగి, । దిమ్మ రాయె
మునిఁగి, మునిఁగి, మునిఁగి, । ముండయై పోయెరా! ॥వి॥ 4266
"అతి సర్వత్ర వర్జయేత్" అయోమయ వర్తనులు అతిగా ప్రవర్తిస్తారు.

ఆ. వద్దనంగఁ బోదు । వలెననఁగా రాదు
తాను జేసినట్టి । దానఫలము
ఉల్లమందు వగవ । కుండుటే! యోగంబు ॥వి॥ 4267
సుఖ దుఃఖములు లాభనష్టములకు మతిచెదరనివాడు మాన్యుడు.

ఆ. వనము నామము వేరె । వలమెల్ల నొక్కటే
గిరియు నామము వేరె । గిరియు నొకటే
మృగము నామము వేరె । మృగమెల్ల నొక్కటే ॥వి॥ 4268
ఆవులు అనేక రకములయినా పాలన్నీ ఒక్కటే.

ఆ. వనము బిలములందు । వరయోగి తానుండు
పనియె యందునిందు । పాక పడఁగ
తనివిఁ దీర మదిని । దలకొని చూడరా! ॥వి॥ 4269
కొండలలో గుహలలో నుండుటకన్న తలపునిలిపి తనయింటనుండుట మేలు.

ఆ. వనములోనఁ దిరుగు । వరమాను లైనను
మనసు కుదరకున్న । మమతచేతఁ
జెకుదురన్న నూరఁ । జెడుటేమి లెక్కరా! ॥వి॥ 4270
మునీశ్వరులే మనసు నిలుపలేనిచో మొప్పెలగుదురు.

ఆ. వనములోనఁ బుట్టి । ఘనకోర్కెలన్నియు
కోర్కెలందు ముక్తి । కుదురు పడదు
మనము బ్రహ్మమనుచు । మదినెఱుంగలేరు! ॥వి॥ 4271
అడవిలోనున్నా ఆత్మస్థిరము లేకున్న అన్నియూసున్న

క. వర దేశిక చరణంబుల
నురమున ధరియించి మిగుల । నుత్సాహముతో
గురువరుని వేడికొన్నను
బరిపూర్ణము నొక్కచూపు । పనుపడ వేమా ! 4272

వర దేశికుడు=నిజమగు గురువు. నిజమగు గురూపదేశం నిజతత్వ
మును జూపించును.

ఆ. వరలు రత్నసమితి । వలెఁ గూర్చు ధాన్యంబు
జక్కదంచి వండి । మిక్కటముగ
సుష్టు భోజనములఁ । జూరగా నిడువాఁడు
చెప్పనేల నతఁడె । శివుఁడు వేమ. 4273

"అభ్యాగతః స్వయంవిష్ణు"
అభ్యాగతులకు తృప్తిగా పెట్టినవాడే దివ్యుడు.

ఆ. వర్ణ మాశ్రమముల । వదరుదురు గురుగ
మరణ మెఱుఁగనట్టి । మాలయయ్యె
గురువనుచునుజొచ్చి । గుటివెన్కఁ దానాయె ॥వి॥ 4274

వర్ణాశ్రమ ధర్మములు చెప్పేవారు వర్ణములు దిని తపసు చేసినా పనికి
రానివారే !

ఆ. వరషము భూమిపై । గురియుచుండెఁ గదా
ప్రజలు బ్రతికే కొఱకు । పంట పండు
ఉదకము లేకుంటె । యుర్విపై బ్రతుకేది? ॥వి॥ 4275

మేఘనాథుని కరుణలేనిదే మేదినిపై బ్రతుకులేదు

ఆ. వరుఁడు చక్కనైన । వజ్రాల గనియైన
దళుకు మెఱుపువంటి । తత్వమున్న
నన్య పురుషవాంఛ । యాడుదానికి నుండు ॥వి॥ 4276

స్త్రీకి తన మగనిని విడి పరులను జూచు భావము సాధారణంగా
కలుగునని మన సాధుమూర్తి వాదన.

ఆ. వలపుఁ గలిగెనేని । వనజాక్షి యధరంబు
పంచదారకుప్ప । పాలకోవ
చూతఫలరసంబు । జుంటి సమానమా ॥వి॥ 4277

వనజాక్షి యధరము=కలువపూలవంటి విశాలమైన నేత్రముల స్త్రీ పెదవి; చూతఫలరసము=మామిడిపండు రసము; జుంటి=తేనె;

ఆ. వలపుఁజూపి మదిని । వర్ణించి కానక
వెతలఁ జిక్కువాఁడు । వెఱ్ఱివాఁడు
కులముఁ గోరువాఁడు । గుణహీనుఁ డగునయా! ॥వి॥ 4278

వలపు వానిని తగ్గించును. కులము గోమును తగ్గించును.

ఆ. వలపుఁజూపి సతిని । వలలోడ్డిపట్టెడు
గతిని రాజుమనసు । గడఁగనగునె ?
లోనగుట్టుఁ దెలిసి । లోలతనుండరా! ॥వి॥ 4279

వలచినవారు లలనలకొరకు అనేక మాయలు పన్నుదురు.

ఆ. వలపుదీరెనేని । వనజాక్షి యధరంబు
ములకపంటి జిగురు । ముప్పిరసము
చింతలేనివేళ । జీడి సమానమా! ॥వి॥ 4280

కామము కడతేరినవెనుక కాంత చింతల ముంచిన బొంత.

ఆ. వలయునన్న రాదు । వద్దన్నఁబోదది
తాను జేసియున్న । ధర్మఫలము
ఉల్లమందుఁ దలఁప । కుందుటే యోగము ॥వి॥ 4281

“ కానున్నది కాకపోదు కమలజుకైనన్ ”

ఆ. వలలుపన్ని దుష్ట । వన్యమృగంబుల
బట్టవచ్చుఁ గాని । పాడుమనసు
గురునిబోధలేక । కుదిరికకే రాదు ॥వి॥ 4282

గురుని బోధలేనిదే మనసు కూలంకషముగా కుదురదు.

ఆ. వల్లకాల్లు దున్ను । వాగు లడ్డమురాఁగఁ
దుమ్మకంపఁదచ్చి । త్రోవఁగట్టు
దండుగైనఁ బెట్టు । ధర్మానికోర్వఁడు ॥వి॥ 4283

వ్యవసాయదారుని సేద్యవిధానము వర్ణించాడు.

ఆ. వల్లనన్నఁ బోదు । వాోగి కోరిసనురాదు
తొొల్లి జేసినట్టి । ధూర్తఫలము
ఉల్లమందు వగవ । కుండుకే ! యోగ్యంబు ॥వి॥ 4284

"క. తొలి జేయు కర్మఫలములు
కలుగంగా నేల యేద్వ కాగలదున్నే ?
తలపున బ్రహ్మము నిలిపిన
కలుగునె కైవల్య పదవి కాగలనదియే ! "

ఆ. వల్లభునికి నిష్ట । వస్తువు లందించి
యతనిమానసమున । కతికియున్న
నట్టి వనిత మంచి । కట్టడికలదగు ॥వి॥ 4285

భర్తానుసరణమే భార్యకు కర్తవ్యము.

ఆ. వల్లవైపు లేక । వాగ్దత్తమటుజేసి
యదిగో యిదిగో యనుచు । నాసఁబెట్టి
గడువుపెట్టి రేపు । గడియ గానిమ్మని
గడియలోనె పడియెఁ । గదర వేమ. 4286

వాగ్దానముచేసి తరువాత నావల్ల గాదనుట పరమనీచము.

ఆ. వశముగాని యాలి । వైర మేమనవచ్చు
యశము జెఱచుగాని । యనువుపడదు
కొసరుటెల్ల దాని । కోరికనేతీర్చు ॥వి॥ 4287

యిష్టములేని యాలిని విడువక దానిష్టాను సారంగా వర్తించినవాడు కష్టుడే !

ఆ. వసుధనొడ్డ కేల ? । వైద్యకావ్యంబులు
గ్రుడ్డిదానికేల । గునుకు పరుగు
బుడ్డవానికేలఁ । బో కుప్పిగంతులు ? ॥వి॥ 4288

వారికి నప్పని విషయాలు నప్పించుకొనుట ముప్పుకే !

ఆ. వసుధలో మాయాది । వేదుకార్ధముఁజూచి
పొంగిపడుదురు జనులు । పొలయుఁదెలక
తనలోనె వేడుకల్ । మొనసిఁజూడఁగరాదు ॥వి॥ 4289

* యతి తప్పు ; మోసగాళ్ళను నమ్మి ముప్పులు పాలౌతారు.

ఆ. వ్రతములాచరింప । వట్టికష్టమెకాని
బ్రతుకుమీఁద నాశ । పడుటయేల ?
వ్రతముచేత గురుని । వెదకంగలేరయా ! ॥వి॥ 4290

వ్రతములు = సత్యనారాయణ మొదలగు వ్రతములు ; వ్రతము = దీక్ష ; గురితో గురుని వెదకుటయే వ్రతఫలము.

ఆ. వ్రతములుండేదెవఁడు ? । వ్రతము చేసేదెవఁడు ?
వరమునిచ్చేదెవఁడు ? । వసుధలోన
ఇంతకైన తెలివి । యిదియేమి యున్నది ॥వి॥ 4291

అన్నిటికీ ఆదిపురుషుఁడే కర్త.

ఆ. వ్రతములెన్నియైన । వట్టిచిక్కులెకాని
యాత్మచిక్కుఁగాన । నలవికాదు
ఆత్మచిక్కుబాపు । నతఁడెపో ఘనయోగి ॥వి॥ 4292

ఆత్మచిక్కు విడదీసినవాడే అసలైన యోగి.

ఆ. వ్రాకిళ్ళుపదిమూసి । వాయునాదము తలచి
పాపమనెటివాణ్ణి । పండఁబెట్టి
నీతిమార్గముతోటి । నిలిచి తొక్కించరా ! ॥వి॥ 4293

దశేంద్రియ బంధనమొనర్చి మాయను మడియింఁచి మహాత్ముఁడవుకమ్మన్నాడు.

సీ. వాక్కు గోరును మంచి । వాగేంద్రియమ్మును
వచనక్రమంబులు । వరలఁబలుకు
చేతులు గోరును । జెలఁగుదానంబుల
నియ్యఁ బుచ్చుకొనఁగ । నిరవెఱుంగు
పదములు గోరును । బరగుసంచారంబు
బహుదూరమైనను । బ్రజ్వరిల్లు
మలవిసర్జనములు । మహిఁగుద మొగిగోరు
బదిలంబుగానిట్టి పద్ధతగును

ఆ. వాగులడ్డుగట్టి । వల్లకాలువ దున్ని
మును నడిచెడిత్రోవ । ముండ్లుగొట్టి
పైరు పెట్టునట్టి । పాపులుగలరొకో! ॥వి॥ 4301

రైతులు చేయు కృషి కార్యములు చలోక్తిగా చిత్రించాడు.

తే. వాచకాదుల వర్ణింప । వశముగాదు
సూచనాగ్రపు శిఖరంబు । జూడఁగోరి
గోచరించెడు దానిలో । గుట్టుఁజేరు
మాచరాచరగమ్య మం । దందు వేమా! 4302

జంగమస్థావరమైన భువనములు జగధీశునిలో యిమిడియే యున్నవి.

ఆ. వాచవికిని మొగము । వాచిన యట్టుల
నదియు, నదియుఁ, దినఁగ । మొదలుపెట్ట
మరలదింక బుద్ధి । మర్యాదపోయిన ॥వి॥ 4303

వాచవి = స్త్రీబుద్ధి; పర స్త్రీలోలత మాన ధన ప్రాణములు మంటగలసిననూ మానినిమీద మమకారము మానలేదు మోహితుఁడు.

ఆ. వాడకుటికి తిట్టు । వలదన్న మొఱపెట్టు
మగనినెత్తిఁగొట్టు । మందుఁబెట్టు
యిట్టియాలి తోడ । నెట్టువేగెదరొకో! ॥వి॥ 4304

గయ్యాళిగంపల కలగాబులగ గమ్మత్తులు కండ్లతో జూచి వ్రాశాడు.

ఆ. వాడకుటికి తిట్టు । వలదన్న మొఱపెట్టు
ముందు మగనిఁదిట్టు । ముసుగుఁబెట్టు
గడుసుగాలి మగని । గంపతో నమ్మురా! ॥వి॥ 4305

గడతేరిన ఆడది మగని గంపతో నమ్మును.

ఆ. వాడకులములేక । వనరు మనుష్యుండు
ఈనిన పులిబోలు । నెఱుక నుండు
లేనివానివలెనే । దీన వాక్యములాడు ॥వి॥ 4306

అసలు పద్యములో భావం సమంజసముగా లేదు.

ఆ. వాడవదినె కేల ? । వావి వర్తనములు
చాడిగాని కేల ? । జారబుద్ధి
మూఢ మతులకేల ? । ముదముతో జ్ఞానంబు ॥వి॥ 4307
శెట్టివాని భార్య వాడకెల్ల వదినె.

ఆ. వాడసత్వమెల్ల । నడిసముద్రము లోన
బండిసత్వమెల్ల । బట్టబైట
ఆడుదాని సత్వ । మాడనే చెల్లురా! ॥వి॥ 4308
సహజమును స్వచ్ఛముగా చెప్పెడు.

ఆ. వాఁడు వాఁడనంగ । వానికేమిర లోటు
వాఁడటనరె దేవ । వర్యుఁబోగడ
వాఁడుకాక యదియె । వాఁడనఁ దప్పేమి ? ॥వి॥ 4309
"వాడు" అనేపిలుపు పోడిమి తప్పేదిగాదు.

ఆ. వాఁడు, వాఁడు, వాడు । వాని లోపలనుండు
వాఁడె వాఁడు పాఁడు । వాఁడు గాఁడు
వాఁడువానిఁ గూర్చు । వాఁడెపో బ్రహ్మంబు ॥వి॥ 4310
అక్కడా, యిక్కడా, అందూ, యిందూ. అప్పుడూ యిప్పుడూ, ఏలాగైనా యీశ్వరుఁడే!

ఆ. వాత గుణవచేత । వలపైన మగవాఁడు
లోబ్రైకనుల చెలికి । లోపడీయును
పుట్టి జగతినిలుచు । పునరుద్భవంబున ॥వి॥ 4311
ఆదిశక్తికి పుట్టి ప్రపంచమంతా సృష్టించాడు శివుఁడు.

ఆ. వాతనాకు మేయు । వలపలి మెడవాఁడు
ఒంటికాలి యాతఁ । డొప్పుచుండు
రాజసభలయందు । రంజిల్ల మాట్లాా 4312
రాజసభలలో ప్రాయసకాడు. యిది పొడుపుడు పద్యము.

సీ. వాతపైత్య శ్లేష్మ । రీతు లొక్కటిగాఁగ
శాత్రవ మిత్రులు । సమముగాఁగ
సరవితో నన్నమాష । ధము లొక్కటిగాఁగ
స్వర్ణలోష్టంబులు । సమముగాఁగ

జాతి భేదంబులు । సరణి నొక్కటిగాఁగ
కర్మధర్మంబు లొ । క్కటియుగాఁగ
ఘనసుఖ, దుఃఖంబు । లెనయ నొక్కటిగాఁగ
కన దివారాత్రు । లొక్కటియుగాఁగ
దెలిసి యాత్మలోన । దేదీప్యమానమా
తేజమందు శివునిఁ । దేటపఱచి
మనసు శివునిఁజూడ । మగ్నత్వ మొనరించు
వాఁడె పరమయోగి । వసుధ వేమ. 4313

ద్వంద్వాతీతులను నిస్తంద్రముగా చెప్పెను.

ఆ. వాతబుద్ధిచేత । వాదంబులాడఁగా
బూనియుందురయ్య । పుడమిలోనఁ
గర్మ మార్గమునను । గడ తేరలేరయా ! ॥వి॥ 4314

వాగ్వాదులతో కాల మెల్లబుచ్చేవారు పట్టి దద్దమ్మలేగా !

ఆ. వాతమయము మేను । బాల్యమునందును
యౌవనంబున బైత్య । మావరించు
వృద్ధి శ్లేష్మమునకు । వృద్ధత్వముననగు ॥వి॥ 4315

వైద్యశాస్త్ర విజ్ఞానము.

ఆ. వాతియోని వాని । వర్ణింప దోషంబు
హృదయ యోనివాని । నెన్నసల్లె
మకుట యోని వాని । మఱియెన్న బాపంబు ॥వి॥ 4316

త్రిమూర్తులఁ త్రిదేవులను ధరించిన స్థానములను చెప్పి చమత్కరించాడు.

ఆ. వాద మాడఁడెపుడు । వరుస నెవ్వరితోడ
జేరరాడు తాను । జేటు తేఁడు
జ్ఞానియగుచు బుధుఁడు । ఘనతనొందగఁ జూచు ॥వి॥ 4317

"పండిత స్సమదర్శినిహిః" సమత్వముతో జూచినవాడే చక్కనిపండితుడు.

ఆ. వాదమాడి తిట్టు । వరుస నెవ్వరినైనఁ
జేరరాదటన్నఁ । జేటుఁదెచ్చు
గడుసురాలు తెలియ । వడిశిలఁ బోలురా ! ॥వి॥ 4318

గండుకెక్కిన ఆడవి యిరుగు పొరుగులకు వడిశెలలో రాయివంటిది.

క. వాదమున నడచు నరుఁడట
లేదనఁగా భూమిఁ దిరుగు । లెస్సగఁ దనకే
యేదైన హానివచ్చిన
సాధనపాదంబు నడవ । జరగదు వేమా ! 4319

జరుగుచున్నప్పుడు, పనులను గణింపక ఆపదలో దాపును జూచు
కొనుట మూర్ఖుల లక్షణం.

ఆ. వాన కురువకున్న । వచ్చును క్షామంబు
వాన కురిసెనేని । వరద వారు
వరద కఱవు రెండు । వరుసతో నెఱుఁగుఁడీ ॥వి॥ 4320

క్షామము=కరవు; మంచి చెడుగులు మరువకుండా ఉండండి;

ఆ. వాన, గాలి, ఎండ । వరుసతో సమమని
మాన ముఖ్యములను । మరియు మాని
దీనతను వసింప । ధీరుండు యోగిరా ! ॥వి॥

తపోనిష్ఠుఁడు ఏపరిస్థితులకూ తల్లడిల్లడు.

క. వానను దడియని వారును
బూనిక వేమన్నబోధఁ । బొరయని వారున్
నానాదిక్కుల వెదకినఁ
గానంబడఁగలేరు తెలియఁ । గదరా వేమా ! 4322

కవిచౌడప్ప వేమన ఒక త్రాటిమీద నడచినవారే !

ఆ. వానభయము చేత । వడి దూరెదరు లోన
నెండకెంతకైన । నెండి చరతు
రేల? లోకజనులు । మేలోర్వకుందురో ! ॥వి॥ 4323

"కొండంత ఎండకు ఉండగలము చినుకంత చినుకు కుంగలేము"

ఆ. వాన రాకడ మఱి । ప్రాణంబు పోకడ
కానఁబడదు ఘనుల । కైనఁగాని
కానఁబడిన మీఁదఁ । గలి యిట్లు నడచునా ! ॥వి॥ 4324

మేఘమూ రోగమూ ఎప్పుడొస్తాయో ఎవ్వరికి తెలుసు ?

ఆ. వానిఁ గననివాఁడు । వాఁడు కానేకాఁడు
వానిలోని వాఁడె । వాఁడు సుమ్ము
వానిఁగన్నయట్టి । వాఁడు తాయోగిరా ! ॥వి॥ 4325

బ్రహ్మమును గననివాడు ప్రాజ్ఞుఁడే గాడు.

ఆ. వామపాద మందు । వడిగుహ్యమొత్తుచు
గుహ్యమజ పదంబు । గుదియ దిగిచి
మనము గుహ్యమందు । మరగించి వీక్షింపు ॥వి॥ 4326

ఎడమ కాలిమడమ మూలాధారమందునూ కుడి కాలి మడమ లింగస్థానమందుంచి శిరస్సు, కంఠము, భుజములు చక్కగా నిక్కించి భ్రూమధ్యమును జూచుట సిద్ధాసనము.

ఆ. వాయుతోడుత ప్రాణ । వాయు గూడితె గదా
వయ్యని ప్రణవంబు । వాగురుండు
రెండు నొకటైన వెనుక । దండకు బాజారి ॥వి॥ 4327

ప్రాణవాయువు ధనంజయ వాయువు యేకంచేసే పోకడ తెలిసినవాడే ప్రణవము తెలిసిన ప్రజ్ఞానిధి.

ఆ. వాయువందె పుట్టి । వాయువందె పెరిగి
వాయువందుఁ గీలు । వరుసఁ దెలియ
వాయువందుఁ బ్రాణ । వాయువే తత్వంబు ॥వి॥ 4328

వాయువులో ప్రాణవాయువు జూచినదేవా పరమజ్ఞాని.

కం. వాయువు బయలున బుట్టెను
వాయువె బయలందు నడగి । వచ్చుచునుండున్
వాయువును బట్టి కుంభక
వాయువులోఁ గలియువాఁడె । వశ్యుఁడు వేమా ! 4329

వాయువును కుంభించి దాని గుర్తు తెలిసినవాడు ధన్యుఁడు.

ఆ. వాయువే మనసాయె । వాక్కు వేదములాయె
మనసె వాయువాయె । మాటలేల !
*వాయుఁబుట్టిన క్రమము । వేదాంతులకు బయలు ॥వి॥ 4330

యతి తప్పు; వాయువు షట్చక్రములలో పుట్టి తిరిగే విధానము తెలిసినవాడే దిట్టయగు యోగి.

ఆ. వారకాంతలెల్ల వలచి । యేతెంతురా !
పొందుఁజేసి ధనము । పుచ్చుకొనక
మారకమ్మ చొచ్చి । మఱియిల్లు వెడలునా ! ॥వి॥ 4331
మహామ్మారి మనుజులను చంపకుండా వెడలి పోతుందా !

ఆ. వారకాంతలెల్ల । వలపించి వత్తురు
బుద్ధులెల్ల దోలఁగ । పుచ్చుకొఱకు
మాట యాథిగాఁగ । మగలెల్ల వత్తురు ॥వి॥ 4332
వార స్త్రీ వలపు మగవారిని గుల్లచేయుటకే !

ఆ. వారణాసి విష్ణు । వహ్ని నేత్రుల మీఁద
*జీవహింస గురుని । తానసించి
తలను నున్న వాఁడు । తానైన మోక్షమా ॥వి॥ 4333
*యతితప్పు ;
"కాశీపురో నివాసస్థో విశ్వనాథో జగద్గురుః
దేహాంతే చోపదిశ్చేతు తత్క్షణే కర్ణసంపుటే"
కాశీపుర స్థిరడగు విశ్వేశుని కర్ణరంధ్రముల గాలిలో వెతుకుము.

ఆ. వార్తయందు జగము । వర్తించు చున్నది
అదియు లేనినాఁడె । యవని పతులు
అంత్యకాల మగున్న । లగుచు నుందురుగాన
వార్త నిర్వహింప । వలయు వేమ. 4334
దేవుని ఆజ్ఞప్రకారం భువి, భూపతులు నడచు కొంటున్నారు.

ఆ. వార్తలోని వార్త । వసుమతీశునిఁ జేర్చు
వార్తలోని వార్త । వశ్యుఁడగును
వార్తలోని వార్త । వరకవి యగునయా ! ॥వి॥ 43౩౬
వార్తలోని వార్తఁదెలిసిన వాడే పరముఁడు.

ఆ. వార్తలోనివార్త । వైభవ మరయక
మిట్టిపడుదు రిలను । మిడతరీతి
గట్టిఁజేసి నిలుపు । ఘనుఁడెవో ! శివయోగి ॥వి॥ 4336
ఉపదేశమంది ఉపము తెలిసినవాడే ఉమాపతి భక్తుడు.

ఆ. వారి గానవోఁడు । వాఁడు కానేకాఁడు
వానిలోని వాఁడు । వాఁడు సుమ్మి
వాని గన్నవాఁడు । వాఁడురా! యోగిరా! ॥వి॥ 4337

తనను తెలియనివాడు మనుజుఁడుగాడు, తెలిసి కొనినవాడు జ్ఞాని.

ఆ. వారిలోనఁ బుట్టి । వారిలోనే పెరిగి
వారిఁ బాసి యాఁడు । వారిఁ జేరి
కర్మమంటియున్న । కారణమేమయా! ॥వి॥ 4338

ఆత్మ బంధుల విడచి ఆలితో బోయినవాడు అజ్ఞాని.

ఆ. వారి వీరి నడుగ । వశముఁ గాకుండును
పోరి గురుని నడుగఁ । బొందుపడును
దారిలోన నెఱుక । తార్కాణుచుండురా! ॥వి॥ 4339

గురువు నడిగి తెలిసికొన్నచో దారిలో కాళ్లకు తగులు కొంటుంది ముక్తి

ఆ. వార్ధియందుఁ బుట్టి । వశముగా రావచ్చు
పూర్ణదృష్టియందుఁ । బూనరాదు
పూని యెఱుక మించి । పొడమిన బ్రహ్మంబు ॥వి॥ 4340

యెరుకను దాటించో మరుగు తిరుగులేని మార్గం దొరకును.

ఆ. వావి వర్తనలును । వరుసను మర్యాదఁ
దప్పి నడచెనేని । దగులుఁ గీడు
వదలదపుడు దాకు । నది తప్పినందుది
ముసలి ముప్పునైన । మునుఁగు వేమ! 4341

వావి వరుసలు, తప్పి వర్తించే వానికి ముసలప్పుడైనా ముప్పు తప్పదు.

ఉ. వాసనలేని పువ్వు; బుధ । వర్గములేని పురంబు; చాలవి
శ్వాసములేని భార్య; గుణ । వంతుడుగాని కుమారుడున్ సద
భ్యాసములేని విద్య; పరి । హాసప్రసంగము లేని వాక్యమున్
గ్రాసములేని ప్రౌఢ కొర । గాదయభూమిని వెట్టివేమనా!

పెమ్మయ సింగధీమణి పద్యము దిమ్మెక్కిన పండితమ్మన్యుఁడు నిమ్మళంగా దూర్చాడిందులో; పండితమ్మన్యుఁడు=పాండిత్యము లేక పండితుడనని చెప్పుకొనువాడు.

ఆ. వ్యాధికలిగెనేని । వైద్యుని చేతను
మందుఁ దినకకాని । మానదెందు
జెంత దీపమిడక । చీకటి పాయునా ! ॥వి॥ 4343

అజ్ఞాన హరణమునకు సుజ్ఞానోపదేశం అవసరం గాదా !

ఆ. వ్యాధి పీడితంబు । వ్యసన సంతాపంబు
దుఃఖ సంభవమున । దొడరు భయము
లేని వారలుండ । రేనాటి కైనను ॥వి॥ 4344

సర్వసాధారణంగా జనులకు ఏదో ఒక్క బాధ యుండును.

ఆ. వ్యాధి వచ్చినపుడు । వైద్యునిచే మందు
తీసి తినకకాని । తీఱదెందు
మందువంటి మనసు । మనుజుండు కనవలె ॥వి॥ 4345

వ్యాధి ఔషధమువలె అజ్ఞానమునకు యుపదేశముండా లన్నాడు వేమన.

ఆ. వ్యాధెఱుఁగని వాని । వైద్యంబదేలనో !
కొదవఁ దెలియలేని । కోర్కెలేల ?
మనసుఁ దెలియలేని । మరిజ్ఞానమేలరా ! ॥వి॥ 4346

తెలియని విషయముల కొరకు యత్నించుట దేబెతనమే

క. వ్యాపించియున్న లోకము
బ్రాపింపక గురుని వేడి । బహుతంత్రములం
దీపించు మనసు నిల్పుము
రూపంబగు బట్టబయలు । రూఢిర వేమా ! 4347

గురూపదేశం చేత పరమును పట్టుకో !

ఆ. వ్యాస, దక్షముఖుల । వ్యాపారములు చూడ
శివుని దూషకులకు । సిగ్గులేదె ?
కుంకబోడి జూచి । అంకాడనేర్తురే ! ॥వి॥ 4348

వ్యాసుడు ఒక్క పూటాశనమునకై శివుని దూషించి శిక్షయనుభవించెను. (కాశీఖండము) దక్షుడు శివుని తిట్టి వీరభద్రుని రూక్ష వీక్షణములచే అధ్వర ధ్వంసము శిరచ్ఛేదము చేయించుకొన్నాడు

(వీరభద్రవిజయము)

ఆ. వ్రాతవెంటగాని । వరకుఁడా దైవంబె
నీతికొలఁదిగాని । వ్రాతగాదు
వ్రాతకజుఁడు కర్త । నీతికిఁ దా గర్త ॥వి॥ 4349

నీతియున్నవానికి బ్రహ్మవ్రాత పనిచేయదు ?

ఆ. వ్రాతవెంటఁగాని । వరమీఁడు దైవంబు
చేతకొలఁదిఁగాని । వ్రాతగాదు
వ్రాతకజుఁడు కర్త । చేతకుఁ దాఁ గర్త ॥వి॥ 4350

బ్రహ్మ అదృష్టకర్త తాను మోక్షకర్త

గీ. వ్రాయనేర్చినఁ జదివిన । వశముగాదు
చేయవలె బుద్ధినొక్కఁడు । చేష్టమీఱి
మాయఁద్రొక్కిన వాఁడెపో । మహితుఁడరయ
కాయపోషణ మొనరింప । గనఁడు వేమ. 4351

మాయ నణచినవాడే శ్రీయుతుడు

ఆ. వింత చదువు చదువ । వివరింపఁగా లేని
హీనుఁ డవగుణంబు । మానలేఁడు
బొగ్గు పాలఁ గడుగఁ । బోవునా మలినంబు ॥వి॥ 4352

సహజగుణములు సపర్యలవల్ల సమయము.

తే. వింత లుడుగని మదిలోనఁ । జింతగలుగు
నంతరంగపు గుడిలోన । నంకురించి
మంతనంబునఁ జేరుచే । మానవృత్తి
సంతసంబందుఁ జింతలు । సమయు వేమ. 4353

సంతాపము లేనివానికి చింతలునశించి యత్రాంతము మూర్తిమంతము చెంతనుండును.

క. వికటంబు మాని భృకుటీ
నికటంబున ముక్తికాంత । నేత్రైయుడి తా
నొక్కటై సమరతి యుపరతి
ప్రకటంబుగఁ జేయునట్టి । ప్రభుగను వేమా ! 4355

ముక్తికాంతా సంగమమునకు సమరతి యుపరతి, తెలిసికొని వర్తించిన వాడే జ్ఞాని.

క. వికలత్వమేమి లేకయ
భృకుటికిఁ బైచూపు నిలిపి । బిత్తరపోకే
యకలంక రూపమందిన
నికరంబగు మోక్షమిదియె । నిజముగ వేమా ! 4355

నిటల తటమున పటు సమర్థతతో నిటలేక్షణుని వీక్షించుచే విముక్తికి మార్గము

క. వికలసుఖ దుఃఖములఁ దాఁ
బ్రకటితముగ నెంచిచూచి । ప్రజ్ఞానిధివై
కళవికలు లేక మెలఁగిన
నికరంబగు బట్టబయలు । నిలుచుర వేమా. 4356

సుకర ప్రాసను సొంపుగా జెప్పుచూ సూక్ష్మ బ్రహ్మ సొంపుజూచే మార్గం చెప్పేడు కవి చంద్రుఁడు.

ఆ. విఘ్నముల కాదికర్తయౌ । విఘ్నపతిని
విశ్వసాక్షిగ నెంచుట । వినతియగును
శుద్ధ చిన్మాత్రుఁడనిఁ యెంచి । సొక్కవలయు
మానసారాధనమె యెక్కు । డౌను వేమ. 4357

మనము విఘ్నేశ్వరుని ఆదిలో పూజించుట అలవాటు. విఘ్నేశ్వరుడే ఆధారము.

ఆ. విజయుఁడైన నరుఁడు । విల్లంది నప్పుడె
కుజనులైనవారు । కూలిరిగద
భజనచేయు ఘనుఁడు । పాలింపకుండునా ! ॥వి॥ 4358

అర్జునుఁడు కురువంశ నిర్మూలన కధచెప్పెను.

క. విజ్ఞాన దృష్టిలోనను
సుజ్ఞాన తపంబుఁ బూని । సూక్ష్మము నీవై
యజ్ఞాన మడఁచి నిండిన
ప్రజ్ఞానము బ్రహ్మపదవి । ప్రబలును వేమా! 4359

అజ్ఞానము అణచే ప్రజ్ఞయే బ్రహ్మ పదవికి బాట

సీ. విజ్ఞాన దృష్టిచే । విశ్వమంతయు నీకు
పరమాణువని తోచు । ప్రాభవముగ
అజ్ఞాన దృష్టిచే । నన్నియు నిజమని
కాన్పించుచుండును । క్రమముగాను
సుజ్ఞాన దృష్టిచే । సుఖతరంబైనట్టి
సకలంబు తా నని । ప్రకటమగును
ఇన్ని మార్గంబుల । నేకరీతిగ జూచు
యోగికి శూన్యమై । యొగినిఁ దోచు
విమలబోధంబుచే రెంటి । సమత గలుగు

కుమతవాదంబు నసియించి । కుదురుపడును
చిత్తశుద్ధామనస్కమై । చెలగుచుండు
తత్పదార్థ మహిమచేత । ధరను వేమ! 4360

దృక్కులు ఒక్కొక్క ఫక్కిని ప్రవర్తిల్లుచుండును. అన్నిటినీ సమీకరించి ఆనందము పొందే దృక్కునే అవలంబించు.

ఆ. విటుడు డాగుఁజేసి । విడిచిపెట్టిన లంజె
పేద పెనిమిటి పడి । ప్రియము సేయుఁ
కుప్పలోని చెప్పు । కుక్కతిన్నట్లయా ! వి॥ 4361

డాగు = మచ్చ; నీచబుద్ధి గల కుక్క రోతలోపడిన చెప్పును గూడా విడువకుండును.

ఆ. విటుఁడు తిరిగిరోసి । విడిచిపెట్టిన లంజె
బీదవిటునిఁ జేరి । ప్రియము సేయు
బండ్లువడ్డ కుక్క । పసరంబుఁ గరవదా! వి॥ 4362

విటులచే విడిచిపెట్టబడి, కర్కుర్తివానిని జేరి టక్కులు చేయును.

ఆ. విటుఁడు పట్టి రోసి । విడిచిన లంజెకుఁ
బిదప నొకఁడు సేరెఁ । బ్రియముతోను
గుడిచి వేయుపుల్లె । కుక్కలు నాకవా ! వి॥ 4363

ఎందరితోనో చిందులుద్రొక్కిన మదవతిని మరగిన విటుడు మందమతిగాడా

ఆ. విటుఁడు స్త్రీని రోసిఁ । విడిచిపెట్టెడువేళ
నేడనున్న సిగ్గు । నెంచనేలఁ ?
గుడిచివేయు పుల్లె । గోతుల దొర్లదా । వి॥ 4364

వ్యభిచారిముండలు మానాభిమానము లుగిడచి మసలుతుంటారు.

ఆ. విటునిఁ గన్న వలపు । విశదమైయుండును
బోటి చూపునకును । సాటిగలదె ?
కంటిలోన పాప । కుంటెనగాఁడయా ! వి॥ 4365

కుంటెనగాడు = తార్చేవాడు; వలపు కాని తిలకించిన వెలయాలికి మై పులకరిస్తుంది.

ఆ. విటునిఁ జేరఁగోరి । వీధిలో మదినుంచు
పడతి రీతిఁ బరముఁ । బ్రాకనగును
గుణములన్ని మఱచి । గుర్తించి చూడరా ! వి॥ 4366

కాంక్షించిన దానికై దీక్షాదక్షులై యుండుట సహజము.

ఆ. విటుల కనుల చెంత । విభ్రమమై తోఁచు
సాటిలేని పొలతిఁ । చక్కఁదనము
కంటిలోని పాప । కుంటెనగాఁడయా! ॥వి॥ 4367

పొలతి కులుకు కనుచూపులు విటులకు వింతచేయువా !

ఆ. విటులకన్న యెంత । విశదమై యుండునుఁ
బోటిఁజూపు కట్టి । పాటిఁగలదె ?
కంటిలోని పాప । కన నెంతవాఁడురా ! వి॥ 4368

కన్నే అన్నింటికి ఆధారము.

ఆ. విటులఁ జూడగానె । మటుమాయఁ జేయును
కిటికియందు జేరి । కేకరించుఁ
బటిమ మీఱు స్త్రీల । బరికింపలేరయా ! వి॥ 4369

వలపు కాని తిలకించలేక పోతే వన్నెలాడి నిలువలేదు.

క. విడుదలలేకయుఁ జూచిన
నెడతెగకయు నెఱుక మఱపు । లెంచక తనలోఁ

బుడమిని మఱచెడు రిచ్చను
తడబడకయుఁ దత్వమంది । తలగకు వేమా! 4270
అతిశయించిన మతితో నారాధించి ఆనంద మనుభవింపుము

క. విడువని మాయా తమమును
గడవఁగలేరైరి జనులు । కడుజిత్రముగా!
సుడివడి పుట్టుచుఁ జచ్చుచు
గడ తేరుటఁ గానరైరి । ఖలులై వేమా! 4371
మాయామోహ జగము శాశ్వతమని మూర్ఖులు తలతురు.

ఆ. విడువ ముడువలేక । కుడువఁ గట్టఁగలేక
వెఱపులేక విద్య । నొరయలేక
వెడలలేనివాని । నడపీను గందురు ॥వి॥ 4372
ఎందుకూ పనికిమాలిన మందమతిని నడపీనుగని సతులే అంటారు.

ఆ. విడువవలయు నూరు । విశ్రాంతి గాకున్న
విడువవలయు నాలి । విధము చెడిన
విడువవలయురాజు । వితరణి గాకున్న ॥వి॥ 4373
పనికిమాలిన వారిని పట్టున విడువ వలయును.

ఆ. వితరణంపుఁ జూడ్కి । విశ్వరూపముఁ జూచి
మతిని గడకు ద్రొక్కి । మానమూని
సతతమెన్నువాఁడు । సరసుఁడే యిలలోన ॥వి॥ 4374
ప్రఖ్యాతిగా దానము చేయువాడే వితరణశాలి.

ఆ. వితరణుండు తానె । విజ్ఞాన తపమూని
మతికి గతియటంచు । మరిగి తిరుగ
సతత మాత్మయందె । సందేహములురోయు ॥వి॥ 4375
ప్రఖ్యాతి నార్జించిన వారికి భావములోనున్న సంశయాలు సమయును.

ఆ. విత్తనంబు గురువు । విశ్వంబు లోపలఁ
బ్రణవమంత్ర మరయ । బరమగురువు
కర్మగురువు తనకుఁ । గారణమాబుద్ధి ॥వి॥ 4376
బీజము వంటివాడు గురువు.

ఆ. విత్త మొకరికిచ్చు । వితరణ గుణమును
జిత్త మొకరికిచ్చు । చెన్న పఱచు
బ్రహ్మచేతలన్ని । పాడైనచేతలు ॥వి॥ 4377

విరించి మంచిగుణముల నన్నింటిని యొంచి యొక్కరి కీడు

క. విత్తవను మఱయు దలలో
బొత్తున జనియించి పొట్ట । పోయిన భంగిన్
దత్వజ్ఞానికి కర్మం
బత్తెఱగున విడిచిపోవు । ననువున వేమా! ॥ 4378

విత్తనము మొక్క రెమ్మలు విడిపోయి మహావృక్షమగును.

ఆ. విత్తహీనమైన । వేళయందును దల్లి
తనయు, లాలు, సుహృ । దులనెడు లోకు
లెల్ల శత్రువులగుదు । రెందునజెడెదవు ॥వి॥ 4379

డబ్బులేనివారికి దగ్గరవారూ దూర మౌతారు.

క. విత్తును నుముకయుఁ దమలోఁ
బొత్తునఁ బుట్టఁగను బొట్టు । పోయిన భంగి
న్వేత్తగు నాతనిఁ గర్మం
బత్తెరగున విడిచిపోవు । ననువుగ వేమా! 4380

వడ్లగింజ ఊకా తవుడు విడి బియ్యమగును.

ఆ. విత్తు ముగ్గనేని । వృద్ధికానేరదు
విత్తు ముగ్గకున్న । వృద్ధియగును
విత్తె విశ్వకర్మ । వివరించి చూడరా! వి॥ 4381

పరువు దప్పిన ఫలకారి కాదు.

ఆ. విత్తు మొదటిగురువు । విశ్వంబునకు నెల్ల
ప్రణవమంత్ర మొకట । పరమగురువు
కర్మగురువు సుమ్మి । గాయత్రి మంత్రంబు ॥వి॥ 4382

గాయత్రీ మహామంత్రమే కైవల్యమిచ్చునది.

ఆ. విత్తులేని యట్టి । వృక్ష మొక్కటి పుట్టె
ఫలము పువ్వురెమ్మ । పత్రిలేదు

స్వాదు లేదు చూడ । సాపాటునకు లెస్స
దీనిభావమేమి । తెలుపు వేమ. 4383

తిరుమలేశుని తరిమి పరముప పనికివచ్చునట్లు వేమన్న దీనిని ప్రజల కందిచాడు.

ఆ. విత్తు విశ్వకర్మ । విశ్వంబులోపలఁ
ప్రాణియనెడి చెట్టు । పరగుచుండు
నోలిఁజెట్టు చచ్చు । మూలంబు చావదు ॥వి॥ 4384

దేహము నశించును. దేహినశించదు (భగవద్గీత)

ఆ. విద్య గలిగియుండి । వినయము లేకున్న
నైదువలకు మేలి । మైన మణుల
సొమ్ములుండి కంఠ । సూత్రంబులేనట్లు ॥వి॥ 4385

వివిధ భూషణములు ధరించిన వెధవరాలి వలె, విద్యయుండి వివేకములేకపోవుట ;

ఆ. విద్యగలిగియుండి । వితరణిఁ గాకున్న
నయిదువులకు మేలి । మైన మణుల
సొమ్ములుండి కంఠ । సూత్రంబులేనట్లు ॥వి॥ 4386

అయిదువులు=ముత్తైదువులు; అన్నీ వుండీ అసలుది లేకుంటే అయిదవ తన మేదీ!

క. విద్యల లోపల నీతియు
వాద్యంబులలోన వీణ । వర రసికులకున్
హృద్యంబై విలసిల్లిన
విద్యలలో బ్రహ్మవిద్య । విద్యర ! వేమా ! 4387

శ్రేష్ఠమైన వాటిని చెప్పాడు.

ఆ. విద్యలేకయున్న । విత్తము లేకున్న
మూఢుఁడైనఁ దుదకు । మూగయైన
నిష్టబంధువునకు । నీయుడు గన్యను ॥వి॥ 4388

విద్యావిత్తములే వియ్యానికి నెయ్యము జూపును.

ఆ. విద్యలేనివాఁడు । విద్వాంసుల కడల
నుండఁగానె పండి । తుండు గాఁడు
కొలని హంసల కడఁ । గొక్కెరలున్నట్లు ॥వి॥ 4389
పండితులలోనున్న పనికిమాలినవాడు హంసలలో కొంగే

క. విదితంబగు ఘటమవసిన
మదితంబగు నాకసంబు । నుప్పర మొకటౌ
నదె విధము వి దేహంబను
సదమల కైవల్య సరణి । సంపద వేమా! 4390
శరీరము విడచిన జీవి వాయువులో లీనమగును.

ఆ. విధవ పొందుగూడ । విధి కడ్డమైయుండు
బ్రతుకు వాంఛలెల్ల । భ్రమకుఁజోటు
బ్రదుకు చావులెల్ల । మెదుకులకాయెరా! వి॥ 4391
ప్రాణి బ్రతుకుటకు చచ్చుటకూ అన్నమే ఆధారము.

క. విధి కృతమందురె యన్నియు
విధికిని విధి లెస్సయయ్యె । విష్ణు నుతింపన్
విధి యెవ్వఁడందురావల
విధి బ్రహ్మము తలఁపఁ । దలఁప వెలయుర వేమా! 4392
కర్మ ప్రాప్తికి బ్రహ్మ కారణమందురు. బ్రహ్మ కర్మకు ఎవరు కర్తలు ?

క. విధికృతమ యందురందరు
విధి విధికిని లెస్సయయ్యె । విష్ణు నుతింపన్
విధియందె దివ్యరాసులు
విధి బ్రహ్మము దెలియ దెలియ । వెలయదు వేమా! 4393
విధికృతులు=బ్రహ్మనిర్ణయము; బ్రహ్మనిర్ణయమా! భావనిర్ణయమా!

కం. విధి కృతములందు రన్నియు
విధికిని విధిలెస్స యయ్యె । విష్ణుని జంపెన్
విధి యభవు రూపమందెను
విధిబ్రహ్మము సుమ్ము తలఁప । వినరా వేమా! 4394
మనము చేయునదే మనకువచ్చునుగాని వనజాసను డేమిజేయును ?

కం. విదిలేక జరుగదనుచును
మదిలో నే వస్తువైన । మనసునఁ గూడుం
బొదలుచు విడువఁగ జాలని
యదియే సంసార బీజ । మనఁబడు వేమా ! 4395
సంసార బీజమే జనులను సమయఁజేయును.

తే. వినతిసేయుచు సద్గురు । వేడిభక్తి
మును భ్రమరకీటక న్యాయ । మునను దగునే ?
వాని నెన్నంగ దరమె యీ । వసుధలోన
సాధుసన్మార్గ మదె యగు । సతము వేమా ! 4396
భ్రమర కీటన్యాయముగా గురువు నాశ్రయించి గురువు కావాలి.

ఆ. వినర నరకమెల్ల । వెలిఁద్రోసి వాయువుల్
మనలోనగూర్చి । మర్మమెఱిఁగి
ఆత్మలింగపూజ । నంటిన ముక్తి రా ! ॥వి॥ 4397
ఆత్మలింగని జూచి యానందించుట ఆఖరు కోరిక.

క. వినవలె దశవిధ నాదము
గనవలె నిర్భేదపదము । గాంచిన పైపై
గనవలె "సోహాం" భావము
మనవలె బరిపూర్ణ మూని । మదిలో వేమా ! 4398
దశవిధ నాదములలో " సోఽహం " భావము వినినవాడే ధన్యాత్ముఁడు.

కం. వినవలె నాదము తనలోఁ
గనవలె బ్రహ్మంబు విడక । కౌతుక మొప్పం
గనవలె "సోహాం" భావము
తనుదానై "పరము" నందు । దగులక వేమా ! 4399
తనకుతాను " సోఽహం " భావము వినుట తత్వజ్ఞునకు ధర్మము.

కం. వినవలె నెవ్వరు సెప్పిన
వినినంతనె తమకపడక । వివరింపవలె

న్గాని కని వివరముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతి పరుఁడు । మహిలో వేమా ! 4400

సుమతీశతక పద్యమును జూచి జూడనట్టుగా యిందు జేర్చారు.

తే. విన్నదన్నది కన్నది । వింతలగును
నిన్న మొన్నను గన్నది । నేఁడు లేదు
అన్నిఁటను నిండియున్నది । యందవలెను
హృన్నళినమందె తానుండు । నెపుడు వేమ. 4301

హృన్నళినము = హృదయ పద్మము ; విన్నదీ, కన్నదీ, మన్నదీ, తిన్నదైన మార్గమును ఎన్నుకో !

ఆ. విన్నవాఁ డెవండొ ? । కన్నవాఁడెవ్వఁడో ?
విన్న, కన్నవాఁడు । వెలయు నొకఁడె
అరసి చూడవలయు । నంబుధినైనను ॥వి॥ 4402

సర్వమునకు కర్త శంకరుడే !

ఆ. విన్నవానిఁ గన్న । గన్నవాఁ డధికుండు
కన్న వానికన్న । గలియువాఁడు
ఉన్నతోన్నతుఁడయి । యుర్విలోపలనుండు ॥వి॥ 4403

ముక్తి కాంతా రక్తి కాంతలను అయత్తపరచి చిత్తమున కర్తే మార్గాన్ని పొత్తుపరచుకో !

ఆ. విన్నసుద్ది కొంత । వినని సుద్దులు కొన్ని
వింత సుద్దులెన్నొ । వినఁగఁ దెలియు
దానుగన్న యట్టె । ధరలోనఁగందురా ! ॥వి॥ 4404

తానుజూచిన భావంగానే యితరులు చూస్తారని ఎట్లు చెప్పుట.

కం. విని కని పెద్దల పలుకులు
మనవలెఁ బరిపూర్తిఁ జెంది । మసలక లోనే
పనుపడఁ గోరుచు నుండిన
మనుజుఁడె పరిపూర్ణుఁడగును । మహిలో వేమా ! 4405

పెద్దల వాక్యములు విని పేరు ప్రఖ్యాతులు సంపాదించుకో.

కం. విని కలయికలను బాయును
కని కలిసిన కాంతఁ గూడి । కలయుం బాయుం
గని కలియఁ బ్రేమ పోవును
గని కొనఁగాఁ బ్రేమ యెదియొ । కనరా ! వేమా ! 4406
ఉపమ వలన యుపదేశము వలన యొకేరకముండునా !

కం. వినియుండెడి జనమెల్లను
చనిపోయిన వారి పుణ్య । సత్కథ వెలమిన్
వినవలె, కనవలె, ననవలె
ననిమిషునకు నైన దెలియ । దంత్యము వేమా ! 4407
పూర్వగాథలను పుక్కిట నుంచుకొని పూజ్యుఁడవు గావలయును.

ఆ. వినియు వినకయుండు । వెఱ్ఱివాఁడై యుండు
కనియు కనక యుండు । కడఁగి యోగి
మనుజ వరుల చేత । మఱిపూజఁ గొనుచుండు ॥వి॥ 4408
మహాత్ములు వెఱ్ఱివలె మసలుతుంటారు.

ఆ. వినియు వినకయుండు । కనియుఁ గానకయుండు
తలఁచి తలఁపకుండు । దానుయోగి
మనుజ వరుల చేత । మఱిపూజఁ గొనుచుండు ॥వి॥ 4409
మనుజులు పూజించినవారు మహాత్ములు గారా !

కం. వినుకరి కనుకరిఁ గోరును
కనుకరి యా కాంతఁగూడ । గవయం గోరుం
గనుఁగొనఁ బ్రేమను బొరలును
ఘనతర మోహంబు చేటు । గదరా వేమా ! 4410
విన్నంతవలన. కన్నంతవలన కోరిక లూరును.

కం. వినుమా నిటలముఁ జేరఁగ
ఘనమగు నొకశక్తి కలదు । కడుజిత్రముగాఁ
గనుఁగొన దానికి నవ్వల
గనకంబను జ్యోతిఁగలదు । కనుమా ! వేమా ! 4411
నిటలముపై నున్న సహస్రారములో “ సోఽహం ”ను జూడుము.

ఆ. వినుర నరకమెట్లు । కనకుండ నందున్న
గురునిఁజేరి మర్మ । మెఱుఁగునంత
వీలు కలుగునతఁడు । మేలుమార్గము చూప ॥వి॥ 4412

గురుని గురితో నరకము నాశనమగును.

ఆ. వినుర నరకమెల్ల । వెలిమూసి వాయువుల్
మనసులోనఁగూర్చి । మర్మమెరిఁగి
ఆత్మలింగ పూజ । నంటిన ముక్తి రా! ॥వి॥ 4413

పంచవాయువుల బంధించి ఆత్మలింగా న్నర్చించుటే ఆంతర ముక్తి.

ఆ. విను వివేకమనెడు । వింత గొడ్డలిచేత
నలయ విద్యయనెడు । నడవి నఱికి
బ్రహ్మమం దెఱింగి । పాటించినంతట
ముక్తిఁ జూడవచ్చు । మొనసి వేమ. 4414

వివేక కుఠారముచే అజ్ఞానాటవిని అంతమొందించు.

ఆ. విప్రవరుఁడు చెడ్డ । పిండంబుఁ దినఁబోవు
పేరటమున కరుగుఁ । బెండ్లిపడుచు
కులము మొదలు పోవఁ । గూలెపో మానంబు ॥వి॥ 4415

“ క. కులము చెడ మాన మేగును
కలిమి నశించంగ బుద్ధి కంగారెత్తున్
వెలయువతి పొందు తీరిన
కళవళపడి మనసు కష్టగతు లందుక్రియన్ ”

ఆ. విప్రవరుల మనుచు । వేదంబుఁ జదువక
ప్రాకృతులను జూచి । పరిహసించు
ధరణి సురలకన్న । దాసరి మతెమెచ్చు ॥వి॥ 4416

బ్రాహ్మణులకన్న సాతానవైష్ణవులే మిన్నయని వేమన్నసూక్తి.

ఆ. విప్రవరుల మూర్త । వివరము నమ్మచుఁ
బెద్దల నొగిఁగూర్చి । పెండ్లిచేయు
నువిద ముండయౌను । హూర్తము నిజమెట్లు ॥వి॥ 4417

ముహూర్త బలిమే యున్న ముండెందుకవాలి ?

ఆ. విప్రవరులయందు । విహిత కర్మలయందు
నీతినుంచువాఁడె । నిల్మలుండు
భక్తిగలుగువాఁడె । పరమార్థ పరుఁడయా ! ॥వి॥ 4418
సద్బ్రాహ్మణులను సత్కరించినవాడే సరసుడు.

ఆ. విప్రునెంగిలాకు । వీధికుక్కలపాలు
మాలపుల్లెయైన । మానితంబు
మంతుకెక్కునాకు । మాలపుల్లె యటంచ్రు ॥వి॥ 4419
మాలవాడు తిన్న విస్తర మంచిది.

ఆ. విప్రులెల్లఁ గూడి । వెట్టికూతలు కూసి
సతి పతులనుగూర్చి । సమ్మతమున
మును ముహూర్త ముంచ । ముండెట్టులాయెనో ॥వి॥ 4420
ముండమోయుటకు ముహూర్తమున్నదా ?

ఆ. విమల చక్రమందు । వింతలన్ని తెలిసి
సమపు గాలిచేత । సన్నుతింపఁ
గనఁగరాదు మహిమ । ఘనులకైననుగాని ॥వి॥ 4421
సహస్రార చక్రములో సమీరమును జూచిన సత్త్వజ్ఞుడు.

ఆ. విమలదృష్టిఁ బూని । విజ్ఞానమందక
తమముఁ బాయరాదు । తథ్యముగను
దమము మీఱినంత । తత్త్వార్థమందును ॥వి॥ 4422
విమలదృష్టి వలన విజ్ఞానము దానివలన తత్త్వము కుదురును.

తే. విమల నిర్గుణ తత్త్వమంది । వెలవనేల ?
నిత్యనైమిత్తి । కాచార నిపుణుఁడగుచు
దివ్య పరిపూర్ణ దృక్కుంది । తేజరిల్లు
పేర్కొందురెల్లెడఁ । గాదె ? వేమ. 4423
ఘనులు విజ్ఞానము నారాధింతురు.

ఆ. విమలసృష్టిఁ బూని । విజ్ఞానమందలి
తమముఁబాయనగునె ? । తథ్యముగను
దమము మీఱినంతఁ । దత్త్వార్థమందురు ॥వి॥ 4424
అజ్ఞానాంధకార మణచిన సుజ్ఞాన సూర్యుడుదయిస్తాడు

క. విమలాంత రంగమందును
సమగతియగు నిష్ఠఁబూని । సత్యముఁగనుచే
యమ మూల సంచితంబులు
క్రమముగఁ దెగ సత్యమమరు । గట్టడి వేమా! 4424

అష్టాంగ యోగములే ఆధారచక్రాని కాధారము

ఆ. వివర నరకమెల్ల । వెలిమూసి వాయువుల్
మనసుతోడఁ జేర్చి । మర్మమెఱిఁగి
యాత్మలింగపూజ । నంటిన ముక్తిరా! ॥వి॥ 4425

వాయువును హృదయమున పదిలపరచిన చిన్మయబ్రహ్మ చిక్కుతాడు

ఆ. విశ్వకర్మ గురువు । విశ్వంబునకునెల్ల
బ్రణవమంత్ర మొకటి । పరమగురువు
కర్మ కపుడు గురువు । గాయత్రి మంత్రంబు ॥వి॥ 4426

గాయత్రీ మహామంత్రము కలుషముల నడచి కైవల్య మిచ్చును.

ఆ. విశ్వకర్మ పూజ । వేడ్కతోఁ జేయఁగా
విశ్వము జననమయి । వెలయుచుండు
విశ్వకర్మయాది । విమల విరాట్టగు ॥వి॥ 4427

విశ్వకర్మ జగత్సృష్టికి కర్తైనా!

ఆ. విశ్వకర్మపేరు । విశ్వదేవుండని
పుణ్య కార్య విధుల । బూజఁ జేసి
నమ్మకుండువారు । నరకమునఁ బడరే? ॥వి॥ 4428

విశ్వకర్మ యొక్కడే విశ్వేశ్వరుఁడు విశ్వకర్మ కులముల వాదము

ఆ. విశ్వకర్మ మహిమ । వినఁగ విచిత్రంబు
విశ్వకర్మ మహిమ । శాశ్వతంబు
విశ్వకర్మలేమి । విశ్వంబు నిలుచునా! ॥వి॥ 4429

విశ్వ=సమస్తము; కర్మ=పనులుచేయువాడు. కర్మ=శాలి; విశ్వ
అయ్యెను కర్మి+శాలి=పనులుగలిగిన వాడు తుదకు "కంసాలి" యయ్యెను

ఆ. విశ్వకర్మలేక । విశ్వంబు లేదురా !
విశ్వకర్మచేయ । విద్యలన్ని
విశ్వకర్మలేమి । విశ్వంబు పాడురా ॥వి॥ 4430

విశ్వకర్మ లేనిదే విశ్వ మెట్లు సృష్టయింది ?

ఆ. విశ్మకర్మలేని । విశ్వంబు చూడరా
విశ్వకర్మ చేసె । విశ్వమెల్ల
విశ్వకర్మ లేని । విశ్వంబులేదయా ! ॥వి॥ 4431

చేసినవాడు విశ్వకర్మ గనుక విశ్వమను పేరొచ్చెను.

ఆ. విశ్వకర్మలేని । విశ్వంబు మఱిలేదు
కుడువఁ గూడులేదు । కోక లేదు
విశ్వమయుఁడె యట్టి । విభునేలఁ దెలియరో ! ॥వి॥ 4432

అన్నిటికి ఆధారమైన వాడు గాబట్టి యింతగా వేమన ప్రశంసించెను.

ఆ. విశ్వ కర్మసుతులు । వెలయు దేవతలెల్ల
కానక తిరిగెదరు । కష్టజనులు
అట్టివారి యెంగి । లందఱు తిందురే ॥వి॥ 4433

విశ్వాన్ని సృష్టించాడు గాబట్టి విశ్వకర్మ. యొకరింట తినడు వారింట మరొకరు తినని అధిఖ్యాత సంపాదించాడు.

ఆ. విశ్వకర్మసృష్టి । వివరంబుగాఁ జేయ
విశ్వమంతఁ దృప్తి । వెలుంగుచుండు
విశ్వకర్మగాదు । విమల విరాట్టయా ! ॥వి॥ 4434

విమల విరాట్టు విశ్వకర్మగా వేమన చెప్పుతున్నాడు.

ఆ. విశ్వతత్వమెల్ల । విశదంబుగఁ దెలిసి
భక్తి మూలమెల్ల । బాగు పఱచి
రక్షకత్వమందు । రాజయోగివి కమ్ము ॥వి॥ 4435

భక్తి, యుక్తి, శక్త్యానుసారముగా రమణీయమైన రాజయోగము చేపట్టమన్నాడు మనకవిరాజు.

ఆ. విశ్వనాథుఁడనుచు । విశ్వ కారణుఁడన్చు
విశ్వకర్మ వేధ । వినుతిఁ గనుచు
విశ్వకర్మ యాది । విశ్వగురుండగు ॥వి॥ 4436

అది విశ్వేశ్వరుఁడే విశ్వకర్మయని వేమన వినుతించాడు.

ఆ. విశ్వనాథు నందు । విప్రుల యందును
వినయ మందు । వేద విధులయందు
భక్తిలేని వాఁడు పాపాత్ముఁ । డిలలోన ॥వి॥ 4437

"వి" ఆదిలో నున్న వారిని విశ్వాతీతులని వేమన వేడ్కతో చెప్పెను.

ఆ. విశ్వమందుఁ బరుని । వివరంబుఁ గానక
పరమహంస నెట్లు । పట్టవచ్చు?
మానసమున నిష్టఁ । బూనఁగవలెఁగాని ॥వి॥ 4438

మానసారాధన పరమహంసను పట్టుకొనుటకు ప్రాపైనది.

ఆ. విశ్వమందు బ్రహ్మ । విస్తరించుట గాక
వేఱె బ్రహ్మమునికి । వెదక నేల?
తగిలి యుండెఁగాదె । తనలోనె బ్రహ్మంబు ॥వి॥ 4439

తనలో నున్న తత్త్వముఁ దెలియక తన్నులాడుతా రెందుకూ ?

ఆ. విశ్వమనఁగ నేమొ । వివరించి చూడండి
విశ్వ మైదుచేత । వెలయుచుండు
విశ్వము మదిలోన । వెదకి వీక్షింపుడీ ॥వి॥ 4440

పంచభూత వినిర్మాణమైనదే విశ్వము.

ఆ. విశ్వము నడపంగ । విశ్వేశ్వరుండుండు
బ్రాహ్మణులకు నేల? । పాటి దక్క
వనములోని కోతి । వసుమతి నడపునా! ॥వి॥ 4441

విశ్వము నడుపువాడు విశ్వేశ్వరుఁడు. అయిన మనాధిక్యతేమి ?

కం. విశ్వములో వెలి తానై
విశ్వాతీతుండు మఱియు । విశ్వంభరుఁడై
విశ్వమునకు వేఱగుచును
విశ్వములో వెలుఁగుచుండు । విడువక వేమా! 4442

వేదవేద్యుఁడు శెలిగాలిలో అంటీ అంట కుంటాడు.

ఆ. విశ్వ మూలమందు । విశ్వభావముఁ జెంది
పండియుండుఁ జేను । బట్టబైట
పండునసెనుచేను । భావంబు దెలియరో ! ॥వి॥ 4443

పరిపక్వమైన మోక్షఫలాన్ని మానస బీజముతో పండించుకో !

తే. విశ్వరూపము మదిలోన । వెలయఁజూచి
హ్రస్వ మమరఁగ బుద్ధిని । నంది పట్టి
స్వస్వరూపముఁ గనువాఁడె । సజ్జనుఁడు
శాశ్వతానంద మందఁగఁ । జాలు వేమా ! 4444

హ్రస్వము = కురుచ : మదిని కుదించి భక్తిని పోషించి పరమును పట్టుకోమన్నాడు.

ఆ. విశ్వ రూపుఁడైన । విశ్వేశ్వరుండుండు
విశ్వమందుఁ దాను । వెలుఁగుచుండు
విశ్వకర్మ తానె । విశ్వంభరుండయా ! ॥వి॥ 4445

ప్రపంచాన్ని భరించినవాడు విశ్వంభరుడు.

సీ. విశ్వవిరాడ్రూపి । విశ్వకర్మనఁగను
విశ్వాసహస్రాక్ష । విశ్వకర్మ
విశ్వరూపుఁడు తృప్త । విశ్వకర్మనఁగను
విశ్వవిశాంపతి । విశ్వకర్మ
యని వేదముల నిట్లు । వినుప్రజ్ఞచేఁ బల్కు
దెలిసినారే మున్ను । తేటఁబడఁగ
నావేదగోచరుం । డా నిత్యవర్తియు
నా విరాణ్మయమూర్తి యామహాత్ముఁ

డా మహాదివ్య పురుషుండ । నాదియోగ
కల్పితుండును త్రైలోక్య । కారణుండు
గుణములకు నెల్ల బ్రకృతియై । కొమరు వసుధ
వెలసె నభిరామ రూపుఁడై । వినర వేమ. 4446

తనగురువగు అభిరామయ్యను విశ్వకర్మ వంశోన్నతుడు గావున గురుభక్తిని నిరూపించెను.

ఆ. విశ్వ సింపరాని । విశ్వంబు మఱిలేదు
కుడువఁ గూడులేదు । కోకలేదు
విశ్వమయుఁడె యైన । విభునేల ? దెలియరో ! ॥వి॥ 4447
విశ్వాతీతుఁడు తనలోనే సర్వముంచుకొన్న నిద్రాహారములకు నెల వేది ?

క. విశ్వాస ఘాతకులెయై
వేశ్యల మేమేయటనుచు । వెలలుగొనుచునా
శాశ్వత లాభము నొందుచు
విశ్వములో దొంగలనఁగ । వెలసిరి వేమా ! 4448
వెలయాండ్రు విట కాండ్ర నిలువెల్ల దోచుకొంటారు.

క. విశ్వోత్పత్తికి నజుఁడని
విశ్వము రక్షింపఁ బెంప । విష్ణుండని యీ
విశ్వముఁ జెరుపఁగ హరుఁడని
విశ్వేశుల కిట్టిపేర్లు । వెలసెను వేమా ! 4449
త్రిమూర్తులు సృష్టి స్థితి, లయ కారకులు (వేదప్రమాణం)

క. విషమును బొరసినఁ బొలియడు
విషదిందీవర దళంబు । విధమున మఱి తా
విషయారి వర్గములలో
విషములు తనుఁబొరయకుండ । వేమన నేర్చున్. 4450
సర్వమూ సమత్వమున గనిన వానికి విషమని నీరని యుండదు.

క. విషయములఁ దెరలి పొలుపుగ
విషయము లంటక మహాత్ము । విధమున ధరలో
విష సంసారమ్మును విడి
విషయములన్నియును గెల్వ । వేమన నేర్చున్. 4451
విషయ లోలత్వము లేక విషయముల సంగతుల కూలంకషముగా తెలిసినకోవిదుఁడీ వేమన

క. విషయములఁ బొరలి రోయక
విషమంటిన గతినిజూచు । విధమున ధరలో

విషసమము లాయె సుఖములు
విషయమ్ములఁ గూడకుండ్రు । వేత్తలు వేమా ! 4452
విజ్ఞానవేత్తలు విషయముల విధానములు గుర్తించి వాటిని విడిచి పెట్టుదురు.

క. విషయము లొరసిన నొరయఁడు
విషయేంద్రియ పరదళంబు । వివరింపంగా
విషమారి షట్కమను దు
ర్విషయములను బొందకుండ । వేమననేర్చున్. 4453
విషయ షట్కము విడచిన విజ్ఞాని. వేమన

తే. విషయ సంబంధమూలమై । వెలయు సుఖము
భూరి సంసార జలధిలోఁ । బొర్లి మునిఁగి
* అంగనాసక్త చిత్తులై । వెలయుచుంద్రు
మోహమును వీడ లేకుంద్రు । మురిసి వేమ. 4454
యతితప్పు; అంతులేని సంతులతో సంసారకూపమున చింతతో నుంటారు.

ఆ. విషసహితులు । విషధరు లెన్నఁగ
వృషభ వృషణములను । విఱియఁగొట్ట
నఘమువచ్చుఁ గడకు । నాయువుఁగొదవగు ॥వి॥ 4455
గణము తప్పు; గిత్తలకు బుడ్డలు గొట్టుట పాపమని అన్నాడు.

ఆ. విష్ణు గర్భమందు । వెలసెను లోకమ్ము
లందు సకల జీవు । లమరఁ గలవు
ప్రాణికోటు లెల్లఁ । బరగవైష్ణవులయా ! ॥వి॥ 4456
"సర్వమును విషుమయమని శాంతి బొందుము" (భాగవతం)

ఆ. విష్ణు దుర్బుద్ధిచే । పృథివిలో శివమూర్తి
మోహినైనాఁ జూచి । మోహపడెడు
వారికున్న మదము । నరులకుండఁగ లేద ! ॥వి॥ 4457
జగన్మోహిని విలాసాన్ని వీక్షించి శంకరుఁడు కింకరు డయ్యాడు.
(అమృత మథనము)

ఆ. విష్ణు నంశమందు । వివిధ విరక్తులు
కలుగునట్టి వెల్లఁ । గాలఁద్రొక్కి
నిలిచిచూడఁ గాను । నిశ్చల తత్వంబు ॥వి॥ 4458

వీరవైష్ణవులు కలవానిని విసర్జించి కైవల్యానికి ప్రాకుతారు.

ఆ. విష్ణు భక్తులెల్ల । విభూతి పాలైరి
శివుని భక్తులెల్ల । సిద్ధులైరి
భక్తులెల్ల జీవి । పాలుగాఁ బోయిరి ॥వి॥ 4459

విభూతి=ఐశ్వర్యము; సిద్ధులు=అణిమాది అష్టసిద్ధులు.

ఆ. విష్ణు భక్తులెల్ల । వెలిబూచి పాలైరి
వాదమేల ? మతవి । భేదమేల ?
దెలియు లింగధరులు । తిరుమంటి పాలైరి ॥వి॥ 4460

వైష్ణవులు మన్నుధరించి దహనము చేయుట వలన బూడిద పాలు,
శైవులు విభూతిధరించి పాతిపెట్టుట వలన మట్టిపాలు.

ఆ. విష్ణుయోని కాదె । వివరించి చూచిన
శివుఁడు లింగముగద । సిద్ధము గను
రెంటి కళల సందు । నంటెను బ్రహ్మంబు ॥వి॥ 4461

విష్ణువు క్షేత్రము, శివుఁడు బీజము.

ఆ. విష్ణువునకు సొద్దు । వృషభాంకునకు సొద్దు
బ్రహ్మకైన సొద్దు । బలువుగాను
వేమనకొక సొద్దు । వేసితి నని చెప్పు ॥వి॥ 4462

అన్నివిధాలా అందరి కపనిందలే !

తే. పీగిలాగుచు గాలిని । విడిచిపెట్టి
యూరు చక్రంబు లందది । యమరుబట్టి
మేరు శిఖరముపై నున్న । మిహిరుఁడెవఁడు ?
వాఁడె బ్రహ్మంబు తెలియంగ । వలయు వేమ. 4463

మిహిరుఁడు=సూర్యుఁడు; స్వైరసంచారాన్ని జరిపి జ్ఞానివి కమ్మన్నాడు

ఆ. వీటిదాని పొందు । విడువఁజాలని వాఁడు
చచ్చుదాక మోయుఁ । జాప గుడిసె
భాగవతుల పట్టు । బాపంగ నోపఁడు ॥వి॥ 4464

" విధముచెడి యీటివానికి దగుల్కొంటే చచ్చినదాకా చాపలమోతే "

ఆ. వీడవలయు వారిఁ । గూడిన నెగ్గగు
వీడు వాడలందు । వెలసి వాఁడు
పాడుచేయు పనులు । పరిపాటియే కదా! ॥వి॥ 4465

దుర్జనులకు దూరంగానుండుము.

ఆ. వీనులందు నదేమొ । వినిపింప నా దనుచు
యెదిరించి తెవ్వరైన । పేద వటంచు
పల్లాలగొట్టేరు । మాట్లాడ బోకురా! ॥వి॥ 4466

ఎదురు మాట్లాడు వానిని పంప్లూవ గొడుదురు.

ఆ. వీనులందున బల్కె । వీర్య నాథుని తోడ
వాదులాడఁగ వలయు । వేడ్కలలర
వాదులాడకపోతె । పునికెట్లు గలుగురా! ॥వి॥ 4467

* గణములు యతులు తప్పు; వీర్యనాథుఁడు = శివుఁడు

ఆ. వీనులందు వినెడి । వేడుక గుఱిదాటఁ
బూని ప్రణవ రవళి । భోరు కొనెడి
స్వానుభవముఁ గోర । సన్యసింపఁగవలె ॥వి॥ 4468

ప్రణవ నాదాన్ని శ్రవణ రంధ్రములో విన్నవాడే జ్ఞాని.

ఆ. వీరవర మహేశ । విభవంబుఁ జేపట్టి
బాహ్యవిద్యచేత । బరగు టెట్లు?
పురికి సింహమెఱిఁగి । పోయిన చందంబు ॥వి॥

వీరశైవ మతాన్ని వినుతించాడు.

ఆ. వీరశైవ ధర్మ । విధము లెఱింగియు
బ్రహ్మవిద్య మీఁద । బరగె నేని
చెలఁగి పులికిబంటు । సింగపుఁ బిల్లయా ॥వి॥ 4470

వీరశైవులు బ్రహ్మమును బడసిన విశ్వాతీతులు గారా!

ఆ. వీరశైవ మనెడి । విభవంబు చేపట్టి
బ్రహ్మవిద్య మీఁదఁ । బరగకున్న
పూరికి మృగరాజు । పోయిన చందంబు ॥వి॥ 4471

శైవులు బ్రహ్మము నెరుగనిఎడల పనికిమాలినవారు; పూరి = గడ్డి.

ఆ. వీర్య వృద్ధిలేక । పట్ట చచ్చినజీవి
దాసి యింటికి పోయి । దిగులుచేత
విషయించ లేకను । వెధవయై కూర్చుండు ॥వి॥ 4472

పుంస్త్వము లేనివానివలె పొందికలేక అర్థంగా అకతాయిగా ఉంది.

ఆ. వీఁడుఁడైనరాదు । వినయమున్నను రాదు
చదువులందు రాదు । సటలరాదు
జన్మపాకముననె । సఫలమౌనరులకు ॥వి॥ 4473

జన్మ సంస్కారము చేత సర్వమూ సిద్ధించును.

ఆ. వీఁడుఁడైన లేదు । విద్యనేర్చినలేదు
సత్కులమున లేదు । సటలలేదు
జన్మఫలమెకాని । జపియించినను రాదు ॥వి॥ 4474

పూర్వపుణ్యము లేక ఏదయూ అందీ పొందదు.

ఆ. వీలుగ జడలు పులి । తోలు విభూతియు,
గక్షపాలలు పది । లక్షలైన
మోతచేటెగాకి । మోక్షంబు లేదయా ? ॥వి॥ 4475

జడలు, విభూతి, పులితోలు, కక్షపాలలు ధరించుట కక్షలు పెంచుటకే మోక్షానికి గావు.

ఆ. వృక్షములకు మంచి । వ్రేళ్ళు రెమ్మ చిగుళ్ళు
మత్స్యముల కందంబు । ముక్కు చెవులు
పక్షుల కందంబు । పల్కులొకటేనయా ॥వి॥ 4476

సృష్టి, అందాన్ని పొందికగానే జెప్పాడు.

ఆ. వృక్షనామము వేఱె । వృక్షంబు నొక్కటే
పుష్పనామము వేఱె । పుష్ప మొకటే
ఫలనామము వేఱె । ఫలమెల్ల నొక్కటే ॥వి॥ 4477

నామరూపములు వేరుగానున్ననూ అసలు పదార్థమంతయూ నొకటే.

ఆ. వృశ్చికంబును కుక్క । ద్రేలాడుటయుఁ జూచి
పండ్లగఱచియు దాన్ని । పట్టఁబోతె
ముక్కుపై కొండెతో । మూట కుండిసుచునా ? 4478

దుష్టులకు దూరముగా నుండుట మేలు.

ఆ. వెండికొండ పసిడి । కొండయు దనకుండ
దేవుఁడేల బోయి । తిరిపె మెత్తె ?
ఆతఁడెంతటి ఘనుఁ । డైన నడుగ కుండఁ
దీరదయ్య భువిని । తివిరి వేమ. 4479

యీశ్వరునకు కైలాస మేరుపర్వతములు రెండును వెండి బంగారు కొండలుండగా అడుక్కుంటున్నాడు. దీనికి కర్మమే ప్రధానము.

ఆ. వెడగువేత్త యనుచు । వినఁగన రీనరుల్
వేయు మార్గములను । వేలుపజుఁడె
అతఁడు సృష్టికర్త । అంతకు గురుఁడెన్న
నతనికి దులయేది ? । యరయ వేమ. 4480

సృష్టికర్త యైన బ్రహ్మకు సాటిలేరు.

ఆ. వెడలివచ్చు వేళ । వెనుకఁ బోయెడివేళ
తేనులేదు కొంచుఁ । బోనుబోఁడు
ధనమెచటి కరుగునో । తానెందుఁ బోవునో ! ॥వి॥ 4481

జనన మరణము లప్పుడు ధనము తెచ్చుట పట్టుకపోవుట లేదు మధ్యనెందుకు?

ఆ. వెతకి కానలేఁడు । వేదాంత వేద్యుఁడు
తత్త్వవేత్త లేఁడు । ధరణిలోనఁ
గలిగె నేనతఁడు । కనబోవ మఱిలేఁడు ॥వి॥ 4482

మహాత్ములు మానవులలో కలసి మెలసి యుండుటచేత కనుగొనుట కష్టమే ?

ఆ. వెతకి కానలేఁడు । వేదాంత వేద్యుని
తత్త్వవేత్తఁ గలఁడు । ధరణిలోన
కన్నవారి కెల్ల । కనబడఁ డెప్పుడు ॥వి॥ 4483

తత్వవేత్త తరిస్తేగాని తెలియబడడు.

ఆ. వెతకి కానలేరు । వేదాంత వేద్యుని
నుత్తముండె కాంచు । నుర్విమీఁద
కలిగెనే నతనిని । గానంగలేరయా ! ॥వి॥ 4484

విజ్ఞానవేత్తలు వెలికి గనఁబడరు.

ఆ. వెతలు దీర్చువాఁడు । వేదాంత వేద్యుఁడు
రతుల నేల వాఁడు । రమణుఁ డగును
సతిని బెనఁగు వాఁడు । సంసారయోగిరా ! ॥వి॥ 4485

వేదాంతవేద్యుని, రసికుని, సంసారయోగుల సహజస్వరూపము చిత్రించాడు.

ఆ. వెతలు పుట్టిచచ్చు । వివర మెఱుంగక
జతుకమంటు రీతి । జారుఁడగును
గతికి హితవుఁ గనఁడు । కామాతురుఁడయి ॥వి॥ 4486

జతుకము = లక్క ; కామాతురులు గతికి లొంగి మతులుచెడి వర్తింతురు.

ఆ. వెదక వెదక దొరకు । వేదాంత వేద్యుండు
వెదకువానిఁ దాను । వెదకుచుండు
వెదకనేర్చి నట్టి । వెరవర్లు గలరొకో ! ॥వి॥ 4487

మంచిగురువును శిష్యుఁడు వెదకిన, శిష్యుని గురువు వెదకును.

ఆ. వెదకి, వెదకి, వెదకి । వేసారి, వేసారి
తిరిగి, తిరిగి, తిరిగి, । దిమ్మతిరిగి
బొమ్మలాటఁ జూచి । పోఁబడిగంటిరా ! ॥వి॥ 4488

మతి స్థిమితముగా లేక తిరుగుట దిమ్మతనమునకే.

ఆ. వెన్న చేతఁ బట్టి । వివరంబుఁ దెలియక
ఘృతముఁ గోరునట్టి । యతని భంగి
తాను దైవమయ్యు । దైవంబుఁ దలఁచునే ॥వి॥ 4489

తనలోనున్న దైవమును దెలియలేక తీర్థయాత్రలవెంట తిరుగనేల ?

ఆ. వెనుకఁ జూత మన్న । వెనను గష్టపు గుంట
ముందు జూత మన్న । మురికి గుంట
వెలఁదిఁ జూచి నరులు । వేడుకపడుదురు ॥వి॥ 4490

వెలదిని వెనుకా ముందూ విమర్శించి జూచిన అసహ్యమే !

ఆ. వెన్నుఁ దగిలియుండు । విడువక నిరతంబు
చిన్ననాఁటి నుండి । చెలిమిఁ జూపు
అన్నదమ్ములకును । నాప్తుఁడై యుండురా ॥వి॥ 4491
కుటుంబమును కూలంకషముగా బాగుచేసినవాని లక్షణములు చెప్పెను.

ఆ. వెన్నెల నిలుచుండి । వేపాకు పడవేసి
యడ్డసరపు రసము । నందుఁ బోసి
కరుగ రాగి యమరి । కాంచనంబగునయా ॥వి॥ 4492
బంగారుయోగము సంగతి తెలిసినవారికే ?

క. వెయ్యేరు నదుల జలములు
తియ్యక మఱి మునుగఁ బోవ । ద్రిప్పటఁ కాదా !
కొయ్యగులామునకు జ్ఞానము
వెయ్యేనను దెలుప రాదు । వినరా ! వేమా ! 4493
లెక్కకు మించిన యాత్రలు సేవించుట తెలివితక్కువవారి లక్షణము.

క. వెయ్యేరు కతుల జలనిధి
తియ్యని ననిశంబు గలయఁ । ద్రిప్పట యరుదా !
కొయ్యకు దా సుజ్ఞానము
వెయ్యి విధంబులను జెప్ప । వృథరా ! వేమా ! 4494
మూర్ఖులకు ముక్తివిధానం చెప్పుట సాధ్యముగాదు.

క. వెయ్యేల నడువ వలదిఁక
నయ్యా ! రామయ్య ! నయము అజ, హరి, హరులన్
వెయ్యేండ్లు తపమొనర్చిన
నియ్యరు మోక్షంబు । భువిని వింతవుగ వేమా ! 4495
ఆత్మారాముని విడచి అజరుద్రాదుల పూజచేయుట కుజన మార్గమే.

ఆ. వెఱపులేక గురునివి । వేడుచు వేసారి
స్థిరముగాను బూజ । చేసి, చేసి
పరముఁ గన్నవాఁడుఁ । పరిపూర్ణయోగిరా ! ॥వి॥ 4496
గురుకరుణా కటాక్షణములచే పరిపూర్ణుఁడు తెరవునిగంటాడు

ఆ. వెఱపు మొదటికి విడిచి । వెడలెడివాయువు
కచ్చుయూడ్చి గట్టి । కాళ్లుదీసి
తరుచు తరుము, శివుఁడు । తారకంబున చిక్కు ॥వి॥ 4497

శ్వాసగతులను అతులితముగా నడపిన శితికంఠుఁడు చేరువలోనే ఉండును. శితికంఠుఁడు = ఈశ్వరుఁడు.

ఆ. వెఱపు దీరిన వాఁడె । వేదాంతి యనబడును
కూడుఁబెట్టిన వాఁడె । గుణయుతుండు
మనసు నిలిపిన వాఁడె । మౌన జ్ఞానుండగు ॥వి॥ 4498

"అన్నమిచ్చినవాని. ఆలినిచ్చినవాని అపహసించుట హాని ఓకూన లమ్మ" (జానపద గేయము).

క. వెఱవని మది దృఢ విజ్ఞత
పరమును గమకించి లోనఁ । బదిలము గాఁగన్
స్థిరరూప మంది పొందెడు
గుఱియగు పరిపూర్ణమందుఁ । గూడర వేమా ! 4499

పరిపూర్ణముయొక్క గురిని బట్టబయలుగా చెప్పెడు.

క. వెఱవవలెఁ బాపమునకును
వెఱవఁగవలె మరణమునకు । విశ్వములోనన్
మఱవఁగవలె సంగముల
మఱి మఱవంగవలదు మేలు । మహిలో వేమా ! 4500

భావము మారినా, భద్రభూపాలునిదే యీపద్యము క్షుద్రముగాదు.

క. వెఱవవలెఁ బాపములకును
వెఱవఁగవలె ఋణములకును । విశ్వము లోనన్
మఱవవలె బరులనేరము
మఱవంగావలదు మేలు । మహిలో వేమా ! 4501

వేమన స్వకపోల కల్పితనీతి పద్యములు ఆణిముత్యములే లేనపుడు కృత్రిమ రత్నములే !

ఆ. వెఱ్ఱినక్కల వలె । వేదముల్చదివి రే!
యాశ్రమంబు లెఱుఁగ । రయ్యగాండ్రు
వేదసార మంత । వేమన యెఱుగును ॥వి॥ 4502

వేదసారము తెలియని విజ్ఞానులు వెఱ్ఱినక్కలే!

ఆ. వెఱ్ఱి బట్టు వాని । వినయంబు లధికంబు
చెడ్డముండ ముసుగు । చెలఁగిపెట్టు
చెడిపెకొడుకు మిగులఁ । జేయు నాచారంబు ॥వి॥ 4503

యదార్థాన్ని యథాతథంగా చిత్రించుటే వేమన కవితావైచిత్ర్యము.

ఆ. వెఱ్ఱిమొద్దు కేల? । వేదశాస్త్రంబులు
ముద్దులాడి కేల? । ముసలి మగఁడు
చద్ది మిగులనింట । సంసార మేలరా! ॥వి॥ 4504

అంతఃపురములోనుండి యీతాకుగుడిశవరకు ఆకళించుకొన్న అనుభవశాలి వేమన.

ఆ. వెఱ్ఱివానికైన । వేషధారికి నైన
రోగికైనఁ బరమ । యోగికైన
స్త్రీలఁ జూచినపుడు । చిత్తంబు రంజిల్లు ॥వి॥ 4505

అతివలను జూచి అందరిమతులు కతకాలని బుద్ధిబుట్టును.

ఆ. వెఱ్ఱివాని మిగుల । విసిగింపఁగా రాదు
వెఱ్ఱివాని మాట । వినఁగ రాదు
వెఱ్ఱికుక్కఁ బట్టి । వేటాడఁగారాదు ॥వి॥ 4506

తెలివితక్కువ వాళ్ళతో సలహా, సహవాసము చెడ్డ తెచ్చునేమో!

ఆ. వెఱ్ఱివేషములను । వేసికొంచు తిరుగ
గఱ్ఱికుక్క తెలువు । గాదు సుమ్మి
పుఱ్ఱెలోని గుణము । పూడ్చింప జనవలె ॥వి॥ 4507

"పుఱ్ఱెకు బుట్టిన బుద్ధి పుడకలతోనే పోవాలి" (ఆర్యోక్తి)

కం. వెఱువని మది దృఢదృష్టిని
పరమును గమకించి లోన । పదిలము గాఁగన్

స్థిరరూపమంది పొందెడు
గురియగు పరిపూర్ణమందు । గూడుర వేమా ! 4508

భీతిచెందక. నీతి విడువక, ఖ్యాతిగలదానినే కాంక్షించుము

ఆ. వెలఁది చక్కదనము । వెఱ్ఱివైన యీడును
విభుని కరుణలేమి । విగతి నుండు
నీదుకరుణ లేమి । నేర్పులు కొఱగావు ॥వి॥ 4509

భర్త మెప్పు పొందని భామిని ఘనతలు కొరగానివే !

ఆ. వెలఁది సొంపుఁ జూచి । విఱ్ఱవీగుటలేల ?
గలికి గుణము కాదె । కారణంబు
చలనచిత్తవృత్తి । జారిణికే యబ్బు ॥వి॥ 4510

స్త్రీలు నాలుగు జాతులు; పద్మినీ, హస్తినీ, చిత్తినీ. శంఖినీ జాతులై యుండును.

క. వెలయాలి వలన గూరిమి
కలుగదు మఱి కలిగెనేనిఁ । గడ తేరదురా !
పలుగురు నడచెడు తెరువున
బులు మొలవదు మొలిచెనేనిఁ । బొదలదు వేమా ! 4511

మకుటము మార్చి వికట కవులు వేమన కంటగట్టిరు.

ఆ. వెలయు పరమతత్త్వ । విభవంబు దెలియక
బ్రహ్మవిద్య చేత । బరగు టెల్ల
వూరికున్న గహరి । పోయినచందంబు ॥వి॥ 4512

గహరి = గస్తీ తిరుగుట ; ఆధారము లేకుండా అందిందను టవివేకము.

తే. వెల్లకుక్కల యెంగిలి । విశద మాయె
బడుచు వేశ్యల యెంగిలి । ప్రాప్తమాయె
జెడుగు యెఁగిలి యంతకు । శ్రేష్ఠమాయె
నిష్ఠమగు వారి యెంగిలే యెగ్గు వేమ. 4513

సంసారాన్ని రోసి సానికొంపలకు భిక్షానికి తిరిగే కుక్షింభరులగూర్చి చెప్పినదీ పద్యము.

క. వెలిచూపు లోనచూపును
కలయంగా నొక్కచూపు । గా జూచిన యా
నిలకడగల యోగీంద్రుఁడే
సలలిత సుజ్ఞానుఁడిలను । సదమల వేమా ! 4514

అంతర బాహ్యముల జ్ఞానముగలవాడే అభివందనీయుడు.

క. వెలిప్రపంచాది వృత్తుల । గలియ నొక్కి
మనసు మాయలనెల్లను । మాపి సాక్షి
సత్య సమదృష్టిబూనుట । సమ్మతంబు
సాధు హితమును బరదము । సతము వేమా ! 4515

సమదృష్టి సాధువులకు సద్భూషణము.

ఆ. వెలివసింపుచంద్రు । వెట్టి కులమువారు
కానిపోని పనులు । కలిగె నంద్రు
తాము కానలేని । తరబడి ఘనునైన ॥వి॥ 4516

కులతప్పులు వేసే వర్గాలవారిని కూలద్రోశాడు.

ఆ. వెళ్ళివచ్చునాడు । మళ్ళి పొయ్యేనాడు
వెంటరాదు ధనము । కొంచబోఁడు
తాను యేడఁబోను ? । ధనమేడఁ బోవునో ? 4517

భూమిమీదికే ధనము చచ్చినప్పుడుగాని పుట్టినప్పుడు గాని లేదు.

క. వేడుక మదిలోఁ జూడక
తోడగు నా యెఱుకమీఱి । త్రొక్కుడుపడకా
జాడను మఱచినవాఁడే
వేడుకఁ బరతత్త్వమంది । వెలయును వేమా ! 4518

వింతలను వీక్షించక మంతనములను మాయమరచినవాడే మహాత్ముఁడు.

ఆ. వేఁడుచున్నయట్టె । వినయంబుఁ జూపుచు
గోత దింపు సుమ్ము । కొండెగాఁడు
చెప్పరాదువానిఁ । జెఱుచును దుదకెట్లొ ॥వి॥ 4519

చాడీలను చెప్పేవాడిని సరసకు జేరిస్తే చక్కని కొంపలను ముక్కలు జేస్తాడు.

ఆ. వేదుబట్టువాని । వినయంబు లధికంబు
చెడ్డముండ ముసుఁగు । చెలఁగివెట్టు
చెడిపెకొడుకు । మిగులచేయు నాచారంబు ॥వే॥ 4520

చెడిపె కొడుకు చేసే ఆచారములతి చిత్రముగానుండును.

తే. వేదగీతంబులను మించి । వెలయువాని
నాదబిందువు కళలంటి । నయముగాను
సాధకంబునఁ జొచ్చుటే । సన్మతంబు
జన్మసార్థక్య మద్దన । జనునువేమ. 4621

నాదు, బిందు, కళలంటి వేదాతీతుని అదుకోమన్నాడు

క. వేదంబనఁగా వాదము
వేదంబుల నంటియుండు । వెన్నుఁడు, శివుఁడు
న్నాదిఁదగు మూాలమందును
భేదా భేదములులేవు । పేర్కొన వేమా! 4522

వేదములలో వివక్షతయే లేదు.

క. వేదంబుఁ జదివి విప్రులు
వాదంబులు మాని తనరు । వస్తువుఁగనిరా
మోదంబునంటి తమలో
భేదంబుల నడఁచువారె । పెద్దలు వేమా! 4523

వాద భేదములు లేని ప్రాజ్ఞులే పెద్దలు.

క. వేదంబుఁ జదివినంతట
వాదంబులకొఱకె శాస్త్ర । వాంఛలు గలుగున్
భేదంబు కలిగినంతట
లేదందురు దానఫలము । లేశము వేమా! 4524

భేదబుద్ధి గలవానికి వేదోప యోగ మేమి ?

క. వేదము చావడిమాటలు
వేదాంతము పట్టుగొమ్మ । విధి దెలియఁదగన్

నాదమె యోగవశంబని
సారముగ జగతిలోన । చాటరవేమా ! 4525
రచ్చబండ దగ్గర ముచ్చటించుకొను మాటకే చావడి మాటలు.

క. వేదమును జదివియు । విజ్ఞవీగుటె కాని
యడుగు గతికె వచ్చి । రందఱిటు
బ్రహ్మమహిమఁదెలిసి । బ్రతికిన బ్రతుకయా ॥వి॥ 4526
బ్రహ్మను తెలియని వాని బ్రతుకు బ్రతుకు కాదు.

క. వేదము బాపని మాటలె
వేదాంతము పట్టుఁ । గొమ్మ విబుధులకెల్ల
న్నాదిమ ముఖవచనంబిది
సాధకమని జనులకెల్లఁ । జాటరవేమా ! 4527
వేదములు తొల్లి పలికిన పలుకులు.

ఆ. వేదములనుఁ జదివి । వెరవేమి గాంచిరి
యరిగి తిరిగి వత్తు । రందరిండ్ల
బ్రహ్మమహిమఁ దెలిసి । బ్రదుకుట నిజమయా ! ॥వి॥ 4528
వేదము చదువుట వీధుల వెంబడి యాచనకేనా !

తే. వేదములలోని యుక్తిని । వెలయఁజూచి
యోధయై యున్న వానికి । నుపముతోడు
వాదులేకయ మదిలోని । వైరి నడఁచి
యిష్టులను గూర్చి తాఁ గనుఁ । బుష్టివేమ. 4529
తనలోనున్న విరోధిషట్కము నడచినవాడే ! ఆగమవిధుని కన్న మిన్న.

ఆ. వేదమూలమెల్ల । విశ్వకర్మయె యని
వేదములను బల్కు । విధముఁదెలిసి
నమ్మకుండువారు । నరకములోఁ బడరె ॥వి॥ 4530
అసలు మూలము విశ్వకర్మ కాదన్నవాడు కష్టుడు.

క. వేదమెగా పడిమాటలు
వేదార్థంబెల్ల చదువు । విప్రులకెల్లన్

వేదమె బండ చయంబని
సాదరముగ జగతిలోన । చాటురవేమా ! 4531

వేద సారస్వతము విజ్ఞానుల కవసరమా !

క. వేదమెపుడు విడి మాటలె
వేదార్థంబెన్నఁ జదువు । విప్రులకెల్లన్
భేదము భండన విధమని
సాదరముగ జగతిలోనఁ । జాటరవేమా ! 4532

వాదోప వాదములకే వేదసారస్వతము.

ఆ. వేదవిద్యగాదు । వీర విద్యయుగాదు
బాధవిద్యగాదు । పరువుగాదు
మధురమైన యట్టి । మనసు నిల్పెడి విద్య
సాధువిద్య యెన్న । జగతి వేమ. 4533

మనసుని నిల్పినదే మహత్తరవిద్య

ఆ. వేదవిద్యలెల్ల । వేశ్యల వంటివి
భ్రమలఁ బెట్టి తేట । పడఁగ నీవు
గుప్తవిద్య యొకటి । కులకాంత వంటిది ॥వి॥ 4534

వేదవిద్య వేశ్యా లోలురకే !

ఆ. వేదవిప్రులెల్ల । విశ్వోపకారులు
సాక్షియున్నవాఁడు । జగతిలోన
సంకర కులజులును । సర్వోత్తములె చూడ ॥వి॥ 4535

ఋషులందరూ సంకర కులజులే

తే. వేదశాస్త్ర పురాణముల్ । వెదకనేల ?
నాది తుదియును లేనిదే । యచలమగును
సాచు మదిలోన వెలిగెడు । సత్యమాను
వాదములు గానరాకుండి । వరలువేమ. 4536

ఆది మధ్యాంతరహిత మైనదే అసలువిద్య.

ఆ. వేదశాస్త్రములను । విననేమిఁ గుడిచిరి
యరిగి తిరిగి పొత్తు । రందరిల్లు
బ్రహ్మ మహిమ దెలిసి । బ్రతుకుట నిజము మా! ॥వి॥ 4537

శాస్త్రాలన్ని చదివి సాధించే దేదీ!

ఆ. వేదశాస్త్రంబుల । వివరంబుగా చదివి
వస్తువెఱుఁగకుండ । వెఱ్ఱులైరి
వీధివీధుల తిరిగి । వ్యర్థులై పోదురు ॥వి॥ 4538

వస్తుతత్త్వము తెలియనిదే వన్నియు వాసియులేదు.

ఆ. వేదశాస్త్రములను । విననేమి గుడిచిరి
యదిరి తిరిగి చత్తు । రందరిట్లు
బ్రహ్మమెఱుకఁ దెలిసి ! బ్రతుకుటే నిజమయ్య ॥వి॥ 4539

బ్రహ్మస్వరూపము తెలియుట భావజ్ఞుని ధర్మము.

ఆ. వేదశాస్త్రములను । విరివిగాఁ దానేర్చి
వాదమాడు వాఁడు । వెఱ్ఱివాఁడు
సారమైన గుఱుతు । సాక్షిగానెంచఁడు ॥వి॥ 4540

సర్వోత్కృష్టమైన గురుతును సాధించినవాడే సన్యాసి.

ఆ. వేదసారమెల్ల । వెదకి తాఁజూచియు
లీనమైనబ్రహ్మ । రీతిఁ దెలిసి
పరము గనెడు వాఁడె । పరమ గురుండౌను ॥వి॥ 4541

విజ్ఞానమును తరచిన వాడే విమలాంతః కరణుఁడు.

కం. వేదాంత జనితమగు సం
పాదితుఁడగు గురుని వేడి । పరిపూర్ణుండై
మోదంబున గురిమించిన
సాధనలో ముక్తిఁగలుగు । సత్యము వేమా! 4542

వేదాంత గురూపదేశమున తెలుసరాని దేమున్నది.

తత్త్వపదము :- వేదాతీతుఁడు వేమనరా । వేమనమాటలు వేదమురా!
వేదశాస్త్రములు వాదమురా, । వాదుల నోళ్ళనుబూదియెరా

విసువకచదివిన విందురురా, । విన్నవారు కనకెన్నరురా
కన్ననె చెప్పఁగ గడఁగఁడురా । చెప్పిన నెవ్వఁడుఁజేయుడురా
చేసినవాఁడే సిద్ధుఁడురా, । సిద్ధులమాట ప్రసిద్ధమురా!
జాతర జాతర జాతరరా, । జాతాతీతుఁడు వేమనరా! 4543
వేదవేదాంగోపని షత్సారము వేమన యిందుదహరించాడు

కం. వేదాంతులమని కొందఱు
వాదములకు నడుముగట్టి । వత్తురె? వారల్
సాదులు గారని చెప్పఁగ
భేద గుణంబొకటె గురుతు । పెద్దది వేమా! 4544
భేద. భావం గలవారికి వేదాంత మెందుకూ!

ఆ. వేనవేలు చేరి । వెఱ్ఱికుక్కల వలె
అర్థహీన వేద । మఱచుచుండ్రు
కంఠశోషె కాని । కలిగెడి ఫలమేమి? ॥వి॥ 4545
విధి తెలియని వేదఘోషలు వెఱ్ఱికుక్కల మొరుగులే!

ఆ. వేపాకు దొలిచేసి । వెన్నెలలోనుంచి
యాకు పసర యింత । యమరఁబోయ
వేడి దీరువెనుక । వేగ హోమంబగు ॥వి॥ 4546
సాధకులు స్వర్ణాన్ని చేసుకొనుటకు చక్కని యోగము

ఆ. వేప విత్తునచమురు । వెళ్ళదిగియఁగఁ గదా
వేపచేదని నరుల్ । వాడుకొనిరి
విత్తు విత్తుగనుంటె । వేపచేదెట్లాయె ॥వి॥ 4547
యతి పోయినది; వేపగాలి తగిలిన కుష్ఠురోగముగూడా బోవును.

ఆ. వేమఁడిట్లుచెప్పు । వేలు పద్యంబులు
తప్పులెన్నియున్న । నొప్పియుండుఁ
దత్తర పడకండుఁ । జిత్తమ్ము నిల్పరా! ॥వి॥ 4548
వేలాది చెప్పిన వేమన పద్యాల్లో తప్పులనకండా తర్కించి చదువుము.

కం. వేమన చెప్పిన కల్పం
బే మానవుఁడైనగాని । యెద నూహింపం

దామసమేఁటికి గల్గును
వేమనయే సిద్ధుఁడౌను । వినరా వేమా ! 4549

అణిమాద్యష్టసిద్ధులు సిద్ధింపజేసుకొన్న సిద్ధుఁడే వేమన.

క. వేమన చెప్పినపద్యము
సామంబునఁ జదివినట్టి । సజ్జనులెల్లన్
సోమన తెలఁగలయాతని
నేమంబునఁ జూతురయ్య । నేర్పున వేమా ! 4550

సోమన=చంద్రుఁడు ; వేమన పద్యాలు విజ్ఞానవిశ్వేశ్వరుని దర్శించే సూత్రాలు.

క. వేమన చెప్పినమాటలు
సామంబున సకలవేద । సారంబుగదా
సామెత పంచాక్షరిలో
నీమహిమలు దేలియుంట । యింపన వేమా ! 4551

పంచాక్షరీ మహామంత్ర ప్రభావమువలె వేనమ కవితారీతులు వెల్లివిరుస్తారు.

క. వేమన చెప్పిన వేదము
కాదనియెడు వానినోట । గాలంబుగదా !
ఖేదంబు లుడిఁగిఁ దెలిసిన
సాధులకే ముక్తియనుచు । చాటర వేమా ! 4552

వేమన నీతులు కాదను వారు గాడిదలే

ఆ. వేమనవఁగ యోగి । వెలసె లోకములోనఁ
బూజ లిడుఁడు పుణ్య । పురుషులార
పూజ లిడినయంత । భుక్తి ముక్తుల నిచ్చు ॥వి॥ 4553

వేమనయోగి యోగిగాక ; యీ సోమరులందరూ యోగులేనా !

క. వేమున్నన్నా నాకును
నీమహిమను సత్పథంబు । నేఁడు లభించెన్
రామయతో సరిదేశికు
నేమంబున గానమెంను । నిజముగ వేమా ! 4354

వేమన అన్నా ' మీగురువు అభిరామయలాంటివాడు లేనేలేడు.

క. వేమన్నా ! నీ మహిమల
నేమన్నను దెలియనింక నెటువలెనన్నా !
వేమన్నా ! నీచిత్తం
బేమన్నను నీవె మాకు । నికగతియన్నా ! 4555

యీపద్యములు వేమన యందు డిందుకొను భక్తిగల శిష్యులు పల్కిన పల్కులేమో !

ఆ. వేమనార్యుని కన్న । వేఱె యోగియులేఁడు
రామచంద్రుని కన్న । రాజులేఁడు
ఆంజనేయుని కన్న । నతిభక్తుడును లేఁడు ; ॥వి॥ 4556

యోగి, రాజు, భక్తుఁడు యీముగ్గురే పృధివి కాధారము.

ఆ. వేమనిట్లు చెప్పె । వేలపద్యంబులు
తప్పులెన్ని యున్న । నొప్పియుండు
తత్త్వపడకయందుఁ । జిత్తము నిల్పుము ॥వి॥ 4557

పదములు ఏమైదో నియమముగా జూచి కొదవ గలిగినవని యనక భావము నెంచి గ్రాహ్యుఁడవు గమ్ము.

ఆ. వేముకన్నవిషము । వెఱ్ఱిపుచ్చ ధరిత్రి
పాముకన్నవిషము । ప్రథమశాఖ
నాభికన్నవిషము । నల్లని బాపఁడు ॥వి॥ 4558

నీచమైన వస్తువులు నిరూపించాడు.

ఆ. వేము చెక్కఁదిన్న । విషరోగములు వాయు
దేహకాంతిఁ గలుగు । దృఢముఁ గలుగు
తినఁగఁ దినఁగ నదియె । తీయఁగానుండును ॥వి॥ 4559

వేమును విపరీతంగా చెప్పుటకు కారణందాని యందున్న గుణవిశేషమే !

ఆ. వేముఁ డిట్లు చెప్పు । వేయు పద్యంబులు
తప్పు లెన్ని యున్న । నొప్పియుండు
తత్త్వర పడకయందు । బిత్తరె యుండరా ! ॥వి॥ 4560

వేమన పద్యములు మనకాల బద్ధలవలన కొలదక, విజ్ఞాన విశేషంగా తిలకిస్తే శరీరం పులకిస్తుంది.

ఆ. వేముఁడిట్లు చెప్పు । వివరపు వాక్యముల్
వేముఁడిట్లుపొవు । వెట్టిపోక
పామరులకు నెల్ల । ప్రతిపక్షమై యుండు
పండితులకునెల్ల । పరము వేమ. 4561

వేమన వాక్యములు పండిత పామరజన పరమార్థములు.

ఆ. వేము పాలుఁ బోసి । వేయేండ్లు పెంచిన
జేదు విడిచి తీపిఁ । జెందనట్లు
నోగుగుణము వీడి । యుచితజ్ఞుఁ డగునెట్లు? ॥వి॥ 4562

సహజాన్ని చక్కబరచ సదానందునికీ శఖ్యము గాదు.

ఆ. వేముపాలుఁబోసి । ప్రేమతో పెంచిన
చేదు విరిగి తీపి । చెందఁబోదు
ఓగునోగే గాక । యుచితజ్ఞుఁ డెట్లౌను? ॥వి॥ 4563

పనికిమాలినవాడు యేపద్ధతిలోనైనా ప్రాజ్ఞుడగునా!

తే. వేయి నే నూరు పద్యముల । వేడ్కమీర
పఠనఁజేసిన మనుజుండు । ప్రాభవముగ
మోక్షమార్గంబు నొందును । మొనసివేగ
సకలసంస్కృతి నెడఁబాసి । సరగ వేమ. 4564

వేలకొలది పద్యములు గుప్పి వేమన చదివిన వారి సంస్కృతి వీగ
జేయుచున్నాడు.

ఆ. వేయిపద్యముల వి । వేకియై భక్తితోఁ
బఠనఁజేసినట్టి । భక్తులకును
బాయకుండు మోక్ష । పద మరచేతిదై ॥వి॥ 4565

వేమన వేయిపద్యములనైనా విడువక చదివినవారికి మోక్షమబ్బును.

తే. వేయుక్రతువులు పనిలేదు । వేడ్కమీఱఁ
జేయు క్రియలెల్ల గురుభక్తి । చిత్తమందుఁ
బాయకుండుటె ముక్తికి ।బాటయగును
న్యాయమగు మార్గమిద్ది యా । నవనివేమ. 4566

గురుభక్తితో చేసిన కార్యములే గురుతరములు.

ఆ. వేయు విధము లమర । వేమన పద్యంబు
లర్థమిచ్చువాని । నరసినంత
చూడఁజూడ గలుగుఁ । జోద్యమౌ జ్ఞానంబు ॥వి॥ 4567
వేమన పద్యములు అర్థమునీగి అవసరమైన విషయాలను అందిస్తాయి.

ఆ. వేరు పురుగు చేరి । వృక్షంబు జెఱచును
చీడపురుగు చేరి । చెట్టుఁ జెఱచు
కుచ్ఛితుండుచేరి । గుణవంతుఁ జెఱచురా ! వి॥ 4568
క॥ వేమన కవితారీతులు
సోమన తలదాల్చువాని జూపును యెపుడున్
నీమమున ననుసరించిన
కామితమీడేరుటరుదె ? కాంక్షించినచో ॥

ఆ. వేలకొలది భువిని । వేషముల్దాల్తురు
ప్రాలుమాలి బువ్వ । ఫలముకొఱకు
మేలుగాదు మదిని । మిన్నందియుండరా ! వి॥ 4568
భుక్తికొరకు బూటకపు వేషాలు వేయుటకంటే శక్తితో ముక్తినిగనరాదా !

ఆ. వేశ్యకు నుదయించు । వివరమంద తెఱింగి
రేమి యనఁగ వేఱె । యీ మహిమకుఁ
బరగు బ్రహ్మమెఱుఁగ । బట్టిన దశగదా ! వి॥ 4570
బ్రహ్మము తెలియుటచేత వేశ్యాపుత్రుఁడైన వశిష్ఠుఁడు గొప్పవాడయ్యాడు.

ఆ. వేషధారినెపుడు । విశ్వసింపఁగ రాదు
వేషమంత దోష । విధమెఱుఁగరె ?
రట్టుకాదె మునుపు । రావణువేషంబు ॥వి॥ 4571
మాయవేషాలు మానశిక శక్తినే మంటగలుపుతాయి.

ఆ. వేషధారి యొకఁడు । వెలయు వంపులగూర్పు
నూటయొక్క కులము । నూతఁగలిపి
కల్లు ద్రుచ్చుతాను । గట్టునా ! మోహంబు ॥వి॥ 4572
కల్లు త్రాగినవాడు ఒడలు మరిచి యేమీ గానలేడు.

ఆ. వేషభాషలింకఁ । గాషాయవస్త్రముల్
బోడినెత్తు లొప్పఁ । బొరయుచుండ్రు
తలలు బోడులైనఁ । దలపులుబోడులా ! వి॥ 4573

సాధులు సన్యాసాశ్రమముపేర సంసారాశ్రమములో జేరియుంటారు.

ఆ. వేషభాష లెరిగి । కాషాయవస్త్రముల్
కట్టినపుడె ముక్తి । కలుగఁబోదు
తలలు బోడులైన । తలపులు బోడులా ! వి॥ 4774

వేషభాషలున్నంత వీతరాగులని నమ్మట కూడదు.

తే. వేషములు పొట్టకొఱకయి । వేయవచ్చు
ధరణి నిజగురు భక్తిని । దలఁగకుండ
నీమఁ గొనియాడి సేవింప । నెవరి తరము ?
పూర్వపుణ్య ఫలంబునఁ । బొసగు వేమ ! 4575

"ఉదర నిమిత్తం బహుకృత వేషం"

ఆ. వేషములు వేయవచ్చును । వేలకొలది
ధరణి నిజగురు భక్తిని । దలఁగకుండ
నిల్చికొనియాడ సేవింప । నెవరితరము ? ॥వి॥ 4576

నిజగురుభక్తి యబ్బుట మాటలతో లేదు.

ఆ. వేషమొనరఁ గట్టి । వెలయ శూద్రత్వంబు
తనకు లేదనుకొను । ధరణి ద్విజుఁడు
అరిది గిట్టువేళ । నడుగు ద్విజత్వంబు ॥వి॥ 4577

వేషధారణ వలన విఱ్ఱవీగుట వెఱ్ఱితనము.

ఆ. వ్రేయ వ్రేయ గాను । విత్తన మనిపించు
వ్రేయ వ్రేయఁ అవల । వృక్షమగును
తెలియ తెలియువాఁడు । దేవుఁడనందగు ॥వి॥ 4578

"ప్రయత్నేన సాధ్యతే సర్వం" ప్రయత్నమున సర్వమూ సాధింపవచ్చును.

ఆ. వైరముడిగి పరము । వర్ణించి మదిమించి
పురముఁజేరు నీకుఁ । బొసఁగుఁ బదవి
తరము గానిదదియె । తమకించి దాటరా! ॥వి॥ 4579

దేహేంద్రియాలను తీర్చికట్టిన దివ్యత్వము రాదా !

ఆ. వైశ్యులమనియెడి । వార్త మాత్రమెకాని
దొంగలింత కన్న । దొరకరెందు
నేలమీఁద వీరి । నేర్పుల నేమందు? ॥వి॥ 4580

వర్తకులు కొనుట అమ్మటలలోను ఘోరాలాచరిస్తారు.

ఆ. వైష్ణపుట్టి లనుప । మాత్రమెకాని
భ్రష్టులింత కన్న । వేరులేరు
జారుబలమైన । నీరుగాబోవునా! ॥వి॥ 4581

యెంతనూ పొందని సుందరి డెందమువలె నున్నదీపద్యము.

ఆ. వైష్ణవులను వట్టి । వార్త మాత్రమెకాని
ప్రజలఁ జెఱుతురయ్య । భ్రష్టులుగను
కష్టవరుల కెల్లఁ । గలుగునా! మోక్షంబు ॥వి॥ 4582

వైష్ణవులు జరిపే గోష్టులలో గోప్యములేమో!

ఆ. వొకట కిందనొక్క । డొనర లబ్దముఁ బెట్టి
వలనుగా గుణియింప । వరుసఁ బెఱుఁగు
నట్టిరీతినుండు । నౌదార్యఫలములు ॥వి॥ 4583

అన్నిశాస్త్రములతో సహా వేమన గణితశాస్త్రములో గూడా గడితేరినవాడే!

ఆ. వొకని కీడు వేఱె । యొక్కని కియ్యఁడు
యొకరి మేలె వేరె । యొకరికీడు
కీడు మేలు వారు । పోడిమిదెలియదు
గాలుఁడెఱుఁగు వారి । గగురవేమ! 4584

"కలిమి లేములు కావడికుండ లటుండునను" అర్యోక్తి వలె మేలు కీడులు మేళవించియుండును.

ఆ. వొక్కమనసుతోడ । నున్నది సకలము
తిక్కఁబట్టి నరులు । తెలియలేరు
యిక్కనెఱిఁగి నడువ । నొక్కఁడే చాలురా! ॥వి॥ 4585

ఆ. వొడలుబడలఁ జేసి । యోగుల మనువారు
మనసు కల్మషంబు । మాన్పలేరు
పుట్టమీఁదగొట్ట । భుజగంబు చచ్చునా! ॥వి॥ 4586

ఆ. వోరుల కొఱకు భూమి । నోరచేటి వారును
యవనిజ వశ్యు । లయినవారు
పాలవంటివారు । పన్ను పెట్టెడివారు
వాకెఱుంగరు కాప । వారు వేమ. 4587

సర్వప్రపంచాన్ని పోషించే దాత (కాపు) రైతు.

ఆ. వొల్లనన్న బోదు । యొల్లనన్నఁగ కాదు
తొల్లిఁజేయునట్టి । ధూర్తఫలము
యుల్లమందు వగవ । కుండుట యోగ్యంబు ॥వి॥ 4588

కాగల ఫలమునకు కంగారెందుకూ !

ఆ. వోగు బాగెఱుగని । యొట్టి మూఢజనంబు
లిలను ధీ జనముల । నెంచుటెల్ల
మృగముతోడ కుక్క । మొఱిఁగిన సామ్యమా ॥వి॥ 4589

తరతమ భేదమెఱుగని తత్వమెందుకు ?

## శ

ఉ. శక్తి కొలంది నాప్రజలు । శ్రద్ధగ నెప్పుడు గూడిపాడఁగా
రక్తిగనున్న పాటయని । రమ్యముతోడుత విన్న వ్రాసినన్
ముక్తియనంగ జెల్వొనరు । మోక్షపుదారియె నీకుఁజేకురు
న్భక్తిని జిన్మయంబునను । బాదుగఁ జేర్చిననందు వేమనా!

చిన్మయబ్రహ్మములో గలవాలంటే శ్లేషార్థాలు, విజ్ఞానాంశాలు విశదంగా తెలియాలి.

ఆ. శక్తితోడవచ్చి । శంకరాచార్యులు
విశ్వకర్మ మీఱ । వెలయఁ బోరెఁ
గడఁగి విశ్వకర్మ । ఘనుఁడని మెచ్చరా! ॥వి॥ 4591

జగద్గురు శంకరాచార్యులు విశ్వకర్మను వేడుకొన్నాడేమో !

ఆ. శక్తిపూజచేసి । సరవిఁ గుంభముఁ బోసి
మొక్కుచుండు వేళఁ । గుక్కయేద్వ
నూరు పాడబంచు । నూరెల్ల నేద్తురే! ॥వి॥ 4592

గ్రామదేవత జాతరలలో యిటివి జరుగుచుంటాయి.

ఆ. శక్తి మహిమ సోకి । చెడిరయా ! పురుషులు
ముక్తి మహిమెఱుఁగని । మూఢులగుచు
ఆదిశక్తికూడ । నన్యాయమై పోయె ॥వి॥ 4593

అవివేకులు ఆదిశక్తికి ఆరోపించే యీ ఆటలాడేరు

క. శతమాత్రము పంచాక్షరి
మితమెట్లనో తెలిసినట్టి । మేదిని ప్రజకు
న్నతతముఁ జేకురు మోక్షము
శితకంఠుని పురములోన । సిద్ధము వేమా ! 4594

పంచాక్షరీ మహామంత్ర పఠన పవిత్రత నిస్తుంది.

క. శతవింశతి పంచాక్షరి
మితమెల్లను దెలిసినట్టి । మేధావులకున్
అతిత్వరఁ జేరును మోక్షము
శితకంఠుని పురములోన । సిద్ధము వేమా ! 4595

యిరువదియైదు తత్త్వముల పరిమిత పంచాక్షరి నెంచిన శివుఁడు కాడా !

కం. శతసంఖ్య పద్యములచే
మతిమంతుఁడు పఠనఁజేయు । మమతలు తొలగన్
నతఁడు గను అమర పదవులు
శితకంఠుని పదముఁజేరు । సిద్ధము వేమా ! 4596

వేమన పద్యాలు చదివిన విజ్ఞులు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాస ఆశ్రమముల ధర్మము నెరుగుదురు.

తే. శత్రుజయమంది మదిలోన । సఖ్యపడఁగ
శాశ్వతంబగు పరిపూర్ణ । సరణిఁదెలిసి
నిత్య నిర్గుణమందును । నెగడు మయ్యు
ముక్తి యఱచేతి పండువు । ముందు వేమ ! 4597

అరిషడ్వర్గాలను జయించి అరచేతిలో మోక్షము పొందమన్నాడు.

ఆ. శత్రువర్గ మరసి । సరగున ఖండించి
మిత్రవర్గమునకు । మేలుఁజేసి

దండివెలుఁగు జూచి । పిండ మధ్యంబున
న్నార్తి నిలుచునతఁడె । హరుఁడు వేమ. 4598

శరీరములోనున్న శత్రువుల జయించి శాశ్వతానంద పదవినందుము.

ఆ. శత్రుఁవర్గములను । శరముచేఁ గూల్చెడి
పరముఁగోరి గురుని । వార్తఁదెలిసి
తరముఁగానఁ బరముఁ । దాకుటే తత్వంబు ॥వి॥ 4599

శత్రునాశనము చేయునదే పవిత్ర గురూపదేశము.

ఆ. శత్రువులను ద్రుంచి । శాంతంబు వహియించి
కృత్యములను నడపు । నిత్యునెఱిఁగి
సత్య మడగకుండ । సాధించి నటువంటి
పురుషుఁడొను బుణ్యా । పరుఁడు వేమ. 4600

సత్యాన్ని సాధించినవాడు నిత్యుఁడు గాడా!

ఆ. శనియె చాలదనుచు । ననిరంట విప్రులు
శనికిఁ జాలని దది । కనఁగలేరు
కర్మఫలమె మిగులఁ । గష్టములుక్కడుపురా! ॥వి॥ 4601

కర్మఫలమె చాలా కష్టమన్నాడు.

తే. శర్వు నెంచుము మదినిల్పి । సతముగాను
పర్వమించని ప్రజ్ఞలోఁ । బట్టువిడక
నిర్వహించుట ముక్తికి । నెలవదగును
సర్వ విహితంబదియొ కాదె । జగతివేమ. 4602

శర్వుఁడు = యీశ్వరుఁడు; ప్రజ్ఞాశాలి విజ్ఞానాన్ని సాధిస్తాడు.

ఆ. శ్రద్ధతోడ గురుని । సన్నిధిఁజేరినఁ
బద్ధతిఁ దగుఁ బరము । వజ్రికైన
బుద్ధి చెదరినంతఁ । బూర్వపక్షంబగు ॥వి॥ 4603

వజ్రి = ఇంద్రుఁడు; ఉన్నతి నార్జించి క్రన్నన కోరిక లూరినవాని బ్రతుకు సున్న.

క౦. శ్రమపడు టేలర మదిలో
విమలంబగు దృష్టిఁ బూని । వివరించినచో
నమనస్క భావపరమగు
సమమగు పరిపూర్ణ మమరు । సత్యము వేమా! 4604

సాంఖ్య, తారక, అమనస్కములలో; అమనస్కము నాకళించు కొన్నవాడు ఆనందుడు.

ఆ. శ్రవణ పుటములున్న । సార్థక్యమేమిరా!
వినఁగవలయుఁ బెద్ద । లనెడి వన్ని
వినఁగ వినఁగ నీకె । విశదంబులౌ సుమ్మి ॥వి॥ 4605

చెవుల సార్థక్యము సిద్ధులవాక్యముల వినుటయే.

సీ. శ్రవణములోఁ్కొరును । సంగీత, సాహిత్య
భావాదులై నట్టి । పలుకులెల్లఁ
జర్మంబు గోరును । సరవితోడను శైత్య
మృదులోష్ణ కాఠిన్య । ములనె యెపుడు
గన్నులు గోరును । గరమొప్ప వర్ణంబు
లై నట్టిరూపము । ల్వరుసతోడ
నాలుక గోరును । నయముగాఁ దీయన
యొగరు, కారము, చేదు । నుప్పు, పులుసు
ముక్కు గోరును గంధము । ల్మోదముతోడఁ
జెవులు, చర్మంబు, కన్నులు, । జిహ్వ, ముక్కు
విన్న గలిగిన దిటువంటి । దెల్ల మోసి
తన్నుఁ గనుఁగొన ఘటియింప । దగును వేమ. 4606

పంచేంద్రియములు యెంచుకొనే అభిరుచు లన్నిటిని చెప్పెను.

తే. శాంత మమరెడి చిత్తంబు । సంగ్రహించి
చిత్త విశ్రాంతి నొందిన । యుత్తమునకు
దేవదేవుఁడు తెలివొందఁ । దేటపడును
దా నపుడు పరమశివుఁడన । దనరు వేమ. 4607

“శాంతము లేక సౌఖ్యము లేదు.”

ఆ. శాంతమానసమునఁ । జల్లనై శీతల
భీతినున్న వాఁడు । పరమ యోగి
అట్టివాఁడు ముక్తి । నతివేగఁ గైకొను ॥వి॥ 4608
ప్రశాంతమైన మానసము గలవాడు మహనీయుఁడు గాడా!

క. శాంతమున నన్ని పనులును
సంతోషంబునను గూడు । సత్యము జయమౌ
బంతము చెల్లును ధర్మజుఁ
డెంతేసి ప్రయాసముల జ । యింపఁడె వేమా! 4609
భారతవిజ్ఞాన కోశమే, వేమన హృదయకోశము.

ఆ. శాంతమె జనులకెటు । జయముఁ బొందించును
శాంతముననె గురునిఁ । జేరవచ్చు
శాంతభావ మహిమ । సరిఁజెప్ప రాదయా! ॥వి॥ 4610
శాంతము గలవానికి విశాంపతులైన వాదాక్రాంతులే!

ఆ. శాంత, శమ, దమాది । సద్గుణములతోడఁ
దెలివి మధ్యగురునిఁ । దేటపఱప
నిండుపూర్ణుఁడైన । నిర్మలుండెవ్వఁడో! ॥వి॥ 4611
సద్గుణ సమాశ్రయసంపన్నుఁడే సకలార్థసాధకుఁడు.

తే. శాంతి సమకూర్చి నంతట । సత్యమమరు
సత్య మమరిన గురుభక్తి । శాశ్వతమగు
నిల్పు నిలలోని జనులకు । నిరతిశయము
గౌరవముఁ దాన నన్నిఁట । గలుగు వేమ. 4612
శాంతి సత్యమును, సత్యమువలన భక్తిపరవశత్వము దానివలన బ్రహ్మ
ైమ్యము ప్రాప్తించును.

ఆ. శాంభవీ ముద్రలో । శశిబింబములుఁ దెలుసు
శశిబింబముల లోన । ఛాయఁదెలుసు
ఛాయఁదెలిసినపుడె । శబలుండుఁ దానాయె ॥వి॥ 4613
శాంబవీముద్ర నభ్యసించి శబలుఁడవు గమ్ము.

ఆ. శాశ్వతంపు తేజు । సమలక్ష్యమునఁ జూచి
యాశవిడని వాఁడె । యధముఁడగును
కాశి జేరఁగానె । కలుగునా ! మోక్షంబు ॥వి॥ 4614

ఆశాపాశము ద్రెంచక కాశిఁవెళ్ళి గాసిపడనేల ?

ఆ. శాస్త్రవిద్యలు యోగము । ల్చదువ లేదు
మంత్ర తంత్రముఁ జేసిన । మరిఁగిరాదు
అనుభవాగమ్య మలవడ । నందుమయ్య ॥వి॥ 4615

స్వానుభవయోగ్యముచే సద్గతులనంది పొఁదుము.

ఆ. శ్వాస లాగి విడిచి । సాధింపనేర్చిన
మోసపోకముక్తి । మూటఁగట్టు
దోసకారి గుణము । గాసిఁజెందకపోదు ॥వి॥ 4616

శ్వాసను పీల్చుట, విడచుట తెలిసిన వాఁడే ధీరుఁడు.

ఆ. శ్వాస విడిచే క్రమము । వాసిగా కనుగొంటె
యోగసాధనుంచి । యేమిఫలము ?
రాజుఁజచ్చిన వెనుక । రాజ్యంబు నిలుచునా ! ॥వి॥ 4617

స్వరవిజ్ఞానులు తెలిసినవానికి అధమాధమములే.

ఆ. శిలను బ్రతిమఁజేసి । చీకటింటను బెట్టి
మ్రొక్కవలదువెఱ్ఱి । మూఢులార
ఉల్లమందు బ్రహ్మ । ముండుటఁ దెలియరో ! ॥వి॥ 4618

మానసికారాధనే మహత్తరమైనదని యోగివాక్కు.

ఆ. శిలలఁ జూచి నరులు । శివుఁడనిభావింత్రు
శిలలు శిలలెకాని । శివుండుకాఁడు
తనదులో శివుని । దానేలఁదెలియఁడో ! ॥వి॥ 4619

చిత్తములో నున్న చిన్మయబ్రహ్మమును హత్తిన వేడ్కతో జూడుము.

ఆ. శిలలు దేవతలని । చెలరేగి చెలరేగి
మొనసి పూజసేయు । మూర్ఖులార
జీవులందెకాని । శిలలందు నేముండు ॥వి॥ 4620

జీవేశ్వరుని భజింపక శిలలసేవ చిత్తచాంచల్యము.

ఆ. శిలలు దేవతలని । స్థిరముగా రూపించి
మంటిపాలైరి । మనుజులెల్ల
మంటిలోనిరాళ్ళ । మదిలోనఁదెలియరో? ॥వి॥ 4621

చట్టుబండల పూజించి మట్టిపాలవ నేల ?

ఆ. శిలలు మహితములుగఁ । జెన్నొంద ధరహెచ్చు
నెత్తిఁబెట్టికొంద్రు । నేతలైనఁ
దేజమొప్పు నపుడె । దివ్యమందురుగదా! ॥వి॥ 4622

రత్నములు రాళ్ళవంటివైనా గొప్పతన ముండుటచే రాణింపుకెక్కును.

క. శిలవృక్ష లతలఁ బుట్టిన
జలజాక్షులు ముగురుగూడి । చతురత తోడం
దలవాకిటఁ రతిసేయఁగ
నిల జనులకు లక్ష్మికలుగు । నెల్లెడ వేమా! 4623

ఇది చాటుపద్యముల లోనిది. వేమనలోనికి ఎవరెక్కించారో! (తాంబూలము)

ఆ. శిల్పికన్న గురుఁడు । సీమ నెవ్వఁడు లేఁడు
శిల్పి చెప్పిన గుఱి । సీమకెల్ల
శిల్పిఁ దిట్టినయెడ । శ్రీశుని దూషించి
నట్టుగాదె వినుమ । యవనివేమ. 4624

శిల్పిని మించిన శ్రేష్ఠుఁడు యేసీమలో లేడు.

ఆ. శిల్పికన్న గురువు । సీమనెవ్వఁడు లేఁడు
శిల్పిచేయుగురువు । సీమవెలసె
శిల్పి నిందచేయ । శ్రీగురు నన్నట్లు ॥వి॥ 4625

శిల్పినల్పముగా చిత్రించాడు.

క. శివకవులకు నవకవులకు
శివభక్తికిఁ దత్వమునకు । జింతామణికిన్
శివలోక ప్రమథులకును
శివునకు గురువునకు శరణు । సేయర వేమా! 4627

కవి లోకమున నెల్ల మంచిమార్గమున నడవమన్నాడు.

## వాక్యము

శివకాయాపురి పట్టణంబునకు, తొమ్మిదవ గవాక్షములు, ఇరువదైదు కోటలు, మూడు బుర్జులు, ఆరుక్రొత్తళాలు, మూడుకోట్లయేనూరు తోరణ గండ్లు, నలుగురుమన్నె నాయకులు,ఏడ్గురు మల్లాలు, వారియందు ఏంకాగివరుడు, ఒక్కడు అయిదు అశ్వంబులు, యెనిమిది మదగజంబులు, ఆర్గురు కావలివాండ్రు, కోనా దివ్యల రామభటులైన కోయాపురి పట్టణంబు కాచియున్నారు. సాధించేనంటే అసాధ్యంబు కాదు, ఛేదించే నంటేనూ ఛేద్యంబుకాదు, యెక్కచూచేనంటే మాయెట్లు కానరాదు. హరిహరబ్రహ్మాదులకు నలవిగాదు. ఇది యెవరికిసాధ్యం బంటివాయన, శ్రీగురు పాదపద్మంబులు నమ్మిన నిశ్చల పురుషులకు సాధ్యంబౌను, అది యెట్లంటి వాయనా, గురువుపదేశంబనే గురిజేసి, దాసోహంబనే విల్లు దనరగా బట్టి, ఏకోధ్యానంబనె వారు ఎక్కించి, ప్రణవవాదంబనే భేరీ వేయించి, ఉచ్ఛ్వాసనిశ్వాసంబనే వుయ్యాల సరవత్తి కుదియంగా బట్టి దశవాయువులనే అశ్వంబుల గదలించి, పంచాక్షరియనే జోడు బలిమిగాఁ దొడిగి అజ్ఞానంబనే అగడ్త చెదరంగా దోసి, సుజ్ఞానంబనే బాణంబు జొచ్చినంతటనె, అశ్వపతి గజపతి, నరపతి, పరివారంబులు వాతాహతంబులైరి. కోటకొల్ల బోయెను. అందువున్న సూక్ష్మదశ వాయువులు చెదరెను. పదినూరు కంబ్రాలుగల సింహాసనం బపుడు బట్ట బయలాయెను. శతకోటి భాను సమీరణజ్యోతి చేదొరికెను. ప్రతాపధనుడు వారిపోయెను. కడుమించి ప్రభానులు కొలుకు దిగిరి. బ్రహ్మరంధ్రంబనే వుక్కుటంబు బట్ట బయలాయెను! యిది యెవరికే సాధ్యం బంటి వాయన. శ్రీగురుపాదపద్మంబులు నమ్మిన నిశ్చల పురుషులకు సాధ్యంబౌను. విశ్వదాభిరామ వినురవేమ! 4628

వేమన తనసమకాలీన ప్రసిద్ధ చారిత్రకులైన రాజులను మంత్రులను, వారి సామంతులను, దండనాయకపరివార సమేతముగా దేహముతో పోల్చి కైవల్య మార్గమందుటకు గమ్యస్థానము జూపించిచాడు.

ఆ. శివభజనల వారు । భువి మంటిపాలైరి
వాదమేల దైవ । భేదమేల!
విష్ణుభక్తులెల్ల । వెలిభూతి పాలైరి ॥వి॥ 4629

శైవులు విభూతి నలది మట్టిని బొందిరి; వైష్ణవులు మట్టి నలది బూడి దయ్యారు.

ఆ. శివమతమునకెల్లఁ జెలగు హరిగురువు
హరిమతమునకెల్ల । హరుఁడు గురువు
గురువుఁ దెలియనట్టి । గుఱు తేమి గుఱుతయా! ॥వి॥ 4630

"శివ కేశవులకూ భేదమా
వారు చేసినందుకు మరి ఖేదమా
ఎద్దు నెక్కినవాడు లింగడూ బొల్లి
గ్రద్ద నెక్కినవాడు రంగడూ
ఎద్దూ నెక్కినవాడు గ్రద్ద నెక్కినవాడు
యిద్దరు ఒక్కటే సత్యము జనులార ॥ శివ ॥

ఆ. శివమతమునకైన । వివరింపఁగ గురువు
హరిమతమునకైన । నరయ గురువు
గురువు నెఱుఁగలేని । గుణహీనుఁ డెఱుఁగునా! ॥వి॥ 4631

హరి హర మతములకు గురుతుగలవాడు గురువొక్కడే.

క. "శివ" యను రెండక్షరములు
భువిలో నెవడైనఁగాని । పొలుపు దలిర్పం
దవిలి యొక నూఱు మాఱులు
ప్రవిమలముగ వ్రాల్లెవేయఁ । బరముఁడు వేమా! 4632

"శివ" నామము చింతించినవానికి శ్రీవిభూతి లభించును.

ఆ. శివయోగులమటంచు । శివు నెఱుంగక లేక
ఖ్యాతిగా జనులు ప్ర । ఖ్యాతులైరి
ప్రజలు పొగడితే నేమి । పొగడకున్నను యేమి? ॥వి॥ 4633

శివయోగులకు డాబుదర్పాల నవసరము.

ఆ. శివ వరంబులేక । శృతివాదముల చేత
సంశయంబు చెడదు । సాధులకును
చిత్రదీపమునను । జీకటి పాయునా ! వి॥ 4634

శృతులు మతిలేకండా చదివిన సద్గతులు గలుగునా !

క. శివుగుడిని దీప మిడినను
శివమందిరమందు జ్యోతి । స్థిరమగు టరుదా !
శివయోగి కమల హృదయము
దివి దళములు లేపుచుండుఁ । దెలియర వేమా ! 4635

హృదయదీపము యీశున కర్పించిన యీప్సితము లీడేరు టరుదా ?

క. శివుగూర్చి దీప మిడినను
శివమందిరమెల్ల వెలుగఁ । జేయునెకాదే
శివయోగి జ్ఞానదీపము
భువనంబులు వెలుఁగఁజేయుఁ । బొలుపుగ వేమా ! 4636

యోగత్వమున మించినది యుర్విలో లేదు.

ఆ. శివుఁడిట గలఁడంచు । శిలలకు మ్రొక్కెడి
వెఱ్ఱులార! జగతి । వెడగులార!
జీవులందె కాని । శిలలందు లేఁడయా ! ॥వి 4637

శిలలు పూజించిన వాడికి శ్రేష్ఠత్వ మెట్లబ్బు ?

ఆ. శివుఁడు గలఁడటంచు । శిలలకు మ్రొక్కెడు
వెఱ్ఱి జీవులార । వెతలు విడుఁడి
జీవులందె కాక । శిలలనేమున్నది? ॥వి॥ 4638

నిజమగు భక్తుఁడు శిలలకు మ్రొక్కునా !

ఆ. శివుఁడు యన్నిటియందు । సాక్షిగా బల్కంగ
లేదు లేదని బల్కు । సాధనేల ?
గగన సన్నిధియందు । గురిపెట్టి చూడరా ! ॥వి॥ 4639

అడవిలోవున్న యతి చిత్తచాంచల్యము బోలియున్న దీపద్యము.

ఆ. శివుఁడు బ్రహ్మమనుచు । శివశ్రుతి బలుకంగ
భక్తిలేకయెట్లు । బ్రాహ్మణుఁడగు?
హరుని భక్తులెల్ల । నగ్రజన్ములుగారె? ॥వి॥ 4640
శివుని పూజించిన వారే శ్రేష్ఠ కులజులు.

ఆ. శివుఁడు బ్రహ్మమనుచు । స్మృతులెల్ల బలుకంగ
వేఱె దైవములను । వెలియఁగొల్చి
శిష్టజనులు కూడ । భ్రష్టులై పోయిరే! ॥వి॥ 4641
వేదములన్నీ విశ్వేశ్వరునే వినుతించిన విజ్ఞులు తెలియరేమి ?

ఆ. శివుఁడు మూలకర్త । సృష్టియె విష్ణుండు
విష్ణువందు శివుఁడు । వెలయుచుండు
శివునియందు హరియుఁ । జెలగుచు నుండురా! ॥వి॥ 4642
శివకేశవులకు అభేదవ్యవసాయము జూపించాడు.

ఆ. శివుఁడు మూలదుంప । సృష్టిచే విష్ణువు
విష్ణువనఁగ శివుఁడు । వెలుఁగుఁదానె
శివుఁడు విష్ణు వనఁగ । శివరూప నామముల్ ॥వి॥ 4643
హరిహరులు యిద్దరొక్కటే

ఆ. శివునిమంత్రమె యగు । శ్రీహరిమంత్రము
తెలిసి తెలియలేరు । తిక్కనరులు
దేవుని మరచి తమ । దేహమే యనుదురు ॥వి॥ 4644
పారాయణ మంత్రాక్షరము లన్నియూ పవిత్రములే!

ఆ. శివునిమీఁద మనసు । స్థిరముగానుండిన
నౌనుమోక్ష మరయ । నౌనదాను
శివునిమీఁద మనసు । చీమంత తప్పిన
గాదు కాదుముక్తి । కాదు వేమ. 4645
శివునిధ్యానమే శ్రేష్ఠము.

ఆ. శివుని యనుభవంబు । సృష్టిలోపల లేక
సంశయం బుడుగదు । సాధకులకు
చెలఁగు దివ్వెలేక । చీకటిపాయునా ! ॥వి॥ 4646
సంశయ నివారణకు శంకరుధ్యానమే సాధనము.

క. శివునెంచి దీపమిడినను
శివుమందిరమందు జ్యోతి । శివస్థిర రూపున్
శివయోగి హృదయ మందున
శివ త్రిభువనములకు కర్త । స్థిరమగు వేమా! 4647

త్రిభువనములకు శివపూజయే శ్రేష్ఠము.

ఆ. శిశువు నరసిపట్టి । చేటలోనే పెట్టి
కడమక్రమముఁ జేసి । ఘనతతోడ
నడచు దినములెల్ల । నానాఁటికిట్లని
తెలియఁజేసె నపుడు । దృఢత వేమ. 4648

శిశుజనన మప్పుడు మంత్రసాని జేయు క్రమము.

ఆ. శిష్యవర్గమునకు । శివుఁజూప నేరక
కాని మతములోనఁ । గలుపునట్టి
గురుని యెఱుకనరయ । గుడ్డెద్దు జొన్నరా! ॥వి॥ 4649

మోసకారి గురువుల మోసములను జెప్పెను.

తే. శీఘ్ర గమనములో మించి । చిన్మయంబు
దాకి పరిపూర్తిఁ జెందును । ధన్యుఁ డరయఁ
బరమ పరిపూర్ణ పదవిలోఁ । బ్రబలునయ్య
నిర్గుణబ్రహ్మ మెదఁగని । నెగడ వేమ. 4650

నిరుణ బ్రహ్మారాధనే నెరయోగి లక్షణము.

ఆ. శీలమనుచు నరుఁడు । సిగ్గింతయునులేక
పరుల సొమ్ములెల్ల । బరిహరింప
వేషభాషవలన । మోసంబు సేయుచు
గ్రాసవాస మందు । గదర వేమ. 4651

వేషభాషలు జూపి మోసగించేవారి ముచ్చట్లు చెప్పెను.

క. శీలముగల సుందరి తన
యాలైనను స్వర్గమేల? । నైహికసుఖమే

వీలగు సతి దుశ్శీలగఁ
గాలుని పటుదూతయగును । గదరా! వేమా! 4652
పతివ్రత యైనభార్యగలవానికి వైకుంఠమేల ?

ఆ. శీలవ్రతముచేత । శిష్యుల శిష్యులై
తపసి కర్మములను । ధారవోసి
విశ్వ కర్మకులము । వీటఁబుచ్చిరి గదా! ॥వి॥ 4653
శిష్యులపాత్రుఫలము గురువునకు గుచ్ఛితగులును.

తే. శ్రీ కంఠుఁడగు వేమన । చెప్పినట్టి
పద్యముల నెవ్వఁడేనియు । పఠనసేయ
నట్టి పురుషుఁడు మనమున । నిట్టి దనుచుఁ
జెప్పరానట్టి పదవిని । చేరు వేమ. 4654
వేమన పద్యములు విడువక చదివిన శివస్వరూపము జూరగొంటాడు.

తే. శ్రీకరంబుగ వేమన । చెప్పినట్టి
పద్యముల నెవ్వ డేనియుఁ । బఠనసేయు
నట్టి పురుషుడు మనమున । నిట్టిదనుచుఁ
జెప్పరానట్టి వస్తువు । జేరువేమ. 4655
పరమార్థ దృష్టితో వేమనపద్యములు చదువుట పరతత్వమందుట.

తే. శ్రీకరంబుగ వేమన । చెప్పినట్టి
పద్యముల నెవ్వడేనియుఁ । బఠనసేయు
నట్టి పురుషుని మహిమల । నిట్టి వనుచు
మనకుఁ జెప్పంగ శక్యమే । మహిని వేమ. 4656
శుభకరమైన వేమన పద్యములు యిహపర సోపానములే!

ఆ. శ్రీకర శివతత్వ । శీలుఁడౌ వేమన
ప్రాకటమగు వేయు । పద్యములను
లోకమందు జదివి । లోవెలిఁ బాయరో! ॥వి॥ 4657
శుభప్రదమైన వేమన పద్యములు చదివి ధన్యులుగండు.

క. శ్రీకరు బ్రహ్మాకారునిఁ
బ్రాకటముగ మదినిఁ జేర్చి । ప్రణవాకృతిలో

సోకి నటించెడు జ్ఞప్తిని
బాకముఁ గని దాటువాఁడె । భక్తుఁడు వేమా! 4658

మంగళ ప్రదుడు మహిమాన్వితుఁడగువాఁడే ప్రణవాన్నారాధన చేస్తాడు.

తే. శ్రీకరుండగు వేమన । జెప్పినట్టి
వేలకొలదులు పద్యము । ల్వివర మెఱుఁగు
పురుష వరునకు సిద్ధించు । బరమ పదము
అనుభవములని వర్ణింప । నగుర వేమ. 4659

వేమన పద్యములు చదివి విశ్వాతీతులుగండు.

క. శ్రీ నెత్తిన రుద్రునకును
శ్రీ నోటను బ్రహ్మకెపుడు । శిరిగుల్కంగా
శ్రీ నెరిరొమ్మున హరికిని
శ్రీ నెడపఁగ గురుఁడ వీవు । శ్రీ వర వేమా! 4660

త్రిదేవులను త్రిమూర్తులను ధరించే తీరులను వివరించాడు.

క. శ్రీమంతులైన వారలు
సామాన్య జనాళి నెటులు । సఖ్యతగంద్రే?
పామరగణ మదికాదా!
తామే మేటుల మనుట । తప్పుర వేమా! 4661

ఐశ్వర్యవంతులను ఆదుకొమ్మన్నాడు.

క. శ్రీమదుమాపతియగు నా
స్వామికి దాసుండనంగ । జగములు పొగడన్
వేమన యనియెడు ధీరుఁడు
నేమంబునఁ జెప్పె దీని । నిక్కము వేమా. 4662

ఉమాపతి = గౌరీశ్వరుఁడు; ఈశ్వరభక్తుఁడగు వేమన యీవిజ్ఞాన సాగరాన్ని వివరించాడు.

క. శ్రీ మూలశక్తి యనఁదగు
నామూర్తులఁగన్నతల్లి । యాఁ గాదనకా
ధీమూర్తి నెంచి చూడుము
నీమూర్తికి సాటియేమొ । నిజముగ వేమా. 4663

ఆధారమైన ఆదిశక్తిని నీమూర్తిలో మూర్తీభవించుకో.

క. శ్రీ యన మంగళ దేవత
శ్రీ యనఁగా విష్ణుపత్ని । సిరి సంపదయున్
శ్రీ యనెడు మూలశక్తిని
శ్రీ యని వర్ణింపు మెపుడు । స్థిరమతి వేమా! 4664

"శ్రీ" యన త్రిమూర్తుల పత్నులందరికీ వర్తించును.

క. శ్రీ రాజయోగ విద్యా
పారీణున కబ్బుగాక । పరమ సుఖంబీ
ధారుణి వేరెవ్వరికిని
కూరిమి చేకూరదెపుడు । కుదురుగ వేమా ! 4665

రాజయోగాలు చేసినవారికే రమ్యపు సుఖములు గలుగును.

సీ. శ్రీరాజ రాజేశ్వ । రీ రాజయోగంబు
తెలిసిన వారికి । తేటపడఁగ
అండ పిండాండ బ్ర । హ్మాండములన్ దెలియును
భూత త్రివేణులు । పొసగుచుండు
మూర్తిత్రయంబను । ముఖ్యశక్తులు మూడు
రేచకాదులు మఱి । తోఁచుచుండు
సన్మండలములును । సచ్చిదానందముల్
తత్వంపదాదులు । దనరదోమ
నాదములు నాడులున్ భువి । బోధపడును
లోకముల్ చక్రముల్ శూన్య । చక్రములును
తనువులున్ త్రిపుటములు నేల । తథ్యముగను
తెలియనేర్చును వేమన । తేజమొప్ప ॥వి॥ 4666

1. శ్రీరాజ యోగసామ్రాజ్యం నిర్వికల్పవిరాజితం తళ్యాను భవ సిద్ధ్యర్థం గురుసేవా కరోతి యః" రాజయోగము వికల్పము లేనిది.

2. "రాజరాజేశ్వరీ యోగం శేషమార్గం ప్రశస్యతే । యః పఠేత్సతతం భక్త్యాః సముత్తో నాత్రసంశయః ॥

రాజరాజేశ్వరీ మంత్రము జపించిన వారికి మోక్షు వచ్చును.

క. శ్రీరామ యనెడుమంత్రము
తారకమని యెఱిఁగి మదిని । ధ్యానపరుండై
సారముఁ గ్రోలెడు । నరునకుఁ
జేరువఁనే పరమపదవి । జేకురు వేమా ! 4667

"తారకం మనస్సుద్ధి కారకం"

క. శ్రీరామ రామనామము
మాటాడక వినునరునకు । మహితాత్ముఁడవై
యూరూర దిరిఁగిచెప్పుమి
యూరూఢ తపఃఫల దమ । దగునని వేమా ! 4668

శ్రీరామ మంత్రము శ్రేష్ఠతమన్నారు.

క. శుకయోగీంద్రుఁడు తనలోఁ
బ్రకటితముగఁ బూర్ణమంది । బ్రహ్మన్వితుఁడై
యకలంక భావపరుఁడై
నికరంబుగ వెలయుచుండె । నిజముగ వేమా । 4669

శుకయోగిమహర్షి యోగపురుషుడు. (భాగవతము)

ఆ. శుక్లమరయఁజూడ । శుభ్రమౌ తెలుపగు
నరయశోణితంబె । యలరునెఱుపు
తెలుపు నెఱుపు రెండుఁ । దేజరిల్లెడునాత్మ ॥వి॥ 4670

శుక్లశోణిత సమ్మేళన ఆత్మోత్పత్తికి ఆధారము.

ఆ. శుక్లశోణితములు । శోధింపనీరదె
నవ్యకర్ధమంబు । నారమెకద
నారమందొదవిరి । నారాయణుఁడునరుల్ ॥వి॥ 4671

నారము = నీరు ; నీటిలో నారాయణుఁడు నరులూ పుట్టిరి (విష్ణుపురాణము)

తే. శుద్ధచిన్మాత్రపరతత్వ । సుఖముఁగోరి
ముద్దుగుల్కెడునాత్మకు । మూలమెఱిఁగి
సద్దుసేయఁగఁ బూర్ణుఁడై । సంచరించు
సిద్ధయోగికిసరిలేరు । చెప్ప వేమ. 4672

పరిశుద్ధమగు చిన్మయబ్రహ్మమును పరికించినవాడే ప్రౌఢకవి.

ఆ. శుద్ధదృష్టి దెలిసి । శుక్రునంతటివాఁడు
పట్టలేక మనసు । పారవిడిచి
కన్ను వోవఁబిదప । గాకిచందంబయ్యె ॥వి॥ 4673

శుక్రాచార్యులు వంటి జ్ఞాని బుద్ధివిడచి కాంతాలోలుఁడై కన్ను పోగొట్టుకొన్నాడు.

తే. శుద్ధనిర్గుణ పరిపూర్ణ । సిద్ధిఁగోరి
యమల నిర్గుణచింతన । నందిపిదప
నభ్యసింపుము తపమూని । యనుదినంబు
నిర్గుణబ్రహ్మ మాత్మలో । నెగడు వేమ. 4674

నిర్గుణబ్రహ్మ నెగడాలంటే. నిన్ను నీవు జూచుకో

తే. శుద్ధపరిపూర్ణ దృష్టిలో । సుస్థిరముగ
నాటినిర్గుణ మందుట । నిర్మలంబు
గద్దెపైఁజేరి బ్రహ్మంబుఁ । గాంచనగును
సుద్దులేఁటికిగురుఁజేరఁ । జూడు వేమ. 4675

"యదా చర్మ వదా కాశం వేష్టయిష్యతి మానవం తథాపరశివం జ్ఞాత్వా సముక్తో నాత్ర సంశయః"
శివునెరిగిన వాడు ముక్తిపొందును.

ఆ. శుద్ధులెల్లగూడి । శోధించి శోధించి
శుద్ధిఁజేసియుక్క । సున్న మొసఁగి
శుద్ధికిఁ బ్రథమంబు । సున్న మేకాదయా ! ॥వి॥ 4676

రసవిష గంధకాదులు శుద్ధులు జేయుటలో సున్నము నుపయోగింతురు. (వైద్య విజ్ఞానము)

ఆ. శుష్కబుద్ధిచేత । శుశ్రూషలొల్లని
నిష్ఠఁబట్టియేమి । నిజమెఱింగె
గష్టమైన విద్య । ఖలులకు నబ్బునా ! ॥వి॥ 4677

శుష్కప్రియములు శూన్యవాదములు.

ఆ. శూద్రతనము పోమె । శూద్రుఁడనఁగానని
ద్విజుఁడను కొనుటెల్ల । తెలివి లేమి
ఇత్తడైచఁట పసిడి । కీడనవచ్చునా ! ॥వి॥ 4678

తన్నుక చచ్చినా తలపు లూసువారు తత్త్వజ్ఞులౌతారా !

ఆ. శూద్రయువతి కొడుకు । శుద్ధాంతరంగుఁడై
వేదవేద్యమైన । పాదుఁదెలిసి
బ్రహ్మపదవి కన్న । బ్రాహ్మణుఁడే కదా ! ॥వి॥ 4679

శూద్రత యగు పల్లెపడుచు కొడుకు వాస్యుడు. వేదాలు గూడావ్రాసెను

ఆ. శూద్ర శూద్ర యనుచు । శూద్రుల నోనాడు
శూద్రకులము తన్నుఁ । జుట్టుకొనఁగ
మనసు శుద్ధిలేక । మఱిద్విజుండెట్లౌను? ॥వి॥ 4680

మనసు శుద్ధిలేని వాడే శూద్రుడు.

ఆ. శూద్రుఁ డనుచు చూడ । శూద్రుల బోనాడి
మాలకంటె మగఁడు । మాల యనుచు
ద్విజుఁడనే పట్టన్న । ద్విజుఁడుగానేర్చునా! ॥వి॥ 4681

వేమన కాలపు "పట్టన్న" పంతులగురించి యీపద్యము జేప్పేడు.

ఆ. శూద్రురాలి కొడుకు । శుద్ధాంతరంగుఁడై
వేదవేద్యమైన । పాదుఁదెలిసి
బ్రహ్మపదవి గన్న । బ్రాహ్మణాగ్రజుఁడాయె ॥వి॥ 4682

వ్యాసుని గురించి గొప్పగా చెప్పుచున్నాడు.

ఆ. శూద్రులనుచు భువిని । శూద్రుల బోనాడు
మాలకన్న దుడుకు । మహిని లేఁడు
నరకమునకు నేగు । నష్టమైన వెనుక ॥వి॥ 4683

మనస్సు బాగున్న మరి శూద్రత్వ మెక్కడ?

ఆ. శూద్రులందుఁ బుట్టి । శూద్రుల దూషించి
ద్విజుల మనెడుమాట । నిజముచేసి
మనసు నిల్పుకున్న । మహిశూద్రుఁ డధముండు ॥వి॥ 4684

శూద్రుఁడైన సుజ్ఞానమువలన ప్రజ్ఞాశాలి యౌతాడు.

ఆ. శూలినెంచి మదిని । శుద్ధాంతరంగుఁడై
కాలకర్మములను । గాలద్రొక్కి
మేలుపూర్ణపదవి । మెచ్చును శివయోగి ॥వి॥ 4685

మంగళప్రదమైన యోగత్వముగలవారే శివయోగులు.

కం. శృంగారవతుల కింటను
బంగారమువంటి పతులు । పరమ ప్రియులై
రంగుగ శోభిలు చున్నను
దొంగలిటులఁ గోరనేమి ? । దొమ్మర వేమా ! 4686

పతినివిడచి పరపురుషుల ప్రాపుగోరే పతిత దొమ్మ తెగులు పట్టిన పశువే.

తే. శృతమునకు దోచు రవమున । శోత్రియుఁడగు
మదినిలోగుట్టు లోపలి । గతినెఱింగి
నంత పరిపూర్ణ భావంబు । నందు నతఁడు ॥వి॥ 4687

"సోఽహం, హంసో" అని తనంతట అనాహతముగా ఘోషించుచున్నది. నేనేబ్రహ్మము బ్రహ్మము నేనే అని శృతి చెప్పుచున్నది.

తే. శృతమునకు దోచురవమున । శ్రోత్రియుఁడగు
మతిని లోగుట్టు లోపలి । గతినెఱింగి
నంతఁ బరిపూర్ణ భావంబు । నందునాతఁ
డరయ బ్రహ్మర్షి కిని సాటి । యగుర వేమ. 4688

, పరిపూరాత్మను పరికించినవాడే బ్రహ్మర్షి.

క. శృతి దృష్టాంతము లేకయె
మతిహీనులు పల్కినట్టి । మాటలు చూడన్
సతమని నమ్మగరాదం
దతులితమగు పూర్ణపదవి । యందదు వే గా! 4689

మతిలేని మాటలు శృతుల నందుతాయా !

క. శృతి యుక్త్యను భవము లేకను
మతిహీనులు పల్కినట్టి । మాటలు వినినన్
సతమని నమ్మగరాదది
యతులితముగ పూర్ణపదవి । యందదు వేమా! 4690

శృతి అనుభవాలు లేనివారు శ్రోత్రియులౌతారా !

ఆ. శైవవైష్ణవాది । షణ్మతములకెల్ల
దేవుఁడొక్కఁడనుచు । దెలియలేరె ?
తమకు భేదమైనఁ । దత్వంబు భేదమా ! ॥వి॥ 4691

ప్రవక్తలచే కల్పిత మతములు వేరుగానున్నా సారమొక్కటిరా.

క. శోణితము కామ సతులకుఁ
బ్రాణితముగ శుక్లమగును । బహు పురుషులకుం
బ్రాణము తెలుపెఱుపుఁ గలియ
గానగు నీదేహ గంధి । ఘనమగు వేమా! 4692

శుక్లశోణిత సంయోగమే జీవకణము లుత్పత్తికి మూలమగును.

తే. పండు డుర్ర్వని బ్రదికిన । పరసుఁడగునె?
దండివాఁడన్న భ్రమఁజూపు । నిఁడుగాను
కొండలోపల జేరిన । గండఁడగునె?
నిండు పరిపూర్ణ మంద ని । తండు వేమ. 4693

నపుంసకుఁడు నారీమణుల కూర్మి సంపాదించగలడా!

క. షట్చక్రములకు నావల
షట్చింతలు విడువ ముక్తి । షడ్గుణనిధియై
షట్కాయలందుఁ బొందుట
షట్చిత్రములై వెలుంగు । షట్కము వేమా! 4694

షట్చక్రములలో షడ్విధ శ్రేయస్సును బొందమన్నాడు.

ఆ. షడర విందములను । సాధ్యముగా జేసి
కుండలిని కనుఁగొని । కుదురు పరచి
మనసు నిల్పువాడు । మరిద్విజుఁ డనవచ్చు ॥వి॥ 4695

షట్చక్రముల సాధించి కుండలిని మేల్కొల్పువాడే గొప్పవాడు.

ఆ. షట్పదంబులేల । ఝుంకారములు సేయు
నెగురఁ గలిగినట్టి । పొగరెకాదె
తాము చూడనెంత । తమ బ్రదుకెంతరా! ॥వి॥ 4696

నీచులు చేయు ఆర్భాటములు తుమ్మెదల రొదలవంటివన్నాడు.

ఆ. షడ్రుచులను వేఱు । సారమెల్ల నొకండె
సృష్ట వేరుకాని । నీతి యొకటె
పరమభక్తి వేఱు । భవుఁ డొక్కడే సుమీ! ॥వి॥ 4697

పరమ జ్ఞానముతో జూచువానికి అన్నియూ ఒక్కటే!

తే. షడ్రుచులు వేఱు ధరలోన । సార మొకటె
సకల మతములు వేఱ్వేఱు। సాధ్యుఁ డొకడె
భక్తులు గనఁగ వేఱైన । బ్రాప్యుఁ డొకఁడె
కువలయంబున దీనిగా । గొనుము వేమ. 4698

కువలయమున = భూమిపైన; బుద్ధియొక్కటైన భూమియంతయూ ఒక్కటేగాదా !

ఆ. షణ్ముఖీ ముద్రలో । షడ్వర్గములు బోవు
షడ్వర్గములతోడ । షణ్మతములు
తప్పుదారులుఁ బోక । ఒప్పుగానుండురా! ॥వి॥ 4699

షణ్ముఖీ ముద్రవలన షడ్గుణము లణగి చక్కని జ్ఞానమార్గమబ్బును.

ఆ. షేకు సైదు మొగలు । చెలగు పఠానులు
తురకల దొరతనము । తొలుతఁ జేసి
రాఁగ రాఁగ విడిచి । రైతులై కొలచిరి ॥వి॥ 4700

మహమ్మదీయులు షేకు, సైయద్, మొగలు పఠానులుగా నున్నారు.

ఆ. షోడశాక్షరములు । శోధించి మదినెంచి
గూఢ భావమూని । కుదియఁబట్టి
వేడుకలర ముక్తి । విన్నంది చూడరా ! ॥వి॥ 4701

" ఓం నమూల నాస్తి, నాస్తి ప్రజ్ఞానం శరీరం కారణం నచ కార్య కారణ రూపాణాం ప్రపంచం నాస్తి సర్వదా ! " అని ద్వాదశాక్షరి షోడశాక్షరీ పంచదశీ మంత్రములు గదా !

ఆ. షోడశోపచార । శూన్యప్రచారముల్
భక్తిలేకపాడ । ఫలము గలదె ?
నిక్కమైన భక్తి । మొక్కిన నేచాలు ॥వి॥ 4702

షోడశోపచారములు చేసిన దేవుడు నూక్ష్మలో మోక్షమిస్తాడని శృతులు చెప్పుచున్నవి.

స

కం. సంకల్ప ముడిఁగిననుతా
న్సంకల్పుండైన జాలు । సద్గతిఁదడవా
సంకల్పమె బంధంబని
సంకల్పమె మోక్షపదవి । చక్కఁగ వేమా ! 4703

సంకల్పము = మనసులో నిశ్చయము; మనోనిశ్చయమే మనసుకు మార్గము.

ఆ. సంచితకర్మను ద్రుంపను
మించఁగలే రైరి జనులు । మెలకువ తోడం
బంచశరునింట గెలిచెడు
సంచెఱిఁగిన తత్వవేత్త । సరసుఁడు వేమా ! 4703

సంచితము = పూర్వపు కర్మఫలితము; పంచశరుఁడు = మన్మథుఁడు.

ఆ. సంతకూటమందు । వింతలు చూడకు
చింతలోని చింత । చిన్మయంబు
పంతగించి చూడఁ । బరమామృతంబురా ! ॥వి॥ 4704

సంసార సంబంధములతో కూటమియే సంత.

కం. సంతత సమాధి ప్రజ్ఞను
వింతలు దలపోయకుండ । వివరించినచో
నంతరమునఁ బరమాత్ముఁడు
మంతవ్యుఁడు వెలుఁగుచుండు । మదిలో వేమా ! 4705

సంతతము = ఎల్లప్పుడు; నిత్య సమాధిస్థుఁడు నిశ్చల బ్రహ్మమును తెలియగలడు.

ఆ. సంత బసివి పొందుఁ । జలిపందిరి జలంబు
ద్రోవ నమ్ముతోడు, । దొత్తునంట
రచ్చసభలనిద్ర । రసికులు మెత్తురా ! ॥వి॥ 4706

స్వకపోల కల్పిత లోకానుభవ ప్రపత్తిని చిత్రించాడు: బసివి=బనికిమాలినది.

ఆ. సంతలోన సరకు । సరసమాఁ గొనవచ్చు
వింతలంది పొంద । వివరమేది ?
చింతదీర్చిచూడ । జిన్మయజ్యోతిరా ! ॥వి॥ 4707

చింత లెడబాసి సంసార సంతలోనున్నా వింతలేదు.

ఆ. సంద్రమునకుజూడ । సరియేదియును లేదు
అట్టి జలధినీర । మనువు గాదు
అనువుగానినీరె । యదియేమి చేయును ? ॥వి॥ 4708

అంతము పంతము లేని సంద్రము. అయినా త్రాగడానికి పనికిగాదు.

తే. సందియములేని మదిలోన । సత్యమాత్మ
పొందుఁగూడుఁట ప్రత్యక్ష । పూర్ణమనుచు
నందుచుండుము పరతత్త్వ । మద్దనెపుడు
కందువదె స్వర్గసౌఖ్యము । గాఁగ వేమ ! 4709

పరతత్త్వానికి సందియము లేని మదియే సాక్షీభూతము.

ఆ. సందె వార్చనేమి ? । జపము సేయఁగనేమి ?
వేదశాస్త్రములను । వెదకనేమి ?
పడతి గనినవాఁడు । బాపఁడుగాఁడయా ! ॥వి॥ 4710

స్త్రీని జూచిన మాత్రమున చిత్తగలిగినవాడు బ్రహ్మజ్ఞాని ఎట్లగును?

కం. సందులు గొందులు వెదకిన
బొందునె ? పరతత్త్వబోధ । పురుహూతునకే
నందెందుఁ బొందుపడునన
నందందే యలరుచుండు । నమలము వేమా ! 4711

పురుహూతుఁడు = ఇంద్రుడు ; ఇంద్రునికిసైతము డెందము కుంది డిందువడుట తప్పలేదు.

కం. సందేహామేల వినరయ
మందానందంబుఁగలుగు । మర్మముఁదెలియున్
ముందా మర్మము వీడమి
నెందఱు వేనోళ్ళనన్న । నేవమెవేమా ! 4712

ఆమందానంద మందుటకు డెందములో కుందుట కూడదు.

ఆ. సంధ్యవార్చనేమి ? । జపము నేయఁగనేమి ?
వేదశాస్త్రములను । వెలియనేమి ?
బత్తిలేనివాఁడు । బాపఁడు గాఁడయా ! ॥వి॥ 4713

బత్తి చిత్తానికి హత్తనియెడల బాపడెట్లగు ?

ఆ. సంధ్య వార్చనేమి ? । జపముసేయఁగనేమి ?
వేదశాస్త్రములను । వెలయనేమి ?
పరముఁగననివాఁడు । బాపఁడుగాఁడయా ! వి॥ 4714

పరమపదవీ సోపాన మార్గము వెదుకనిదే బ్రహ్మత్వ మెట్లు సిద్ధించు ?

ఆ. సంధులైనవారు । యిందు నందనకుండు
నన్ని తావులందు । హారునివలెను
తెలియువారికెల్ల । దేవుఁడే కనిపించు ॥వి॥ 4715

సంధులు = తెలిసినవారు; సంధులను తెలసికొనిన సర్వజ్ఞత్వము సిద్ధించును.

ఆ. సంసారమును విడిచి । సన్యాసిగాకుంటె
చేసినపాపముల్ । మోసఁబోవు
మోసబుద్ధియుగాక । మోక్షంబు చెఱిచేది ॥వి॥ 4716

మోసపు బుద్ధిచేత పరులను మోసగించి తను మోసపోతున్నాడు.

ఆ. సంసారమున మునిఁగి । సన్యాసిగావాఁడు
అతిశీఘ్రమునను ఆ । నందుఁడౌను
ఆనంద మనుమాట । అద్భుతాకారంబు వి॥ 4717

అతీతాకారమే ఆనందము.

క. సంసార సుఖము లూడిన
సంసారమువదలి లోక । సంచారియగున్
సంసారేచ్ఛలు విడకయె
హంసను బట్టంగలేరి । హంబున వేమా! 4718

సంసార సుఖమును విశువనిదే హంస పట్టే సూత్ర మలవడను.

ఆ. సంసారిఁగాకుంటె । సన్యాసిఁగాబోఁడు
సన్యాసిఁగాకుంటె । సాధుగాఁడు
సాధుండుగాకుంటె । సజ్జని గాఁడురా! ॥వి॥ 4719

సాధు విజ్ఞాన బోధాక్రమమును సమీకరించాడు మనసాధు.

ఆ. సంసారి యెందైన । సన్యాసిఁ గాబోఁడు
సన్యాసి తిరిగి సం । సారిగాఁడు
మాలవాఁడైందైన । మాదిగవాఁడౌనె? ॥వి॥ 4720

కాకి కేకి గాదు, కేకి కాకి గాదు

ఆ. సంసారి యేమెఱుఁగు । సన్యాసి నడతలు
గ్రుడ్డివాఁ డేమెఱుఁగు । గుఱుతు దారి
కుంటివాఁ డేమెఱుఁగు । కాశీశ్వరుని ముఖము ॥వి॥ 4721

* యతి పోయెను; అసమర్థులకు సమర్థత ఎట్లు వచ్చును ?

ఆ. సకలంబు మతికిని । సంతోష మతితోడ
బ్రహ్మ మెఱిఁగిన నాఁడె । బ్రాహ్మణుండు
బ్రహ్మ నెఱుఁగకపోతె । బ్రాహ్మణుండేలాగు? ॥వి॥ 4722
సకలార్థ తత్త్వవేదియే సద్బ్రాహ్మణుఁడు.

ఆ. సకల కల్మషములు । సమ్మతింతురె చేయ
విప్రులేల నిట్లు । వెఱ్ఱులైరొ?
కాలగతిని యిట్టి । కడగండ్లు పుట్టెరా! ॥వి॥ 4723
కాలమహిమను బట్టి కష్టములు వచ్చును.

ఆ. సకలజాతి పురుష । సాంకర్యమునకును
సతులనిచ్చి తాము । సమ్మతింత్రె
ఉంకువె కనలేని । యోగులు బాపలా! ॥వి॥ 4724
ఉపమానోపమేయములు సందర్భోచితములుగా లేవు.

ఆ. సకల జీవములను । సమముగా నుండెడి
యతిని క్రమముఁదెలియు । నతఁడె యోగి
అతఁడ వీవె యనుట । నన్యుండు గాఁడయా! ॥వి॥ 4725
సర్వత్రా సమబుద్ధి గలవాఁడే జ్ఞాని

ఆ. సకల తనువులెత్తి । సంచరించును జీవి
కలిమి బలిమి తగిలి । కలవరించు
నాత్మ తేజమూని । యచ్చుగాఁ జూడరా! ॥వి॥ 4726
ఆత్మతేజమునకు సాటిగలది వేరొకటి లేదు.

ఆ. సకల తీర్థములను । సకల యజ్ఞంబులనుఁ
దలలు గొరుగకున్న । ఫలముగలదె?
మంత్రజలము కన్న । మంగలి జలమెచ్చు ॥వి॥ 4727
తీర్థసేవలు ముడుపులూ ఘనత నీయవు.

ఆ. సకల ధర్మములకు । శంభుండె యధిపతి
శంభువునకు ముక్తి । సౌఖ్యమేది?
తలచు త్రోవఁ దిరుగు । తలక్రిందు లౌదురే! ॥వి॥ 4728
శంకరుఁడే నిశ్శంక లేక సంచారము చేసి ప్రేతభూమిలో కూర్చొని నాటకము త్రొక్కెఁడు.

క. సకలంబై తాఁ బుట్టును
సకలము నొక్కటికిఁగాను । సర్వముఁ దానౌ
వికటంబై తిన జంపునె
యకటా! యావస్తువెవ్వ । రందుర వేమా! 4729

విచిత్ర విడికథతో వేదాంతాన్ని జోడించి విచిత్రంగానే వివరించాడు.

క. సకలము నాకలికొఱకే
నికరంబుగఁబెట్టె మనకు। నీచపు గుణముల్
సకలంబందు వసించెడి
యకలంకుఁడె యేమివింతొ । యరయర వేమా! 4730

అన్ని యెడల సంచారము చేయువాడే సర్వేశ్వరుఁడు.

క. సకలము నిర్గుణచింతను
వికలంబును జెందలేవు విజ్ఞానివయై
ప్రకటించి మెలఁగునంతట
సకలంకునిఁ గాంచుటదియె । యమలము వేమా! 4731

జీవికి యేమహత్తరమైన శక్తినిచ్చి యిష్టార్థము లీడేర్చిన ఈశ్వరుని మాయారూపమును మట్టుగా జెప్పెను.

ఆ. సకలయోగములకు । శంభుండె యధిపతి
ఆ మహేశ్వరునకు । నధికుఁడేడి?
తలచు క్రోవ లరిగి । తమి భ్రష్టులౌదురు ॥వి॥ 4732

అన్ని విభూతులకూ ఆ మహేశ్వరుఁడే కర్త.

ఆ. సకలరూప మాత్మ । సాక్షిలో నెంచుట
నికరమైన బయలు । నిర్ణయంబు
వికలమింతలేక । వెలుగును దత్వంబు ॥వి॥ 4733

తత్వ నికరుని దెలసికొనిన సకల బ్రహ్మము సాక్షాత్కరించును.

ఆ. సకలరూపములకు । సాక్షి తానై యుండు
సకల సముఁడు చూడ । సమముగాను
వికలమేమిలేక । వెలిగించికానరో! ॥వి॥ 4734

వికలాన్ని విడగొట్టి విజ్ఞానాన్ని వెలిగించుకో!

ఆ. సకలవస్తుజాతి । సంతతి తనువునఁ
బుట్టెనంద్రు పంచ । భూతములనె
దానిచేతఁ దాము । దరపోషణచేయు
వారు నిజమెఱుంగ । లేరు వేమ. 4335

పంచభూతములే బ్రహ్మాండ భాండమునకు ఆధారము.

ఆ. సకలవస్తువులను । సంతత తనువుల
వుసురి కేడఁ? బంచ । భూతములును
దాని దానిచేతఁ । దగు భూషణముచేయు
నేమిలేదు సుఖము । నెఱుఁగు వేమ. 4736

పంచభూతముల సంచార క్రమమే ప్రాణికోటి.

ఆ. సకలవస్తువులును । సంతత తనువులుఁ
బుట్టిపోవు పంచ । భూతములుర
గాలివిచ్చి పోవు । కైవడి నుండురా! ॥వి॥ 4737

గాలియొక్క రాకపోకలవలె చావుపుట్టుకలు జరుగును.

ఆ. సకల విద్యలఁగని । సంతోష పడవచ్చుఁ
జేయిసాచి కాసు । నీయలేఁడు
చెలఁగి యొరులకైనఁ । జెప్పవచ్చును గాని
తాము చేయలేరు । ధరను వేమ. 4738

ఇతరులకు చెయ్యమని చెప్పవచ్చుగాని తానుచేయలేడు.

(లోకానుభవము)

ఆ. సకల విద్యలందు । సంపన్నులైయున్న
యట్టివారుఁ బరిచ । యమునఁ జౌక
పెరటిచెట్టు మందుఁ । బరికింప మెచ్చరు ॥వి॥ 4739

తరచూ చూచుటవలన తక్కువ స్థాయిగా భావిస్తారు.

ఆ. సకల విద్యలెఱిఁగి । చచ్చిఁబ్రదుకు విద్య
యొకటి నేరమనుచు । నుర్విజనులు
కటకటఁ బడుదురె । కడహానిఁ దెలియరు ॥వి॥ 4740

అసలు విద్య తెలియక అఘోరించేవారు అయోమయులు.

సీ. సకల వేదంబుల । సారమై విలసిల్లు
సద్గురు వాక్యంబు । సత్యముగను
మదిలోన సద్భక్తి । మఱవక చేసిన
మమతలు విడునయ్య । మహితముగను
చిత్త విభ్రమఁ బాసి । చిన్మాత్రమందగఁ
జేరికొల్చిన ముక్తి । చేరువగును
హరి హరాదులకైన । నలవిగానిది బయ
లను భవవేద్యమై । యలరనగును
అట్టి సద్బోధ మర్మంబు । నరయవలెను
మనసులోఁ గల్మషంబులు । మానవలెను
శీఘ్రకాలంబులో నాత్మ । సిద్ధియగును
నిత్య సంతోష నిలయుఁడై । నెగడు వేమ. 4741

త్వరలో నిత్యసంతోషి యగుటకు నియమక్రమము విజ్ఞులకు వివరించాడు.

తే. సకల శాస్త్ర పురాణము । ల్చదివి, విన్న
గలదు లేదని తెలియక । కలిమిచేతఁ
గులుకుచుండెడి జనులకు । గుణమురాదు
తెలియదని చేర గురుబోధ । తెలుపు వేమ. 4742

గురూపదేశము లేనిదే కోటిగ్రంథాలు చదివినా కొల్లబోవును.

ఆ. సకల శాస్త్రములను । జదివియు వ్రాసియుఁ
దెలియఁగలరు, చావుఁ । దెలియలేరు
చావుఁ దెలియలేని । చదువుల వేలరా ! ॥వి॥ 4743

ఎన్ని గ్రంథములు వల్లెవేసినా చావును తెలిసేవి చదువరేమి ?

ఆ. సకల శాస్త్రములును । సంపుటంబులువ్రాసి
చదువనేర్చిరైనఁ । జావెఱుఁగరు
చావెఱుఁగని చదువు । చదువంగనేలనో ! ॥వి॥ 4744

చావు తెలిసిన చదువు చదివినవాడే చతురుఁడు.

తే. సకల శివరూప తత్త్వంబు । సంస్మరించి
వికల మేమియు లేకుండ । వివశుఁ డగుచు
నికరమగు నిండుబ్రహ్మంబు । నెనుక వలెను
సుకరమయి ముక్తి చేకూఱు । సారిది వేమ. 4745

శివమూర్తి తత్త్వము స్థిరముగా తెలిసినవాడే శివయోగి.

ఆ. సకల సంపదలను । సారస్య మెఱుఁగని
వంచనగల మనువు । వాడిపోవు
సమములేని మనువు । చక్కఁగా నుండునా ! ॥వి॥ 4746

పరస్పర విరుద్ధములుగల భార్యాభర్తల సంబంధము విడాకులు పెడాకులు.

క. సకలాకారుఁ డనంతుఁడు
సకలాత్మలయందు సర్వ । సాక్షియుఁ దానౌ
సకలగత నిర్వికారుం
డకలంక స్థితిని బ్రహ్మ । మనఁబడు వేమా ! 4747

కలంక రాహిత్యమైన ఘనతర యోగమే బ్రహ్మమనబడును.

క. సక్తిని మదిలోఁ బూనియు
భక్తిని సాధింపనగునుఁ । బలు తెఱఁగులుగా
యుక్తిని మదిలోఁ బెనిచిన
ముక్తికి భంగంబెయగును । మొగిచెడ వేమా ! 4748

యుక్తి లోక తంత్రమునకేగాని ముక్తిని చేపట్టడానికి విరక్తిచేస్తుంది.

ఆ. సక్తిమాను పనులు । చక్కఁగా నెఱవేఱు
భక్తిగలుగు పూజ । ఫలమునిచ్చు
యుక్తిగలుగు మాట । యొప్పునురా భువి ॥వి॥ 4749

ఆటవెలదికి అంద చందముల నిచ్చే ప్రాసల భూషణాలుగా చేసి
భావ పరిణతిని పరిపక్వంగా జూపించాడు.

ఆ. సక్తులైనవారు । సాగింత్రు కార్యముల్
రక్తికొలఁది నవియు । రమ్యములగు
ముక్తికొఱకు విధులు । ముదమునఁ జేయరా ! ॥వి॥ 4780

శక్తిసామర్థ్యము గలవారు సాఫల్యము బొందుదురు.

తే. సఖుఁడు తోడైనదానికి । సంతసించి
వికలమొందదు నిజమిది । వెగటుఁగాదు
నికరపు తెలుక తోడైన । నిజముగాదె ॥వి॥ 4781

స్నేహితుని బోలి పరిపూర్ణము పరము ముదము చేకూర్చును.

తే. సఖుఁడు తోడయ్యెనన్నను । సంతసింత్రు
వికలమొందరు నిజమిది । వెగటుకాదు
నికరపు తెలుక తోడైన । సుకరములుగ
సకలకార్యంబు లొప్పు ని । జంబు వేమ. 4782

మిత్రుడు మేలును చేకూరుస్తాడు.

ఆ. సగము కన్నులుమూసి । సగము కన్నులు తెఱచి
సగము కన్నులమీదఁ । జెలఁగుచున్న
జ్యోతిదేవినిఁ జూచు । జాణ యెవ్వరు లేరు ! ॥వి॥ 4753

ఆపోజ్యోతిని అరయుటకు నిమీలిత నేత్రావధానమే నిజమగు మార్గము.

ఆ. సగరుఁ డుర్వి రాజు । చక్రవర్తి యటంచు
పరులు తన్నుఁ బొగడ । బ్రదుకుచుండె
నిట్టి ఘనత వీరి । కెందునకయ్యెరా ! ॥వి॥ 4754

సగరుడు సత్పరిపాలనాసక్తిచే రాజయ్యు చక్రవర్తిగా ప్రశంసింపబడెను.

ఆ. సగుణ నిర్గుణమనియెడి । సంశయంబు
పరమ గురునాజ్ఞచేఁ గాక । పట్టుపడదు
అగణితంబుగ మదిలోన । నందవలెను ॥వి॥ 4755

సగుణ, నిర్గుణములు గురూపదేశము వలననే గుర్తింపబడగలవు.

తే. సగుణ నిర్గుణ భేదార్థ । సంశయంబు
పరమ గురునాజ్ఞచేఁగాక । పట్టువిడదు
అగణితంబుగ మదిలోన । నందవలెను
వాదములు సేయ నెచ్చగు । వసుధ వేమ. 4756

వాదభేదములువిడచి గురుభక్తిని పొదుకొన్న గుర్తుదొరుకును.

క. సగుణం బనగా లేనిదె
సగుణంబన నదియె మోహ । జాలము లెల్లన్
సగుణంబు మఱచి నీలోఁ
దగులుట నిర్గుణము దారి । తలకొను వేమా! 4757

సగుణబ్రహ్మకన్న నిర్గుణబ్రహ్మ నిన్నీ డేర్చేది.

చ. సగుణము నాత్మలోపలను । సన్నుతి సేయకభక్తికల్గునే?
జగమున నెట్టివారికిని । శాంతము గల్గినగాక కల్గునే
సగుణము మీఱి మానసపు । సత్తువఁ జింత నొనర్పకున్న దా
నగణితమైన యోగి పద । మందెడు మార్గము రాదు వేమనా!

సగుణ బ్రహ్మారాధన సాధించిన త్వరలోనే నిర్గుణబ్రహ్మ నీలో నిలచును.

క. సగుణమె లోకము లన్నియు
సగుణంబె త్రిమూర్తులెంచ । సకల సురేశుల్
సగుణమె జ్ఞప్తికి మూలము
సగుణమె నిర్గుణపు దారి । సమకొను వేమా! 4759

సకలాండజాలము సగుణ స్వరూపమే జ్ఞానులకు.

తే. సచ్చిదానందమగు । జ్ఞప్తి సరవిఁ జేరి
మెచ్చి చిన్మాత్రమగు శక్తి । మేను మఱచి
నిశ్చలత నున్నవాఁడె పో । నిత్యయోగి
నిశ్చలాత్మని శివుఁడన । వచ్చు వేమ. 4760

సచ్చిదానంద జ్ఞప్తిఁ దెలిసినవాడే సర్వజ్ఞుఁడు.

ఆ. సజ్జనుల చెలిమియె । చాలింపఁగా రాదు
ప్రకృతి నెఱుఁగకున్న । భక్తిలేదు
విలువవెట్టి రీతి । భక్తి నిల్పుదురయా! ॥వి॥ 4761

భక్తిని ఆసక్తిచే చేపట్టాలిగాని కిమ్మత్తుతో రాదు.

ఆ. సతత మాత్మరూపు । సాధించి, శోధించి
యుతముగాను బుద్ధి । యూదినొక్కి
గతిని గోరి ముక్తి । గనుటయే లాభంబు ॥వి॥ 4762

సద్గతిని కోరి ముక్తిగనుట సాధుసమ్మతము గాదా!

తే. సత్పర బ్రహ్మ మయమూని । సౌఖ్యమెఱిఁగి
ప్రత్యగాత్మకు లోనైన । భావమంది
నిత్య నిరతి శయంబంది । నిజముఁగనుము
సత్యసంసిద్ధి ముక్తి మొ । సంగు వేమ. 4763

జీవాత్మ, పరమాత్మ, ప్రత్యగాత్మ, భావమును పరికించమన్నాడు.

క. సత్యం బగు విజ్ఞానము
నిత్యము బ్రహ్మత్మమనుచు । నిర్గుణుఁ డై తా
సత్యంబుగ మది నెన్నుచు
కృత్యంబు నడంగఁ ద్రొక్కుఁ । గృతియగు వేమా! 4764

సత్యమగు బ్రహ్మ విజ్ఞానము పొందుటకు అజ్ఞానము హరింపజేయాలి.

ఆ. సత్యమనఁగ వేఱె । జగమునఁ గనలేదు
నిత్యమగుచు నాత్మ । నెగడియుండు
నిత్యవస్తు వెఱుఁగ । నీవెబ్రహ్మము సుమ్మి ॥వి॥ 4765

నిత్యమైన వస్తువును గనుగొనిన నీవు బ్రహ్మవుగావా?

ఆ. సత్య మమరియుండ । జ్ఞాన మమరియుండు
జ్ఞాన మమరియుండ । సత్యముండు
జ్ఞాన సత్యములవి । సమమైన ద్విజుఁడగు ॥వి॥ 4766

సత్యజ్ఞానములు సర్వోత్కృష్టములు.

ఆ. సత్యము గలుగునెడ । జగతిలో వారికి
జ్ఞాన మమరగల్గు । మానుగాను
జ్ఞానమె కలుగునెడ । సమధిక ద్విజుఁడగు ॥వి॥ 4767

నిత్యనిష్ఠా గరిష్ఠుఁడగువాడు సాధించలేనిదేది?

క. సత్యమును హరిశ్చంద్రుఁడు
నిత్యముఁదా బొందియుండి । నిలిచెఁ దిరముగా
భృత్యుఁడవై నామదిలో
సత్యంబునె నిల్పఁజూడు । చయ్యన వేమా! 4768

సత్యనిష్ఠాత్ముఁడై నిరంతర మందరినోళ్ళ హరిశ్చంద్రుఁడు సత్యము
చేతనే పొగడబడుచున్నాడు (హరిశ్చంద్ర)

ఆ. సత్యము విడనాడి । సాహసంబులు సూపి
బంటు పంతమాడు । బత్తిలేక
కర్మజీవి తాను । గానంగలేఁడయా ! ॥వి॥

కర్మజీవి శర్మదము గైకొను టెట్లు?

ఆ. సత్యమైన యుక్తి । సమముగా మదినిల్పి
నిత్యమైన ముక్తి । నెలవెఱింగి
భక్తియుక్తిమీఱి । బయలంది పొందరా ! ॥వి॥

నిత్యమైన సత్యమును ఆసక్తి యుక్తులతో పట్టి ముక్తిని బొందుట కుదురుతుందని అవుగమ్మ.

ఆ. సత్యవంతులయెడ । సరసమాడఁగరాదు
పేదవారితోడఁ । బెనఁగరాదు
కలిమిగలుగు వారిఁ । గలియనే రాదురా! ॥వి॥

నీతిని ఆచరించే వారికి ఆనందమీగిన మహత్తర భావారామములో పలికిన కేకివలె కూతవెడతాడు వేమన.

మ. కో. సత్యవాక్యము గోప్యమిద్దని । శాశ్వతంబుగనెన్నుచు
న్నిత్యభోగము నిత్యసౌఖ్యము । నిత్యనిర్గుణ ఛాయలో
మత్తుఁడై పరిపూర్ణచిన్మయ । మర్మమూనుచు నెప్పుడుం
బొత్తుఁబాసి తలంపు జ్ఞప్తిని । బూను వేమననిత్యమున్

"మ. కో. మత్తకోకిల పంచమస్వర మాధురిన్వెలయించి తా
చిత్తవృత్తుల పొత్తుగూరిచి శీఘ్రమే నయమారగా
సత్తుచిత్తుల నాదుబిందుల సారమేర్పడ జెప్పెరా
యుత్తమంబగు భక్తియుక్తుడు యుర్వి వేమనయోగిరా!"

తే. సత్యసమమగు తేజంబు । సతరించి
నిత్యకర్మా ధ్యనుష్ఠాన । నిష్ఠనెఱిఁగి
కృత్యముల నెల్లగోయుట । కీర్తియగును
స్తుత్యమది యయి కల్పించు । సుగతివేమ.

వాటమైన తేటగీతిలో సూటిగల బోటునీటును వెలయించి పదముల యదుట విదితముగా వివరించాడు వేమనకవి.

తే. సత్య సంసిద్ధినగు బ్రహ్మ । నిత్యపదవి
ముత్యమనియెంచి మదిలోన । మూలమెఱిఁగి

నిత్య నైమిత్తికములలో । నేర్పుఁగనుము
భృత్యభావంబు బూననే । పొసఁగు వేమ. 4774

భృత్యభావము చేత నిత్యకృత్యము నెరవేర్చుము.

ఆ. సతికి బతికినైన । సంపదే సంపద
పుత్ర సంపదయును । భువిని ఘేలు
సరగ ముదిసి బ్రతుకు । సంపదే సంపద ॥వి॥ 4775

కాపోడ్కి కాడీ; కమ్మోడ్కి పాడీ. కులా సాకీబీడీ, పడుసోళ్ళకీ జోడీ, ముసల్మానుకీ దాడీ, ముఖ్కె ముకీ ముఖైము (కాళ్ళకూరినూక్తి)

అ. సతిని జూచిఁ జూచి । సౌఖ్యంబు తాఁగోరు
గతిని కానలేడు । కర్మజీవి
గతులు సతుల వలన । గానంగలేరురా! ॥వి॥ 4776

సద్గతులు సతులు వలన సమకూరు ననేమాట నీటిలోమూట.

కం. సతి పతులు పెనఁగు నప్పుడు
పతి శుక్లము సతికి గర్భ । పతనము కాఁగా
సుతుఁడగుచు జన్మమెత్తును
హితమతి నీజన్మ మెఱుఁగ । హేతువు వేమా! 4777

నీజన్మక్రమమును నిశ్చయమగు క్రమములో నీవు గుర్తించుము.

కం. సతియందె పుట్టెఁ బతియును
బతియందే పుట్టె సతియు । బరమార్థముగా
సతి పతు లనఁగా నెవ్వరో?
మతినదిఁ దెలియంగవలయు । మహిలో వేమా! 4778

మహా విజ్ఞానులు అతీతమార్గములో వీక్షించినచో యీమహత్తర విషయము స్పష్టమగును.

ఆ. సతియొనర్చు చెడుగు । పతి కవశ్యమువచ్చుఁ
బతియొనర్చు మంచి । సతికి సగము
బతియొనర్చు చెడుగు । సతికేలరాదొకో! ॥వి॥ 4779

భార్యాభర్తల పరస్పర కర్మల ఫలితములు ఏలరావు?

ఆ. సతిలేని పురుషుండు । సంసారియేగాఁడు
మతిలేని పురుషుండు । యతియుగాఁడు
గతిలేని పురుషుని । బ్రతుకేమి బ్రతుకురా ! ॥వి॥ 4780
మతి, గతి, సతి ; సంసారికి చక్కని భూషణములు.

ఆ. సతులఁ గవయుటెల్ల । సుతులఁ బడసెదమను
వెతల పడుటకేటి । వెఱ్ఱితనమొ?
నేలనున్నరాయి । నెత్తికెత్తినయట్లు ॥వి॥ 4781
లేనిపోనిబరువు నెత్తికెక్కించు కొననేల ?

ఆ. సతుల గుణముఁ జూచి । సాధుభైరవుడును
బెద్ద కడుపువాఁడుఁ । బెండ్లిమానె
బట్టుకాశెఁగట్టె । భువి నాంజనేయుండు ॥వి॥ 4782
కాలభైరవుడూ, వినాయకుఁడు, ఆంజనేయుడు కాంతల వంతలకు
జడిసి వడుగులయ్యారు. (అష్టాదశ పురాణము)

ఆ. సతులచేతఁ బుణ్య । సౌఖ్యము కలదని
నరుఁడు కర్మములను । నమ్మియుండు
దానికానిబుద్ధి । హానికి మూలమా ॥వి॥ 4783
సతులు చక్కగా లేకున్న పతుల మతులు కతకతలాడును.

ఆ. సతులఁజూచి నరుఁడు । సౌఖ్యంబు గోరును
గతులగానలేఁడు । కర్మమందు
గతులు సతులవలన । గానంగలేరయా ! ॥వి॥ 4784
సద్గతులకు సతిమూలము.

ఆ. సతులఁజూడఁ జూడ । సంసారి కాఁగోరు
సుతులు పుట్టఁ బుట్ట । వెతలఁబడును
గతులు చెడఁగఁ జెడఁగఁ । గర్మమంచేడ్చును ॥వి॥ 4785
సతీసుతులు లేక గతిలేదని ఏడ్చి; కలిగినదరువాత కర్మముమీదపడి యేడ్చును.

ఆ. సతులఁ బడయరాదు । సుతులఁ బడయరాదు
వెతలఁబడిన వాఁడు । వెఱ్ఱివాఁడు
నేలనున్నరాయి । నెత్తికెత్తిన యట్లు ॥వి॥ 4786
సతీసుతులు నిన్ను తరింపజేయలేరు.

ఆ. సతుల మాయనమ్మి । సౌఖ్యంబు గలదని
మతివిహీనులైరి । మనుజులెల్ల
గతులు సతులవలన । గానంగలేరయా ! ॥వి॥ 4787
స్త్రీలవలన చిత్తచాంచల్యమే గాని శ్రేష్ఠత సిద్ధించదు.

ఆ. సతులు జప తపములు । సల్పంగ సాగిన
బురుషులేల నీకను । బుడమిలోన
బాపమెంచవద్దు । పట్టి శిక్షింపుడీ
పుణ్యపురుషులెల్ల । భువిని వేమ. 4788
వేమన దృష్టిలో స్త్రీలు వికలులగా అగుపించారేమో !

ఆ. సతులు సుతులు మాయ । సంసారములు మాయ
ధనము, ఘనము మాయ । తలఁపు మాయ
మాయ బ్రతుకునకనె । మమతగల్పించెరా ! ॥వి॥ 4789
మాయామేయ జగము మత్తును గల్పించును.

ఆ. సదసునందు వేశ్య । సైగలు కనుపింప
ముదితమీఁద నాశ । ముడివడంగ
మదిని భ్రమయ కెపుడు । మాఱ్కొని చూడరా ! ॥వి॥ 4790
వేదజడులలోగూడా వేశ్యలను వీక్షించి వెతలబడు అలవాటుంది.

క. సద్గురు కృపచే నెప్పుడు
సద్గతి దీపింపుచుండు । చాలా చదువుల్
సద్గతిని గలుగఁ జేయునె ?
సద్గురువే దైవమనుచు । చాటుము వేమా ! 4791
సద్గురువు దొరకుట జన్మసాఫల్యముగాదా ?

తే. సద్గురు కటాక్షమొందిన । సత్తముండు
ధ్యానపరమున జ్ఞప్తిని । దగులనించి
నిర్గుణంబును ముట్టను । నియతి మీఱి
"సోహ" మను భావమాత్మను । జూచి వేమ. 4792
" మను ఆత్మలో జేర్చాలన్న సుజ్ఞానగురు వవసరము.

తే. సద్గురువు నెల్లకాలంబు । సమతతోడ
గొల్చువానికి మోక్షంబు । కుదురుపడును
ద్వంద్వమోహంబు తొలగించు । దర్పణమును
చూపువాఁడీ జగంబున । శుభుఁడు వేమ! 4793

ద్వంద్వాభిమానమును విడిపించినవాడే వివేకియగు గురువు.

తే. సమకొనంగను సంయోగ । సరణి నెఱిఁగి
పోరుచుండిన ధ్యానంబు । పూర్తియగును
తెలియ నఱచేతిఁదా ముక్తి । తేటపడును
అనుభవమునకురాఁ । బర మదియె వేమ. 4794

జీవేశ్వర సంయోగమే ముక్తి.

ఆ. సమత గురుని దృష్టి । సముముగా మదినిల్పి
బయల రుచుల మాన । భద్రపఱచి
పరగఁ జూడ బట్ట । బయలగు బ్రహ్మంబు ॥వి॥ 4795

బాహ్య విషయాలను విడచి అంతరదృష్టి గలవాడే ఇంద్రియాతీతుఁడు

క. సమబుద్ధి గుఱుతు మీఱిన
యమనస్క మహావిభూతి । యందును దోడన్
విమలంబగుఁ బ్రజ్ఞానము
క్రమమగు నచలాంశ మదియె । కనుమిక వేమా! 4796

సమబుద్ధి సాధించిన అమనస్కము అందుతుంది

క. సమయంబు మంచిదయ్యెను
క్షమియించితి రయ్య నాకు । సాధ్యంబాయెం
దమఫలమటంచుఁ జెప్పితిఁ
గ్రమముగఁ గథయెల్ల ముప్పుఁ । గడచెను వేమా! 4797

గురువగు అభిరామయ్యను ప్రార్థించు విధానము చెప్పెను (స్వీయచరిత్ర)

ఆ. సముదయంబు నందు । సర్వమొక్కటి యైన
వైర మొదవదేమి? । వారలేమి?
ఎచ్చు తగ్గులందు । నేర్పడనే హాని ॥వి॥ 4798

సమత్వము వహించినవాడే జ్ఞాని.

తే. సరకుఁగొనఁగూడ దెఱుకను । సత్యముగను
బరమపరిపూర్ణమా జ్ఞప్తిఁ । బట్టుఁ బట్టి
నిరత మభ్యాసశీలుఁడై । నిండవలెను
జరమ మందొప్పఁదత్సౌఖ్య । సరణి వేమా! 4799

అభ్యాసము చేత ఆత్మజ్ఞానమును అందుకోమన్నాడు.

క. సరగున సిద్ధాసనుఁడై
చిరమిలఁ జరణములు నిలిపి । శృంగాటక మం
దరయుచు గళబిందువుగను
వెరవున నాముక్తికాంత । వేడర! వేమా! 4800

సిద్ధాసనము వేసి ఏకాగ్ర ఏదృష్టితో శృంగాటకమును జూచుట ముక్తి.

ఆ. సర విచారబుద్ధి । జరిగిన యంతనే
హరియుఁ బృథివిచేత । నలసుఁడగును
గాని వానిమాయఁ । గడుమోదమునఁ గని
పూనిబ్రహ్మమందు । బొందు వేమా! 4801

మంచివిచారమువలన హరిభూతత్వములో జేరును.

ఆ. సరవి జారబుద్ధి । జరిగిన యంతనే
హరియుఁ పృథివిచేత । నలసుఁడగును
కాని దానిమాయ । కనుద్రోయగ నెఱింగి
పూనిబ్రహ్మమందు । పొందు వేమ. 4802

భూతత్వములో పురుషత్త్వమును పొందించి మూచిన మాయ పోవును.

ఆ. సరవితోడఁ గూడు । స్వాధిష్ఠ చక్రంబు
ప్రాణ పవనములను । బందుచేసి
వెడలకుండువాఁడు । వేదాంతవేత్తమా ॥వి॥ 4803

స్వాధిష్ఠాన చక్రములో ప్రాణవాయువును బంధించిన పరమజ్ఞాని కాగలఁడు.

తే. సరవిఁ బంచాక్షరీ జ్ఞాన । పరుఁడటు పర
మాత్మనెఱుఁగును నెఱిగిన । నవనియందుఁ

బ్రజ్వరిల్లును వాఁడెపో । పరమునందుఁ
దానె పరమాత్ముఁడగునట్లు । ధరను వేమా ! 4804

పంచాక్షరీ పఠనజ్ఞానము గలవాడు పరముడుగాడా !

క. సరసిజభవు వధియించియు
హరియందును గలిసి హరిని । హతముగఁ జేసెం
బురహరుని గలిపి తానే
హరుఁడై యానందవిధము । నందుర వేమా ! 4805

త్రిగుణములను రహితము జేసిన మోక్షసామ్రాజ్యము మంజేతిమకురమే ?

తే. సర్వ కులధర్మ మర్మముల్ । సంతరించి
సకల యోగంబులను గాంచి । సన్మతముగ
బట్టబయలందుఁ జేరుటే । బ్రహ్మవిద్య
గుట్టిది యటంచు దెల్పురా । గురుడు వేమ. 4806

సర్వధర్మములు సమత్వముతో సాధించే క్రమము సద్గురువే యుప
దేశించ గలడు.

ఆ. సర్వజ్ఞ సింగన్న । సంతరించిన ధనము
పరగ భూమిపాలు । పరులపాలు
సరగ పెద వేమన్న । సంతరించిన ధనము
సుర భూసురులపాలు । చూడు వేమా ! 4807

సర్వజ్ఞ సింగభూపాలుఁడు సంపాదన సానులపాలు; పెదకోమటి
వేమారెడ్డి ధనము బ్రాహ్మణుల పాలు.

తే. సర్వదాను పరబ్రహ్మ । శాశ్వతముగ
వెలుఁగుచున్నది గనుమిదే । విశ్వమంత
అసదృశా సోక్తమైనట్టి । దవగతంబు
బట్టబయటనె వెలుగొందు । బరగ వేమా ! 4808

అసదృశమైన పరబ్రహ్మ అంతటా వెలుఁగుచున్నది.

తే. సర్వ పరిపూర్ణమా బ్రహ్మ । సత్యమనెడి
యుక్తిలోనెంచి యూహలో । ముక్తిఁగాంచి

యున్నయాతఁడె ముక్తుఁడీ । యుర్విలోన
గష్టసుఖముల నెంచఁడు । గనఁడు వేమ. 4809

పూర్ణమును పుచ్చుకొన్నవాడు కష్టసుఖాలను కాళ్ళను రాయును.

తే. సర్వ మచలంబుగా నెంచి । సత్యముగను
నిర్వహించినవాఁడె పో । నిర్మలుండు
పర్వలిడకయె పూర్తియై । పరగుచుండు
నిర్వికారుఁడతండగు । నుర్వి వేమ. 4810

సర్వమూ అచలముగా జూచి సత్యమార్గముగా నడచినవాడే సాధువు.

తే. సర్వమతముల యందును । సన్యసించి
నిర్వికారతలో మించి । నియతిఁ గాంచి
యున్నయాతఁడు పరిపూర్ణుఁ । డుత్తముండు
శివునిగా నాతనిం జెప్పఁ । జెల్లు వేమ. 4811

సర్వమత సామరస్యము తెలిసినవాడే శంకర సమానుఁడు.

క. సర్వము తానని తెలిసిన
నిర్వాణికిఁగాక ముక్తి । నిలువఁగ వశమా!
యుర్వెల్ల దాను దిరిగినఁ
బర్వత, బిల, జలధులందుఁ । బడినను వేమా! 4812

తాను సర్వమని తెలిసినచో తత్వమే కుదురుతుంది.

ఆ. సర్వమొకటె చూడు । సమకూడును ధ్రువంబు
రెప్ప వేయఁబోకు । రేయుఁబవలు
పగలులోని పగలు । పరమాత్మ చూడరా! ॥వి॥ 4813

చూపునిల్పి ఆపోజ్యోతిని అవలోకించుము.

తే. సర్వవాక్యార్థ భావంబు । సరణి మరిగి
నిర్వహించిన గుణచర్య । నిజమెఱింగి
పర్వలిడకయ నుండుటే । ప్రముదితంబు
శర్వకృపఁగోరువారికి । జగతి వేమ. 4814

ఈశ్వర కృపగోరువారికి యీప్సితములు కలుగును.

ఱదీప్తి త్రిగుణ వి । శ్రాంతమెదియొ
అంతరంబున హంసిస్సై । అలరునదియె
దివ్య పరిపూర్ణనిర్గుణ । దేవుఁడగుచు
బరగుచుండును గన బట్ట । బయలవేమ. 4815

బట్టబయలున ప్రకాసించు హంపను పరికించనువ్వాడు.

తే. సర్వ సమమగు బుద్ధిలో । సత్యమెఱిఁగి
లోన నిజరూప మానస । ధ్యాన మమర
చింతచేయుచు నుండుటే । చిన్మయంబు
వాదులాడెడి చదువేల । వలదు వేమ. 4816

తర్క-వితర్క-ములతో తన్నుక చావుటకంటే సమత్వములోనుండుటమేలు.

తే. సహచరంబగు నెఱుకను । సరకు గొనక
యిహపరంబులు గానట్టి । దెఱిఁగి మరిఁగి
నిబిడమగు బట్టబయలున । నిలుచుటొప్ప
నాత్మరూపంబు కాన్పింప । నగుర వేమ. 4817

ఆత్మరూపమును జూచుటకు బట్టబయలు పరికించాలి.

ఆ. సహజ గుణము విడదు । జారిణికెప్పుడు
సుతుల పతిని బాసి । సూటిదప్పి
గృహము వెడలి యంతఁ । దహతహ పడునయా ॥వి॥ 4818

జారిణి తనస్వభావాన్ని మార్చుకొనుట కష్టము.

తే. సహజ చిన్మయ బ్రహ్మంబు । సముకొనంగ
సూర్యచంద్రుల గతిలోన । సూక్ష్మమెఱిఁగి
పూర్ణకుంభక నాసాగ్ర । పురముఁజేరు
మపుడె మహనీయ మూర్తివీ । వగుదు వేమ. 4819

చిన్మయబ్రహ్మమును చేపట్టుటకు సూర్య, చంద్ర నాడుల సూక్ష్మము తెలియాలి

ఆ. సవతితల్లిఁ జూడ । సాకులు నెరపును
స్వంతతల్లి వలెను । సైపదెపుడు
వింతలడచి లోని । విజ్ఞానమందరా ॥వి॥ 4820

తల్లిలాంటి తత్వాన్ని తెలిసి సాధించుకో.

ఆ. స్పర్శగాలి కలిసి । సద్రూప కర్మంబు
తెలియఁ జేయునపుడు । దేహమునకు
దేహవాంఛచేతఁ । దెగి తేరలేఁడయా ! ॥వి॥ 4821

దేహవాంఛలున్న వారు దివ్యమార్గాన్ని చేపట్టలేరు.

ఆ. స్వప్నమనఁగ మేని । స్వాతంత్ర్యమునుగాదు
స్వప్నమనఁగ । జీవసంకటంబు
అల్పనరుఁడు తెలియు । టవనిలో నరుదయా ! ॥వి॥ 4822

స్వప్నభ్రాంతులు మూర్ఖులు గుర్తించలేరు.

క. స్వప్నము మేల్కని చూడఁగ
స్వప్నములోఁగన్న ఫలము । సమయుచు నుండున్
స్వప్నముఁ దలఁపని క్రియ
నిస్స్వప్నని గతి నిలుపు మదిని । సరసత వేమా ! 4823

నిస్స్వప్నని జూచుటకు నియతిగా నుండవలయును.

తే. స్వ స్వరూపంబు తాఁదానె । సంగ్రహించి
దుస్స్వభావంబు పూర్తిగా । దుగ్గడించి
విశ్వరూపంబు మదినెంచు । విధముఁ గనము
శాశ్వతానంద మొప్పెడి । జగతి వేమ. 4824

తనయొక్క రూపము తానే తెలిసికొనిన తత్త్వము కుదురదా !

తే. స్వ స్వరూపమున నెఱుక । హ్రస్వమగును
బిందునాద కళాతీత । భిన్నపరమ
తన్మయ శరీరమందుఁటే । తత్త్వమగును
గురుకటాక్షము లభియింపఁ । గుదురు వేమ. 4825

గురుకటాక్షమున్న గురుతర విషయాలు కూలంకషంగా తెలియును.

క. సాకార నిరాకారము
లోకోత్తరమగుచు మదిని । లోబయలై యా
యేకాక్షర పరమార్థము
నీకడనే నిలిచియుండు । నిజముగ వేమా ! 4826

"ఓం" కారము తాలూకు యుత్కృష్టము గుర్తించిన పరమార్థము నీదాపులోనే యుండును.

తే. సాంఖ్య తారక ముద్రలు । సంతసమున
గురుముఖంబున నెఱిఁగియు । గుట్టు విడక
నిరత మాత్మావలోకన । నెరపుయోగి
పరమపద మఱచేతను । బట్టువేమ. 4827

ఆత్మావలోకన చేసినవాడు ఆద్యంత రహితుని అవలోకించును.

తే. సాక్షిఁబల్కరాక । సభ మెచ్చురట్లుగా
అసమముగను కొంగు । కొసరు లేక
బ్రహ్మ సభలలోన । బలికిన యదిసాక్షి
కడమసాక్షి సాక్షిఁ । గాదు వేమ. 4828

బ్రహ్మ సభలలో పల్కిన సాక్ష్యమే సరియైనది.

ఆ. సాగిపారువారు । సకలకార్యంబులు
వాగ్వ్యయములచేత । వరలుచుంద్రు
సాగిపారని తఱి । సమకూడ దొక్కటి
ధనముయెంతయున్న । ధరను వేమ. 4829

అభివృద్ధి మార్గములు గోరువారు అభ్యుదయమునకు వత్తురు.

ఆ. సాటిగాని బయలు । సాధించి మించినఁ
బ్రకటితముగ నాత్మ । ప్రజ్వరిల్లు
నిక్కమమరఁ జూడు । నేర్పున విలసిల్ల ॥వి॥ 4830

నేర్పు. కూర్పు, చేర్పులుంటే నీలోనే బ్రహ్మముంది.

ఆ. సాటి చెప్పనగునె । సాధు సజ్జనునకు
గొప్పచదువు చదివి । యొప్పననుచు
వాదులాడు నతని । వదరుటేలరా! ॥వి॥ 4831

వాదులాడే చదువు ఖేదమునకే.

ఆ. సాటిచేయవచ్చుఁ । జదివి వాదములాడు
చదువరులను జెట్టి । సముదయమును
పోరి పోరిగెల్చు । నోరు నోవనివాఁడు ॥వి॥ 4832

వాదులాడినవాడు నోటితీట తీర్చుకొనువాడే.

ఆ. సాటి యెవరులేరు । సాంబమూర్తికిఁ బోల్ప
దీటిలేని గొప్ప । దేవుఁడతఁడె
ధాటి కలుగు నతని । ధ్యానించువానికి ॥వి॥ 4833

సాంబమూర్తి సాటియైన దైవము లేదని వేమనవాక్కు

ఆ. సాటివారు నిన్ను । సాధింపఁగా లేరు
ధర్మమెపుడు నీవు । తప్పకున్న
భారతంబులోని । పరమార్థమిదె కదా ! ॥వి॥ 4834

"ధర్మమేవ జయతే" అని (భారత వాక్యము).

తే. సాత్వికాంశములోనెంచి । సత్యముగను
రాజసంబున మదిమించి । రంగుగాను
తామసంబున నడఁచుచే । తత్త్వదంబు
గుణము లిట్టుల గుదిరిన । గురుఁడె వేమ. 4835

గుణాలు కుదిరినవాడే గురుఁడు.

ఆ. సాత్వికులయినట్టి । సజ్జనులగువారు
పేదరీతిగాను । బృథివి లోనఁ
బుణ్య ఫలముచేతఁ । బూజలందుచునుండ
ధన్యులైరివారు । ధరణి వేమ. 4836

సాత్వికులు పరమును సాధించి పేదలవలె అగుపింతురు.

తే. సాధన చతుష్టయంబుల । సామ్యమెఱిఁగి
వింతలన్నియు మదిలోన । విడిచినపుడె
మంతనంబగు గురుభక్తి । మహిమయగును
సుంతయైనను బెడదారిఁ । జొరదు వేమ. 4837

సాధన చతుష్టయములఁ దెలిసిన జ్ఞానము కుదురును.

తే. సాధనను జిక్కితక్కడు । సత్యపరముఁ
జేర గమకించి యుక్తిలోఁ । జిన్మయంబు
దారిఁ గనుఁగొనువాఁడె పో । ధన్యుఁడరయ
గౌరవించెద రెల్లలో । కముల వేమ. 4838

చిన్మయ బ్రహ్మమును పట్టు గుట్టు నెరిగినవానిని నెట్టుకొని ఆశిస్తారు.

ఆ. సాధనంబులేక । సమకూడ దేదియు
బోధలేని విద్య । పొందదెపుడు
పాదుకొల్పి మదిని । భావించి చూడరా ! ॥వి॥ 4839

గురూపదేశము లేని విద్య గ్రుడ్డివిద్య గాదా!

ఆ. సాధు చరితమైన । సతి సత్ప్రవర్తన
జార యేమెఱుంగు । సాధుజనుని
బ్రహ్మనిష్ఠ మెఱుఁగు । ప్రాకృతుఁడెఱుఁగునా ? ॥వి॥ 4840

బ్రహ్మనిష్ఠ ప్రాకృతునకు, పాతివ్రత్యము జారకు తెలియవు.

ఆ. సాధుజనుల చెలిమి । చాలింపఁగా రాదు
ప్రకృతి విడక యున్నఁ । బరములేదు
పిందెఁగోసిచూడ । బీజంబు గలుగునా ! ॥వి॥ 4841

వేమన కవితా సవిత్రి వేయివిధముల విజ్ఞానప్రజ్ఞా శేముషీ పరిపక్వము వెల్లివిరుస్తుందిందు.

ఆ. సాధుజనులఁ బట్టి । సంతాప మొందింప
కుల వినాశమందు । క్రూరజనుఁడు
సాధుజనుల పూజ । సాయుజ్య పదవిరా ! ॥వి॥ 4842

సాధుల పూజిఁచుట సాయుజ్యమార్గము.

ఆ. సాధుజనుల మీఁద । సంతోష పడువాఁడు
నొరుల మేలు చూచి । యోర్చువాఁడు
నింట నున్న నేమి । నెచట నున్న నేమి ? ॥వి॥ 4843

సాధుల పూజించువాడు చచ్చినా బ్రతికినా సదానందుడే !

ఆ. సాధు సజ్జనులను । సంతరించినవాఁడు
ప్రజల సంతసంబు । పఱచువాఁడు
కదసి శాత్రవులను । గరుణఁ జూచినవాఁడు
పాదుకొన్న ముక్తి । పరుడు వేమ. 4844

శాత్రవులను మిత్రభావంతో జూచినవాడే పవిత్రుఁడు.

ఆ. సాధు సజ్జనులను । చక్కఁగా పూజించి
కరుణ పొందిన యపుడె । సరసుఁడౌను
సరసత విడకుండ । సద్గురుని కలియరా! ॥వి॥ 4845

సాధుసజ్జనుల బోధలు సర్వోత్కృష్టములు.

ఆ. సాధుసాంగత్య మమరిన । శాంత మమరు
శాంత మమరినఁ జిత్తంబు । శక్యపడును
శక్యపడిన మనంబె యొ । సంగుఁ బరము
పరముఁగాంచిన శివుఁడనఁ । బరగు వేమ. 4846

శాంతము వలన సర్వమూ సమకూడునని ముక్తసరిగా ముక్త పద ప్రస్తములో చెప్పెను.

ఆ. సాముఁ జేసి జెట్టి । సాహసియైయుండు
సాముఁ జేయకున్న । సరణిఁగనడు
సాముఁ జేయువాఁడు । చావక యుండునా! ॥వి॥ 4847

సామువలన శరీరారోగ్యము తప్ప తక్కిన దేదియూ రాదు.

క. సారంబగు విజ్ఞాన వి
చారంబగు హంసఁ గూడి । చతురత మీఱం
గోరిక లెంచని బయలునఁ
జేరుట కైవల్యపదవిఁ । జెందుట వేమా! 4848

విజ్ఞాన సారాంశాన్ని చతురతతో విలోకించిన హంసను అందుకొంటాడు.

క. సారముగల యాత్మ వి
చారము గుర్తించి మదిని । జపలము విడినన్
మీఱును జ్ఞాన వివేచన
మాఱుండని ముక్తిఁ జూపు । మహిలో వేమా! 4849

విజ్ఞాన విలసితమైన విలోకనముచేత సంసార విముక్తినంది ముక్తినిపొందును.

ఆ. సారముగల యుక్తి । సమముగా మది నిల్పి
నిత్యమైన ముక్తి । నెలవెఱింగి
భక్తియుక్తి మీఱి । బయలంది పొందరా! ॥వి॥ 4850

చక్కని ముక్తిని పొందుట ముముక్షుమార్గము గాదా!

ఆ. సారవిద్యలందు । సరణిఁ దెలియలేక
దూరమందు జేరు । దుర్జనుండు
పరముఁ దెలియ నతఁడు । భావజ్ఞుఁ డెట్లగు ॥వి॥ 4851

పరము తెలియని ప్రజ్ఞ యేమున్ననూ పరమార్థము పట్టుబడుట దుష్కరము.

ఆ. సారాయి త్రాగుట । సభకు యోగ్యత కాదు
కల్లుత్రాగుట మొదలు । కానెకాదు
*వీటి రెంటికైన । వుచ్చ త్రాగుట మేలు ॥వి॥ 4852

* యతిలేదు ; సారా, కల్లు త్రాగుటలు తృణీకార భావము సూచించేదు !

ఆ. సారాయి మాంసంబు । శంభుండు తినగను
*జనులకెల్లను మనసు । పుట్టె తండ్రి
మనసుపుట్టిన వెనుక । మురిపెంబు గలిగెను ॥వి॥ 4853

* యతులు పోయెను ; తండ్రి నడుచుకొనిన మార్గములో తన యులూ నడచుకొంటారు.

ఆ. సాలె జాండ్ర మాల । జాతులవారలు
నేఁతగాండ్ర మనుచు । నేలమీఁద
చెప్పుదు రిలఁ గాని । గొప్ప వహించిరా? ॥వి॥ 4854

నాటి కాలపు చేతిపనులు జెప్పెను.

క. సాహసమునఁ జతురక్షరి
నూహను దమినెంచి మించి । యొప్పుగఁ గనినన్
మోహామడంగును భక్తిని
దేహములో దేహిఁగనును । తెంపుగ వేమా ! 4855

దేహములోనున్న దేహిని గనుటే దివ్యత్వమునకు మార్గము.

ఆ. సాహసముననైన । సత్యముచేనైన
మోహబుద్ధి విడిచి । ముక్తినెఱిఁగి
చేర్చిమదిని గురునిఁ । జెలరేఁగియుండరా ! ॥వి॥ 4856

ఏవిధంగానైనా మోహము విడచి మోక్షగురువు నాశ్రయింపుము.

క. స్థావరముల భక్షింతురు
భావింపక జంగమములు । బహువిధ రుచులన్
ఆవల సకల ప్రాణులు
తీవరమునఁ దమ్ముఁదామె । తిందురు వేమా! 4857
తినమరగినవారికి అన్నియూ తినుట కూహ జనించును.

ఆ. స్నానమింపుగఁ జేసి । సంధ్యవార్చితె నేమి
* గాయత్రిమంత్రంబు । గొణిగితేమి
"సోహ"గాయత్రిని । శోధించిచూడరా! ॥వి॥ 4858
* యతి పోయెను; చిత్తశుద్ధిలేక యేపనిచేసినా రిత్తలే!

ఆ. స్నానమొనరఁజేసి । సద్ధర్మమీయక
నీళ్ళమునుఁగనగునె? । నేర్పులేక
నీళ్ళయందుగోడి । నెలవుగా మునుఁగదా? ॥వి॥ 4859
నీతి నియమములు లేక నీటిలో మునిగిన యేమి వచ్చును?

ఆ. స్నాన సంధ్య జపము । లైననె భుజియించు
నిష్ఠలెన్నియైన । నెరపుఁగాని
ఒకనికీయఁడేమి । సుకృతంబుకల్గునో! ॥వి॥ 4860
స్వలాభాపేక్షులు యితరుల సహకారమునకు వచ్చినా యొప్పరు.

ఆ. స్మార్తకర్మములను । శ్రౌతకర్మంబులు
ప్రేతకర్మములను । బ్రీతితోనె
చేయువారిచేతఁ । జేయించు విప్రుండు ॥వి॥ 4861
శ్రౌత స్మార్త కర్మలు వచ్చిననూ విడువవు.

తే. స్వాత్మ తన్మయ మననంబు । సంగ్రహించి
నిర్గుణ బ్రహ్మపదవికి । నెఱియ బుద్ధి
నొక్కి నిర్భయమందుచే । నుడువ టంద్రు
వేదవేదాంతసారార్థ । విదులు వేమ. 4862
ఆత్మను తన్మయము చేయుచే వేదాంతుల విలక్షణం.

ఆ. స్వాతిమెఱుపుఁ జూచి । సంతోషపడుదురు
స్వాతిమెఱుపులేమి । సఫలమన్న
మెఱుపు నుఱుములేక । మేఘంబుగురియునా ! ॥వి॥ 4863
మూఢనమ్మకములకు పోయి ముప్పులు పొందొద్దన్నాడు.

తే. స్వానుభవమూని మదిలోన । సారమూని
తాను దానగుచుండును । దత్త్వవేత్త
మేనుమఱచిన నిద్రలో । మెలఁగునట్టి
మానిలాగున నదెకదా । మహిమ వేమ. 4864
స్వానుభవము తెలిసినవాడే సర్వజ్ఞుఁడు.

ఆ. స్వానుభూతియందు । శాస్త్రవాసన లందు
సంశయంబులేని । సాధనమున
చెలఁగ దీపమట్టి । చిత్స్వరూపమునంటు ॥వి॥ 4865
"అనుభూతిం వినామూఢో వృథాశాస్త్రాణిమోదతే
ఫలబింబితశాఖాగ్రా ఫలాశ్యాదన మోదవత్"
శాస్త్రవాసనగలవారి పలుకులే చక్కనివి.

ఆ. స్వానుభూతిలేక । శాస్త్రవాసనలచే
సంశయంబు విడదు । సాధకునకు
చిత్రదీపమునను । చీకటిపోనట్లు ॥వి॥ 4866
స్వానుభూతి లేనిదే సంశయము సమయదు.

ఆ. సిగ్గటంచనఁబడు । సిగ్గదెచ్చోనుండు
నాకలెచటనుండు । నరయగాను
దాగియున్నయిన్ని । దాగినచోనుండు ॥వి॥ 4867
ఎచ్చట యున్నవి అచ్చటనే యుండును.

ఆ. సిగ్గు గలదటంద్రు । సృష్టి లోపలివారు
వెఱ్ఱివేమనఁ గని । వెఱగుపడిరి
తనకు గల్గుసిగ్గు । దైవమే యెఱుఁగురా ! ॥వి॥ 4868
సిగ్గును పల్కుటయే గాని భావంలోనుంచి పాటించిన వారులేరు.

ఆ. సిగ్గు దాగునెడల । జీకటి యెటదాగు
నాకలేడదాగు । నాత్మలోన
దాగియున్న నిద్ర । దాగుటఁ దెలియుఁడీ ॥వి॥ 4869
నిద్రాహారాలు దాగియున్న తావులు తెలిసికొనుటే తత్వజ్ఞుల లక్షణం.

ఆ. సిగ్గు విడువకున్న । శివసౌఖ్యమే లేదు
తగ్గి మొగ్గకున్న । సిగ్గువిడదు
సిగ్గు విడుచువాఁడె । చిరకాల జీవిరా! ॥వి॥ 4870
సిగ్గుతోనే విడచినవాడే శివయోగి.

ఆ. సిగ్గు విడిచిన యపుడె । శివరూపు తానామె
సిగ్గు విడువకపోతె । శివునియెట్లు?
కనుగొన లేరయా । ఘనులు యెంతటివారు ॥వి॥ 4871
బాహ్యవాసనల నంటనివాడే పరబ్రహ్మస్వరూపుఁడు.

ఆ. సిద్ధమైన మాయఁ । జిక్కియున్నంతకు
తుర్యమగు పదంబు । దొరకఁబోదు
సిద్ధమైన తత్వ । సిద్ధి గావలె సుమీ! ॥వి॥ 4872
తత్వము సిద్ధించుకొనుటకు మాయను రద్దుచేయుము.

ఆ. సిద్ధులెల్లఁగూడి । చిన్మయ మొనరించి
శుద్ధిచేసి రొక్క । సున్నమునను
శుద్ధికిఁ బ్రథమంబు । సున్నయే కాదయా? ॥వి॥ 4873
సున్న లేనిదే ఏదియూ లేదు. సున్నా అన్నిటికి మార్గము.

ఆ. సిద్ధులైనవారి । చిత్తమే రంజిల్లు
నొడలి మెఱుఁగులెక్క । కిడదుగాన
పనసపండు ఘనత । పైనేమి కలదురా? ॥వి॥ 4874
సిద్ధుల బుద్ధుల గనుటేగాని పయిపూతలు పరికించరాదు.

క. స్థిరతర బుద్ధిని జూచిన
పరిపూర్ణ సుఖంబుగల్గి । ఫలమొందు సుమీ!

పరుఁడని నీవని మదిలో
గురిమించిన గోప్యమదియె । గొనబగు వేమా! 4875

జీవజీవేశ్వరుల తారతమ్యముల హత్తించుటే పరమగోప్యము.

ఆ. స్థిరములేని క్షుద్ర । పరకూటములు చేసి
హెచ్చు తగ్గునొంది । హీనమతులు
ఖరము పిల్లగుచు । గ్రక్కునఁ జెడుదురు! ॥వి॥ 4876

ఖరము = గాడిద; కులతత్వవాదులు ఖరసమానులు.

ఆ. స్త్రీల వ్రతముచేత । శిష్యుల శిష్యులై
తపసి కర్మములను దారవోసి
విశ్వకర్మ కులము । వీటఁబుచ్చిరిగదా! ॥వి॥ 4877

పావనవంశములో పతితులు పుట్టుటవలన వంశము పాడగును.

క. స్త్రీజనని యనం జనునటు
స్త్రీజన్మముచూడ భువిని । శివునకు ముందై
స్త్రీ జనిశక్తి యనందగు
తేజములోఁ ద్రిగుణకర్త । తెరువగు వేమా! 4878

త్రిమూర్తులకు స్త్రీ జన్మించెను

క. స్త్రీనెత్తిని రుద్రునకగు
స్త్రీనోటను బ్రహ్మకెపుడు । సిరి గుల్కంగా
స్త్రీ నిలిపెను హరి రొమ్మున
స్త్రీనెడపెడి గురుఁడ వీవె । దేవర వేమా! 4879

త్రిమూర్తులఁ త్రిదేవులను దీక్షతో ఒక్కొక్క స్థానములో ఉంచారు.

ఆ. స్త్రీల చనులు పూల । చెండ్లుగాఁ బోల్చెను
పాలు మాలునట్టి । పనసకొడుకు
చన్నులెట్లు పూల । సాటి కావచ్చురా! ॥వి॥ 4880

స్త్రీలను వర్ణించు బేలకవులను పనస కొడుకు లని భాషించాడు.

ఆ. స్త్రీలఁ జంపువాని । శివుఁడు సైరింపఁడు
స్త్రీలఁ జంపువాఁడు । శిథిలమగును

స్త్రీలఁ జంపువాఁడు । శివ శివా నరకంబుఁ
జెందునయ్య యేమి । చెప్ప వేమ. 4881

స్త్రీహత్య మహాపాతకము.

ఆ. స్త్రీలజాతియె వేఱె । గోజాతి యొక్కటే
కుక్కవర్ణము వేఱె । కుక్కవొకటె
గోవువర్ణము వేఱె । గోజాతి యొక్కటే ॥వి॥ 4482

జాతి భేదములేగాని నీతిభేదములేదు.

ఆ. స్త్రీలఁజూచి నరుఁడు । చిత్తంబు నిలుకడ
చేయలేక తాను । చెడునుగాదె ?
ఏటికట్ట ప్రమాన । డెందాక నిలుచురా ! ॥వి॥ 4483

కట్ట = గట్టు ; స్త్రీలనుజూచి సిగ్గులేనివారికి ఎగ్గులే !

ఆ. స్త్రీలమనుచు నరులు । సిగ్గింతయును లేక
పరులసొమ్ములెల్లఁ । బరిహరించి
వేషభాషల గడు । మోసంబుచేయుచు
గ్రాస పోషణముల । గంద్రు వేమ. 4884

వేషభాషలతో గ్రాసము జేసుకొనేవారు మోసకారులు.

ఆ. స్త్రీల మాయచేతఁ । జిక్కి తాఁ గొన్నాళ్ళు
తెగులు గోరునట్లు । తగిలిపోవుఁ
దనిసిపోనిసి తుదను । దైవంబుచేఁ జెడు ॥వి॥ 4885

స్త్రీలోలులకు చెడుట తప్పదు.

ఆ. స్త్రీల మాయచేత । చిక్కక కొన్నాళ్ళు
గతులుఁబడియు మమత । గలుగుఁగాని
తగులు విడుచువాఁడె । తా నాదిమూలంబు ॥వి॥ 4886

కాంతల వంతలు తెలిసికొని కాళ్ళదన్నినవాడే ఘనుఁడు.

ఆ. స్త్రీల ముఖముఁజూచి । చిత్తంబు దృఢముగా
జేయని మనుజుండు । చెడు నిజంబు
ఏటిగట్టుప్రమాని । కెప్పుడుచలనమే ! ॥వి॥ 4887

చెరువు గట్టునున్న చెట్టునకు, స్త్రీలమీద బుద్ధినుంచిన వానికి చెడుగు తప్పదు.

ఆ. స్త్రీల వ్రతముఁజెఱిచి । శిష్యునకును శిష్యుఁ
డగుచు నీమమెల్ల । నడవిఁ గలిపి
విశ్వకర్మ కులము । వాఁడేలజొచ్చెరా! ॥వి॥ 4888
గురుద్రోహి ఎవ్వడో మనకవిగారి దృష్టికి తగిలాడు.

ఆ. స్త్రీలు కల్లుచోటఁ । జెల్లాటములు గల్గు
స్త్రీలు లేనిచోట । చిన్నవోవు
స్త్రీలచేత నరులు । చిక్కుచున్నారయా! ॥వి॥ 4889
అందాలకన్నిటికి ఆధారం ఆడవాళ్ళే.

క. స్త్రీలును బురుషులు దమలో
నాలని మగఁడనుచు నమ్మి । యనుభవ వశులై
చాలగ భ్రమియింతురు గద
వీలుగఁ దమపుట్టుచావు । వెదకరు వేమా! 4890
జనన మరణములు తెలియక భార్యాభర్తలు అనేకవిధాలు పోవుదురు.

ఆ. సుఖదుఃఖములనెల్ల । సద్గురుని బోధచే
తృణముగాభావించి । తనువు లోన
మంటపంబునుజేరి । మరుచువాఁడే యోగి ॥వి॥ 4891
* యతిసున్న ; సుఖదుఃఖములను సృక్కజేసి సూన్యములో జేరుము.

ఆ. సుఖదుఃఖములురెండు । సతిపాదములు నాల్గు
యెఱుక నిత్యముఁజేసి । హెచ్చరికతో
* మఱచిపోయినవాఁడె । పరమాత్మ జీవాత్మ ॥వి॥ 4892
* యతులులేవు ; ద్వంద్వములను స్త్రీలఅందములను డెందములో డింపుపరచినవాడే పొందికైనపూజ్యుఁడు.

ఆ. సుఖమునందుఁ దాము । సుముఖులైయుండఁగాఁ
బ్రకృతిఁ బెండ్లిచేసి । పరము జెఱచి
విధిని బుట్టజేసె । విధిని తాఁ గానఁడు ॥వి॥ 4893
ప్రకృతి పెండ్లిమొదలగు లోకభ్రాంతులలో నుంచును.

ఆ. సుఖములెల్ల దెలిపి । చూడంగ దుఃఖముల్
పుణ్యములును బాప । పూర్వకములె
కొఱఁతవేయ దాంగ । కోరినచందమా ॥వి॥ 4894

సుఖదుఃఖములు కలిగి దేహి సుఖమునే గోరును.

ఆ. సుఖములొందు నేను । సుగుణుఁడనై యుండ
నన్ను బెండ్లియాడ । నయముఁజెప్పి
దీనిఁగూర్చిన విధి । నేనేమియందును ! ॥వి॥ 4895

ఎందుకూపొందని పద్యము. యిందులోనిది కాదేమో !

ఆ. సుఖ సుఖానఁ దాను । సుగుణుఁడై యుండంగఁ
బ్రకృతిపెండ్లిచేసి । పరముఁజెరిచి
విధులఁ బుట్టఁజేయు । విధినిఁదాఁ గానఁడు ॥వి॥ 4896

సుఖదుఃఖములు రెండూమాని ప్రసుక్తాతాడు నరుఁడు.

ఆ. సుగుణవంతురాలు । సుదతియైయుండిన
బుద్ధిమంతు లగుచుఁ । బుత్రు లొప్ప
స్వర్గమేటి కయ్య । సంసారి కింకను ॥వి॥ 4897

సంసారమంత అహింసాతత్వమైన స్వర్గతుల్యమే ?

తే. సుజను లందఱుఁ దమలోన । సూక్ష్మమెఱిఁగి
నిజ సమాధిని భజియించి । నేర్పు మిగిలి
విజయమందరె విజ్ఞాన । విధముఁగోరి
యజనము లికేల ? హింసకా । యరయ వేమ. 4898

సూక్ష్మమెరిగిన శుద్ధాత్మునకు జంతువధచేయుట హంతుగాదా !

ఆ. సుజ్ఞాని కెప్పుడు । జ్ఞానముపై నుండు
* నజ్ఞాని కెప్పుడు । అడవినుండు
సంసారి కెప్పుడు । సంపదపై నుండు ॥వి॥ 4899

యతిపోయినది; ఎవరికిఏదిసంతోషమో దానిపై భ్రాంతి తప్పకుండును.

క. సుడిబడి తిరిగెడు ప్రాణులు
కడతేరుట కెద్ది తెరువో । కనలేరుగదా !

యిడుములకుదారిఁ జూపని
విడుదలలో గురునివేడి । వెలయుము వేమా ! 4900
సంసార జలధిలోపడి మున్కలు వేసేవారికి మోక్షమేదీ !

తే. సుత, ధనాదిభోగమ్ములఁ । జూచిఁ జూచి
మతి విహీనుఁడు గాకున్న । మహితునెపుడు
మతకమంటదు సగ్జ్ఞప్తి । మధురమగును
గుతుక మెడతెగకుండఁగాఁ । గూర్చువేమ. 4901
భార్యాపుత్రుల బంధనము లేనివాడికి అసలు బంధమేది ?

ఆ. సుతులచేతఁ బుణ్య । సుఖము బొందుదునని
మనుజుఁడుండు గర్మ । మతముఁ దగిలి
ఏనుఁగు పడియున్న । నెత్తునా ! మశకంబు ॥వి॥ 4902
మశకము = దోమ; మతిచెడి పెతలఁబడువానికి సతీసుతులు
సహకారం చేస్తారా !

ఆ. సుతులు సతులు మాయ । సుఖదుఃఖములు మాయ
సంస్కృతియును మాయ । జాలిమాయ
మాయబ్రతుకున కన్ని । మాయఁ గల్పించెరా ! ॥వి॥ 4903
సంసారసంబంధమంతయూ మాయ.

ఆ. సుదతిననువు మీఁదఁ । జూచిన పోలిక
సురభి ననువు మీఁదఁ । జూడనేల ?
సుఖముఁ జూచినట్లు । సుకృతంబు చూడకు ॥వి॥ 4904
సురభి = కామధేనువు ; కోరినకోరికలిచ్చే కామధేనువువంటి
పరము గాంచుము.

క. సున్నంబుఁ దిన్నవారికి
నున్నతముగ పరుసవేది । యుండును జూడన్
వన్నెకు మించిన సున్నము
వెన్నగు బ్రహ్మాదులకును । వెలయుగ వేమా ! 4905
కాయకల్ప చికిత్సను గురించి ఘనమైన యోగము.

ఆ. సున్నమనఁగ మహిని । సూక్ష్మమై యుండును
సున్నమనఁగ నిహముఁ । జూపుగతినె
సున్నమాపరంబుఁ । జూపుచు నుండురా ! ॥వి॥ 4906

ఓంకారము సున్నను కలసియున్న వన్నె కెక్కుతుంది.

ఆ. సున్నమన్న నేదో । సూక్తిని దెలసిన
వన్నెగన్న యట్టి । వారు గాక
యెన్నగలరె యొరులిఁ । కెన్ని యోజించిన ॥వి॥ 4907

ఓంకారమునకు సున్న జేరిన యుత్కృష్టమబ్బుంది.

క. సున్నమును దిన్నవానికి
నున్నతమగు స్వర్గమేల ? । నుండదు చూడన్
వన్నెకు మించిన సున్నం
బున్నతమగు బ్రహ్మమునకు । నుపమగు వేమా ! 4908

ఓంకార శబ్ద పఠన యున్నతోన్నతమయినది.

ఆ. సుప్తిజాగరముల । సొలపులఁ దా నుండి
కప్పుకొన్న మాయఁ । గానలేక
దబ్బర నిజములనుఁ । దా లెస్సఁ గనలేక
గొబ్బునఁ జెడిపోవు । గుణము వేమ. 4909

జాగ్రస్స్వప్నములు గానలేక జడుడు కాకూడదు.

ఆ. సురలు మానులెపుడు । సరవి వర్తింతురు
* ధర్మమార్గమొకటె । తారకముగ
అట్టు కానివార । లసురులై చచ్చిరి ॥వి॥ 4910

* యతిలేదు; మౌనవ్రతులే సురలు. కానివారు దానవులు.

తే. సూక్ష్మతేజంబు చూడ్కిలో । వీక్షణంబు
నక్షయంబైన యనుపమా । ఘ క్షయంబు
రక్షకంబని యెంచుటే । రాజవిద్య
దీక్షవహియించి సాధింప । దివురు వేమ. 4911

సూక్ష్మతేజము చూడ్కిలో నిలిపి "సోఽహం" మును జూపించుట రాజయోగము.

ఆ. సూక్ష్మదృష్టిఁ బూని । సోదరిఁ దెగటార్చి
పాప నిలిపి యుండె । ఫలముఁగనుము
నీకు నీవె నిలిచి । నిన్నుంటి చూడరా ! ॥వి॥ 4912

సూక్ష్మదృష్టితో మాయను దెగటార్చి మహిమోపేతుఁడవుగమ్ము.

ఆ. సూక్ష్మమధ్యమునను । సొరిది జీవుండుండు
స్థూలమధ్యమునను । సూర్యుఁడుండు
నాదు బిందుకళల । నడఁబ్రహ్మముండురా ! ॥వి॥ 4913

నాదు బింద కళల పొదులో బ్రహ్మమున్నాడు

ఆ. సూక్ష్మమరయ నీకు । సుఖతత్వ భావంబు
పుట్టు చావులేని । పురుపుదారి
మానసంబునంటి । మరువక చూడరా ! ॥వి॥ 4914

చావు పుట్టుకలు లేనిదారి బుద్ధి నిదానించి చూడుము

ఆ. సూక్ష్మరూపమంది । సూక్ష్మరూపమునంగ
స్థూలరూపమందు । స్థూలమనఁగ
మాటయొక్కటైన । మర్మంబుఁ దెలియదా ! ॥వి॥ 4915

సూలసూక్ష్మ రూపముల మాటలేగాని వాట మొకటే.

ఆ. సూక్ష్మరూప మెఱిఁగి । సుఖమునుఁ బొందక
శాస్త్రమెఱిఁగి చెడిన । చందముగను
చావు పుట్టెఱుఁగని । చదు వేల ? చదువురా ! ॥వి॥ 4916

చావుపుట్టువుల జాడ లెరిగిన చదు వే నిజమగు చదువు.

ఆ. సూక్ష్మరూపమెఱిఁగి । సుఖ మొందఁగాలేక
బహుళముగను జదువు । బడుచునరుఁడు
చావు చేటెఱుఁగని । చదు వేలఁ ? జదువఁడో ॥వి॥ 4917

చదువులోనున్న అజారామరణయోగము అనుభవములోనికి దెచ్చుకో.

ఆ. సూచికాగ్రదృష్టి । సొరిది భ్రూమధ్యముఁ
జూచి చూచి మఱియుఁ । జూచెనేని
ఆత్మరాకపోక । లప్పుడె తెలియురా ! ॥వి॥ 4918

నాసికామధ్య దృష్టిచే నారాయణుడగుపడును.

క. సూటిగఁ దత్పదమందినఁ
గోటికిఁ బడగెత్తవచ్చుఁ । గుదిరిన మదితో
మీటనఁద్వంపద మనియెడు
కూటస్థుని నైక్యమొదవఁ । గోరును వేమా! 4919

తత్పద త్వం పదసిద్ధి కోటికి పడగెత్తించును.

ఆ. సూటిదప్పరాదు । సూక్ష్మ తేజమ్మునఁ
గోటకొమ్మలెక్క । వాటమగును
మీటి జ్యోతి నంటి । మిన్నకుండుటె ముక్తి ॥వి॥ 4920

జ్యోతివంటి కోటిని చేపట్టినవాడే మేటి.

క. సూత్రం బమల విచారణ
నేత్రంబులు సగముమూసి । నెఱిఁగను నెదియో
గాత్రంబగు బ్రహ్మాంశము
పాత్రుండై బుద్ధినొక్క । పరుఁడగు వేమా! 4921

నేత్రములు సగము మూసి నిరీక్షించినవాడే నెరయోగి

ఆ. సూదినంటురాయి । సూత్రముగా నాత్మ
సాధనంబు మీఱి । సంతరించి
పాదుకొల్పు నరులు । పరమాత్మఁగందురు ॥వి॥ 4922

సూదంటురాయివలె సూక్ష్మబ్రహ్మన్ని లాగుము.

తే. సూర్యచంద్రాగ్ని నేత్రుని । జూడఁగోరి
కార్య గురులందుఁజేరక । కారణంబుఁ
గోరి విబుధుని కాంతిలో । మీఱి యచల
దుర్గమునకును బైఁజేరి । తూగు వేమ! 4923

మండల త్రయాన్ని కుండలిలో నిల్పినవాడే మహాత్ముఁడు.

ఆ. సూర్యునిఁ బొడఁగన్న । సోలక వికసించుఁ
జుక్కలదొరఁ గన్న । స్రుక్కుదెందుఁ
గలువ తమ్మిగాదు । కలదదీ భూమినే? ॥వి॥ 4924

సూరన్నకు సొక్క, చంద్రన్నకు చెదర బ్రహ్మయ్యకు చెదరక కుదురుగా యున్నదేది?

ఆ. స్థూలాలుఁ దెలిసితే । సూక్ష్మమందున శివుని
కారణంబుగ యోగి । కలియనేర్చు
యెద్దు తవుడునుఁ గోరు । బెల్లంబుఁగోసునా! ॥వి॥ 4925

స్వానుభవమును, లోకవిజ్ఞానమును జోడించేడు.

ఆ. స్థూలమగును గుడ్డు । సూక్ష్మమౌ గన్పాప
పాపలోని జ్యోతి । పరమ పదము
మాపు రేపునా క । మదినంటెచూడరా ॥వి॥ 4926

సూక్ష్మబుద్ధిచేత పాపను వీక్షించి పరమందమన్నాడు మన ప్రాజ్ఞుఁడు.

ఆ. స్థూలము కనుగ్రుడ్డు । సూక్ష్మము కన్పాప
కంటిపాప నుండుఁ । గారణంబు
కారణమును బ్రహ్మ । కళ నెఱుంగఁగవలె ॥వి॥ 4927

బ్రహ్మకళల నెరుగుట పరమును దెలియుట.

క. స్థూలాంశ మన్నమయ మగు
బాలునఁ గర్మేంద్రియములు । ప్రాణమయంబౌ
మెలగును జ్ఞానేంద్రియముల
జాలము మానస మయంబు । చవిఁగను వేమా! 4928

అన్నమయ, ప్రాణమయ, మానసమయముల జాడలు తెలిసికొమ్ము.

తే. సేకరించిన గురుభక్తి । సేతువనఁగఁ
జెల్లు; భవమను సింధువుఁ । జెలఁగిదాట
బంధురంబగు గురునాజ్ఞ । బయలుపడును;
బరగఁ జేరెడుఁ బరమగు । పదము వేమ! 4929

గురుభక్తిచే ఆంజనేయుడు సముద్రమును దాటి గురుతిచ్చెను.

తే. సేకరించిన మనసులో । చింతవిడక
రాకపోకలు లేనట్టి । రాజ్యపదవిఁ
దాకి తన్మయమందుటే । తత్పథంబు
కాక పెరమార్గముల ముక్తి । కలదె వేమ? 4930

భక్తిని స్వీకరించి ముక్తిమూలము గనుటే తత్పదము.

ఆ. సేతువందు మునుఁగ । క్షితిఁ గాకి తెలుపౌనె ?
కాశికేగ గద్ద । గరుడుఁడగునె ?
బదరికరుగ వృద్ధు । బాలుండు గాఁడయా! ॥వి॥ 4931
స్వభావము మార్చుటకు శక్తిలేదు.

ఆ. సేవఁజేసి గురుని । స్థిరభావమందెడు
త్రోవనంటి జ్ఞప్తిఁ । దొలఁగనీక
భావమందె పరముఁ । బరికించిచూడరా! ॥వి॥ 4932
మూల తత్వాన్ని సాకల్యము చేసికొని ముక్తిని బొందమన్నాడు.

క. సేవించి గురునిఁ గన్గొని
కావరమును గడకుఁ జిమ్మి । కడువేడ్కలరా
న్గావించు నిజసమాధిని
భావింపఁగ బ్రహ్మ బయలు । పనుపడు వేమా! 4933
సమాధిష్ఠుఁడగుటకు సద్గురోపదేశము సవ్యముగా పొందాలి.

ఆ. సొంత తనయుఁడైన । సొగసుగా నుండితే
*స్త్రీజాతి యాసించు । సృష్టియందు
కామమెచ్చును గాని । కొడుకెచ్చుయామెనా ! ॥వి॥ 4934
* యతిలేదు ; స్త్రీల చిత్తప్రవృత్తులు చిత్రంగా నుండును.

ఆ. సొమ్ముఁగన్నదనుక । జ్యోతి వెలుగవలె
సొమ్ముఁగన్న వెనుక । జ్యోతియేల ?
అంజనంబులేక । యాసొమ్ముఁ దెలియదు ॥వి॥ 4935
విజ్ఞానము గావాల చే సుజ్ఞాన మవసరము. సుజ్ఞానము సాధనము.

ఆ. సొమ్ములెల్ల నేఁఱు । చూడ బంగరొకండె
ముదితలెల్ల వేఱు । మోహమొకటె
పశువులెల్ల వేఱు । పాలెల్లనొక్కటే ॥వి॥ 4936
ముడిపదార్థము యొక్కటైనా వస్తువులు వేరు వేరుగా నుండును.

ఆ. సోమముఖులఁ గూడి । సుఖియించు వాఁడేల ?
రామ మంత్రజపము । రహినొనర్చు
పామరత్వ మతనిఁ । బాయదెన్నఁటికిని ॥వి॥ 4937
సోమముఖులు = చంద్రవదనలు.

ఆ. సోమయాజి ననుచు । సొంపుగా వేషంబుఁ
గట్టి మాంసమెల్లఁ । గాల్చితినును
ద్విజుఁడఁ దా ననఁగ న । ధికమేమి తనవల్ల ॥వి॥ 4938
సోమయాజులందరూ జిహ్వాతీట దీర్చుకొన్నవారే!

ఆ. సోమయాజి ననుచు । సొంపైనశాలువల్
మకరకుండలములు । మనసుదీరఁ
దా ధరించు మనకుఁ । దానేమిలాభించు! ॥వి॥ 4939
పండిత శాలువలు మకరకుండలములు బండలకే! మామూలు పండితులకేల?

ఆ. సోమయాజిని బట్టి । సొడ్డు వేసెను రంభ
మనసు తీర్చునప్పుడు । మమతతోడఁ
గ్రతువుఁజేయ ఫలము । కాదె యీపాట్లకే? ॥వి॥ 4940
క్రతువులచేయుట రంభ సొడ్డులు తినుటకేనా!

ఆ. సోమలతల రసము । సోలెడైనను ద్రావ
రేల మేలటంచు । నెన్నుచుంద్రె?
క్రతుఫలంబు కంత । గతమగుఁ గాఁబోలుఁ ॥వి॥ 4941
యాగములో నుపయోగించు పానీయము సోమలత.

ఆ. సోహముండేవరకు । దేహ మాద్యంతంబు
స్థిరముగా పురమందు । దిరుగుచుండి
సోహంబు దిగిపోతె । దేహంబు నిలుచునా! ॥వి॥ 4942
"సోహం" నిరంతరము పట్టుటకు దేహాన్ని పోషించుకొమ్ము.

ఆ. సౌఖ్య మరయనట్లె । సౌఖ్యంబుకలుగును
హారుని కృపను సౌఖ్య । మమరియుండు
సుఖ మసుఖములకును । శూలికారణమగు ॥వి॥ 4943
సుఖముల కంతకూ శూలి కారణుఁడు.

ఆ. సౌఖ్యము గల దిలను । సద్భక్తివల్లను
సౌఖ్యము గలిగిననె । సమ్మతమగు
సౌఖ్యముగలవాఁడు । సంతోషపడవచ్చు ॥వి॥ 4944
సౌఖ్యమే సర్వశ్రేష్ఠము.

## హ

ఆ. హంసు మీఱఁగాను । యతుల జన్మంబులఁ
దీరి చెప్ప నెంత । వారికైన
నాడకాడ కనుపు । లతిశయమై వచ్చు ॥వి॥ 4945

డాబుల రాయళ్లు జూపించే తమాషాలు చెప్పాడు.

ఆ. హంస కెరుగఁ జేసి । హృత్సరోజముమీద
నాద మనియెడి విత్తు । నాటఁబెట్టి
యేడుకుండలనీళ్ళు । యేమారకను విడు ॥వి॥ 4946

హంసను త్రివేణీసంగమములను చేయించుము.

ఆ. హంసధ్యానంబు లోనైన । ననుభవంబు
సంశయంబుల ద్రుంచిన । సత్యమమరు
ధ్వంసమగు లోక వాసన । తన్మయంబు ॥వి॥ 4947

హంసయందు మనస్సు లయము చేసిన సత్యలోకము చేరుకొనును.

తే. హంస ధ్యానములోనైన । దనుభవంబు
సంశయంబుల ద్రుంచిన । సత్యమమరు
గురుకటాక్షము దొరికిన । గుఱుతు చిక్కు
గుఱుతు కూడిన లభియించుఁ । బరము వేమ. 4948

హంసను బట్టుటకు గురుకటాక్ష మవసరము.

ఆ. హంసమానసోద । మంటక తిరిగిన
ముట్టుఁగర్మ చయము । ముఖ్యముగను
యోగి తిరుగు హంస । భోగముతోఁడను ॥వి॥ 4949

మానస సరోవరమున హంసను ఓలలాడించుటే మోక్షమార్గము.

తే. హంసయోగమునకు సాటి । యవనిఁగలదె
శంసమించిన మదిలోన । శంకరుండు
ధ్వంస మొనరించి యెఱుకను । దర్పమణఁచు
ప్రాంసకునిఁ బట్టి శిక్షించు । పగిది వేమ. 4950

ప్రాంసకుఁడు = భ్రాంతులలో చిక్కినవాడు ; హంసయోగము వలన శంకరుదర్శనం అచిర కాలములో యగును.

ఆ. హంస మాన "సోహ" । మంచును దిరిగిన
నెట్టి కర్మమైన । నెగడ దిలను
యోగితిరుగు సకల । భోగంబులోడను 4951

హంసతో యోగి నిరంతరం విహరిస్తాడు.

తే. హఠము సాధించి గుర్తించి । యందవలెను
మఠము సందుల గొందుల । మరగనేల ?
ఘట పటాదుల తిమిరంబు । గాలఁద్రొక్క-
జఠరవాయువు సైదోడు । జరుగువేమ. 4952

హఠయోగము ఆరోగ్యసూత్రము.

తే. హఠము సాధించి ఘటమున । హర్ష మొదవ
బఠన మేర్పడఁజేయుట । ప్రాపకంబు
నిటల దుర్గముఁచేరుటే । నిత్యసుఖము
పటిమ గలయట్టి లక్ష్యంబు । పరగవేమ. 4953

హఠయోగముతో నిటలమును జూచినవాడే నిత్యుఁడు.

తే. హఠము సాధించి ఘటమున । హర్ష మొదవ
బఠన మేర్పడఁజేయుట । ప్రాపకంబు
నిటలదుర్గము చేరుటే । నిత్యసుఖము
పటిమగలయట్టి లక్ష్యంబు । పరగవేమ. 4954

హఠయోగమున శరీర పటుత్వముచే భక్తిని సాధించుము.

ఆ. హత్యసేయఁ గూడ । దవి యెందులకు నన్న
హత్యసేయువాఁడె । యధముఁడౌను
హత్యసేయువాని । కాజ్ఞ యేమనవచ్చు ॥వి॥ 4955

ప్రాణివధ చేయువాడు మహాపాపి.

క. హాయమదిరి పరువులిడు గతి
రయమునఁ బారెడిని మనసు । ప్రతికూలముగా
నయమో, భయమో, చూపుచు
బయనము సాగింపనీక । పట్టర వేమా ! 4956

హాయము = గుఱ్ఱము; మనసును బంధించి మార్గమును కనుగొనుము.

ఆ. హాయము గురువుగాదె । యఖిలంబు తాఁగాదె
యనుభవింపరాదె । హరునిఁగూర్చి
యతికినంతలోనె । యంధకారంబేల ? ॥వి॥ 4957
గురువుగారిని గుణ్ణముతో పోల్చాడు.

తే. హాయముల ద్వయముఁబట్టి నీ । వంకురించి
ద్వయ వినాశకమా బైలుఁ । దాకఁ గోరి
జయముపొందఁగ మదినొక్కి । జానుఁడవగు
భయ నయంబులు పెనఁగొను । ప్రజ్ఞ వేమ. 4958
మనస్సు, బుద్ధి యను రెంటిని క్రమబద్ధముచేసి గమ్యస్థానము చేరమన్నాడు.

ఆ. హాయము సున్నమునకు । నతిశయంబైనట్టి
కల్ప మేలఁ గల్గు । కారణంబు ?
హాయము సున్నము దిన । నంధకారముడుగు ॥వి॥ 4959
సున్నము = ఆశ; ఆశా పాశములు గోసినవాడు భాసురముగా ప్రకాశించును

ఆ. హాయమెకిఁగిన బంటి । కల్పునిఁజేరిన
* మాఱు మలయఁదొత్తు । మరుగు మగఁడు
మాళ్ళముంతకోళ్ళ । మఱి కోతికైనట్లు ॥వి॥ 4960
* యతి లేదు; దీని భావము భావజ్ఞులకే తెలియాలి.

ఆ. హారికి దొరకెనందు । రా సిరియప్పుడే
దొరకెఁగాదె విషము । హరునకరయ
నెవని కెట్టులగునో । యెవ్వఁడెఱుంగురా! ॥వి॥ 4961
అదృష్టమును తప్పించువాడు అవనిలేడు. (క్షీరసాగర మథనము)

క. హరియజుఁడు తాళకర్తలు
పురహరుఁడో మేటిపాత్ర । భువనములోఁ దా
నరయఁగ బ్రతిమై చూచును
సురుతరముగ విశ్వకర్మ । గురుఁడుర వేమా ! 4962
యిది శివతాండవ ఘట్టము.

ఆ. హరియెవఁడు? హరుఁడెవఁడు? । హరిహరుం డెవ్వఁడు?
మహిని జూడఁజూడ । మతమెఁగాక;
అన్ని శివమయమని । ఆనందపడు యోగి ॥వి॥ 4963

హరి హరులకు అభేదమును గణించెను.

క. హరివిధి సురమును లాదిని
మెఱసియు జన్మించి పిదప । మేలుల కెడఁగా
జరయందు మరణమందును
వరుసన్వర్తిలిరిమాయ । వాసన వేమా! 4964

త్రిమూర్తులు దేవతలూ కూడా క్రమముగా మాయకు లోబడువారే!

క. హరివిధులు కనుట వినరా!
హరుఁడు నిమిత్తంబులందు । నాడుట వినరా!
గుఱిగల చదువులు వినరా
తఱివచ్చిన దెరిగియుండి । తలఁపర వేమా! 4965

శివకేశవ చరిత్రలు చిత్రముగా చిత్రించాడు.

ఆ. హరి హరవిధులెన్న । నాత్మలోనుండంగ
శివుని వెదుకఁబోవు । జీవుఁడరయ
జీవుఁడు శివుఁడవును । సిద్ధంబు తెలియరో! ॥వి॥ 4966

జీవుడు యీశ్వరుఁడయి జీవేశ్వరుడయ్యెను.

ఆ. హరి హరాదులకును । నజుఁడు తానె జగము
యోని ముగ్గురనుచు । నొప్పుచుంద్రు
కళలనఁగ గలుగుటఁ । గళ గానరాదయా! ॥వి॥ 4967

ప్రకృతియోనిలో ప్రభవించినవారే త్రిమూర్తులు.

తే. హరి హరాదులకైనన । యాత్మ విద్య
గురుకటాక్షముఁ బొందక । యెఱుక పడదు
పరమ పరిపూర్ణభావంబు । బయలునగును
నిరుపమానందనిర్గుణ । నిరతివేమ. 4968

ఆత్మవిద్య సాధించుటకు హరిహరులకైనా గురువు కావలసిందే!

ఆ. హరి హరాదులందు । నాశను దిగనాడి
శాంతబుద్ధిఁ గూడి । సగుణమందు
జింతమాని పిదపఁ । జిన్మయు మందరో! ॥వి॥ 4969

హరిహరుల మీద ఈశను అంతరింపచేసి చిత్తాన్ని నిలిపి చిన్మయ బ్రహ్మాన్ని చూడుము.

ఆ. హరుఁడు గురువుఁ । గాదె యఖిలంబుతాఁగాదె
యనుభవింపరాదె । హరునిఁగూర్చి
యలికినంతలోన । నంధకారంబేల? ॥వి॥ 4970

ఈశ్వరధ్యానమే కరుణనిచ్చును.

ఆ. హరుని ధ్యానించను, । హరునిపూజించను,
హరుని సేవించను । ధరణిలోన
గురుపుత్రులకె గాని । గర్వపోతుల తరమ? ॥వి॥ 4971

గర్వపోతులకు హరుని మహద్విభూతి యందదు.

ఆ. హరుని విల్లువిఱచి । యా రామభద్రుండు
ప్రియముతోడ నాడు । పెండ్లియాడె
భూమికన్నె యెచటఁ । బుట్టెనుగానరో? ॥వి॥ 4972

యిది సీతాకల్యాణ ఘట్టము చెప్పెను.

తే. హవము మదియందు నిల్పుట । హంసవిద్య
శివముఁ బరికించి జీవుని । సేకరించి
భయము హరియింప నైక్యంబు । భద్రపడఁగ
గవయుచుండెడి జ్ఞప్తిలోఁ । గలియు వేమ. 4973

హవము = పిలుపు; పిలుపును తలపున నిలిపి మంగళ ప్రదమును మననము చేయుట మాన్యత.

ఆ. హాని గలుగునాఁటి । కలయవస్థలు మెండు
హాని లేనినాఁటి । కవియులేవు
హానిఁ దెలియునట్టి । యతఁడె పో శివయోగి ॥వి॥ 4974

హానిని తెలిసికొనినవాడే యాత్మయోగి.

ఆ. హాని గలుగఁబోదు । హరి మదినెంచెడు
వానికబ్బుఁ బరము । వసుధయందు
బూని నిష్ఠమీఱి । పొదలకయుండరా! ॥వి॥ 4975

బ్రహ్మము భావమున నిల్పినవారికి ప్రపంచబాధలు పట్టవు.

ఆ. హానిచేతఁ గలుగు । నధిక దుఃఖంబులు
హానిచేత దప్పు । నరయ సుఖము
హానిచేతఁ గొంత । యలమట గల్గురా! ॥వి॥ 4976

హాని చేయుటవలన నానాభీభత్సములు నానాట కల్గును.

ఆ. హానిఁజెందని గురుభక్తి । ననుసరించి
పూని పరిపూర్ణవిజ్ఞప్తిఁ । బొంది మిగిలి
స్వానుభవమూని యందుటే । సమరసంబు
కానివాదంబులాడఁగా । ఘనమె వేమ? 4977

కాని వాదములాడుచు కాలము వెళ్ళబుచ్చువారు కష్టులు.

తే. హానిలేనట్టి పదవిని । బూని పిదప
స్వానుభవసిద్ధి యందుట । సమ్మతంబు
ధ్యానపరమగు నిచ్ఛలో । దలపుఁ నిలుప
మానమూనుము మమతలు । మాను వేమ. 4778

తలపులు నిలిపి మమతలు మానిన హాని యగును.

తే. హానివృద్ధుల రెంటిని । నణచిమదిని
బూని గురుమంత్రరాజంబు । పొందుపరచి
తానె తానగుచుండుచు । తత్త్వవేత్త ॥వి॥ 4979

హాని విద్యలు అందకుమ.

తే. హానివృద్ధుల రెంటిఁ బో । నడచి మదిని
బూని గురుమంత్రరాజంబుఁ । బొందుపఱచి
తానె తానగుచుండును । దత్త్వవేత్త
మానితంబగు గురుబోధ । మహిమ వేమ. 4980

గురుబోధ పరములను చేయును.

తే. హాయిపొందుచు గురుభక్తి । నందవలెను
మాయయొఱుకను నమ్మక । మంజులముగ
కాయమందున నీశ్వరుఁ । గనుటె ముక్తి ॥వి॥ 4981
శరీరములో శంకరునిజూచుట సాఫల్యము.

ఆ. హాయినొందుచు గురుభక్తి । నందవలెను
మాయ యొఱుకను నమ్మక । మంజులముగఁ
గాయమందును నీశ్వరు । గనుటముక్తి
హేయగుణములఁ నెడఁబాపు । మెంచి వేమ. 4982
దుర్గుణములను విడచి సద్గుణాశ్రయమును చక్కగా పట్టుము.

తే. హాళిమీఱిన గురుభక్తి । ననుసరించి
యాళితంబుగ గాలిని । నీడ్చిపట్టి
కూజితంబున సొక్కుట । కుంభకంబు
రాజయోగికి నియమమహా । రమణ వేమ. 4983
కుంభకయోగము కూలంకషముగా తెలిసినవాడు రాజయోగి.

ఆ. హింసచేయరాదు । సంసారధర్మంబు
వెనుకఁజూపుదురట । విప్రవరులు
చావుపశువు తినెడి । చండాలుఁడే మేలు ॥వి॥ 4984
హింసచేయువానికన్న చచ్చిన గొడ్డు తిను చండాలుడు మేలు.

ఆ. హింసచేయరాదు । సంసార ధర్మంబు
జంతువులను జంపి । సాపడుదురె?
చావు పశువుఁ దినెడి । చండాలుఁడే మేలు ॥వి॥ 4985
తనతిండికై జంతువులను ఖండించుట మొండి బండతనము.

ఆ. హింసచేయు నాతఁ । డిలలో నజ్ఞాని
హింస చేయనున్న । హీనుఁడగును
హింస హింసపరచు । నిలలోన సుజ్ఞాని ॥వి॥ 4986
“అహింసో పరమోధర్మ” యను సూత్రమును అజాండము నిండా దండోరా వేసెను.

ఆ. హింస చేయకుండ యెయ్యి । ముఖ్యధర్మంబు
యనక హింసచేత । యవని సురులు
చావు పశువుఁదినెదు । చండాలుఁడే మేలు ॥వి॥ 4987

జిహ్వా చాపల్యమునకై హింసను చేయుట హీనాతి హీనము.

ఆ. హింసలన్ని మాని । హితుఁడయి జనుఁడు సం
సారి యయిన ముక్తి । జేరవచ్చు
హింసలెన్నొ చేసి । హితుఁడౌట యెట్లులో ! ॥వి॥ 4988

హింస మానినవాడే సర్వజన హితుఁడు.

ఆ. హింస సలుపువాని । కెన్నఁడుఁ దయలేదు
హింస నెఱుఁగనతఁ । కెప్పుడు భయమె
హింస నేవగింతు । రెల్ల సజ్జనులుఁను ॥వి॥ 4989

కటికబుద్ధిని సజ్జనులు గౌరవింపరు.

ఆ. హీనజాతివాని । కెచ్చు వైష్ణవమిచ్చి
ద్విజులకన్న దొడ్డ । తీరటన్న
కల్లుకడవఁ గడిగి । గంగకిచ్చిన రీతి ॥వి॥ 4990

నీచులను మనీషులగా చేయుట కల్లుకుండలో కాశీ గంగ పోసినట్లే.

ఆ. హీనజాతివాని । నిలుసేరనిచ్చిన
హానివచ్చునెంత । వానికైన
నీగ కడుపుసొచ్చి । యిట్టట్టుఁజేయదా ! ॥వి॥ 4991

చెడుగువారిని చేరదీసిన నానా చిద్రములు కల్పిస్తారు.

ఆ. హీన నరులతోడ । నింతులతోడను
బడుచువాండ్రతోడ । బ్రభువుతోడఁ
బ్రాజ్ఞ జనులతోడ । బ్రహ్మఘ్నజనుతోడ
వైపుఁదెలిసి పలుక । వలయు వేమ. 4992

ధర్మశాస్త్ర రహస్యార్థముల క్రోడీకరించి కోమలంగా అందించాడు.

ఆ. హీనుఁ డగుచుఁ జనఁడె । యింద్రుండు కామియై
మారుఁడట్లె మున్ను । మడిసిపోఁడె
బ్రహ్మ కామియగుచు । భంగంబు పడలేదె ? ॥వి॥ 4993

ఇంద్రుడు. చంద్రుఁడు, బ్రహ్మ ; తారాశశాంకము, రామాయణము అలితోపాఖ్యానము.

ఆ. హీనుఁ డెన్ని విద్య । లిల నభ్యసించిన
ఘనుఁడు కాఁడు హీన । జనుఁడె కాని
పరిమళముల గర్ద । భము మోయ ఘనమౌనె ? ॥వి॥ 4994

హీనుఁడు ఎంత చదివినా హీనగుణము విడువడు.

ఆ. హృదయమందు గ్రంధి । విదళితమై పోవు
సందియంబు లెల్లఁ । జయ్యనఁ దెగు
క్షయము గాంచు । నతని కర్మంబు లావరా !
వరునిదర్శనంబు । వరలు నపుడె ॥వి॥ 4995

పాదములు తారుమారై, భావము పలురకములై భామిని వలె యీ పద్యమున్నది.

ఆ. హృదయమందునున్న । యాతనిఁ దెలియక
శిలల కెల్ల మ్రొక్కు । జీవులార
శిలల నేమి యుండు । జీవులందె కాక ॥వి॥ 4996

విగ్రహారాధన విరమించమన్నాడు.

క. హృదయం బలరఁగఁ జేసియుఁ
జెదరని మనసున శివునికిఁ । జేసినపూజల్
వృధగాదది యెంచంగను
ముదిసిన యందాఁకఁ జేయ । ముక్తుఁడు వేమా ! 4997

హృదయమున యీశ్వరధ్యానము పొదలించిన ముక్తుఁడగును.

క. హృదయంబున శివుఁగని నె
మ్మది నిలిపి చిదాత్మతత్త్వ । మయమై తలఫం

గుదిరెడి పరిపూర్ణుఁడు శివుఁ
డుదయంబై తేజరిల్లు । నుపముగ వేమా! 4998

మనోనిబ్బరముతో మానసికారాధన చేసిన మహేశుఁడు మరువకుండును.

ఆ. హృదయమందున శివుఁ । డుండుటఁ దెలియక
శిలలకేఁటి కెఱఁగి । చేతులెత్త
అంధకుండు ముకుర । మరసి చూచినయట్లు ॥వి॥ 4999

ముకురము = అద్దము; అసాధ్యకార్యములకు అఱ్ఱులు చాచరాదు.

ఆ. హృదయమందు శివునిఁ । జెదరక నిలిపిన
బదిలుఁడగును భవుఁడు । ప్రాపుగాను
కదిసినొక్కిమదిని । గ్రక్కునఁ జూడరా! ॥వి॥ 5000

హృదయాన్ని పదిలపరచి భావనచే బ్రహ్మాన్ని చూడుము.

క. హృదయము పదిలంబైనను
గుదిగొను సన్యాసమునకుఁ । గోమ్ములు గలవా
యిదె యెఱుఁగరె చదువరులట
మది ముక్తికి నాస్పదంబు । మహిలో వేమా! 5001

హృదయాన్ని పదిలపరచిన కోరికలు కూకటివేళ్ళతో నశించును.

తే. హృదయరంగంబు నంటెడు । విధము మరిగి
కదియనేర్చిన ధీరుని । గాంచుటరుదు
* కదురుకొని పరిపూర్ణుఁడై । గుట్టుగాను
బదిలముగఁ గాంచు బయలునఁ । బరము వేమ. 5002

*యతిలేదు; భావములోనున్న బ్రహ్మమును పదిలముగా పరికించమన్నాడు.

ఆ. హృదయసాగరమును దాటి । హృష్టినొంది
కుదురుపడగను గురుమర్మ । మెరిగియంత
చదురుమది బైలులోఁ జేరి । సంచరించు
విదిత మగునప్పుడా బ్రహ్మ । విద్య వేమ. 5003

బ్రహ్మవిద్య విదితపడుటకు మదిని చదును చేసుకో.

దయ హర్మ్యంబునందొప్పు । సదయుగన్న
దము లభియించునప్పుడు । ముదముగాను
ంవులెన్నేనిఁ జదివి యేమా । మదముకొలఁది
నువారికి లేకుండు । ముక్తి వేమ. 5004
గ్మాదుల చదువులు మమకారములకేగా !

దయమందు శివుఁడు । కుదురుగనుండంగ
ుల మొక్కుటేల । జీవులార?
ంరదె కాని । శిలలందు లేఁడయా ॥వి॥ 5005
ుఁడు శిలలందున్నాడనుట సిగ్గుచేటు గాదా !

దయము చెదరక నిల్చిన
నే మోక్షంబుదారి । యనువై యుండున్
మెఱుఁగని చదువేలను
యుం దేముక్తికిరవు । మహిలో వేమా ! 5006
ంచదురుపరచినచో ముక్తివిదితము గాదా !

మృతకుక్కవన్న । నెటువంటివారికి
ు నిత్యమగునె? । తథ్యమరయ
ి మెఱుఁగలేరె । వేమనవచ్చురా ! ॥వి॥ 5007
ములు పాటించకపోవుట మానత్వమని మన కోవిదుని ఉద్దేశ్యము.

ంకార విద్య । నెఱిఁగినవారెల్ల
బడని యట్లు । విద్యచేత
మెఱుఁగు వెనుకఁ । దనకుఁ జింతేలరా ! ॥వి॥ 5008
చేసే విద్యగలవారివలె పరమభోగివిగమ్ము.

ంనగముచేత । నెప్పుడుగలవాఁడు
ొండమీఁద । వెలయువాఁడు
లసె బిచ్చ । మేమనవచ్చురా ! ॥వి॥ 5
ష్ణనూ, వంతలూ చింతలూ తప్పవు. (శివలీలలు)

ఆ. హేమముగలవాఁడు । కాముఁడు సోముఁడౌ
దినకరుఁ డగువాఁడు । తేజమందు
విత్తహీనుఁడైన । వెఱ్ఱుల తమ్ముఁడౌ! ॥వి॥ 5010

ధనము లేనివానికి ఘనము లేదు.

వేమనపద్యములు అకారాది క్రమముతో
సంపూర్ణము
సమస్తలోకా స్సుఖినో భవంతు
శ్రీ శ్రీ శ్రీ

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన బజార్, హైదరాబాద్. దం. న్య.